# సర్దార్ గౌతు లచ్చన్న

(జీవిత చరిత్ర)

రచయిత
వంగపండు అప్పలస్వామి
పార్వతీపురం

ప్రచురణ
శ్రామిక రైతాంగ-జనవిజ్ఞాన-పీఠం
విశాఖపట్టణం.

2709 R11

సర్దార్ గౌతు లచ్చన్న

(జీవిత చరిత్ర)

# ఆదర్శ దంపతులు

Acc. No. 3419



మాన్యశ్రీ
సర్దార్ గౌతు లచ్చన్న



శ్రీమతి
గౌతు యశోదా దేవి

శ్రామిక-రైతాంగ-జనవిజ్ఞాన-పీఠం
విశాఖపట్నం

జాతీయ స్వాతంత్ర్యోద్యమ యోధుడు
ఆంధ్ర రైతోధ్యమ రథ సారథి
బడుగు బలహీన వర్గాల నాయకుడు

# సర్దార్ గౌతు లచ్చన్నగారి

## అభిప్రాయం

నా జీవిత చరిత్రను నేనే స్వయంగా వ్రాసి ప్రజలకు అందించాలన్న అభిలాష నాలో చిరకాలంగా ఉండేది అయినా అది నాకు సాధ్యం కాలేకపోయింది.

అయితే నామేధావి మిత్రవర్గంలో కొందరు నా జీవిత చరిత్రను లిఖించాలని ప్రయత్నం చేయకపోలేదు. హైదరాబాద్‌లో నున్న ఒకనాటి బాలల అకాడమీ డైరెక్టర్ విశాఖపట్నం ఆంధ్ర యూనివర్సిటీ ప్రొఫెసర్‌గారొకరు నాపట్లగల అభిమానంతో వ్రాయ తలపెట్టినా అందుక కాలం కర్మ కలిసి రాలేదు. అది ఫలించలేదు,

అయితే ఇటీవలే నేను ఉక్కునగరంలో నివసిస్తున్నందున అచ్చట అతిసమీపాన గల పెందుర్తి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో పనిచేస్తున్న చిరంజీవులు పి. తాతారెడ్డి, యన్. దామోదరరావు, జి. నారాయణరావు దైవశాత్తు నా వద్దగువచ్చి మాటల సందర్భంలో వారు పనిచేస్తున్న కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్న ప్రసిద్ధ కవి, రచియిత శ్రీ వంగపండు అప్పలస్వామిగారిని గూర్చి నాతో ముచ్చటించారు. వారైతే నా జీవిత చరిత్రను రాయగల సత్తా, సామర్థ్యాలున్నవారని, అనేక పద్య, గద్య కావ్యాలు రాసిన వారని చెప్పగా విన్నాను. పైగా నేనన్న వారికి ఎంతైనా గౌరవాభిమానాలు కలవని నాకు తెల్పారు. అందుకు ఆ చిరంజీవుల్ని వెంటనిడుకొని నే స్వంయంగా పెందుర్తివెళ్లి వారితో చర్చించాను. ఇందుకు వారును ఎంతగానో స్పందిస్తూ నా జీవితచరిత్రను వ్రాయటానికి అంగీకరించారు.

నిజానికి వీరెవరోకాదు కవిగారి కజిన్ బ్రదర్ స్వర్గీయ వంగపండు పారన్నాయుడుగారు పార్వతీపురం నివాసి. నాకొకనాడు అతిసన్నిహిత రాజకీయ మిత్రులుగా మెలిగేవారు. సోషలిష్టు భావాలుగల వ్యక్తి. అనేక ఉద్యమాలలో నాతో పాల్గొన్న ప్రజానాయకుడు. ఇకపోతే నేడున్న కవిగారి ఓన్ బ్రదర్ వంగపండు జగన్నాధం కూడా నేనన్న, నా ఉద్యమం అన్నా ఎడతెగని ప్రేమాభిమానం. నేడు వారి సోదరులు అప్పలస్వామిగారు నా జీవిత చరిత్రను లిఖించడం అర్థదాయకం,

ఆమోదయోగ్యం. వంగపండు సోదరులకు నాపట్లగల అపార ఆదరణాభిమానాలు ఆ కుటుంబంలో జన్మించిన కవిగారి ద్వారా ఇలా నా జీవితచరిత్ర ప్రత్యక్షమైందని నా నమ్మకం.

నిజానికి నా జీవితచరిత్రను రచించవలసిన అవసరమేమని ప్రశ్నించుకున్న-నా రాజకీయ జీవితంలో నే పొందిన ''ఆంతరంగిక సంఘర్షణలు'' నే నెదుర్కొన్న ''చిత్ర విచిత్రమైన రాజకీయ సంఘటనలు సమాజానికి తెలియపర్చబడటం చాల అవసరమని భావించాను. రైతుకూలీ ప్రజల్ని దోపిడీ చేస్తున్న జమిందారీలపై పోరాటాల్ని కొనసాగించి బడుగు బలహీన వర్గాల హక్కుల రక్షణకై అహర్నిశలు శ్రమించి యువకులను, విద్యార్థులను ముందుకు నడిపించుటలో మార్గదర్శకంగా నిలిచి 16 ఏండ్లకు పైగా సాగించిన స్వాతంత్ర పోరాటజీవితా నంతరం-అనేక అధికార రాజకీయ పదవుల్ని త్యజించి ఆంధ్రకేసరి టంగుటూరి, అఖిలభారత కిసాన్ సభ అధ్యక్షులు రైతు రంగాలతోపాటు కాంగ్రెస్ నుండి విడివడి బైటకివ చ్చాను. నియంతృత్వ పోకడల్ని అరికట్ట ప్రజాస్వామ్య రక్షణకు జాతీయ కాంగ్రెస్‌కు ధీటైన జాతీయ నాయకత్వాన్ని, ప్రజాభిమానాన్ని కల్గిన వివిధ పార్టీలలోచేరి ఆంధ్రప్రదేశ్‌లో ప్రతిపక్ష నాయకునిగా అనేకమార్లు ప్రజాస్వామ్యాన్ని రక్షించే పరమ పవిత్రమైన బాధ్యతను ప్రజలు నాకు అందించగా చేపట్టాను.

నా మనగడకు, రాజకీయ అధికార పదవీ భాగ్యాలకుగాక, రాష్ట్ర ప్రజల సంక్షేమం, సౌభాగ్య ఆశించి నేటి అస్తవ్యస్త నిరంకుశ కాంగ్రెస్ విధానాల్ని ఎదిరించ సిద్ధమే అనటానికి నిదర్శనం ఒకనాడు నా మంత్రి పదవికి నేనిచ్చిన రాజీనామా. నిరంకుశ అప్రజాస్వామిక కాంగ్రెస్ విధానాల్ని ఖండించుటలో నేనెన్నడూ వెనుకాడలేదు.

నేను నా జీవితం-జీవిత చరిత్ర భావితరాల పురోగతికి, మానవ సమాజాభ్యుద యానికి ఏమాత్రం ఉపయోగపడగలదో నిర్ణయించవలసినది జనసామాన్యం, మేధావి వర్గం మాత్రమే అన్నది నా ఆత్మవిశ్వాసం.

నాఈ జీవితచరిత్ర గ్రంథమునకు తొలిపలుకును సమకుర్చిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత శ్రీ నారాయణరెడ్డి గారికి, దీనిపై అభిప్రాయం వ్రాసి ఇచ్చిన ఒకనాటి నా రాజకీయ సహచరులు ఆంధ్రప్రదేశ్ గౌరవ ఆర్థిక-ఉన్నత శాఖామాత్యులు. మాన్యశ్రీ కె. రోశయ్యగారికి నా అభినందనములు.

అప్పలస్వామిగారు ప్రభుత్వ జూనియర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నం దున నా జీవిత చరిత్రను లిఖించడానికి వారికి అనుమతి ప్రభుత్వం నుండి కావలసిఉన్నం దున ఆమేరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనుమతినిచ్చినందుకు వారభినందనీయులే.

నా జీవిత చరిత్రను రచించిన వంగపండు అప్పలస్వామిగారు తెలుగులో అనేక గ్రంధాలను రచించినవారు. సామాన్య చదువరులకు కూడా అవగతం అయినట్లు చక్కని భాషలో, శిష్టవ్యావహారికి శైలిలో నా జీవితచరిత్రను బహు విధాలుగా లిఖించి చూపడంలో అప్పల స్వామిగారు ''ప్రజాకవి'' అని అన్పించుకున్నారు. తానొక రాష్ట్రప్రభుత్వోద్యోగి అయిన సాహిత్యం ద్వారా సమాజానికి సేవ చేయాలన్న వారి ఆశయం ఎంతైనా మెచ్చుకోదగినదే. సుమారు ఒకటన్నర సంవత్సరాలు శ్రమించి నా జీవిత చరిత్రను రచించిన శ్రీ అప్పలస్వామిగారిని మరొకమారు అభినందిస్తున్నాను.

నిజానికి నా 80 ఏండ్ల జీవితచరిత్రను వ్రాయడం ఒక అసిధారా వ్రతం లాంటిదని నాకు తెలుసు. రాజకీయ నాయకుని జీవితచరిత్రను వ్రాయడం కేవలం భాషాజ్ఞానమున్న సరిపోదు. అంతకు మించిన గ్రంథ విజ్ఞానం, లోకానుభవం ముఖ్యంగా రాజకీయ విజ్ఞాన పరిజ్ఞానం ఉన్నగాని ఇది సాధ్యపడదు. నాపై అమితాభిమానంతో ఎంతో పట్టుదల ధృడసంకల్పంతో తన కృషిని కొనసాగించి నా జీవితచరిత్రను పూర్తిచేసిన అప్పలస్వామిగారు నాకెన్నటికి ఆధరణీయులు, అభినందనీయులు. వారికి నా దైవం ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాధించాలని కోరుకుంటున్నాను.

నా రాజకీయ సహచరులు, నా మేధావి వర్గం, వదాన్యులు, శ్రేయోభిలాషులతో కూడిన శ్రామిక జనవిజ్ఞాన పీఠం విశాఖపట్నం, ఆంధ్రప్రదేశ్ వారికి నాయీ జీవితచరిత్రను గ్రంధ రూపంలో వెలుగులోనికి తెచ్చినందుకు వారెల్లరికి నా కృతజ్ఞతా పూర్వక అభినందనములు.

ఇట్లు
భవదీయ సేవాభిలాషి
సర్దార్ గౌతు లచ్చన్న
విశాఖపట్నం

1-3-90,
విశాఖపట్నం.

# సర్దార్ గౌతు లచ్చన్న

(జీవిత చరిత్ర)



ప్రజానాయకుడు
సర్దార్ గౌతు లచ్చన్న

ప్రజాకవి, గ్రంథకర్త
వంగపండు అప్పలస్వామి

శ్రామిక-రైతాంగ-జనవిజ్ఞాన-పీఠం
విశాఖపట్నం

గ్రామ్స్ "టెల్‌వర్స్"

ఫోన్స్: కార్యాలయం: 236911
234815
గృహం : 63063

# తెలుగు విశ్వవిద్యాలయం

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఎం.ఎ.,పిహెచ్.డి., డి.లిట్.
ఉపాధ్యక్షులు

కళాభవనం,
సైఫాబాదు
హైదరాబాదు—500 004.

లేఖ సం: తెవివి/ఉపా/690/90

తేది: 16-2-1990

## అభినందన

కొందరు బిరుదుల వెంటపడతారు. మరికొందరి కోసం బిరుదులే పుడతాయి. భారత దేశీయ స్థాయిలో 'సర్దార్' అనగానే వల్లభభాయ్ పటేల్ గుర్తుకొస్తాడు. ఆంధ్రరాష్ట్ర పరిధిలో సర్దార్ అనగానే శ్రీ గౌతు లచ్చన్న గుండెకెక్కుతాడు.

పూరికొంపలో పుట్టిన శ్రీ లచ్చన్న తెలుగు గడ్డలో అగ్రశ్రేణి నాయకుడిగా, మంత్రివర్గ సభ్యుడిగా రాణకెక్కడం అలవోకగా జరిగిన పనికాదు. ఆయన క్రమాభ్యుదయం వెనక మొక్కవోని వజ్రసంకల్పముంది, చెక్కుచెదరని కార్యదీక్ష ఉంది.

ఉద్రేకం లచ్చన్నగారికి ఉగ్గుపాలతో అలవడింది. ఉద్యమస్ఫూర్తి ఆయన రక్తస్పందనలో రణదుందుభులు మ్రోగించింది. అక్రమాలపై తిరగబడడం బాల లచ్చన్నకు అత్యంత సహజంగా అలవడిన విద్య.

నా చిరకాల మిత్రులూ, స్వాతంత్ర్యోద్యమ మూర్తులూ, దళితజన బాంధవులూ శ్రీ లచ్చన్న గారి జీవనరేఖలను ఎంతో పదునుగా చిత్రించిన గ్రంథమిది. వంగపండు అప్పలస్వామిగారికి జీవిత చరిత్ర రచనలోని మెళకువలు పట్టుపడ్డాయి. ఏ ప్రకరణం ఎలా ఎత్తుకోవాలో, ఎక్కడ విషయాన్ని సంభాషణ రూపంలో చెప్పాలో, ప్రకరణం చివర ఏ మలుపు తిప్పాలో తెలిసిన రచయిత శ్రీ అప్పలస్వామి. లచ్చన్నగారి సుదీర్ఘ జీవితానికి పట్టిన నిలువెత్తు అద్దమిది. ఎనభయ్యవపడిలో ఉన్న లచ్చన్నగారి వ్యక్తిత్వం చూసుకోవడానికి ఈ గ్రంథం బాగా ఉపకరిస్తుంది. ఈ గ్రంథ నాయకులు శ్రీ లచ్చన్న గారికి, దాయకులు శ్రీ అప్పలస్వామిగారికీ నా అభినందన.

(సి. నారాయణరెడ్డి)

K. ROSAIAH
NISTER FOR FINANCE, POWER
AND LEGISLATIVE AFFAIRS



HYDERABAD

DATE 12-3-90.

## అభిప్రాయం

అరవై ఏండ్ల ప్రజా రాజకీయ జీవితాన్ని – స్వాతంత్ర్యోద్యమ పోరాట వీరునిగా – రైతు కూలీ ప్రజోద్యమాల సంధాన కర్తగా – బలహీన వర్గాల ప్రజా నాయకునిగా విజయవంతంగా నేటికి పూర్తి చేసుకుంటున్న సర్దార్ గౌతు లచ్చన్నగారి జీవిత చరిత్రను గ్రంథ రూపేన వెలువడటం ఎంతైనా సుభావహం – ముదావహం.

విశాఖ జిల్లా ప్రభుత్వ జూనియర్ కళాశాలలో ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్న ప్రసిద్ధ కవి, రచయిత వంగపండు అప్పలస్వామిగారు సర్దారు గౌతు లచ్చన్నగారి జీవిత చరిత్రను రెండు భాగాలుగా ఒకే గ్రంథమున 550 పేజీలలో వ్రాయటం లచ్చన్నగారి యావజ్జీవిత రాజకీయ చరిత్రను అన్ని దృక్కోనాలనుండి ఇనుమడింప జేసినట్లయినది. శ్రీ అప్పలస్వామిగారు తెలుగులో సుమారు 10 గ్రంథాలను రచించిన రచయిత. సాహిత్యం ద్వారా సమాజానికి సేవ చేయాలన్న వారి అభిలాషను, ఆశయాన్ని ఎంతగానో మనం మెచ్చుకోవలసివుంది. అందుకు వారెంతైనా అభినందనీయులు.

నిజానికి సర్దార్ గౌతులచ్చన్నగారి జీవిత చరిత్ర ఆంధ్రుల అరవై ఏండ్ల రాజకీయ చరిత్రగా నుండగలదనుటలో విప్రతిపత్తి లేదు. భావి తరాలవారికీ గ్రంథము ఎంతగానో ఉపయోగ పడగలదు. యువతరానికిది నిత్యనూతన రాజకీయ చైతన్య కరదీపకయై – మార్గదర్శకంగా ఉండగలదన్నది నా నమ్మకం – విశ్వాసం.

ఆంధ్రులకు అరవై ఏండ్లుగా చేసిన, నేటికీ చేస్తున్న వారి రాజకీయ సేవలకు ప్రతి ఒక్కరము వారికి పార్టీలకతీతంగా గౌరవించవలసిన బాధ్యత మనపై, సమాజంపై వుంది. అందుకు వారు అర్హులు, ప్రజాభిమానులు. సమకాలీన రాజకీయులలో అగ్రగణ్యులు. గత ఆంధ్రుల రాజకీయ చరిత్రతోపాటు సమకాలీన ఆంధ్రప్రదేశ్ రాజకీయ చరిత్రను తెలిపే ఈ గ్రంథము రాజకీయాలలో ప్రవేశించ దలచే వారికి రాజకీయ విజ్ఞాన జిజ్ఞాసను కలిగించి ఎంతైనా

(పేజి నెం...2)

**K. ROSAIAH**
MINISTER FOR FINANCE, POWER
AND LEGISLATIVE AFFAIRS




HYDERABAD

DATE

వారికుపయోగ కారిగా ఉండ గలదు. అంతేగాక ఈనాటి యువతరానికి, విద్యార్థిని విద్యార్థులకు మనదేశ గత రాజకీయ చరిత్రను నేటి చరిత్రను తెలుసుకొనుటకేగాక వారిలో దేశభక్తిని, జాతీయతను ఈ గ్రంథము ఎంతగానో ప్రేరేపించగలదనుటలో అత్యుక్తి లేదు.

నిజానికి గత, వర్తమాన సర్దార్ గౌతులచ్చన్నగారి అరవై ఏండ్ల రాజకీయ చరిత్రను తెలిపే ఈ గ్రంథము ప్రతి ఒకరు చదువ వలసినది, ప్రతి ఒక గ్రంథాలయమున ఉండవలసినదని నా అభిప్రాయము. ఈగ్రంథమునకు ప్రసిద్ధ రచయిత జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, వైస్‌చాన్సలర్ శ్రీ నారాయణరెడ్డిగారు తొలి పలుకును సమకూరుస్తూ లచ్చన్నగారి జీవితనికిదొక నిలువెత్తు అద్దముగా ఉండగలదని చెప్పడం ఈ గ్రంథప్రాశస్త్యమును ఎంతగానో ఇనుమడింప చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో ప్రసిద్ధవడసిన సమకాలీన రాజకీయనాయకుని జీవిత చరిత్రను తెలిపిన ఈ గ్రంథము నిజానికి జనసామాన్యమెల్లరికి లచ్చన్న చేసిన సేవలు తెలియపరచడమేగాక మా ఆంధ్రుల గొప్పతనాన్ని, ఉద్యమశక్తిని, రాజకీయ ఔన్నత్యాన్ని ప్రతి ఒకరికి విశదపరచేదిగా రచించిన కవి వంగపండు అప్పలస్వామి గారిని మరొక మారు అభినందిస్తున్నాను. బలహీన వర్గాల్లో సామాజిక స్పృహను, యువతరంలో రాజకీయ చైతన్యాన్ని, సంస్కరణల్లో విప్లవ భావోద్రేకాన్ని ఎంతగానో మన కందించిన సర్దార్ గౌతు లచ్చన్నగారి జీవిత చరిత్ర జనాదరణ కలిగి ప్రజలందరికి ఉపకరించగలదన్నది నా నమ్మకం, ఆత్మవిశ్వాసం.

కె. రోశయ్య

(కె. రోశయ్య)

ఆర్థిక, విద్యుచ్ఛక్తి మరయు ఉన్నతవిద్యాశాఖామాత్యులు,

హైదరాబాదు,
తేదీ. 12-3-1990.

# సర్దార్ గౌతులచ్చన్న జీవిత చరిత్ర

## పరిచయం

### (రచయితగా నామాట)

ఇది సర్దార్ గౌతు లచ్చన్నగారి జీవిత కథ. లచ్చన్నగారు ఒకనాటి స్వాతంత్ర్య సమరయోధులు. నేటి సమకాలీన రాజకీయ నాయకులు. ఎస్టేట్ రైతాంగం పోరాటాన్ని ఉత్తరాంధ్రలో నడిపిన రైతోధ్యమ నాయకుడు. మన ఆంధ్రరాష్ట్ర మాజీ మంత్రి వర్యులు. పలుమార్లు మన శాసనసభకు శ్రీకాకుళం జిల్లా సోంపేట నియోజక వర్గం నుండి ఎన్నికైన ప్రజాప్రతినిధి. పేరెన్నికగన్న ప్రతిపక్ష రాజకీయ పార్టీ నాయకుడు. నేటికి ఒక రాష్ట్ర రాజకీయ పార్టీ నాయకునిగా మనగలుగు తున్నారు. ఎనలేని కీర్తిప్రతిష్టలార్జించిన బలహీన వర్గాల ప్రజల నాయకుడు. వయోభారం తన మీద పడుతున్నా లెక్కపెట్టక నిస్వార్థంగా నిరంతరం ప్రజాసేవ లోనే ఉన్న లచ్చన్న ముందు తరాలవారికి మార్గదర్శి.

నేటికి 60ఏండ్లనాటి పరిస్థితి-రాజకీయంగా బలహీన వర్గాలవారిని అదమాయించడం, ఆర్థికంగా వెనుకబడిన వారిని దోచుకోవడం, సాంఘికంగా అల్పులైన వారిని అణగద్రొక్కడం నిత్యం జరిగేది. గౌతు లచ్చన్న రాజకీయ, ఆర్థిక, సాంఘిక హక్కుల సాధనకై పోరాటం సాగించిన, సాగిస్తున్న, సాగించగల రాజకీయవేత్త లచ్చన్న.

ఉత్తమ జీవిత చరిత్రలో ఆ వ్యక్తి భావాలు, స్వభావాలు, ప్రభావాలు వాస్తవ చిత్రణలో ఉండాలి. వ్యక్తిత్వ పరిశీలన జీవిత చరిత్రకు జీవం వంటిది. లచ్చన్నగారు తను పుట్టిపెరిగిన ఆనాటి సామాజిక పదఘట్టనలకు తట్టుకొని అట్టడుగునుండి అణగద్రొక్కబడిన కులాలనుండి పుట్టెడి ఆశలతో ప్రభవించిన వారు లచ్చన్న. వారు ఆశించనదేమిటి, పొందినదేమిటి, సాధించినదేమిటి.

ఎందరో మహానుభావులు అందరికి నా వందనాలు. అయిన ఏ కొందరి జీవితాలనే మనమేల సందర్శించాలి-సమాజాన్ని ఉత్తేజ పరిచి ప్రజలను చైతన్యమొన రించే వ్యక్తియొక్క జీవిత చరిత్ర సమకాలీన చరిత్రకు అన్నివిధాలా అద్దంగా నిలిచి ఎంతో విలువైన సమాచారాన్ని చదువరులకు, పరిశోధకులకు, జనావళికి అంది స్తుంది.

ఉత్తరాంధ్రలో జన్మించిన సర్దార్ గౌతు లచ్చన్న రాజకీయ జీవిత చరిత్ర 60ఏండ్ల సుదీర్ఘ దివ్య రాజకీయ సాంఘిక సేవా చరిత్ర గలది. తన కాలమునాటి

సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్థితిగతుల అవగాహనకు ఎంతగానో తోడ్పడగలదు. అందువలననే ఏదేశపు సాహిత్యంలోనైనా ఆ దేశానికి చెందిన ప్రముఖ వ్యక్తుల జీవిత చరిత్రలు ప్రత్యేకమైన స్థానం వహిస్తాయి. నిత్యం పరిణామానికి లోనైన సమాజంలో ప్రామాణికతను నిర్దేశించగలిగిందేమిటి? దేశ కాలమాన పరిస్థితులననుసరించి ప్రజాసౌలభ్యాన్ని దృష్టిలో నిడుకొని రాజకీయ విధానాలను తగిన వ్యూహం ఎత్తుగడలతో రూపొందించు కోవాలి. అయితే సిద్ధాంత ప్రామాణికతకు కట్టుబడిన రీతిని ఏ ఒకరు కాదనలేరు. మానసిక పరిపక్వస్థితి లోపించిన-సిద్ధాంత అవగాహన కొరవడిన-లేకున్న పిడువాదాన్ని పట్టుకొని వ్రేలాడిన తుదకు మనకు మిగిలేది వాదము-ప్రతివాదము-సమన్వయ విధానంలో తప్పటడుగు వేయక తప్పదు.

సమాజం-వ్యక్తి-సమాజాన్ని విడిచి మనం పరుగెత్తిన అదే స్థాయిలో మనల్ని సంఘం అందుకోలేక పోవచ్చు. సమాజాన్ని ఎదురు తిరిగి నడిచిన సంఘం ప్రతీకారంతో ఎదురు తిరిగవచ్చు. సమాజాన్ని విడువక సంఘం తిరగబడక సమకాలీన సమాజాన్ని చైతన్యవంతం చేయాలి. సంస్కరించాలి. నేడు కులాల నిర్మూలన జరగక పోయినా కులాల మధ్యగల గీతలు చెరిగి పోతున్నాయి. లేమితనం, వెనుకబడిన తనం ఇంకా మన సమాజమున గల వ్యక్తులలో ఉన్నా-ఏ ఒక వ్యక్తిని నేడు వారికున్న సంపద అధికారాలను బట్టి గొప్పవానిగా భావించే పరిస్థితి నేడు లేదు. అందువలననే దేశంలో కోటికిపడగెత్తిన వారిని ప్రజలు పట్టించుకోరు, స్మరించరు. అయితే తనకోసం పాటుపడే వ్యక్తి ఏ స్థితిగతులలో ఉన్నా ప్రజలాతనని ఆరాధిస్తారు. రాజకీయ నాయకులు రాణించడానికి ఇదే కారణం. చైతన్యం అంతగాలేని సమాజమున పుట్టి ఆ సమాజాన్ని ముందుకు నడిపిన వ్యక్తి లచ్చన్నకు ఆనాడున్నదేమి? అందువలననే తనకు ఆనాటి సమాజానికి ఘర్షణ అనివార్యమైంది. అయితే అందులో జయించినవాడే గొప్పవాడు. చైతన్యవంతమైన సమాజం వ్యక్తిని ముందుకు నడిపించ గలదంటారు కొందరు. అయితే మరికొందరు చైతన్యం పొందిన వ్యక్తులే, చైతన్యంలేని సమాజాన్ని ముందుకు నడపగలరంటారు. లచ్చన్నగారు ఈరెండవ కోవకు చెందినవారు. తన జన్మ యొక్క ప్రయోజనం స్వార్థంకాక, లోక కళ్యాణార్థమని భావించాలి. తన ఆలోచనా ధోరణిని, సరణిని వ్యక్తిపరంగా గాక, స్వార్థపరంగా గాక సామాజికాభ్యుదయం వైపు మరలించగలిగితేనే వారిని సమాజం గొప్పవారిగా భావిస్తుంది. అందువలననే ''లోకానుగ్రహ ఏవైయసో హేతుసే జన్మకర్మణః'' అని చెప్పబడింది.

సర్దార్ గౌతు లచ్చన్న బడుగువర్గాల రాజకీయ మేధావి. లచ్చన్నగారి జీవిత చరిత్ర బడుగువర్గాల బాధల [illegible]

చరిత్ర-ఉద్యమభరితం లచ్చన్న చరితం. లచ్చన్నగారి జీవితం భావితరాలకెల్ల ప్రభావితం.

నిత్యం సాగరములా గంభీరంలా కన్పించినా-అట్టడుగు ప్రజలనాధుకోవాలన్న అంతర్మదనంలో నిమగ్నమై ఉంటారు. తన జీవితంలో తనకెదురైనవి పూలబాటలు కావు. దాటుకుంటూ పోవాలి. ముళ్లపాదల తూట్లు తప్పవు. సునాయాశంగా బ్రతికే తెరవుకాదు. నిత్యజీవన సామాజిక సమస్యల విషవలయంలో స్వార్థపూరిత రాజకీయ ప్రయోజనాలను ఆశిస్తున్నవారిని ఎదిరించాలి. ఆనాడు రైతుల్ని పీల్చిపిప్పి చేస్తున్న జమీందారీలను ప్రతిఘటించాలి. లచ్చన్నగారిలో గల దేశభక్తియావేశ పూరితాభిలాష ఓడి పలాయనం చిత్తగించే పరిస్థితి ఏనాడు రాలేదు. ఫలితమంది తీరాలన్న పట్టుగల స్వరూపం. ధీరులై వెనుకదారులెదికే రకం కాదు.

తన రాజకీయ జీవిత చరిత్రలో అధికార వ్యామోహ ఉపేక్షతప్పించి పదవులనధిష్టించి తీరాలన్న ఆశక్తే కనపడదు. సుఖసంతోషాలతో జీవితాన్ని నెట్టుకొని పోవాలన్న మనస్తత్వం గాక-బ్రతుకును బలహీన వర్గాల సంకేమానికై నిత్య ప్రయోగాత్మకంగా నిలపటంలోనే ఆశక్తి. తన రాజకీయ జీవితంలో లభించిన పదవులకు పదవులకు ఉప్పొంగనూ లేదు, అవి తననుండి దూరమైనపుడు క్రుంగనూ లేదు. స్థిత ప్రజ్ఞుడు లచ్చన్న. తిరుగులేని బలహీన వర్గాల ప్రజా నాయకుడు లచ్చన్న.

ప్రజలందరూ బాగుపడి తీరాలని కోరుకుంటూనే-బడుగువర్గాలకు ప్రభుత్వం తప్పక ప్రత్యేక సదుపాయాల్ని కల్పించాలని వాదిస్తున్న ప్రజానాయకుడు. బలహీన వర్గాల ప్రజాసంకేమ రాజకీయ పరిజ్ఞాన జ్ఞాన బాండాగారం సర్దార్ లచ్చన్న. నిజానికి సర్దార్ గౌతు లచ్చన్న ఒక వ్యక్తికాదు. ఒక సంస్థ, ఒక ఉద్యమం, ఒక విప్లవానికి ప్రతీక. సమకాలీన రాజకీయ సామాజిక చైతన్యకర దీపిక లచ్చన్న.

పడకకుర్చీ రాజకీయ పీఠాన్ని బ్రద్దలుకొట్టి జనంలోకి జొరపడి సామాన్య కార్యకర్తయై ఉత్తరాంధ్రలో ఊరూర తిరిగి పల్లె రైతాంగంలో విప్లవాన్ని స్పందింపజేసి అసామాన్య రాజకీయ నాయకునిగా అవతరించినవాడు లచ్చన్న. గాలికి ఎగిరివచ్చి రాజకీయాలలో ఒకేగంతు వేసి గద్దెనెక్కినవాడు కాదు లచ్చన్న. గతంలో స్వాతంత్ర్య పోరాటంలో రైతుకూలీ ప్రజోద్యమాలలో పాల్గొన్న ప్రజానాయకుడు అనిపించుకొన్నవాడు.

తెల్లదొరలానాడు వల్లుగుళ్లను చేసి-జైల్లల్లో దోచిన జడియలేదే
భూములపై హక్కు బుగతవి కావని పోరాడె-తనకేమి భూమిలేదే
రైతోద్యమాలను రాణించతలపడె-పాడిపంటలు తన పంచలేవే
రాజ సంస్థానాల రద్దవ గద్దించె-పుడమి గొప్పోళ్లింట పుట్టలేదె

అరువదేండ్లుగ-రాజకీయాలు నడిపి
కూలినాలి జనాలను కూడదీసి
ఉద్ధరించెన యువతకు ''ఊత'' అనగ
ఉత్తరాంధ్రకు లచ్చన్న ''ఊపిరి'' రనగ

మూర్ఖ దురాచార, దుర్మార్గ సాంప్రదాయాల కారు చీకట్లు కమ్మిన కాలంలో, అగాధాలకు దిగజారి, అజ్ఞానాంధకారంలో బడుగువర్గాల ప్రజలు కొట్టుమిట్టాడు తున్న సమయంలో వారికి వెలుగు రేఖలనిచ్చిన రాజకీయ విజ్ఞాని లచ్చన్న. ఆనాడు, ఈనాడు, ఏనాడు లచ్చన్నగారు ఆలోచించేది అణగారిని ప్రజలు ఔన్నత్యానికి-ప్ర జావాణిని నిన్న మొన్నటి వరకు శాసనసభ బైట-లోన వినిపించిన లచ్చన్న నేటికి ఒక తన్పై వయోభారం పడుతున్నా ఒక రాజకీయ పార్టీనేతగా బడుగువర్గాలు బాగుపడ వారి బానిస సంకెళ్లను త్రెంచ దీక్షాకంకణ ధారియై రాజకీయ విజయ దుందుబిని మ్రోగిస్తూనే ఉన్నారు.

రైతురంగా కిసాన్ ఉద్యమం తనకు ఊపిరికాగా పలెపల్లెను తిరిగి జమిదారులను ఎదిరించినవాడు దేశ స్వాతంత్ర్య సముపార్జనలో మూడు మారులు చెరసాలలో మ్రగ్గిన దేశభక్తుడు. బడుగువర్గాల బుజంతట్టి పెత్తందారులపై ధ్వజమెత్తిన విప్లవ మూర్తి. తక్కువ కులాల వారిని వెక్కిరిస్తూ వస్తున్న పరమ ఛాందస మతాలను పగడ్బందీగా ఎదిరించి సవర్ణులతో వారు సరిసమానులని ఆచరణలో జూపిన ఆదర్శమూర్తి. రైతుబాంధవుడు--రాజకీయ నాయకుడు-రైతుకూలీ ప్రజోద్యమ నిర్మాత అయిన ఎన్.జి. రంగా అనుచరునిగా చేరి సహచరుని స్థాయిని సంపాదించు కున్న రైతోద్యమ నాయకుడు. ప్రతిపక్ష నాయకునిగా శాసనసభలో ప్రజల కష్టాలను ప్రస్ఫుట పరచి ప్రభుత్వాన్ని దద్దరిల్లజేసిన ఉపన్యాసకుడు. మంత్రిగా కొద్దికాలమే పనిచేసిన పలువురు మెచ్చే సంస్కరణలను ప్రవేశపెట్టిన ప్రజా శ్రేయోభిలాషి, ప్రజాభిమాని, ప్రజల మనిషి.

స్వాతంత్ర సమరంలో పాల్గొని 1951 వరకు సుద్ధ కాంగ్రెస్‌వాదిగా మనగలిగిన జాతీయవాది, గాంధేయవాది ఆనాటి రాష్ట్ర కాంగ్రెస్ ఉపకార్యదర్శి. రైతుకూలీ ప్రజారాజ్య స్థాపన చేయాలన్న ప్రొ. ఆచార్య రంగాజీతో చేయికలిపి రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని అమలపరచ దలచిన ఒకనాటి కృషికరలోక పార్టీ రాష్ట్ర నేత.

క్తికి స్వేచ్ఛ, స్వంత ఆస్తి లేనిదే మనుగడకు అర్థంలేదన్న ప్రసిద్ధ మేధావి జగోపాలాచారి నాయకత్వమున నడిచిన ఒకనాటి రాష్ట్ర స్వతంత్ర పార్టీ నాయ డు. దేశానికి ఎన్నుముక రైతన్నే అన్న నినాదంతో ముందుకు వచ్చిన నాటి ్వర్గీయ చరణ్‌సింగ్ స్థాపించిన ఒకనాటి లోక్‌దళ్ పార్టీ రాష్ట్ర నాయకుడు. 'షలిస్టు సమాజ స్థాపనకై లోక్‌నాయక్ జయప్రకాష్ పిలుపుపై ఏర్పాడి అలనాడు నతాపార్టీ రాష్ట్ర నాయకత్వ ప్రధాన రాజకీయ భాగస్వామి. పల్లెభారతిని ఉద్ధరించ ంమే తన లక్ష్యంగా, ధ్యేయంగా ప్రకటిస్తూ వస్తున్న భారతదేశ జనతాదళ్ పార్టీ లుపు మేరకు నేడు రాష్ట్ర జనతాదళ్ నాయకులుగా మనగలుకుతున్న ుజాభిమాని.

కేవలం పదవీకాంక్ష, అవకాశవాదం, స్వీయప్రయోజనాలే తన ధ్యేయమైతే ుచ్చన్న ప్రజలనుద్ధరించ వివిధ పార్టీలలో మనగలగ నవసరం లేదు. ఏ ఒక అధికార ార్టీలోనో తను స్థిరంగా ఉండాలన్న ఉండగలరు, వివిధ అధికార పదవులనందగ ారు. అయితే లచ్చన్న లక్ష్యం పదవీ అధికారలనందుట కాదు. దోపిడీదారుల నుండి బలహీన వర్గాల ఎలా ఉద్ధరించాలన్న పట్టుదలాదీక్షతో విరామమెరుగక నేటికీ ఒక రాజకీయ నాయకునిగా ప్రకాశిస్తున్న మహోన్న వ్యక్తి సర్దార్ గౌతు లచ్చన్న.

ఇటువంటి వ్యక్తి రాజకీయ జీవిత చరిత్రను లికించటం సులభకరమైన విషయం కాదన్నది నాకు తెలుసు. రాగద్వేషాలకతీతంగా రచయిత నిలిచిన గాని ప్రయత్నం సిద్ధించదు. పరిణామక్రమంగా, పరిశుద్ధాత్మకంగా సత్యప్రేరితమై సుబోధకంగా రచన కొనసాగాలి. సులభతరమైన తెలుగు పదజాలంతూ, అవగాహనతో భావాల వెలుగుతో రచన ఏర్పడాలి. రచయితకు లచ్చన్నగారితో పూర్వపరిచయం లేకున్న అతని గత రాజకీయ జీవిత గాధాసప్తసతిని కనీ వినీ ఉన్నవారు. సుమారు 60 ఏండ్లు రాజకీయాలలో నిర్మాణాత్మక పాత్ర వహించిన లచ్చన్న జీవిత చరిత్ర బలహీన వర్గాల బాంధవునిగా ఆతనికి పేరు ప్రఖ్యాతుల్ని తెచ్చిపెట్టగలదు. ఆతని జీవిత చరిత్ర ఉద్యమాల ఊపిరిగా ఉంటుంది. లచ్చన్న జీవితాన్ని బహుముకంగా పరిశీలించాను. నా భావన మేరకు వివరించాను. నా భావనలో, అంశనాలో, సన్నివేశాల నిర్ణయాల్లో, అభిప్రాయ ప్రకటనల్లో ఏవైనా లోపాలున్న అవన్ని రచయితకే పరిమితమవుతాయి తప్పించి కథానాయకునికి చెందినవిగా ఉండవు. ఏ ఒకరైనా నాయీ రచనపై ఏ విషయం తెల్పదలిచినా తప్పక వాటిని స్వీకరించి అందలి తప్పొప్పులను సహృదయంతో స్వీకరించ గలను.

సాహితీ రూపం పొందినంత మాత్రాన గ్రంథాల్లో ఒక కథగా అల్లిన కారణంగా ఏ ఒక వ్యక్తి చరిత్రలో గొప్పతనం సంపాదిస్తాడని కాదు. అయితే గొప్పతనం గల

వ్యక్తుల జీవితాలను లిఖిత పరచి, భద్రం చేస్తే అది భవిష్యత్ మానవాళికి మార్గదర్శకంగా ఉండగలదనుటలో విప్రపత్తిలేదు. అయితే లిఖించబడకున్న చరిత్రలో వ్యక్తుల ఘనకార్యలు కలకాలం నిలిచి మనగలగలేవా? అసంభవం! ఎంతటి కీర్తిప్రతిష్టలను ఆర్జించినా, ఎంతటి ప్రజోపకారియైనా అతని చరిత్రను గ్రంథస్తం చేయనిదే శాశ్వతంగా ఈ జగతిలో నిలిచి ఉండదనటానికి "మున జన జ్ఞాపక శక్తి" తక్కువగా ఉండుటయే కారణం. దశావతారాలు ఒకే దేవుని, ఒకే స్థాయి ప్రతిరూపాలని మనం భావించినా పౌరాణిక యుగంలో రామావతారినికున్న ప్రాధాన్యత ప్రచారం ఏ అవతారానికి లభించలేదు. కారణం తేటతెల్లమే. మహాకవి వాల్మీకి సృష్టించిన రామాయణ కావ్యమే. ఇక చారిత్రక యుగంలో ఎందరో సామ్రాజ్యాధిపతులు ఈ ధరణినేలినా వారందరూ మరుగున పడినారు. శ్రీకృష్ణదేవరాయలు అందరికన్న చిరకీర్తిప్రతిష్టలను ఆర్జించిన వారుగా నేటికి పరిగణింపబడుతున్నారు. కారణం విదితమే అతని ఆస్థానంలో ఉన్న అష్టదిగ్గజాలు.

ఊరు పేరుతో ప్రతిఒకరు జన్మించినా-తన స్వార్థం, తన బ్రతుకు తప్ప ఇతరుల మంచిచెడులను పట్టించుకొనకున్న తన తదనంతరం తన పేరును మర్చిపోతుంది. తన కుటుంబమే తన పేరును విస్మరిస్తుంది. అందుకే పోతన తన భాగవతంలో "కారే రాజులు రాజ్యముల్ గెలవరే గర్వోన్నతిన్ చెందరే-వారేరి-సిరి మూటగట్టుకుని పోవంజాలిరే-ఇంతకున్ భూమిపై పేరైనన్ గలదే?" అని ప్రశ్నించారు.

ప్రజానాయకులు సర్దార్ గౌతు లచ్చన్న విశాఖపట్నంలో నివసిస్తూ ఉక్కునగరానికి సమీపమున గల నేను నివసిస్తున్న పెందుర్తిలో గల నా స్వగృహమునకు విచ్చేసి "అప్పలస్వామి ఆచార్యా-ఆర్య మీరు ప్రజల కథ రాసిరని వింటి ప్రజల కొరకు అరువదేండ్లుగాజీవితమంకితమయెనాదు కథ రాయబూనుట న్యాయము కదా?" అని " అడిగినంతనే ఆశ్చర్యమావరించ-రెండు చేతులు జోడించి దండమిడుతు అంత భాగ్యమా నాకు మహానుభావా! సచరిత్రుని కథ జన్మసార్థకమేగ రాజకీయాలను నడిపించు రాజు కథను వెనుకబడిన జనావళి వెలుగు కథను, బడుగువర్గాలు విలపిల్లి బ్రతుకు కథను, గౌతు లచ్చన్న ఖ్యాతికి తగిన కథను". అంతటి ఔన్నత్యం గల వ్యక్తియొక్క జీవిత చరితను లికించ సిద్ధపడితిని. ఏ పార్టీకి చెందిన వారైతేనేమి, ఆ పార్టీ సిద్ధాంతమేదైతే నేమి భారత రాజ్యాంగ పరిధికి లోబడి స్వేచ్ఛా సమానత్వాలను, శాంతియుత సహజీవనాలను ఆదర్శంగా గల ఏ ఒక సిద్ధాంతమైన మనకు ఆదరణీయమే. ప్రజాస్వామ్యం, సామ్యవాదం, జాతీయత, లౌకికవాదం మనక కావాలి. మట్టిపాలైన వెట్టిచాకిరీ బ్రతుకులను, రైతుకూలీలను, వెనుకబడిన హరిజన గిరిజనులను బుజం తట్టి ఉద్యమాలను నడిపి ఎవరికి

లచ్చన్నగారెందులోను తీసిపోరని దున్నేవానిదే భూమని, కష్టించే వానిదే ఫలితమని, కులాలు వర్ణాలు కూడదనవని ప్రబోధించిన మహనీయుని చరిత్రకు శ్రీకారం చుట్టితిని.

పలుమార్లు మన ఆంధ్ర శాసనసభలోన-ప్రజల కష్టాలను పలికెనెవరు
తెగునాటను నాడు వెలుగిచ్చు మంత్రివై-నలుదికలు కాంతిని బంపె నెవరు
ప్రతిపక్ష నాయక పదవిని చేపట్టి-ప్రభుతను గద్దించు ప్రముఖుడెవరు
బలహీన వర్గాలు బాగై వెలుగొంద సభలు సమ్మేళనల్ జరిపెనెవరు
నాడు నేడును చూడ ఏనాడు కూడ
బడుగువర్గాల ప్రజలనే బాగుచేసె
వెనుకబడిన కులాలకో వెలుగు నివ్వ
నీదు కథరాసి మెప్పింతు నిఖిల జగతి

గౌతు లచ్చనగారితో పరిచయ భాగ్యం రచయితకు దలిమిలా ఏర్పడినదే తప్ప మొదటినుండి నున్నది కాదు. అందువలన ఇది యాదృచ్ఛికం కానేరదు. ఉద్దేశ్యపూర్వకమే. దైవ నిర్ణయమే. దైవనిర్ణయానికి ఏనాడు ప్రతిరూపంగా నిలువగల ''ప్రజాత్మ నాకిడిన ఆదేశంగా భావిస్తు తన కథను రచించాను. విశ్వ విజ్ఞాన తేజస్సులో ప్రజాచైతన్యం ఒక కరదీపికగా వెలుగొందాలన్న దానికిదొక ప్రతిరూపం.

కొందరు జన్మతః అధికులని, మరికొందరు పుట్టుకతోనే అల్పులని విడదీసి 40 ఏండ్ల క్రిందట బాహటంగా ప్రచారంచేసే సామాజిక దౌర్భాగ్యపు విధానలపై ధ్వజమెత్తినవారు సర్దార్ గౌతు లచ్చన్న. ప్రజారాజ్యములో ప్రతిఒకరు పరిపాలనకర్హులని స్వాభావాధిక్యతను కొందరే కల్గియుందురన్న గుడ్డినమ్మకాన్ని నడ్డివిరగొట్టినవాడు సర్దార్ గౌతు లచ్చన్న. నడివీధిలో నడిచి నలుగురిలో తనొకడనని ప్రజోద్యమాలను, రైతోద్యమాలను నడిపినవాడు లచ్చన్న.

గీతాకారుడు సిరిసంపదలు నీతి, విజయము ఎచట నుండగలవో భగవద్గీత ముగింపు శ్లోకంలో తెలిపాడు.

''యత్ర యోగీశ్వరః కృష్ణో-యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో ర్భూతిర్ధ్రువర్నీతిర్మతిర్మమః

పారమార్థిక విషయాలను, ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని బోధించనదే గీత. కృష్ణుడు గాక, యోగీశ్వరుడైన కృష్ణుడు. అర్జునుడు గాక ధనుర్ధారియైన అర్జునుడు ఎచట ఉందురో అచటనే సిరిసంపదలుండగలవని వక్కాణించినది. ఒకరు యోగ మనస్తత్వానికి సంకేతం. వేరొకరు కర్తవ్య నిర్వహణకు చిహ్నం. అందువలన ఏ ఒకరిలో

ఈయోగ మనస్తత్వం, కర్తవ్య నిర్వహణ ఉండునో వారు తప్పక సిరి సంపదలను విజయాలను అందగలరని ఆశీర్వదిస్తూ తన ముగింపు వాక్యములో గీత పలికింది. సర్దార్ గౌతు లచ్చన్నగారిలో పై తెల్పిన ఇరువురి యొక్క సంకేతము, చిహ్నముమ చూడగలము. రాజకీయాలను నడిపి నేటికి యోగ మనస్తత్వం గల శ్రీకృష్ణునిగా ధనుర్ధారియైన అర్జునునిగా తన జీవిత లక్ష్యసాధనలో ముందడుగేస్తున్న స్వాతంత్ర్యోద్యమ యోధునికి, రైతోద్యమ సారధికి, బలహీన వర్గాల ప్రజా నాయకునికి ఆ శ్రీకృష్ణ పరమాత్మ ఆయురారోగ్య ఐశ్వర్యాలను ప్రసాధించాలని మనసారా అభిలషిస్తూ నాయీ గ్రంథ రచనకు ఉపక్రమిస్తున్నాను.

రచయిత
వంగపండు అప్పలస్వామి
పార్వతీపురం

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ

Pendurthi,
Dt.10-5-1989.

From
V. Appalaswamy, M.A.(Double),B.Ed.,
Principal,
Govt.Junior College,
Pendurthi, Visakhapatnam.

To
Sardar Gouthu Latchanna,
Freedom Fighter,
25-9-11, Rajavari Street,
Visakhapatnam-530 001.

Respected Sri,

On my request dated.26-11-88 made to the Government of A.P. I am happy to inform you that the benevolent Government of A.P., represented by its Secretary, Education Department (IEI) has kind enough accord permission to me to write a book of your life history in view of your historical participation in freedom struggle, as I feel that your life history will be an assert and guidance to the future generation got only to the people of Andhra Pradesh but also to the people of our country in general.

While according permission, the Government of A.P. in their Memorandum No.850/IE-1/891-Edn., Dt.2nd May, 1989, (Copy enclosed), has kind enough to mention that the author (i.e) myself has to complete the book without determental to my normal duties as principal and subject to the conditions indicated in the para 5 of the above said Memorandum and also under rule 13 of A.P.C.S.(Conduct Service Rules, 1974). In accordance with this condition I am obliged to have personal interviews urgently with your good-self only on Sundays and other public holidays.

May I therefore request you to kindly permit me to write a book on your life history and let me know your time during Sundays and other public holidays to facilitate me to meet you in person at your residence or at any place convenient to you, as Visakhapatnam is only 8 K.M. from Pendurthi.

A waiting for your kind reply at the earliest.
With regards,

Yours Sincerely,

**Sardar Gouthu Latchanna** Freedom Fighter & Ex-Minister (A.P)
25-9-11, Rajavari Street, Visakhapatnam-530 001,
31-A, Old M.L.A. Guest House Hyderabad-500 178)
Phone: 61648
Phone: 242299

Date. 12-5-1989

To
Sri V. Appala Swamy,M.A(Double),B.Ed.,
Principal,
Govt. Junior College,
Pendurthi,
Visakhapatnam.

Dear Sri Applaswamy garu, Namaste.

Ref: Your letter dated.10-5-89 with regard to write a book on my life history.

- - - - -

Thanks for your kind letter cited above. I welcome your proposal to write a book of my life history, and I feel that it will be a privilege to me since I myself thinking of writing my biography. I will be available on all Sundays and on other public days at my above residence,. Visakhapatnam. I request you to give me a ring to my above telephone number: 61648, Visakhapatnam before you start from Pendurthi.

Since I am in public life from 1930 Salt-Satyagraha (i.e) fifth nine years and above, I request you kindly to bare with me during your interviews, if I go into details on various aspects of my public life, as I feel that it may be necessary to write my life history in two parts (i.e) upto the attainment of freedom of our country as Ist part and as IInd part, on all the events that have taken place until now during post independence period of my public life.

I trust you will kindly agree with my above suggestion.

With regards,

Yours sincerely,

**GOVERNMENT OF ANDHRA PRADESH**
**EDUCATION IE.1 DEPARTMENT**

Memorandum No.850/IE.1/89-1, Edn.Dated:2-5-1989

...

Sub: APES - Sri V. Appala Swamy, Principal, Govt.,Junior College, Pendurthi, Visakhapatnam District - Permission to write a book on the life history of Sri Gouthu Lachanna Freedom Fighter - Permission - Accorded.

Ref: 1. From Sri V. Appalaswamy, Prl, Govt.Jr.College, Pendurti, representation dt.26-11-1988.
2. From Sri G. Syam Sundar Sivagi, M.L.A lr.dt.3-4-89.
3. From the DHE Lr.Rc.No.1093/JC1-4/89, dt.5-4-89.

...

Under rule 13 of A.P.C.S(Conduct) rules 1974, Government accord permission to Sri V. Appalaswamy, Principal, Government Junior College, Pendurthi, Visakhapatnam to write a book on the life history of Sri Gouthu Lachanna freedom fighter, without detrimental to his normal duties and subject to the conditions indicates in para 5 of the letter first cited.

R.V. Vaidyanath Ayyar,
Secretary to Government.

To
The Director of Higher Education,A.P. Hyderabad.
Copy to the Regl.Jt. Director of Higher Education, Rajahmundry.
Copy to Sri Syama Sunder Sivaji, MLA., MLA Quarters, Hyd.
Copy to the individual through Director of Higher Education, Hyd.
Copy to SF.

Forwarded by order

Section Officer.

# శ్రామిక-రైతాంగ-జనవిజ్ఞాన-పీఠం

## విశాఖపట్నం
## సుమనస్సు నమస్సాంజలి

సర్దార్ గౌతులచ్చన్నగారి జీవిత చరిత్రను-భావి తరాలవారికి నిత్యనూతన రాజకీయ చైతన్య కరదీపికగా ప్రకాశించగలదన్న నమ్మకం-విశ్వాసంతో రచించమని ప్రసిద్ధకవి-రచయిత-ప్రిన్సిపాల్ వంగపండు అప్పలస్వామి గారిని అర్థించితిమి.

మా కోరిక మేరకు రచయితకు సర్దార్‌జీపై ఉన్న గౌరవ ప్రేమాభిమానాల్ని పురస్కరించుకొని సుమారు ఒకటన్నర సంవత్సరాలు ఈమహత్తర బృహత్తర ప్రజాకార్య సాధనలో నిమగ్నమై తన విధిని తను నిర్విఘ్నంగా కొనసాగిస్తూనే సాహిత్యం ద్వారా సమాజానికి సేవ చేయాలన్న సత్‌సంకల్పంతో 80 ఏండ్ల లచ్చన్నగారి జీవిత చరిత్రను సుమారు 600 పేజీల గ్రంథంగా తీర్చిదిద్ది నందుకు వారినెంతగానో మేమభినందిస్తున్నాం. ఇందుకు వారు మాకు నిత్య సన్మానితులు.

సర్దార్ జీవిత చరిత్రను వెలుగులోనికి తెచ్చుటకు మాకు అన్నివిధాల ఆర్థిక-హార్థిక సహకార సద్భావాలందించి ఈ గ్రంధ ముద్రణకు తోడ్పడిన వధాన్యులకు, శ్రేయోభిలాషులకు మా అభినందన పూర్వక నమస్కారములు.

ఇంతటి మహత్తర గ్రంథాన్ని వెలుగులోనికి తెచ్చిన ముద్రణాది పతులకు, డైరెక్టర్ ఆంధ్రయూనివర్సిటి ప్రెస్ వాల్తేరు వారికి, హైదరాబాద్ జ్యోతిప్రెస్ అధిపతి మాన్యశ్రీ దేవేంద్రనాథ్ గారికి, స్పీడ్ ప్రింట్ పార్టనర్ విజయవాడ గురుకృష్ణ గారికి మా కృతజ్ఞతలు.

సెక్రటరీ
శ్రామిక-రైతాంగ-జనవిజ్ఞాన-పీఠం
విశాఖపట్నం

10-4-90
విశాఖపట్నం

# సర్దార్ గౌతు లచ్చన్న-జీవితచరిత్ర

## కృతజ్ఞతలు

నేటికి 60 ఏండ్ల ప్రజారాజకీయ జీవితాన్ని పూర్తి చేసుకుంటున్న సర్దార్ గౌతు లచ్చన్న జీవిత చరిత్రను వ్రాయడం 60 ఏండ్ల ఆంధ్ర రాష్ట్ర రాజకీయ, సాంఘిక, ఆర్థిక చరిత్రను తిలకించడమే అవుతుంది. ఇంతటి ఘనకార్యానికి రచనా వ్యాసంగానికి నన్ను ప్రోత్సహించి తన జీవిత చరిత్రను పూసగ్రుచ్చినట్లుగ నాకు విశదపరచిన సర్దార్ గౌతులచ్చన్నగారికి యావజీవితం కృతజ్ఞునిగా వుంటాను.

వాగార్థాల వలె విడివడక జంటకవుల మాదిరి నడవడిలో, అభిప్రాయ ప్రకటనలో, ఏకాత్మను అలవరచుకొని అపూర్వ సహోదరులవలె ఉత్తరాంధ్ర రాజకీయాలలో ప్రజాభిమానులనిపించుకొంటున్న నేటి స్వతంత్ర శాసనసభ్యులు గౌతు శ్యామసుందర శివాజీ, కింజరాపు ఎర్రన్నాయుడుగారు. ఒకరు శ్రీకాకుళం జిల్లా సోంపేట నియోజక వర్గం నుండి ఎన్నికకాగా వేరొకరు ప్రక్కనేగల హరిశ్చంద్రపురం నియోజక వర్గం నుండి గెలుపొందిన వారు. నాయీ గ్రంథ రచనకు అనుమతినిప్పించుటలో చూపిన శ్రద్ధాశక్తులు, వెలుబుచ్చిన అభిప్రాయాలు నాపై వారికి గల ప్రేమానురాగాలు నా జీవితంలో చిరస్మరణీయాలు.

సరార్ గౌతులచ్చన్న జీవిత చరిత్రను లిఖించుటకు దయతో ''పర్మిషన్'' మంజూరు చేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం విద్యాశాఖ వారిక నా మనః పూర్వక ప్రణామములు. సదరు ఆదేశాన్ని తమ ద్వారా నాకందించిన విద్యాశాఖ డైరెక్టర్ వారికి నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథమునకు తొలిపలుకును సమకూర్చిన జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత తెలుగు యూనివర్సిటి వైస్ ఛాన్సలర్, ఆధునిక సినీకవి, స్నిగ్ధ కవితాసారధి డా. సి. నారాయణరెడ్డిగారికి-ఈ గ్రంథముపై అభిప్రాయం వ్రాసి ఇచ్చిన ఆంధ్రప్రదేశ్ గౌరవ ఆర్థిక ఉన్నత విద్యాశాఖా మాత్యులు మాన్యశ్రీ కె. రోశయ్య గారికి ఇరువురికి నా మనః పూర్వక ధన్యవాదములను సమర్పిస్తున్నాను.

పెందుర్తి ప్రభుత్వ జూనియర్ కళాశాలలో లెక్చరర్లుగా పనిచేస్తున్న చిరంజీవులు యన్. దామోదరరావు, పి. తాతారెడ్డి, జి. నారాయణరావు ముప్వురు నాపై ఎంతో గౌరవాభిమానాలతో నా హితమాశించి ప్రఖ్యాతి గాంచిన బలహీన వర్గాల ప్రజానాయకుడు సర్దార్ గౌతులచ్చన్న గారితో నాకు పరిచయం చేసారు. నిజానికీముప్వురు నాలోని ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులను నాయీ రచనను చేపట్టడంలో పెంపాం

వారిగా భావిస్తూ వారికి నా అనురాగ ఆప్యాయతలను అందిస్తు సత్యం, శివం, సుందరం అంటూ ఆశీర్వదిస్తున్నాను. నాయీ రచనను కొనసాగించుటకు తన వంతు అభిమానాన్ని నాకందించిన ప్రియ శిష్యుదు, ఉత్తముడు చిరంజీవి ననపల పాండురంగారావు గారికి నా ఆశీస్సులు.

నే వ్రాసిన బ్రహ్మ లిపికి ప్రాణప్రతిష్ట చేసి స్పష్టమైన రూపం కల్పించి నా వ్రాత ప్రతుల్ని వెలుగునిచ్చే రీతిని వ్రాసిపెట్టిన యం.ఏ. తెలుగు లిటరేచర్ పోస్టు గ్రాడియేట్ నా ప్రియమైన నా పెద్ద కూతురు శ్రీమతి శ్యామసుందరం జయశ్రీకి నా అభిమాన పూర్వకమైన ఆశీస్సులు. నేనింతటి స్థితికి రావటానికి ఆదినుండి ఒక కారణంగా నిలచి లోగడ నే వ్రాసిన ఎన్నో రచనలకు నేటి ఈ రచనకు ఊపిరి పట్టుగా నిలిచిన నా శ్రీమతి అన్నపూర్ణకు నా ప్రేమాభిమానాల్ని అందిస్తున్నాను.

ఎన్నో వ్యయప్రయాసలకోర్చి, అహర్నిశలు శ్రమించి పట్టుదల దీక్షతో నాయీ గ్రంథమును ముద్రించి వెనుకబడిన జనావళికే గాక ఎల్లరికి ఒక వెలుగును ప్రసాధించిన శ్రామిక రైతాంగ జనవిజ్ఞాన పీఠం విశాఖపట్నం వారికి కృతజ్ఞుడను.

1-7-89

విశాఖపట్నం.

రచయిత

వంగపందు అప్పలస్వామి.

# గౌతు వంశ వృక్షం

(శాఖోపశాఖలు)

గౌతు బుడ్డయ్య
(అంబుగం వాస్తవ్యులు)

కృష్ణయ్య
(బారువా వచ్చి స్థిరపడి పోయారు)

కుమార్తె కుమార్తె కుమారుడు చిట్టియ్య (లచ్చన్నగారి తండ్రి బర్మా వెళ్లివచ్చినవారు భార్య రాజమ్మ)

సత్యనారాయణ మహాలక్ష్మి లచ్చన్న (భార్య యశోదమ్మ)

శ్యామసుందర శివాజీ (విజయలక్ష్మి భార్య) ఝాన్సీ సుశీల
(1989 ఎన్నికైన శ్రీకాకుళం జిల్లా సోంపేట నియోజకవర్గ ఇండిపెండెంటు శాసనసభ్యులు)

శిరీష అనూరాధ

ఝాన్సీ+రామకృష్ణలు సుశీల+వాసుదేవులు

ప్రసాద్ రాజు చంద్రశేఖర్ గాయత్రి

# సర్దార్ గౌతు లచ్చన్న

(జీవితచరిత్ర)

## అంకితం

రైతాంగాన్ని బడుగు బలహీన వర్గాల బతుకుల్ని బాగుచేసిన-చేస్తున్న-చేయగల సర్దార్ గౌతు లచ్చన్నగారిని కడుపార కని పెంచి పోషించి వెనుకబడిన వర్గాలకు ఒక వెలుగును ప్రసాదించిన పుణ్యదంపతులకు

ఓం



స్వర్గీయ
గౌతు చిట్టియ్య

స్వర్గీయ
గౌతు రాజమ్మ

రచయిత.

# సర్దార్ గౌతు లచ్చన్న

## (జీవితచరిత్ర)

## ప్రథమ భాగము

## విషయ-సూచిక



సమాప్తం.

# [illegible]. బడుగువర్గాల బాంధవుడు

శ్రీలు విలసిల్లిన భాగ్యసీమ మన "ఆంధ్రభూమి" – తన సంస్కృతిని, చరిత్రను ఉత్తేజ పరచగలది మన "ఆంధ్రప్రభ" – తన కీర్తిప్రతిష్టల నలు దిశల వ్యాపింపజేయగలది మన "ఆంధ్రజ్యోతి" – ఆంధ్రుల చిరకాల వాంఛితమైన ఆంధ్ర రాష్ట్రము ఏర్పడితీరాలన్న ప్రజాభిమతమును పలు విధాలుగా ఆనాటి ఆంధ్రపత్రికలు ప్రజావాణిని వినిపించాయి. చివరకు అమరజీవి శ్రీ పొట్టి శ్రీ రాములు త్యాగ ఫలితంగా 1953 అక్టోబరు 1 వ తేదీన ఆంధ్ర రాష్ట్ర అవతరణ జరిగింది.

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధాని కర్నూలు. గవర్నర్ మాధవలాల్ చందూలాల్ త్రివేదీ. ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం ముఖ్యమంత్రిగా రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడింది. ఉపముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి.

అది 1955 నవంబరు నెల 7 వ తేదీ సుప్రభాత సమయము. ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గ విస్తరణ జరగబోతున్న దినము. అట్టడుగునుండి పుట్టెడు ఆశలతో లేచి అభ్యుదయంవైపు నడచివెళ్లటానికి తగిన రాజకీయశక్తినిపుంజుకుని – ప్రజాశక్తిగా ప్రకాశిస్తూ–ఉద్యమాలకు ఊపిరిపోసి, ఉత్తరాంధ్రకే ఊపునిస్తూ లేచి, వెలుగు జూచిన, వెనకబడిన తనానికి–మంత్రివర్గంలో చేరమని ఆహ్వానలేఖ అందింది.

తాత్కాలిక రాజధాని కర్నూలు శక్రటేరియేట్ కార్యాలయంలో అతి నిరాడంబరంగా మంత్రివర్గ ప్రమాణస్వీకారం జరిగింది. ప్రకాశం పంతులు, సంజీవరెడ్డి, ఇతర కాంగ్రెస్ నాయకులు, ప్రతిపక్ష నేతల సమక్షాన సభాభవనమే ఒక వేదిక కాగా గవర్నర్ మాధవలాల్ చందూలాల్ తనస్థానంనుండి లేచి మంత్రివర్గంలో చేరబోతున్న రాజకీయనాయకుని పిలచి తదుపరి జరగవలసిన కార్యక్రమాల్ని ప్రకటించారు.

ఇంతలో సభావేదికపైనున్న ఒక స్ఫురద్రూపం లాల్చీ, పంచెకట్టు, కండువా, నల్లద్దాల కళ్ళజోడు, వేస్టుకోటు ధరించి, మూర్తీభవించిన అధికార రూపంలా, వెల్లివిరిసిన విప్లవభావాల సంకేతమై, పటిష్టమైన కొట్టొచ్చే శారీరక భీకర ఆకారం తనస్థానంనుండి గంభీరమైన వదనంతో లేచి కండువా, కళ్ళజోడును సవరించు కుంటూ తనకు నిర్దేశించిన స్థానంలో నిలచి గవర్నరు ప్రమాణపత్రమును చదవగా రాష్ట్రమంత్రివర్గంలో చేరబోతున్న ఆ వ్యక్తి దాన్ని అనుసరిస్తూ చదవడం జరిగింది. భారత రాజ్యాంగబద్ధంగా తను నడవగలనని ప్రమాణస్వీకారం చేయడమైంది.

ఆ ప్రమాణంచేస్తున్న రూపం, స్వరూపం ఎవరిదో కాదు—ప్రతిఘటనా ప్రతిరూపంగా, బలహీనవర్గాల బలంగా, వెనుకబడిన వర్గాల వెలుగుగా, ప్రజా ప్రతినిధిగా, ప్రజాభిమానిగా, ఉత్తరాంధ్రకే ఉత్తేజాన్నిచ్చే శక్తిగా ఉంటూ వస్తున్న సర్దార్ గౌతు లచ్చన్నగారిది. ఆంధ్రుల చరిత్రను, సంస్కృతిని, అభ్యుదయాన్ని పరిరక్షించుకోవాలన్న తపనలో ఏర్పడిన ఆంధ్రరాష్ట్ర మంత్రి వర్గమున లచ్చన్నగారు వ్యవసాయ – కార్మికశాఖామాత్యులుగా అనాడు ప్రమాణ స్వీకారం చేసారు. ధీరోదాత్తుడు, బహుజన బాంధవుడని వేనోళ్ళ ప్రజలచే పొగడ బడిన లచ్చన్న మంత్రిపదవి నధిష్టించగనే అట్టడుగునపడిన జాతి జనాలకు ఆశా జ్యోతి వెలిగింది. తరతరాల దాస్యంలో, వెట్టిచాకిరీ బ్రతుకులతో జీవితాన్ని నెట్టుకుంటూ వస్తున్న రైతుకూలీ ప్రజానీకంలో కాంతిరేఖలు వెల్లివిరిసాయి. అధికారంలో బలహీనవర్గాలకు భాగస్వామ్యం లభించింది. మంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన లచ్చన్నకు ఈ అవకాశం రావడం, ఆహ్వానం పొందడం, లచ్చన్నగారు మంత్రి పదవిని ఆశించినందున కాదు. షరతులతో కూడిన, పార్టీ ఆదేశంమేరకు జరిగింది. 1953 అక్టోబరు 1న ఏర్పడిన కాంగ్రెస్ మంత్రివర్గాన మెజారిటీ లేదు. "కె.ఎల్.పి." నలుగురు సభ్యులను చేరదీసినా ఫలితం లేకపోయింది. రాజకీయ శక్తిని పుంజుకోవటానికి, ప్రజా శక్తితో అభ్యుదయంవైపు నడచివెళ్లటానికి, తప్పనిసరి పరిస్థితులలో లచ్చన్నను మంత్రివర్గంలో చేరమని నవంబరు 4వ తేదీన కాంగ్రెస్ ప్రభుత్వం రాయబారం నడిపింది. మంత్రిపదవి వచ్చిందని దౌడుతీసే రీతిగాక, లచ్చన్నగారు "కె. ఎల్. పి." అధిష్టానవర్గం ఆదేశించనిదే వీలులేదు పొమ్మన్నారు. చివరకు రంగాజీ అనుమతితో రంగంలోకి దిగారు. ఇంతవరకు ఈ ప్రజాప్రభుత్వాలు బలహీనవర్గాలకు ఏంచేసిపెట్టాయి ? ఈ ప్రజావాణి — శాసనసభలోన, బయట గద్దించి అడుగుతున్న రాజకీయ నాయకునికీ – ప్రజకు చేయగలిగిందల్లా చేసిపెట్టగల అధికారయోగం వచ్చిపడింది.

స్వాతంత్ర్య సమరయోధుడు, ప్రజాప్రతినిధి పరిపక్వమొందిన రాజకీయ నాయకునికి, ప్రజారాజ్యంలో పదవి లభించిన ప్రజా జీవననాడిని ప్రతిస్పందింప జేస్తుంది. రాష్ట్ర మంత్రివర్యునిగా వ్యవసాయకార్మిక శాఖలను తీర్చిదిద్దాలన్న దీక్ష పట్టుదలతో లచ్చన్నగారి హృదయం నిండిపోయింది. కళ్ళల్లో కాంతిరేఖలు విలసిల్లాయి. ఉత్సాహ ఉద్రేకాలు ఉప్పొంగి, జనవాహినిలో జాగృతిని తీర్చి రైతుకూలీల నుద్ధరించాలన్న ఆకాంక్ష అతనిలో లేచింది.

ప్రజాహితుడైన రాష్ట్ర కృషికరలోక పార్టీ నాయకుడు, మిశ్రమ మంత్రి వర్గమున చేరడం ఆంధ్ర ప్రజానీకం ఎంతగానో హర్షించింది. రైతు శిక్షణ యాత్రలను ఉత్తరాంధ్రను నడిపించి, జమీందారీ విధానాన్ని రద్దయ్యేలా తన పార్టీస్థాయిలో ఎనలేని కృషిసలిపిన లచ్చన్నకు మంత్రిపదవి లభించడం

పలువురు ప్రముఖులు ప్రజావిజయంగా ఆనాడు పేర్కొన్నారు. లచ్చన్నగారు ఆనాడు మంత్రివర్గంలో చేరడం నిజానికి ఆనాటి కాంగ్రెస్ పార్టీ రాజకీయ తాంత్రిక విధానాలకు పరాకాష్ట.

ఆనాడు ఏర్పడిన మంత్రివర్గం మిశ్రమ మంత్రివర్గంగా భావించబ నిజానికది కాంగ్రెస్ మంత్రివర్గమే. ప్రజాపార్టీని రద్దు పరచుకుని కాంగ్రెస్లో తరువాత ప్రకాశంపంతులుగారికి ముఖ్యమంత్రి పదవి లభించింది.

నీలం సంజీవరెడ్డిగారు ఉపముఖ్యమంత్రిగా రూపొందారు. ప్రజాపా ప్రతినిధియైన శ్రీ తెన్నేటి విశ్వనాథంగారికి ఆర్థిక పదవి లభించింది.

కృషికరలోకపార్టీ ప్రతినిధియైన సర్దార్ లచ్చన్న మంత్రివర్గంలో పనిచేయటానికి "రంగాజీ"తో అనేక విడతల చర్చ తదుపరే సాధ్యపడింది. మంత్రివర్గం నిర్ణయాలు తీసుకొన్నప్పుడు మంత్రివర్గం సభ్యుడైన సర్దార్ లచ్చన్నగారికి "ఓటింగ్ స్వేచ్ఛ" యిచ్చే పరతుపైన లచ్చన్నగారు మంత్రివర్గంలో చేరారు.

వ్యవసాయ కార్మిక శాఖలు బాగా పుంజుకొని, రైతుకార్మికులు బాగుపడతారన్న విశ్వాసంతో ప్రజలు భావించారు. సభలు, సన్మానాలు, సత్కారాలతో లచ్చన్నగారిని యావదాంధ్రదేశం అభిమానించి ఆదరించింది. ప్రభుత్వాన్ని ఇంత వరకు గడగడలాడించిన రాజకీయవేత్త చేతుల్లోకి ప్రభుత్వమే వచ్చిపడింది. సమర్థునికి ఆవగింజంత అవకాశం యిచ్చిన అసంఖ్యాక ప్రయోజనాలు వికసిస్తాయి. ఇక ప్రజలు సుఖిస్తారు. బడుగువర్గాలు బాగుపడతాయి. వెలుగురేఖలు జనిస్తాయి.

పడకకుర్చీ రాజకీయపీఠాన్ని బద్దలుకొట్టి ప్రజాబాహుళ్యంలోనికి జొరబడి సామాన్య కార్యకర్తయి, అసమాన రాజకీయనాయకునిగా అవతరించినవాడు సర్దార్ గౌతు లచ్చన్న. అఖిల ప్రజ బాగుపడాలని కోరుతున్న సమయమున అట్టడుగునపడి అఘోరిస్తున్న బహుజనావళిని అన్ని విధాలా ప్రభుత్వం చేయూతనిచ్చి ఆదుకోవాలని, అదే తన పదవీస్వీకార లక్ష్యంగా లచ్చన్న భావించారు.

గాలికి ఎగిరివచ్చి రాజకీయాలలో ఒకే గంతువేసి గద్దెనెక్కి గంధర్వాంశను పొందిన వ్యక్తి కాదు లచ్చన్నగారు. గతంలో రైతుకూలీ ప్రజారాజ్యం కావాలని, రావాలని, పాట్లుపడి దేశంనుండి తెల్లదొరలను వెళ్ళగొట్టాలని ఎన్నో ప్రజోద్యమాలను నడిపి, జైళ్ళలో మ్రగ్గిన స్వాతంత్ర్య సమరయోధుడు లచ్చన్న. 20 వ శతాబ్దము పూర్వార్ధమున ఉత్తరాంధ్రలో ప్రభవించిన, రాజకీయ చైతన్య కరదీపిక లచ్చన్న.

స్వరాజ్యం రాకపూర్వమే 1930 ఏప్రిల్ లో ఉప్పుసత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొని చెరసాలలో నిర్బంధించిన నాటినుండి రాజకీయజీవితం ప్రారంభమైంది. స్వరాజ్యం రాకపూర్వం ఉత్తరాంధ్ర పల్లెల్లో ఏ ప్రాంతం పరికించినా బక్కచిక్కిన

పశువుల్లా, డొక్కలెండిన పిట్టల్లా పొట్టకోసినా అక్షరంముక్క రాని అనాధజనావళి కోకొల్లలు. వారినెల్ల ఆదుకొని పార్టీపరంగా వారిలో చైతన్యాన్ని తెచ్చిపెట్టాలి. అందరితో తను వారికోసం శ్రమించాలి. ఇదే ఆనాటి లచ్చన్నగారి ధ్యేయం.

"రైతుకూలీ ప్రజారాజ్యస్థాపనే తన ఆశయమని" రంగాజీ పిలుపునిచ్చారు. గంజాంజిల్లా ఆంధ్ర కాంగ్రెస్ నాయకులలో స్వర్గీయ పల్లెల శ్యామసుందరం తనను ముందుకు నడిపించగా, రైతుయాత్రలను నడపటంలో, కార్యకర్తగా తనరాజకీయ జీవితం ప్రారంభమైంది. రంగాజీ నడిపిన వేసవి పాఠశాల నిడుబ్రోలులో వరుసగా మూడుమారులు శిక్షణ పొందడంలో, ఆనాటి కాంగ్రెస్ ముఖ్య కార్యకర్తగా, వక్తగా రూపొందారు. ఒకవైపు అటు రంగాజీ పిలుపుపై రైతుకూలీ ప్రజాఉద్యమం ఇటు గాంధీజీ పిలుపు మేరకు ఆంగ్లేయులపై తిరుగుబాటు, స్వరాజ్యసాధనకై ఆవేదన, ఆందోళన, కారాగార శిక్షలు, రైతుయాత్రలు, కిసాన్‌సభల సందడి, జమీందారులపై పోరాటం, మరోవైపు మువ్వన్నె జండాను ప్రతిష్టించితీరాలన్న స్వాతంత్ర్య పోరాటం.

గాంధీగారి పిలుపుపై సత్యాగ్రహొద్యమంలో దుమికి నాటి యువశక్తికి ప్రతిరూపంగా నిలిచారు, చదువుకు స్వస్తిజెప్పి రాజకీయోద్యమంలో చేరారు. తత్ఫలితంగా పోరాటాలు, అవమానాలు, లాఠీదెబ్బలు, చెఱసాలలు, అజ్ఞాత జీవితం, ప్రాంతీయ జమీందారుల బల్లెంపోటు, పరదేశీ ప్రభుత్వ నిరంకుశ విధానపు కళ్ళెం ఒకవైపు తననుపట్టి బంధిస్తున్నా భయపడలేదు. ఉప్పుసత్యాగ్రహం, క్విట్ఇండియా ఉద్యమంలో చెఱసాల్లో బంధింపబడిన రాజకీయ నాయకుడు లచ్చన్న.

ఉత్తరాంధ్రలో రైతుకూలీ ప్రజోద్యమ రథసారధి లచ్చన్నగారే అన్న పేరు సంతరించుకొని పల్లెపల్లెల్లో పర్యటించి ఆనాటి రైతునాయకులను కూడగట్టుకుని, జమీందారీ విధానం రద్దయ్యేలా కృషిసల్పుతూనే ఇటు స్వరాజ్యసాధనలో తీవ్ర కృషిచేసారు. రైతుయాత్రలు, కిసాన్‌సభలు, ఎస్టేట్ రైతాంగ పోరాటాలు నడుపుతూ ఉత్తరాంధ్ర అంతటా రైతోద్యమానికి ఊపిరి పోసారు. నాటి జిల్లాల్లోగల నాయకులకు తనుముఖ్య అనుచరుడయి మెలుగుతూనే, ఒకనాటికి తను అనేకమంది సహచరులను కూడగట్టుకోగలిగారు.

1942లో లచ్చన్నగారు ఏప్రాంతానికి వస్తున్నా, బహిరంగ సభల్ని ప్రకటించిందే తడవుగా లచ్చన్నగారు వస్తున్నారని పొలాల్లోపాకి, పొంగి పొర్లిపోతున్న ఉత్సాహం రైతుల్లో; రాజులకెదురు తిరిగి, జమీందారీలను కాదని, నడివీధిలోకి వచ్చి జబ్బచరుస్తున్న "ఈతడెవరు ? జగజెట్టిలా ఉన్నాడు. రండి" అని పరుగులిడుతున్న రైతుకూలీజనం ; లచ్చన్న మనవాడేఅన్న కూలి నాలీ జనం. కడజాతుల వారికి కలిమిని, బలిమిని తెచ్చిపెడతాడట, కలికాలం విడ్డూరమని విర్రవీగే అజ్ఞా

నుల ఆక్రోశాన్ని ఖండించిన రాజకీయ మేధావి లచ్చన్న. దళితజనం బాగుపడాలి; బలహీనవర్గాలు వెలుగులోకిరావాలి; రైతుకూలీలు రాజ్యమేలాలి; ఇనాందారీలు, పెట్టుబడిదారులు, జమీందారీలు పోవాలి. "దున్నేవారికి భూమి" "కష్టించిన వారిదే ఫలితం" తన నినాదాలు ఉప్పొంగిన తరంగాల్లా, గర్జించిన సింహాల్లా విరుచుకు పడ్డాయి. ఆకాలంలో ఆ నినాదాల్ని బహిరంగంగా ప్రకటించడమా? దోపిడిదారుల దౌష్ట్యాలకు ఎదురుతిరిగి నిలవడమా? ఎంతధైర్యం?! ప్రజలలో చప్పట్లు, నినాదాలు. బ్రతుకు మరచి నిద్రిస్తున్న రైతుకూలీల్లో చైతన్య ప్రవాహాలు, ఉద్రేక తరంగాలు. ఏమినీ ఉపన్యాసధోరణి—తెల్లదొరల పాలనలో ఇంతటి తెగింపా? గంధర్వాంశగలరాజులు ఈతని దృష్టిలో గడ్డిపరకలా? పేదల గవర్నమెంటు వస్తుందా? కూలి నాలి జనానికి కూడు, గుడ్డ దొరుకుతుందా? స్వరాజ్య భానుడు త్వరలో ఉదయించబోతున్నాడా? జమిందారీలు అంతరించి పోయే దినమొస్తుంది, రైతుకూలీలే రాజ్యమేలేవారని ప్రజల్ని నమ్మించి పలికిన ధీరోదాత్తరాజకీయవేత్త సర్దార్ గౌతు లచ్చన్న.

ఆల్ ఇండియా కిసాన్ సభలు పలాసాలో ఉత్తరాంధ్రలో అలనాడు జరిగాయి. తత్ఫలిత మన్నట్లు మందసా రైతుల పోరాటం జరిగింది. క్విట్ ఇండియోద్యమంలో అండర్ గ్రౌండు పోరాటంలోకి వెళ్ళిన సర్దార్ గౌతు లచ్చన్న మూడవసారి రాజకీయ ఖైదీగా శిక్ష అనుభవించి ఉత్తరాంధ్రలో రాజకీయ నాయకునిగా, కార్మికోద్యమ నిర్మాణకర్తగా రూపొందారు.

మంత్రిత్రయం ప్రతిపాదనలమేరకు మనదేశాన స్వరాజ్యప్రకటనకు ముందు 1946లో తాత్కాలిక జాతీయప్రభుత్వం ఏర్పడి, స్వర్గీయ జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశ తాత్కాలిక ప్రధానిగా ఉండేవారు. దేశమంతటికి ఢిల్లీలో సెంట్రల్ అసెంబ్లీ ఉండేది.

బ్రిటిష్ పాలిత రాష్ట్రాలు ప్రిన్సిపల్ ఎస్టేట్స్‌గా విభజించబడిన నాటి ఇండియాలో ప్రతీ రాష్ట్రమునందు శాసనసభలుండేవి. పన్నుచెల్లించేవారు, అక్షరాస్యులు మాత్రమే ఆనాటి శాసనసభలకు ఎన్నుకొనే ఓటర్లుగా ఉండే వారు. అంతేగాక కొన్ని వర్గాలవారు వారు ఎన్నుకొనుటకే పరిమితమైన రిజర్వుడు నియోజకవర్గాలుండేవి. కమ్యూనల్ అవార్డు ఫలితం.

అటువంటి నియోజకవర్గాల్లో ఒకటైన ఆనాటి ఇచ్ఛాపురంనుండి రాజమండ్రి వరకు గల కార్మిక ప్రాతినిధ్యం వహించే, విశాఖకార్మిక నియోజకవర్గం ఉండేది.

ఆనాటి అఖిల భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు బాబూ రాజేంద్ర ప్రసాద్, నాటి ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షులు రంగాజీ అభిమతం మేరకు ఆనాటికే ఒక స్వాతంత్ర్య సమరయోధునిగా జాతీయవాదిగా అఖిలభారత జాతీయ కార్మిక

సంఘు (I.N.T.U.C.) ఆంధ్రశాఖ స్థాపనాధ్యక్షునిగా, విశాఖ షిప్‌యార్డ్ కార్మిక సంఘాధ్యక్షునిగానున్న లచ్చన్నగారిని విశాఖ లేబర్ సీటుకు నామినేషన్ దాఖలాచేయమని ఢిల్లీ నుండి, ఆనాటి బర్మాకమ్యూనిష్టులు తిరుగుబాటొనరించిన సందర్భంగా కారాగారాల్లో మగ్గుతున్న ఆంధ్ర కార్మికుల విముక్తి కార్యక్రమాల్లో రంగూన్‌లో ప్రభుత్వ అతిధిగాఉన్న సర్దార్ గౌతులచ్చన్నగారికి పంపినఆదేశం మేరకు, విశాఖపట్నంవచ్చి నామినేషన్ దాఖలుచేసారు.

ఆనాటికే లచ్చన్నగారికి విశాఖపట్నంలోగల కార్మిక వర్గాలలో బలమైన పలుకుబడిని కలిగి యున్నందున తనే సింధియా షిప్‌యార్డ్ కార్మిక సంఘానికి అధ్యక్షునిగా ఉన్నందున, కమ్యూనిష్టులు తనను ఎంతో ఎదిరించి పోరాడిన, పోరాటాలకు దిగిన ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు జరుగుతున్న ఉపఎన్నికలలో విశాఖ లేబరు సీటు నుండి ప్రప్రధమంగా శాసన సభ్యునిగా ఎన్నుకోబడినారు. ఉత్తరాంధ్ర రాజకీయ ఉద్దండ పిండంలా వెలసి ప్రజాభ్యుదయానికి ఉరికంబ మెక్కటానికైనా సిద్ధమే అన్న లచ్చన్న అధికార రాజకీయ యోగానికి నాందీ ప్రస్తావన జరిగింది.

1948 జూన్ నెలలో, ఉమ్మడి మద్రాసు రాష్ట్రశాసనసభలో అధికార పార్టీ సభ్యునిగా ప్రవేశించారు. ప్రజావాణిని శాసనసభ ప్రతిధ్వనించేలా ప్రసంగాలు చేసేవారు. శాసనసభలో లచ్చన్నగారు మాట్లాడని దినములేదు. చర్చించని విషయం లేదు. అంతవరకు ప్రజావేదికల్లో గడిపిన లచ్చన్నగారికి శాసనసభా వేదిక లభించింది. గవర్నమెంటు బలహీనవర్గాలకు ప్రత్యేక సౌకర్యాల్ని ప్రకటించాలని, రైతుకూలీల నాదుకోవాలని, జమిందారీ విధానం పోవాలని గర్జించేవారు. ఊగిపోతూ ఉద్రేకంతో బల్లల్ని గుద్దడం కాదు ప్రభుత్వం కళ్లు తెరచేలా వారి గుండెల్లో నాటేలా సూటి పోటి మాటలతో ఆలోచనల్ని రేకెత్తించే భావనలతో నిండి యుంటుంది లచ్చన్నగారి ప్రసంగం. జనసామాన్యానికి అందుబాటులో నుంటాయి అతని ప్రసంగాలు. వెనుకబడిన కులాల్లో బలాధిక్యత ఉండదు. సంకల్పశక్తి శూన్యం, అజ్ఞానం బ్రహ్మచెముడు చెట్టులా వ్యాపిస్తుంది. వెనుకబడిన కులాలు విజృంభిస్తే, అణగారిన వర్గాలు అదుపు తప్పితే, ఉన్నత కులాలు అగ్ర వర్ణాలు అదరిపోతాయా అని ప్రశ్నిస్తే, మహాభారతం కన్న మించినఘర్షణ జరుగుతుందని ఒకనాడు లోహియా అన్నారని ప్రతీతి.

1949 మార్చి నెలలో తులాబందుల నాగేశ్వరరావు అధ్యక్షతన గుంటూరులో వెనుకబడిన తరగతుల మహాసభ జరిగింది. లచ్చన్నగారు ఆసభకు ఉపాధ్యక్షులు. మద్రాసు అసెంబ్లీలో బలహీనవర్గాల సంక్షేమానికి పథకాలు ప్రకటించాలని ప్రసంగాలుచేసారు. 1950లో కోస్తాతీరాలు జీవనోపాధి లేక నిరాశ్రయులైన వేలాది జాలారులకు చేయూతనిచ్చే ప్రయత్నములో మత్స్యకారుల మహాసభను జరిపారు.

1951లో ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షపీఠానికి ఎన్నికలు జరిగాయి. ఆసరికే కాంగ్రెస్ పార్టీలో ముఠారాజకీయాలు ఏర్పడాయి. అంతవరకు ఆంధ్ర కాంగ్రెస్ పార్టీకి అధ్యక్షునిగా ఉంటూ వస్తూన్న రైతోద్యమనాయకుడు కిసాన్ నేత రైతు ప్రొఫెసర్‌రంగా మరల అధ్యక్ష స్థానానికి పోటీ చేయగా శ్రీ నీలం సంజీవరెడ్డి గారు రంగాగారిపై పోటీకి తలపడ్డారు. మంత్రివర్గం ముఠా అని, మంత్రివర్గ ముఠాని ఎదిరించేముఠా అని బలీయమైన రెండు వర్గాలు ఆంధ్రలో రూపం దాల్చాయి. రైతురంగాదే మెజారిటీవర్గం అని వేనోళ్ల పలుకబడింది. యావదాంధ్ర ప్రజానీకం అలానేభావించింది. అయితే ఫలితంమాత్రం ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షునిగా శ్రీ నీలం సంజీవరెడ్డి ఎన్నుకోబడినారు. కేవలం 5ఓట్ల తేడాతోనే, అదయినా ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీలో అనేక స్థానాలు ఖాళీగా ఉన్నందున, కొన్ని స్థానాల నందలి సభ్యులు ఉన్నతన్యాయస్థానం యిచ్చిన నిలుపుదల ఉత్తర్వు మేరకు హాజరుకావీలులేనందున రైతురంగా ఓడిపోవడం జరిగింది. ఆ ఎన్నికలను పర్యవేక్షించుటకు అధిష్టానవర్గం యస్. కె. పాటిల్‌ను పంపించింది. స్వల్ప ఓట్ల తేడాలో సంజీవరెడ్డినెగ్గారు. రంగాజీ ఓడిపోయారు. ఈ సంఘటన ఆంధ్రకాంగ్రెసు పార్టీలో ముఠాలు బలపడి ఆంధ్ర రాజకీయాల్లో పెనుమార్పులకు దోహదకారి అయ్యింది. అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్‌కమిటీ సభ్యునిగా ఢిల్లీ సెంట్రల్ అసెంబ్లీ సభ్యునిగా ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్షునిగా కిసానోద్యమ నిర్మాణ సంధానకర్తగా 1931 నుండి 1951 వరకు 20 ఏండ్ల సుదీర్ఘ ఆంధ్ర కాంగ్రెసు పార్టీ నేత అనిపించుకొన్న రైతు రంగాపై నాటి రాజకీయ స్థితి గతుల ప్రభావం పడింది. రాజకీయ పరిణామానికి లోనయింది. ఆసరికే ప్రకాశం పంతులు అభిమానులు భోగరాజు పట్టాభి శీతారామయ్య అనుచరులు రైతు రంగా సహచరులు అన్నభావం ఏర్పడింది. సంజీవరెడ్డిగారికి దారిదొరికింది, ఆనాటివరకు నూటికి నూరు పాళ్లు కాంగ్రెసు పార్టీ విధేయులుగాఉంటూ వస్తున్న గురు శిష్యులు రంగా లచ్చన్నల్లో రాజకీయ మార్పులు గోచరించాయి.

అదే సమయమున 1951 లో భారత జాతీయ కాంగ్రెసు పార్టీలో కూడ పెను మార్పులు సంభవించాయి. ఆచార్య జె. బి. కృపలానీ రాజీనామా చేసి కాంగ్రెసునుండి వైదొలగడమేగాక, కాంగ్రెసు సంస్థ ముఖ్యమా ? నెహ్రూజీ ముఖ్యమా ? వ్యక్తిముందా ? సంస్థముందా ? అని నిలదీసి ప్రశ్నించారు. ఆంధ్ర కాంగ్రెసు పార్టీ నుండి ఆంధ్రకేసరి ప్రకాశం పంతులు రైతు రంగా ఇరువురూ నిష్క్రమించారు. ఆచార్య జె. బి. కృపలాని భారతదేశస్థాయిలో ప్రజాపార్టీని స్థాపించ దలచి వివిధ రాష్ట్రాల నాయకులకు పిలుపునిస్తూ ఢిల్లీలో మహాసభలు జరుపగా, ఆ మహాసభకు ఆంధ్రనుండి ఆంధ్రకేసరి, రైతు రంగా ఇరువురు హాజరయ్యారు. దేశస్థాయిలో ప్రజాపార్టీని స్థాపించిన కృపలానీ ఆంధ్ర ప్రజా పార్టీకి ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులు గారిని అధ్యక్షులుగా నియమించారు. రైతు రంగాను విస్మరించారు. ఆదిలోనే హంసపాదు అన్నట్లు

రాష్ట్రస్థాయి ప్రజాపార్టీ నిర్మాణంలోనే ఆంధ్రకేసరికి రైతు రంగాకు అభిప్రాయ భేదాలు పొడగట్టాయి.

ప్రజాపార్టీలో చేరిన ప్రముఖరాజకీయవేత్త రైతు రంగా తనకు ప్రజాపార్టీ కేంద్రనాయకత్వం గుర్తించనందుకు తీవ్ర అసంతృప్తిని ప్రకటిస్తూ ప్రజాపార్టీనుండి బయటకు వచ్చారు. ఎన్నో ఏండ్లు కృషి సలిపి, కాంగ్రెసు పార్టీని పటిష్టపరచిన తనను పార్టీ అధ్యక్షస్థానానికి తిరస్కరించడం ఒక అవమానంగా భావించి కాంగ్రెసు పార్టీనుండి ఆనాడు బయటపడినారు. ఈనాడు ప్రజాపార్టీలో చేరగనే తన ప్రతిభను తన రాజకీయ సేవనుప్రక్కకు నెట్టినందుకు అసంతృప్తి చెంది ప్రజాపార్టీ నుండి నేడు విదలించుకొన్నారు. మార్గాంతరం మరొక పార్టీని దేశ స్థాయిలో నెలకొల్పి రైతుకూలీ జనులనుద్ధరించడం తప్ప వేరే గత్యంతరంలేదు. 1937లోనే ఆంధ్రాలో వేసవి రాజకీయ పాఠశాలలు నడిపిన రాజకీయ మేధావి. రంగా రైతు కూలీ ఉద్యమాన్ని లేపి రైతేరాజుగా ఉండాలన్నది అతని సిద్ధాంతం. గాంధీజీతో చర్చించి ప్రత్యేక కిసాన్ ఉద్యమాన్ని నడపుటకు అతనినుండి ఆశీస్సుల నందిన రాజకీయనాయకుడు. తన స్వీయ సిద్ధాంత రూపకల్పనకు ఆనాడు స్వేచ్ఛ, అవకాశం లభించింది. ఆల్ ఇండియా స్థాయిలో ఢిల్లీలో కిసాన్‌సభ జరిపి వివిధరాష్ట్రాల నాయకులకు పిలుపునిచ్చి తను ఏర్పరుస్తున్న కృషికరలోక పార్టీలో చేరి రైతోద్యమాన్ని బలపరచమన్నారు. కిసాన్‌సభకు ఆంధ్రనుండేగాక రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, గుజరాత్, రాష్ట్రాల నుండి ప్రతినిధులు వచ్చారు. రైతుకూలీ ప్రజారాజ్య స్థాపనకు పిలుపునిస్తు ఏర్పడిన కృషికరలోక పార్టీ జాతీయస్థాయిలో కె.ఎల్.పి. ని ఏర్పాటుచేసారు. రాష్ట్రశాఖలు కొన్ని రాష్ట్రాల్లో ఏర్పడ్డాయి. ఆంధ్రశాఖకు ప్రధాన కార్యదర్శిగా సర్దార్ గౌతులచ్చన్న నియమించబడినారు. సరారు లచ్చన్న కృషికరలోకపార్టీని బలపరచి రాష్ట్రవ్యాప్త పర్యటనలు జరిపారు. పల్లెపల్లెల్లో తిరిగి కృషికరలోక పార్టీ సిద్ధాంతాలను వివరించి పార్టీ ఎన్నిక ప్రణాళికలను పంచిపెట్టారు.

ఉత్తరాంధ్రకు చెందినవారే కృషికరలోక పార్టీ ప్రధానకార్యదర్శి. ఆనాటికి ఉత్తరాంధ్రలో లచ్చన్నగారికున్న పలుకుబడి, ఆదరణ ఎంతగానో పెరిగింది. లచ్చన్నగారి పార్టీ మాది అని అనడంతప్పించి కృషికరలోక పార్టీలో ఎవరున్నా లేకున్నా వారికొకటే. వారికి తెలిసింది "మానాయకుడు లచ్చన్న. మేమంతా లచ్చన్న పార్టీకి చెందినవారము. మాబ్రతుకులు బాగుపడే దతని చేతుల్లోనే" రైతాంగంనుండి తరచుగా ఆనాడు వినబడేమాటలివి.

రాష్ట్ర వ్యాప్తంగా పల్లెపల్లెల్లో తిరిగి కృషికరలోకపార్టీని ప్రజల పార్టీగా పెంపొందింప చేసారు. ప్రజాసమస్యల పరిష్కారానికి అనేక పోరాటాలు నడిపేరు. స్కూలుఫైనల్ చదివిన లచ్చన్న నాయకత్వం నడపడమా, అన్నది

పార్టీలో కొందరిలో ఈర్ష్య చోటు చేసుకోలేకపోలేదు. అయినా ప్రతిఒక్కరు లచ్చన్న నాయకత్వాన్నే కోరుకునేవారు.

ఆంధ్రలో రాజకీయ సంచలనం రేకెత్తిన రోజులవి. కాంగ్రెస్‌పార్టీ, ప్రజా పార్టీ, కృషికరలోక పార్టీ, అవిభక్త కమ్యూనిష్టు పార్టీ జనాల్లోకి జొరబడి సిద్ధాంత రాజకీయాల్ని నడుపుతున్న సువర్ణ కాలమది. కేవలం నిస్వార్ధం, త్యాగం, విజ్ఞానం, సమానత్వభావం, దేశభక్తి గల వ్యక్తులకే రాజకీయ పదవులు లాభించే స్థితిగతు లానాటివి. వయస్సు, విజ్ఞానం, అనుభవం ఉన్నవారికే సమాజమున ఆదరణాభిమానాలు లభిస్తున్న కాలమది.

రైతుబాంధవుడు రంగాజీ, బడుగు వర్గాల నాయకుడు సర్దార్‌లచ్చన్న జాతీయకాంగ్రెస్ నుండి వేరుపడిన తదుపరి కృషికరలోక పార్టీని రైతాంగానికి, కూలినాలిజనానికి అతిచేరువయిన పార్టీగా రాష్ట్రస్థాయిలో ప్రతిష్టింప జేసారు.

ఇండియా సర్వస్వతంత్రమైన రిపబ్లిక్‌గా మారిన తదుపరి 1952 లో మొదటి జనరల్ ఎలక్షన్లు జరిగాయి. ప్రప్రధమంగా వయోజన ఓటింగుహక్కు అమల్లోనికివచ్చింది. జనసామాన్యానికి కూడ వారి అభిప్రాయాల్ని ప్రకటించే రాజకీయహక్కు సంక్రమించింది.

ఆంధ్రలో కృషికరలోక పార్టీ అన్నిపార్టీల వలె తన ఎన్నికల ప్రణాళికను విడుదలచేసి తన అభ్యర్ధులను ఎన్నుకోవలసిందిగా ప్రజలను కోరింది. కృషికరలోక పార్టీ నాయకులు రాష్ట్రపర్యటనలో పాల్గొన్నారు. రంగాగారు అనేక సభల్లో ప్రసంగించారు.

సర్దార్‌లచ్చన్న శ్రీకాకుళం జిల్లా సోంపేట నియోజక వర్గంనుండి పోటీ చేస్తూ ఉత్తరాంధ్ర జిల్లాల్లో విరివిగా పర్యటించి తన పార్టీఅభ్యర్ధుల గెలుపుకు విశేష కృషి సలిపారు. సోంపేటనుండి తను గెలవడమే గాక, ఉత్తరాంధ్రలో పది నియోజక వర్గాలనుండి, కృషికరలోక పార్టీ అభ్యర్ధులను గెలిపించారు. మిగతా ఆంధ్రప్రాంతంనుండి ఆర్గురు కె.ఎల్.పి. పార్టీ శాసనసభ్యులు ఎన్నికై వచ్చారు. మొత్తం 16 మంది శాసనసభ్యులను కలిగిన పార్టీగా, కృషికరలోక లెజిస్లేచర్ పార్టీ లచ్చన్నగారినే పార్టీనాయకునిగా ఎన్నుకున్నది. ఉమ్మడి మద్రాస్ రాష్ట్రశాసన సభలో తన ఉనికిని స్థిరపరచుకో గలిగింది.

కృషికరలోక పార్టీ నాయకునిగా, సర్దార్‌లచ్చన్ననే రంగాజీ నియమించారు. పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిని డిప్యూటీ లీడరుగా నుంచారు.

పార్టీలో అసంతృప్తి 1953 అక్టోబరులో ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంలో తిమ్మారెడ్డిగారు "కె.ఎల్.పి."కి రాజీనామా ఇవ్వటంతో బయటపడింది.

నిజానికి 1952 లో జరిగిన ఉమ్మడి మద్రాసు శాసనసభ ఎన్నికల్లో కాంగ్రెసు అగ్రనాయకులు ఓటమిని చవిచూశారు. మెజార్టీ కోల్పోయారు. ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ అన్ని పార్టీలకన్నా ఎక్కువమంది శాసనసభ్యులను పొందగలిగింది. ప్రకాశం నాయకత్వాన 'యునైటెడ్ ఫ్రంట్' ఏర్పడింది. కె.ఎల్.పి.ని కూడా ఆహ్వానించింది. కె.ఎల్.పి. ఎటుమొగ్గిన అటు విజయం. రంగాగారు ఏమికోరినా అది లభించే స్థితి. సిద్ధాంతరీత్యా కమ్యూనిజాన్ని అంగీకరించని రంగా—అవినీతి, అక్రమాలకు హేతువైన "కంట్రోల్సు"ను తొలగించాలన్న షరతుపై నీతినిజాయితీకి రూపమైన రాజాజీ నాయకత్వాన కాంగ్రెసులో కలవకనే మంత్రివర్గ నిర్మాణానికి సహాయపడాలన్నది రంగాగారి విధానం.

మద్రాసు రాష్ట్రమునుండి విడివడి ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలని ఆంధ్రులు ఏనాటినుంచో వాంఛిస్తూ వచ్చారు. అయితే 1952 లో ఆ ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. మద్రాసునుండి విడిపోవాలని ఆంధ్రులు ఆవేదన పడుతున్నదినాలవి. 'మద్రాసుకూడ ఆంధ్రులదే' అన్న నినాదం లేచింది. 'తిరుపతి మాదే'నన్న తమిళ నినాదానికి దారితీసింది.

ఆంధ్రరాష్ట్ర మేర్పడటానికి రాజగోపాలాచారి అంగీకరించకపోవడంతో ఆందోళన ఉధృతమై పర్యవసానంగా అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు ఆత్మార్పణతో ఆంధ్రప్రతినిధులు సర్దార్ గౌతు లచ్చన్న, తిమ్మారెడ్డి, తెన్నేటి విశ్వనాథం, టంగుటూరి ప్రకాశం పంతులు తదితర పక్షాల ప్రముఖులు శాసనసభలో ఆంధ్రరాష్ట్రం కావాలన్న వాదనలను లేవనెత్తారు.

ముక్కోటి ఆంధ్రులలో పెల్లుబికిన తీవ్ర ఉద్వేగాలకు తలఒగ్గి పరిస్థితులు తమ చేతిలోలేవని గ్రహించి నెహ్రూజీ ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణానికి యెంచి భాషాప్రయుక్త రాష్ట్రాల విభజన పరిశీలనకై 'ఫజుల్ అలీ కమిషన్' ఏర్పాటు చేశారు.

కర్నూలు తాత్కాలిక రాజధానిగా ఆంధ్రరాష్ట్రం అక్టోబరు నెల 1 వ తేదీన ఏర్పడింది. ఆంధ్రనాయకులలో రాజకీయ సంచలనం ఏర్పడింది. ముఖ్యమంత్రి ఎవరు ? వివిధ పార్టీల సమాలోచనలు జరిగాయి.

ఆంధ్ర కాంగ్రెస్ పార్టీకి అసరికి అధ్యక్షునిగా ఉన్న సంజీవరెడ్డికి శాసనసభ సభ్యత్వం లేదు. పైగా సంఖ్యాధిక్యత కూడ లేదు. మంత్రివర్గం కాంగ్రెస్ ఏర్పరచలేని పరిస్థితి.

అసరికే కృషికరలోకపార్టీతో చర్చలు జరిపి విఫలమైన కాంగ్రెస్ పార్టీ ప్రజాపార్టీతో మంతనాలు నెరపింది. కమ్యూనిస్టులకు, ఏ యితర పార్టీకో ఆంధ్ర ముఖ్యమంత్రి కాగల అవకాశం యివ్వకుండా ప్రత్యామ్నాయంగా కాంగ్రెసు

పథకం వేసింది. ప్రజాపార్టీని రద్దుపరచుకొని వచ్చిన ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి పదవి ఇవ్వగలమని టంగుటూరి ప్రకాశం పంతులుగారితో రాజీకుదుర్చుకున్నది.

కాంగ్రెస్ పార్టీ ఆంధ్రకాంగ్రెస్ పార్టీ అధ్యక్షులైన నీలం సంజీవరెడ్డిని శాసన సభకు ఎంపికజేసి ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా చేయాలన్న తలంపుతోనే ఉండేది. దరిమిలా అందువలననే కాళహస్తి నియోజకవర్గంలోనున్న కాంగ్రెస్ శాసనసభ్యునిచేత రాజీనామా యిప్పించి సంజీవరెడ్డికి తన పార్టీఅభ్యర్థిగా గెలిపించి శాసనసభకు అంపించింది.

పార్టీలో బలాబలాలు అంతంతమాత్రాన ఉన్నందున బలీయమైన మంత్రి వర్గాన్ని ఏర్పరచుకోవాలన్న తపనతో పార్టీల నాయకులమధ్య మంతనాలు కొనసాగాయి.

సంజీవరెడ్డిగారు ఆ దినాల్లోనే లచ్చన్నగారిని ఒకనాడు పార్టీషన్ కమిషన్ సమావేశములలో ఇంటికి విందుకు రమ్మని ఆహ్వానించారు. లచ్చన్న ఏనాడు ఔదార్యంగానే ప్రవర్తించగలవారు. కాదనక సంజీవరెడ్డిగారి ఇంటికి వెళ్ళారు. రాత్రి విందుభోజనంలో రాజకీయాలపై ప్రస్తావన—

"లచ్చన్నగారూ ! మీకు ఉత్తరాంధ్రలో ఉన్న రాజకీయ బలమెంతటిదో నాకు తెలుసు. మీరు నాతో కలసి రండి – కలసి మంచిపని చేద్దాం" అని సంజీవ రెడ్డిగారడిగారు.

"సహకరించటానికి, కలవటానికి హస్తి మశకాంతర వ్యత్యాసముంది రెడ్డి గారూ ! ఏపార్టీముందు నడచినా మిశ్రమ మంత్రివర్గం కొనసాగటానికి మేమెప్పుడు సహకరిస్తాం. మధ్యంతర ఎన్నికలను తెచ్చిపెట్టం."

"అయితే నయోధ్యకు అభ్యంతరమేమిటి ?" రెడ్డి. "మాపార్టీ అధినాయకులు నా రాజకీయ గురువు ఆచార్య రంగాజీ ఆశీస్సుల నర్థించటమే. ఏనాడూ పార్టీ అధినేతకు మించి ప్రవర్తించిన వాడనుకాను. రంగాజీ అంగీకరించనిదే ఒక్క అడుగు ముందుకు వేయలేను" లచ్చన్న.

సంజీవరెడ్డిగారు ఆలోచనలో పడ్డారు. "రెడ్డిగారూ ! ఇందులో తప్పిదం ఏమీలేదు. రాజకీయాలలో శాశ్వత శత్రుత్వం, మిత్రుత్వం ఉండదని మీకు తెలిసినదే రంగాగారితో మీరు సంప్రదించండి."

"సరే చూద్దాం. రంగాజీతో చర్చిస్తాను"

"నేను రంగాజీతో చర్చించి ఒప్పిస్తాను. మీరు రంగాగారిని కలసి సంప్రదించండి. మీరు చొరవ తీసుకోవాలి."

"సరే లచ్చన్నగారూ! రంగాజీతో కలసి చర్చిస్తాను" అంటూ చర్చలు ముగించారు. కాని మరల చర్చలు జరగలేదు. లచ్చన్న గారిని తనవైపు మరల్చు కోవాలన్న రెడ్డిగారి వ్యూహం ఎత్తుగడ ఆనాటికి ఫలితాన్నివ్వలేదు. రంగా-రెడ్డిగారి మధ్య చర్చలు ఎలా ఫలిస్తాయి? ఒకేపదవిని ఒకేస్థాయిని ఆశిస్తున్న ఇరువురి వ్యక్తుల మధ్య, సంఘాల మధ్య ఏనాడు ఏకాభిప్రాయం, అంగీకారం కుదరదు.

ఇక ప్రజాపార్టి నేత టంగుటూరి ప్రకాశం పంతులు గారిని మరల కాంగ్రెసులో చేరమని అహ్వానించక తప్పలేదు. కాంగ్రెసు పార్టీతో కుదిరిన అంగీకారం మేరకు ప్రజాపార్టీ నుండి విడివడి కాంగ్రెసు పార్టీలో పంతులుగారు చేరిపోయారు. ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి పదవిని చేపట్టి ఆంధ్రుల ఔన్నత్యాన్ని గొప్పతనాన్ని పెంచటానికి – పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఆగమన జ్యోతిని వెలిగించి రాజధాని కర్నూలులో ఆంధ్రరాష్ట్రానికి అంకురార్పణ జేసారు. ఇక మంత్రివర్గం ఏర్పాటు పరిపాలనా సన్నాహాలు, గవర్నర్ త్రివేది కాంగ్రెసు లెజిస్లేచర్ పార్టి నాయకుడైన ఆంధ్రకేసరిని ఆంధ్రరాష్ట్ర ప్రధమ ముఖ్యమంత్రిగా ఎన్నుకొన్నారు.

ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవి నధిష్టించిన పంతులుగారు తన పదవి సుస్థిరం కాదేమోనన్న భావంతోనే కృషివరలోక పార్టి నేతతో సంప్రదింపులు జరిపారు.

"రంగాజీ! ఒకనాడు మీరు, నేను కూడ కాంగ్రెసును విడచి బయటకు వచ్చిన వారమే. ఈనాడు నేను కలిసినా మీరింకా ఆపార్టీలో నుండటం దేనికి? నాతో చేయి కలిపి ఉపముఖ్యమంత్రిగా పదవినధిష్టించండి" అన్నారు పంతులుగారు. "పంతులుగారూ! మీ మంత్రివర్గంలోనికి లచ్చన్నగారిని, తిమ్మారెడ్డిగారిని తీసుకోవడం మంచిది" అని రంగాజీ అనడంతో, "నిజమే వాళ్లు యువకులు, వారికి రాజకీయ జీవితం ఎంతో ఉంది. మీరు వచ్చి ఉపముఖ్యమంత్రి పదవిని చేపట్టండి. కె.ఎల్.పి. ని కాంగ్రెసులో విలీనం చేయండి" అన్న పంతులుగారి అభిమతాన్ని రంగాజీ త్రోసిపుచ్చారు. రైతు కూలీ రాజ్య స్థాపనకు, ప్రధాన శత్రువైన కాంగ్రెసులో తాను ప్రవేశించిడమన్న ప్రశ్నేలేదు, పొమ్మన్నారు. కాంగ్రెసు విధానం మారితే తాను చేరగలనన్నారు. "మీ అభిమానం అటువంటిది. అయితే ప్రస్తుతపరిస్థితులను అంచనా వేసుకోనిదే మీఅభిప్రాయానికి తలొగ్గలేను. మద్రాసు రాష్ట్ర రాజకీయాల్ని నడిపిన మనం – నేడు ఆంధ్రరాష్ట్ర రాజకీయాలలో వెనుక బడలేముకదా! కాంగ్రెస్ అధిష్టాన వర్గం మీ అభిప్రాయాల్ని ఎంత వరకు మన్నిస్తుందో మేము వేచి చూడవలసి ఉంది" అన్నారు రంగాజీ. "అందరం కలసి రాష్ట్రాన్ని బాగుచేద్దాం అన్న మీ అభిమతం గొప్పదే – అయినా పార్టీ అధినేతలు అలా భావించాలికదా" ‘న్నగారన్నారు.

లచ్చన్న భావనే నిజమైంది. అధిష్ఠానవర్గం నీలం సంజీవరెడ్డినే ఉప ముఖ్యమంత్రిగా డిక్లేర్ చేసింది. పర్యవసానం ముఖ్యమంత్రి ప్రతిపాదనలను ప్రక్కకు నెట్టింది. ఆనాటికి కృషికరలోకపార్టీలో 12 మంది శాసన సభ్యులే మిగిలారు. నలుగురు కాంగ్రెసు పార్టీలోనికి మారారు—కునిశెట్టి వెంకట నారాయణ (సాలూరు), నీలాద్రిరావు (ఇచ్ఛాపురం), తిమ్మారెడ్డి (కడప), బత్తిన సుబ్బారావు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన మొట్టమొదటి దినాల్లో లచ్చన్నగారు మద్రాసు నగరం షినాయి నగరంలో ఉండేవారు. గ్రామణి స్వరాజ్యం పార్టీవారు తరచుగా వస్తూ లచ్చన్నగారిని ఒప్పించ ప్రయత్నాలు సాగించేవారు. ఎర్నేని సుబ్రమణ్యం అనే తనమిత్రుని ద్వారా ప్రకాశం పంతులుగారు మద్రాసులో ఉన్న లచ్చన్నగారికి రాయబారము అంపించారు. "ఇదేమిపద్ధతి ? ఎవరిని బలపరచాలని ? పార్టీ ప్రతినిధినైన నాకు మాపార్టీ ఎలాఉండాలో మాపార్టీ నాయకుడు చెప్పాలిగాని, ఈ ప్రకాశంగారెవరండి ? నాకు చెప్పటానికి పంతులుగారు కాదు. మాపార్టీ నాయకులు" అంటూ ఆ ఆహ్వానాన్ని సునిశితంగా తిరస్కరించారు.

అయినా మరొక ప్రయత్నం జరిగింది. రంగా గారి అభిమాని, సుప్రసిద్ధ పత్రికారచయిత దినపత్రిక ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావుగారు వచ్చి లచ్చన్నను ఒప్పించజూశారు.

"లచ్చన్నగారూ ! నామాటవినండి. ఆంధ్రకేసరిని అన్ని విధాలా బలపరచండి. మీరు ఆదరణ నందండి" వెంకటేశ్వర్రావుగారు చెప్పారు.

"ఏమండీ వెంకటేశ్వర్రావుగారూ ! ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని అభినందిస్తూన్న మీవంటివారు అనవలసిన మాటలా ఇవి ? ప్రజాస్వామ్యం మీద పత్రికలలో ఎడిటర్స్ కాలంలో వ్యాసాలు వ్రాస్తూన్న మీరు సిద్ధాంతాల్ని, పార్టీనాయకత్వాన్ని ప్రక్కకు నెట్టి వ్యక్తిగత బాగోగులు, పద్ధతిని చేపట్టమంటారా? మీరు పెద్దలు. మీరిలా చెప్పడం భావ్యంకాదు."

ఇలా దెప్పిపొడిచిన లచ్చన్నగారి భుజం తట్టి "నిజం లచ్చన్నా ! సిద్ధాంతమును, నాయకత్వాన్ని విస్మరించిన రాజకీయాలు సిగ్గు విడచిన నాటకీయాలే సుమా !" అనిఅంటూ అటనుండి జారుకున్నారు నార్లవారు.

తుదకు ప్రకాశం పంతులుగారు రంగాగారిని పిలచి రాజకీయ ఒప్పందానికి రాక తప్పలేదు. మంత్రివర్గం నిలబడాలంటే మరో మార్గంలేదు.

రంగా — ప్రకాశం చర్చలు కొనసాగాయి. సహకరిస్తాం తప్పించి, కలియబోము. మాపార్టీ వ్యక్తిత్వాన్ని వదలుకోము. మంత్రివర్గం తీసికొన్న నిర్ణయాలపై ఓటింగు స్వేచ్ఛను మంత్రివర్గంలో చేరబోయే మాపార్టీ ప్రతినిధికి యివ్వాలి.

కాబినెట్ తీసికొన్న నిర్ణయాన్ని కాదనే హక్కు మాపార్టీ ప్రతినిధికి ఉండాలి. అన్న రాజకీయ ఒప్పందం జరిగింది. ముఖ్యమంత్రి ప్రకాశం ఆహ్వానంపై, పార్టీ నేత రంగా అనుమతితో పై ఒప్పందం ఫలితముగా సర్దార్ గౌతులచ్చన్న 1953 నవంబరు నెల 7వ తేదీన తనరాజకీయ గురువు రంగాగారి జన్మ దినమున ఆంధ్రరాష్ట్రమంత్రివర్గంలో వ్యావసాయిక కార్మికశాఖామాత్యులుగా పదవీ స్వీకారం చేసారు. ప్రజాపార్టీతరఫున తెన్నేటి విశ్వనాథం లోగడనే ఆర్థికశాఖామాత్యులుగా నియమించబడినారు. సంజీవరెడ్డి ఉపముఖ్యమంత్రిగా నియమింపబడినారు.

ఉత్తరాంధ్రలో ఒకనాడు స్వరాజ్యసాధన దిశలో యువచైతన్యానికి ప్రతి రూపమై నిత్యం కృషి సలిపినదెవరు? ఉప్పు సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలలో నిర్బంధించబడి చెఱసాలలో క్రుగ్గిన దెవరు ? స్థానిక హరిజనోద్య మంలో ముందడుగు వేసినదెవరు ? విప్లవ అరుణ కిరణమై తెల్లదొరలను దేశం నుండి వెళ్లగొట్టాలని తీవ్రవాదిగా ఒకనాడు బెంగాల్ విప్లవ వీరులతో కలియవెళ్లిన దెవరు ? మారిందెవరు ? రైతురక్షణ యాత్రల్లో పాల్గొని నాటిగంజాంజిల్లా ఆంధ్ర కాంగ్రెసు నాయకుడు పుల్లెల శ్యామసుందరరంగారి అడుగు జాడల్లో నడిచిం దెవరు ? అఖిల భారత జాతీయకాంగ్రెసు ఏర్పడిన సోషలిష్టు ఫోరంకి అను కూలిస్తూనడిచినదెవరు? ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు రైతురక్షణ యాత్రలు జరిగితే ముఖ్యకార్యకర్తగా పాల్గొన్నదెవరు ? ఆల్ ఇండియా కిసాన్‌సభలను ఉత్తరాంధ్ర పలాసాలో జరిగినట్లు కృషిసలిపిన ముఖ్యకార్యకర్త ఎవరు ? మందసా రైతుల కాల్పుల విప్లవ పంథాను నడిపిందెవరు ? క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా అండర్‌గ్రౌండ్ పోరాటం జరిపినదెవరు ? రాజకీయ రైతోద్యమాలను నడిపే కార్యకర్తగనే గాక నాయకునిగనే కార్మిక శ్రేయస్సునకు పాటుపడిన ఆకార్మికప్రతినిధిగా శాసనసభకు ఎన్నుకోబడిన దెవరు ? బక్కచిక్కిన కూలన్నలను, మేడిపట్టిన రైతన్నకు అండగా నిలచి భుజం తట్టి ధైర్యం జెప్పిందెవరు ? రైతాంగం హీన దీన స్థితిలో నుండగా రంగాజీ యిచ్చిన పిలుపుపై రైతురక్షణయాత్రలను నడపుటలో ప్రాధాన్యత వహించిం దెవరు ? శిస్తులు కట్టమనికాదు, కట్టలేమన్న రైతు నినాదాన్ని పల్లెపల్లెలో తన అనుచరులతో వ్యాప్తి చేసిందెవరు ? వాడవాడల కిసాన్ సమ్మేళనల్ని జరుపుటలో. రైతోద్యమాలను నడపుటలో పార్టీకి కొండంత బలంగా నిలచిం దెవరు ? ఎస్టేట్ రైతాంగం పోరాటాల్లో ముందు నిలచి తన సహచరులను మెప్పించిందెవరు ? మందసా జమిందారుల కిరాతక పోలీసుకాల్పుల బాధితుల్ని అజ్ఞాతవాసంలో నుంటూ రక్షించిందెవరు ? తన అనుచరులకు మార్గదర్శిగా నిలచిందెవరు ? రైతురంగా ఆశీస్సులతో ఉత్తరాంధ్ర రైతు రాజకీయ నాయ కులను సమైక్య పరచి గట్టిగా కృషిసలిపిందెవరు ? కల్లుగీత కార్మికుల నుద్ధ రించ బహువిధాల నేటికి ప్రయత్నిస్తున్నవారెవరు ? శాసనమండలి సభ్యత్వానికి

వన్నె తెచ్చిందెవరు ? ప్రత్యేకాంధ్ర మహోద్యమానికి నాందీప్రస్తావన చేసిందెవరు ? పార్టీ ఆదేశానికి కట్టుబడి మంత్రి పదవికి రాజీనామా ఇచ్చిం దెవరు? శ్రేయోరాజ్యస్థాపన జరిగి రైతు కూలీ ప్రజారాజ్యం రావాలని, కావాలని నేటికి ఒక పార్టీ నేతగా కృషిచేస్తున్న దెవరు ? అనాటి నుండి నేటివరకు 35 ఏండ్ల శాసనసభా జీవితం గలవ్యక్తిగా పేరొందిన దెవరు ? ఇన్నాళ్ల రాజకీయ పోరాటాల్లో ఓటమిని అంగీకరించక వయోభారం తనపై పడుతున్న నేటికి ఒక వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన నాయకునిగా రాష్ట్రస్థాయి రాజకీయ నాయకునిగా పేరందిన స్వాతంత్ర్య సమరయోధునిగా ప్రఖ్యాతి గాంచిన దెవరు ? ఎవరో, ఈపుస్తకం చదవండి మీకే తెలుస్తుంది.

# 2. లచ్చన్నకుటుంబం - పుట్టుపూర్వోత్తరాలు

లచ్చన్న జననం :

ఉత్తర కోస్తా కళింగసీమలో ఉద్దానం ప్రాంతాన నాటి గంజాం జిల్లా సోంపేట తాలూకాలో బారువా గ్రామంలో ఒక రాజకీయ కాంతికిరణానికి రూప మేర్పడినది పుణ్యదంపతులు గౌతు చిట్టయ్య రాజమ్మల చిరకాల నోముల పంట 1909 ఆగష్టునెల 16వ తేదీన బారువాలో రాజకీయ భానోదయమై ఒక సాధారణ బీద సెగిడి కుటుంబమున మన లచ్చన్న జన్మించారు. అట్టడుగున గల అగాధాలను పట్టుకున్న నికృష్టాలను విదలించుకుని వదలించుకొని, ఇనబింబం మొగ్గతొడిగింది. ఉత్తరాంధ్ర రాజకీయ చరిత్ర భవిష్యత్‌నే తీర్చి దిద్దగల ఆశారేఖ పొడసూపిన దినమది.

కల్లు గీత పారిశ్రామికుని ఇంట్లో కాంతిరేఖ జనించింది. తరతరాలనుండి చదువు సంధ్యలులేని ఇంట్లో వాటిని పొందనాశించడమే తగదన్న చోటున ఒక ధ్రువతార వెలసింది.

లచ్చన్న తన తల్లిదండ్రులకు అష్టమ సంతానం. లచ్చన్న తాత తండ్రులు సెగిడి కులస్థులు. కులంవృత్తే వారికి కూడుబెట్టేది. ఈత చెట్లను కోతవేసి కల్లు నుత్పత్తి చేయడం, అమ్మడం చుట్టు ప్రక్క గ్రామాల్లో గల కల్లు దుకాణాలకు సరఫరా చేయడం వారి వృత్తి.

బారువాలో తన తాతతండ్రుల కానాడున్నది ఒకపూరికొంప, చిన్నపొలం. చుట్టు ఉన్న తనవారి పూరి గుడిసెలు, ఉపవాసాల బ్రతుకులు.

లచ్చన్న తండ్రి చిట్టయ్య తన ఎనిమిదిమంది సంతానాన్ని జూచి సంతోషించే అదృష్టాన్ని నోచుకోలేదు. తనసంతానంలో ఒక కుమార్తె లక్ష్మి, ఇద్దరు కుమారులు సత్యన్నారాయణ, లచ్చన్నలు మాత్రమే వారికి దక్కారు. నిజానికి లచ్చన్న తల్లిదండ్రులు విద్యాగంధం అంటని కులంలో జన్మించినప్పటికి వారికి జన్మించిన సంతానం భవిష్యత్‌ను బంగారుబాట వేయడం నిజానికదొక దైవ సంకల్పం. వృత్తినిబట్టిగాక ప్రవృత్తిని బట్టి వ్యక్తుల్లో అంశాలుద్భవిస్తాయన్నది బలపడి వారిలోగల ఏదోఒక మహత్తరమైన అంశ లచ్చన్న జన్మించిన తేదీని వారిఅన్నయ్యజాతక లగ్నాన్ని వారిచేతవ్రాయించి పెట్టింది. తమ సంతానం భావి జీవితాల్ని అదృష్ట జాతకులుగా చూడాలన్న వారి భావన, తపన మెచ్చుకోదగినదే. పుట్టిన చిరంజీవి బాల లచ్చన్న ఉత్తరాంధ్ర రాజకీయాలకే వన్నెతెచ్చి ఆంధ్రదేశానికే వన్నె తెస్తాడని వారానాడు భావించి యుండరు.



తన కుటుంబ సభ్యులతో సర్దార్ గౌతు లచ్చన్నగారు



సర్దార్ గౌతులచ్చన్నగారి మనవలు - మనమరాండ్రు



ప్రసిద్ధ దేశభక్తుడు లచ్చన్న ప్రథమ గురువు మార్గదర్శి ఆంధ్రరాష్ట్ర రైతు సంఘాధ్యక్షులు ఉమ్మడి మద్రాస్‌రాష్ట్ర శాసనసభ్యులు స్వర్గీయ పుల్లెల శ్యామసుందరం గారి వర్థంతి సభలో లచ్చన



1942 క్విట్ ఇండియాఆందోళన సందర్భంగా అండర్‌గ్రౌండ్‌లో సహకరించిన పైలరామస్వామి ఉరఫ్ గాలినాయుడు (బ్రాహ్మణతర్ల)



రైతోద్యమం స్వాతంత్ర్య పోరాటంలో లచ్చన్నగారికి అండగానిలచిన పుండరీకాచారి (రాజాం)



1942లో స్వాతంత్ర్య సమరంలో లచ్చన్నగారికి తోడు నీడగా నిలిచి జైళ్లకు లచ్చన్న గారితో వెళ్ళిన, స్వర్గీయ కిల్లి అప్పల నాయుడు (శ్రీకాకుళం – పురుషోత్తమపురం.)



లచ్చన్న అండర్ గ్రౌండ్‌కి వెళ్తున్న సందర్భంగా తనకు సహాయపడిన లచ్చన్న సన్నిహిత సహచరుడు నీలాంబరం



కాకినాడ బాంబుకేసు ముద్దాయిలతో



ఉమ్మడి మద్రాసు రాష్ట్ర మాజీ యం.ఎల్.ఏ.
స్వర్గీయ పుల్లెల శ్యామసుందరం



1930 లో అచ్చన్న



మా తృ రాజారావు



ప్రసంగిస్తున్నది, ఒకనాడు
పలాసా కాంగ్రెస్ సేవాదళ్
కమాండర్‌గా పనిచేసిన
జి. హనుమంతరావుగారు.



వడ్డి విశ్వనాథం - ఉపాధ్యాయుడు



అఖిల భారత స్వతంత్ర పార్టీ వ్యవస్థాపకులు మాజీ మద్రాస్ రాష్ట్ర ముఖ్యమంత్రి ఐమగూరి మేధావి చక్రవర్తి
రాజగోపాలాచారితో నాటి రాష్ట్ర స్వతంత్ర పార్టీ అధ్యక్షుడు.



సుంకర సత్యనారాయణతో - లచ్చన్న



హైదరాబాదు లేక్‌వ్యూ అతిథిగృహంలో ప్రథమ భారత రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్, సర్దార్ గౌతులచ్చన్న ఆయన సతీమణి శ్రీమతి యశోదాదేవి

ఆనాటి సమాజ స్థితిగతు లూహించుకొన్న అది గొంతెమ్మ కోర్కె. తగని కోర్కె. బయటపడి చెప్పిన తగవును కొనితెచ్చే కోర్కె. ఆనాటి పరిస్థితులటు వంటివి. గ్రామాల్లో వారిది గొప్ప కులం. పెద్దింటోళ్ళు వీరిది తక్కువ కులం. చిన్నింటోళ్లు అని ఛీదరించుకొంటూ తమదే గొప్ప కులం అనిపొంగిపోతూ వీధులంట వెళ్లాడే పాపిష్టిచెడు కాలమది. అంటరానితనం అగ్ని[illegible] మనుషులకు మాల మాదిగ అని పేర్లిడి, వారంటిన మైల పడిపోతామని నీటిలో పలుమార్లు మునిగి తేలే పరమఛాందస మూర్ఖ భావాల గుడిపిచ్చు ఆనాటి సామాజిక పరిష్వంగింపట్టు. వెనుకబడిన కులం, అట్టడుగునపడి అసూరిస్తున్న సామాజిక అన్యాయానికి బలి అయిపోతున్న కులం గౌతు లచ్చన్న ప్రభవించిన కులం, దీనికి తోడు లచ్చన్న జన్మస్థానం బారువా ప్రాంతం. వెనుకబడిన ప్రాంతం. కూలినాలి జనాలతో కూడిన ప్రాంతం, కూడు, గుడ్డ, వసతి సరిగ్గా లభించని ప్రాంతం.

లచ్చన్న జన్మించిన శుభ ఘడియలు ఆనాడు ఏ ఒకరికి పండుగదినం కాకపోయిన తల్లిదండ్రులకే ఒక అపార పెన్నిధి లభించేలా తోచినా నాడు అట్టడుగునపడి అనాథ ఆక్రందన జీవుల పాలిట ఒక శుభదినంగా చరిత్రలో నిలచి పోగలదు. సహజంగా తన తల్లిదండ్రులు గౌతు లచ్చన్నను తమవంశోద్ధారకుడని భావించి యుంటారు. కాని భావిలో తనే బహుజనోద్ధరణ కావిస్తాడని ఆలోచించి యుండరు. అష్టమ గర్భంలో పుట్టిన నల్లనయ్యలా గౌతు లచ్చన్న కూడ తన గ్రామంలో నానాహంగామాచేస్తాడని కూడ కలలో తలచి యుండరు. ఆ నాడు ఆ నల్లనయ్య చేసినవి కృష్ణలీలలు. ఈనాడు ఈ గౌతు లచ్చన్నవి విచిత్ర చేష్టలు. తన కులమే రాజ్యమేలుతున్న దినాల్లో ఆ నల్లనయ్య ఏమిచేసినా సరిపో యింది. అట్టడుగునపడి సాంఘిక పదఘట్టనలలో నలిగిపోతున్న గౌతులచ్చన్న కులం తన చేష్టలకేమిసహాయసంపత్తిని తెచ్చిపెట్టగలదు ?

జన్మతః కొన్ని శక్తిసామర్థ్యాలు సుగుణాలు వ్యక్తులకు సంక్రమిస్తాయి. "ప్రకృతైః ర్గుణైః ప్రభవాః" అని గీత. అంతేగాని కులం వంశంనుండి కాదు! లేకున్న గౌతులచ్చన్నకు వంశపారంపర్యంగా వచ్చేవి ఏమున్నవి ? "ధైర్యే సాహసే లక్ష్మీః" అన్నది తప్పించి ధైర్యంతో వృక్షాల శిరోభాగాల నధిగమించి సాహసంతో వాటి నధిరోహించి వాటినుండి అమృతాస్వాదనచేయడం పిరికివారికి మొతకవారికి సాధ్యమైన పనికాదే! సాహసానికి మారుపేరుగల వృత్తిపని అది - వ్యక్తిపని అది.

గౌతులచ్చన్నది దురదృష్ట జాతకం అయితే, అదృష్టయోగం [illegible]. అలముకున్న అజ్ఞానపు కారుచీకట్లో సంక్రమించిన అమాయక దృష్టి దుర్భర సాంప్రదాయాలను పట్టుకొన్న చాదస్తుల నమ్మకాల్లో పెచ్చరిల్లిన సామాజిక

అసమానతల అన్యాయాల పొదల్లో నుద్భవించినవారు బాలలచ్చన్న. తుదకతడే అరుణకిరణమై విప్లవభానోదయమై అగ్రవర్ణాలవారి దురహంకారాన్ని, జనాలను కాల్చుకుతింటున్న జమీందారుల దోపిడిని అరికట్టిన అగ్నికిరణమని అనాడు ఎవరూ భావించలేని దుస్థితి — అనాటి సామాజిక దుస్థితి. నమకాలీన పరిస్థితి.

## లచ్చన్న జననకాలం — నాటి పరిస్థితులు :

లచ్చన్న జన్మించిన కాలంనాటి సామాజిక ఆర్థిక రాజకీయ స్థితిగతులను తలచుకుంటే ఎంతటివారు పెల్లుబికి బయటపడలేని పరిస్థితి.

లచ్చన్న జన్మించింది ఉత్తరాంధ్రకోస్తాతీరాన కళింగ సీమలోగల ఉద్దానం ప్రాంతం. కళింగ సీమకు ఉత్తరభాగాన నేటి శ్రీకాకుళం జిల్లాలోగల ఇచ్ఛాపురం బారువా–మందసా ప్రాంతాన ఉత్తర కోస్తా తీరం ఇసుక తిన్నెలపై వెలసిందొక ఉద్యానవనం. దానినే అందరూ 'ఉద్దానం' అని పిలుస్తారు. ఎటు పరికించినా నారికేళ వనాల దృశ్యాలే కంటికింపుగా కన్పిస్తాయి. అసంఖ్యాకములైన వృక్ష రాజాలతో, పచ్చని పెదురు పొదలతో పంటభూములిన్ని కలిగిన ప్రదేశం ఉద్దానం. ఉద్ధానంలో అసంఖ్యాకములైన చిన్న చిన్న గ్రామాలు ఊపిరిపోసికొన్నవి. ఉద్ధానం మూడు వైపులున్న మడిమాన్యాల్ని దున్నుకొని బ్రతుకుతున్న రైతన్నలు వ్యవసాయక కూలీలు, ఒకవైపున సాగరతీరంలో గుడిసెల్లో తెరపర్యంతం వ్యాపించియున్న మత్స్యకారిశ్రామికులు అసంఖ్యాకంగా కన్పిస్తారు. అయితే భూమిపుట్టులపై ఆధారపడి జీవిస్తున్న రైతుకూలీలు నీటికోసం నింగికి మోడక తప్పలేదు. నిరుపేద మత్స్యకారిశ్రామికులు అమ్మకం కొనుగోలు దళారీల దోపిడి విధానంలో బలిఅవక తప్పలేదు.

కళింగసీమపై గజపతుల పాలన అంతరించింది. సామ్రాజ్యాలు భారత రాచరికాలు క్రమేపి గతిస్తూ విదేశీయుల పాలన క్రమేపి మనదేశాన వ్యాపించడం ప్రారంభమైంది. వ్యాపార రీత్యా మనదేశానికి వచ్చిన ఆంగ్లేయులు హైందవ రాచరిక వంశాలను జయించి తమ అధీనంలోనికి తీసికొని బ్రిటిష రాచరిక పద్ధతులను మనదేశాన ప్రవేశపెట్టారు. భారతీయులను అస్వతంత్రులుగా జేసారు.

బ్రిటిషువారు భూమిపై హక్కులను రైతులకు పెత్తందార్లకిచ్చి భూస్వాములు రాజ్యాన్ని అమలులోకి తెచ్చారు. ఎస్టేట్స్, రాజాస్థానాలు వెలసాయి. స్వాతంత్ర్యం హరించుకొనిపోయిన జనంపై తమకు అధికారం సంక్రమించినదన్న భావంతో జమీందార్లు బ్రిటిషువారికి కప్పాలు చెల్లిస్తూ వారి అడుగులకు మడుగులకు తలొగ్గుతూ వారివారి ఎస్టేట్సులోగల రైతుల్ని పీల్చిపిప్పిచేసే పన్నులను శిస్తు దస్తులను దౌర్జన్యంగా వసూలుచేసే రీతి-నీతిని చేపట్టారు. క్రీనీడాహంకారం పెరిగింది. రైతాంగం జమీందారుల దౌర్జన్యాలకు బలిఅవుతూ వస్తున్నది.

కూలీలు కార్మికులు పెత్తందార్ల దోపిడీకి బలిఅవుతూ వస్తున్నారు. జమీందార్లు రాజులు రైతుల్ని ప్రజల్ని జలగల్లా పట్టుకొని వారి రక్త మాంసాల్ని పన్నుల రూపేణ పీల్చడం తప్పించి వారి సుఖశాంతులను చూడని పరిస్థితి. కష్టపడి వస్తు రాశిని సృష్టిస్తున్న కూలివానిని, కార్మికుని పట్టించుకోని దుస్థితి. వారి సుఖశాంతులను, దర్జాలను పెంచుకోవడం తప్ప వారికున్న హోదాలకు అధికారాలకు పదును పెట్టుకోవడం తప్ప జనాల కష్టాలను తీర్చలేదు సరికదా వారి ఖర్మకు వారేబాధ్యులని త్రోసిపుచ్చారు. వారి దుస్థితి హీన పరిస్థితి వారి పూర్వజన్మ ఫలితమని, కర్మ సిద్ధాంతాన్ని పెంచి పోషించి ప్రజానీకంలో వెదజల్లారు. మూఢ నమ్మకాలను, దుష్టసాంప్రదాయాలను సమాజమున వెలరేగేలా ప్రోత్సహించారు. అందుకు ఎదురుతిరిగినవారిని అణచి పెట్టడం, అధోగతికి దిగజారేలా కుట్రలను జరిపేవారు. సమాజమున అధికులమని అంతస్తులకి అర్హత పెట్టిపుట్టి నందునే లభించినదన్న సిద్ధాంతం వ్యాప్తిజేసారు.

ఒక వైపున ఆకలి, నిరుద్యోగం, నిత్యదారిద్ర్యం; వేరొకవైపు సంఘంలో నీచకులాల ముద్ర, మరోవైపు జమీందారుల పన్నుల బాధ, తమ కష్టాల్ని హరించే దోపిడిదారుల అక్రమాలు. వెట్టిచాకిరి బ్రతుకులు. ఇవి చాలవన్నట్లు మూర్ఖ దురాచార మూఢ నమ్మకాల పడికట్టులు, ఆచారాలు, సాంప్రదాయాలు, అరువులు, బాదస్తుల చాకిరేవులు, నిరాడంబర జీవితం. నిర్వీర్యతకు రూపమని భావించే రాల్ని కలిగియుండుటయే బ్రతుకుకు సార్థకమన్నది లేవింది. బలమైన వర్గాల, బల హీనవర్గాల బాధనేగాక సమాజం 'అగ్ర వర్గాలు' 'అణగారిన వర్గాలు' అని తేడా రావడంతో అంతరాలు విభేదాలు లేచి సంపూర్ణ విషవలయం ఏర్పడింది. హెచ్చుతగ్గుల సుడిగుండాలు ఏర్పడ్డాయి. కక్ష, కలత, భీతి, వీరిలో వ్యాపించాయి. ఈర్ష్య, ద్వేషం, అసూయ, కుట్ర, దగా పాదుగట్టుకున్నాయి.

బ్రిటిష్ రాచరికం విదేశీ సంపదలను మన అంగడిలో అమ్మించి మన స్వదేశీ ముడిసరుకుల్ని వాళ్ల దేశాలకు ఎత్తుకొనిపోయే పరిస్థితి దాపురించింది. విదేశీ సరుకుల దిగుమతితో భారీపరిశ్రమల స్థాపనతో చేతివృత్తులపై, గృహ పరిశ్రమలపై జీవిస్తున్న లక్షలాది గ్రామీణప్రజానీకం తమ ఉపాధులను కోల్పోయింది. నైపుణ్యం కొరవడిన శ్రామికులు, నిరుద్యోగులు వీధిన పడ్డారు. ఒక వైపు ధనికుల భోగభాగ్యాలు, వేరొకవైపు అగ్రవర్గాల అత్యాచారాలు, వేరొక వైపు భూస్వాముల దోపిడి విధానాలు, వేరొకవైపు రైతుకూలీల ఆర్తనాదాలు. అసమానతలు, అంటరానితనం జనంలో నింగికెగసి కూర్చున్నాయి. వ్యక్తిస్వార్థం వీరవిహారం చేస్తూ సామాజిక శ్రేయస్సు చతికిలబడింది. బలహీనులను బలవంతులు దోచుకోవడం సమాజమున చెప్పుకొనదగిన ఒక కళగా రాణించడం ప్రారంభ మైనది.

తాత కిష్టప్ప :

ఇటువంటి సామాజిక స్థితిగతులున్నకాలంలో బాలలచ్చన్న బడుగుతాత కిష్టప్ప బతుకు యెలావుంటుందో ఊహించటానికి అందనిదేమీ కాదు. లచ్చన్న ముత్తాత స్వగ్రామం బారువా కాదు, అంబుగం. లచ్చన్న తాత బుద్దయ్య అంబుగం లోనే గతించగా అచ్చట బ్రతకలేక లచ్చన్న తాత కిష్టప్ప బారువాగ్రామం చేరి స్థిరపడ్డారు.

కిష్టప్పకు చిట్టయ్య ఒక్కడే కుమారుడు, ఇద్దరు కుమార్తెలు. కిష్టప్ప తన కులవృత్తిని చేపట్టక కూలికిట్టక రోజా కడుపుపోసుకునేవాడు. కులవృత్తి కూడు బెట్టినా పెట్టకున్నా ఆ వృత్తినే తప్ప ఇతరవృత్తిని చేపట్టక సంఘం అదమా యించి అడ్డుతగిలే రోజులు. నడుంకి జడతాడును కట్టుకొని చెట్లనెక్కి కల్లు తీస్తూ గీస్తూ యజమాని ఇంటికి వెళ్ళి దానిని ఇచ్చి తనకిచ్చిన అణా కూలి డబ్బులతో యింటికి వచ్చేవాడు.

కిష్టప్ప కుటుంబం :

ఆదాయం లేదు, ఖర్చువిపరీతం. దేవుడిచ్చిన పిల్లలను పోషించాలి. కుటుంబ యాత్ర దుర్భరమైనా సాగించాలి. కాలేకడుపుకు గంజిలభిస్తే జన్మకు చాలునన్నది ఆనాటి తన జీవిత లక్ష్యం, ఈ పూట గడిచింది రేపెట్లా సాగేది అన్నది తన నిత్య దైనందిన చింతవావ్యాపారం. తనకు కూడువిడిన, కూడునిడకపోయిన, తన స్వీయ వృత్తిలోనే ఉండాలన్న పరమ దారుణ సామాజిక షరతులున్న నికృష్ట సమాజమది. ఒక కులంవారు వేరొక కులంవారి పనులను గాని, చర్యలను గాని చేపడితే ఘోరకలి వచ్చిందిరా బాబూ అని గోలపెట్టి ఘోషపెట్టే దురాచార దుర్మార్గపు సమాజమది. ఎవరి వృత్తిలో వారుండక తప్పని స్థితిగతు లానాటివి.

చదువులేదు, సంస్కారంలేదు, అయినను దైవమిచ్చిన "జ్ఞానం" ఉంది. ఆలో చన ఉంది. కిష్టప్పకు జానెడు భూమి లేదు. కూలీనాలీ చేసికొని జీవించడం తప్ప వేరే ఆధారం లేదు. తన చుటూ ఉన్న తనలాంటివారు తమ బీదస్థితికి "ఖర్మ", పూర్వజన్మ ఫలితమని భావిస్తూ గోళ్లగిల్లుకుంటూ కూర్చోకుండా కిష్టప్ప మాత్రం కొంచెం మీదకు ఆలోచించగలిగాడు. తనవలె తన సంతానం కూడ బాధలు పడాలా ? మన బతుకులు ఏమిటి యిలా తగలడుతున్నాయి ? అందరూ హాయిగా బతుకుతుంటే మనకే అవస్థలేమిటి ? అని సాటివారితో కిష్టప్ప అనేవాడు. ఇది విన్న తనతోడివారు ముక్కుపై వేలిడుకొనేవారు. మన బతుకులకు రాసి పెట్టిందింతే. తగని పరుగులు మనకేల అంటూ నిరాశ పరచేవారు కిష్టప్పను సాటికులస్థులు.

నడుముకి జడతాడు కట్టుకొని, వృక్షాన్ని అదిమి పట్టుకొని, అంగవస్త్రంతో చెట్టు తలమీద కత్తితో గంటిడి తీసికొని వెళ్లిన కల్లుబిడ్డెను దానికి ప్రేలాడ గట్టి చెట్టుదిగి వచ్చిన కిష్టప్పకు బాలని కూలిడబ్బులు ముట్టేవి. మరల గడుపు దినం. తరువాత చెట్టు ఎక్కి నిండిన కల్లుబిడ్డెను దింపి యిజమానికి ఇచ్చినపుడు – అందేది ఆ అణాకూలి డబ్బులే!

ఆలోచన వచ్చింది. పనిచేస్తున్నది తను, ఆ వస్తువును హెచ్చు ఖరీదుకు అమ్మి బాగుపడేది యజమాని. తనే ఆ పనిచేస్తేనో? అయితే ఈత, తాటిచెట్లు తనకేవీ? భగవంతుడు సృష్టించిన కనీసం వృక్షాలు కూడ అందరి మనుషులవి కావా? ఏమిటిదంతా? ఈ చెట్లకు కూడా శిస్తులు చెల్లించాలట. ఈ వృక్షాలు జమీందారులవట. ఈ భూములు రాజులవట. ఈ సంపదంతా వారిదేనట. దీనిని ఎవరైన వాడుకున్న అందుకు సుంకాలు చెల్లించాలట. మరి సుంకం తనవద్ద లేదే? ఉన్నా ఆ జమీందార్లవద్దకు వెళ్లగలిగిన పలుకుబడి, తాహతు లేదే? ఏమిటి, ఈచెట్లను నాటింది జమీందారులా ?

జమిందార్లు జలగల్లా మనుషుల రక్తాల్ని పీల్చి పిప్పిచేస్తున్నారు. అయినా బయటకు పల్లెత్తు మాట అన్నామా, మరింక చిరునామా ఉండదట. రాజుగారి బంట్రోతులు వాళ్లని రచ్చబండపై నిలబెడతారు. "ఏమిటో రంగయ్య! ఈ జమీందార్లు కూడ రాజులు కారట. వీళ్లమీద ఏదో కంపెనీ ఉందట. ఆ కంపెనీ వాళ్లకు వీరు దస్తులు చెల్లించుకోవాలట. జమీందార్లకు మనం శిస్తులు చెల్లిస్తుంటే వారు కంపెనీకి కప్పం చెల్లిస్తున్నారట. ఏమంత గొప్ప. వీళ్ళకింద మనం పాలెగాళ్లం. వాళ్ళక్రింద వీరు పాలెగాళ్ళు.

అయినా మనకెందుకురా కిష్టప్పా! వాళ్లు మహారాజులు పెట్టి పుట్టినోళ్ళు ఏలుబడిసాములు పూర్వ జన్మలో పుణ్యం చేసుకున్నవాళ్లు. నిజమేరా మనం ఇంకా ఇలానే అనుకుంటుంటే వాళ్ళింకా పెరిగి పెద్దవారై మనల్ని పీక నులిమి అవతలకు పడవేస్తారు.

అంతేనంటావా ?

అంతే!

సరేలేరా, ఆదినం రాకపోతుందా? మనం జూడకపోతామా? ఇదీ ఆనాటి పరిస్థితి. ప్రజల దుస్థితి. పర్లాకిమిడి, మందసా, పలాసా, బారువా, చీకటి, తర్లా, సరుపాం, బొబ్బిలి, సాలూరు – ఇవన్నీ సంస్థానాలే. జమీందార్లయి జనంలో పడి శిస్తులు దస్తులు చెల్లించు కొనేవారే.

ఈనాటికీ తెలంగాణా వెనుకబడిన ప్రాంతం. నైజాం పాలనవారి చలువ జమీందార్లున్న ప్రాంతం అనగానే మనకు గోచపాతరాయుళ్ళు, గర్భ

దరిద్రులు, పుట్టుకతో పాపాత్ములు, హీనులు, జన్మతః జమీందార్లు, దైవాంశ సంభూతులు, గొప్పవారు అన్నవారు మనకు ప్రత్యక్షమౌతారు. వారి అడుగులకు మడుగులొత్తే జనం పెత్తందార్లు తయారవుతారు. పల్లెల్లో గల ప్రజానీకాన్ని భయపెట్టి బాధపెట్టి జడిపించి జులుంజూపి గర్జించి నిర్దీవాల్లా వారిని మార్చి ముక్కుపిండి శిస్తులు దస్తులు వసూలు చేసికడుపు నిండా మెక్కి ఉన్నదంతా బుక్కి మిగిలిన దానిని జమీందారునకిచ్చి వారిని సంతోష పెడతారు. మన కిష్టప్ప మాత్రం ఎలా బాగుపడగలడు? పెత్తందారు చేతిలో పనిచేయక తప్పని స్థితిగతులవి.

తండ్రిచిట్టయ్య :

కిష్టప్ప, కిష్టప్పభార్య తుదకు జీవన సమరంలో ఓడిపోతూనే పరమ పదించారు. తమ కుమారుని చిట్టయ్యను దిక్కులేని వానిగా జేసి వెళ్లారు. అప్పటికి చిట్టయ్య వయసు 10 ఏండ్లకు మించి యుండవు. తనఇద్దరు చెల్లెళ్లను పోషించి వివాహాలు జరిపించవలసిఉంది. అందరి సంసారాలు అంతంత మాత్రమే, ఇంకా ఒకరి కొకరు చేసేదేముంది? దారిద్ర్యాన్ని పంచుకోవడం తప్ప. ఒంటినిండా బట్టలేక, కడుపునిండా తిండిలేక, ఉండటానికి కనీసం పూరిగుడిసె కూడ మంచిది లేక ఎన్నాళ్ళీ దుర్భర జీవితమని తల్లడిల్లి పోయాడు చిన్నవాడైన చిట్టయ్య. అంతా ఖర్మ, కనీసం ఆడవారి ఒంటిమీద కూడా అడ్డంగా వేసుకొనే చీర తప్ప ఏమీ లేని పరిస్థితి వారిది. మొగాళ్లకు అంగవస్త్రం, అదైనా అంతంత మాత్రమే. కలవారిలా తను బతకటానికి మరి అవకాశమే లేదా? లేక భగవంతుడు మమ్మల్ని యిలానే బతకాలని పుట్టించాడా? కన్నీళ్ల బతుకులతో కాలం వెళ్ల బుచ్చుటయేనా కర్తవ్యం? విలాస జీవితాలతో రసకేళివినోదాలతో భోగభాగ్యాలతో తులతూగుతున్న వారు తన ముందటనే తిరుగుతుంటే, కనీసం బ్రతకటానికి అవకాశం లేని ఇచ్చట ఉండటంవృధా, శద్ధదండగ, అన్న నిర్ణయానికి వచ్చాడు చిట్టయ్య. ఏకాకి బ్రతుకుకన్న ఘోర నరకం ఏముంది? బంధువులున్నా ఒకరి నొకరు ఇచ్చేది ఏముంది? ఆకలి అవమానం – జనంలో కూడ ఆలోచనలు రేకెత్తాయి.

మనదేశాన్ని బ్రిటీషువారు పాలిస్తున్న దినాలవి. బ్రిటీషువారిది రవి అస్తమించని సామ్రాజ్యం అని ప్రతీతి. బర్మా, మలయ, సింగపూర్, సిలోన్, మార్షియస్, ఫిజీ ద్వీపాలతో వారికి మానవశక్తి అవసరం అయింది. యాంత్రికశక్తి ఆనాటికి అంతగా పుంజుకోలేదు. ఫ్యాక్టరీలలో వ్యవసాయ భూములలో రైతు కూలీల కార్మికుల అవసరం హెచ్చుగా వుండేది. ఉత్పత్తులను పెంచటానికి వారికి వీరు

# 23

బ్రిటిషువారు ఇండియానుండి పైదేశాలకు వలస పోవటానికి కార్మికులను, కూలీలను అనుమతించి, ప్రోత్సహించేవారు. పైదేశాలకుపోతే అచ్చట బాగా డబ్బు గడించ వచ్చన్నది గొప్ప ప్రచారంగా ఉండేది.

అయితే సముద్రయానం చేసేవారు మరల మతంలోనికి జాతిలోనికి తీసి కోబడరని సనాతనులు ప్రకటించారు. ఇండియాలో హీనజాతులుగా పిలవబడిన వారు శూద్రులు, పంచములు. విదేశాలకు కడుపుకోసం కూటికోసం కూలికోసం పరుగులెత్తటానికి మరి జంకలేదు. మండుతున్న జఠరాగ్నిని ఆపే శక్తి మతానికి గాని, కులానికిగాని లేవుకదా? మనుగడ తదుపరే మానవుడు మహోన్నత్యాన్ని సంస్కృతిని జ్ఞప్తిలోనికి తెచ్చుకుంటాడు. వాటి మనుగడకు మార్గాన్ని ఏర్పరు స్తాడు. ఆకలి ఆలోచనను రేకెత్తిస్తుంది. ఆలోచన అవసరాన్ని సూచిస్తుంది. మానసిక సంఘర్షణకు లోనుకానిదే మనిషి నిజాన్ని తెలుసుకోలేడు.

చిట్టయ్య నిరక్షరాస్యుడైన నిరుద్యోగి కాడు, నిత్యం ఏదో పనిచేస్తూ బ్రత కాలని చూస్తున్నవాడు. తనచుట్టూ ఉన్న పరిస్థితులను తెలుసుకొనే జ్ఞానాన్ని పొందాడు. చదువులేనివాడికన్న చదువుకున్నవాడు పొందే గౌరవాన్ని కళ్లారా చూసాడు. తనకు ఆస్తి లేక పోయినా ఆస్తి ఉన్న వ్యక్తికి ఈసంఘంలోని మనుషులు ఎంత గౌరవిస్తారో విలువిస్తారో బాగా గ్రహించాడు. తనకులంలోనే చదువు కున్నవారులేరు. తనచుట్టునున్న అనేక కులాల్లోకూడా చదువరులులేరు. అక్షరం ముక్క వచ్చినవాడిని అందరూ వింతగా చూస్తూ చుట్టూ చేరి ప్రదక్షిణలిడి పూజించే దినాలవి.

బారువాలో మొత్తం సెగిడి కులస్థుల కుటుంబాలు 80 వరకు ఉండేవి. అయితే అందులో భూవసతి గల కుటుంబాలు నాలుగైదు మాత్రమే. మిగతా వారు కేవలం కల్లుగీత పని మీదనే బ్రతికేవారు. అందులో మాధవయ్యది ఒక కుటుంబం. అందరూ అతనిని ముద్దుగ మాదన్న అని పిలిచేవారు. బొర్రా మాదన్న అంటే అందరికీ ఎంతో ప్రేమ. తను కూడ అందరి పట్ల చాలా వినయంగా ప్రవర్తించేవాడు. రైతు పని చేసే సెగిడి కుటుంబం అతనిది. వృత్తిలో వచ్చిన మార్పును గౌరవాన్ని అతడు పొందేవాడు.

చిట్టయ్య మాదన్న తండ్రివద్దకు వచ్చి తన యింట్లో పాలికాపుగా చేరతా మన్నాడు. చిట్టయ్య మంచితనాన్ని గ్రహించిన మాదన్నతండ్రి కాదనలేకపోయాడు. అయితే పాలెకాపుగా జేరడం తప్పించి వాళ్ల తనకెంత జీతం చెల్లిస్తున్నారు, తను వాళ్లనుండి ఎంత తీసికుంటున్నాడన్నది తెలియని దగ్గర సంబంధాన్ని, అనుభూతుల్ని ఒకరిపై ఒకరు పెంచుకున్నారు.

మేనమామ :

మాదన్న తల్లి చిట్టయ్యను పిలిచి తృణమో పణమో ముట్టజెప్పేది. అతనిపై అంతులేని అభిమానాన్ని కనపరచేది. చిట్టయ్య తన ఆదాయాన్ని ఎవరికిస్తాడు-తనకెవ్వరున్నారని. అందుకు మాదన్నగారి తల్లి వద్దనే ఆదాయాన్ని ఉంచమని ఆమెచేతిలో పెట్టేవాడు. ఆరోజుల్లో అన్నీరూపాయి నాణేలే. ఆదినాల్లో ధాన్యం రాగులను పాలెగాపులకు జీతంగా యిచ్చేవారు. తను గంజి అంబలి త్రాగుతూ తన సంతతికి భవిష్యత్‌లో బంగారుబాట వేయాలని భావించే చిట్టయ్య సంకల్పమెంతటిఉదాత్తమైనదో కదా!

దండిగా గడించాలి, భూమిని ఏమాత్రమైన ఖరీదుచేయాలి. స్వంత సాగు చేసుకోవాలి. బండిబక్కను కొనుక్కోవాలి, పంట పండించాలి. అయితే ఆనాడు ఒకసామెత ఉండేది, ఎంతచిట్టు అమ్మితే వెంకడికి పెళ్ళి అవుతుంది అని. ఎంతశ్రమించినా చిట్టయ్య తన ఆశయాన్ని నెరవేర్చుకోలేడు (పుట్టెడు చిట్టు ఒక పావలా అని వినికిడి).

అందుకే ఒకనాడు చిట్టయ్య ఒక నిర్ణయానికి వచ్చాడు. రంగమెల్లి పోదామె రావోలమ్మో అన్న జానపద గీతంలో అర్థం తెలుసుకున్నాడు. జీవితాన్ని బాగు పరచుకోదలచాడు. అంతే రంగూన్ రాజధాని బర్మా చేరాడు. వచ్చిన కార్మికులను వారు ఎంతో ఆనందంతో చేరదీసేవారు. వారికి కావలసింది బర్మాలో సులువుగా కార్మికశక్తిని పొందడం. హెచ్చుగా ఉత్పత్తిని చేసి లాభాలను గడించటం - వీరిని ఉపయోగించుకోవడం – పనిముట్టులా తదుపరి పారవేయడం.

అప్పటికే బర్మా రాజధాని రంగూన్‌తో వేలకొలది తెలుగువాళ్లు [illegible]. అందరిలో మంచిగ మెలగిన చిట్టయ్య అందరి తలలో నాలుక [illegible]. కూలి మన్ననలందాడు. నాలుగు పైసలు సంపాదించడం ప్రారంభించాడు. కర్రల మిల్లుల్లో పనిచేసేవాడు. గడించిన కూలి డబ్బులను జాగ్రత్తగా [illegible]. కొంత మిగిల్చి ప్రతీ నెల ఇండియాలోనున్న [illegible] తను [illegible] పాలికాపుగా ఉన్న ఇంటికి (మాదన్న తల్లికి) మనియార్డరు చేసేవాడు. [illegible] వచ్చిన తన తోటికూలీ వద్ద చేరి మాదన్న గారి తల్లికి ఉత్తరాలు వ్రాస్తుండేవాడు. "పంపించిన డబ్బును జాగ్రత్తగా [illegible] అవగానే ఏదో కొంత భూమిని కొనండి. ఒక ఇంటిని [illegible] నేను మనదేశం వచ్చేస్తాను. అక్కడే బ్రతుకు [illegible].

[illegible] ఉత్తమురాలైన ఇల్లాలు. తనను నమ్మిన [illegible] ఉంచింది. ఒక ఇంటిని కూడా సమ

కూర్చింది. చిట్టయ్య తనకు ఇండియాలో తన స్వంతగ్రామం బారువాలో పొలం, ఇల్లు ఉందన్న ధీమాతో తిరిగి బర్మా వదిలి ఇండియా చేరి బారువాలో స్థిర పడ్డాడు. బర్మా వెళ్లి ప్రయోజకుడైన చిట్టయ్యకే తన కూతురు రాజమ్మను ఇచ్చి వివాహంచేసారు. ఏ ఇంటిలో తను ఒక పాలెకాపుగా మెలిగాడో ఆ ఇంటి ఇల్లాలి మెప్పులను పొంది ఆయింటి పిల్లను పెండ్లాడి స్థితిగతులను పెంచుకున్న చిట్టయ్య కథ నిజానికి చిత్రమైనదే.

ఈనాడువలె ప్రామిసరీ నోట్లుమీదగాక అనాడు మాటమీదనే అప్పు లిచ్చేవారు, తీసికొనేవారు. అప్పులు ఎగగొట్టడమన్నది అనాడు హీనాతి హీనంగా, నికృష్టంగా భావించేవారు. తుదకు వాళ్లు అప్పుతీర్చలేకపోతే వాళ్ల సంతానం తీర్చవలసిందే నన్న పట్టుదల, పంతం గల సమాజం అది. వీరిలో నున్న మంచిని బలహీనతగా చేసికొని అవతలవారు వీరిని వెట్టిచాకిరికి కూడ గురిచేయడం జరిగేది. అయితే అనాటిది సత్తెకాలపు లోకం అని ప్రతీతి. సాక్ష్యాధారాలు అవసరంలేదు. మాట నమ్మకమే మూలాధారాలు. చిట్టయ్య పంపిన డబ్బును మాదన్న కాజేసినా కాదన్నవారు లేరు. అన్యాయం అని నిరూపించుకోలేరు. అయినా పొలం కొనిపెట్టి ఇళ్లు కట్టించిన మాదన్న తల్లిని చిట్టయ్య ఎంతో గౌరవించేవారు. భార్య రాజమ్మ అన్నా పంచప్రాణాలు. మగవారు బాగుపడాలంటే ఆడది సహ కరించనిదే సాధ్యంకాదు కదా !

చిట్టయ్య రాజమ్మలు సొంత ఇంటిలో కాపురం పెట్టారు. తమకున్న పొలంలో కష్టించి, చిన్న కొబ్బరితోటను కూడ సంపాదించారు. రెండెకరాల భూమిపై రత్నాల్ని పండించారు. చిన్న రైతుగా మారి తమవృత్తిని వ్యవసాయం నుండి వ్యాపారానికి మార్చారు. వస్తువును సృష్టించినవాడు వ్యాపారి కానిదే లాభాల్ని గడించలేడు. ఒకటి రెండు కల్లంగడులను తెరచారు. నలుగురైదుగురు గీత పనివాళ్ళను పెట్టుకొనే స్థితిని సంపాదించారు. తన భార్య రాజమ్మ కల్లు అంగడులను నడిపించుటలో అందెవేసిన చేయి అనిపించుకోవడమే గాక, భర్తకు అన్ని విధాలా అండదండలుగా ఉంటూండేది.

చిట్టయ్య తన గీతపనివాళ్ళు నలుగురిని వెంటబెట్టకొని కల్లును చెట్లనుండి తీసికొని వచ్చేవారు. కల్లంగడిలో రాజమ్మ ఉంటూ కల్లును అమ్మించడం చేసేది. చుట్టూగల చిన్నచిన్న గ్రామాల్లోని మోతుబరిరైతులు కల్లంగడికి వచ్చినా కల్లు త్రాగేవారుకారు. నలుగురితో నాలుగుకబుర్లు చెప్పుకొని జారుకొనేవారు. వారి ఇళ్లకుకాదు, రహస్యస్థలానికి పోయి కల్లునుతెప్పించుకొని ఎవరూచూడకుండా త్రాగేవారు. వీరికి రహస్యంగాకల్లును అందించే సౌకర్యాన్ని రాజమ్మ కలిగించేది.

చిట్టయ్య ఎంతకష్టజీవో, శ్రమజీవో కల్లును సేవించకుండా ఉండలేక పోయేవాడు. రాజమ్మ వారించినా అదిలేనిదే బ్రతకలేననేవాడు. ఆనాటికి సెగిడి

కులస్థులేకాదు, అనేక కులాల్లో ఉన్నవారు తరచుగావచ్చి త్రాగేవారు. అదిఅంత తప్పుగా భావించేవారు గాదు. అయితే ఉన్నత కులస్థులు మాత్రం త్రాగడం ఒకవిడ్డూరంగా చెప్పుకొనేవారు. దొంగతనంగా, ఇతరులకు తెలియకుండా త్రాగేవారు అరుదుగాఉండేవారు. నిజానికి చిట్టయ్యకు త్రాగుడు అలవాటు లేకుంటే ఇంతకు పదింతలు గడించి ఒక చిన్నసైజు జమీందారై ఉండేవారేమో? రాబడి అంతగా ఉండేదన్నమాట.

బారువాలో చిట్టయ్య అంటే ఇపుడు అషామాషీమనిషికాదు. కులంలో చెప్పుకోదగిన వ్యక్తిగా మారాడు. సుమారు 80 కుటుంబాలలో తనొక ప్రత్యేకమైన హెూదాను దర్జాను పొందగలుగుతూ ఉండేవాడు.

అనాటి వస్తువులు, ఉత్పత్తిపంపిణీ ఎంతో విచిత్రంగాఉండేది. బతికితే చాలునన్నభావంతోఉన్న ప్రజలు తప్పించి, వర్తక వాణిజ్యాలుచేసి ధనవంతు లవుదామన్న ఆశలేనివారే హెచ్చుమంది. కేవలం ఐదురూపాయిలకు బాగా బలిసిన 30 కేజీల పొట్టేలు లభించేది. నిజానికి దీనిఖరీదు ఈనాడు ఏ 600 రూపాయిలో ఉంటుంది. అనాటి జనజీవన సరళికూడ కేవలం ధన సంపాదనకే గాక ఆటపాటలతో కాలంవెళ్లబుచ్చేవారు. కోళ్లపందాలు, పొట్టేలు పందాలు తరచుగా జరిగేవి. ఫలానా పేరుగల తోటలోనో, ప్రదేశంలోనో కోడిపందెం లేక గొర్రెపందెం అని ప్రకటిస్తారు. ఈ ప్రకటించిన వారెవరోకాదు, యిరు ప్రక్కల పందెం వేసి కోళ్ళను, గొర్రెలను పందెంలోనికి దించేవారు, అంతే అదిచుట్టుప్రక్కల నిమిషంలోవ్యాపించి పందెం జరిగినచోట ప్రజలు అసంఖ్యాకంగా కూడేవారు. వస్తువుల అమ్మకాలు, తినుబండారాలుకూడ అమ్మబడేవి. కల్లంగడికి ఆనాడు ఉన్నంత గిరాకి మరే దినమున ఉండేదికాదు. ప్రతీదినం మాంసంకూర లేనిదే మెతుకు మింగుడు పడదన్న స్థితికి వచ్చారు. రాజమ్మకూడ భర్త అన్న మమకారంతో అన్ని సౌకర్యాల్ని జరుపుతూ ఉండేది. ఇక కోళ్లు, గొర్రెలు ఆనాడు రైతుకూలీలు విపరీతంగా పెంచేవాళ్లు. ఆ దినాలు వేరు, వారి జీవన విధానాలే వేరు. పగటల్లా పనిపాటలతో అలసిపోయిన ఆ రైతుకూలీలు రాత్రి వేళలో భజనలని, తుంబుర పాటలని, పరమేశు పాటలనీ పందిళ్ళను మరీ వేసి జరుపు కొనేవారు. చిట్టయ్యకూ ఆటపాటలన్న అమితమైన అభిలాష, కోరిక ఉండేది. ఇలా దినదిన ప్రవర్ధమానమై మొలకెత్తిన గౌతు వంశవృక్షం అంబుగంలో గౌతు బుర్రయ్యతో ప్రారంభించింది. బారువా చేరి కృష్ణమ్మ జననంలో స్థిరపడి శాఖోపశాఖ లైంది.

# ౬. లచ్చన్నగారి బాల్యం

సముద్రతీరంలో ఉప్పొంగిన కెరటంలాంటిది లచ్చన్నబాల్యం. ఎద్దుల్లా మొద్దుల్లా సాగిపోయే నాటి ప్రాంతీయ జనజీవన సరళిలో చైతన్య కదలికకు ప్రతిరూపం లచ్చన్నబాల్యం.

చిట్టయ్య రాజమ్మలకు చిన్నారి లచ్చన్న ఎనిమిదవవాడు. పాపం ఆ దంపతులు కన్న వారిలో ఒకరుకాదు ఐదుగురిని పోగొట్టుకున్న వారి హృదయాల్లో అగ్ని పర్వతాలు పేలాయి. ఆత్మలు ఘోషించాయి. పుట్టిన సంతానం అంతరించి పోతుంటే, తమ కళ్లముందే మాయమవుతుంటే ఏ తల్లిదండ్రుల గుండెలు భరిస్తాయి. తమసంతానం పెరిగి గొప్ప చదువులు చదివి ఉద్యోగాలు సంపాదించి సాటి మనుషులనుండి గౌరవ మర్యాదల్ని పొందగలిగితే చూడగలిగిన అదృష్టాన్ని ప్రతీ తల్లిదండ్రులు కోరుకుంటారు. చిట్టయ్య రాజమ్మల కా అదృష్టం లేదా ? కులవృత్తిలో కూడుగుడ్డకు లోటులేదు. కూడబెడుతున్నారు కూడ. తమపిల్లల్ని పెంచి పెద్దజేసి వారికి విద్యాబుద్ధుల్ని చెప్పించి వారిని పెద్దచేయాలన్న సంకల్పమే వారిది, తప్పించి తమవృత్తిలోనికి దించి వారికి తమ సుఖసంతోషాలకు సాధనాలుగా జేసుకోవాలన్న స్వార్థం లేని పుణ్య దంపతులు వారు. తమ పిల్లలనే భాగ్యానికి వాళ్ళ జీవితాలను ధారపోయాలని చూస్తున్న కష్టజీవులు. తమకు సంతానయోగం ఉన్నప్పటికి, దక్కే యోగం ఇకలేదు అన్న నిస్పృహలకు లోనయ్యారు. అయినా, రాజమ్మ దైవభక్తిగల ఇల్లాలు. చిట్టయ్య సాత్వికుడు. సంతానం కలిగి నిలబడాలని మొక్కని దేవుడు లేడు, పూజించని దేవత లేదు. నోములు నోచేది వ్రతాలు చేసేది సంతానప్రాప్తికి. ఎవరేమిజెప్పినా ఏ చిట్కా చెప్పినా భక్తితో ఆచరించేది రాజమ్మ. భక్తికి దైవత్వం లోనవక తప్ప లేదు. ఆ దంపతులు నోచుకొన్న నోములు ఫలించాయి. ఆరవ సంతానంగా మగ బిడ్డను కన్నారు. సకల సృష్టికి కారణభూతుడైన ఆ సత్యన్నారాయణ పేరునే తమ బిడ్డకు పెట్టారు. ఆ దైవం కరుణించాడని మురిసిపోయారు. ఏడవ సంతానంగా ఆడపిల్ల జన్మించింది. మహాలక్ష్మి అని పేరిడి వారింట లక్ష్మి వెలసిందని సంబర పడిపోయారు. చివరిగా అదృష్టయోగమున వారికి అష్టమ సంతానంగా అదృష్ట జాతకుడు లచ్చన్న 1909లో ఆగష్టు 16వ తేదీన బారువాలో జన్మించారు. జనజీవనసరళిలో జాగృతిని తెచ్చిపెట్టే చైతన్యం ఆనాడుద్భవించింది. కాంతి కిరణాలు చైతన్య దీపికలు ఏ జీవిలో ప్రవేశించినా ఉత్సాహ, ఉద్రేక ఉల్లాసాలు ఉప్పొంగి పరవళ్లు త్రొక్కక మానవు. సమకాలీన సమాజమునందలి అచేతన శక్తులకది అపురూపాలుగా, అసందర్భాలుగా, అక్రమాలుగా కన్పించక తప్పదు.

పిల్లవాడు అల్లరి పెట్టిన, ఎగిరి గంతేసిన పెంకివాడు, రాలుగాయి అని బిరుదులు తగిలిస్తారు. అష్టమ సంతానం అందులో ఆఖరివాడు లచ్చన్న. తల్లిదండ్రుల ఆదరణాభిమానాలకు మరి కొదవలేదు. ముద్దు ముచ్చటకు కొరతలేదు. రాజమ్మ చిట్టయ్యలకు ఇరువురు కొడుకులను ఇలవేల్పులకన్న మిన్నగా చూసుకొనేవారు. ఒకేఒక ఆడపిల్ల లక్ష్మిని అల్లారుముద్దుగా పెంచేవారు. పిల్లలు అడిగినదే తడవు వారేమి కోరినా కొని తెచ్చి పెట్టేవారు.

రాజమ్మ చిట్టయ్యలు ఎంత ఆదరణను అందించేవారో అంతకు మించి ముద్దు ముచ్చటలతో వారిని ముంచెత్తేవారు. వారివద్దనున్న కల్లుగీతపనివారు, ఇక బంధువుల సంగతి చెప్పాలా ? తల్లిదండ్రులు ఆనందిస్తారని కొందరు, వారినుండి ఆదరణాభిమానాల్ని పొందాలని మరికొందరు.

అతిగా ముద్దు చేసిన పిల్లలు చెడిపోతారని అల్లరివాళ్లు అవుతారని జనసామాన్య నానుడి. అయితే ముద్దు చేయని పిల్లలంతా బాగుపడిపోతారని మనమంతా నమ్మలేంకదా. పిల్లల్లో స్వాభావిక లక్షణం మేరకు, సహవాసాల ప్రభావం మేరకు ప్రేరణలనంది వారి ప్రవర్తన ఉంటుందని మనస్తత్వ శాస్త్రవేత్తలు ప్రవచిస్తారు. లచ్చన్న బాల్యం ప్రతిఘటనలమయం. మానసిక శాస్త్రజ్ఞులు మనిషికి కొన్ని గుణాలు వారసత్వంగా లభిస్తాయని చెప్పారు. తన తాత దినమెల్ల కష్టపడిన బ్రతుకును కొనసాగించుకోలేని దుస్థితిలో ఎంతో మాన సిక సంఘర్షణకు గురి అయ్యేవారు. తన తండ్రి ఎన్ని కష్టాలనోర్చి అయినా భూములను కొనాలని, ఆస్తిని సంపాదించాలని, నిత్యం పరిశ్రమించే మనిషిగనే గాక విదేశాలకు కూడా పోయి తన లక్ష్యాన్ని సాధించుకున్న దిట్ట. తన జీవిత వాంఛను నెరవేర్చుకొన్న ఘటికుడు. సమాజంలో సమున్నతమైన స్థానాన్ని పొందాలని పరితపించడమే గాక కుల వ్యత్యాసాలు కుల దౌర్జన్యాలు లేని సమాజాన్ని రంగూన్‌లో జూచి వచ్చినవాడు. అటువంటి సంఘాన్ని ఆశించేవారు సంపద – అధికారాలు లేనిదే, సమాజంలో గౌరవం లేదని, స్వీయానుభవం ద్వారా తెలిసికొన్నవారు. తనతండ్రి అటువంటి తాతతండ్రులకు వారసుడయిన లచ్చన్న బాల్యం మాత్రం తిరుగుబాటులేని బాల్యంగా ఉండగలదా? వార సత్వంగా కొన్ని గుణగణాలంకురిస్తాయి. అయితే సమకాలీన సమాజం ప్రభా వంతో మనిషి వాటిని సద్వినియోగంలోనికి తేవచ్చు లేదా దుర్వినియోగపరచ వచ్చు.

[illegible] అల్లరిపిల్లవాడని ప్రతివాడు వచ్చి చెప్పిన తల్లిదండ్రులు [illegible] చెప్పేవాడు. మీరేమి అనుకోవద్దు అని సర్దిచెప్పి [illegible] పిల్లలోనికి వెళ్లడం జరిగితే మరల ఏదో తగవు [illegible]. తోటిపిల్లలు తనతో వాదనకు దిగినా, తన

న్నది కాదన్నవారి కాలుచేతులు విరిగాయన్నమాటే. తోటిపిల్లల్ని కొట్టడం, పుట్లనెక్కడం, వెక్కిరించి ఏడిపించడం, ఏమీ ఎరుగనట్లు నటించడం, పరుగులు తీసి ఏఒక్కరికి అందకుండా పారిపోవడం, బుర్ర పగిలినా, కర్రదెబ్బలు కాసినా తనకేమి పట్టలేదన్న రీతిలోనుండటం, శరీరం ఎంత బలిష్టంగా ఉండేదో – గుండె ధైర్యం నిగ్రహం అంత స్థాయిలో ఉంటేనే తప్ప తిరగబడడం, తిరగబడిన వారిని కొట్టడం జరగదుకదా !

అల్లరి పనుల నరికట్టాలంటే వీడిని వెంటనే "బడి" లోనికి పంపిస్తేనేగాని వీడి తిక్కకుదరదని తండ్రి చిట్టయ్య ఆలోచించేవారు. బడివయసు రానిదే ఎలా అని రాజమ్మ అనేది. చదువుకోవటానికి వయసులేదుకాని, ఇతర పిల్లల్ని కొట్టడానికి మాత్రం వీడికి వయసుంటుందా అని తండ్రి చిరాకు పడిపోయేవాడు.

"బాబూ చిట్టయ్య – అమ్మా రాజమ్మ మీ చిన్నోడు చూసారా మా చెఱకు తోటలో పడి జామిచెట్టెక్కి విరచి తినడమేగాక, తీసికొని వెళ్లినవారినందరిచేత తినిపించాడు. ఇలా అయితే ఎలాగ అమ్మా ? మేముబ్రతకాలా ? అక్కరలేదా ? మీరేమో కల్లంగడిలో ఉంటారు ఏమీ పట్టించుకోరు" అనేవారు. "అంతమాట అనకండి. వాడు పెంకివానిగా తయారయాడు. ఎన్ని చెప్పినా ఆ కొంటెపనుల్ని వాడు మానలేదు. ఈసరికి జాగ్రత్తగా చూసుకుంటా"మని సమాధానం.

"ఒరే ఏమిట్రా నీఅల్లరి. ఆగడాలు తగ్గిస్తావా ? నాలుగు తన్నమంటావా ? నిన్న వాళ్ల మామిడితోటలో పడి కాయలన్నింటినీ రాళ్లతోకొట్టి రాలగొట్టావట. మామిడికాయల్ని దొంగిలిస్తావా ? నీకేం తక్కువని, కావలసివస్తే మేము కొని పెట్టమా ? ఎందుకురా మమ్మల్ని ఇంతగా దుఃఖపెడతావు" అన్న తండ్రిమాటలకు "అబ్బే లేదునాన్నా ఒట్టి అబద్ధం నేనేమి చేయనిదే, కావలసివస్తే అమ్మనుఅడుగు" బాలలచ్చన్నపై అమ్మ అభిమానం "లేదులెండి, కిట్టనివాళ్లు ఏమోచెబుతారు, మనం నమ్మడమేనా ! నాతండ్రి చాలా అమాయకుడు. అటువంటి పని ఎన్నటికీ చేయడు" అమ్మసమాధానం.

"ఏమే రాజమ్మా ! చూసావటే నీకొడుకు తతంగం. నీటిలో ఈదడమట, నీటిలోమునిగి తేలడమట చూడు, వీడెంతటికి తెగించాడో ? చస్తానో, బతుకు తానో అన్న బెంగ భయం కూడ లేదు, వీడికా తెగింపు ఎచ్చటనుండి వచ్చింది ?" చిట్టయ్య రాజమ్మతో అంటున్నారు.

"ఆ వచ్చింది, మీనుండి మీనాన్ననుండి. మీరు మాత్రం ఏమెరుగని అమా యకపు సుద్దులు. నాటుపనులు మోటుపనులు మీరు మాత్రం చేయలేదూ ? ఆ మాత్రం మీసుగుణాలు మీఅబ్బాయికి అబ్బవా ?" అని రాజమ్మ దెప్పిపొడ వడాలు – ఇదీసంగతి.

"చూడవే రాజమ్మా! ఆ వీధిలో తగువులాఉంది. మన అబ్బాయి లచ్చన్న కాదుగదా ? కాకపోవడమేమిటి మన అబ్బాయే. వాడిని ఏదో అన్నాడట-చిన్న వాడేగానీ వీడికి ఎంత పౌరుషం! ఎవరేమన్నా పడడంట. అందుకని పదిమందిని పోగుచేసి వాళ్ళపై దండయాత్రచేసి వాళ్లనుచితకతన్నాడట. "వీడితో ఎలా గండి ? తెల్లారితే తగవు, వేగలేక పోతున్నాం. ఒరే లచ్చన్నా! ఏమిటిరా ఇదంతా ?" అన్న తల్లి మాటలకు "ఏమిటమ్మా, నీవు మరీను. తప్పు నాది కాదు, అంతా వాళ్లదే. తప్పు చేసిన వారిని తంతే తప్పామ్మా ? "

"నోర్మూయ్యరా నీవు అంతటివాడవయ్యావురా, వాళ్లంతా పెద్దోళ్లు – పెద్దోళ్ల కుర్రాళ్లు తప్పు చేసినా ఒప్పు చేసినా మనంఊరుకోవాలి," "నేను ఊరుకోను" "అయితే చావరా" అని నాలుగు దెబ్బలు, ఐదు తన్నులు తన్ని మూలబెట్టడం, మరుక్షణం తల్లిదండ్రుల కన్నుగప్పి వీధిలోపడడం. "ఒరే లచ్చన్నా! నిన్నటిదినం ఎవరిపైనో చేయిచేసుకున్నావట ? చిలిమంత లేవు. నీవు వారితో తలపడ్డావట, వాళ్ళ తగవుల్లో జోక్యం చేసుకోవడానికి నీవెవడవురా ?" గద్దించిన తండ్రితో, "అదికాదునాన్నా, దౌర్జన్యంగా అనవసరంగా పావం అపిల్లల్ని వాళ్లు కొడుతుంటే వాళ్ళకు బుద్ధి వచ్చేలా నాలుగు తన్ని వచ్చాను తప్పానాన్నా ?" లచ్చన్న మాటల్లో తనుచేసిన పనిలో తప్పు లేదన్న ఆత్మవిశ్వాసం.

"తప్పా తప్పున్నరా! నోర్మూసుకొని మూల పడి ఉండు, తప్పుఒప్పుల్ని నరిచేసేంతటి వాడివయ్యావురా" తండ్రిసమాధానం.

"నాన్నా, నాన్నా, చూపావా ! తమ్ముడు అటువైపు పరుగెత్తుతున్నాడు. తిన్నగా ఆ ప్రక్కమామిడితోటలోనికి వెళ్లడం ప్రతీదినం ఆ చెట్టులెక్కడం, ఆ చెట్టుకొమ్మలనుండి గెంతటమట నాన్నా! ఆతోటల్లో పెద్దపెద్ద పుట్టలు కూడా ఉన్నాయట నాన్నా, పాములుంటాయన్న భయం కూడా లేకుండా ఆపుట్టలెక్కి ఆడటం ఆటనాన్నా !" అన్న సత్యన్నారాయణ మాటలకు చిట్టయ్య "ఒరే తమ్ముడిని పిలుచుకురారా, వాడి భరతం పడతాను" అన్నాడు. లచ్చన్న దగ్గరకు వెళ్లి తండ్రి పిలుస్తున్నారని చెబితే, లచ్చన్న "నీవు నాన్నతో చెప్పావా, నీకేంచేస్తానో చూడు" అని అన్నపైతిరగబడటం. "ఇంటికి వచ్చావా నాయనా! ఆ తోటలోనే ఉండిపోరా. ఆ పుట్టల్లో గట్లల్లో ఉంటూ కాలంగడపరా! నీకేం పోయేకాలంరా, నీకీబుద్ధిమరి తగదు. ఒసే రాజమ్మా! వీడిని బడిలో వేసేద్దాం, అపంతులుగారైనా బాగు చేస్తారేమో" అంటూ పెద్దకొడుకు వైపుతిరిగి "సత్యం! నీవు, తమ్ముడు ఇద్దరు రేపటినుండి మన ఊరు బడిలోనికి వెళ్లండి" అంటూ చెప్పాడు చిట్టయ్య.

"వారు వెళ్ళడమేమిటి" మీరే వెళ్ళి బడిలో వేయండి. మన అబ్బాయిలకేమి తక్కువ; బడిలో వేసేటపుడు అందరి పిల్లలకు చక్కెరకేళీలు పంచుతారుగా, మీరూ కొనిపట్టుకొని వెళ్లండి, పళ్లెంలో బియ్యం పసుపు కుంకుమ గంధం

పెడతాను. పిల్లలకు పంతులుగారిచేత అక్షరాభ్యాసం చేయించండి" అని రాజమ్మ అన్నది. ఎలిమెంటరీ స్కూలు టీచరు సాతాను వైష్ణవ మాష్టారు రంగ నాయకులు వద్ద అక్షరాభ్యాసం లచ్చన్నగారికి జరిగింది. "దండం దశగుణం భవేత్" అన్న సిద్ధాంతాన్ని అక్షరాలా అమలు పరచేవారు, మాష్టారు రంగ నాయకులు "మా పిల్లలు బాగుపడాలి. మా వృత్తిలోనికి మాత్రం రావదు. పెరిగి పెద్దోళ్లయి పెద్దసదువులు చదివి, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేయాలి. వాళ్ళను చూసి మేము మురిసిపోవాలి" రాజమ్మ–చిట్టయ్యల ఆశ, అభిలాష.

# ౬. లచ్చన్నగారి విద్యాభ్యాసం

## విద్యార్థి లచ్చన్న – నాటిసమకాలీన పరిస్థితులు :

కాలం మార్పులతో, చేర్పులతో ముందుకు సాగిపోతూ ఉంటుంది. దేశ కాలమాన పరిస్థితులలో తీవ్రమైన పరిణామాలు ప్రారంభమయాయి. దేశీయమైన బొట్టు, కట్టు విడనాడి ఇంగ్లీషువారి వేషభాషలకు విలువనిచ్చే స్థితిగతులు ఏర్పడ్డాయి. ఇంగ్లీషు బడులు పల్లెపల్లెల్లో కూడ వ్యాపించాయి. భారతమాత దాస్య శృంఖలాలను త్రెంచుకుని రాజకీయ చైతన్య శంఖారావాన్ని పూరించ సిద్ధపడుతున్నది. చిన్న చిన్న సంస్థానాధిపతులు బ్రిటీషు రాచరికానికి తలొగ్గి కప్పాలు చెల్లిస్తూ, ప్రజలనుండి శిస్తుదస్తులను దౌర్జన్యంగా వసూలుచేస్తూ భోగ భాగ్యాల్ని అనుభవిస్తూ రైతుకూలీలను కన్నీళ్ల బతుకులతో కొనసాగనిచ్చే దారుణ పరిస్థితి – పల్లెప్రాంతాల్లో పుట్టగొడుగుల్లా జమీందారీలు వెలసి భూస్వాములను, పెత్తందార్లను సృష్టిస్తూ పైశాచిక కృత్యాలతో కట్టుబడి చెల్లించేవారి పొట్టకొట్టే సన్నివేశాలు, వారి ప్రగల్భాలు, పేదలవోళ్ళు కొట్టి, వారి కడుపులను నింపుకుని జీవించే బడాబాబుల డాబులు, దర్జాలు-ప్రదర్శనలు.

ప్రజాజీవితంలో కొంత చైతన్యం రాసాగింది. మంచి చెడులను విమర్శించి తెలిసికొనే స్థితిగతులను వంతరించుకోగలిగారు. ఒకవైపు చిన్న చిన్న జమిందార్లు వారి ఏజెంట్లు, భూస్వాములు, పెత్తందార్లు వేరొకవైపు సామాన్య ప్రజలు, కష్ట జీవులు, దరిద్రులు మరొకవైపు, ఘర్షణ కొనసాగింది. ఘర్షణ నుండి ఆలోచనా మృతం.

భారతదేశంలో సాంస్కృతిక పునరుజ్జీవనం. ఉద్యమాలు వచ్చాక జాతీయోద్యమ బీజాలు ఏర్పడ్డాయి. దాదాబాయి నౌరోజీ, గోపాలకృష్ణగోఖలే, సురేంద్రనాథ్ బెనర్జీ మొదలగువారు నవభారత నిర్మాణానికి పునాదులు వేశారు. హాలా హలాన్ని నెట్టి అమృతాన్ని అందరకీ పంచిపెట్టాలన్న సామ్యవాద భావాలు నెల కొంటున్నాయి. కులం పేరిట, వర్గం పేరిట, బీదలను స్వదేశ పెత్తందార్లు దోచుకునే పరిస్థితులు. నల్లవారిని, నల్లవారే దోచుకోవడంతో పాటు, ఆ తెల్లవారు కూడ నల్లవారిని అణగద్రొక్క జూస్తున్నారు. ఆనాటి ప్రభుత్వ ఉద్యోగులలో అత్యధిక సంఖ్యాకులు తెల్లవారే. వాళ్ళ దృష్టిలో భారత ప్రజలు కుక్కలు, నక్కలకన్న హీనం. క్రిమికీటకాదులుగా, ప్రజల్ని వారు భావించేవారు. మానవతను మట్టి కలిపి, ప్రజాస్వామ్య భావాల్ని మంటగలిపేవారు.

భారతీయులు కూడ ఇంగ్లీషు విద్యను నేర్చుకోవాలి. వారిని నేర్చుకొనేలా చేయాలన్న బ్రిటీషు విద్యా విధానం వారి భవిష్యత్ నే కురచ పరచింది. శాస్త్రీయ

విజ్ఞానం, హేతువాద ప్రజాస్వామ్య సిద్ధాంతము, సమసమాజం, స్వేచ్ఛ, మానవులంతా సమానులు అన్నభావాల్ని, విద్యాధికుల్లో వ్యాపింప జేసింది. ఆనాడు 5వ తరగతి పాసయిన విద్యార్థి ఈనాడు I.A.S. వానికన్న అధిక గౌరవం, మన్ననల్ని పొందేవాడంటే విద్యాగంధం లేక జనం ఎంతహీనస్థితిలో నుండేవారో అవగతం అవుతుంది.

ప్రపంచం అస్థిరమని, జీవితం అనిత్యమని, వస్తురాశి అంతా భ్రమ అని, ఈ లోకంలోగాక పై లోకంలో ప్రాణి సుఖసౌఖ్యాల్ని, ముక్తి మోక్షాలను పొంది తరిస్తాడని, తరింవాలని, విధివ్రాత నుండి మనిషి తప్పుకోలేడని భారతీయ నాగరిక సంస్కృతి వాదించింది. కర్మసిద్ధాంతాన్ని ప్రతిపాదించింది. వేదాలు ప్రమాణ గ్రంథాలని ఘోషించింది. ఆత్మ, పరమాత్మలను అన్వేషించింది.

భారతదేశంలో ఆనాటి బ్రిటీష్ రాచరిక పాలనలో ఆంగ్లేయ విద్య, శాస్త్రీయవిద్యను ప్రవేశపెట్టారు. భౌతిక ప్రపంచాన్ని తరచిజూచి, అనుభవించే రీతినీతులను మానవ జాతికి చెప్పడం ప్రారంభమైంది. భౌతికశక్తుల ప్రభావాల్ని విప్పిచెప్పింది. భారతదేశానికి వచ్చిన గవర్నర్ జనరల్స్ లో అనేకమంది భారతీయులు విజ్ఞానవంతులు కావాలని కోరారు. ఆమేరకు కొంత ప్రయత్నం చేశారు. భారతీయులకు స్వపరిపాలనా విధానాన్ని చేపట్టేలా శిక్షణను ఇవ్వదలిచారు.

లార్డ్ బెంటిక్ సతీసహగమనము నిషేధిస్తూ మూఢాచారాల్ని ఖండించాడు. రిప్పన్ స్వపరిపాలనా విధానాన్ని ప్రవేశపెట్టాడు. లార్డ్ మెకాలే ఇండియాలో ఇంగ్లీషు విద్యావ్యాప్తి అవసరమని వాదించి, బ్రిటీష్ రాచరికాన్ని ఒప్పించగలిగారు.

జాన్ బ్రైడ్ గ్లాడ్ స్టన్, లార్డ్ నార్త్ బ్రూక్, లార్డ్ సాలిస్ బరో, లార్డ్ ఎడింబరో మొదలగు ఆంగ్లేయులు ఉన్నతాశయాలను, ప్రజాస్వామ్య భావాలను ఇండియాలో కూడ వ్యాపింపచేశారు.

వందేమాతరం నినాదంతో 1920లో హిందువులు ఉద్యమాలు సాగిస్తున్న దినాలు. ఇంగ్లీషు బడులు వ్యాపిస్తున్న కొద్దీ, పాతభావాలు, మూఢదురాచార దుష్టసాంప్రదాయాల పట్టు సడలిపోవడం ప్రారంభమైంది. భారతీయ విజ్ఞాన సంస్కృతి పునరుజ్జీవనం పొందింది. నవీన భాష్యాన్ని, నూతన విధానాన్ని పొందడం ప్రారంభించి భారతీయనాగరికత, సంస్కృతి ఎంత గొప్పవో, ఆనాటి మనదేశ విద్యాధికులు, చదువరులు ఆంగ్లభాషలో చదువుకొని, తెలిసికొనే స్థితిలో ఉండేవారు.

స్వదేశీయుల్లో, సాంఘిక మార్పులు రాసాగాయి. రాజకీయ మార్పుల కోసం ప్రజలు కలలు కంటున్నారు. జాతినుద్ధరించాలన్న భావాలు స్వదేశీయుల్లో కలిగించి, బానిసత్వంలో మ్రగ్గుతున్నామన్న భావం బాగా బలపడింది.

భారతీయ జీవన స్రవంతి కొనసాగేలా దీక్షవట్టిన, స్వదేశీ విద్యాధికులు, విజ్ఞానులు బయలుదేరారు. భారతీయుల న్యాయమైన హక్కులను సాధించటానికి నడుంకట్టారు. "స్వరాజ్యం జన్మహక్కు" లాంటి నినాదాలు బయలుదేరాయి. "వందేమాతరం" లాంటి ఉద్యమాలుగూడుకట్టుకుంటున్నాయి. స్వీయ సంస్కృతి, నాగరికత వర్ధిల్లాలన్న ఆకాంక్ష వెలరేగింది. భారతీయులు అన్నిట్లో సమర్థులు, ప్రతిభాసామర్థ్యాలలో ఎవరికీ తీసిపోరు అని నిరూపించుకోవటానికి సిద్ధపడుతున్న ఘడియలు.

చదువరులకే గాక, చదువురాని నిరక్షరాస్యులకు కూడ జాతీయ భావాలు మొలకెత్తే మధుర ఘడియలు. దేశభక్తి, జాతీయభావం ఎల్లెడలా ప్రస్ఫుటమవుతున్న తరుణం. స్వరాజ్యసాధన, భారతీయుల హక్కులు, ప్రజాస్వామ్య పాలన, జీవనవిధానం, స్వేచ్ఛా సమానత్వాలు ప్రజ్వరిల్లుతున్న వాతావరణం.

దాదాబాయి నౌరోజీ, ఆనందాచార్యులు, గోఖలే, బెనర్జీ, బాలగంగాధర తిలక్, సురేంద్రనాథ్ బెనర్జీ, మదన మోహన మాలవ్య, లాలాలజపతిరాయి, ఫిరోజిషా మెహతా, ఆనంద మోహన్, బోస్, మన్ మోహన ఘోష్, పండిత అయోధ్య నాథ్, కాళీచరణ బెనర్జీ, R.N. ముదోల్కర్, గంగాప్రసాదవర్మ, శంకరన్ నాయర్, కేశవపిళ్లై, బిపిన్ చంద్రపాల్, అంబికాచరణ మజుందార్, భూపేంద్ర నాథబోస్, న్యాపతి సుబ్బారావు, సచ్చిదానందసిన్హా, భారత దేశమందలి పలు ప్రాంతాల నుండి, రాష్ట్రాలనుండి ప్రతిధ్వనించిన స్వాతంత్ర్య పోరాట సమర శంఖారావాలు – బ్రిటీషు నిరంకుశ పాలనా విధానానికి ప్రతిఘటనలు ; దేశం నలుమూలల జాతీయ భావం, స్వాతంత్ర్య కాంక్ష, స్వేచ్ఛా – సమానతా భావాలు ఎక్కువ పొందుతున్న సువర్ణకాలం.

ఉత్తరాంధ్రను కళింగసీమ అనికూడ వ్యవహరిస్తారు. కళింగసీమలో ఉద్యమం నాటికేకవనాలకు ప్రతీతి. దీనికి అతి దగ్గరగల బారువా కూడా సమకాలీన పరిస్థితులకు లోనవుతూ వచ్చింది.

ఇంగ్లీషు బడులలో పిల్లల్ని చేర్పించడం, దరాగా, గొప్పదనంగా భారతీయులు భావించేవారు. ఇంగ్లీషు నాలుగు అక్షరాలు వచ్చి, ఆంగ్లంలో నాలుగు మాట మాట్లాడగలిగినా, ఇక ఆ చదువరి భవిష్యత్ బంగారు బాటే. అది నాటి పరిస్థితి. మ్యాట్రిక్యులేషన్ చదివిన వారికి ఆనాడు ప్రభుత్వంలో పెద్ద హోదాగల ఉద్యోగం వచ్చేది, కోరుకున్న పదవి దొరికేది. అధికారిగా చెలాయించే అవకాశం ఎవ్వరి అండదండలు అవసరం లేకున్నా వచ్చేది

ఆంగ్లము చదివినవాడు అధికారో, ఉద్యోగో అయి తీరవలసిందే. అవసరం లేదను కునేవాడు జాతీయవాదే. చదువుకున్న భారతీయ సంతతినెల్ల తూర్పు ఇండియా కంపెనీ సంగ్రహించేది. బ్రిటీషువారి దేశపాలనను కొనసాగించాలన్నా, ఉన్నత మైన పదవుల నధిష్టించటానికి లండన్ నుండి తెల్లదొరలు వచ్చేవారు. ఇక క్రింది పదవులన్నింటిని నిర్వహించవలసింది భారతీయులే కదా! ఎక్కడలేని గిరాకీ ఉండేది. ఒకవైపు ఉద్యోగం, వేరొకవైపు సంఘంలో గౌరవం లేదా అంతస్థు, గుర్తింపు, ఎక్కడలేని ఆదరాభిమానాలు లభించేవి.

కులాల కుమ్ములాటలలో, వర్ణ వర్గ విన్యాసాలలో, వ్యత్యాసాల దోపిడిలో, మతంపేరిట జరిగే దారుణ హోమాలలో సతమతమౌతూ సనాతనంగా వస్తున్న భారతీయ సమాజం మార్పులను, చేర్పులను సాదరంగా ఆహ్వానించింది. సనాతన మూఢాచారాలకు ప్రాముఖ్యమివ్వని సాంఘిక పరిస్థితుల్ని సృష్టి స్తున్నందుకు సహకరించింది.

## బారువాలో ఎలిమెంటరీ విద్యాభ్యాసం (1916–17) :

చిట్టయ్య - రాజమ్మలు చిరకాలవాంఛ తీర్చుకోవాలన్న కోరిక, సాధించా లన్న పట్టుదల ఏమిటంటే, స్వీయవృత్తిలోనికి వారి పిల్లల్ని దించకుండా చదువులను చెప్పించి, పిల్లలు ఉద్యోగాలు చేయగా చూసి సంతోషించడం.

బారువాలో గల ఎలిమెంటరీ స్కూల్లో లచ్చన్నను చేర్పించారు. అన్నయ్య సత్యన్నారాయణ బుద్ధిగా చదువుకోవడంతో పేరు పడ్డాడు. తమ్ముడు లచ్చన్న కూడ ప్రాథమిక పాఠశాలలో అడుగిడినాడు. బడికి వస్తూ పోతున్న తమ పిల్లలిద్దరినీ చూచి చిట్టయ్య - రాజమ్మ లిరువురు తమలో తాము ఉప్పొంగి పోయేవారు. పెద్దింటి పిల్లలతో సరిసమానులుగా వారిపిల్లలు చదువుతున్నారు. అగాధంలో, అజ్ఞానంలో విజ్ఞానపు కాంతిరేఖలు సామాన్యమా! సాహస కృత్యానికి మారుపేరు, చైతన్యానికి మారుపేరు! ఒకమారు చిట్టయ్య మీసం దువ్వు కున్నాడు. రాజమ్మ ఎంతో గొప్పగా మురిసిపోయింది. అది 1916 వ సంవత్సరం. లచ్చన్న వయస్సు 7వత్సరాలు. ఎలిమెంటరీ స్కూల్లోకి అన్నయ్య సత్యన్నారాయణతో కలసి వెళ్ళడం రావడం జరిగేది. తిరిగిన కాళ్ళు, తిన మరిగిన నోరు ఊరుకుండలేవన్నది సామెత. అన్నయ్యతో బయలుదేరిన తమ్ముడు మరల ఇంటికి రావడం స్కూలునుండి కాదు, ఏపొలంనుండో, ఏతోట నుండో, ఏ చెఱువునుండో. అల్లరి పిల్లలతో ఆడుకుంటూ, కేరింతలతో రావడం జరిగేది.

"ఏమిరా స్కూలు విడిచి ఎటు వెళ్ళావు" అంటే సమాధానం వెక్కిరింపు, ఏడుపు, దబాయింపు, దౌర్జన్యం. చిన్నారి మనసులో చిందులేస్తున్న ఉత్సాహ తరంగాలు, పొంగిప్రవహిస్తున్న ఉద్రేకభావాలు, ఎగిరి గంతేస్తున్న తీవ్రవాద

వాదనలు, తల్లిదండ్రులను కాని, ఇతరులను గాని, వారి మాటలను గాని పట్టించుకొనే స్థితిని కల్పించలేదు.

ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్న లచ్చన్న తరగతిని దాటి పైతరగతికి వెళ్తున్నకొద్దీ అంతకన్న ఆకతాయితనంకూడ అంతకు వెయ్యింతలు అభివృద్ధి అయింది. అల్లరిగా తిరగడమే తన ఆయుర్దాయానికి ఆధారమన్న రీతిని వ్యవహారం సాగేది. ప్రతీదినం స్కూలుకు బయలుదేరి తోటల్లోకి వెళ్ళి చెట్లెక్కడం, గెంతడం, కాలుచెయ్యి విరగ్గొట్టుకోవడం, కాయల్ని, పండ్లను, దొంగతనం చేయడం, నీటిలో ఈతలు కొడుతూ నిత్యం బడి యెగగొట్టడం, తన జట్టును ఒకదానిని ఏర్పరచుకొని ఇతరులపై దండయాత్ర చేయడం, ఎవరికో, ఏదో దౌర్జన్యం జరిగిందని, ఆ పిల్లల్ని పట్టుకొని బావమోదడం, అల్లరి జీవితం తప్పించి చదువులపై కనీసపు శ్రద్ధాపక్తులు ఉండేవి కావు.

ఈ పరిస్థితిని జూచిన చిట్టయ్యకు ఆవేశం, కావేశం అగ్నిలా లేచేది. కడుపు మండేది. కొడుకును జూచి పొంగిపోవలసినవారు క్రుంగిపోవడ మేమిటి ? మేమేదో కాయకష్టం చేసి యిలా బ్రతుకుతున్నాం. కల్లంగడిని పెట్టుకుని జీవిస్తున్నాం. వీళ్ళయినా కాస్త చదువు చదివి మమ్మల్ని ఉద్ధరిస్తారను కుంటే వీడి వరస ఇదా ? బాగా చదివి పెద్దవారై మావంశానికి పేరు తెస్తారని, భావించినమా బంగారు కలల్ని ఇలా కరగిపోవడమేనా ? లేదు, మేము పెట్టుకున్న ఆశలు సాధించితీరాలి, వీడి పని పడతాను, చాకిరేవులా ఒకబాదు బాదుతేనే తప్ప వీడిక దారిలోకి రాడు.

"ఒరే లచ్చన్న, నీ కాళ్ళూ చేతులూ విరుస్తాను, ఇలారా" చేతికి వచ్చిన దెబ్బ కాళ్ళకు వచ్చిన తన్ను తగిలాయి. పాపం చిన్నప్రాణం. తండ్రి చితక గొట్టడం. ప్రాణం విలవిలలాడింది. మొర్రో, కుయ్యో అని తల్లి ప్రాణం మొత్తుకుంది. కొడుతుంటే వద్దనలేకపోయింది. కొడుకు బాగుపడి ప్రయోజకు డవాలన్న వాంఛతో కుమిలిపోయింది. స్పృహతప్పిపడిపోయిన బాల లచ్చన్న ఎంతసేపటికి లేవకపోవడంతో, తల్లిదండ్రులు ఘొల్లుమన్నారు. ఉలుకు పలుకు లేకపోయే వరికి, వీరి గుండెలు ఆగిపోయే పరిస్థితిని తెచ్చు కున్నారు. వారికి కాళ్ళాడలేదు. ఊపిరి బిగబట్టుకున్నారు. నిర్జీవంగాపడివున్న చిన్నకొడుకును జూస్తూ లేవనెత్తారు. గుండెలు బాదుకొన్నారు. ఇంతలో ఏం జరిగింది అంటూ, చుట్టుప్రక్కల కుటుంబాలవారు పరిగెత్తుకు వచ్చారు. ఏ ఒక్కరి నోటినుండి మాటరానివరిస్థితి, అందరి కళ్ళంట నీళ్ళొచ్చాయి. చూడ ముచ్చటగా, ముద్దుగా ఉన్న బాల లచ్చన్న సొమ్మసిల్లడం చూచి ఎవరికి సాహసం చాలిగలగదు ! "చిట్టయ్యా ! నీ తీరు బాగులేదురా ? ఏంటిరా చదవా లంటావు ? ఏం చదువు లేకపోతే మనమంతా బ్రతకలేదటరా?" అని గద్దించింది ఆ వంతు ముదుసలి. "ఏమిటో ఈ చిట్టయ్యగాడి అత్యాశ కాకపోతే వంటా,

యింటాలేని చదువుసంధ్యలు, మనకెలావస్తాయిరా? నీ తాతతండ్రులు చదివార్రా! నీకొడుక్కిచదువెలా వస్తుందిరా? బావకొడితే చదువు సాగుతుందా?" అని సాగదీశాడు చిట్టయ్య సమవయస్కుడు.

"అమ్మా రాజమ్మా! ఎందుకమ్మా ఆ అబ్బాయిని అలా బావమోదటం? చదివి ఏం ఉద్ధరిస్తాడని? ఊళ్ళుఏలతాడా? దేశానికి రాజవుతాడా? మన కులం ఏమిటి? మనబ్రతుకేంటి? గొంతెమ్మ కోరికలతో బతుకుల్ని పాడు చేసుకోకూడదమ్మ" అని సాటి కుటుంబీకుని గొంతు అక్కసుతో అరచింది.

ఎవరేమంటున్నా చిట్టయ్య - రాజమ్మలు వినిపించుకునే పరిస్థితిలో లేరు. కొడుకు ఏమవుతాడో అన్న బెంగతో ఊపిరి బిగబట్టుకొని ఉన్నారు. ఇంతలో లచ్చన్నకు మెలకువ వచ్చింది. మెల్లగా లేచాడు. ఏడుపులేదు, ఏడుపుముఖం లేదు. నిద్రనుండి లేచినట్లు లేచాడు. [ఎదురు దెబ్బలు తిన్నను వెన్నుచూపని గుండె ధైర్యం, వెన్నుపోటు పొడిచినా ఓడిపోని మనస్తత్వం; ఆ దైవం జన్మతః లచ్చన్నకు ప్రసాదించిన వరాలేమో?] ఒడిలోనికి తీసుకున్న చిట్టయ్యకు కళ్ళ వెంట నీళ్ళు రావడం ఆగలేదు. రాజమ్మకు ఆవేశం పొంగి పొరలి 'ఏమి' అనలేని నిస్సహాయతతో ఉండిపోయింది. "ఏమయ్యా, ఇక నుండి అబ్బాయిని ఏమనొద్దు. వాడిరాత ఎలా ఉంటే అలా ఉంటుంది" అన్న ఇరుగు పొరుగు వాళ్ళ మాటలకు చిట్టయ్య మౌనం వహిస్తూ, వెయ్యిదేవుళ్ళకు మనసులో మ్రొక్కుకున్నాడు. ఇకపై పిల్లల్ని కొట్టకూడదని ఒట్టేసుకున్నాడు. పిల్లలపై వచ్చినకోపాన్ని దిగమ్రింగుకున్నాడు. పిల్లవాడిని ఎలా అదుపులో పెట్టాలా అని ఆలోచించాడు. పెద్దబ్బాయి సత్యన్నారాయణ బుద్ధిగా వెళ్ళి చదువుకుంటున్నాడు. మరి ఈ చిన్నబ్బాయి ఎందుకిలా అయ్యాడు? వీడిని ఎలా దారిలో పెట్టాలి? ఏ మాష్టారికైనా అప్పజెప్పి వారి చేతుల్లోపెడితే బాగుంటుందన్న నిర్ణయానికి వచ్చాడు. తలుపుల సూర్యనారాయణ అనే స్కూలు హెడ్మాష్టరు బాల లచ్చన్నని ఎంతగానో అభిమానించి మంచి దారిలోనికి తీసుకొనిరావాలని ప్రయత్నించేవారు. ఆ మరునాడు బారువా హయ్యర్ ఎలిమెంటరీ స్కూల్లో అసిస్టెంటుగా పని చేస్తున్న కోడిగంట నరసింహంగారి ఇంటికి వెళ్ళాడు. ఈ కోడినాగును ఆ కోడిగంట నరసింహంగారికి అప్పజెప్పాలని అతని కోరిక. నరసింహం బోడవరం నుండి వచ్చినవాడు. యఫ్.ఏ. చదివాడు. జమిందారు పిల్లలుకూడా అతని దగ్గర విద్యనభ్యసించేవారు. ఐదవ తరగతి పాసయినా, పోయినా, అయ్యవారి ఉద్యోగం దొరికే రోజులవి. ఈనాడు అత్యధిక సంఖ్యలో విద్యాధికు లున్నందున ఏ ఒక్కరిని ఏ ఒక్కరు అపురూపంగా, అతి పెద్దగా భావించక పోయినా, ఆనాడు ఎమ్. ఏ. చదువుకున్న వారికి సంఘంలో గల గౌరవము గొప్పదనము వర్ణించటానికి అలవే కాదు. స్కూళ్ళుకూడ ఎచ్చటెచ్చటనో ఉండేవి. జిల్లాకేంద్రాల్లోనే హైస్కూళ్ళుండేవి. బారువాలో 8వ తరగతి వరకు

ఉండటం ఆనాటి బారువా ప్రజల భాగ్యమనే చెప్పాలి. ఎలిమెంటరీ విద్యను సంపాదించిన వారెల్ల, అమిత విద్యావంతులుగా చలామణి అయ్యేవాళ్ళు. ఇక హైస్కూల్లో విద్యను పూర్తి చేసినచో అవ్యక్తి అదృష్టం ఏమనాలి ? బ్రతుకంతా బంగారుబాట. సంఘంలో గౌరవము హెూదా దర్జాలు లభించేవి. 'ఊ' అంటే ఉద్యోగము లభించేది. విద్యావ్యాప్తి జరుగని దుర్దినాలవి. ప్రజలంతా యింకా విద్యను పిల్లలకు చెప్పించాలని మోజుపడని రోజులవి. ఇంగ్లీషు విద్యచెప్పిస్తే పిల్లలు చెడిపోతారని, అప్రాచ్యులౌతారని కూడ భావించే చీకటియుగమది. అమరాంధ్ర కావ్యాల చదువుతో సరి పెట్టుకుంటే పుణ్యం, పురుషార్థం రెండూ లభిస్తాయనే ప్రచారం బాగాఉండే కాలం అది.

బాలలచ్చన్నను వెంటనిడుకొని ఇంటికి వచ్చిన చిట్టయ్యను జూచి "చిట్టయ్యా ! నీవెంతైనా నిజానికి కొనియాడ దగిన వాడవయ్యా! ఈ చీకటి యుగంలో కల్లంగడివి పెట్టుకొని జీవిస్తున్న నీవు యిలా నీ కొడుకులను విజ్ఞానవంతులుగా చేయబూనడం ఎంతయినా గొప్పవిషయం సుమా. తప్పక నీకొడుకును బాగు చేస్తాను. వాణ్ణిదుపులోవుంచి చదువుకొనేలా చేస్తాను. అల్లరి పిల్లవాడైన మా అబ్బాయి అంటే నాకు ఎంతో ఇష్టము చిట్టయ్యా" అన్న మాష్టారి మాటలకు చిట్టయ్య ఆశ్చర్యపడ్డాడు.

"కావు చిట్టయ్యా ! ఇటువంటివారే రేపు తనకైన, దేశానికైన ఏమైనా చేయగోగలరు. పిరికివారు, మొద్దులు బాగుపడే దేముంది ? ఇతరులను బాగు చేసేదేముంది ?"

"బాబుగారూ - మీకష్టం ఉంచుకోను, మాపిల్లవాడిని దారిలో పెట్టండి. వాడు బాగా చదివి మా వంశాన్ని ఉద్ధరించాలి. మా అందరిలో పేరు తెచ్చుకోవాలి. మేస్తోడపిల్లాడుగా మాపిల్లాడు పెరిగి పెద్ద పెద్ద ఉద్యోగాలుచేస్తే మేము చూడాలి. మీ అంతటి వాడు మావాడు కావాలి బాబుగారూ" కొడుకు ఉన్నతిని కోరే కొండగా చిట్టయ్య తన ఆశను వ్యక్తం చేశాడు.

"తప్పక నీకోరిక నెరవేరుతుంది చిట్టయ్యా" అన్న అయ్యవారికి తనతో తెచ్చిన అరటిపళ్ళ గెలను, మామిడి పండ్ల గంపను ఇంటిలో పెట్టాడు.

ఆనాడు పిల్లాడిని అయ్యవారికి అప్పగించడం అంటే ఈనాడు ప్రయివేట్ ట్యూషన్ వంటిదికాదు. కేవలం ఈనాడు వలె రేట్లు పెట్టి చదువును వారికి చెప్పడం కాదు. వారికి విద్యాబుద్ధులతో పాటు క్రమశిక్షణ, సౌశీల్యాన్ని బోధించే బాధ్యత కూడా ఉండేది. గురుభావం, సేవాభావం ఉండేది. విద్యను బోధించడం ఆనాడు ఒక పవిత్రమైన కార్యం. విద్య దానంగా భావించేవారు. జ్ఞానోదయాన్ని కలిగించే మహాత్తర వ్యక్తి గురువు. గురువే దేవుడు, మహేశ్వరుడు. ఆనాడు గురువు

ఆజ్ఞను ధిక్కరించటం అనేది అపవిత్రంగా భావించేవారు. తల్లిదండ్రుల కన్న గురువు మిన్న అన్న భావం గల దినాలవి.

నరసింహస్వామి పంతులుగారన్న చిట్టయ్యకు అమిత గౌరవం. ఆకతాయి లచ్చన్న అన్నా పంతులుగారికి ఎంతో ప్రీతి. ఆబాలునిలోగల భవిష్యత్ రూపు రేఖల్ని మానసిక జిజ్ఞాసను దృష్టిలో వీక్షించగలిగారేమో ?

ఆనాటి పంతుళ్ళను అయ్యవార్లని పిలిచేవారు. ఇంగ్లీషువిద్య వ్యాపిస్తున్న కొద్ది 'మాస్టార్లు' అని పిలవబడుతూ వచ్చారు. పల్లెల్లోగల అయ్యవార్లకు పాలు, పెరుగు, మజ్జిగ, కూరగాయలు, ఒకటేమిటి పల్లె ప్రజలు వారికి కావలసినవి భక్తి భావంతో సమర్పించే వారు. వారి పిల్లల బ్రతుకులను దిద్దు మహనీయులుగా వారిని భావించేవారు. అయ్యవార్లకు తప్పించి ఆగ్రామములో ఉత్తరంముక్క కూడ రాసే చదువరి ఒక్కరు కూడలేని దారుణ పరిస్థితి, అజ్ఞానం, అమాయకత, మూఢనమ్మకాలు విచ్చల విడిగా సంచరించే కాలం.

"బాబుగారూ ! మా చిన్నోడ్ని మీదగ్గరే ఉంచుకోండి. మీ ఇంటివద్దనే చదువు చెప్పండి. మా ఇంటికి తిండికి తప్ప మరెప్పుడూ పంపించవద్దు. మావాడ్ని మీఅంతటివాడ్ని చేయండిబాబు మీమేలు మరచిపోను, మీకు ఋణపడి ఉంటాను."

నిరక్షరాస్యుడు, వెనుకబడిన కులస్థుడు, అమాయకుడు, అజ్ఞాని అయిన చిట్టయ్యకు తనబిడ్డపైగల మమకారానికి పంతులు నివ్వెరపోయాడు. తన కుమారుడు బాగుపడాలని తనవృత్తిని గాక పెద్దఉద్యోగస్తుడవాలని, సమాజంలో గౌరవం సంపాదించాలని, ఉన్నత కుటుంబాల్లో ఉన్నవారితో సరితూగాలని, న్యూనతతో తక్కువ కులం అన్న అవమానంతో ఇతరులవల్ల తను పొందుతున్న మానసిక బాధను తన కుమారులు అనుభవించరాదని, ఉన్నత కులస్థులవలె తన సంతానం పెద్దదై పెద్దచదువులు చదివి ఉద్యోగాలు చేసి వారితో సరిసమానంగా కూర్చోవాలి, సరిసమానంగా గౌరవింపబడాలి, వారితో సరిసమాను లనిపించు కోవాలి, అని చిట్టయ్య ఆలోచిండమేగాక, నిత్యం తన కొడుకులు చిన్న వారైనా వారిచెవుల్లో నూరిపోసేవాడు. తన సంకల్పమే తుదకు నెరవేరింది, తీరింది. ఆతండ్రికి ఋణపడి ఉండాల్సింది తన తనయుడు లచ్చన్న మాత్రమే కాదు, మనసమాజ మందలి బలహీన వర్గమంతా నేడు ఆ చిట్టయ్యను నిత్య స్మరణ చేయనిదే ముక్తిరాదు, విముక్తి లేదు.

"ఏంరా చిట్టయ్యా ! కొడుకును పంతులుగారికి అప్పగించావట ? బాగా పంతులు గారికి మేపుతున్నావట కద ? కావలసినవన్ని ఆ పంతులు ముంగిట్లో పోస్తున్నావటగా ? ఏంటి నీకొడుకు గొప్పవాడయిపోతాడనే ?

ఎలా అయిపోతాడు కులాలన్నింటినీ కలిపేస్తాడా ? పెద్దింటి వాళ్ళతో సమాన మైపోతాడా మన బ్రతుకుల్ని మార్చేస్తాడా?"

"పోరా సన్నాసీ ! కల్లంగడికి వచ్చిన నీవు కల్లు త్రాగినట్టు మాటాడకురా, ఈ కులాలన్నీ కూడనివిరా. నాకంతా తెలిసిపోయింది. బర్మాలో ఈ కులాలు కూతలు లేనేలేవు. గొప్పకులం తక్కువ కులం, యిక్కడేఉంది. అచ్చట లేనే లేదు. ఉన్నదంతా ఉన్నవారు లేనివారే. చాకలి అని, మంగలి అని, కుమ్మరి అని,కమ్మరిఅని, సెగిడెకులస్థులని మనల్ని అంతా అంటారు. "ఒరే" అని పిలిచినా కుక్కవ పేనుల్లా మనం ఉంటాం. కోపమొస్తే తిడతారు, తంతారు. వాళ్ళు పెద్దోళ్లు. కాళ్ళుచేతులు పట్టుకుంటాం. మన కులాల్లో ఉన్న పెద్దవారిని కూడ "ఒరే" అని పిలుస్తే, వోర్మూసుకుని ఉంటాం."

"అంతకన్నా ఏంచెయ్యగలంరా చిట్టియ్య ? మనకు ఆస్తిపాస్తులు లేవు. అంతస్థులు అసలేలేవు. చిన్న కులాల్లో పుట్టాము" అని ఎదుటివారు అంటే జవాబుగా "అందుకే మనం ముందుచూపుచూడాలి. మన పిల్లల్ని మనలాగ బతకనివ్వ కూడదు. చదువుకున్నవా డేకులానికి చెందిన వాడైనా ఉద్యోగం ఇస్తున్నారు. ఉద్యోగం అంటే ఊళ్ళు ఏలటమే కద. డబ్బుకు డబ్బా వస్తుంది. గౌరవం, హోదా వస్తుంది. యింక మనిషికి కావలసిందేమిటి ? ఈనాడు మన కులాల్ని యీసడిస్తున్న ఈ పెద్దలు మన పిల్లలు బాగుపడి చదువుకొని ఉద్యోగస్థులయితే వారిపనుల గురించి వాళ్ళ వద్దకు వెళ్తారు, వాస్తారు. అప్పుడు ఎవరు గొప్పోళ్ళు, ఎవరు చిన్నోళ్ళు చెప్పండిరా ?" అంతులేని ఆత్మ విశ్వాసంతో అన్న చిట్టియ్య సమాధానానికి అంతా చల్లబడ్డారు.

నిజానికి అనాడే చిట్టియ్య తప్పటడుగు వేసి లచ్చన్నను కులవృత్తిలోనికి తోసేస్తే ఈనాడు బలహీనవర్గాల ప్రజానీకం ఇంకా వేయేండ్లు వెనుకబడి ఉండే వారేమో !

సమాజంలో పీడితులన్నా, పంచములన్నా లచ్చన్న గారికి జన్మతః జాలి. వారి ఉద్ధరించి తీరాలన్న పట్టుదల, దీక్షా కార్యక్రమమే అతని జీవితం. సర్వ్యులపట్ల సమభావం జాలి–ప్రేమ ఆతని జీవితంలో పరిపూర్ణంగా వెలసిన విలక్షణాలు.

శ్రీ వరసింహ స్వామి పంతులుగారు కేవలం ఉపాధ్యాయవృత్తిని నిర్వహించడమే తపవిధిగా పెట్టుకోలేదు. అంతకన్న తనకు దేశం పట్ల అభిమానం ఉండవి నిరూపించేవారు. కొందరు బ్రతకడమే ధ్యేయమని తన వృత్తితో సరిపెట్టుకుంటారు. జీవితానికి ఒక లక్ష్యం, ఒక ఆశయం ఉండాలని అంతకుమించి ఆలోచిస్తారు కాని ఆచరణలో వాటిని సాధిస్తారు పంతులుగారు.

ఆయన జాతీయవాది. ఖద్దరుధారి. ఆనాటికాలంలో ఖద్దరును ధరించడం, ఆత్మ సంయమనంగలవారికే సాధ్యం. నిరాడంబరతకు, సాధుశీలతకు అది తార్కాణం. దేశభక్తికి చిహ్నం. ప్రతిదినం స్వరాజ్యం పేపరును తెప్పించుకొని చదివేవారు. పత్రికాపఠనం చేసేవారు. ఈనాడువలె ఆనాడు ప్రకటనలతో పత్రికలునిండి ఉండేవి కావు. కేవలం దేశవార్తలను గుప్పించేవి.

తనవద్దనున్న పిల్లలకు కేవలం పాఠాల్ని బోధించడమే ధ్యేయంగా భావించ లేదు. దేశవిషయాల్ని వారికి బోధించేవారు. ఆ పిల్లల మస్తిష్కంలో దేశం అంటే ఏమిటో ఒక రూపం ఏర్పరచ సాహసించేవారు. సాహసికులయిన విద్యార్థులన్న ఆయనకు అమిత ప్రీతి. అందువలన లచ్చన్న అంటే అతనికి అమితమైన అనురాగం. ధైర్యసాహస గుణాలున్న ఈనాటిబాలలే రేపు స్వరాజ్యసాధనకు పనికి వస్తారని తను భావించేవారేమో ?

పంతులుగారు ఎంతకట్టుడిలో పెట్టడానికి ప్రయత్నిస్తున్నా లచ్చన్న తన అల్లరితనాన్ని తగ్గించుకోలేదు. లచ్చన్న దృష్టి ప్రతి నిమిషం ఏదోఒక ఆకతాయి పని, అల్లరి చేద్దామనే. భయపెడితే లొంగేరకం కాదని పంతులుగారు పసికట్టారు.

"ఒరే లచ్చన్నా ! పాఠాలు చదవరా ! బాగుపడతావురా ! అల్లరిపనుల్లో తలదూర్చడం ఎందుకు ? మీ తలిదండ్రులను, గురువులను ఏడిపించ కూడదురా ! అయినా నీమీద నాకు కోపం లేదు. తప్పక నీవు బాగుపడతావు" అని భుజం తట్టేవారు.

లచ్చన్న ఎల్లప్పుడు పంతులుగారింట్లోనే ఉండటంవలన, అతని చర్యలలో కట్టుబాటు వచ్చింది. పంతులుగారు బ్రాహ్మణులు. వంటచేసుకునేవారు. వంటకు సహాయకారులు ఈ శిష్యులే. కాయగూరలు, పాలు, పెరుగు అన్నీ ఈ శిష్యులే సమకూర్చేవారు. గురువుగార్కి సహాయపడటం లచ్చన్నకు అదొక అనుభూతి. వంటవండటానికి సహాయపడుతూ ఉండేవారు.

కులం, మతం కుళ్ళుతో కులికే సంఘంలో పంతులుగారు కులభేదం పాటించకుండా వీళ్ళందర్నీ తనింట నిడుకొని వీరిచేత వండించుకొని తినడం నలుగురికి ఆశ్చర్యమే కలిగేది. నలుగురూ తనని తక్కువకులంవాడని జూచినా తన గురువు తనని అలా చూడక నలుగురితో సరిసమానంగా చూస్తున్నారు అనే భావంవల్ల ఆ పిల్లల్లో ఆయనంటే గొప్ప గౌరవం ఏర్పడింది. లచ్చన్నకు పంతులుగారిపై అమిత ప్రేమాభిమానాలు ఏర్పడ్డాయి. బ్రాహ్మణుడయిన పంతులు గారు తనని నీచంగా తక్కువగా చూడలేదు. అయితే ఆ గ్రామములోగల ఇతర బ్రాహ్మణులు తనని తక్కువవానిగా హీనంగా చూడటం — తన అరికాళ్ళలో మంటలెక్కేవి. అంటరానివారని, అట్టడుగున వున్నవారని, వెనుకబడిన

వారని, హీనకులస్థులని ఆ గ్రామసులు భావించినా, పంతులుగారు మాత్రం లచ్చన్నను తన బిడ్డలా చూడటంవల్ల లచ్చన్న ఆలోచనలో మంచి మార్పు వచ్చింది. శిష్యులలో సమతాబీజాల్ని నాటిన గురువు శ్రీ నరసింహ స్వామిగారే. గొప్పవారు, తెలిసినవారు, పెద్దకులసులు, గురువులయిన మాస్టారు గారు, మాపట్ల యిలావున్నా తక్కిన గ్రామంలోగల ప్రజలు మమ్మల్ని ఎందుకలా చూస్తారు ? కులం, వర్గం లేనివాడినని ఎవరయినా అన్నారా వాళ్ళ కాళ్ళు చేతులను ఊడబెరకడం అన్న ఉద్రేకానికి అప్పుడప్పుడు లచ్చన్నగారు లోనవుతూ ఉండేవారు. అటువంటివారిని శిక్షించాలి. అటువంటివారిపై దౌర్జన్యం జరపాలి వారిపై తిరుగుబాటు చేయాలి. తిరుగుబాటు మనస్తత్వానికిదే కారణభూతమైన దేమో !

లచ్చన్న తనఅన్న సత్యన్నారాయణకన్న ఐదేండ్లు చిన్న. అయినప్పటికీ 8వ తరగతికి వచ్చేసరికి లచ్చన్న తన అన్నయ్యతో కలిసారు. అన్నయ్యకు అల్లరి అంటే తెలియదు. అయితే చదువులోకూడ ఏమీ హుషారుకూడ లేదు. లచ్చన్న అల్లరి పెట్టినా తుదకు అన్నిక్లాసులు పాసయి ఎనిమిదవ తరగతిలో అన్నయ్యను కలిసారు. కృషి, అభ్యాసం, దీక్ష, పట్టుదల లేని కుర్రాడు చదువులో ఎలా నెగ్గుకు రాగలడు ? శ్రద్ధాసక్తులకు లోటులేదు. తను తలచుకోవాలే తప్ప పరీక్ష అలా తప్పడమన్న ప్రసక్తేలేదు. నాల్గవ తరగతిలో రెండు సార్లు, అయిదవ తరగతిలో ఒకసారి, ఆరవ తరగతిలో రెండుసార్లు పరీక్ష తప్పాడు అన్నయ్య.

ఆనాటి బొరువా హయ్యర్ ఎలిమెంటరీ స్కూల్లో తలుపుల సూర్యనారాయణ బదిలీ అయిన తరువాత మల్లాది సాంబమూర్తిగారు హెడ్ మాస్టారుగా ఉన్నప్పుడు క్రమశిక్షణ తప్పిన పిల్లల్ని దండించడంలో వెనుకాడేవారు కారు. పిల్లల్ని పట్టుకొని బెత్తంతో బాదేవారు. బాగా చదవమని హెచ్చరిక చేసేవారు. ఆనాటి పంతుళ్ళు పిల్లల్ని ఎలాంటి దండన విధించినా తల్లిదండ్రులందుకు అంగీకరించేవారు. పైగా ఆనాడు హెడ్మాష్టారంటే ఆ గ్రామప్రజలందరికి భయభక్తులుండేవి. ఆతనికి ఎదురుగా రావటానికి జంకేవారు. దూరంగా తప్పుకుంటూ దండాలు పెడుతూ గౌరవించేవారు. పిడుగులాంటివారైనా పిల్లల్ని బాగుచేస్తాడురా అని పొగిడేవారు. గురువే దైవమని ఆనాడు భావించేవారు. అయితే కొత్త [illegible] ఉక్రోషంతో ఉండేవారు. అవసరమైతే దండించి తరువాత [illegible] చేరదీసి ప్రేమించితే ఆ పిల్లలు వెంటనే తమపై విధించిన దండనను [illegible]. అలాకాక గురుశిష్యుల అనుబంధాన్ని విస్మరించడంవల్ల "హెడ్మా[illegible] ప్రవర్తన బాగాలేదు. మీరంతా నాతోకలిసివస్తే ఆ హెడ్మాష్టర్ను ఎదు[illegible] తడాఖా చూపిస్తాము" అని తోటిపిల్లలదగ్గర జబ్బచరిచారు లచ్చన్న. [illegible] వానరమే. అల్లరిచేసే నాయకుడు ముందుండాలిగాని వెనుక [illegible], అల్లరి చప్పోళ్ళకు లోటుండదు.

విద్యార్థులను శిక్షించైనా వారిని పెద్దవాళ్ళుగా చేయాలన్న హెడ్మాస్టరుగారి సంకల్పం మెచ్చుకోదగినదైనా, తుదకది పిల్లల్ని బానిసలుగా మార్చే హీనస్థితిగా మారగలదేమో !

లచ్చన్న తన అనుచరబృందం ఒకనాడు హెడ్మాస్టరుపై తిరగబడాలన్న నిర్ణయానికి వచ్చారు. వెనుక బెంచీనుండి అల్లరి వినబడింది. వెంటనే హెడ్మాస్టరు "ఎవడ్రావాడు ? ఓహో నాయనా ! నీవా లచ్చన్నా ? తుంటరితనం, కొంటె పనులు నావద్దచెల్లవు జాగ్రత్త. మక్కలు విరగ్గొడతాను, బెంచీఎక్కి నిలబడు" అని గద్దించారు.

"ఎందుకు బెంచీ ఎక్కాలి ? నేనేం తప్పుచేశానని ? ఎక్కనంటే ఎక్కను, ఏంచేస్తావో నీయిష్టంవచ్చినట్లు చేసుకో" అని ఎదురు సమాధానం లచ్చన్నది.

"ఓహో ! అంతటివాడవయ్యావురా ? నీ యింట వంట పుట్టిన గుణం ఎలా పోతుందిరా ?"

"చూడండి హెడ్‌మాష్టరుగారూ ! నన్ను తిట్టండి పడతాను. నాయింటి గురించి, నాకులంగురించి అన్నారా మిమ్మల్ని........"

"ఏంచేస్తావురా భడవా ? విలువునా చీరేస్తాను చూడు........" అని బిగ్గరగా అరుస్తూ దగ్గరకు వెళ్ళి బెత్తం ఎత్తారు.

"ఆగండి!" అంటూ ఆ బెత్తాన్ని లాగుకొని ప్రక్కనున్న బెంచీని అతనిపైకి త్రోశాడు. కాళ్ళకు బలంగా తగిలినందున హెడ్మాష్టరు చతికిలపడ్డారు. పిల్లలు ఘొల్లుమన్నారు. లచ్చన్న తనబృందంతో బయటకు పరుగెత్తారు. స్కూల్‌కి లాంగ్ బెల్ కొట్టారు. అసిస్టెంటులువచ్చి హెడ్మాష్టరును లేవనెత్తారు "ఆ లచ్చన్న జోలికి పోవద్దు అని మేమెన్ని జెప్పినా మీరు వినలేదుకద" అని. హెడ్మాష్టర్ నెమ్మదించారు.

అంతటితో లచ్చన్న ఆ స్కూలుకి స్వస్తిచెప్పారు. ఆ సంవత్సరం ఎనిమిదో తరగతి పరీక్షకుకూడా వెళ్ళలేదు. జమీందారీ తోటల్లో ఉండటం చేసేవాడు. కోడుగంటి నరసింహంగారే ఇంటికి తీసికొనివచ్చి మరల చదివేటట్లు చేశారు. లచ్చన్న ఆ హెడ్మాష్టరుని ఎదిరించాడని, ఎదురుదెబ్బ తీసాడని ఆ దినం బారువా గ్రామమంతా వ్యాపించింది. అందరూ నోళ్ళు నొక్కుకున్నారు. అసలు వాడికి విద్యాబుద్ధు లెందుకని అన్నారు బంధువులు, కొందరు అభివృద్ధి నిరోధకులు. "ఎంత హెడ్మాష్టరయినా పిల్లల్ని పశువుల్ని బాదినట్లు బాదడమేమిటి?" అన్నారు ఆధునికులు. "గురుశిష్య సంబంధానికే ఒక పెద్దదెబ్బ తగిలింది. పిల్లవాళ్ళను క్రమశిక్షణలో పెట్టాలనే ఒక విద్యాసంస్థ అధిపతిపై పిల్లల తిరుగుబాటా ? ఎంత ఘోరము, ఎంత అన్యాయ" మన్నారు సనాతనులు.

చిన్నారి లచ్చన్నలో ఆనాడు ఏమాత్రం చింతలేదు. తనవంశాన్ని, కులాన్ని అవమానపరిచిన ఏ ఒకరినైన ఎదిరిస్తానన్న తలంపేతప్ప మరి ఏ ఇతర ధ్యాస లేదు. తనుచేసిన యీ అపరాధము ఆనాడు అకృత్యంగా తోచకపోయినా, భవిష్యత్తులో అదే పెద్ద ఘోరతప్పిదంగా తను భావించవలసి వస్తుందని, ఆ ప్రధానోపాధ్యాయుడు ఇచ్చిన శాపమే తనకు శాపమై చదువు అబ్బకుండా చేసిందని తనకానాడు తెలియదుకదా? ఆనాటి తన ప్రవర్తన మంచిదా? చెడ్డదా? అన్న జిజ్ఞాస తనకెక్కడిది? గురువులు శిష్యుల్ని దండించడం ఏమాత్రం దుస్సంకల్పంగాకాక వారి పురోభివృద్ధుల్ని ఆకాంక్షించడమే. విద్యార్థికి గురువుపయి కసి ఎందుకు కలుగుతుంది? తనను గురువు ప్రేమించక ద్వేషిస్తున్నాడని భావించినందుననే. భవిష్యత్తును ఊహించి ప్రవర్తనను అదుపులోనిడగల జ్ఞానం ఆ వయసుకెక్కడిది? అంతచిన్న వయస్సులో కూడ, ఎవరైనా, తుదకా దేవుడైనా, స్వీయ కులాన్నిగాని, వంశాన్నిగాని, ఎద్దేవా చేసాడో వాడికి తగిన శాస్తి చేయకుండా విడిచిపోయేవాడుకాదు లచ్చన్న.

అంతచిన్న వయస్సులో కూడ లచ్చన్న ఎందుకింత తిరుగుబాటు మనస్తత్వాన్ని పెంచుకోవలసి వచ్చింది? అతనితో చదువుతున్న వేలాదిమంది తోటి విద్యార్థులు అతనివలె ఎందువలన ఆనాడు సంచరించలేదు? అన్యాయం జరిగితే చూసి సహించలేని వారుంటారు. జరిగిన అన్యాయాన్ని భరించి మూలకూర్చున్న వారుంటారు. లచ్చన్న మొదటి రకానికి చెందినవారు. సునిశితమైన తనఆలోచనా, శక్తి ఎదుటివారు తనని అవమానిస్తున్నారా గౌరవిస్తున్నారా, అని పసిగట్టేరకం. బారువాలో ఆనాటి సమాజంలో ఉన్న అసంతృప్తి లచ్చన్నను రెచ్చగొట్టేది. తనుచిన్న వాడైనా ఆలోచనలో పెద్దవాడే, తలకు మించిన ఆలోచనల్ని చేసినవాడే, తగవుల్ని కొనితెచ్చుకునేవాడు. కాలాతీతంగా ఆలోచించేవాడు. కాలానికి మించని బుద్ధులు గలవారితో తగువాడేవాడు.

జమీందార్లు, పెత్తందార్లు, భూస్వాములు బారువాలో జరుపుతున్న అకృత్యాల్ని ప్రతీదినం కళ్ళారాజూచేవారు. తమ పలుకుబడికి లొంగి తిరగని వాళ్ళని బహిరంగంలోకి ఈడ్చి బాదేవారు. ఎదిరించినవారిని దౌర్జన్యంతో మట్టుపెట్టేవారు. తక్కువ కులాల్లోవాళ్ళను, వెనుకబడిన వాళ్ళను, సెగిడికులస్థులను, ఎంతో హేయంగా తూష్ణీ భావంతో చూడటం, అవమానపరచడం, అగౌరవపరచటం, "ఒరే" "ఏరా గాడిదా" అని నీచంగా సంబోధించటం, ఏమాత్రం తప్పుచేసినా తన్నడం, మొదలైన నీచకృత్యాలనుచూసి ఉద్రేకంతో, ఊగిసలాడిన వ్యక్తికీ తనవయస్సు వారిపయి తిరుగుబాటు చేసేందుకు సరిపోయేదికాదు. అయినా, ఆ సన్నివేశాలు అతనిపయి బలీయమైన ప్రభావాల్ని చూపెట్టాయి. సమాజంలో ఎంత చిన్నవాడైనా, బ్రాహ్మణుడు, జమీందారు, పెద్దకులస్థుడు అయితే "ఏం నాయనా! బాబూ!" అని గౌరవంగా సంబోధించడం, అదేవయసున్న అస్పృశ్యుని నీచంగా పిలవడం అనేది తనకు ఎంతమాత్రం నచ్చేదికాదు.

ఇక ఆగ్రామంలో పెద్దకులస్థులు – జమీందార్లు తక్కువ కుల స్త్రీల మాన ప్రాణాలపై దౌర్జన్యంచేసినా కిమ్మనక నోరుమూసికొనే వాళ్ళ దౌర్భాగ్య స్థితి, లచ్చన్న మనసును కుదిపివేసేది. ఇన్ని అక్రమాలుచేస్తున్న నీచులు సంఘంలో అందరిచేత గౌరవింపబడటం అనేది మరీ విచిత్రంగా ఆ బాల లచ్చన్నకు తోచేది. ఇలాంటి నీచులకు బడితపూజ చేస్తేకాని బుద్ధిరాదు అనేది బాల లచ్చన్న అభిప్రాయం. ఎదురు తిరిగి వీరిని ఏనాటికయిన జయించాలి అనే ప్రతీకారభావంతో ఊగిసలాడేవాడు, దౌర్జన్యమే ఇందుకు మందని భావించేవాడు.

తమకులాలను, వంశాలను హీనపరచ జూచేవారిని, మేము అందరికన్నా గొప్పవారమని, గొప్పకులాల వారమని విర్రవీగేవారిని, బావమోదాలని చూచేవాడు. తమని గౌరవించని వారిని దుష్టత్వంతోనైనా, లొంగతీసుకోవాలన్నదే అతని మతం. ఏదోవిధంగా పగ, కసి తీర్చుకోవాలి.

తనతల్లిదండ్రులు కల్లంగడికి వచ్చి వాళ్ళు ముంతలతో అందించిన కల్లును, తప్పత్రాగి, వాళ్ళిచ్చిన మసాలా దినుసుల్ని దిగమింగి – మరల మరునాడు ఆ కల్లమ్మినవాడు హీనమైనవారని, మేము గొప్పవారమని భావించేవారిని, వెళ్ళి బావబాదాలని ఆలోచిస్తుండేవారు. అన్యాయాల్ని, అక్రమాల్ని, ప్రతిఒక్కరు ఎదిరించగల సమర్థులయితే ఇవి ఏనాడో రూపుమాసి పోయుండేవి. చరిత్రలో నూటికి, కోటికి, ఒక్కరే వీటిపై దండయాత్ర చేస్తారు. బహుజనుల కోనం తప్పించి తనవంశం, తనకులం గొప్పదనం కోసమేనాడు లచ్చన్న ఆలోచించ లేదు.

లచ్చన్నలో తిరుగుబాటు మనస్తత్వం పెంపొందింది. ఉన్నతవంశీయుల పయి కసి, కక్షలకు రూపమేర్పడింది. ఎదురు తిరిగి పోరాడడానికి నిశ్చయించుకున్నారు. తన తాత తండ్రులు వారి స్వంతం కొరకు ఆలోచించారు. తను, తన గ్రామంలోనున్న తనలాంటివారినేగాక, దేశంలోఉన్న బలహీనవర్గాల, హీనదీన పరిస్థితిని, తుదముట్టించాలని తలచాడు.

జీవితంలో ఎదురు తిరిగి పోరాడటం, ధైర్యం, సాహసం, పట్టుదల, దీక్ష, వంశపారంపర్య లక్షణాలుగా తనతాత తండ్రుల నుండి వచ్చాయి.

## మందసాలో రాజావారి హైస్కూల్లో విద్యాభ్యాసం (1925–26)

లచ్చన్న బారువా హయ్యర్ ఎలిమెంటరీ స్కూలుచదువు ముగించుకుని, 8వ తరగతి పాసయి 9వ తరగతిలో (ఫోర్తుఫారం) ప్రక్కనే ఉన్న మందసా రాజావారి హైస్కూల్లో చేరడానికి కోడుగంటి నరసింహంగారే కారణం. మందసా రాజాహైస్కూలులో ఉన్న డి. సూర్యనారాయణ గార్కి లచ్చన్న అన్న అప్పగించారు. కొడుకు హైస్కూల్లో చదువుతున్నాడని తండ్రి డబ్బును పంపించే

వారు. స్వగ్రామం లోనే తనతండ్రియిచ్చిన డబ్బులు సరిపోయేవి కావు. మంద సాలో ఉన్నందున కొడుకు ఏం కష్టాలు పడుతున్నాడనో, రాజమ్మ, చిట్టయ్యతో చెప్పిడబ్బు ఎక్కువగా పంపించేది.

అనాడు హైస్కూలు చదువులు చదివించడం, ఈనాడు యూనివర్సిటీ చదువుల్ని చదివించడం కన్న గొప్ప. ఖర్చుతో కూడుకున్నది. అనాడు ఉపకార వేతనాలు లేవు. ప్రభుత్వసహకారం అసలే ఉండేదికాదు. పిల్లల తల్లిదండ్రులే చదువు ఖర్చునంతా భరించాలి. కల్లంగడిలో వస్తున్న ఆదాయం, గణనీయంగానే ఉండేది. అందులోచిన్న కొడుకుపై గారాబం, ముద్దు ఎక్కువ. ఉత్తరం వ్రాసి నదే తడవు, కబురుపెట్టినదే తడవుగా, తగినపైకాన్ని పంపేవారు. లచ్చన్న అసలే అగ్ని కణం, అకతాయిగుణం. జనంలోకిపోయి, జగడమాడటానికి, మందసాలో కావలసినంత స్వేచ్ఛ లభించింది. అదుపులో పెట్టడానికి తల్లిదండ్రులు దగ్గరలేరు ఇక ఇందుకు తోడు, కొల్లా హరికృష్ణ – వడ్డె విశ్వనాధం అను సహచరులు లచ్చన్నకు తోడైనారు, ఇంకామరి కొందరు. అదొక బృందం, మిత్రబృందం. వీధుల్లో నడవాలన్న, ఇంటికి వెళ్ళాలన్న, స్కూలుకు చేరాలన్న, విడచినవుడు మరల రావాలన్న ఆ మిత్ర బృందం విడిపోయేదికాదు. బృందం నాయకుడు లచ్చన్న.

ప్రవర్తన మరల మొదటికే వచ్చింది. బావుల్లో, చెరువుల్లో పడి ప్రొద్దస్తమానం ఈతకొట్టడం, మామిడి తోటల్లోపడి కాయల్ని, పండ్లను కోసుకొనిపోవడం, అల్లరి పెడుతూ ఊరుచుట్టూ తిరగటం. ఎదిరించిన వారిని తంతామని బెదిరించటం, ఎవరేమన్న కయ్యానికి కాలు దువ్వటం – ఇదీవారి నిత్యదైనందిన జీవితం. ఇక వారికి చదువులు అబ్బేదెలా? చదివిన చదువు వంటబట్టేదెలా? అంతటితో ఆ మిత్రబృందం, సరిపెట్టుకోలేదు. దొంగతనంగా పొలాల పయిబడి, ఈత తాటి చెట్లునెక్కి కల్లు బిడ్డెలనుదించి త్రాగడం కూడ ప్రారంభించారు. ఇక వీరిని బాగుచేయటం ఆ బ్రహ్మతరం కాదు.

తన తండ్రి కల్లంగడిని పెట్టడమేగాక కల్లును సేవించేవాడు. తన తాత కల్లుత్రాగి మత్తులో మునిగినవాడే, మరితను కూడ కల్లు త్రాగిన వాడుగనే ఉండాలా? డబ్బులు సంపాదించేవారుగా మున్నందున పగలు కల్లు, రాత్రివేళ సారాయి సేవించేవారు. నిషాలో ఉన్న తన తాతగాని, తండ్రిగాని ఏనాడు తాగితందనా లాడటం, ఏ మోమో త్రాగినట్లు మాట్లాడ్డం, తూలిపోవడం, భార్యా బిడ్డలను కొట్టడం లాంటివి ఉండేవికావు. త్రాగి పడుకొనేవారు. వారసత్వంగా కల్లు త్రాగడం నేర్చిన లచ్చన్న తదుపరి జీవితకాలంలో, 1930 లో ఉప్పు సత్యాగ్రహం చేసి. గాంధేయవాదిగా మారి, మద్యపాన నిషేధాన్ని, ప్రచారం చేశాడు తాగలేదు సరికదా తనతండ్రిని కూడ త్రాగుడునుండి మాన్పించివేయ

గల మహత్తర మనోనిగ్రహశక్తి, ఆదర్శచరణశీలిగ, మారిన ఉదంతం, నిజానికి తన జీవిత చరిత్రలో పేర్కొనదగిన అంశంగా నిలచిపోతుంది.

మంచిసా రాజావారి హైస్కూల్లో లచ్చన్న చదువు కొనసాగలేదు. దురల వాట్లు, చెడుసహవాసాలు కొనసాగాయి. రాత్రింబవళ్లు ఆ మిత్రబృందం హైస్కూల్లోనే ఉండేవారు. ఈనాడు 9 వ తరగతి విద్యార్థులు వయసుకు 14-15 సంవత్సరాలైనా-చూడానికి 11 సంవత్సరాలు మించనట్లుగా ఉంటారు. కాని ఆనాడు 9 వ తరగతి (ఫోర్తుఫారం) చదువుకుంటున్న వీళ్ళ వయస్సు సుమారు 20 సంవత్సరాలు. శరీరదృఢత్వంవల్ల చూపరులకు వయస్సు మించి కన్పడేవారు. అచ్చువేసిన ఆంబోతుల్లా వీధుల వెంట తిరిగినా, ఎప్పుడూ హైస్కూల్లో ఉన్నందున వీళ్ళంతా గొప్పగా చదివేస్తున్నారు సుమా అన్న భావం ఇతరులకు కలిగించేవారు.

అయితే ఈ మిత్రబృందం వెకిలి చేష్టలు తొందరలోనే వెల్లడయినాయి. అందరూపై గ్రామాలనుండి ఉన్నత విద్య (ఆనాటి కాలంలో అవే పైచదువులు) అభ్యసించటానికి వచ్చినవారే. కాస్త మస్తుగా, ఇబ్బందిలేక బ్రతుకుతున్న కుటుం బాల నుండి పైచదువులకు వచ్చేవారు. తల్లిదండ్రులు పంపించిన పైకంతో పేకాట లాడటంవల్ల వీరికితిండి పెడుతున్న భోజన హోటళ్ళకు చెల్లించేవారుకారు. చెల్లిం చండి అని అడిగిన హోటల్ యజమానులపై తిరుగుబాటు చేసేవారు. పంపించిన డబ్బుచాలటం లేదని తల్లిదండ్రులను సతాయిస్తుండేవారు. బడికి జీతాలు కట్టడానికి డబ్బులు ఉండేవికాదు.

ఆ రోజుల్లో హోటళ్లు వైష్ణవులు, ఒరియా బ్రాహ్మణులు నడిపేవారు. పేరుకు హోటళ్ళయినా అవి సంసార కుంటుంబాలున్న ఇళ్ళవంటివే. చదువుకున్న అబ్బాయిలకు నెలవారీ ఒప్పందముపై ముందుగా భోజనాలు పెట్టేవారు. భోజనాలు టిఫిన్లు నెలంతా తిని నెలాఖరున డబ్బు అడిగితేవారికి ఇవ్వటానికి వీరివద్ద డబ్బులు లేకపోవడంవల్ల వేరే హోట
మొదటి హోటల్ వారు వచ్చి
డబ్బు అడిగితే తిరిగి దబ
చూస్తా" మని బెదిరించటం.

ఆతరువాత ఇలా ఊళ్లో
పెట్టకపోతే చేతిలో ఉన్న
కొన్నాళ్ళు గడిపేవారు.

ఆరోజుల్లో విధవరాళ్ళు
వండి పెట్టేవారు. భోజనం
అన్నం, కూర, పప్పు, రసం,

రూపాయలు చెల్లిస్తేగాని ఆ భోజనం దొరకదు. కనీసం దానికి కూడా లేక పస్తులుండాల్సివచ్చేది.

ఇన్ని ఇబ్బందులకు లోనైనప్పటికి వారిలో ఈషణ్మాత్రం జ్ఞానోదయం కలిగేదికాదు. విషమ పరిస్థితిని వారే సృష్టించుకున్నారు. వారి హీనదీనస్థితికి వారే కారణమని గ్రహించక తల్లిదండ్రులే కారణమైనట్లుగా, డబ్బు పంపించని కారణంగా ఈ ఇబ్బందులు పడుచున్నట్లుగానూ, వీళ్ల చదువులను పట్టించుకోలేదనీ భావించేవారుపైవాళ్లు. "విద్యార్థులకు భోజనం పెట్టరా ?" అనే మూర్ఖమైన ఆలోచనతో హొటల్స్ వాళ్లపై దండయాత్ర చేయడం ఒక్కొక్కమారు, తిరిగి కొట్టించుకోవడం, తెగబలిసిన ఆంబోతుల్లా తిరగడం, ఉరకలెత్తిన వయసుతో ఒళ్ళు విరుచుకొని నడవడం, మనకేమిటోయి, మన మంతా వీరులం, ధీరులం అని వారి శరీరాల్ని వారే చూసుకొని మురిసిపోవడం, శారీరక మదం పెంచుకున్నారు గానీ, మానసిక బలం పెంచుకోవటానికి ప్రయత్నించలేదు. బుద్ధిబలంగాక భుజబలం పెంచుకున్నారు కండబలం తప్ప, కలంబలం పెంచుకోలేదు, పాఠాలపై శ్రద్ధ లేదు. చదువుపై ఆసక్తి లేదు. గురువులపై భక్తి లేదు. వినయవిధేయతలు అసలే లేవు. శ్రద్ధాసక్తి లేక చదువు వంట బడుతుందా ? వినయవిధేయత లోపించిన విజ్ఞానం అలవడుతుందా? ఫలితంగా లచ్చన్న, లచ్చన్న మిత్రబృందం తుదకు అందరూ పరీక్షల్లో ఫైలవ్వటం, మరల బరువెక్కిన గుండెలతో లచ్చన్న స్వగ్రామం బారువా చేరుకున్నాడు. పరీక్ష పోగొట్టుకుని వచ్చిన లచ్చన్నను తల్లిదండ్రులు కసరలేదు సరికదా, ఒడ్డూ పొడవుల్ని పెంచుకొనితయారైన కొడుకును చూసిమురిసిపోయారు. ఏకులం వాడి కొడుకుకు, మా కొడుకు తక్కువ అని లోలోన పొంగిపోయారు.

## శ్రీకాకుళం హైస్కూల్లో విద్యాభ్యాసం :

చిట్టయ్య రాజమ్మలు తమఇద్దరి పిల్లల చదువును కొనసాగించాలన్న దీక్ష పట్టుదలలో ఏమాత్రం సడలింపులేదు. మందసావెళ్ళి చిన్నకొడుకు సాధించేదేమీ లేదు, పెద్దకొడుకు 8 వ తరగతి పాసయి ఇంటివద్దనే ఉన్నాడు.

ఉత్తరాంధ్రలో శ్రీకాకుళం, జనావళి కూడలికి, వర్తకవ్యాపారాలకు నిలయంగా ఉండేది. మద్రాసు ప్రెసిడెన్సీలో గంజాం జిల్లాలో ఆనాడున్న బారువా నుండి పైచదువులకు శ్రీకాకుళం చేరడం జరిగేది. లచ్చన్నను మరి చదివించదలచలేదన్న అభిప్రాయంతో తల్లిదండ్రులుండగా సోదరుడు సత్యనారాయణ నరసింహంగారి చేత లచ్చన్నను చదివించేటట్లు ఒప్పించాడు.

పెద్దబ్బాయిని ఉపాధ్యాయ శిక్షణా శిబిరంలో చేర్పించారు. చిన్నబ్బాయి లచ్చన్నను మరల ఫోర్తుఫారంలో జాయిన్ చేశారు. పెద్దబ్బాయి నీడలో, చిన్నబ్బాయి శ్రద్ధగా చదువుకుంటాడని, శ్రీకాకుళంలో లచ్చన్నను హైస్కూల్లో



అచ్చన్న గారి మాతృమూర్తి గౌతు రాజమ్మగారు



ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కార్మిక శాఖామాత్యులుగా గుడ్లవల్లేరులో రైసుమిల్లుకు ప్రారంభోత్సవం చేస్తున్న సర్దార్ గౌతు లచ్చన్న

చేర్పించారు. కనీసం స్థలం మారితే పిల్లడి మనస్తత్వంలో మార్పు వస్తుందేమో అన్నది, ఆ తల్లిదండ్రుల ఆశ, ఆరాటం. ఏదైనా జబ్బుచేస్తే డాక్టర్లు స్థలం మార్పిడులు చేయమంటారు. ఉష్ణోష్ణ స్థితిగతులలో మార్పులవల్ల శారీరక ఆరోగ్యం కలుగుతుందేమోనని, అలాగే మానసిక మార్పు కావాలిగనక, వికసిస్తున్న బుద్ధి విజ్ఞానంలో, ఉపయోగపడాలంటే కనీసం పాఠశాల మార్పిడి జరిగితే మంచివాడిగా జీవితాన్ని మలచు కొనగలడేమో అన్నది ఆతల్లిదండ్రుల ఆశ, ఆలోచన.

శ్రీకాకుళంలో అన్నగారితో కలసి ఉండడం వల్ల స్కూలుకు రెగ్యులర్‌గా హాజరయ్యేవారు. ఘోర్తుఘారంలో గుడివీధి కోటిపల్లివారి మేడలో గది అద్దెకు తీసుకున్నారు. ఒకనాడు బారువాలో పనిచేసిన శ్రీ సూర్యనారాయణగారి బంధువు వద్ద ప్రయివేటు విద్య నేర్చుకొనేవారు ఆ తరువాత రావిగడ్డ జగన్నాధ పంతులు గారనే స్థితిపరుని ఇంటిలో గది లభించింది. అతనిది ఒక పెద్ద ఇల్లు. అయింట్లో పలువురున్న సరిపోయేది. పైగా పంతులుగారు భార్యావియోగి. తదుపరి ఎవరిని వివాహం చేసుకోలేదు. ప్రత్యేక జీవన విధానం, వ్యక్తిత్వం గల విశిష్టవ్యక్తి ఆయన. స్వాతంత్ర్యాభిలాష గలిగి ఉండేవారు. ఆస్తిపాస్తులకు కొదవలేదు. అగ్రవర్ణానికి చెందిన వ్యక్తి అయినా అందరినీ చులకనగా జూచిన మనస్తత్వం కాదతనిది, పైగా ఆదరించి అభిమానించేవారు.

వారి ప్రతీ చర్యలో దౌర్జన్యభావం, రౌడీతనం, ఉట్టిపడేవి· అహంకారం, అహంభావము తనప్రతి మాటలో చోటుచేసుకునేవి. ఇక తన దినచర్యలో ప్రధాన భాగం, ఇంట్లో కసరత్ చేయటం, ఇతరులకు నేర్పటం. సత్యనారాయణ, లచ్చన్న తిద్దరు స్కూలుకు వెళ్ళివచ్చేవారు. వచ్చిపోతున్న లచ్చన్నను పంతులుగారు పరిశీలించేవారు, పలకరించేవారు. "ఏమోయి లచ్చన్నా! చదువుబాగా సాగుతుందా? పుస్తకాల్ని చదివామంటే గొప్పకాదోయ్, మనిషికి స్వతంత్రభావన రావాలి, స్వేచ్ఛ కావాలి, వ్యక్తిత్వాన్ని పెంచుకోవాలి, దౌర్జన్యం, అన్యాయం ఎక్కడున్నా ఎదిరించాలి, చదివేస్తున్నంత మాత్రాన సంబరం కాదు."

మండుతున్న అగ్నిజ్వాలకు మరల సమిధలు లభించాయి లచ్చన్నకు. మంచిగురువే లభించాడు. ఒకరి పట్ల ఒకరికి ఆకర్షణ అభిమానాలు పెరిగాయి. లచ్చన్న భావిజీవితానికి ఉపయోగపడే ప్రచ్ఛన్న శక్తులు యిలా లచ్చన్నకు ప్రత్యక్షమౌతున్నాయోమో, పోరాట ధీరునిగా మార్చటానికి, సాధనాలుగా ఉపయోగంగా ఉండాలేమో !

లచ్చన్న చిన్నప్పటినుండి, బలిష్టమైన శరీరపటుత్వాన్ని కలిగియుండేవారు. అందుకు మరల కసరత్తు శిక్షణ తోడైంది. ఉదయాన్నే అందరూ స్నానం చేయడం, శుచిగా, శుభ్రంగా ఉండటం, అక్కడే వండుకొని తినటం. ఇక ఆహారం మాంసాహారం. బలమైన ఆహారాన్ని అందరూ సమిష్టిగా స్వీకరించటం. జగన్నాధం

గారు కూడ మాంసాహారాన్ని తీసుకునేవారు. ఇకవీరికి అదుపు అడ్డేముంది. ఆదరించినవాడి గుణాలు మనకు అబ్బటం అబ్బురం కాదుకదా! భోజనాల్ని కలిపి చేయడం, వారిని తన వారిగా చూడటం, సమతాభావాన్ని పెంపొందింప చేయడం వల్ల లచ్చన్నలో అతనిపై భక్తిశ్రద్ధలను హెచ్చింపజేసింది, గురుభావం ఏర్పడింది.

పంతులుగారితో లచ్చన్నకు ఎంతో చనువు ఏర్పడింది. అతను ఏం చేయమన్న హనుమంతునిలా చేయడం తప్పించి ఆలోచించి, అది తప్పా, ఒప్పా అన్నది తనకింకలేదు.

పంతులుగారు దుష్టశిక్షణకూడా చేసేవారు. కొంత దేశభక్తి జాతీయభావం ఉన్నవాడే. ఎదురు తిరిగిన వారెవరైనా వారిని దండించటం అతనొక పనిగా పెట్టుకునేవారు. ఇక ఎలానూ తనకు 'రామదండు' ఉందికదా! సహయోధులతో బయలుదేరి రౌడీతనం చేయడం, ఎదుటివారిపయి దెబ్బతీయడం. పంతులుగారన్న ప్రతి ఒక్కరికీ హడల్. అతని ప్రవర్తనే అంత. అతనింట్లో ఉన్న ప్రతి ఒక్కరు పల్లెత్తుమాట అనేవారు కాదు. ఇంటియజమాని కోదండరాముడు కదా !

అయితే దినచర్యలో ఒక భాగంగా రౌడీతనం, దౌర్జన్యం ఉన్న తను స్కూలుకు వెళ్ళడంలోను, చదవడంలోను, లచ్చన్న అశ్రద్ధచూపలేదు. పంతులుగారు ఎంత రౌడీతనాన్ని నేర్పినా, చదువును అశ్రద్ధచేస్తే ఊరుకునేవారుకాదు. రాత్రిపూట పాఠాలను శ్రద్ధగా చదవమనేవారు. అందువలననే అన్నయ్యకు "టీచర్ ట్రయినింగ్" పూర్తయ్యేసరికి, లచ్చన్న కూడ తన ఫోర్తు ఫిఫ్తుఫారంల విద్యను పూర్తిచేశారు.

ఇచ్ఛాపురం హైస్కూలు విద్యాభ్యాసం :

అన్నదమ్ములిద్దరు శ్రీకాకుళంలో విద్యాభ్యాసాన్ని ముగించుకుని, మరల స్వగ్రామం బారువా చేరుకున్నారు. రాజమ్మ, చిట్టమ్మల కోరిక నెరవేరి తమ పెద్దకొడుకు ఉపాధ్యాయుడు కాబోతున్నాడు. తమ కొడుకు ఇతర కులాల పిల్లలకు ఇకపయి విద్యాబుద్ధుల్ని, పాఠాల్ని బోధిస్తాడు. వారికంతకన్న పాంఘిక హోదా, అంతస్థు ఏం కావాలి? పెద్దకొడుకు ఉద్యోగి అయినట్లే. ఇక చిన్నకొడుకు లచ్చన్న సంగతి, బారువాకు అతిదగ్గరలో నేటి ఒరిస్సారాష్ట్ర సరిహద్దులో ఉన్న ఇచ్ఛాపురం హైస్కూల్లో 11వ తరగతి (స్కూల్ ఫైనల్) లో చేర్పించారు. ఆనాడు ఒక విద్యార్థి స్కూల్ ఫైనల్ చదువుతున్నాడంటే పిహానికతడొక విద్యాధికుడిగా అందరిచేత గౌరవింపబడేవాడు. ఆ కాలంలో అది గొప్ప చదువు. తదుపరి చదువు యఫ్.ఎ. తరువాత తరగతి బి.ఎ. అంత

విద్యాధికుడు ఎక్కడ ఎంత వెదికిన దొరికేవాడు కాదు. అదీ ఆనాటి విద్యా పరిస్థితి. లచ్చన్న యఫ్.ఎ. చదవాలి, బి.ఎ. పూర్తిచేసి ఏ కలెక్టరో, ఆఫీసరో అవ్వాలన్నది ఆ తల్లిదండ్రుల కోరిక, జీవితాశయం.

ఇచ్ఛాపురం హైస్కూలులో లచ్చన్న చదువు షరామామూలే. శ్రీకాకుళంలో తన అన్నయ్య తనవద్ద ఉండేవారు. ఏ చెడుతిరుగుడు తిరిగినా మందలిస్తాడనీ, అమ్మ, నాన్నకు చెబుతాడని కాస్త భయం ఉండేది. ఇచ్చట ఇచ్ఛాపురంలో బెదురు బెంగలేదు. హాయిగా రౌడీమిత్రులతో తిరగడం, కులాసాగా దినాల్ని గడపటం. ఇదీ విద్యార్థి లచ్చన్న దినచర్య. ఈతని సహచర విద్యార్థి కాళిదాసు, రౌడీతనానికి లీడరు.

లచ్చన్న బాగుపడతాడని, పెద్దవాడు కావాలని వారాశించిన రీతిలో తల్లి దండ్రులు పంపమన్న డబ్బును పంపేవారు. మందసాలో చదువు వెలగబెట్టిన పద్ధతిలోనే, ఇచ్ఛాపురంలోనూ సాగింది. ఇంటికి వచ్చినపుడు తల్లిదండ్రులు బుజ్జగిస్తూ, మంచిగా, కొంచెం స్థాయిలో మందలిస్తూఉండేవారు. "అలానే" అని మరల పాతదారిలో పడి పరిగెత్తేవారు. వయసాకర్షణకు లొంగి లేనిపోని ఆకతాయి పనుల్ని చేయడం, చేయించడం తప్పించి ఇదితప్పు, అది ఒప్పు అని ఏనాడు ఆలోచించనూలేదు, ఆలోచించే స్థితిగతులను పొందనూలేదు. ఇచ్ఛాపురంలో కూడ పేకాటలాడటం, పైలాపచ్చీసుగా తిరగడం. పుస్తకాలు తీసిన పాపాన పోలేదు. ఏ ఒకరు ఇదిచూసి ఏం నాయనా ఇళ్లా చెడిపోతున్నావు అని మందలిస్తే ఇక వారిపని పట్టడం. వారిపైబడి దండయాత్ర చేయడం, ఇదీ పద్ధతి. సరస్వతీ ఆరాధన లేదు, సజ్జన సాంగత్యం అసలే లేదు. నిజానికానాటి ఉపాధ్యాయులు మనసా, వాచా వృత్తికి కట్టుబడి ఉండేవారు. పవిత్రమైన జీవితాలను గడిపేవారు. ధర్మాలను, నీతులను ఆచరించిజూపేవారు. అసలు అటువంటివారు తప్పించి ఇతరులు ఉపాధ్యాయ వృత్తికి అనర్హులన్నది, ఆనాటి లోకోక్తి. విద్యార్థుల అభ్యు దయాన్నే నిత్యంకోరే ఉపాధ్యాయ హితబోధలను లచ్చన్న పట్టించుకోలేదు.

ఆ స్కూలు హెడ్‌మాష్టారు ఉపద్రష్ట సత్యనారాయణ లచ్చన్నను పిలిచి "ఎందుకురా అలా చెడతిరుగుతావు? ఎప్పుడూ స్కూల్లో ఏదోతగవుతెస్తావు, అల్లరి చేస్తావు, చదువు అనవు, సంధ్య అనవు, నా మాట విను. బుద్ధిగా చదువుకొని బాగుపడు లేదా, ఫలితం అనుభవిస్తావు" అని హెచ్చరించారు.

ఆ బోధనల ఫలితం ఆ హెడ్మాష్టరును ప్రతిఘటించడం. ఆతని పని పట్టా లని వ్యూహం, ఎత్తుగడలు. ఆ కాలంలో ఏ విద్యార్థినైనా పబ్లిక్ పరీక్షకు పంపిం చాలన్నా సెలక్షన్ విధానం అమలులో ఉండేది. స్కూలుఫైనల్ తరగతి చదువు తున్న విద్యార్థినీ విద్యార్థులందరికీ ఈనాడువలె ఆనాడు పరీక్షలకు పంపటానికి వీలులేదు. ప్రత్యేకమైన పరీక్షల్ని స్కూలుస్థాయిలో ప్రవేశపెట్టి ఆ స్కూలు

హెడ్మాష్టరు పబ్లిక్ పరీక్షలకు వెళ్ళేవారిని సెలక్షన్ చేయవలసి ఉండేది. ఆ సెలక్షన్‌లో లచ్చన్న పూర్తిగా ఫెయిలయిపోయారు. ఇదేదో హెడ్మాష్టరు గారు తనపై చేసిన కుట్ర అని లచ్చన్న భావం. ప్రతీకారం, పగలు. పాపం ఆ హెడ్మాష్టరు తనకు రాగల అపాయాన్ని ఊహించలేకపోయారు. లచ్చన్న, లచ్చన్న బృందం అంత సాహసానికి దిగుతారని కలలో కూడా ఊహించని అమాయకజీవి, తన ప్రాణానికే హాని అని తను ముందుగా భావిస్తే, లచ్చన్నను పరీక్షలో కూర్చోవటానికి సెలక్షన్ చేసేవారేమో. ధర్మాన్ని అనుసరించిన తన కెవరైనా ఏమి చేయగలరన్న ధీమాతో హెడ్మాష్టరు ఉన్నారు.

ఆదేరాత్రి లచ్చన్న, లచ్చన్నబృందం బరితెగించారు. చేయబోయేది ఎంత చెడ్డపని! ఎంత నేరమన్నది మరచిపోయేరు. హెడ్మాష్టర్ ఇంట్లోప్రవేశించి, ఆయన నోట్లో అరవకుండా ఒకగుడ్డను కుక్కారు. అందరు కలిసి అతనిని పట్టుకొనివెళ్ళి, పెద్దగోనెసంచిలో వేసి మూతిబిగించి కట్టారు. ఆ గోనెసంచితో అతనిని మోసుకొనిపోయి దూరంగా ఒక తోటలో ఉంచారు. మర్నాడు తెల్లవారుజామున ఆ సంచిలో అతనిని తెచ్చి ఒక దీప స్తంభానికి కట్టివేసి ఉడా యించారు. తెల్లవారేసరికి ఈ దుస్థితిని జూచి, తనవాళ్ళంతా వచ్చి లబో దిబో మని ఏడుస్తూ, అతనిని తీసుకు వెళ్ళారు. ఆ వెళ్ళడం యింటికి కాదు; తిన్నగా ఇచ్ఛాపురాన్ని విడచి వేరొకచోటకు వెళ్ళిపోయారు.

ఇంత ఉపద్రవాన్ని సృష్టించిన లచ్చన్న బృందం స్కూల్లో ప్రవేశించారు. అల్లరి అన్యాయం చేయటానికి ముందుగా, ఎంత ప్రోత్సాహ ప్రోద్బలాన్ని విద్యార్థులందించినా, ఆ అల్లరి, అన్యాయం జరిగాక చేసినవాళ్ళనుండి, సాధా రణంగా వీరందరూ తప్పుకుంటారు. తప్పు అని వాళ్ళకు మనస్సాక్షి చెప్తు తుందేమో ? ఇదే జరిగింది లచ్చన్న మిత్రబృందానికి. స్కూల్లో ఎవరూ వారికి కనీసం పరోక్షంగానైనా అభినందించలేదు సరికదా, అదోలా వారిని చూడటం ప్రారంభించారు. "ఎవరు చేసారు, ఎవరు సాక్ష్యం ?" అని ఎంత బుకాయించినా, చేసిందెవరన్నది విద్యార్థులకు అధ్యాపకులకు తెలిసిపోయింది. లచ్చన్న, లచ్చన్న మిత్రబృందం సాటి విద్యార్థుల వద్ద ముఖం ఎత్తుకుని తిరగలేని దారుణ పరిస్థితిని పొందారు. శారీరకంగా ఏ ఒక్కరు ముందుకు వచ్చి ఎదిరించకపోయినా, మానసికంగా ప్రతి ఒక్కరూ వీరిని ప్రతిఘటించారన్నది లచ్చన్న, లచ్చన్న బృందానికి అర్థమయిపోయింది.

లచ్చన్న హృదయంలో విమర్శ చెలరేగింది. చేసింది తప్పేమో అన్న భావం బిగుసించింది. జాలి, కరుణ ఏ మూలనుండో తొంగిచూసాయి. పాపం, క్షోభ, ఆలోచనలు తలలో దూరాయి. అంతరాత్మ ఘోషించింది. ఇదితప్పు, దారుణం, పైశాచికం, కిరాతకం. అంతరాత్మలో అన్యాయమన్న భావం పొడచూపుతోంది. బయటకు ఎంత దబాయించినా, మనసులో, బుద్ధిలో,

ఆత్మలో ఏదో పొరపాటు జరిగిందన్న ఆత్మవిమర్శ చోటుచేసుకుంది. చిన్నగానైనా ఆత్మజ్యోతి వెలిగి, ఆత్మప్రకాశం కలిగింది. బలమైన సంఘటనకు గురి అయితేనే తప్ప బలమైన ఆలోచనాధోరణులు ఏర్పడవు, బలపడవు.

తన వయసు పొంగు అల్లరి మనస్తత్వం, అహంభావం, అహంకార వ్యక్తీకరణ, తననుఅంగీకరింప చేయకున్నా, తనమానసిక జిజ్ఞాసలో వెలిగి అంతర్నిరీక్షణలో పొడసూపిన న్యాయాన్యాయ విచక్షణ చూచాయిగ లచ్చన్న హృదయంలో మెదిలింది.

తనకు అడ్డం వచ్చిన వారిని అంతం చేయడం ఒకధర్మమా లేక భావ్యమా ? తనను నిత్యం ప్రేరేపిస్తూ రెచ్చగొడుతున్న సమకాలీన సామాజిక అసమానతలకు, అన్యాయాలకు తను తలొగ్గడం న్యాయమా, "తనది విపరీత మనస్తత్వం" అని తర్కించి తేల్చుకోవలసిన వయసు, విజ్ఞానము తనకున్నవా, తనిలా ప్రవర్తించ టానికి కారణం తన దగ్గరఉన్న సాటి సమాజానికి చెందిన సహచరులన్నది తనకు తెలుసా ?

మనప్రవర్తన చాలవరకు మనచుట్టుఉన్న సామాజిక స్థితిగతులను బట్టి ఉంటుందని మానసిక శాస్త్రజ్ఞుల ఉవాచ. మూర్ఖదురాచార దుష్టసాంప్రదాయాల్లో మూఢనమ్మకాలతో మునిగి తేలుతున్న నాటిసమాజములో లచ్చన్న మాత్రం వాటిని అధిగమించి అంతవేగంగా నెట్టుకుని, విదిలించుకొని బయటకు రాగలడు. నాటి సామాజిక స్థితిగతులే సర్వపరిష్వాంగాలని మహాకవి శ్రీశ్రీ ఉవాచ. వాటిని తలదన్ని కుబుసం విడిచిన పాములా బయటకు రావాలి.

లచ్చన్న చుట్టూ ఉన్నవి దౌర్జన్యం, అక్రమాలు, అన్యాయాలు, సమాజంలో అసమానతలు, హెచ్చు తగ్గు కులాలు, నీచోన్నతులు, మానావమానాలు, ఘోర అస్పృశ్యతా పాతకం, పెత్తందార్లు, క్రపెత్తనం, జమిందార్లుకులం పేరుతో, మతం పేరుతో మనుషుల్ని హీనపరచి మాట్లాడ్డం, అవమానించడం, పురుగుల్లా, క్రిమికీటకాదుల్లా వారిని చూడటం, మెత్తగాఉన్న వారిని మొత్తడం, మంచివారిని కష్టాల్లో ముంచడం, ఎదురుతిరిగే వారినే 'బాబు' 'నాయినా' అని దండాలిడటం, ఆనాటి సామాజిక స్థితిగతులు.

ఆసమాజమే విద్యార్థి లచ్చన్నలో, విపరీత మనస్తత్వాన్ని తెచ్చిపెట్టింది. తనవరకు తను ఆలోచిస్తే తనకు ఒకరితో తగవేమిటి ? లచ్చన్నలో భావిభాగ్య విధాత తనకు తెలియకనే సంఘర్షణ బీజాలు గల సంఘంలో సమరం సాగించిందేమో !

సరిసమాన అవకాశాలు, సరిసమాన గౌరవాలు, హొదాలు, అంతస్థులు గల సమాజంలో సంఘర్షణకు చోటేలేదు. విపరీత మనస్తత్వములు వెల్లివిరియు

అవసరం రాదు. కుట్ర, దోపిడీ, దగా, మోసాలతో కూడిన సమాజంలో కక్ష, కలత, భీతి, వ్యాపించక తప్పదు.

మనుషుల్లో మంచివాళ్ళు, చెడవాళ్ళుండవచ్చు, ఉంటారు. కులాల్లో ఉచ్ఛ–నీచ కులాలేమిటి ? కులం బల్లెముతో మనిషిని కూల్చడమా ? కుల మొకరికి విషభాండం వేరొకరి కదే అమృతభాండం. ఇదిమరీ విచిత్రం. వ్యక్తులను బట్టి కులానికి ప్రాముఖ్యతా ? కులాలను బట్టి మనుషులకు గౌరవమా ? ఇదెక్కడి న్యాయం ? సాటిమనుషులపై పగతీర్చుకోవటానికి, గతపాడు సమాజంలో ఎవరో, విషబీజాన్ని నాటి మనుషుల్ని ఉచ్ఛ నీచ కులాలకి చెందిన వారని శపించారు. మానవతకే మచ్చ కల్పించి, సంస్కార సభ్యతలను మంట గలిపారు.

విద్యార్థి లచ్చన్న ఆనాటి పరిస్థితి నేటిసమకాలీన విద్యార్థి పరిస్థితికాదు ఆర్థిక వ్యత్యాసాలను అంతం చేయాలని, సౌకర్యాలను పొందాలని నేటి విద్యార్థి ఆందోళన. నాటివిద్యార్థి సంఘంలో గౌరవం కావాలని, చీడ పురుగుల్లా తనను చూడకూడదని, మేము అందరితో అన్ని విధాలా సమానమే అని, తనమనసెంత ఆక్రోశించి ఆవేదన పడినా, ఆలోచన పడినా నాటి సమకాలీన సమాజం అంగీకరించదే, తిరగబడి, విరగబడి, నవ్వుతుందే. అందుకు ప్రతీకారం ఉద్రేకం, ఆవేశం ఉంటే తిరగబడటం, లేకుంటే మూలబడటం.

బహుజనులను నీచంగా – నికృష్టులుగా తమతోటివారు భావిస్తున్నారని విద్యార్థి లచ్చన్న, బాల లచ్చన్నగ ఉన్నప్పుడే పసిగట్టాడు. కసిని, కక్షను పెంచుకున్నాడు. ప్రతీకారం తీర్చుకోవాలన్న పట్టుదల బహు విధాలైన అకృత్యాలకు తనను పురి కొల్పేదేమో ?

బ్రిటీషు రాచరికానికి అంత్యదశ సమీపిస్తున్న కాలమది. ఆంగ్లేయ విద్య వలన సామాజిక ధోరణులలో మార్పులు గోచరిస్తున్నాయి. కులం, మతం, వర్ణం, స్వార్థపరులు సృష్టించినవి తప్ప అవి దైవికాలు కావు. నిర్మూలింపబడనివికావు అన్నది ద్యోతకమవుతున్న మధుర ఘడియలు.

లచ్చన్న గారిలో తలెత్తిన పెడధోరణులు, స్వార్థపరమైనవి కావు. బూజు పట్టిన సంఘం, కుళ్ళిపోయిన సమాజం వలన, లేవనెత్తబడినవే. తనవారిని, తనను, అభిమానించిన వారిని ఎవరేమన్న ఊరుకునేరకం కాదు. దెబ్బకు ఎదురుదెబ్బ తీయాలన్నదే అతని అభిమతం – అసహాయతలకు, అన్యాయాలకు లోనైనవారు చిన్నవారైనా, పెద్దవారైనా వారికి తోడ్పడాలని వారికి అండదండ లుగా ఉండాలన్నది అతని అభిమతం.

బాలలచ్చన్న, విద్యార్థి లచ్చన్న చేసిన చర్యలపై వ్యాఖ్యానించలేం. తెలిసీ, తెలియని పితిలో చేసిన చర్యలవి. మంచీచెడుల పరిశీలనలో మదనపడుతున్న

బాధాకరస్థితి. రోగకారకపరములైనవి. కొన్ని ప్రాణములు నిలబెట్టలేదా ? చురకిడు జ్యోతి కాంతి జ్వలించును.

లచ్చన్న జీవితంలో పొద్దుపొడిచిన తరుణమాసన్నమైంది – ఇచ్ఛాపురం, హైస్కూల్లో స్కూలుఫైనల్ పరీక్షల్లో కూర్చొనుటకు జరిగిన సెలక్షన్‌లో తప్పినందున మరల స్వగ్రామం బారువా చేరారు.

మరల శ్రీకాకుళంలో హైస్కూలు విద్యాభ్యాసం :

ఒకనాడు తను శ్రీకాకుళం హైస్కూల్లో చదువుతుండగా ఏఇంటిలో ఉండి చదువు కొనసాగించారో అయింటి యజమాని జగన్నాథం పంతులు గారి వద్దనుండి, సత్యనారాయణ పేరున బారువా ఉత్తరం వచ్చింది. వేసవిశెలవుల్లో బారువాలో ఉన్న విద్యార్థి లచ్చన్నకు ఆ ఉత్తరం అన్నయ్య అందించాడు.

జగన్నాధం పంతులుగారు ఎంతో అప్యాయితతో వ్రాసారు. మీతమ్ముడి స్కూల్ ఫైనల్ సెలక్షన్ కాలేదని, బాధపడవద్దనిచెప్పు. శ్రీకాకుళం వచ్చేయిమను. మరల నాయింటి వద్దనే ఉండి పరీక్షలకు హాజరవుతాడు. అతను వేరొకచోట ఉండవలసిన పనిలేదు. మాయింట్లోనే వుంటూ భోజనం వసతి సౌకర్యాలన్నింటిని మాయింట్లోనే కల్పిస్తాను, వెంటనే రమ్మను.

విద్యార్థి లచ్చన్న –.పంతులుగారు యిరువురు ఉత్తర ప్రత్యుత్తరాలను జరుపుకునే చనువు, సద్భావం, పరస్పరం పెంచుకున్నారు. పంతులుగారికెందుకో లచ్చన్న పై అంత మక్కువ. బహుశా ధైర్యవంతుడని, సాహసవంతుడని, ఎదురుతిరిగి నిలబడగల ధీరుడని భావించిఉంటారు.

తల్లిదండ్రుల అనుమతిని తీసుకుని, శ్రీకాకుళం వచ్చిమరల హైస్కూల్లో చేరారు. స్కూల్‌ఫైనల్లో, కాలం, వయస్సు, పెరుగుతున్నది కదా, మార్పు చేర్పులు తదనుగుణంగా రాక తప్పదు కదా !

లచ్చన్న విద్యార్థి దశలో మార్పు వచ్చింది. అతని ప్రవర్తనలో ఊహించని మార్పు ఆవరించింది. రౌడీ చర్యలను మానుకున్నాడు. పంతులుగారన్న అమిత అభిమానంతో ఉండేవాడు. తల్లిదండ్రులు గాక, పంతులుగారు తనకు అన్ని సౌకర్యాలు చేయడం, తనకేదో గొప్పచిత్రానుభూతినితెచ్చిపెట్టాయి. ఉచిత భోజన సౌకర్యాలు ఏర్పరచిన పంతులుగారిని సంతోషపెట్టాలి. ప్రధమంగా తనను నమ్మినవారిని, తనను అభిమానించిన వారిని, సంతోషపెట్టాలన్న భావనకు గురి అయినారు.

పుస్తకాల్ని తిరగవ్రాయడం అలవాటుచేసుకున్నారు. ప్రతీదినం హైస్కూల్లో ప్రత్యక్షమయ్యేవారు. బుద్ధిగా తరగతిలో కూర్చొని పాఠాల్ని వినడం జరిగేది.

ఆ స్కూల్లో జేశ్వనారాయణమూర్తిగారు హెడ్‌మాష్టరుగా ఉండేవారు. పట్టుదలగలవారు. బాలాగట్టివారుకూడా. క్రమశిక్షణ లోపించిన వారెవరైన దండించటానికి వెనుకాడేవారు కాదు.

ఆ స్కూల్లో డ్రిల్ టీచర్ నేమాని నరసింహమూర్తిగారు. ఆటపాటల్ని నేర్పే డ్రిల్ టీచరన్న సహజంగా విద్యార్థులకు ప్రేమాభిమానాలు ఎక్కువ. లచ్చన్న, లచ్చన్న బృందానికి ఆ డ్రిల్ టీచరే ఒక మార్గదర్శకుడయాడు. అతని కనుసన్నలలో ఆ బృందమంతా మెలిగేది. క్రీడలలో మంచి అభిరుచి కన్పరచేవాడు లచ్చన్న. శారీరక సౌష్టవం పెంపుదలకు డ్రిల్ నేర్పడం తన విధియైన, విధ్యుక్త ధర్మమైన నరసింహమూర్తిగారు తనను అనుసరించి నిత్యం తిరిగే లచ్చన్న, లచ్చన్న బృందానికి దేశంగూర్చి కొంత చెప్పేవారు. ఆయన దేశభక్తుడు. జాతీయ వాది. పైగా సమసమాజవాది. సమతావాదాన్ని బోధించేవారు. విద్యార్థులకా విషయాలు వింతగా తోచేవి. పదిమంది యోగక్షేమాల్ని ఆశించేవారే నిజానికి నిజమైన దేశభక్తులు, నిస్వార్థసేవాసక్తిగలవారు.

జాతీయ భావాల్ని బోధిస్తున్న నరసింహంగారు లచ్చన్నకు ఎంతయినా నచ్చేవారు. ప్రతిదినం డ్రిల్ టీచర్ జరిపిన స్కూలు ప్రభాతభేరీ కార్యక్రమాల్లో లచ్చన్న క్రమంతప్పక హాజరయేవాడు.

విద్యార్థిజీవితంలో మార్పు జీవన విధానంలో మార్పు. ఆలోచనా ధోరణిలో మార్పు. అందరినీ తను అంచనావేసే రీతి, నీతిలో మార్పులు చేర్పులు జరిగాయి. జాతి, జాతీయత అంటే ఏమిటి ? అనే ప్రాథమిక రాజకీయ పాఠాల్ని నరసింహమూర్తిగారివద్దనే నేర్చుకోవడం జరిగింది.

"ప్రక్కనున్న మూర్ఖ, దుష్ట, దుర్మార్గ, దుర్నీతి సమాజాన్ని దుమ్మె త్తిపోయడం కాదురా లచ్చన్న ! ఆ పని ఎలానూ చేయాలి, చేద్దాం. మొదట మనం, మన భారతమాత దాస్యశృంఖాలాల్ని త్రెంచ నుద్యమించాలి, స్వరాజ్యం సంపాదించాలి. విప్లవమా ? అహింసా ? ఏమార్గం అన్నదిగాక మనదాస్య శృంఖలాల్ని తెంచుకోవాలనేదే మన లక్ష్యం కావాలి."

లచ్చన్నకు అనాటికి 21 సంవత్సరాలు. 1929–30 విద్యాసంవత్సరం స్కూల్ ఫైనల్ పరీక్షకు సెలెక్టై కాబడి హాజరైనారు.

చదువరి వేరు, విజ్ఞాని వేరు. వేదవాక్యం వెలుగు చూసింది. విద్యార్థి లచ్చన్నకు చదువుపై శ్రద్ధ పెరిగింది. "శ్రద్ధావాన్ లభ్యతే జ్ఞానం" అనికదా గీత. విద్యార్థి లచ్చన్న వివేకి అయినాడు. మనశ్శుద్ధితోబాటు జ్ఞానశుద్ధి కలిగింది.

దుర్మార్గం విడచి సన్మార్గంలోకి రారా నాయనా అని పలుమార్లు బ్రతిమాలారు తన మాతాపితలు రాజమ్మ చిట్టయ్యలు. అజ్ఞానపు చీకట్లనుండి విజ్ఞానం

వెలుగులోనికి నడవరా బాబూ అని ప్రబోధించిన తన స్కూల్ టీచర్ కొడిగంటి నరసింహస్వామి, కేవలం బ్రతకడమే ధ్యేయంకాదు పదిమందికి ఉపయోగపడి స్థిరమైన కీర్తి పొందాలని దీవించిన నేమానినరసింహము పంతులు, రావికంటి జగన్నాథం పంతులు—వీరెల్లరు లచ్చన్న భావిజీవితానికి ఎంతగానో తోడ్పడి నారు.

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ
ఓం శాంతి శాంతి శాంతిః

# 5. ఉప్పొంగిన ఉత్తరకోస్తా

బాల లచ్చన్న బారువా ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నపుడే అకతాయిగా తిరుగుతూనే దేశంలో ఎక్కడ ఏమిజరిగినా పెద్దలు చెప్పగా వినటానికి తన చెవులను ఒగ్గేవాడు. దేశవిషయాలన్న కుతూహలం ప్రదర్శించేవాడు. కోడిగంటి నరసింహస్వామి గారు ప్రతీదినం "స్వరాజ్య" పత్రికను తెప్పించేవారు. పత్రిక చదివి ఆనాటి దేశపరిస్థితులను, గాంధీజీ మొదలైన నాయకులనుగూర్చి ప్రబోధిస్తుంటే లచ్చన్న అల్లరితనాన్ని వాయిదా వేసుకుని మరీవినేవాడు. ఆ వార్తలపట్ల ఆసక్తిని, అభిరుచిని కనపరిచేవాడు. గాంధీజీ సాధించిన ఘనవిజయాల్ని టీచరు చెవుతుంటే అతని శరీరం ఉప్పొంగిపోయేది. ఉద్రేకం దేశభక్తితో వళ్ళు జలదరించేది.

గాంధీజీ పిలుపునందుకొని తిత్తి వెంకటరెడ్డిగారు, తిత్తి బలరామయ్యగారు బెరహంపూర్‌నకు ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను ఆహ్వానించారు. అతడు గాంధేయవాది. గాంధీజీ అనుచరుడు. 'రామదండు'ను స్థాపించి స్వరాజ్య సమర రణభేరిని మ్రోగిస్తున్నాడు. అటువంటివ్యక్తి బెరహంపూర్‌కు రావడం జరిగింది.

పోలీసులు అరెస్టుచేసి గోపాలకృష్ణయ్యగారిని బంధించారు. బెరహంపూర్ కోర్టులో శిక్ష వేసి జైల్లో పెట్టడానికి తీసికొనిపోతున్నారని తెలిసి అసంఖ్యాక విద్యార్థులు సోంపేట రైలుస్టేషనుకు వెళ్ళారు. అలా ఆ ఉద్యమంలో రైలును కూడ కొంతసేపు ఆపిన విద్యార్థులలో చెప్పుకోదగిన విద్యార్థి లచ్చన్న అని వేరే చెప్పనవసరంలేదు. తన వయసానాటికి 14 వత్సరాలు మాత్రమే. ఆనాటి సమకాలీన విప్లవోద్యమాలు విద్యార్థి లచ్చన్నలో భావావేశాన్ని, ఉద్రేక ఉత్సాహ ఉల్లాసాల్ని ఎంతగానో పెంపొందింపజేసాయి.

1920 లో పూజ్య బాపూజీ స్వరాజ్య ఉద్యమానికి నాయకత్వం వహించిన తదుపరి ఉద్యమ స్వరూప స్వభావాలు మారాయి. అహింసా విధానం సత్యాగ్రహోద్యమ విధానానికి ఆయువుపట్టుగా మారింది. విదేశవస్తు బహిష్కరణ, స్వదేశీవస్తువుల వాడకం – సర్వత్రా ఆదరింపబడాలని గాంధీజీ పిలుపునిచ్చారు. ఖద్దరు వస్త్రధారణ, రాట్నం చేపట్టడం, నూలు వడకడం జాతీయ కార్యక్రమాలుగా విలసిల్లాయి. తెల్లదొరతనంమీద వ్యతిరేకంగా జాతీయత, దేశభక్తిగల రచనలు ఎన్నో వ్యాప్తిచెందాయి. దేశప్రజలను ఆత్మత్యాగాలకు పురికొల్పుతున్న దినాలవి. బ్రిటీషు నిరంకుశ పాలనావిధానాన్ని, దౌర్జన్యపద్ధతులను ప్రతిఘటించి

పోరాడుతున్న సమయమది. గుంటూరులో పల్నాటిఉద్యమం లేవదీసినవారు కన్నెగంటి హనుమంత.

గాంధీజీ సత్యాగ్రహోద్యమం, సహాయనిరాకణోద్యమం ప్రజల్ని ఎంతగానో ఆకర్షించాయి. బానిసత్వంతో 'బ్రతికేకన్న ఆత్మ త్యాగమే మిన్న' యన్న భావం విరివిగా ప్రజానీకంలో వ్యాపించింది.

1922–23 లో బ్రిటీషు సామ్రాజ్యాన్ని గజగజలాడించిన మన్యంవీరుడు మన అల్లూరి సీతారామరాజు. స్వరాజ్యోద్యమానికి గట్టి ఊపునిచ్చి తుదకూపిరిని వదలినవాడు. ఆంధ్రలో స్వరాజ్య సమర రణభేరిని మ్రోగించటానికి అల్లూరి ఆదర్శ పురుషుడై నిలచాడు. పత్రికలలో చదవగా పెద్దలనుండి అల్లూరి వీరగాథ లను లచ్చన్న వినేవారు.

నెహ్రూ, తిలక్, లాలాలజపతిరాయ్ వంటి దేశభక్తుల జీవిత చరిత్రలను వారు చేస్తున్న సాహస కృత్యాలను వినడం లచ్చన్న కెంతగానో ఇష్టం. "తను అంతటివాడనైతేనో" "తను అంతటి దేశభక్తిని ప్రదర్శించగలిగితేనో" అని ఊహించుకుంటూ ఉండేవారు లచ్చన్న.

గోఖలే, తిలక్ తరువాత కాంగ్రెస్ సారధిగా గాంధీజీ అవతరించారు. విప్లవ పంథాన విడచి అహింసాత్మక విధానంద్వారా స్వరాజ్య సంపాదన అన్న పద్ధతి వెలసింది. 1926 వరకు అధినివేశ ప్రతిపత్తి చాలునన్న జాతీయ కాంగ్రెసు పార్టీ 1926 లో భారతీయులకు సంపూర్ణ స్వరాజ్యం కావాలని నాగపూర్‌లో తీర్మానం చేసింది.

హైస్కూల్లో విద్య నభ్యసించుచున్న దినాల్లో లచ్చన్న ఎంతో ఆకతాయిగా తిరుగుతున్నా ప్రతీదినం పేపరునందలి విషయాల్ని విని కుతూహలపడుతూ వుండేవారు. తన ప్రథమ గురువు నరసింహస్వామి టీచరు నేర్పిన విద్య అది.

1920 నుండి దేశంలో సహాయనిరాకరణోద్యమం ప్రారంభమైంది. దౌర్జన్య రాహిత్యం ద్వారానే స్వరాజ్యం సంపాదించాలని కాంగ్రెస్ స్వరాజ్యోద్యమ రథ సారథి గాంధీజీ పిలుపు నిచ్చారు. స్వరాజ్య సమరం కొనసాగుతున్న కాలమది. దేశభక్తులుగా దేశనాయకులు దేశబంధు చిత్తరంజన్‌దాస్, సురేంద్రనాద బెనర్జీ, గోఖలే, బాలగంగాధర తిలక్, లజపతిరాయ్, మాలవ్య, మహాత్మా గాంధీ పేర్లు పేపర్లలో వస్తుండేవి.

మహాత్ముడ్ని దైవంగా ప్రజలు భావించేవారు. నరసింహమూర్తిగారు స్వరాజ్య దినపత్రికను చదివి లచ్చన్న, తదితర విద్యార్థులకు చెప్పేవారు. అతనిదొక మనస్తత్వం. స్వరాజ్యం లభించాలన్న ఆశ.

జలియన్‌వాలాబాగ్ దురంతం ప్రజల్ని ఎలా కల్లోలపరచింది, మా
వివరిస్తుంటే బాలలచ్చన్న ఆవేశానికి లోనయేవాడు. పిడికిలి బిగించి పండ్లు
వాడు. "వాళ్ల నా ముందుంటేనా కాళ్ళు విరగ్గొట్టేవాడిన"ని కోపంతో అనే

1921 లో కాంగ్రేసు సభకు 14,852 మంది హాజరైనారని, రెండ
మంది ముస్లింలు, రెండువేలమంది స్త్రీలు ఆ సమావేశానికి హాజరైనారని, ఆ
లోనే రౌలత్ చట్టానికి జలాపత్ ఉద్యమాన్ని, జలియన్ వాలా బాగ్ దురంత
ఖండిస్తూ తీర్మానించారని చెప్పగానే బాలలచ్చన్న ఎగిరిగంతేసి, తన
సంక్రమించిందన్నంత సంబరపడిపోయేవారు. దేశవిషయాలను విని ప్రే
నందిన వ్యక్తి. భవిష్యత్తులో రాజకీయనాయకునిగా మారకుండా ఎలా జీవిత
కొనసాగిస్తాడు ?

గాంధీజీ పిలుపునందుకొని ప్లీడర్లు కోర్టులకు హాజరుకాలేదు. ఉద్యోగస్త
కార్యాలయాలదరికి పోలేదు. విద్యారులు పాఠశాలలను బహిష్కరించా
లచ్చన్న నిజానికి తనూ ఆ ఉద్యమంలో పాల్గొంటే ఎంతో మంచిదనుకొనేవా
అయితే తనకంతటి వయస్సులేదు. ఎదురు తిరిగిపోరాడాలన్న భావనతో
మతమయేవారు బాలలచ్చన్న.

ఆ రోజుల్లో జరిగిన అనేకోద్యమాల ప్రభావం బాలలచ్చన్నపై ప్రసరించి
అనేక సంఘటనలు జరుగుతాయి. కాని వాటిప్రభావం, అందరిపై చూపక కేవల
కొంతమంది పైనే ఎలాపడుతుంది ? వ్యక్తి హృదయంలో వాటిని పరిగ్రహిం
శక్తి, ఆసక్తి, యుక్తి, భక్తిశ్రద్ధలున్నాగాని ఏసంఘటన ప్రభావం ఏ ఒకరిమీదా
చేయదు. బాలలచ్చన్న భవిషత్ రాజకీయ ఉదయభానుడుగా ప్రకాశింపనున
డనటానికి, ఆ ప్రేరణలకు ఆకర్షితుడవడమే !

విద్యార్థి లచ్చన్నను ఉద్యమంలోకి దూకేలాచేసి, అతని మనసును కల
వేసిన సంఘటనలు బెరహాంపూర్‌లో సహాయనిరాకరణోద్యమం వ్యా
దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను అరెస్టు చేయటం, సహాయనిరాకరణోద్య
ప్రకటన.

లచ్చన్న వల్లభాయిపటేల్, సరోజినీనాయుడు, జవహర్ లాల్ నెహ్రూ
మొదలైన గాంధీజీ భక్తులు సాగిస్తున్న పోరాటాల్ని, చేస్తున్న త్యాగాలను విన
పుడు తను కూడ, వారిలా మారి, కాంగ్రెసు సైన్యంలో చేరిపోవాలని, మా
పోవాలని, నిత్యం తనలో భావిస్తుండేవారు. ఆరోజులలో జరిగిన సత్యాగ్రహాలి
గూర్చి విన్నపుడు ఉద్రేకంతో మనసు ఉప్పొంగి ఉరకలు త్రొక్కేది. తనకు
సత్యాగ్రహ పోరాటాలకు వెళ్లాలని ఉండేది. పక్షిలా రెక్కలుంటే ఎగిరివెళ్ళి
అక్కడ వాలి పోయి ఉండేవాడిని అని కలలు కనేవారు.

1923లో ఢిల్లీ శాసనసభలో బడ్జెట్‌లో ఉప్పు పన్ను హెచ్చించాలని సూచించినపుడు కాంగ్రెసు ప్రతినిధులు తిరస్కరించారు. లచ్చన్నగారికి ఏమీ అర్థం గాలేదు. తమ కుటుంబం అనాడు చెప్పుకోదగిన ఆర్థిక స్థితిగతులను చుట్టు ప్రక్కలవారికన్న మెరుగ్గా ఉండడం ఒకకారణమైతే రెండవ కారణం అణా పారేస్తే కావలసినంత ఉప్పు లభిస్తుండేది. దీని కెందుకింత ఆర్భాటం అని. తన వయస్సు 21 సం॥లు వచ్చినపుడు తెలిసింది. గాంధీజీ తలపెట్టిన ఉప్పు సత్యాగ్రహోద్యమ మెంతటి లక్ష్యాన్ని సంతరించుకొన్నదో, అది బ్రిటిషు వారిని సాత్వికంగా బంధింప జేసే తిరుగులేని ఆయుధమని, స్వరాజ్యసాధన అని.

సైమన్ కమిషన్‌ను కాంగ్రెసు పార్టీ బహిష్కరించింది. దేశభక్తులు, దేశనేతలు కమిషన్ పర్యటనకు అడ్డుతగిలారు. సైమన్ కమిషను అశ్వాలపై పయనించే వారట. వీరు నెహ్రూని మట్టించుకొని ముందుకు సాగారని పత్రికలో చదివి విద్యార్థి లచ్చన్న ఉద్రేకపడి పోయేవారు. మద్రాసులో టంగుటూరి ప్రకాశం పంతులు ఆంధ్రకేసరియై గర్జించి తెల్లవాళ్ల తుపాకులకు రొమ్ము ఒడ్డి నిలచిన సంఘటన, తెల్లదొరలు తెల్లముఖం వేసిన సంఘటన పేపర్లలో చదివి విద్యార్థి లచ్చన్న ఎగిరి గంతేసేవాడు. తన హృదయం వీరత్వంతో ఉప్పొంగిపోయేది. మనస్సు ప్రళయ తాండవం చేసేది. నేను కూడా ఆ కేసరిలా ఎందుకు గర్జించి ఎదురు తిరగకూడదు? అందుకు తగిన మనసు, కోరిక ఉన్నా వయసు, విజ్ఞానం లేదుకదా!

ఆనాడు నెహ్రూ వీరగాధలు పత్రికల్లో ప్రచురిత మయ్యేవి. తన 40వ ఏట 1929 లో అఖిల భారత కాంగ్రెసు మహాసభకు అధ్యక్షుడు కాగలిగాడు. విద్యార్థి లచ్చన్న వయసు నాటికి 20 ఏండ్లు మాత్రమే. తను అంతగాక పోయినా అందులో కొంతయినా పేరు తెచ్చుకుంటే ఎంత బాగుండేది. ఇదీ విద్యార్థి లచ్చన్న ఆలోచనాధోరణి. 1929లోనే భారత జాతీయ స్వాతంత్ర్య యోధుడు, ఆంధ్రుడు మద్దూర అన్నపూర్ణయ్యను అరెస్టు చేసి జైల్లో బంధించారని తను విన్నపుడు తన మనసెంత ఆవేదనకు, ఆక్రందనకు గురియైనదో. తనుకూడా అలా జైలుకెళ్ళితే? ఇవన్నీ పేపర్లో సంఘటనలను విని, ఉద్రేకానికి ఆలోచనలకు లోనైన సన్నివేశాలు అయితే, ఆలోచనలను ఆ ఉద్రేకానికీ ఒక రూపం కల్పించే సన్నివేశాలు తటస్థ పడలేదు. అప్పటికవి ఆలోచనలుగా ఉద్రేకతకు అవి ఊతగా మాత్రమే మిగిలేవి.

విద్యార్థి లచ్చన్న తన స్వగ్రామంలో 8 వ తరగతి చదువుతుండగా ఒక సంఘటనలో ఎంతగానో ప్రభావితుడవడం జరిగింది. గాంధీగారు విదేశీవస్తు బహిష్కరణోద్యమాన్ని చేబట్టి భారతీయులకు విదేశీవస్తువుల కొనుగోలును, విని యోగించటాన్ని నిషేధించమని పిలుపు నిచ్చారు. దేశం నలుమూలల హర్తాళ్, ఆందోళనలు, విదేశీ వస్తు దహనాలు జరిగాయి. బహిష్కరణలు కొనసాగాయి.

స్వగ్రామం బారువాలో ఆనాడు హర్తాళ్ ఊరేగింపు జరుగుతున్నది. విద్యార్థి లచ్చన్న తన సహచరులతో స్కూలునుండి ఇంటికి వస్తున్నారు. మధ్య దారిలో విదేశీవస్త్రాల దహనకాండ ప్రజలంతా జరుపుతున్నారు. జనంలో ఉత్సాహం, దేశ భక్తి, త్యాగం రెచ్చిపోయే సంఘటనలు బాలలచ్చన్నకు ఎవరు చెప్పారు ? తన వంటిమీద చొక్కా తీసి అమండుతున్న అగ్నిలో వేసారు, తన సహచరులు నివ్వెరపోయారు. చూపరులు ఆశ్చర్యపడిపోయారు. ఆ చిన్న లచ్చన్నకు విదేశీ వస్తు బహిష్కరణ దహనకాండ అన్న ఆ దశలో తెలిసిందేమిటి ? తెలిసిందల్లా ఒక్కటే దేశంలో ఏదో ఉద్యమం కొనసాగుతుంది. ఆ ఉద్యమంలో పాల్గొన్న సర్వ ప్రజానీకం అభినందిస్తున్నారు, హర్షిస్తున్నారు. ఆ ప్రయత్నం దేశం కోసమే అని. తన చొక్కా లాగు తీసి అగ్ని గుండంలో పడనేయడం ఆతని మనస్సులో చెరగని ముద్ర వేసింది. దేశానికి స్వతంత్రం కావాలి. స్వతంత్రం అన్న అనాటి తన చిన్నారి భావమేమిటో, మనసుప్పొంగిపోయింది. మధురానుభూతి లభించింది. ఆనందోత్సాహాలతో పొంగిన మనసులో ఏదో కొంత పూనకం ఊపు వచ్చినట్లయింది. ఆలోచనల్లో కొత్తదనం, తలపులో చైతన్య భావం, వినూత్నమైన వీరత్వం ధీరత్వం, ఎవ్వరెదిరించినా ఓడిపోని మనస్తత్వం, తిరుగులేని అనమాన త్యాగభావం ఒక్కసారిగా తనలో ఆవరించాయి. సత్యాగ్రహోద్యమం తనమేధస్సులో చెరగని ముద్రయైనది.

ఇంటికి చేరిన బాల లచ్చన్నను జూచి తల్లిదండ్రులు తన పిల్లవాడు చేసిన దాక ఘనకార్యంగా భావించలేకపోయారు. అదీ ఒక అల్లరితనమని ఊహించారు. ఫలితం దండగ. పట్టిన పట్టువదలని విద్యార్థి లచ్చన్నకు ఆయుధం నిరాహార దీక్ష. ఖద్దరు లాగులు ఖద్దరుచొక్కాలు కుట్టించాలట. దేశభక్తులు జాతీయ నాయకులు ధరిస్తున్నవస్త్రాలను అనాడు తను కూడ ధరించాలని తన తపన. జన్మజన్మల సంస్కార ఫలితం తప్పించి సామాన్యుని భావనకందని ఆలోచనా విధానం. బాల లచ్చన్న జాతీయ స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగా కొనసాగుతున్నదినాల్లో పుట్టి పెరిగినవారు. జాతీయ భావాలు, స్వాతంత్ర్య పిపాస, స్వదేశీ సిద్ధాంతము, ప్రజాస్వామ్య భావాలు ప్రజ్వరిల్లుతున్న తరుణంలో విద్యార్థి లచ్చన్న విద్యాభ్యాసం కొనసాగింది. యువశక్తి ఆదర్శ ఆవేశాలలో జాతీయ భావాలను మాతృదేశ దాస్య శృంఖలాలను త్రుంచాలని నిరంకుశ బ్రిటీష్ రాచరికవ్యవస్థతో పోరాడుతున్న సమయంలో లచ్చన్న జీవితం రూపురేఖల్ని దాల్చింది.

స్వరాజ్య సాధనా కాంక్షతో యావత్ ఉత్తరకోస్తా ప్రజానీకం ఉప్పొంగి పరవళ్లు త్రొక్కింది. ఉప్పొంగిన నాటి ప్రజానీకానికి ఒక ప్రత్యేక చిహ్నం, యువక లచ్చన్న, ఉద్వేగిలచ్చన్న, యువకలచ్చన్నే ఉప్పొంగిన నాటి ఉత్తర కోస్తా తరంగాలలో ప్రతిఘాతం, రాటుపోటు ప్రతిఘటనల సమన్వయ ప్రతి రూపం.

# 3. ఉద్యమించిన ఉత్తరాంధ్ర

## భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమ కార్యకర్తగా లచ్చన్న :

అది 1929–30 సంవత్సరం. తన వయసు 20 ఏండ్లు, స్వాతంత్ర్యోద్యమ కార్యకర్తగా మారాలా, ఉద్యోగం చేసుకుంటూ జీవించాలా ? రెండింటికి పొత్తు కుదరదు. స్వాతంత్ర్య సమర రణరంగంలో నురికి, సర్వాన్ని అవసరమైతే త్యజించాలి. దేశంకోసం అవసరమైన ఆత్మార్పణ చేయాలి లేదా బ్రతుకును కొనసాగుటకు ఏదో ఒక ఉద్యోగాన్ని సంపాదించుకొని సుఖంగా తనమేరకు తను బ్రతకాలి.

లచ్చన్న స్కూలుఫైనల్ పరీక్షలకు హాజరైన విద్యార్థి, ఆ కాలమున అదే మంత తక్కువ చదువు కాదు. అసంఖ్యాక ఆంధ్రులకు అక్షరజ్ఞానం లేని కాలంలో, లచ్చన్న ఉన్నత పాఠశాల విద్యను అభ్యసించారు. చదువరి అన్న ఆనాడు లభించిన గౌరవం అంతా ఇంతా కాదు. మానవుల్లో దేవుడుగా భావించేవారు. ఆశించిన ఉద్యోగం అతి త్వరలో లభించేది. ఈనాటివలె ఆనాడు కూడ విద్య యొక్క ప్రయోజనం కేవలం ఉద్యోగసంపాదనే.

అన్నయ్య ఉపాధ్యాయుడు. తల్లిదండ్రుల వృత్తి కల్లంగడి వ్యాపారం. తను వారికి ఎంత కాలం బరువుగా ఉంటాడు. అన్నయ్య, తల్లిదండ్రులు చదువు కొనసాగించమని చెప్పేవారు లేదా ఏదో ఉద్యోగంలో చేరమని ప్రాధేయపడే వారు. లచ్చన్నకు తీరని సమస్య ఎదురైనది.

తుదకు తల్లిదండ్రులు, అన్నయ్య లచ్చన్నను నిర్బంధించారు. ఏదో ఒక వృత్తిని చేపట్టి తీరాలని శాసించారు. లచ్చన్నదే ఇక తుది నిర్ణయం. జీవితాంతం సొంత సుఖం కొరకే జీవించాలా ? లేక బ్రతుకు పరమార్థం – నలుగురికి సహాయపడాలని, ఉపయోగపడాలని, భావిస్తూ దేశ స్వాతంత్ర్య సమర రణ రంగంలో దూకాలా ? ఏదిగమ్యం ? ఏది జీవితానికి పుణ్యం, పురుషార్థం, ముక్తి, మోక్షం ? బ్రతుకు కొనసాగించడమే గొప్పకాదు, కాబోదు. స్వీయ లక్ష్యాన్ని ఆశయాన్ని బ్రతుకు పంటలో పండించుకోవడమే బాగనిపించుకొంటుంది.

అన్నయ్య తనను బారువా రైల్వేస్టేషన్‌కు తీసికొనివెళ్లాడు. అనధికారంగా ప్రతీ దినం వెళ్లి రైల్వే సిగ్నల్ కోర్సును నేర్చుకోవాలి. రైల్వేడిపార్టుమెంటులో మంచి ఉద్యోగం లభిస్తుందన్నది వాళ్లఅన్నయ్య ఆశ.

రైల్వే డిపార్టుమెంటులో శిక్షణను పొందే ఏర్పాట్లు అన్నయ్య సత్య న్నారాయణ చేసారు. ఒక సైకిల్‌ను కూడ కొనిపెట్టారు. ప్రతీదినం లచ్చన్న సైకిలుపై బారువా రైల్వేస్టేషనుకు వెళ్లి రైల్వే సిగ్నలింగ్ నేర్చుకోవడం, వచ్చే పోయే రైళ్ళకు సిగ్నల్ యిచ్చే శిక్షణను పొందమని తల్లిదండ్రులు ఆశిస్తే తెల్లవాళ్లను ఈ దేశం నుండి వెళ్లగొట్టాలని స్టీమర్లలో, రైళ్లలో, విమానాల్లో వారు వెంటనే కదలి వెళ్లాలని పచ్చ జెండా చూపటానికి సిద్ధమవుతున్నాడు లచ్చన్న. ఘాతుకాల్ని కొనసాగిస్తున్న ఆంగ్లేయుల దుశ్చర్యల నాపటానికి ఎర్రజెండా పట్టి ఊపటానికి సిద్ధమవుతున్నాడు లచ్చన్న.

బాల్యంనుండి విద్యార్థి దశ ముగిసేవరకు ఏనాడు తన గురించి తన వంశం గురించి తన కుటుంబం గురించి ఆలోచించడం తన కలవాటు లేని పని. ఏనాడు తన ఆలోచన దేశభక్తిని చూపాలి, జాతీయ నాయకుల్లా తను ఒకనాటికి పెర గాలి, సమాజంలోనున్న వెనుకబడిన కులాలన్ని బాగుపడాలి, హెచ్చు తగ్గులు నశించాలి, ధనిక బీద వ్యత్యాసాలు పోవాలి, ఇవీ లచ్చన్న ఆలోచనారీతి—ఆవేదనా క్రమం. ఇతనికి రైల్వే డిపార్టుమెంటులో ఉద్యోగం వంటబడుతుందా? తనొక మూల గూర్చొని బ్రతుకును కొనసాగించే మనస్తత్వమే లేదు. మహా నాయకునిగా తను మారాలని నిత్యం కలలు గనే కార్యకర్త.

20 దినాలు వెళ్ళి రావడంతో ఆ వ్యక్తిలో శిక్షణ ఉట్టి కెక్కినది. గుర్రాన్ని గోలెంవద్దకు తీసికొని పోగలం గానీ, అందులో గల నీటిని త్రాగించగలమా? అన్నదొక నానుడి. తన మనసెల్లపుడు త్యాగనిరతికి, సేవాభావానికి దేశభక్తితో ఉవ్విళ్ళూరు తుంటే, తనొక ఊరు పేరూ లేని ఉద్యోగంతో కాలం వెళ్లబుచ్చడమా? అసంభవం.

"ఊహ ఊళ్ళ నేలుతుంటే కర్మ గాడిదల్ని కాసిందని" గ్రామీణ సామెత. సామెతలో గల పరమార్థం ఊహాలోకంలో మనిషి విహరించడం గాదు, పగటి కలల్ని కనడం కాదు, గాలిలో మేడల్ని సృజించడం కాదు, వ్యక్తి కార్యాచరణకు దిగాలి, పురుష ప్రయత్నం చేయాలి, వాస్తవిక పరిస్థితుల్ని ఎదుర్కోవాలి, సమ కాలీన స్థితి గతుల్ని అవసరమైతే ఎదిరించి, తన ఆశయాన్ని సాధించాలి.

లచ్చన్నది ఊహాలోకంలో విహరించే మనస్తత్వం కాదు. కష్టపడి చెమటోడ్చి పనిచేసి ఫలితాన్ని సాధించి అనుభవించాలన్నది అతని అభిమతం. కొందరు ఏమేమో సాధించాలని పిచ్చిపిచ్చి ఆలోచనల్ని చేస్తారు. చివరకు వచ్చేసరికి, పిరికివారిలా వెన్నుజూపి పలాయనం చిత్తగిస్తారు.

లచ్చన్న గుండెనిబ్బరం గుణపాలతో పొడిచిన చెదరనిది, బెదరనిది. సిద్ధసంకల్ప మనస్తత్వం ఆదినుండి తనకబ్బింది. తల్లిదండ్రులెంత గర్జించిన అన్నయ్య ఎంత ఖిన్నుడయిన, పదుగురెంత తనను బెదరించిన తన ఆశయ

సాధనలో తన జీవితాన్ని కొనసాగించాలన్న నిర్ణయానికి వచ్చారు. రాగల రాటు పోటుల్ని భరించాలని తలచారు. ఉద్యమమే తన ఊపిరిగా ఉండాలని భావించారు. దేశభక్తి, త్యాగనిరతి తన జీవితానికి లక్ష్యాలని ప్రకటించారు. బడుగు వరాలవారిని బాగుచేయాలి. వెనుకబడిన కులాల్ని ఉద్ధరించాలి. దేశానికి స్వరాజ్యం సాధించాలి.

దేశ స్వాతంత్ర్యోద్యమాన్ని నడుపుతున్న కార్యకర్తగా తను మెలగి తన దేశభక్తిని ప్రదర్శించాలన్న దృఢ నిర్ణయానికి వచ్చారు. స్వాతంత్ర్యోద్యమ కార్యకర్తగా జనంలోకి లంఘించారు.

ప్రజల్లోకి దూరినంత మాత్రాన జనావళి లచ్చన్నకు పీటవేసి గౌరవిస్తుందా ? బలహీన వర్గానికి చెంది – ఆనాడు కులం తక్కువవాడని పలువురు వేలెత్తి చూపి వెలివేస్తున్న పరిస్థితులు – కూటికి తక్కువైనా, కులానికి తక్కువవాళ్లం కాము అని పెద్దగా చెప్పుకొని, కులం దైవమిచ్చిన వరం అని భావిస్తున్న దౌర్భాగ్యపు సమాజం. కాలీకతంగ వ్యవహరించిన వ్యక్తిని, సమాజం ముందుకు పోనివ్వదు. ఆర్థిక సాంఘిక అంతస్తులు లేకున్నా, అసలే అంగీకరించదు. సరికదా, ముందు పడినా ఈసడిస్తుంది, ఈర్ష్య పడుతుంది. కానికాలం వచ్చిందని, కలియుగం అని శాపనార్థాలు పెడుతుంది. ఇటువంటి సాంఘిక పరిస్థితులు నెలకొనియున్న స్థితిగతులను లచ్చన్న ఎదిరించి నిల్రదొక్కుకొని ముందడుగు వేయాలని, దేశంకోసం, ప్రజలకోసం పోరాడుచున్నానని చెప్పినా, వీడి స్థితిగతులేమిటి ? వీడేమిటి ? వీడికులము చేయాలని చూస్తుంది.

ఉన్నత వర్గాలకు చెందినవారు, బలహీన వర్గాలవారు బాగుపడాలని చెప్పినా, అట్టడుగు ప్రజల నుద్ధరించ అవతరించాడని బిరుదు లిస్తారా, బలహీన వర్గాల వారికి చెందినవారు, వెనుకబడిన కులాలన్ని 'వెలుగుకురావాలని పిలుపు నిచ్చిన వాడొక విప్లవ వాదని, తిరుగుబాటు దారుడని ముద్ర వేస్తారు మొదటి వర్గానికి చెందిన సంఘటనలు, గతదేశ చరిత్రలో కోకొల్లలు. నేటికీ సమాజము నందివి కనిపిస్తాయి.

ఉద్యమించిన ఉత్తరాంధ్రకు ప్రతిరూపమై, రాజకీయ నాయకునిగా, స్వాతంత్ర్య సమర యోధునిగ, రూపురేఖలు తీర్చిదిద్దే సంఘటనలను లచ్చన్న జీవితచరిత్రలో ఇక మనం పరిశీలిద్దాం.

# 7. స్వాతంత్ర్య పోరాటంలో లచ్చన్న

అది 1930 మే 22వ తేదీ లచ్చన్న జీవన మార్గంలో మార్పు తెచ్చిన అతి ముఖ్యమైన దినం. జీవితం మలుపు తిరిగిన దినం. అప్పటికి తన వయస్సు 21 సంవత్సరాలు.

ఆనాడు రాజకీయ జీవితంలో అడుగు పెట్టడమన్న అగ్నిలో దూకినట్లే. ఈనాడువలె కాదు. అధికారాలు, పదవులు, భోగభాగ్యాలు, సన్మానాలు, హెూదా, అంతస్తులు లేవు. పైగా ఆనాడు లాఠీ దెబ్బలు, జీవిత ఖైదు చెఱసాలలో చిత్రహింసలకు గురికావడం. ఫలితమాశించని పోరాటమార్గం స్వార్థానికి చోటు లేని భగీరథ ప్రయత్నం, దేశమాత దాస్య శృంఖలాల్ని ఛేదించడం బానిసత్వం నుండి విడివడి ప్రజాస్వామ్య రాజ్యాధికారాన్ని జాతి పొంద నభిలషించే బృహత్తర మహత్తర దివ్యాశయం సామాజిక శ్రేయస్సు, దేశ శ్రేయస్సు తప్పించి స్వీయ వ్యక్తిగత లాభాపేక్ష కీర్తి ప్రతిష్టల కిసుమంతయిన విలువివ్వని స్వాతంత్ర్య పోరాటంలో సైనికునిగా ముందుకు సాగిపోవడమే.

లచ్చన్నది దృఢ శరీరం, బలిష్టమైన ఆకారం ఆరోగ్యవంతమైన శారీరక పటిష్టతకు ప్రతిరూపం యవ్వనంతో పొంగి పొరలుతున్న కండరాలు మేరు శిఖరాల్ని కూడ అధిష్టించగలనన్న ఆత్మవిశ్వాసం జలనిధులను కూడ దాటగలనన్న నమ్మకం, విశ్వాసం. తను శారీరక పరిశ్రమ జేసిన అందులోను అజేయుడు ననిపించుకొనగలడు. బుద్ధిపరంగా జీవించ దలచిన ఆనాటి కాలంలో తన చదువు నేటి ఉన్నత చదువులకన్నా మిన్న.

లచ్చన్న తన శరీర సౌష్ఠవాన్ని పరిశీలించుకున్నారు. బలిసిన కండల్ని దేశమాత గుండెల్లో గునపాల్ని గుచ్చుతున్న బ్రిటిషువారిని తుదముట్టించటానికి ఉపయోగించదలచారు. తన గుండె ధైర్యాన్ని విప్లవాగ్నిని మండింపుటలో సమిధగా వాడాలని భావించారు. జెండా చేతపట్టుకొని ముందుకు పదండి అని చాటుతూ కదం త్రొక్కుతూ పదం పాడుతూ పదిమందిని ఉద్యమంవైపు నడిపించే రసవత్తర నాటకంలో నాందీప్రస్తావన జేసారు.

1930 ఏప్రియల్ 6వ తేదీన పూజ్యబాపూజీ తన పూజావిధిని నిర్వర్తించిన తరువాత సత్యాగ్రహాన్ని 6-30 గంటలకు సబర్మతీ ఆశ్రమంలో దండియాత్ర ప్రారంభించారు. తే 13-4-1930 వరకు సత్యాగ్రహం కొనసాగాలని దేశప్రజలకు పిలుపునిచ్చారు. దేశం యావత్తు ప్రజానీకం కదిలింది, సత్యాగ్రహ సమరం సాగింది.

## గంజాం జిల్లా ఆంధ్రా కాంగ్రెసు కమిటీ :

అనాడు గంజాం జిల్లా ఆంధ్రాలోనే ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఒక జిల్లాగా ఉండేది ఉత్తరాంధ్రలో ఒరిస్సారాష్ట్రం సరిహద్దులో ఉన్న గంజాం జిల్లాలోనే లచ్చన్న గారి స్వగ్రామం బారువా ఉండేది. ప్రస్తుతం గంజాం జిల్లా ఒరిస్సా రాష్ట్రంలో ఉంది. రాష్ట్రాల పునర్విభజనలో ఒరిస్సాకు గంజాం వెందిపోయినా ఇచ్ఛాపురం, సోంపేట, బారువా, మందసా ప్రాంతాలు ఆంధ్రకు మిగిలాయి.

## బారువాలో సత్యాగ్రహ శిబిరం :

ఆనాటి గంజాం జిల్లా ఆంధ్రా కాంగ్రెస్ కమిటి నాయకుడిగా ఉన్న రామలింగం మాష్టరు కల్లికోట కళాశాల ప్రిన్స్‌పాల్, నిష్టల సోమయాజులు, న్యాపతి నారాయణమూర్తి, పుల్లెల శ్యామసుందరరావు, ఆదుర్తి లక్ష్మీ నాయుడమ్మ, నారాయణరావు మొదలగు ప్రముఖు లుండేవారు. గాంధీజీ పిలుపునందుకొని కాంగ్రెసు కమిటీ బారువాలో ఉప్పుసత్యాగ్రహ శిబిరాన్ని ఏర్పాటు చేసారు. జిల్లా అంతటా తిరిగి ఉపన్యాస వేదికల నేర్పరచి రాజకీయ చైతన్యం కలిగిస్తూ, బ్రహ్మాండంగా ప్రచారం చేసారు. లచ్చన్న రాజకీయ ప్రవేశానికి రంగస్థలాలు బారువా, సోంపేటలే.

బారువాకు అతి చేరువలో ఉన్న సముద్రప్రాంతంలో గల ఉప్పుమడుల నుండి ఉప్పును పండించి, సేకరించి బహిరంగ సమావేశాల్లో ఉద్రేకంగా ఉపన్యాసాలిస్తూ ఆ ఉప్పు పొట్లాలను వేలం వేసారు. తద్వారా వచ్చిన మొత్తాన్ని ఉద్యమానికి వినియోగించేవారు. ఆనాటి నాయకుల ఆదేశాలను అనుసరించడం లచ్చన్న నిత్య దినచర్య.

భారతీయుల, విదేశీయుల జీతాల్లో తేడాలు పోవాలని, పన్నులు ఎత్తి వేయాలని, ముఖ్యంగా బీదలకు అవసరమైన ఉప్పు పన్ను తొలగించాలని దండి సత్యాగ్రహం చేస్తున్న గాంధీజీ ఉప్పు తయారు చేయటానికి సిద్ధపడు తుండగా అప్పటి వైస్రాయి లార్డ్ ఇర్విన్ అరెస్టు చేయించాడు. ఈవార్త దావానలంలా దేశం నలుమూలలా వ్యాపించింది. ఇది తెలియగానే ఉద్యమ కేంద్రంగా నిలచిన బారువాలో హర్తాళ్ జరిగింది. విదేశీ వస్త్రాలను సేకరించి దహన కార్యక్రమం సాగించారు. ఆ సన్నివేశానికి ఉత్తేజితుడై లచ్చన్న తను ధరించిన వస్త్రాలను అందరూ చూస్తుండగానే అగ్నిగుండంలో వేసి తను కూడ దేశాభిమాని అని తెలియపరచుకొన్నారు. ఉదశాభక్తిగా తనదేశభక్తిని ప్రదర్శించిన వ్యక్తిగా నిలద్రొక్కుకున్నారు.

అందరి ఆవేశపుకేకలతో తనూవంతపాడుతూ ఉప్పును పండించినంత మాత్రాన దేశానికి స్వరాజ్యం ఎలావస్తుందా అని ఆలోచించేవాడు కొందరయితే అవహేళన చేస్తూ ఎదురుతిరిగితే, "ఇది గాంధీజీ పిలుపు - దేశానికే మలుపు. మీకేంతెలుసురా అందులోని ప్రత్యేకత ?" అని సమర్థించేవారు లచ్చన్న.

"లచ్చన్నా, ఏమిటిరా నీ ఉబలాటం ? వీధులవెంట తిరిగితే స్వరాజ్యం వస్తుందా ? ఎక్కడో గాంధీజీ ఉపవాసమట, ఇక్కడ వీళ్ళఅందోళనలట ! వీళ్ళా స్వరాజ్యం తెచ్చేది ? బ్రిటీషువారిని దుడ్డుకర్రలతో కొట్టి పంపిచేస్తారా వీళ్ళు ? వాళ్ళేమిటి ? వాళ్ళ సైన్యమేమిటి ? వాళ్ళు పరిపాలనలో దిట్టలు" అన్నది ఆనాటి జమీందార్ల, ఏజంట్లుగా ఉన్న పెత్తందార్ల ప్రచారం.

లచ్చన్న ఎదురు దెబ్బ కొట్టినట్లుగా కుదురుగా వారికి సమాధానం యిచ్చేవారు. కోతులతో రాముడు లంక చేరాడన్నా, రావణాసురుని చంపాడన్నా మీరు నమ్ముతారు. దేశ భక్తితో స్వరాజ్యం తెస్తాడన్న గాంధీజీని మాత్రం నమ్మరు. అది మీ ఖర్మ, అమాయకత, అజ్ఞానం అన్నది లచ్చన్న ప్రచారం.

సత్యాగ్రహం ఉధృతంగా కొనసాగుతున్నపుడు గంజాం జిల్లా కలెక్టరు, తెల్లదొర ఆస్టిన్ ఏమాత్రం చలించలేదు. ఏ ఒక్కరిని అరెష్టు చేయలేదు. ఎకసక్కాలాడినా, ఎదురు జవాబులు చెప్పినా పోలీసులు కిమ్మనకుండేవారు. సత్యాగ్రహం చేసినవారిలో అరెష్టుచేస్తే జైళ్ళకు వెళ్లాలని ఉవ్విళ్ళూరేవారు. ఉడుకురక్తంతో దేశభక్తితో ఉప్పొంగిపోయేవారు. బారువా సత్యాగ్రహశిబిరంలో ఏ అరెష్టులుగాని ప్రతిఘటనగానీ లేవు. తోక ముడిచిందిరా ప్రభుత్వం అన్న అపహాస్యాలు కూడా చెలరేగాయి.

## నౌపడాలో ఉద్యమం - ప్రమాణపత్రంపై సంతకం :

కాంగ్రెస్ రథసారధి గాంధీజీ ఉప్పుకొఠార్లపై దండయాత్రకు పిలుపు నిచ్చారు. గాంధీజీ దండి ఉప్పు కొఠార్లపై దండయాత్ర ప్రకటించిన మరు క్షణం ఆనాటి గంజాం జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ జిల్లా పరిధిలో ఒక కార్యక్రమాన్ని తీసికొన్నది.

నౌపడా ఉప్పుకొఠార్‌లపై దండయాత్రకు సన్నాహాలు ప్రారంభించింది. బారువానుండి సత్యాగ్రహ శిబిరాన్ని నౌపడాకు మార్చారు. ఏప్రియల్ 22న ఉప్పుకొఠార్లపై కాంగ్రెసు నాయకత్వంలో దండియాత్ర జరుగుతుందని కరపత్రాల ద్వారా వాల్‌పోష్టర్ల ద్వారా జిల్లా నలుమూలలా వ్యాపింప చేసారు.

సత్యాగ్రహ శిబిరం దేశ భక్తులను పాల్గొనవలసినదిగా అర్థించింది. యువకులను ప్రోత్సహించింది. అందరూవచ్చి శిబిరంలో చేరుతున్నారు.

నౌపడా కొఠార్లపై దండయాత్ర :

గంజాం జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ కమిటీవారిచ్చిన పిల్పునందుకొని ప్రాంత ప్రాంతమంతా కదిలింది, ఉప్పుకొఠార్లపై దండయాత్రకు. ఇది విన్న లచ్చన్న ఉడుకెత్తి ఉక్రోషంతో ఊగిపోయారు. తన వయసు చిన్నది. దేశం, దేశం అని ఎలుగెత్తి చాటడం అరవడం తప్పించి తనను ఎవరు దేశభక్తి కలవాడని భావించిన సమయము కాదు. ఇతని దేశభక్తిని తలపించే ఎటువంటి సన్నివేశాలను, అప్పటికి లచ్చన్నకు అటువంటి అవకాశాలు ఎదురవలేదు. సత్యాగ్రహ శిబిరాన్ని స్థాపించినవారు స్వర్గీయ పొట్నూరు స్వామిబాబు. శిబిములో హాజరైన నాయకులు ఉన్నవ రామలింగం, నిష్టల సోమయాజులు, న్యాపతి నారాయణ మూర్తి, పుల్లెల శ్యామసుందరరావు, డాక్టర్ నారాయణ రావు, జిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంట్ గిరిమెల్లి కుమారస్వామి, ఇమ్మిడిశెట్టి రామమూర్తి వగైరా నాయకులు, అర్ధరాత్రి సమయమున అరెష్టు కాబడినారు. బరంపూర్ జైలుకుతీసుకొని వెళ్లబడినారు.

బరహంపూర్‌నుండి కె. నారాయణ, కోకలసత్యనారాయణ, స్వర్గీయ ఎల్లాయి సన్నయ్యగారు వచ్చారు. సత్యాగ్రహశిబిరం నాయకత్వం అతనిదే. ఉప్పుకొఠార్లపై దండయాత్ర అన్నమాట చిన్నమాటకాదు. ప్రజల బుర్రల్లో చురుక్కున తగిలేమాట. బ్రిటీష్‌వాడన్న ప్రతిఒక్కరుభయపడి పారిపోయే దినాలు. కలెక్టరన్న కాళ్లు చేతులు తీసివేసి అవతల పారేసినా అతనికి అడ్డు పెట్టేవారెవరూ లేరని, ఆ అధికారం అతనికి ఉందనినమ్మిన దినాలు. ఆసమయంలో తెల్లవాడిమీద పోరాటానికై పిలుపు సామాన్యమా ? చూచి వద్దామని కొందరు, ఈసందడిలోనే మనం చేతికందినంత ఉప్పును సంగ్రహించుకొందామని తట్టలు పారలు పట్టుకొని కొందరు, ఈ పోరాటం ఎలా ఉంటుందో ఈ తమాషా చూచి పోదామని కొందరు, దేశభక్తితో ఆ కొఠార్లపై దండయాత్ర జరిపి దండిసత్యాగ్రహాన్ని మరిపించాలని కొందరు రంగంలోనికి దుమికారు.

లక్షలాది జనంతో ఆ ప్రాంతమంతా నిండిపోయింది. నలువైపులనుండి నౌపడా కేంద్రానికి బారులు తీర్చిన చీమల్లా ప్రజలు రావడం ప్రారంభించారు. కలెక్టరు గట్టి భద్రతాచర్యలు తీసికొన్నారు. గట్టి పోలీసు బందోబస్తు ఏర్పాటయింది.

శిబిరంనుండి ఉప్పుకొఠార్లకు జనసమూహం సత్యాగ్రహులతో కదిలింది ఊక వేసిన రాలని జనసందోహం, ఉద్రేకాలు ఉప్పొంగిన తరుణం, దేశభక్తి తొంగిచూచిన క్షణం, స్వార్థం సన్నగిల్లి త్యాగ భావం నిండుకొన్న ఘడియలు

ఒక్కమారుగా ప్రజానీకం గాంధీజీకి జై అన్న నినాదాల్ని జరిపింది. స్వరాజ్యం నాజన్మహక్కు అని ఎలుగెత్తింది.

నౌపడా ఉప్పుకొఠార్లు చుట్టూ విపరీతమైన జనము మూగారు, ఊ అంటూ ముందుకురికి కొఠార్లను నామరూపాల్లేకుండా చేయగల జనసందోహం. పోలీసు, రెవెన్యూ అధికారులు, నాయకులను గేటు వద్దనే అరెస్టుచేశారు.

లక్షలాది ప్రజలు ఉద్రేక పడిపోయారు. ప్రాంతీయ దేశాభిమానాలకు విద్య ప్రామాణం కాదుకదా ?

మేము చేస్తున్న అన్యాయం ఏమిటి? అరెస్టులు దేనికి? వీరిని వదలండి, లేదా మీఅందరిని బంగాళాఖాతంలోనికి విసరివేస్తాం అనే నినాదాలతో ప్రజా సమూహం ముందుకు సాగింది. వాతావరణం పరిస్థితులు ఎవరి చేతుల్లో లేవిక. ఉద్రేకం ఉక్రోషం తప్ప మరేమి కన్పించని సమయం.

సత్యాగ్రహాన్ని చూద్దామని వచ్చారు వేదాంతం కమలాదేవి. కాకినాడలో పేరుమోసిన దేశభక్తురాలుఆమె. మాజీ రాష్ట్రపతి వి.వి. గిరి గారితండ్రి న్యాయవాది అయిన స్వర్గీయ జోగయ్య పంతులుగారు వచ్చారు. గిరిగారి సహోదరి అదుర్తి లక్ష్మీబాయమ్మ – తండ్రి కూతుళ్ళు ఇద్దరు బరహంపూర్ నుండి వచ్చారు.

నాయకులను నిర్బంధిస్తే అంగీకరించం, మీ అంతంచూస్తాం. అరెస్టులు చేసి తీసుకెళితే అడ్డుకుంటాం. మాశరీరాలమీద నడచి వారిని జైలుకి తీసుకొని వెళ్ళండి లేదా వెంటనే వారిని విడుదల చేయండి అన్న జనసంద్రం ఘోషవిన్న అస్టేక్ గుండె అదరిపోయింది. పోలీసు తుపాకీలు బెదరిపోయాయి. ఆ సరికి పిల్ల పహిల్వాన్ అని బిరుదునందిన మన లచ్చన్న ఆవేశంతో ఊగుతూ కేకలు వేయడం ప్రారంభించారు. జనం అనుసరించారు "వాళ్ళను వదలండి లేదా మమ్మల్ని నిర్బంధించండి" అని.

ముందుకు త్రోసికొని వస్తున్న జనాన్ని ఆపటం అంత సాధ్యం కాదని, కాంగ్రెసు నాయకులను సంప్రదింపులకు పిలచారు. "మీ ప్రజలకు మీరు నచ్చచెప్పండి, శాంతంగా ఉండమని చెప్పండి. గాంధీజీ శాంతంగా ఈ సత్యాగ్రహం చేయమని పిలుపునిచ్చారు. దౌర్జన్యంగా చేయమని చెప్పలేదుకదా ?"

"అది మాకు తెలుసు, ఉప్పొంగిన సముద్రాన్ని ఊరడించడం అంత సులువు కాదు, మా ప్రయత్నం మేము చేస్తాం" అనగానే కలెక్టర్ ఒక లారీపై ప్లాట్‌ఫారం ఏర్పాటు చేసారు. నాయకులు ఆ వేదిక ఎక్కి ప్రజలకు బాకాలద్వారా చెప్పడం ప్రారంభించారు.

"ప్రజలారా శాంతించండి, మనది సత్యాగ్రహం తప్పించి దురాగ్రహం కాదు మన నాయకుడు దౌర్జన్యం చేయమని చెప్పలేదు. అరెస్టుచేసినవారిని జైల్లో

పెట్టడానికి వాళ్లు తీసికొని వెళ్తారు. మనం అంగీకరించి దారి తప్పు కోవాలి. అదే మనసిద్ధాంతం, గాంధీజీ అభిమతం"

"మేము ఒప్పుకోం, జైల్లో పడద్రోసి చిత్రహింసలు పెడుతుంటే, చచ్చిన వారిలా ఉండటానికి మేము అంగీకరించం" అన్న విప్లవాగ్ని జ్వాల వెలరేగింది.

శాంతి వచనంతో తుదకు విప్లవాగ్ని జ్వాల చల్లారింది. ఉద్యమకారులను సత్యాగ్రహానికి తీసుకొని వెళ్ళటానికి జనసందోహం అంగీకరించింది. అడ్డు తగలమని అన్నారు.

ఇక సత్యాగ్రహశిబిరంలో చేరవలసినవారు చేరుతున్నారు. పాలకులు సత్యాగ్రహులను అరెస్టు చేయడానికి సన్నాహాలు ప్రారంభించారు. అరెస్టు చేసినా జైలు కెళ్లటానికి సిద్ధమే అన్నట్లు లచ్చన్న శిబిరంలో వారు చేరారు. సత్యాగ్రహ శిబిరం నుండి సుమారు 3 కిలోమీటర్లున్న నౌపడా ఉప్పుకొఠార్ల వరకు సముద్ర తరంగాల్లా ప్రజానీకం దిక్కులు పిక్కటిల్లేలా నినాదాల్ని చేసారు.

స్వర్గీయులు మల్లాయి నన్నయ్య, పోకల సత్యన్నారాయణ, నలుగురు సత్యాగ్రహదళ సభ్యులను లారీలకెక్కించి, అరెస్టుచేసి బెరహంపూర్ తీసికొని వెళ్తుండగా ప్రజానీకం ఆ లారీని అడ్డింది. "అడుగు ముందుకు కదిలితే అందరినీ పిండి చేస్తాం" అన్న అరుపు సింహ గరనలా వినిపించింది. ఆ సమయానికి కమలాదేవి, జోగయ్య పంతులు, లక్ష్మీబాయి రావడం, ప్రజల్ని అదుపులో నిడటం సాధ్యమయింది. పేరుమోసిన రాజకీయ నాయకుల మాటల్ని ప్రజలు అంతసులువుగా దాటలేరు. అడ్డుపడకండి, గాంధీజీ మతంకాదు అని ఎలుగెత్తి చాటారు అంతే, దారి నుండి తొలగారు. నిజాని కానాడు వారు రానిచో ఆ జనాల్ని ఎవరూ అదుపునిడలేను. కాల్పుల్ని జరపడం తప్పించి కలెక్టరు ఏమీచేయలేరు. సామ్రాజ్యవాదుల తుపాకీలకు ఆనాడు పనితప్పింది, పాపం వారును బ్రతికిపోయారు.

సత్యాగ్రహ శిబిరం నిండా సత్యాగ్రహులే. జైలులో పెడతారన్న భయంలేదు సరికదా, మమ్మల్నింకా జైళ్ళలో బంధించరేం అన్న ఉత్సుకతతో ఉండేవారు. దేశభక్తులనిపించుకోవాలి, ప్రజలు మమ్మల్ని అభినందించాలి. స్వరాజ్యం సంపాదించాలి – ఇదీవరస.

తే 20-4-1930 అర్ధరాత్రి కావస్తుంది. పోలీసు పటాలం శిబిరం వద్దకు వచ్చింది. శిబిరంలో సత్యాగ్రహం చేస్తున్నవారిని బయటకు పిలిపించి "మిమ్ములను అందరినీ అరెస్టు చేస్తున్నాం, ఈలారీలోనికి ఎక్కండి" అన్న మాటలకు చాలా సంతోషం అన్న లచ్చన్నగారితో సహాయక బృందమంతా ఒక్కమారుగా లేచి లారీలలోనికి వెళ్ళారు. మొత్తం 58 మందిని ఆ రోజు అరెసు చేసారు. వారెల్ల భుజంగాలవలె బుసలు కొట్టగల వారే అయినా సత్యాగ్రహ మంత్రబద్ధులైనారు, అందరూ లారీలలో నిలబడ్డారు.

లారీలు కదిలాయి, కొమ్మనాపల్లి గ్రామంవైపు పరుగిడుతున్నాయి. లారీలలో నున్న వారెవరు ? దేశభక్తులు. దేశంకోసం త్యాగం చేయటానికి సిద్ధమైన వారు. జైల్లో బంధించడం దేనికి ? నేరము చేసినవాడిని, హత్యలు దోపిడీలు మాన భంగాలు జరిపినవారిని జైళ్ళలో బంధిస్తారు, మరి వీరిని బంధించడం దేనికి ?

లచ్చన్న మనసు ఉద్రేకంతో ఊగిసలాడుతున్నది. వారెల్లరిని ఖైదీలని పిలుస్తారు. మరి వీరిని రాజకీయ ఖైదీలని పిలుస్తారు. ఆ ఖైదీల హృదయాలు నిరంతరం సిగ్గుతో అవమానంతో క్రుంగిపోతూ భగ్గుభగ్గున మండిమాడుతూంటాయి. వీరి మనస్సులు ఆత్మ సంతృప్తి మేరునగమంతటి ఔన్నత్యానికి చేరిపోతుంది. హృదయం ఆనందంతో ఉప్పొంగిపోతూ ఉజ్వల జాతీయ కాంతి కిరణాలతో నిండిపోతూ ఉంటుంది. ఏఒక్కరికి లభించని గౌరవం హోదా అంతస్తులు వారికే లభిస్తాయన్న ఆత్మసంతృప్తిని కలిగిస్తాయి. నిన్నటివరకు తను ఎక్కడున్నది ఎవరికి తెలియదు. ఈనాడు తనెవరన్నది ఈ సంఘం గుర్తిస్తుంది. సమాజం గుర్తించిన వ్యక్తిజీవితం, అజరామరం.

లచ్చన్న ప్రాయమానాటికి 21 ఏండ్లు. ఆనాడు లారీలలోనున్నది తన కన్న వయసులో విజ్ఞానంలో అనుభవంలో పెద్దలయినవారే. ఆనాటి సంఘటన లారీలోనున్న ఇతరులకేవిధంగానున్నా లచ్చన్న కదే తన భావిజీవితానికి నాంది కాగలదని తను భావించలేదు. లారీ ఎంత వేగంగా పోతుంటే అంతకన్న వేగంగా ఆలోచిస్తున్నారు. తను అందరికన్న ఎంతో ఎత్తుగా పెరిగిపోయాను అన్న సంభ్రమాశ్చర్యాలలో మునిగి తేలుతున్నారు.

ఇంతలో హఠాత్తుగా లారీ ఆగింది. లారీ నిలుచుని ఏవేవో ఆలోచిస్తున్నవారి ఆలోచనలన్నీ ఆగిపోయాయి. "కొమ్మనాపల్లి వచ్చింది, మీరంతా లారీలనుండి దిగి ఇళ్ళకుపొండి" అని అరెస్టు చేసిన పోలీసుముఠా కేక వేసింది.

సత్యాగ్రహులు ఊహించనిది. ప్రభుత్వం అరెస్టుచేసింది, జైల్లోపెడతారు అందుకు సిద్ధం అన్నట్లు ఉన్న సత్యాగ్రహులను మిమ్మల్ని విడచిపెడుతున్నాం వెళ్లండి అన్న కేకతో విస్మయం చెందారు.

"మేము లారీలనుండి దిగం, మమ్మల్ని అరెసుచేయండి" అన్న కేకల్లో లచ్చన్నదే పెద్దకేక. ఇందుకు కాళ్ళకూరి కృష్ణమూర్తి నాయకత్వం వహించి తిరుగుబాటు కొనసాగించారు. "అరెస్టు జేస్తామని లారీఎక్కించి మధ్యదారిని లారీ దిగిపొమ్మనడం కుదరదు".

"బాబూ ! మీరు మొండికెత్తి మాప్రాణాలను తీయకండి. కలెక్టరుగారు మిమ్మల్ని ఇచ్చట దిగవిడచి రమ్మని మమ్మల్ని ఆదేశించారు. పై అధికారుల ఆజ్ఞలను మేము పాటిస్తాం."

కొందరు లారీ దిగివచ్చి పోలీసులతో సంప్రదించారు. మరల వచ్చి "మనం గాంధేయ వాదులం, పోలీసులు ఏంచేస్తే దానిని మనం అంగీకరించాలి, లారీ దిగండి, లారీదిగండి" లారీలో ఉన్న ఏఒక్కరు కిమ్మనలేదు. నిశ్శబ్దం. ఇంతలో "చాతకాని సన్నాసులు, మనల్ని అరెస్టు చేయలేక పోయారు. మనకేం, అందరం దిగిపోదాం రండి" అంటూ లచ్చన్న మొదటగా లారీనుండి క్రిందకు దుమికారు. అంతే లారీ ఖాళీ అయింది. నిజానికి ఆనాటికి పోలీసులు చాలామందిని అరెస్టు చేయడం, పల్లెల్లో లేదా దారి మధ్యలో విడుదల చేయడం పరిపాటి. అయితే మన సత్యాగ్రహుల కిదే క్రొత్త. ముఖ్యమైన నాయకులను జైళ్ళవరకు తీసికొని వెళ్ళి వారిని బంధించి, వారితో వెళ్ళిన జనాల్ని మధ్యలోనే విడిచిపెట్టేవారు. వీళ్ళ నందరినీ జైల్లో వేసి పెద్దవారిగా జేయడం ఇష్టంలేకనో, లేక జైల్లో ఖాళీలు లేకనో ఆ నాటి ఇండియా గవర్నర్ జనరల్ ఒక ఆదేశం ఇచ్చారట, 'ఏ ఒకరిని తొందరపడి జైల్లో బంధించకండి' అని. కారణం రాజకీయ నాయకుల సంఖ్య విపరీతంగా పెరిగిపోయింది. జైల్లో పెట్టినవారిని విడుదల చేసిన మరుక్షణం వారికి ప్రజలు వచ్చి పూలదండలు వేసి నాయకులు అని కితాబు ఇవ్వగానే వారు నాయకులుగా గణింపబడక తప్పదుకదా ! అందుకు కొందరిని మధ్య దారిలోనే వదిలి రమ్మని ఆదేశాలిచ్చి ఉంటారు.

సత్యాగ్రహుల్ని కొమ్మనాపల్లి వద్ద దిగవిడచి పోలీసులు వెళ్ళిపోయారు. వంశధార నదీతీరానగల గ్రామం కొమ్మనాపల్లి. సత్యాగ్రహులు గమ్య స్థానాలు చేరుకోవడానికి నడక సాగించడం ప్రారంభించారు. స్వర్గీయ భారత రాష్ట్రపతి వి.వి. గిరిగారి కనిష్ఠ సోదరుడు నడవలేకపోతున్నాడు. కాలికి దెబ్బ తగిలి సెప్టిక్ అయినట్లుంది. కర్రలతో స్ట్రెచర్ తయారుచేసారు. వంతులువారీగా అతనిని మోసుకుంటూ నడక సాగించారు. రాత్రి అయేసరికి గొట్టివాడ అగ్రహారం చేరుకున్నారు. ఒకనాటి రాచరిక ప్రభుత్వాలు, జమీందార్లు, తమ గొప్పదనాన్ని నిత్యం చాటే బ్రాహ్మణీకుల కుటుంబాలకు కొన్ని గ్రామాలనందలి మడి మాన్యాలను వారికి ధారాదత్తం చేసేవారు. వారి వంశాలవారు వారసత్వంగా వాటిని అనుభవించుకొంటారు. అదే అగ్రహారాలుగా మారి అనేక పేర్లు సంతరించుకొన్నాయి. అగ్రహారాల్లో ఉన్నది బుగతలు, మడి మాన్యాల్ని దున్నిపంటలు పండించేది రైతులు. రైతు వ్యవసాయానికి సహాయపడేది కూలి, రైతుకూలీలు. ఏ రైతుకూలీలు ఉన్నత స్థితిగతులను పొందగలిగేవారు కారు. రైతుకూలీలపై జరిగే అక్రమాలకు నిరసనతెలుపుతూ అగ్రహారాలలో మొదటగా సత్యాగ్రహిగా ప్రవేశించారు లచ్చన్న.

దేశం కోసం త్యాగం చేసేవారిని, జైల్లోకి వెళ్లే వారిని ప్రజలు ఎంతగా అభినందించి ఆదరించి సత్కరిస్తారో లచ్చన్న తన విద్యార్థిదశలో తన గురువు నరసింహమూర్తి చెప్పగా విన్నారు. ఈ నాడు ప్రత్యక్షంగా చూసి ఆనందించే స్థితిలోనికి వచ్చారు.

గొట్టతార గ్రామంలో ఉన్న ప్రజలు ఎదురుగా వచ్చారు. సత్యాగ్రహుల్ని ఆదరంగా తీసుకొని వెళ్ళి గ్రామచావడిలో కూర్చుండబెట్టారు. క్రిందటి దినమున నౌపడాలో జరిగిన సంఘటన ఆ గ్రామప్రజలకు తెలియనిది కాదు. ఆ గ్రామములో గల ఆబాలగోపాలం చుట్టుముట్టారు. అప్పటికి ఆ గ్రామ పెద్దలు సత్యాగ్రహులకు భోజనాల్ని సమకూర్చి సిద్ధంచేసి యుంచినట్లుగా భోజనాలకు లేవమన్నారు. గ్రామస్తుల ఆదరణకు సత్యాగ్రహులు మురిసి పోయారు. ఆ రాత్రి ఆ గ్రామంలో వారెల్ల విజయవీరులు. మరునాడు ప్రొద్దుటనే కాఫీ, ఫలహారాల సన్నాయి, వాళ్ల గౌరవాలకు అంతులేదు. వీరి ఆనందానికి అవధులులేవు. సత్యాగ్రహానికి ప్రజలు ఎంతమద్దతు నిస్తారో స్వానుభవంగా మొదటగా తెలుసుకొన్నారు అచ్చన్న. దళం మరల ప్రయాణం సాగించింది. వంశధార నదిని దాటి కాలినడకలో కోటబొమ్మాళి రైల్వే స్టేషనుకు చేరుకున్నారు. మరల నౌపడా చేరుకొని సత్యాగ్రహం సాగించాలని వారి అభిమతం. కోటబొమ్మాళిలో ఈ దళం ప్రవేశించేసరికి అచ్చట కూడ వీరికి స్వాగతం లభించింది. ఆ గ్రామంలో స్వర్గీయ టంకాల రంగన్న అనే వణిక్ప్రముఖు డుండేవారు. అతను తలపండిన కాంగ్రెసువాది. 1920 నుండి కాంగ్రెసు సేవలో మునిగి తేలుతున్నవారు. వీళ్ళను చూచి పొంగిపోయారు. సత్యాగ్రహులకు భోజనాలు పెట్టించి, సగౌరవంగా స్టేషనువరకు వెళ్లి దిగబెట్టివచ్చారు.

రైల్వే స్టేషనులో సత్యాగ్రహదళం అందరిచేత మన్ననలనందింది. రైలు బయలుదేరింది. తిన్నగా నౌపడా స్టేషనులో దిగారు. దిగీ దిగిన వెంటనే వీళ్ళ నందరినీ మరల పోలీసులు లారీలలోనికి ఎక్కమన్నారు. "ఏమిటి మీరనేది? మరల లారీలలో ఎక్కించి, మధ్యదారిలో విడచిపెట్టి పోవడానికా?" అని గద్దించారు అచ్చన్న.

"నాయనా అచ్చన్నా! మనం గాంధేయులం. తిరుగుబాటు అనేదే మన కొద్దు. వారేం చేసినా మనం కిమ్మనక ఉండటమే మన విధానం. అదే గాంధీజీ అభిమతం." లారీలో ఉన్న ఒక కాంగ్రెసువాది మాటలతో సత్యాగ్రహు లెల్లరు అచ్చన్నతో మరల లారీ ఎక్కారు. పోలీసులు వారిని తిన్నగా తీసికొని వెళ్లి టెక్కలి సబ్‌జైల్లో పెట్టి బంధించారు. అచ్చన్న రాజకీయ జీవితానికి నాంది ప్రస్తావన జరిగింది.

# 8. చెరసాలలో లచ్చన్న ఉప్పుసత్యాగ్రహం

గాంధీజీ పిలుపు నందుకుని గంజాంజిల్లా ఆంధ్ర కాంగ్రెస్ కమిటీవారు బారువాలో ఏర్పరచిన ఉప్పుసత్యాగ్రహోద్యమం సాగింది. సత్యాగ్రహ దళంలో లచ్చన్న యువక బృందానికి నాయకుడు. నిత్య ఆవేశం, సదా ఉద్రేకం కల లచ్చన్నను ఆనాటి దళంలోవేరొకరు అధిగమించలేకపోయారు. అందరూ ఈతనిని గుర్తించేవారు. ముఖ్యంగా పెద్దఅయిన కాంగ్రెసువాది కాళ్ళకూరి కృష్ణమూర్తిగారు. జైల్లో లచ్చన్నను చేరదీసి అందరికన్న మిన్నగా జూచేవారు.

టెక్కలిలో సత్యాగ్రహులను అరెస్టుచేసినారనగానే పల్లెప్రాంతం అంతా తిరగబడింది వారినిచూడడానికి. జైల్లో వేయటమంటే ఇక మరి జన్మలేనట్లే, వారిముఖాలు ఇకకన్పించేది లేదు, వారుఎక్కడ ఉంటారో, ఎలాఉంటారో ఎవరికీ తెలియదు. తెల్లదొరల కళ్లబడినవారి బ్రతుకులు తెల్లారిపోయినట్లే అన్న నమ్మకాలతో అమాయక గ్రామీణప్రాంత ప్రజలుండేవారు.

జైలు జీవితం ఈనాటివలె కాదు. ఆనాడు పౌరహక్కులు నామ మాత్రంగా ఉన్న కాలమది. ఖైదీలు అన్నపదం అప్పట్లో సమాజంలో భయంకరమైన శబ్దం. భీతావహం పుట్టించే శబ్దం. ఇరుకుగదుల్లో, ఊపిరిఆడని స్థితిలో కటకటాల మధ్య బంధిస్తారు. అదిఎంత నికృష్టమైనదో, దుర్భరమైనదో, బాధాకరమైనదో ఊహాకందనివిషయం. మానవుడు స్వేచ్ఛాజీవి. ధన, మాన, ప్రాణాలను అర్పిస్తాడేకాని బంధించబడి యుండడానికి సుతరాము అంగీకరించడు. ప్రాచీన గ్రీకులను శత్రువులు స్వేచ్ఛకావాలా ? ధన సంపదలు కావాలా అని ప్రశ్నిస్తే స్వేచ్ఛనే ఎన్నుకొన్నారట.

టెక్కలి పట్నం, పల్లెప్రజలు జైలుచుట్టు చేరారు. సబ్ కోర్టు, బజారు అన్నీ ఆనాడు కలిసేఉండేవి. బజారుకువచ్చినవారు, కోర్టుకువచ్చినవారు లచ్చన్న వగైరా సత్యాగ్రహుల్ని చూడటానికివెళ్లేవారు. చూడటంలో విశేషం – వింతమనుష్యులుగా వారిని చూసేవారు. కుతూహలంతో జూసేవారు. ఎందుకంత జిజ్ఞాస వారిమనస్సుల్లోఆనాడు కలిగేది ? ప్రభుత్వాన్ని ఎదిరించేవారికి ప్రాణాలుండవు అనే అభిప్రాయంగల ఆకాలంలో గవర్నమెంటుకు ఎదురుతిరిగి వీరు పోరాడుతున్నారా అనికొందరు, స్వరాజ్యంఏమిటి ? ఉప్పుసత్యాగ్రహ మేమిటి ? ఇందులో మనకు వచ్చిందేమిటి ? అనే అజ్ఞానపు వాదస్తులు కొందరు, మనం పిరికివారమైనా నిజానికి వీరు పౌరుషవంతులు, దేశానికి తగినవారనీ అభిమానిస్తూ జూచినవారు కొందరు.

లచ్చన్న వారినిజూచి మనసులో ఉప్పొంగిపోయేవారు. ఒక్కొక్క మారు ఆవేశపడిపోయేవారు. రాజకీయ ఖైదీలుగా ఉన్నవారిని ఇతరఖైదీల్లా చూడక పోయినా అనాడు రాజకీయ ఖైదీలకున్న సదుపాయాలు శూన్యం.

చెరసాలలో వీళ్లందరికీ నాయకుడు కాళ్లకూరి కృష్ణమూర్తి గారు. వీరిని గాంధీదాసు అని పిలిచేవారు. అలానే పిలవాలి. లేనిచో పలకడమన్న మాటేలేదు. అంతగాంధేయవాదీ 1920లో సహాయ నిరాకరణోద్యమంలో ఎదురు తిరిగి జైల్లో శిక్ష అనుభవించిన వారందరికీ అతడే జైల్లో రాజకీయ గురువు. వయసులో, అనుభవంలో, విజ్ఞానంలో పెద్దవాడైన గాంధీదాసుగా రన్న అందరికీ గౌరవం. అతడు గాంధీగారివలె బలిమి కలిమి ఉన్నా నిరాడం బరతపై ఎక్కడ లేనిమక్కువ, ఇంట్లో ఉంటే అంగవస్త్ర ధారణ—గాంధీదాసు కదా ! బైటకువస్తే – పైజామా, తలపై గాంధీ టోపీ, ఖద్దరులాల్చీ, బాడ్జీతో చేయెత్తు కర్రకు కాంగ్రెసుజండాను కట్టి 'గాంధీగారికి—జై' అంటూ బయటతిరిగే రాజ కీయనాయకుడు. చామన ఛాయ, అజానుబాహువు. చూసీచూడగానే ఇతడు దీక్షాదక్షుడు అన్న భావం ఇతరులకు కలుగుతుంది.

చిన్నచిన్న గూళ్లులాంటి గదుల్లో నిర్బంధించిన వీరందరు బయటకువచ్చి ఒకచోట కూర్చొని ఉన్నపుడు గాంధీదాసు వీరికి రాజకీయ విశేషాలను పేపర్లో చదివి చెప్పేవారు. జైల్లో గాలి రాకపోయినా, దుర్గంధంగా ఉన్నా, దేశ మాతను రక్షించుకోవాలన్న సంబరంలో వీటిని మరచిపోయేవారు.

రాజకీయ ఖైదీలన్నవారిని సుఖపెట్టాలని లేదుకదా, ప్రొద్దస్తమానం వాళ్ళతో ఏవో చాకిరీపనులను చేయించేవారు, ఆ నాటికి ఆ జైల్లో ఉన్నవారెల్ల లచ్చన్నతో సహా మొదటగా జైలుజీవితాన్ని చవిచూచినవారే తప్ప పాతవారు కాదు, ఒక్క గాంధీదాసుగారు తప్ప.

గాంధీదాసుగారు నిరంతరం జాతీయనాయకుల గొప్పదనాన్ని చెప్పేవారు. ఆ నాయకుల జీవితాల్ని చదివి వినిపించేవారు. రాత్రింబవళ్ళు కటకటాలమధ్య క్రిక్కిరిసి వాళ్ళంతా ఉండేవారు.

వీళ్ళంతా పిల్లలు. ఏదో ఉద్రేకంలో వచ్చినవారు. ఒకవేళ వీళ్ళ ఉత్సాహం ఉద్రేకం సన్నగిల్లితే పైవారు చల్లగా జారుకుంటారేమోనని అతని భయం. అందుకు జైలువద్దకు వచ్చినవారికి చేయెత్తి పిలచి దగ్గరకు రమ్మని అందరూ వింటుండగా చెప్పేవారు "వీరిని చూడండి. వీళ్ళంతా యువకులు. దేశంకోసం, మన మాతృభూమికోసం, మన స్వరాజ్యంకోసం, ఎంత త్యాగం చేస్తున్నారు ? ఎన్ని కష్టాలు పడుతున్నారు ? మరి మీరేంచేస్తున్నారు ? మమ్మల్ని చూసి *పడమేనా ? కనీసం మీరు వెనకనున్నా ముందున్నవారిని ప్రోత్సహించాలి. మీరు వీరికి అన్ని విధాలా తోడ్పడాలి" ఇది ప్రజలు విని ఎంతో సంబరపడిపోతూ

వారికి తినటానికి పళ్లు ఫలహారాల్ని తెచ్చి అందించేవారు. పిండివంటల్ని చేసి కూడ తెచ్చియిచ్చి వారు తింటుండగా చూచి మురిసిపోయేవారు. కోర్టుకి వచ్చిన ప్లీడర్లతో, కక్షదార్లతోను ఇలానే చెప్పేవారు. వారు సహాయం చేసేవారు.

జైలు అధికారులు ఈ వ్యవహారాల్ని జూస్తూ విస్తుపోయేవారు. మనసులో ఈర్ష్యపడేవారు. వీరికి ఇంత గౌరవమా ? జైలు అధికారులు వచ్చి తర్జనభర్జనలు చేసేవారు అధికారుల ఆధిపత్యాన్ని నిలుపుకొనే ప్రయత్నం చేస్తూంటే గాంధీదాసు "ఎవర్రా మీరు ? మేమేమి దొంగలమా ? స్వాతంత్ర్యం వచ్చితీరాలంటున్న దొరలం. స్వాతంత్ర్య వీరులం, స్వాతంత్ర్య సమరయోధులం, పిరికివారం కాదు. మీలా బానిస బ్రతుకులు మావి కావు. రాజకీయ ఖైదీలు వేరని, ఈ ఖైదీల్లోనే ఎ బి సి అనే వర్గ విభేదాల్ని మీరు కల్పించినప్పటికి అందరికీ ఒకే విధమైన ఆహారాన్ని, స్వేచ్ఛను మీరు అందించకపోయినా మేమెల్ల రాజకీయ ఖైదీలమే. దొంగలం, ఖూనీకోరులంకాదు త్యాగాల్ని చేస్తున్న మమ్మల్ని ఎవరైన ఏమైన అంటే అది వారి తెలివితక్కువతనం తప్పించి మా గొప్పదనానికేమీ మచ్చరాదు" అంటూ జైలు అధికార్లతో ప్రతిదినం పోరాడుతూనే ఉండేవారు.

ఈతని ధాటికి తట్టుకోలేక పోలీసులు వీళ్ళను వరండాలో పడుకోనిచ్చే వారు. పగలంతా ఆ చీకటికొట్టులో ఉండాలి. ఇలా జరిగిన కొన్నాళ్ళకు కృష్ణ మూర్తిగారిపై విచారణ జరిపి శిక్షవేసి రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపించారు. మిగిలిన కొందరిపై విచారణ జరిపి లచ్చన్నగారితో సహా వారిని నరసన్న పేట సబ్‌జైలుకు మార్చారు.

గాంధీదాసుతో మరి నలుగురికి విచారణ జరిపి లచ్చన్నగారి బృందంనుండి విడదీసారు. తెల్లదొరల బంటులైన జైలు అధికారులు రాజకీయ గురువుగా గాంధీ దాసుగారుండటం చూడలేకపోయారు. అనుభవంగల పెద్దలను విడదీసి యువబృందాన్ని నరసన్న పేట జైలుకు పంపించారు. వారు మొత్తం 45 మంది.

నరసన్న పేట జైల్లో అసలైన బాధలు ప్రారంభమైనవి. కాలకృత్యాల్ని తీర్చుకోవటానికి దూరంగా ఉన్న చెరువుకు తీసుకొని వెళ్ళడం, కుండల్ని చేతికివ్వడం, పొరపాటున కుండ బ్రద్దలైతే మండ చిదకగొట్టటం, స్నానాలు చేసికొని రావడం, కుండల్లో నీళ్ళు మోసుకొని రావడం, వంటలు చేయడం, భోజనాల్ని చేయడం, చుట్టూ యమభటుల పారాహుషార్. అత్యవసర సమయంలో కాలకృత్యాల్ని తీర్చుకోవటానికి జైల్లో చట్టిముంత లిచ్చేవారు. అందులోనే అన్నీ జరగాలి. వాటిని మరునటి దినం మోసుకుపోయి వాటిని వీళ్ళే కడగడం మళ్ళా వినియోగించుకోవటానికి.

సత్యాగ్రహుల్లో చాలామంది ఈ దుర్భర జీవితానికి తట్టుకోలేకపోయారు. ఉద్రేకం, ఉత్సాహం తగ్గి దేశభక్తి సన్నగిల్లడంతో కొంతమంది వెనుకడుగు

వేసారు. "ఇప్పుడు మీరు పడుతున్న బాధలు ఏ మాత్రం? శిక్షపడిన తరువాత మరీ దుర్భరంగా ఉంటాయి" అని పోలీసులు హెచ్చరించేవారు.

"జవాన్‌గారూ మా జబ్బ సత్తువ మీకు తెలియదు. మా గుండె బలం కూడ మీకు తెలియదు. మాయ మాటలు చెప్పినా, మంత్రాలు వల్లించినా మేము జడిసేది లేదు" అంటూ లచ్చన్న ఎదురు జవాబు చెప్పేవారు. తదుపరి కార్యక్రమాలు కొందరు అనుసరించేవారు. కొందరు నీరసంగా కూర్చుంటే "ఏమిటి లేవరా?" అన్నమాటలకు "ఏం లేస్తాములా! కడుపులో నొప్పి, తల గిర్రున తిరుగుతుంది, వంట్లో వికారం, మేం మీతో సాగలేం, మీరు వెళ్ళిరండి" అని కొందరు వెనుకకు తగ్గి కూర్చుండిపోయేవారు.

కొంతకాలానికి ఈ బాధలు భరించలేక, నీరసించిపోయి "తెలియక వచ్చాం. మాకు దేశం వద్దు. స్వతంత్రం వద్దు. మేము, మా తల్లిదండ్రులు సుఖంగా ఉంటేచాలు. భవిష్యత్తులో సత్యాగ్రహం అని ముందుకురాము. మమ్మల్ని క్షమించి జైలునుండి విడిచిపెట్టండి" అని క్షమాపణ పత్రాలు జైలు అధికారులకు అందించగా అది విన్న లచ్చన్నగారు "45 మందిమి టెక్కలి జైలునుండి వచ్చాం, చివరకు మిగిలింది మన ఎనమండుగురమేనా" అని లచ్చన్న వాపోయారు.

అధికారుల దమననీతి, పోలీసుల జులుం వీటిని తట్టుకోవడం సాధ్యమా? "ఏమిటి మీరూ క్షమాపణ పత్రాలిచ్చి వెళ్తున్నారా?" అన్న లచ్చన్న ప్రశ్నకు "అవును. మేము బాధలు భరించలేం. ఒకటి రెండు రోజులేగదా అని జైలుకువస్తే అందరూ గౌరవిస్తారని భావించామేగాని జీవితకాలం శిక్షవేయొచ్చని, ఉరిశిక్ష కూడా వేయొచ్చని అందరూ చెబుతున్నారు" అని భయపడుతూ చెప్పారు. "మీరు పిరికివారు. మనం త్యాగం చేయడానికీ, దేశానికి సర్వస్వం సమర్పించడానికి వచ్చాం. ఇలా మీరంతా జారుకుంటే మనకు స్వరాజ్యం వచ్చేదెప్పుడు?" అని లచ్చన్న వారితో అన్నప్పుడు "వచ్చినప్పుడే రానీ. మాకెందుకు ఈ ఖానీకోర్లుండవలసినచోట ఉండటం" అంటూ వెళ్తున్న తన సహచరులను వారించలేకపోయారు లచ్చన్న.

వరవన్నపేట జైల్లో 40 దినాలు బంధించారు. విచారణ జరపలేదు. 45 మంది రాజకీయ ఖైదీలకుగాను లచ్చన్నతో కలిపి 8 మంది మాత్రమే మిగిలారు.

నిత్యం జైల్లో క్రిక్కిరిసిన గదుల్లో, గాలిరాని వెలుతురులేని గదుల్లో ఉండటం, ఉదయాన్నే లేచి మట్టికుండల్ని భుజాన వేసికొని నీళ్లతెచ్చుకొని కోడు ఆవరణలో సబ్ జైలుకు ఎదురుగా వంట వండటం, ఆ వండినది తినడం, తినడం పూర్తయ్యాక మరల వారిని లాకప్‌లో పెట్టడం ఇదీ దినచర్య. ఈ చర్య

లన్నీ ముగిసేసరికి ఉదయం 9 గంటలయ్యేది. 10 గంటలకు మేజిస్ట్రేటు కోర్టుకు వస్తారు. ఆ సమయానికి వారెల్లరూ లాకప్‌లో ఉండాలి.

లచ్చన్నగారు మిగిలిన సహచరుల్ని దగ్గరకు పిలిచారు. "మన మొక ఎత్తుగడ వేద్దాం. ధైర్యంగా ఆ పనిని చేద్దాం" అని ఒక చిన్న పథకాన్ని చెప్పారు. అందరూ సరే అన్నారు. అందుకు సంసిద్ధులం అని చెప్పారు. ఆ మరునాడు ఉదయం కోర్టుహాలువద్ద వంటవండే ప్రయత్నంలో ఉన్నారు. 10 గంటలు కావస్తుంది. వంట పూర్తికాలేదు. పోలీసులు వచ్చి "ఏమిటి మీ తతంగం, ఎప్పటికి వంట పూర్తవుతుంది. మేజిస్ట్రేటుగారు వచ్చేస్తారు. వంట ముగించుకొని వెళ్లండి" అని గద్దించారు.

"చూడండి జవాన్లూ! ఆవేశపడిపోకండి. మాకు పెట్టిన బాధల్ని ఎలానూ భరిస్తున్నాం. కనీసం నాలుగు మెతుకులన్నా వండుకొని తిననివ్వండి."

"ఏమిటయ్యా నీ పొగరు ? ఎదురు తిరుగుతున్నావ్ ? మక్కెలు విరగ్గొట్టాలా ?" ఆవేశంతో హెచ్చరించారు.

"అయితే రా. ఈ కుండల్ని నేలకుకొడితే ఎలా పిండి అవుతాయో అలా మిమ్మల్ని పిండిచేసి వదిలేస్తాం" లచ్చన్న మాటలకు పోలీసులు ఉద్రేకపడి పోయారు.

ఇంతలో దూరంనుండి మేజిస్ట్రేటుగారు వస్తున్నారు. ముందుగా దస్తరం డేతరవేసుకున్న బంట్రోతు ప్రత్యక్షం. లచ్చన్నతో సహా అందరూ వంట చేస్తున్నట్లు నటిస్తూ ఆపనీ ఈపనీ చేయడం ప్రారంభించారు. వస్తున్న మేజిస్ట్రేటుగారికి సలాంకొడుతూ ప్రక్కకు తొలగి నిల్చున్నారు పోలీసులు.

మేజిస్ట్రేటు కోర్టు ఆవరణలోకి ప్రవేశించారు. ప్లీడర్లు, కక్షిదార్లు కోర్టు హాల్లోకి ప్రవేశిస్తున్నారు. ఇంతలో వంటవండినట్లు నటిస్తున్న రాజకీయ ఖైదీలు లచ్చన్నతోసహా చేతుల్లో కుండల్ని సంధించుకొని మేజిస్ట్రేటువైపు పరుగెత్తడం ప్రారంభించారు. పోలీసులు తుపాకులను సంధించడంలో నిమగ్న మవడం, దబాలున ఆ కుండల్ని ఖైదీలందరు ఒకేసారి మేజిస్ట్రేటు ముందు భాగంలో పరుగెత్తి నేలపై కొట్టారు. ఆ శబ్దంతోపాటు బిగ్గరగా నినాదాలు కలిసాయి. "మమ్మల్ని విచారించండి. శిక్షలు వేయండి, ఎన్నాళ్లీనరకం ? ఆలస్యంచేస్తే అంగీకరించం" అని బిగ్గరగా లచ్చన్న అరవడం, చేతులెత్తి జై జై నినాదాలు చేయడం జరిగింది. ఇది విన్న మేజిస్ట్రేటు ప్రాణాల్ని బిగబట్టుకొని కోర్టు ఆవరణలోకి అడుగిడిన మరుక్షణం "ఎవరచ్చట ? వెంటనే వీరిని విచారణ జేస్తాను. కోర్టులో హాజరు పెట్టండి. ఈ దినమే తక్షణమే "అని కోపంగా తన విశ్రాంతి గదిలోనికి జారుకున్నారు.

ఇంతలో రాజకీయ ఖైదీలు చుట్టుముట్టారు. పోలీసులు ఏమనటానికి? వీరు ఖైదీలు కారు, రాజకీయ ఖైదీలు. విచారణ జరిగింది. "మీరు రాజద్రోహులు" మెజిస్ట్రేటుగారి హుకుం. "ఎన్నటికీ కాము. మేము దేశభక్తులు" రాజకీయఖైదీల నినాదం. "అయితే మీరు ఒక నెలపాటు కఠినకారాగారవాసాన్ని అనుభవించండి" ఇది ఆ మేజిస్ట్రేటుగారి ఆనాటి తీర్పు. తీర్పు వెలువడిన మరుక్షణం లచ్చన్నను మిగిలిన రాజకీయ ఖైదీలందరిని ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోగల బెరహంపూర్‌లో జైలుశిక్ష అనుభవించటానికి నరసన్నపేటనుంచి వీరిని తరలించారు. లెక్కలో, నరసన్నపేట సబ్‌జైల్లో అప్పటివరకు వారు రిమాండ్‌లో అనుభవించిన శిక్ష 40 దినాలు. ఇక తీర్పు ప్రకారం శిక్షాకాలం 30 దినాలు, బెరహంపూర్ జైల్లో గడపాలి.

రాజకీయఖైదీలు రిమాండులో ఉన్నంతకాలం వారికి తోచిన బట్టలను వారు ధరించుకోవచ్చు. అయితే శిక్షపడి అనుభవించవలసిన దినంనుంచి వారు ధరించిన బట్టలను జైలు అధికారులకు అప్పగించి జైలు సూపరింటెండెంటు ఇచ్చిన బట్టలను ధరించాలి. సి క్లాసు ఖైదీలకు ఒక నెల కఠినశిక్ష.

బెరహంపూర్ క్వారంటైనలో వీళ్ళకు జైలుగుడ్డల్ని ఇచ్చి కట్టుకోమన్నారు. "మేము కట్టుకోం, అవి విదేశీ వస్త్రాలు. విదేశీ వస్త్ర బహిష్కరణ మా ఉద్యమ లక్ష్యం. ఎంత మాత్రం మేం ధరించం" అన్న లచ్చన్న సమాధానంతో అధికార్లు "మిమ్మల్ని బట్టల్ని ధరించనిదే వదలిపెట్టం" అని కర్కశంగా చెప్పారు.

"అయితే మీరిచ్చిన బట్టలను లాగి పారేసి దిగంబరంగా ఉంటాం, తప్పించి వాటిని ధరించం. ఖద్దరు బట్టల్ని తెప్పించండి" లచ్చన్న మొండి సమాధానం.

"బాబూ ఇది జైలు నిబంధన. ఈ నిబంధన మీకోసం మార్చగలమా ?"

"ఎవరికోసం మార్చుతారు, మిమ్మల్ని మార్చటానికి మేము వస్తున్నాం."

"మాటల సమాధానాల్ని తగ్గించి ఈ బట్టలు వేసుకో. జవాన్లూ! వీరికి ఈ బట్టలు తొడిగించండి" అని ఆదేశించాడు జైలు సూపరింటెండెంటు. బలవంతంగా బట్టల్ని తొడిగించి గదుల్లోకి తరలించారు.

దీనితో ఉడుకెత్తిన లచ్చన్న సహచరులకు కన్నుగీటుతూ "మనమందరం బట్టల్ని విప్పేసి దిగంబరంగా ఉందాం సరేనా" అనగానే అందరూ సరేనన్నారు. అంతే అందరూ దిగంబరులైనారు. వీరిని చూసి జైల్లో ఉన్న వారెల్ల నివ్వెరపోయారు. దిగంబరులుగా ఉన్న వీరంతా గెంతటం, మాకు ఖద్దరు వస్త్రాలు కావాలనడం, జైల్లో గగ్గోలు పుట్టించింది. సుమారు 6 గంటలు దిగంబరులుగా ఉండిపోయారు.

అదే సమయంలో బెరహాంపూర్ జైల్లో శిక్ష అనుభవిస్తున్న శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య గారి చెవిలో ఈ విషయం పడ్డది. ఆనాటికే కాంగ్రెసు నేతగా, రాజకీయ వ్యక్తిగా పేరొందిన వ్యక్తి. అతని వద్దకు జైలు అధికారులు వెళ్ళి ప్రాధేయ పడ్డారు. వెళ్ళి వారిని ఎలాగైన ఒప్పించి బట్టలు వేసుకొనేలా చేయమని.

గొట్టిపాటి బ్రహ్మయ్య లచ్చన్న వగైరా సత్యాగ్రహుల మనోదీక్షకు లోలోన ఆనందించి వాళ్ళ వద్దకు వెళ్లారు. అందరు నమస్కరించారు. "చూడండి ఉద్యమకారులూ! మనది ప్రశాంతమైన ఉద్యమం. మీరిలా ప్రవర్తించకూడదు" "ఖద్దరు బట్టలు కావాలనడం తప్పా ?" లచ్చన్న ప్రశ్న. "మనం ఖైదీలం. పౌర హక్కులను వాళ్ళ దృష్టిలో లేనివాళ్లం. అలా అడగడం తప్పు. నామాట వినండి" అని నచ్చచెప్పారు ఆయన.

"మీరు పెద్దలు, మీమాట వింటాం" అంటూ బట్టల్ని అందరూ శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య సమక్షంలో ధరించారు.

"ఎవరు నాయనా నీవు? లచ్చన్నవా? ఆవేశం ఉత్సాహం గలవాడివే. నీలాంటివాళ్ళు లేకుండా మనకు స్వరాజ్యం ఎలా వస్తుంది? తప్పక నీవంటి ఉద్యమకారులుండాలి" అంటూ భుజం తట్టి తన గదికి వెళ్తున్న శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యను చూచి తానెంతటి అదృష్టవంతుడు. అంతటి రాజకీయనేతచే గుర్తింపబడ్డాను అని మనసులో లచ్చన్న భావించిన మధుర సమయమది.

లచ్చన్న 1930లో ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నందుకుగాను చిక్కోలు నరసన్నపేట సబ్ జైల్లో 40 దినాలు రిమాండులో ఉంచబడ్డాడు. కోర్టు తీర్పు మేరకు ఆరు నెల శిక్షను బెరహాంపూర్ జైల్లో అనుభవించారు.

బెరహాంపూర్ జైల్లో నిత్యం మగ్గాలతో గోనెపట్టాలను రాజకీయ ఖైదీలచేత నేయించేవారు. కావాలనే తను నెమ్మదిగా నేసేవాడు. "బాబూ! మీరు మరి నెమ్మది. త్వరగానే పూర్తిచేయండి" అని జైలు అధికారులు వీరికి చెప్పేవారు.

శిక్షాకాలం నెల దినాలు బెరహాంపూర్ జైల్లో గడిపి లచ్చన్న తన సహచరులతో విడుదలయ్యారు. జైలు నుండి విడివడిన దినమున తన జీవిత దృక్పథంలో వచ్చిన మార్పునకు తనే ఆశ్చర్యపడినాడు. దేశమాత సంకెళ్లను త్రెంచటానికి ముందుకు లంఘిస్తున్న విప్లవయోధుల్లో తనొకడిని అన్న భావంతో దేశభక్తి, ఆత్మత్యాగం నిండిన మనసుతో విజేయునిగా తనింటికి చేరారు. తన గ్రామములో ఇతడొక దేశసేవాసక్తి కలవాడని, దేశభక్తుడని, త్యాగనిరతుడని గుర్తించారు. ఉత్సాహవంతుడై తన ఆశయ సాధనలో మొదటి మెట్టును దాటిన వాడు. చివరికి తన గమ్యస్థానాన్ని చేరుకోవడంలో ఎన్నటికీ విజయుడే కాగలడు.

గాంధీ ఇర్విన్ ఒడంబడిక సంధితో ఉప్పు సత్యాగ్రహం ముగిసింది. కల్లుకొట్లు, సారా కొట్లు వద్దకు వెళ్ళి కల్లు త్రాగవద్దని చెప్పడం శాసన ధిక్కారం కాదని బ్రిటిషు రాజరికం అంగీకరించింది.

పర్లాకిమిడిలో సత్యాగ్రహంలో పాల్గొన్నవారికి అభినందనసభ జరిగింది. 1930-31లో తనకు ఆసభలో పాల్గొని సత్యాగ్రహిగా అభినందనల్ని అందు కోమని పంపిన ఆహ్వాన పత్రం అప్పన్న రాజకీయ జీవితంలో రాజకీయ సోపానంలో మొదటి మెట్టు నధిష్ఠించినట్లుగా తనను ఆనందోల్లాస తరంగాలలో ఓలలాడించింది.

# [illegible]. సత్యాగ్రహి లచ్చన్న

మద్యపాన నిషేధ ప్రచారోద్యమం :

గాంధీజీ ప్రమేయం లేకుండానే 1930లో నవంబరు నెల 12వ తేదీన లండన్‌లో రౌండుటేబుల్ సమావేశాన్ని జరిపింది బ్రిటిష్ రాచరికం. భారతీయుల్ని ఆహ్వానించింది. మహాత్ముడు వెళ్ళి పాల్గొన్నా ఫలితం పూజ్యం. భారతకోకిల సరోజినీ నాయుడు మహాత్ముని అనుసరించి లండన్ వెళ్లడం జరిగింది. భారత దేశం నుండి మైనారిటీల తరఫున జిన్నా ముస్లిం ప్రతినిధిగా, దళిత జాతుల తరఫున డా. అంబేద్కర్ హాజరై చర్చలు జరిపారు. బ్రిటీషువారి విభజించు పాలించు అన్న ఒరవడిని ఈ సమావేశాల్లో ప్రవేశపెట్టారు. భారతదేశాన్ని హిందువులుగా ముస్లింలుగా దళిత వర్గాలుగా విభజించి పాలించే పద్ధతులను ప్రవేశపెట్టడానికి ఉద్యమించారు.

బెరహంపూర్ జైలునుండి విడుదలై వచ్చిన లచ్చన్నకు భవిష్యత్ ప్రణాళిక అర్థంకాలేదు. ప్రతి దినం దినపత్రికల్ని చదవడం, అందలి విషయాల్ని ఇతరులకు వివరిస్తూ కాలం గడపడం. ప్రతి దినం అన్ని రాష్ట్రాల బ్రిటీషు వారి రాచరిక దుష్కృత్యాలను ప్రజలకు తెలుపుతూ ఉండేవి పత్రికలు. ఆనాడు దిన పత్రికలు ఈనాడు అంతసంఖ్యలో ఉండేవి కావు. పరిమితంగా నుండేవి. చదువరులు తక్కువ. ప్రాపంచిక విజ్ఞానం కావాలనుకొనే వారు, దేశాన్ని పఠించుకొనేవారు అరుదుగా ఉండేవారు. దారుణ హింసాకాండ, పన్నుల వసూళ్ళలో దండన, దేశభక్తి అని కాంగ్రెసు జెండా చేత పట్టుకొని గాంధీజీకి జై అన్న వెంటనే లాఠీచార్జి చేసి, కాళ్ల చేతులను విరగ్గొట్టి జీపుల్లో ఎక్కించి, జైళ్ళలో పడదోసి చిత్రహింసలకు గురిచేస్తున్న దినాలు.

బ్రిటీషు వారిది దారుణ హింసాకాండ. మహాత్మునిది అహింసా విధానం. హింసను అహింసతో జయించాలన్న గాంధీజీ వాదనలోని అంతర్యాన్ని అంతగా తెలిసికొనలేని వయస్సు లచ్చన్నది. విప్లవబాటలో వెళ్లాలని. అందులోనే పరుగులు తీద్దామని భావించిన మనస్తత్వం మనసు గాంధేయ విధానం వైపు మరలిపోయేది. స్త్రీలను సహితం హింసిస్తున్న తెల్లదొరలను పట్టుకొని ఉతికి బాకిరేవు పెట్టాలన్న ఆవేశం కలిగేది.

ఒకనాడు బారువాలో గల యువకులందరిని ప్రోగుచేసారు. కాంగ్రెసు జండాలు సంపాదించారు. ఊరేగింపు జరుప తలపెట్టారు. మూర్ఖ తెల్లదొర

తనం, కార్లాయి గట్టితేనేమి, మాగాంధి మాలడై తిరిగితేనేమిటి అంటూ గాంధీజీ జై అంటూ వీధుల్లో తిరిగారు.

ఇంటికివచ్చిన లచ్చన్నతో ఏరా ఏదో జైలుకి వెళ్ళి ఉద్ధరించావుగా మళ్ళి చదువుకో నామాట వినరా, అని వాపోయాడు తండ్రి వీర్రయ్య.

"అసలు నీవ్యవహారమేమిటి, నీ సంగతి చూడు, ఇలా వీధుల్లోపడకు. రైల్వే స్టేషనులో టెలిగ్రాఫ్ డిపార్టుమెంటు వాళ్ళతో మాట్లాడాను. నీవు లోపాయి కారిగా వెళ్ళి శిక్షణపొందిరా. ఉద్యోగం వస్తుంది, హాయిగా ఉండవచ్చు" అన్న సత్యనారాయణ మాటను కూడా కాదనలేదు. ఊకొట్టారు. కొన్నాళ్ళు స్టేషనుకు సైకిలుపై వెళ్ళేవారు కూడా. తరువాత షరా మామ్మూలే.

తనకు తనపై నమ్మకం ఏర్పడినది. అవసరమైతే విప్లవ కారులవలె విజృంభించగలరు లేదా గాంధీజీ అహింసా వాదానికి కట్టుబడి దౌర్జన్యరహిత విధానాలను కొనసాగిస్తూ ఎంతకఠిన శిక్షనైనా భరించగల మానసిక సౌష్ఠవాన్ని శరీరపటుత్వాన్ని ఆనాడు పెంపొందించుకున్నారు.

1931 జనవరి 25వ తేదిన ఇర్విన్ ప్రభుత్వ గాంధీజీతో సహా సత్యాగ్రహ నాయకులను జైళ్ళలోనుండి విడుదలచేశారు. గాంధీ-ఇర్విన్ ఒప్పందం జరిగింది.

1930 జనవరి 31వ తేదిన గాంధీజీ సహాయనిరాకరణోద్యమానికి నాందిగా ప్రకటించిన సూత్రాలు. స్వరాజ్య సాధనగల పరిపూర్ణమైన సత్యాలుగా నెంచి స్వరాజ్యాన్ని తెచ్చిపెట్టగలవన్న భావంతో గాంధీజీ ఈ క్రింది సూత్రాల్ని ప్రకటించి అంగీకరించమని బ్రిటిషు రాచరికానికి లేఖద్వారాతెలిపారు :

1) మద్యపాన నిషేధచట్టం చేయాలి
2) మారకపు విలువను (రూపాయి) పునరుద్ధరించాలి
3) కడా శిస్తులు భూమి తగ్గించాలి
4) ఉప్పు పన్నును తొలగించాలి
5) సైనిక ఖర్చులో 50 శాతం కోత విధించాలి
6) వస్త్రపరిశ్రమకు రక్షణ కల్పించాలి (విదేశీపరిశ్రమలనుండి)
7) నౌకాచిరణంలో ఇండియా ప్రాధాన్యాన్ని పెంచాలి
8) హత్యలు చేయని రాజకీయనాయకుల నెల్లరను జైళ్ళనుండి విడుదల చేయాలి

9) కాంగ్రెసు పార్టీని వేధిస్తున్న క్రిమినల్ శాఖను ఎత్తివేయాలి, లేదా అదుపులోనిడాలి.

10) శాంతిభద్రతలకులోబడి ఆత్మరక్షణకు ఆయుధాల్ని వినియోగించు కొనేలా చూడాలి. పై లక్ష్యసాధనకై 1930 మార్చినెల 12వ తేదిన గాంధీజీ

78 మంది సహచరులను వెంటబెట్టుకుని తన సబర్మతి ఆశ్రమమునుంచి బయలుదేరి దండి గ్రామం వద్ద ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనడం జరిగింది. దేశం దేశం ఆయనతో కదిలింది. ఆ విజయ సాధనలోనే గంజాం జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ ఆధ్వర్యాన ముందడుగు వేసిన లచ్చన్న ఉప్పుసత్యాగ్రహములో పాల్గొని జైలు శిక్షకు గురి కావలసి వచ్చింది. విడుదలానంతరం తారువా చేరిన లచ్చన్న ఖాదీ కార్యక్రమంలో తల దూర్చడం ప్రారంభించారు.

గాంధీజీ ఇర్విన్ ప్రభువు ఒప్పందంలో సత్యాగ్రహ నాయకులు విడుదల చేయబడ్డారు. మద్యపాన నిషేధానికి విదేశీ వస్తు బహిష్కరణకు ప్రచారం చేసుకోవటంలో గల హక్కులను ప్రభుత్వం కలిగింపవలెననుటకు అంగీకరించింది. ప్రతి ఒక్కరు ఇండియాలో బహిరంగంగా వీటిని అనుసరించమని చెప్పవచ్చు, ప్రచారం చేసుకోవటానికి అంగీకరించారు.

లచ్చన్న తన స్వగ్రామం తారువా రైల్వే స్టేషన్‌లో ట్రైనింగ్ పొందుతుండగా ఒక దినమున ఒక లేఖ అందింది అందులో ఒక ఆహ్వాన పత్రం ఉంది. లేఖ విప్పి లచ్చన్న చదువుతూ నివ్వెరపడిపోయారు. తనకు తనతో జైళ్ళకు వచ్చిన సత్యాగ్రహులందరికీ అభినందన జరిపే సమావేశానికి హాజరు కావాలని అందులో పాల్గొన్న ఎల్లరికి వారు స్వాతంత్ర్య సమరయోధులు అని లేఖలో వ్రాయడం, ప్రజలదృష్టిలో తనొక సత్యాగ్రహిగా దేశభక్తునిగా కనిపించడం తనకెంతయిన ఆనందాశ్చర్యాల్ని కలిగించింది. తను చేస్తున్న త్యాగమెంతటిదో తనకే అంతవరకు తెలియని స్థితిలో ఉన్నారు లచ్చన్న. అది గంజాం జిల్లా సత్యాగ్రహ సమరయోధుల సమావేశం. సమావేశ స్థల వేదిక పర్లాకిమిడిలో తను మామూలు ఒక చిన్న కార్యకర్త అని భావించుకుంటున్న తరుణంలో తనకి ఆహ్వానం పంపెన తర్వాత తనగొప్పదనం తనకు, అనాటివరకు అర్థం కాలేదు. ప్రజలు తనపై ఉంచిన నమ్మకాన్ని గట్టిపరచుకోవాలి ఉద్యమించారు.

లచ్చన్న సమావేశానికి హాజరయి అందరి సత్యాగ్రహులతో పాటు వేదికల నలంకరించి సన్మానాల్ని అందుకున్నారు. నిన్న మొన్నటివరకు ఆకతాయిగా తిరిగిన తనను ప్రజలిస్తున్న ఈసన్మానం వెనుకగల పరమార్థం తను తెలుసుకోగలిగారు. స్వార్థం కోసం, స్వార్థ ప్రయోజనాల కోసం, స్వప్రయోజనాల కోసం పాటుపడే వ్యక్తుల్ని సంఘం గుర్తించదు, ఆదరించదు, అభిమానించదు, సన్మానించదు. ఎవరైతే నిస్వార్థ దేశభక్తులో త్యాగభావంతో తన తోడివారికి, తన ప్రక్కవారికి, తన సమాజానికి ఉపకరిస్తారో వారికి తప్పక సమాజం జేజేలు పలుకుతుంది, తల వంచుతుంది, దాసోహం అంటుంది, అధికారాన్ని అందిస్తుంది, గౌరవాన్ని తెలుపుతుంది, సర్వం సమర్పిస్తుంది. అందుకే గాంధీజీ మహాత్ముడై మేరునగ సమధీరుడై జలధి అంతటి గాంభీర్యాన్ని సంతరించుకొని, రవి అస్తమించని తెల్లదొరల రాజ్యాన్ని గడగడలాడిస్తున్నాడన్నమాట.

లచ్చన్న ఆనాడు వేదికపయి నెక్కి ఉపన్యాసా లిచ్చే వయసు, అనుభవం లేదు. విజ్ఞానం అంతగాలేదు అయినా తను మాట్లాడాలి. ఆయన ప్రసంగాల్లో ఉద్రేకాలుప్పొంగాయి. దేశభక్తి ప్రజ్వరిల్లింది, తీర్మానాల రూపాల్లో అవతరించాయి. మన మంతా రేపటినుండి కల్లంగడివద్ద పికెటింగ్ వేయాలి. కల్లు సారాయి త్రాగవద్దని ప్రచారం చేయాలి. అందరి సత్యాగ్రహుల అభిప్రాయం అదే. లచ్చన్న గారి అభిప్రాయం కూడ తిరుగులేనిది త్రికరణశుద్ధితో కూడినది. దీని పరిణామం, లచ్చన్నకు బాగా తెలుసు. అయినా తన కళ్లముందలి మెదలాడేది దేశ స్వాతంత్ర్యముతప్ప అన్యథా కనబడటంలేదు.

## బారువాలో సత్యాగ్రహ శిబిరం :

సమావేశంనుండి తిరిగి వచ్చిన లచ్చన్నకు నిద్ర పట్టలేదు. విశ్రాంతి అన్నది తలపునకు రానిది. కార్యక్రమంలోనికి ఉరకాలి రణభేరి ప్రయోగించాలి. 1921 లోనే బారువాలో ఒక వాలంటీర్ దళాన్ని ఏర్పరిచేలా చేసారు. యువకు లెల్లరిని కూడగట్టుకొని ముందుకు వచ్చారు. శిబిరం ప్రారంభమైనది. పుల్లెల జగన్నాధంగారి ఇంటిలో కాంగ్రెసు కార్యకర్తల సమ్మేళనం జరిగింది. తాను నివసించు సంఘాన గలయునందు ఏ ఒకరు కోరి గాంచిన ఇలను మునుపు చాలా దుస్సాధ్యమైన పని అయినా, అతని మనోధైర్యానికి అపజయంలేదు. కార్యక్రమం ఖరారు అయినది.

(1) విదేశీ వస్తు బహిష్కరణ.
(2) కల్లు, సారాయి దుకాణాలవద్ద పికెటింగ్.

కాంగ్రెసు కార్యకర్తగా జెండా పట్టుకొని ప్రజల్లోకి వెళ్లారు.

ఆ కాలంలో మద్యపాన నిషేధం ప్రచారంచేయటానికి సాహసించటం మాటలుకాదు. మహా ఘనకార్యమైన విషయం. గట్టి సమస్యల్ని సృష్టించగల విషయం. అవిధంగానే దేశంలో తయారైన వస్తువుగాక విదేశాల్లో తయారైన వస్తువుల్ని కొనుక్కోవాలని ఎగబ్రాకుతున్న ప్రజల్లో భారత జాతీయ భావాన్ని కలిగించి వెనుకకు త్రిప్పటం అంత సాధ్యమైన పనా ? నిరక్షరాస్యులకు చదువు బోధించడం, [illegible] విజ్ఞానాలను వంటబట్టించడం, నిత్య దారిద్ర్యంలో కొట్టుకొని పూట గడవక వస్తులు పడుతున్న వారిలో రాజకీయ చైతన్యం కలిగించటానికి ఉద్యమించడం, ఉవ్వెత్తున మింటికెగసి హిమాలయాల్ని ముట్టుముట్టి తారల స్వర్గలానికి రాగలమని భావించడమే అవుతుంది. "మీదనుండి పార్టీ ఆదేశం. దేశం పిలుపునిచ్చింది. నేను కార్యకర్తను, పిలుపునందుకొని ముందుకు దుముకవలసినవాడిని. తర్కించి ఆలోచించడం నాపనికాదు. అందరూ ఆలోచిస్తే ఇక మనకు దక్కేది కాలయాపన వృధాపర్వం. మాట్లాడటం కాదు, తల్లిదండ్రులు ఎలా ఎదిరిస్తారో! మాటల్ని చెప్పడంకాదు, పనుల్ని జరిపించాలి."

"పోరా ! చేతకాని దద్దమ్మ. నన్ను నీవు వెక్కిరించే దేమిటి. పిరికితనం నాజాతకంలో లేనిది. వెరిచిపోయి వెన్నుజూపి పారిపోవడం నాజీవితంలో జరగనిది. సాహసమే నా ఊపిరి. ధైర్యమే నాకు శ్రీరామరక్ష. స్వరాజ్య సాధనకు కృషిని విడిచిపెట్టమంటే తల్లిదండ్రులను కాదు ఆ దేవుడ్నికూడ ఎదిరిస్తాను."

వీధి వెంబడి పోతున్న లచ్చన్నను పిలచి ఒక షావుకారు ప్రశ్నించాడు "బాబూ ! పైదేశాల్లో తయారైన వస్తువుల్ని కొనవద్దంటున్నారు, అయితే మా బ్రతుకులు ఏమికాను ? స్వరాజ్యం వస్తే బాగుపడతాం, అది నిజమే. ఈలోగా మేము ఏమవాలి ? ఇకపోతే మనదేశంలో ఉన్న వస్తువు ఏమిటి బాబు ? వెట్టు, కత్తి, గండ్రగొడ్డలి, పార, గునపాం, ఆధునికమైన వస్తువులు మనకు లేవుకదా"

"నిజమేనండి ! జనమంతా త్యాగం చేస్తేనే తప్ప కష్టాలు అనుభవిస్తేనే తప్ప స్వరాజ్యం రాదండి" లచ్చన్న జవాబు "రాకపోతే మనకేం ? మనం బ్రతకలేమా ?" అమాయకపు ప్రశ్న. "బానిసలుగా బ్రతకగలం, ఒకరిదయా దాక్షిణ్యాలపై మనగడను సాగించగలం, వృక్షాల్లా రాళ్లలా పురుగుల్లా క్రిమి కీటకాల్లా జీవించగలం" అని ఆవేదనతో, ఆవేశంతో అంటున్న లచ్చన్న మాట లకు అదరిపడ్డారు "నీతో తగవు నాకెందుకు. నీలో ఉన్నది తొందరపాటు, తిరుగుబాటే కదా" అంటూ జారుకొన్నారు.

1933లో శ్రీ యం. జి.వి. సత్యనారాయణ లీడర్ గారి ప్రోత్సాహమున ఆనాడు పికెటింగ్ జరిగింది. "మద్యపానంచేయవద్దు, విదేశీవస్తువులను కొనవద్దు" అంటూ బిగ్గరగా నినాదాలిచ్చారు. బారువా పుక్కెల జనార్ధనరావు గారింట్లో ఈసత్యాగ్రహుల శిబిరం ప్రారంభమైంది. కాశీబుగ్గనుండి ఇచ్ఛాపురంవరకు గల కల్లు దుకాణాల వద్ద విదేశీ దుకాణాలవద్ద సత్యాగ్రహులు నినాదాలుగల అట్టల్ని పట్టుకొని వారి దుకాణాలకెదురుగా నినాదాలివ్వడం, దుకాణాల్లో కొనబడుతున్న వారిని ఆపి వారిని ఒప్పించి మెప్పించడం, బాబూ నాయనా అని బ్రతిమలాడటం, వద్దు అని అనడం.

ఒకరోజు సత్యాగ్రహులంతా లచ్చన్నతో సహా బారువాలో గల కల్లంగడి సారాయికొట్టువద్ద పికెటింగ్ కార్యక్రమం చేపట్టారు. ఆ కల్లంగడి సారాకొట్టు ఎవరిది ? లచ్చన్న దాయాదులది. తను, తన అన్నయ్య అకాలంలో ఏ కొద్దిమందో తప్పించి, ఏఒక్కరు చదవలేని ఉన్నత విద్యను పొందడానికి ఆస్కార మైనది ఆవృత్తే. తనకుటుంబ జీవనానికి ఆధారభూతమైన తన వారి వృత్తిపైనే దెబ్బతీయాలని సిద్ధపడి అందరితో లచ్చన్న పికెటింగ్ ప్రారంభించాడు.

సెగిడి కులస్థులందరూ వచ్చి కుల బహిష్కరణ చేశారు. "వీడు బిడ్డయ్య బ్బా అబ్బాయి చేస్తున్న ఘనకార్యం. మన కులంలో చెడబుట్టాడు మనకులాన్నే

నెరవ సిద్ధపడ్డాడు. ఆఖరికి తల్లిదండ్రుల్ని ధిక్కరించి నడివీధిలోనికి నెట్టి వేయటానికి సిద్ధపడ్డాడు. ఉపేక్షిస్తే లాభంలేదు. మీరీ సంగతి మాట్లాడాం పదండి" అన్నారు.

"ఆగండి మీరు. ఇది మా కుటుంబం సంగతి. మా తండ్రి కొడుకులం తేల్చుకుంటాం. మీరిందులో జోక్యం చేసుకోవద్దు" అని కొడుకుతో "అప్పన్నా మమ్మల్ని ఏమిటి చేద్దామని నీ ఉద్దేశంరా?" అని తండ్రి వాపోయాడు, పికెటింగ్ చేస్తున్న అప్పన్న వద్దకు వెళ్ళి.

"అమ్మా ఇందులో రాజీలేదు. నాన్న త్రాగడం మానాలి. అలా అయితేనే నేను ఇంటికివస్తాను లేదా ఈ దినంనుండి నేను ఇంటికి రావడంజరగదు. త్రాగనని మాటిస్తేనే నేను ఇంటికి వచ్చేది" తల్లితో అన్న మాటలకు ఆమె నివ్వెరపోయింది. కల్లంగడికి వచ్చిపోవారిని కల్లు త్రాగవద్దని పికెటింగ్ చేయడంతో సరిపెట్టుకొనక తాగితే తనతో సంబంధం వద్దంటున్నాడు. కొడుకు ఎంతచేస్తున్నా చిన్నయ్య రాజమ్మలకు చిన్నకొడుకుపై అనురాగాభిమానాల్ని తగ్గించుకోలేకపోయారు. అదేకదా స్వార్థమెరుగని తల్లిదండ్రుల ప్రేమ!

ఇంటికిరాక 4, 5 దినాలు వాడవాడలోనే ఎచ్చటెచ్చటనో తిరుగుతూ, ఎవరి ఇళ్ళల్లోనో భోజనం చేస్తూ లేక ఉపవాసం చేస్తూ ఉన్న కొడుకు వద్దకు తండ్రి రాయబారం పంపించాడు. త్రాగనని ఒట్టువేసికొన్నాను ఇంటికి రమ్మని కబురంపాడు. అప్పన్న తన ఆశయం పట్టుదల నెరవేరిందన్న ఆత్మ విశ్వాసంతో మరల ఇంటికి వచ్చాడు. మరల ఉద్యమంలోనికి దూకాడు. అయినా తనతండ్రి తనకు తెలియకుండా, దొంగతనంగా త్రాగేవాడన్న నిజాన్ని తను కప్పి ఉంచలేకపోయేవాడు. కన్నకొడుకు వద్ద తండ్రి భయపడే పరిస్థితి. అప్పన్న నైతిక బలం [illegible] స్పష్టమైనది. కొడుకు వారు ఆశించిన రీతిగా గాకపోయినా పదుగురికోసం పనికివచ్చేవానిగా ఉంటూ వస్తున్నందుకు ఆ కన్న తల్లిదండ్రులు లోలోన మురిసిపోయేవారు. అట్టడుగు జాతుల్లో వెనుకబడిన వర్గాలు, పల్లెకు దూరంగా ఉన్నకొంపల్లో పుట్టిపెరిగిన తమ సంతానం పలుగురిలో నాయకుడయి తిరగడం చూచిన తల్లిదండ్రులు పొందే ఆనందాన్ని అంచనా వేయలేముకదా!

అప్పన్న వగైరా సత్యాగ్రహుల పికెటింగ్ కుదురుగా సెగిడికులస్థుల వృత్తులపై దెబ్బతీసింది. త్రాగిన వాని వెనకబడి తరుముతూంటే తన్ను కొడతాడనుకుంటే తగదని వారిస్తుంటే తగవు పెడతామని అంటుంటే వంటికి ఇంటికి చెరవు అని చెప్పుతుంటే ఇక త్రాగటానికి వచ్చినవాళ్ళలో విలువేదెంత ఉంది? ఈ ప్రచారాన్ని ఎదిరించి త్రాగేవారెంతమంది?

[illegible] పేటలో పికెటింగ్ ప్రారంభించారు. వారి కార్యక్షేత్రం ఉత్తర కోస్తాలో [illegible] ప్రాంతం. ఆ ప్రాంతములో జీవిస్తున్న 'పరుల? మత్స్యకారుల

వేపల్నిపట్టి అమ్ముకొనేవారు. కూలీనాలీ చేసుకొని ప్రాణాల్ని నిలబెట్టుకొనే వారే. కొండంత అజ్ఞానం వారికి తోడు. ఆకాశమంత నిరక్షరాస్యత వారి నీడ. ఇక వారున్నది మూఢ నమ్మకాల గుట్టపై మూర్ఖ సాంప్రదాయాల గుడిసెల్లో. ఇక వారిని రక్షించడం పుట్టించిన బ్రహ్మకు కూడ సాధ్యమైన పనికాదని, ఎవరన్నా వారిపై అప్పన్న విరచుకు పడేవారు. చదువుకొన్న మనమంతా అలా నిట్టూర్పులు విడిస్తే ఇకవారి బతుకులు తెల్లారేదెలా ? వారి జీవితాల్లో నవ వసంతాలు విలసిల్లేదెలా ? వారి మనస్సులలో నవీన భావాలు పొడచేదెలా? వారి జీవితాలు మారేదెలా ?

మత్తులో మునిగి కష్టాల్ని మరచిపోవాలనుకుంటున్న అమాయకులు. ఆ మత్తు వారికి కష్టాల్ని కొనితెస్తుందన్న విషయాన్ని మరచిపోతున్న అజ్ఞానులు. నిత్య దారిద్ర్యం వారికి పోట్లాటల్ని కలిగిస్తుందని, సంఘర్షణకు దారితీసేలా చేస్తాయని, వారి జీవితాల్ని భస్మపటలం చేస్తుందని ఆలోచించలేని మూర్ఖ దురాచార సంపన్నులు.

మత్స్యకారిగ్రామికుల వాడలలో ప్రచారం. వాడవాడల్లో కనిపించే వారి పిల్లల శరీరాలపై కనీసం గుడ్డముక్క కూడ లేని దుస్థితి. దినవారి తెచ్చుకున్న అశాంత ఆదాయాన్ని వెచ్చించి, సారా కల్లును కొని గుటుక్కున మ్రింగేయడం, స్వీకరించేటపుడు విషంతిన్నరీతిగా ఇబ్బంది పడిన తదుపరి అదే తనకు తెలియని లోకాల్లోనికి తీసుకొనిపోయి తనను ఆటలాడిస్తుందని, అదే తనజీవితంలో మధుర మైన భాగమని తలచే అజ్ఞానులు. ఇక అరవాన్న యజమానులు ఇచ్చిన కూలి డబ్బుల్ని సారాకొట్టుకి, కల్లంగడికి వెచ్చిస్తే మిగిలిందేమిటి? తన్నులు పడి చావటాలు, ఏడ్పులు, రోదనలు, పిల్లల ఆక్రందనలు, అర్ధనగ్నంగా కనబడే బ్రతుకులు ... అదీ వారి దుస్థితి.

గ్రామీణ ప్రాంతాల్లో ఎంత దయనీయస్థితి ఉండేది. భారతదేశానికి వలస వచ్చిన వారిని అడుగులకు మడుగులొత్తుతూ సంచరించే అగ్ర వర్ణాలవారికి ఆనాటి ప్రభువులు జమీందార్లు భూస్వాములు వంత పాడేవారు. వారినుండి పొందిన భూములను అనుభవిస్తూ బిగతలుగా అధికారం చలాయించేవారు. జాగీర్దార్లకు జమీందార్లకు చేరువైన ఈ భోక్తలు సమాజమున గల ఇతర వర్గాలను పంచుకు తినేవారు. అమాయకులైన ప్రజలకు తమ మనుగడ, ఉనికి తెలియక 'పుట్టించిన వాడు దేవుడు. మన బతుకులకు అతడే సాక్షి. మనమిలా ఉండాలన్నది ఆదేవుడి కోరిక, అందువల్ల మనబ్రతుకులింతే' అన్నది నమ్మకం. అదేవారి విశ్వాసం.

హరిజనులు దేవుళ్ళ పేర్లు వారి పిల్లలకు పెట్టుకోవటానికి జంకేవారు. సన్యాసి, గుండోడు, తప్పుడు వంటి పేర్లు పెట్టుకొనేవారు. గులాబోళ్ళమని, నౌకరోళ్ళ మని, బానిసలమని, వారికి వాళ్ళే [illegible] [illegible]గేవాళ్ళు. [illegible]బడిన జాతుల్లో, పెంటయ్య, పుల్లయ్య, ఇల్లయ్య- వంటి పేర్లు పెట్టుకునేవారు.

ఇక ఆడవాళ్ళ పరిస్థితి మరీ అధ్వాన్నం, ప్రాణం గల వస్తువులు. చాలమంది మోకాళ్ళ దాకా గుడ్డకట్టు ఉండేది. రవిక తొడగడమంటే వారికి నవ్వనిది, అందనిది. చాలామంది స్త్రీలకు రవిక ధరించడమన్న విలాసాల ఐతుకు బ్రతుకు తున్నారన్న భావన ఉండేది. కాఫీ టీలు త్రాగడం, సిగరెట్టు త్రాగడం, జరిగి నోళ్ళకు పెట్టిపుట్టినోళ్ళకు గాని మనకు తగదు అనే భావం వుండేది.

గ్రామాల్లో విద్యుచ్ఛక్తి అన్న ప్రశ్న లేదు. చీకటిమయం. దీపం బుడ్లు ఉండేవి. కిరసనాయిల్ కాదు, దీపపు ప్రమిద ఉండేవి. ఆ ప్రాంతంలో లభించిన నూనెను పోసి ఒత్తి వేసి వెలిగించుకొనేవారు. ఇంటి గోడలకు చిన్నదివ్వె చేసి అందులో గాలికి దూరంగా ఉండేలా పెట్టుకొనేవారు. పూరిగుడిసెల్లో నివాసం. పుల్ల పుడకలతో వంట చేసుకోవడం. ప్రతిదినం స్నానం చేయాలన్న విషయాన్ని పట్టించుకోలేని దారుణ అజ్ఞానం. అంబలి, గంజి ఆహారం. అన్నం తినడం అంటే అపార భాగ్యంగా భావించే వారు. పెళ్ళి ఉత్సవాలు అయితే అందరూ సంబర పడి పోతారు. "బాబూ మీ పెళ్ళెప్పుడు మాకు పప్పు అన్నం ఎప్పుడు పెడతారు" అని అడిగేవారు. అంటే వాళు పప్పు అన్నానికి ఎంత వాచిపోయి ఉండేవారో తెలుస్తుంది. అసలు తినడం, హాయిగ ఉండటం, అనుభవించడం, అగ్రవర్ణాల వారికే. వీరి పూర్వీకులు అటువంటి అదృష్టాలకు నోచుకోలేనిది అన్న గట్టి నమ్మకం విశ్వాసంతో బ్రతికేవారు. స్వశక్తిపై నమ్మకం ఏమాత్రం లేనివారు

అటువంటి దుస్థితిలో వున్న తన కాలంనాటి తనప్రాంత ప్రజలను ఆదుకొని రక్షించాలన్న దృఢ సంకల్పాన్విత్తుడు అప్పన్న.

ఆడవాళ్ళ సంపాదన అలా చేరాగా ఉండేది. కూలి డబ్బులను వాళ్ల మగాల్ని కాని త్రాగటానికి, కిరాణా సామానులు కొనటానికి, ఇంకా మిగిలిన డబ్బులతో కాస్త గంజికి [illegible] కాచుకొని, కాచు, పిల్లలతో త్రాగటానికి వినియోగించే వారు. అగర్భ దరిద్రులు, అజ్ఞానులు, అమాయకులు, అదృష్టహీనులు. వీరి ఆర్థిక పరిస్థితి మెరుగవాలంటే కల్లు త్రాగకుండా చేయాలి. అదేలా సాధ్యం? అదే నాటి కార్యక్రమం. అప్పన్న, ఇతర కార్యకర్తలు చుట్టుప్రక్కల గ్రామాల్లోకి వెళ్లారు. [illegible] "అమ్మలారా! మామాట వినండి. మీరు మాకు సహాయం [illegible] మాకు సహాయం చేయడం" అన్నారు.

"[illegible] సహాయ పడేదేమిటి?" అన్నారు, వాళ్లేమిటి అంటున్నారో [illegible].

"మీరు మీ మగవాళ్ళు కల్లు సారా త్రాగేటప్పుడు మాకు కబురు పంపించండి. వెంటనే వచ్చేస్తాం. తరువాత పని మాకు వదిలేయండి" విషయాన్ని వివరించారు.

"అంత కష్టం [illegible], మా మగాళ్ళకు త్రాగకుండా మాన్పించితే మాకు [illegible]" అనేవారు. అంత కార్యకర్తలు త్రాగేవారి దగ్గర

వేరేవారు. "ఒరే అప్పన్న వస్తున్నాడురా, గట్టి తిండంరా, గడగడ లాడించేస్తాడు. మాటల్లో మనల్ని ఒప్పించేస్తాడురా ఎలా అయిన మంచోడు సుమా! తాగితే ఒప్పుకోడు. మనం త్రాగకుండా ఉండలేము" అని అనుకుంటున్నారు. ఇది విన్న అప్పన్న వారితో "మీరు ఎంత హీన స్థితిలో ఉన్నారో, శరీరంపై సరియైన బట్టఉందా? తినడానికి అన్నం ఉందా? మీ పిల్లలు, మీరు ఉండటానికి సరియైన కనీసం గూడు ఉన్నదా? మీ ఆడవాళ్ళ వంటిపై నిండుగా గుడ్డ ఉందా మీరు ఆలోచించండి. మీరు తెచ్చుకుంటున్న కూలి డబ్బుల్ని సారాకొట్టుకి, కల్లంగడికి యిచ్చి మత్తులో మునిగి ఇంటికి వెళుతున్నారు. మీ కోసం ఎదురు చూచిన మీ ఇల్లాలు ఏం తినాలి? మట్టితినాలి. మీ పిల్లలు గడ్డితినాలి మీ బ్రతుకులు ఇలా బుగ్గయిపోతున్నాయి. ఆలోచించండి. మనిషి తలుచుకుంటే ఏమైనా చేయగలడు. రండి. లేవండి. కల్లుత్రాగకూడదని గట్టి నిర్ణయాలు తీసుకోండి" త్రాగుడు వల్ల కలిగే కష్టనష్టాల్ని వివరించి చెప్పారు.

"అవును బాబూ, మరి త్రాగము బుద్ధి వచ్చింది. ఇంతవరకు మా గురించి ఆలోచించేవారెవరు, బాబూ. ఇన్ని మంచి మాటలు చెప్పేవారెవరు? తప్పక మేం త్రాగము బాబూ" అంటూ వెళ్తున్న కూలి నాలి జనాల్ని చూచి అప్పన్న మనసు ఉప్పొంగిపోయేది.

తనకా భాష ఎలా వచ్చింది? తన ఉపన్యాస ధోరణి ఎంత గంభీరంగా ఎలా సాగిపోతున్నాది; తన భావాల్ని ఎంత మధురంగా ఇతరులకు విప్పి చెప్పగలుగుతున్నాడు; విచిత్రంగా ఉంది. విషయ తన్మయంలోనయిన కార్యకర్త — హృదయాంతరాళాల్లోనుంచి వచ్చిన మాటలవి. మానసిక విజ్ఞాన వికాస పరిధిలో వికసించిన భావాలవి. నాటి వారు బాగుపడాలి, వీరిని బాగు చేయాలి. ఇతరుల కష్ట సుఖాల్లో తాదాత్మ్యత చెందే స్థితిని, గతిని వ్యక్తి ఇంవడం పొందడం పూర్వ జన్మ సంస్కారం వలన తప్ప అన్యథా చేకూర నేరదు కదా! తన ఉపన్యాస ధోరణిలా తన ప్రజాసేవ, అందలి పట్టుదల, దీక్ష, అభినివేశం కూడ గంగానదీజల తరంగాలా సాగిపోయేది.

తన వ్యక్తిత్వం పెరిగింది. తాగినవాళ్ళు తన కెదురుగా రావటానికి జంకేవారు. ఎవరైనా త్రాగుతున్నా అప్పన్న వస్తున్నాడని విన..: ఎగిరి గంతేసి దాచుకొని పరుగెత్తేవారు. ఎందుకింతగా అప్పన్నను వారి వాళ్ళు భయపడుతున్నారు? అప్పన్న చేతిలో అధికారం ఉన్నదా? లేదే! అయినా తమ శ్రేయోభిలాషి, రక్షకుడు అప్పన్న. అతని మనసును కష్టపెట్టకూడదు. అతను సత్యాగ్రహి కదా!

సమాజమున ఏ వ్యక్తి ముందుకు సాగిపోవాలన్నా అంత సులువుగా జరిగే పనికాదు. సమాజ మొక పద్మపరిష్వంగం. దీని ఛేదించి బయట పడటం అజేయం, అమోఘం, అప్రత్యకరం, అత్యంత [illegible].

అడుగడుగున అడ్డంకులను సృష్టిస్తున్న సంఘం, సంఘంలో గల అరాచకశక్తులు విజృంభించి మీదపడతాయి.

"ఏయ్ లచ్చన్నా! ఆపవోయ్. జనాల్ని తాగవద్దని చెప్తే సంబరం కాదోయ్. ముందు మీ నాన్నను తాగకుండా చేయి. ముందు మీ వాళ్ళను కల్లంగడిని మూసివేసేటట్లు చేయాలి. ఇంట గెలిచి రచ్చ గెలవాలి. ఇతరులకు ఉపన్యాసాలు చెప్పడం చాలా సులువు. తను అనుసరించడం మాత్రం అంత సులువు కాదు సుమా" అన్న కొందరి మాటలకు "నిజమే మీరన్నది" అంటూ లచ్చన్న ఆలోచిస్తూ ఇంటికి చేరారు. ఎదురుగా వస్తున్న తండ్రి చిన్నయ్యతో "నాన్నా! మీరికపై తాగవద్దు. తాగడం జరిగితే నన్ను మరచిపోండి. ఇంటికి రాను. అంతేకాదు, మన కల్లంగడిని, సారా కొట్టును మూసివేయండి వెంటనే. నేను వీధిలో తిరగాలా వద్దా? ప్రచారకునిగా, కార్యకర్తగా ఉండాలా, వద్దా? అని అన్నారు.

చిన్నయ్యకు నోట మాట రాలేదు. ఆలోచన అందలేదు. ఏదో కొడుకు అందరి నోట నలుగుతున్నాడని, పదిమందికి చెప్పే మొనగాడయ్యాడని, పెద్దోళ్ళతోనే జట్టు కట్టి తిరిగే స్థితికి చేరుకొన్నాడని సంతోషించాడే [illegible] చివరకు తన నోటినే మూయించి తన కడుపుపైనే దెబ్బ తీస్తాడని ఊహించలేకపోయాడు.

"నేను కల్లంగడిని కట్టను, నేను తాగడం మానను. ఏం, అంతా నీ యిష్టమేనా? పెద్దరికం చేస్తూ. నిన్నగాక మొన్న పుట్టావు, నీవు మాకు చెప్పేటంతటి వాడివయ్యావా? నీవు చెప్పినట్లే చేస్తే మా బ్రతుకులు ఏంకావాలి?" చిన్నయ్య కుమారునితో ఆవేశంగా మాట్లాడాడు.

"అంతేనంటావా?"

"అంతేరా!" నిశ్చయంగా పలికాడు చిన్నయ్య. ఇంతలో ఇంట్లో నుండి రాజమ్మ వచ్చింది. "ఏమిరా లచ్చన్నా! ఎప్పుడూ మమ్మల్ని ఏడ్పించడమేనా నీపని? మమ్మల్ని బ్రతకనీవు. నీవు బ్రతకవు. ఏమొచ్చిందిరా ఇప్పుడు? నీవు తి[illegible]న్నావు కదా దేశమని, దెయ్యమని. ఇంకా మేము ఎందుల్లోకి రావాలి. నీవు చెడింది చాలక ఇంకా మమ్మల్ని చెడగొడతావా, ఏం బుద్ధి నీకు?"

"అమ్మా నా సంగతి నీకు తెలుసు. నేను పట్టుదల వాడిని. పట్టిన పట్టు వదలను. ఏంచేయమంటారో [illegible] సిద్ధమే" స్థిరసంకల్పంతో అన్నారు లచ్చన్న.

"ఏమిటిరా బెదిరిస్తున్నావా, ఇల్లు వదిలి పోతావా? పోరా! ఉద్యోగం సద్యోగమని ఎప్పు[illegible] ఉన్న కలిగాం" అన్న తం[illegible]గా ఎదు రుగా [illegible] సాష్టాంగనమస్కారం చేసాడు "చూడు.

తమ్ముడూ, ఈ కల్లంగడి మూసేస్తే మన ఇల్లు ఎలాగడుస్తుంది. చెప్పరా, అందరూ కల్లంగడిని చూసే జీవిస్తున్నారు ఇది మన వృత్తిరా!"

"ఎవరు చెప్పారు, పుట్టుకతో ఎవడికి ఏవృత్తి రాలేదు. మధ్యన మనం తెచ్చిపెట్టుకున్నవే. ఇది మంచి వృత్తి కాదు, మన కొద్దు, మరొక వృత్తిలో బ్రతుకుదాం లేదా పస్తులు పడిఉందాం" అన్నమాటకు లచ్చన్న సమాధానం.

"అంతేనంటావా"

"అంతే"

దురుసుగా ఇంటినుండి వీధిలోకి వెళ్లారు. కోపంతో వెళ్తున్న చిన్నకొడుకును చూచి తల్లిదండ్రులు కళ్ళ నీళ్లు పెట్టుకున్నారు. అన్నయ్య చిన్నబోయాడు. లచ్చన్న తన తల్లిదండ్రులనే ఎదిరించినట్లు, వారి కల్లంగడిని సారాకొట్టును మూసివేయమని వారితో తగాదా పడినట్లు దారువా ఊరంత ఒక్క నిమిషంలో వ్యాపించింది. లచ్చన్న వీధివెంట వెళ్తుంటే ప్రతి ఒక్కరు తనను ప్రత్యేకంగా చూచేవారు ఎందువలననో? ఎవరు సాహసించని రీతిలో తను వ్యవహరిస్తున్నాడనేమో!

ప్రతిదినం కల్లంగడి, సారాకొట్టు 25 రూపాయిల బేరం తెచ్చిపెట్టేది. ఆనాటి 5 రూపాయిలతో ఈనాడు ఐదువందలు సరికావు. దమ్మిడీలు ముక్కానీ లుండేదినాలు. దమ్మిడీ ఉన్నవాలు చాలా అవసరాల తీరేవి. డబ్బుకు అంతటి విలువ ఆనాడు ఉండేది. క్రమేపీ బేరంపడిపోయింది. దినవారీ బేరం 25 రూపాయిల నుండి 5 రూపాయిలకు దిగజారింది. లచ్చన్న కొన్నాళ్లు కన బడక పోయేసరికి అమ్మానాన్నల మనసు కూడ దిగజారింది. "ఒరే పెద్దోడా, వెళ్లి తమ్ముడ్ని తీసుకొనిరారా, ఎక్కడ అన్నం తింటున్నాడో? నాకళ్ళ ఎదురుగా నాచిట్టినాన్నకు ఇన్ని బాధలు" తల్లి బాధపడింది.

"నేను త్రాగుతున్నాననేకదా నీకొడుకు ఇల్లు విడిచిపెట్టాడు నేటినుండి త్రాగను. అంతేకాదు మీఅందరికి లేనిది నాకెందుకు రేపటినుండి కల్లంగడిని మూసివేద్దాం" అని చిన్నయ్య అంటూ పెద్దకుమారునితో "వెళ్ళరా సత్యనారాయణా! నీతమ్ముడ్ని ఇంటికి తీసుకొనిరా, మన బ్రతుకులు ఎలాఉంటే అలా ఉంటాయి, అందరం కలసి ఉందాం, కష్టాల్ని సుఖాల్ని అనుభవిద్దాం" అన్నాడు.

తండ్రి మాటలు విన్న పెద్దకుమారుడు ఇంటిని విడిచివెళ్లి దారులో తన తమ్ముడు ఎక్కడున్నాడో వెదికి పట్టుకున్నాడు. తమ్ముని కలసి అమ్మానాన్నల అభిప్రాయం చెప్పాడు. లచ్చన్న విజయగర్వంతో అన్నయ్యతో కలసి ఇంటికి వచ్చారు. అయితే తన పంతం నెగ్గిందనే ఆనందంతప్ప ఇంటి పరిస్థితి రేపు ఏమిటి అన్న ఆలోచనే లేదు లచ్చన్నకు.

చిన్నయ్య కల్లువ్యాపారం మరి చేయలేదు. కల్లంగడి మూతపడింది. సారాకు

కూడా మరి త్రాగలేదు. కులం వారెల్లా లోలోపల కుళ్ళి కుళ్ళి వస్తున్నారు. కల్లు త్రాగటం మానేస్తే సారా త్రాగటం మానేస్తే యిక వారి వృత్తులు సాగేదెలా? సెగిడికులస్థుల వృత్తి ఏమిటి? ఈ తాటిచెట్ల నుండి కల్లుతీసి అంగడిలో అమ్మడం, తీసినందుకు కిరాయి తీసుకోవడం, ఈవృత్తి మూలబడితే ఆ వారువాలో ఉన్నమిగతా 80 సెగిడికులస్థులకు దిక్కేమిటి?

"మనల్ని ఎవడు ఆదుకుంటాడు మనవృత్తుల్ని మనం వేయకూడదు రండిరా రండివెళ్ళపనిపడదాం" అంటూ ఆ వారువాలో ఉన్న సెగిడి కుటుంబాల వాళ్ళందరు ఒకనాడు అప్పన్న ఇంటిమీద దండయాత్ర చేసారు.

ఇంటిని ముట్టుముట్టిన తన కులం వారిని జూచి వీరయ్య రాజమ్మలకు ఏమీ పాలుపోలేదు.

"వీరయ్యా! మీకు ఇదే చెప్తున్నాం. మీ అబ్బాయి సంగతి. ఏమీ బాగులేదు. మనకు కూడు పెడుతున్నవని కూలగొడుతున్నాడు, కల్లు త్రాగవద్దని చెబితే ఇంక కల్లుగీతలో పనేమిటి? ఈ కల్లు గీత పనివాళ్ళంతా బ్రతికేదెలా? మా కుటుంబాల్ని నాశనం చేసి మా ఉసురు పోసుకుంటారా? చెప్పండి, రండి బయటకు."

ఇంటిమీద పోటీ కులమలందరూ విరుచుకుపడ్డారని తెలియగానే ఇంటికి అప్పన్న పరుగెత్తుకొని వచ్చాడు.

"ఏమిటి మీరంతా ఇలా కట్ట కట్టుకొని వచ్చి మా యింటిపై పడి వచ్చారు. మేమేం చేసామని?" అప్పన్న వచ్చిన వారిని అడిగాడు.

"ఇంకా ఏంచేయాలి, మమ్మల్నందరిని బికారుల్ని చేస్తున్నారు, చిప్పమెత్తుకొనేలా చేస్తున్నారు" గద్దించారు పోటీ కుటుంబాలవారు.

"ఏమిటి మీరు చేసేది?" అప్పన్న ప్రశ్న.

"ఇంకా ఏమనాలి, కల్లుత్రాగవద్దని అందరకు చెప్పి ఎవరినీ త్రాగకుండా చేసేస్తుంటే మరి మేము గీసి తెచ్చిన కల్లును ఏం చేసుకోవాలి? మా వృత్తులు ఏం కావాలి?"

"అందుకు [illegible] చేస్తా?"

"ఎందుకు [illegible] లో [illegible] బాగుచేయాలి కాని, ఇలా కులం [illegible] చేయడమా, [illegible] రించారు.

"[illegible] [illegible] బ్రతి[illegible]యారు. మాటలు సరిగా [illegible] [illegible] [illegible] గాంధీగారు యిచ్చిన [illegible]"

"[illegible]"

"మేము మాత్రం కల్లంగడిని మూసివేయలేదా ? మా వృత్తి పోలేదా ? మా ఆదాయం పోలేదా, చచ్చి పోయామా ?" లచ్చన్న దబాయించాడు.

"మీకేం బాబూ, మీవృత్తి పోయినా మిమ్మల్ని పెంచటానికి మీ అన్నయ్య మేష్టరీ ఉద్యోగం వెలగబెడుతున్నాడు కదా. వాడు నాలుగురాళ్ళ తెస్తున్నాడు. మీరంతా తింటున్నారు. ఇకపోతే మీ నాన్నకు పొలం పుట్ర ఉంది. బ్రతక డానికిన్ని గింజలైన వస్తాయి. మరి మేము బ్రతికేదెలా చెప్పండి ?"

"దినానికి 25 రూపాయిలు ఆదాయం వచ్చిన కల్లంగడిని మూసివేసినా మా తల్లిదండ్రులు, మేము బాధపడలేదు. ఆదాయం తగ్గినా మా అమ్మానాన్నలు భరించారు. ఉద్యోగం చేయగల చదువు చదివి ఉద్యోగాన్ని నేను చేయకపోయినా మా తల్లిదండ్రులు భరించారు. ఎవరి కష్టాల్ని వారు భరించాలి, తప్పదు. వెళ్ళండి. మీ వృత్తులు పోతాయి అని నా ఆశయాల్ని నేను విడచిపెట్టను" అన్నాడు లచ్చన్న.

"అయితే మేమే మిమ్మల్ని విడిచిపెడుతున్నాం. మిమ్మలను మా కుటుంబాలనుండి వెలివేస్తున్నాం. రండిరా ఇకపై వీళ్ళు గ్రామంలో ఎలా తలెత్తుకొని తిరుగుతారో చూద్దాం. ఇకనుండి మనలో ఏ ఒకరం వాళ్ళతో మాట్లాడకూడదు ; పలకరించ రాదు ; పిలిచినా పలకకూడదు" అంటూ దురుసుగా కసితో వెళ్లారు సాటి కుటుంబీకులంతా.

"మీ బెదరింపులకు లొంగేది లేదు. వెళ్ళండి. మీరేం చేయగలరో చూస్తాం" అంటూ లచ్చన్న ఉద్రేకంతో మాట్లాడినా, తన కుటుంబంలో ఏ ఒక్కరు కిమ్మనక ఊరుకున్నారు. ఇక ప్రబోధాల ప్రచారం మొదలైంది.

మడిని దున్నేరైతన్నా — గడన చేయరోరన్న
కూలిజేసే కూలన్నా — కూడబెట్టరారన్న

కల్లుపాకలోన దూరి
ఇల్లు గుల్లచేయకురా

కూలిడబ్బు ఆలికివ్వు
కూడుతినగ గూడుచేరు

మత్తులోన పడిన నీకు
బ్రతుకు చిత్తు అవునురా

గాంధి గారి మనకు రక్ష
దేశమాత పిలుస్తోంది

స్వాతంత్ర్యం సిద్ధించగ
చేయికలప లేవరారా ||మడిని||

వీధుల్లో యువకులు చైతన్యాన్ని ప్రబోధిస్తూ సాగిపోతున్నారు. లవ్వన్న ముందు నడుస్తున్నారు. ప్రచారం చేస్తున్న లవ్వన్నను చూచి మండిపడ్డారు తోటి సెగిడి కులస్థులు. తరుణం చూచి దెబ్బ తీయాలన్న దుష్టబుద్ధికి లోనయ్యారు. లేనిచో మన వృత్తులు గాలిలో కలిసిపోతాయన్న ఉక్రోషానికి వచ్చారు.

లవ్వన్న ప్రక్క గ్రామంలో ప్రచారం చేసుకొని ఇంటికి వస్తున్నారు. సమయం అర్ధరాత్రి అయింది. సహచరు లెవరూ తనవెంట లేరు. ఆ చీకటిలో ఎదురుగా ఎవరో వచ్చినట్లయింది.

"ఆగు, నీకాళ్ళు విరగ్గొడతాం" అన్నమాటలు వినవచ్చాయి.

"ఏమి చేశావని ?" లవ్వన్న.

"మా బ్రతుకుల్ని తీసి వీధులలో వేలం వేస్తున్నావు."

"ఓహో మీరా ! నన్ను దండించటానికి ఇంత రాత్రి రావాలా ?"

"రావటం నీతో మాట్లాడటానికి కాదు. నాలుగు దెబ్బలు పెట్టి నిన్ను నలుగు వేయాలి. చూస్తారేం ? కొట్టండి" అన్నదే తడవు వచ్చినవారిల్లా ఒక దెబ్బ కొట్టారు. తలపై, వీపుపై తగిలిన దెబ్బలతో లవ్వన్న ఏమీ మూర్ఛపోలేదు. మనసంతా ఉక్రోషంతో పొంగి వెంటనే తన హస్తాన్ని ఎత్తాడు 'మీ పనిపడతా' అని. కాని అంతరాత్మ నివారించింది "నీవు సత్యాగ్రహివి. దండించిన నీవు పడాలి. గాంధీజీ చెప్పిందేమిటి ? జైల్లో జైలు అధికారులు కొడితే తిరిగి కొట్టావా? ఇక్కడా అంతే ! వారిపై సత్యాగ్రహమే ప్రదర్శించు. దురాగ్రహం వద్దు. మాలిన్యం లేక ఇంతవరకు వస్తున్న సత్యాగ్రహివి అనిపించుకొన్నావు. మరల తప్పు తేకు."

లవ్వన్న వారిని పట్టి వంటి పారద్రోలుకొన్నాడు. అతడు అజేయుడు కూడ. తన గతచరిత్ర చూస్తే అది ఎంతో సులభమైనపని లవ్వన్నకు. ప్రత్యర్థులు చేతికివచ్చిన దెబ్బలు కొడుతున్నా పరిపూర్ణ సత్యాగ్రహిగా నిలుచుండిపోయాడు. కసి తీరిందన్న మిషతో దుండగులు లవ్వన్నను విడిచివెళ్ళారు. పనిగట్టుకొని ఇతరులను బాధపెట్టిన ఒకనాటి లవ్వన్న తనను ఇతరులు బాదమోదుతున్నా కిమ్మనక ఊరుకొన్న సత్యాగ్రహి లవ్వన్న. ఎంతలో ఎంతమార్పు !

మరునాడు ఉదయం "లవ్వన్నను రాత్రి ఎవరో కొట్టి హింసించారట. ఏమిటీ ఘోరం ! పదండి వాళ్ళ పనిపడదాం" అని లవ్వన్న అనుచరులు బయలుదేరబోతుండగా "ఆగండి ! ఎదురుదెబ్బ తీయమని గాంధీజీ చెప్పలేదు. కొట్టిన దెబ్బ కాయమన్నారు. మనం తప్పుచేసినందున హింసించబడలేదు. గాంధీజీ పిలుపుకు తూ.చ. తప్పక అనుసరించినందున దండించబడినాము. ఇది మన విజయమే !"

లవ్వన్న ప్రవర్తన కులంవాళ్ళను రెచ్చగొట్టింది. వీడిని ఎలా లొంగదీయాలా అన్నది వాళ్ళ ఉక్రోషం. "ఎదురుగా వెళ్ళి దుర్భాషలాడినా కిమ్మనక -

ఒకనాడు లచ్చన్నను తిట్టి, కొట్టినవారు క్రమేపీ లచ్చన్న మద్యపాన నిషేధ ప్రచారంలోగల పరమార్థాన్ని తెలుసుకోగలిగారు. అజ్ఞాన అగాధంలో ఉన్న ఉత్తరాంధ్ర జనాల్ని విజ్ఞానపు వినువీధుల్లోనికి తేవడం ఏమంత సులువైన పనా ! అయినా, సాధించిన ఘనతనాడు సత్యాగ్రహి లచ్చన్నగారిదే !

# 16. మఱల చెఱసాలలో లచ్చన్న

1930లో ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని ప్రభుత్వాన్ని ధిక్కరించినందుకు, లచ్చన్నగారు నెల దినాలు బెరహాంపూర్ జైల్లో శిక్ష అనుభవించి మరల స్వస్థలం బారువా చేరుకున్నారు.

గంజాం జిల్లా కాంగ్రెస్‌నాయకులు అతనిని ముఖ్యకార్యకర్తగా గుర్తించారు. అదే సమయమున గంజాం జిల్లా ఆంధ్రా కాంగ్రెసు కమిటీ (గంజాం జిల్లా ఒరియా కాంగ్రెసు కమిటీ కూడ ఉండేది) దేశమాత సంకెళ్ళను త్రెంచగల ధీరులకు, వీరత్వం శూరత్వం ఉన్న దేశభక్తులకు, యువకులకు ఒక శిక్షణను, కాంగ్రెస్ సేవాదళ శిబిరమును ఏర్పాటు చేసింది. శిబిరంలో పాల్గొని శిక్షణ పొందమని యువక లచ్చన్నకు లేఖ అందింది.

బెరహాంపూర్‌లో శిక్షణా శిబిరాన్ని ఏర్పాటు చేసింది. ప్రయుతులు ఎక్కాయి సన్నాయి, పోకులనత్యన్నారాయణలు ఆ శిక్షణాశిబిరానికి కమాండర్లు. ఆలిండియా శిక్షణా శిబిరంలో శిక్షణ పొందినవారు. ఈ పదంలోనే వారి ప్రాధాన్యత తెలుస్తుంది. వీరు ఆదేశిస్తే శిబిరంలో చేరినవారు దానిని పాటించాలి. లచ్చన్న శిబిరంలో చేరారు. ఒక నెలరోజులపాటు శిక్షణ పొందారు. ఏమిటా శిక్షణ? దేశమాత దాస్యశృంఖలాలను ఛేదించటానికి ఎన్నికష్టనష్టాలనైన భరించటానికి సిద్ధంగా ఉండాలి. ఉండేటట్లు చేయడం, ప్రసిద్ధదేశభక్తులుగా పేరందిన వారిని పిలిచివారి చేత ఈ యువకులకు బోధనలు యిప్పించడం, దేశ కాల మాన పరిస్థితులను అనుసరించి, దేశభక్తి, త్యాగనిరతిని క్రమశిక్షణను బోధించడం, నిజ జీవితంలో వాటిని ఎలా తప్పక నిరూపించడం. ప్రతిదినం జండావందనంతో ప్రారంభమయేది దినచర్య.

లచ్చన్నగారు శిబిరంలో అందరి దృష్టిని ఆకర్షించారు. మండుతున్న అగ్ని గుండంలా ఉండే అతని హృదయం, పెనుతుఫానులా విరుచుకుపడే అతని చర్యలు, మేఘ ఘర్జనలా వినబడే అతని మాటలు, పొంగి పొరలే అతని ఉత్సాహం, ఉద్రేకం ఎవరిని ఆకట్టుకోవు ?

శిక్షణా శిబిరంలో శాంతి, అహింస అంటూ కూర్చుంటే స్వరాజ్యం వస్తుందంటారా? తెల్లవాళ్ళపై కలబడి వాళ్ళను దేశంనుండి తరిమికొట్టాలేమా? "అన్న లచ్చన్న ఆవేశానికి, నాయకులు పోకల సత్యన్నారాయణ నన్నియ్యల అతని ఉద్రేకానికి ఉత్సాహానికి పొంగిపోతూ భుజం తట్టి "నాయనా లచ్చన్నా! ఉద్రేకంతో బాటు సంయమనం కూడా వ్యక్తికి ఉండాలి. అదేకదా మన గాంధీ మనకు నేర్పినది. ఏం చేయాలన్నది మనమీద వారున్నారు, వారాదేశిస్తారు,

మనం చేయాలి, అందుకే ఈ శిక్షణ, గాంధేయ మార్గమే మన గమ్యస్థానం. పెద్ద వాళ్లు కాంగ్రెసు నాయకులు, గాంధీ నెహ్రూ తిలక్ లున్నారు. మనమంతా వారిని అనుసరిద్దాం. లచ్చన్న సరేననేవారు. శిక్షణ ముగిసింది. మరల స్వస్థలం బారువా చేరుకున్నారు. తాను పొందిన శిక్షణను ఆచరణలోనికి తేవటానికి, రంగం సిద్ధమైనది. కాంగ్రెసు కార్యకర్తలలో లచ్చన్న ముఖ్యమైన కార్యకర్త. దేశం కోసం అగ్నిలో దూకమన్నా సిద్ధమే అనగల సుశిక్షితుడైన కార్యకర్త. ప్రజలు తనను దేశభక్తునిగా, త్యాగనిరతినిజూపే కార్యకర్తగా చూస్తున్నారు.

లచ్చన్న ప్రాంతంలో జరుగుతున్న కార్యక్రమాలు అనాటి దేశనాయకుల దృష్టిలోనికి వెళ్లాయి. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం కాకినాడలో, కాంగ్రెస్ సేవాదళ ఆఫీసర్స్ ట్రయినింగు క్యాంపును నిర్వహించారు. రాష్ట్రం నలు మూలలనుండి ఎంపిక చేసిన కాంగ్రెస్ కార్యకర్తలను అందులో శిక్షణ పొంద టానికి పిలుపునిచ్చారు. సేవాదళంలో ఇది రెండవ అంతస్తు. సైనికశిక్షణ ముగి సింది. సేవాదళ ఆఫీసర్స్ కేడర్‌లో శిక్షణ. గంజాం జిల్లానుండి ఎవరు ఎంపిక చేయబడతారు.? ఇంకెవరు, లచ్చన్నగారే! అక్కడ రెండు మాసాల శిక్షణ పొందాలి. ఆ శిక్షణా శిబిరం నడుస్తూంది. అనాటి కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి స్వర్గీయ మహర్షి బులుసు సాంబమూర్తిగారి అధ్వర్యంలో.

కాకినాడ సమీపాన గల పయిడావారి తోటలో శిక్షణా శిబిరం. శిబిరం నిండా ఉత్తేజితులయిన కాంగ్రెసు సేవాదళం "శిక్షకులు". స్వరాజ్య సాధనలో తనూ భాగస్తుడే నన్న సంతోషం, విశ్వాసంతో లచ్చన్న హృదయం పొంగి పోతున్నది. శిబిరానికి వస్తూ పోతూ కాంగ్రెసు సేవాదళానికి ఉపన్యాసాలిస్తున్న రాజకీయ స్వాతంత్ర్య పోరాట సమరయోధులు, పెద్దలు, అనుభవశీయులు రాజకీయ నాయకులు దేశభక్తితో చెప్పుతున్న పాఠాలను బోధనలను ఉద్బోధలను స్వాతంత్ర్య సమర రణ రంగాన నిలచి పోరాటానికి కావలసిన ధైర్యోక్తులను ఒక నోట్‌బుక్ లో లచ్చన్న వ్రాసుకొనేవారు.

సేవాదళం కార్యకర్తలను కూడ సభికుల ముందుంచి మాట్లాడమనేవారు. లచ్చన్న లేచి తన మనసులో మున్నది, వెరపులేక నిర్భయంగా మాట్లాడేవారు. నిజాయితీ లేని వాస్తవాల్ని కుండబ్రద్దలుకొట్టే రీతిని చెప్పే మనస్తత్వం లచ్చన్నది. గాంధీ, నాయకులేతని మనో నిబ్బరాన్ని, ఆత్మ శౌర్యాన్ని జూచి నిశ్చేరపడి ముక్కుమీద వేలేసుకొనేవారు. అందరు లచ్చన్నను అభినందించేవారు. ఉత్తరాంధ్రలో ఉద్భవించిన ఉత్తరకోస్తా అని వాళ్లు భావించేవారేమో! .....

1932లో మహాత్మా గాంధి శాసనోల్లంఘనోద్యమానికి దేశ ప్రజలకు పిలుపునిచ్చారు. లచ్చన్న రెండు మాసాల శిక్షణ పొందటానికి కాకి సేవాదళ ఆఫీసర్సు ట్రైనింగులో వుండగా ఈ పిలుపు వచ్చింది. దేశమం అందుకు సన్నద్ధమైంది.

వాతావరణం, బీభత్స దృశ్యం. పల్లె జనం అంతా చుట్టుముట్టి "పాపం వీళ్లందరు ఏమౌతారు ? గవర్నమెంటోళ్లు వీళ్ళని చంపేస్తారేమో ?" అన్నట్లుగా చూస్తూ వారిలోవారు అనుకోసాగారు. తదుపరి రెండవ జట్టు పార్టీనాయకత్వాన, ఇలా జట్టు తదుపరి జట్టు సత్యాగ్రహాలు జరిపాయి. లచ్చన్న ఏ జట్టులోనూ లేనప్పటికీ సోంపేట సబ్ఇన్స్పెక్టర్ ఆదేశించారు "లచ్చన్నను పట్టి బంధించండి. మూల బీజమతడే. అంతటితో ఇచట సత్యాగ్రహుల ఆటకట్టు." గాలించి వచ్చిన పోలీసులు ఎక్కడా కన్పించలేదని చెప్పారు. మళ్ళీ లచ్చన్నను వెదకమని పోలీసుల్ని పంపించాడు.

"ఇడుగో లచ్చన్న పరుగెత్తాడు. అదుగో లచ్చన్న. అక్కడా లేడే ! మరి ఎక్కడ ఉన్నట్లు ?" పల్లెప్రజల హృదయాల్లో. ఏ గృహిణి అయినా వస్తున్న లచ్చన్నను చూసి "బాబుగారూ ! దండాలండి. రండి మా యింట్లో ఉండండి. మిమ్మలను ఎవరూ చూడరు. చూడలేరు. ఆ పోలీసు గూండాలు ఏమ్నీ చేయగలరు బాబూ ? మీరు మాకుండాలి. మీకోసం ఏంచేయమన్నా చేస్తాం." ప్రభుత్వాన్ని ఎదిరించిన వ్యక్తికి ఆదరణ నివ్వగలిగిన శక్తి వారికి ఎలా వచ్చింది ? ప్రతి ఒక్క మహిళ లచ్చన్నను తన ఇంటి ఇలవేల్పుగా భావించింది. "తన భర్త తాగి తందనా లాడితే, తన భర్త కానిపనులు చేస్తే లచ్చన్నబాబుకడ వచ్చి అదుకొని వాళ్ళను బాగుచేసింది" ఇది వారి అభిప్రాయం.

కులంవారు 'లచ్చన్న మా కులదేవుడు' అని భావించారు. వారి కులవృత్తిని కాదని, కల్లు సారాయిలను త్రాగవద్దని చెప్పి జనాలకు బోధించి, కులంవాళ్ళతో కానీరాబడి లేకుండాచేసినా లచ్చన్నపై ఆనాడు వారెంత అభిమానం చూపు తున్నారు. కాలక్రమేణ వారు గుర్తించారు ఏది మంచో ఏది చెడో అన్నది ! దేశం కోసం ఎంతపనైనా చేస్తాడు లచ్చన్న. ఎవరినైనా ఎదిరిస్తాడు లచ్చన్న. దేనినైనా త్యజిస్తాడు లచ్చన్న. ప్రజలగుండెల్లో నాటుకొన్న విషయాలు – ఇవే చాలిక. 'లచ్చన్న బారువాలోనే ఉన్నారు' అనగానే పోలీసులకు అరికాలుమంట నెత్తి కెక్కింది. ప్రతి ఇంట్లో దూరి "లచ్చన్న ఎక్కడ ?" పోలీసు ప్రశ్న.

"ప్రతి ఇంట్లో లచ్చన్న ఉన్నాడు" ఒక గృహిణి సమాధానం.

లాఠీ ఎగిరిపడింది. అయినా ఆమెనోరు తెరిపించలేకపోయింది. దెబ్బలకు సమాధానం భూమిపై దొర్లిపడి లేస్తూ బాధగా నిట్టూర్పు మాత్రమే. అందరి సమాధానం "మాకు తెలియదు."

లచ్చన్న అండర్గ్రౌండ్లో ఉన్నారు. సత్యాగ్రహదళాలను పంపిస్తున్నారు. ఎవరికి ఎవరికి ఆవిధంగా ఆదేశాలిస్తున్నారు. పోలీసుల కన్నుగప్పి తిరుగు తున్నారు. ఉద్యమం మంచి ఊపువందుకొన్నది. అప్పటికే చాలా [illegible] జైలుకు వెళ్లాయి. ఇక తరువాత వచ్చింది. "[illegible]

ఉత్తర్వులను ధిక్కరిస్తాను. జాతీయ జెండాను ఎగురవేస్తాను" అప్పన్న ప్రకటించాడు. ఆ ప్రకటన పత్రికలో ప్రకటించవనవసరంలేదు. కరపత్రాలలో వివరించవనవసరంలేదు. జనం యావత్తుకి ఈ విషయం క్షణంలో పాకింది, దావకింద నీరులా. దారువాలో ప్రజానీకం ముఖ్యవ్యక్తులగల పల్లెల్లో జనం ఈ వింత విశేషం చూద్దామని దారువా వీధుల్లో నిండిపోయారు.

పోలీసులకు ముందుగా తెలిసినందున సబ్ ఇన్‌స్పెక్టరు నాయకత్వాన రంగంలో ప్రవేశించారు. సత్యం బండిలోనుంచి దిగారు. "వాళ్ళను బాదమోదండి" అన్న ఇన్‌స్పెక్టరు మాటలకు వెంటనే కిరాయి పాలకుల పోలీసుల లాఠీలు కదిలాయి. అప్పన్న నోటెత్తి 'స్వతంత్ర భారత్‌కి జై' అని అనగానే వీపుమీద లాఠీపడి విరిగింది. చేయి కిందికి రాలేదు. 'మహాత్మా గాంధీకి జై' అని అనగానే చుట్టుమూగిన పోలీసులు తలా ఒక దెబ్బ అప్పన్న శరీరంపై వేశారు. అయినా అప్పన్న భూమిపై ఒరగలేదు. తరగని ధైర్యంతో ముందుకు పైకి ఎగిరి మరల 'స్వతంత్ర భారత్‌కి జై, మహాత్మా గాంధీకి జై' అనిఅనగానే చుట్టుమూగిన అసంఖ్యాక జనం నుండి దిక్కులుపిక్కటిల్లేలా 'జై జై' అన్న నినాదాలు మిన్నునంటాయి.

ఇంకా ఆలస్యంచేస్తే మంకుపట్టుదలపడితే శాంతికి విఘాతం కలుగుతుంది. దారుణమారణకాండ జరిగినా జరగవచ్చు. గాంధీజీ శాంతియుత సత్యాగ్రహానికి తను మచ్చతెచ్చినవాడవుతాడు. అప్పన్న మరి ఉద్రేకంతో [illegible] ప్రజలను వారించాడు. పోలీసులు అప్పన్నను బంధించారు. అరెస్టుచేసి బండిలోనికి ఎక్కించారు. [illegible] జై జై నినాదాల చేస్తూనే ఉన్నారు. గుర్రంబండిలో కూర్చున్న అప్పన్న 1 [illegible] తన దీక్ష కొనసాగించుకొనటానికి ప్రయాణం [illegible] పోలీసులతో దారువానుండి. తిన్నగా పోలీసులు అప్పన్నను [illegible] రిమాండ్‌లో ఉంచారు. తదుపరి విచారణ జరిగింది.

"[illegible]" మేజిస్ట్రేటు.

"[illegible] తల్లిని చెలసాలనుండి తప్పించటానికి తనయుడు కృషి చేయటం నేరమా" అప్పన్న.

"[illegible]" మేజిస్ట్రేటు.

"[illegible] తన స్వార్థం తన బ్రతుకు చూడక దేశభక్తి త్యాగనిరతిని [illegible] శిక్షించటం న్యాయమా."

[illegible] శిక్షిస్తున్నాను. 6 మాసాల కఠిన కారాగార శిక్ష [illegible] మేజిస్ట్రేటు. ఆ తరువాత అప్పన్నగారిని [illegible] తరలించారు. న్యాయస్థానం విధించిన 6 మాసాల

కారాగార శిక్షను అనుభవించటానికి దగ్గరలోనున్న విశాఖపట్నం సెంట్రల్ జైలుకి పంపించక రాజమండ్రి జైలుకు పంపించటంలో గల విశేషం అనాడు విశాఖ సెంట్రల్ జైల్లో దొంగలుమాత్రమే శిక్షలు అనుభవించటానికి అవకాశ ముండేది. రాజకీయ ఖైదీలను విశాఖపట్నం జైలుకి అంపే వారుకాదు, రాజ మండ్రి జైలుకు పంపేవారు.

జీపుదిగి రాజమండ్రి సెంట్రల్ జైలుకి పోలీసులతో నడచి వస్తున్న లచ్చన్నను జూవి జైలు అధికారులు సందిగ్ధావస్థలో పడ్డారు. లచ్చన్న మైనరా? మేజరా? తన వయసానాటికి 23 సంవత్సరాలు. అయినా వీరికి తను మైనర్ గానే కనపడ్డాడు. పాపం పసివాడని లచ్చన్నను మొదట మైనర్ బాక్‌లో బాల నేరస్తునిగా జమ చేసి చేర్చారు.

రాజమండ్రి జైల్లో 5 మాసాల శిక్ష :

మైనర్‌బ్లాక్‌లో లచ్చన్న కొన్నాళ్ళు గడపవలసి వచ్చింది. ఈలోగా అబ్లాక్ ప్రక్కనే డిటెన్యూ బ్లాక్‌లో బెంగాల్ విప్లవవీరుడు భటాచార్య ఉండేవారు. కొన్నలగడ్డ రామలింగయ్య సహచరులుగా ఉండేవారు. భటాచార్యతో లచ్చన్నగారికి పరిచయమైంది. స్నేహం కుదిరింది "విప్లవపంథాయేమంచిది. సత్యాగ్రహం చేతకాని దద్దమ్మలపని" అని అనహ్యించుకొనేవారు భట్టాచార్య. అతనితో లచ్చన్న ఉన్నది కొద్దికాలమే. లచ్చన్నను మైనరు బ్లాకునుండి మేజరు బ్లాకునకు తనకు 23 ఏండ్లు దాటాయని మార్చారు. ఇచటకూడ లచ్చన్నకు విప్లవ భావాలుగల యువకిశోరాలే ఎదురైనాయి.

లాహెూర్ కుట్రకేసులో ఉరితీయబడిన భగత్‌సింగ్, రాజగురు సుఖదేవ్ లతో విప్లవోద్యమంలో పాల్గొన్నవారు విజయకుమార్ సిన్హా శివవర్మలు. ఈ ఇరువురి తోలచ్చన్నకు జైల్లో పరిచయం అయింది. ఈ ఇరువురు యావజ్జీవ శిక్షను అనుభవిస్తున్నారు. అండమాన్ నుండి తరలింపబడ్డారు.

లచ్చన్న ఇప్పుడు సామాన్య రాజకీయ కార్యకర్త కాదు. రాజకీయ నాయకుడు. స్వాతంత్ర్య సాధన సమర రణ రంగంలో ముందడుగేస్తున్న లచ్చన్నను ప్రముఖ కాంగ్రెసు వాదిగా గాంధేయ వాదిగా ప్రతి ఒకరు గుర్తించే సమయం.

ఇక రాజమండ్రిలో తనున్నది జైల్లోనే అయినా బ్రిటిషువారి దృష్టిలో హంతకులుగా విప్లవవీరులు సిన్హా-శివలతో పాటు, తీవ్రవాదులుగా పేర్కొనబడిన అన్నె అంజయ్య గార్లకు తదిపుడు సహచరుడు సమానుడు. కాట్రగడ్డ నారాయణ రావుగారు, అల్లూరి సత్యనారాయణరాజుగారు వారితో పాటు జైల్లో కారాగార శిక్షను అనుభవిస్తున్నారు.

"మేము ఖైదీలమయినా హంతకులం కాము, దొంగలముకాము, పవిత్రమైన ఆశయానికి జీవితాలను అర్పిస్తున్న వారము" అని రాజకీయ ఖైదీలు అంక

అయినా లచ్చన్న మనసులో ధైర్యం సడలలేదు. నిబ్బరం పోసిపోలేదు. నిగ్రహం ఆత్మశక్తి మేరునగమంతటి స్థాయికి పెరిగింది. బాధలననుభవిస్తున్నా భారతమాత తన ఆత్మలో ఘోషిస్తూ తిరుగుతున్నది. భరించలేననలేదు. ఇకపై మీ యిష్టారాజ్యం నేనేమి అనను ఎదురు చెప్పను అన్నది లచ్చన్న జాతకంలోనే లేనిది. జైలు అధికారులతని మొండి పట్టుదలను మొరటు తనాన్ని నిగ్రహశక్తిని తలచుకొని నివ్వెర పడిపోయారు.

జైలు అధికార్లు ఖైదీల కొంటెతనానికి, తిరుగుబాటుతనానికి లొంగిపోయి ఒక్కొక్కమారు ఏపని పాటలు వారిచేత చేయించక ఊరకనే కూర్చోమనేవారు. అయితే జైలుఅధికారులు నోరు పారేసుకొనేవాళ్ళు. ఖైదీలు, అందులో లచ్చన్న సమాధానం చెప్పకుండా ఉండలేకపోయేవారు. ఆగ్రహం రావాలిగాని అహంకారంఉన్న వ్యక్తులు ఊరుకోగలరా? ఉద్రేకం ఉండాలిగాని, బదులు చెప్పక ఊరుకుంటారా?

జైలులో నిరాహారదీక్ష :

ప్రతివారం సూపరింటెండెంటుగారు ఖైదీలను తనిఖీ చేసేవారు. హెడ్ వార్డెన్ అకారణంగా లచ్చన్న గారిపై చేయి చేసుకోవడం జరిగింది. అంతే లచ్చన్న ప్రాయోపవేశానికి సిద్ధమయ్యారు. అతనిని దండించాలి, దండించడం జరగదు. తను శాంతిదూత గాంధీజీ శిష్యుడు. ఎలాప్రతీకారం తీర్చుకోవాలి. వ్యక్తి సత్యాగ్రహమే శరణ్యం. నిరాహారదీక్ష కొనసాగింది. జైలు అధికారులు చెప్పి చూశారు అతనిని, ఆ వార్డెన్‌ను శిక్షించనిదే తను నిరాహారదీక్షను విరమించేది లేదు అని మొండికెత్తాడు లచ్చన్న. ఉద్రేకస్వభావి లచ్చన్న. సత్యాగ్రహం నిరాహారదీక్షగా లచ్చన్న మార్చారు.

నాతో వాదించిన వార్డెన్ నన్ను కొట్టడమేమిటి? ఆ వాదనలో తను లేకపోతే పశువుల్లా కాలు దువ్వుతారు. జైలు అధికారి బతికిపోయాడు. కానీ గాంధేయవాదికి సత్యాగ్రహం శరణ్యం అయింది. లేకపోతే ఫలితం? ఒకరోజు గడిచింది. లచ్చన్న భోజనప్రియుడు. పుష్కలంగా భోజనం చేయనిదే శరీరపటిష్టత నెలా సంపాదించగలమన్న భావం గల వ్యక్తి. బలహీనుడు చేయగలిగిందేమిటి అన్నది అతని వాదన. నిస్సారమైన జీవితాన్ని, నిస్సత్తువ గల శరీరాన్ని కలవ్యక్తిలో మేధాసంపత్తి ఏమాత్రం ఉండగలదని అతని ప్రశ్న. ఆరోగ్యకరమైన శరీరమున్నగాని ప్రశాంతమైన మానసికానందాన్ని మనిషి అనుభవించలేడన్నది అతని నమ్మకం. A sound mind in a sound body అనికదా!

అటువంటి లచ్చన్న నేడు వ్యక్తి సత్యాగ్రహం—నిరాహారదీక్ష సాగడం విడ్డూరమే అయిన అది విప్లవపంథా. రెండవ దినం అతని దహిస్తున్నది. [illegible]

మనసును నిగ్రహంతో ఉంచగలిగారు. శరీరానికి సంబంధించినది ఆకలి, మనసుకు కాదుగదా? శరీరం నిస్సత్తువలోనున్నా మనస్సు దుర్బలత్వం లేక ఉండగలదు. అయితే గాంధీజీ ప్రభావం తనపై ఉంది. మనసును నిగ్రహించుకోవడం గాంధీజీ నేర్పిన ప్రథమపాఠం. "మనసు స్వాధీనపరుచుకొని అనగవలెను వాయువును నిగ్రహించుట కఠినము మనకు" అని గీత. అయినా అభ్యాసంతోను వైరాగ్యంతోను దీనిని నిరోధించవచ్చునని చెప్పినది గీత!

నిత్యం దేశాన్ని, స్వరాజ్య ఉద్యమాన్ని, గాంధీజీ త్యాగభావాన్ని సంస్మరణ చేస్తుండే లచ్చన్నలు ఆకలి అంతరించి ఆత్మత్యాగంలో ముందడుగు వేశారు. 6 దినాలు గడిచాయి. 7వ దినమున విప్లవ సింహం సిటా శివవర్మ తిరుపతి వ్యవహారంలో జోక్యం చేసుకున్నారు. లచ్చన్నపై చేయిచేసికొన్న ఆ జైలు అధికారి చేత క్షమార్పణ చెప్పిస్తారా మేము ఆ నిరాహార దీక్షకు ప్రతిగా ఆందోళన కార్యక్రమం చేపట్టాలా, అని హెచ్చరించిన మరుక్షణమే జైలు అధికారులు దిగివచ్చారు. క్షమాపణ చెప్పడం, లచ్చన్న దీక్ష విరమించడం రెండూ జరిగిపోయాయి.

జైళ్ళ గదుల్లో మగ్గే రాజకీయ ఖైదీలలో లచ్చన్న ఎవరు అన్న ప్రశ్న రేకెత్తింది. ఇతడెవరో గట్టిపిండమే, జైలు అధికారులను ఎదిరిస్తున్నాడు. ఎన్ని శిక్షలు వేసినా లొంగకున్నారు. నిజమైన విప్లవాదికిటువంటి వారే వెన్నెముకగా నుండగలరు.

ఎదురుగా వస్తున్న లచ్చన్నను చేయిపట్టుకొని ఆపారు బెంగాల్ విప్లవ ఖైదీలు సిటా శివవర్మ.

ముగ్గురూ ఒకచోట కూర్చున్నారు. "చూడండి లచ్చన్నగారు (ఇంగ్లీషులో [illegible]) [illegible] మీరు చేస్తున్న సత్యాగ్రహాలు ఉపకరిస్తాయేమో గాని [illegible] మాత్రం. అవి మనకు రాజ్యం తెచ్చిపెట్టలేవు. మీరేమంటారు?" సిటా [illegible] లచ్చన్నకా ప్రశ్న ఆశ్చర్యాన్ని కలిగించలేదు. నిజానికి తను [illegible] విప్లవవాది. హింసామార్గాన్ని అనుసరించే స్వరాజ్యాన్ని [illegible] ఉన్నవాడు.

[illegible] అని చెప్తున్నారు హింసద్వారానే స్వరాజ్యాన్ని తేగలమని. [illegible] కాదనరు. మొదట్లో నా అభిప్రాయం అదే. [illegible] ప్రభావంతోనే సత్యాగ్రహి అయ్యాను."

[illegible] నిజానికి సంవత్సరం మనకు రాజ్యం [illegible] గాంధీజీ సత్యాగ్రహమార్గం అని చెప[illegible] [illegible].

"నిజమేనండి శివవర్మగారు. ఏదిఏమైన గాంధీజీ ఆంగ్లేయులపై నూతన అస్త్రాన్ని ప్రయోగిస్తున్నారు. అదిమనకు క్రొత్తది. తను చెప్పినది దేశం మొత్తం పాటిస్తున్నది. ఇక మన విధానాన్ని సమర్థించే వారేలేరు. ఉన్నా, ఉన్న సంఖ్యలో ఏమాత్రం" లచ్చన్న.

"అలాఅని నమ్మిన సిద్ధాంతాలకు తిలోదకాలివ్వం. మాఆశయాల్ని రక్షించుకోవటానికి తుదివరకు పోరాడతాం" సిన్హా గర్జించారు.

లచ్చన్న హింసాహింసల సిద్ధాంతాలలో నేది సర్వోత్తమమని నిర్ధారణ పరచుకోలేని సందిగ్ధావస్థలో పడ్డారు.

"మీరు మనసు మార్చుకోండి, విప్లవపంథాను చేపట్టండి. గాండ్రించే పులులను ఓదార్చాలా ? గండ్రగొడ్డలితో నరకాలా ? సర్పానికి బడితెకర్ర, అంబోతుకు ముళ్ళకర్ర, తప్పదు లచ్చన్నా. అనాడు కానీ మనకు స్వరాజ్యంసిద్ధించదు. మన భారతీయులు బాగుపడరు.

మనదేశంలో విప్లవ వీరునిగా పోరాడటానికి సిద్ధ పడుతున్నాం. మనం జైళ్ళనుండి విడుదల అయితే, విప్లవపంథాను అనుసరించాలని తీర్మానించుకొన్నాం కదా. ఇదిగో ఎందుకయినా మంచిది మా చిరునామాలను మీకిస్తున్నాం. జాగ్రత్త పరచండి, అవసరమైనపుడు మీకు ఉపకరిస్తాయి" అంటున్న విప్లవీరులను అభినందిస్తూ–చిరునామాల్ని సంగ్రహించారు. ఆంధ్ర నుండి ఒక విప్లవ వీరుడు మనకు లభించాడన్న ఆనందముతో బెంగాల్ విప్లవ వీరులు సంబరపడి పోయారు.

జైల్లో ఉన్న కాట్రగడ్డ నారాయణరావు గారి సోదరులు, అల్లూరి సత్యన్నారాయణ (ఆంధ్ర నాయకులు) అతని అనుచరులు అన్నెం అంజయ్యగార్లు లచ్చన్నతో చర్చలు ప్రారంభించారు "విప్లవపంథాలేక అహింసామార్గమా, బిప్రరిష్ట ఉద్యమ ఆశయాల వివరాలు మీరు సేకరించినట్లున్నది. ఇకనుండి విప్లవోద్యమాన్ని జైలునుండి విడుదలయిన తదుపరి చేపడతారా" పై ఇరువురు లచ్చన్నను ప్రశ్నించారు. లచ్చన్న అంగీకరించారు. "ఏది ఏమైన ఆ బెంగాల్ విప్లవ వీరుల హితోపదేశాలు మీకు వంటబట్టి నట్లున్నవికదా" అన్నారు సత్యన్నారాయణ.

అంతలో అన్నెం అంజయ్య అందుకొన్నారు, "రావుగారూ! లచ్చన్నకేకాదు మనకూ ఆమార్గమే ఉత్తమంలా ఉన్నది. ఏమిటిజైల్లోపడటం! మరల సత్యాగ్రహం, మరలజైలు. ఎప్పటికి స్వరాజ్యం మనకాలములో చూస్తాము?" "నిజమే అంజయ్యా! తీవ్రవాద భావాలుంటే సరిపోదు. అకార్యక్రమాల్ని మనం రూపొందించాలి. ఉద్యమాన్ని లేపాలి. ప్రభుత్వాన్ని హడలెత్తించి గడగడలాడించాలి. ఏమంటావు లచ్చన్నా? లచ్చన్నలో మానసికమైన మార్పులు వచ్చాయి. లచ్చన్న తీవ్రవాదాన్ని అమలుచేయాలన్న నిర్ణయానికి వచ్చారు.

# 13. విప్లవ అరుణ కిరణం - యువలభ్యన్న

గవర్నర్ జనరల్ వైస్రాయి ఇర్విన్ 1931 జనవరి 26లో మహాత్మా గాంధీని, కాంగ్రెసు వర్కింగ్‌కమిటీని నెహ్రూతోసహా జైళ్ళనుంచి విముక్తం చేయడం జరిగింది. తదుపరి మొదటి రౌండుటేబిల్ సమావేశం లండన్‌లో 1931 నవంబరు 12 వ తేదీన జరిగింది. కాంగ్రెసునాయకులను జైళ్లో పుంచి ఆంగ్లేయులు జరిపిన ఆ సమావేశానికి కాంగ్రెసు నాయకత్వం హాజరుకాలేదు. మహారాజులు, మితవాదులు, హిందూ ముస్లిం ప్రతినిధులు హాజరై సమైక్యతను వర్ణించారు. అన్నిజాతులను ఆకట్టుకునే ఫెడరేషన్ రూపొందాలని ఆసమావేశం తీర్మానించింది. ఆ సమావేశంలో పాల్గొన్న సర్ తేజబహుద్దూర్ సప్రూ, డాక్టర్ జయకర్‌లు గాంధీజీతో కలిసి చర్చించారు. రెండవ సమావేశానికి హాజరుకావాలని కోరారు. మద్రాసునుంచి మహామేధావి శ్రీనివాసశాస్త్రి గాంధీజీని కలిశారు. గాంధీ - ఇర్విన్ పాక్ట్ రూపొందడానికి సన్నాహాలు జరిగాయి. నెహ్రూ దీనికి వ్యతిరేకించినా తుదకు అంగీకరించారు. రాజకీయ ఖైదీలను విడుదలచేయడం హింసతో సంబంధంలేనివారిని, రాజకీయ నేరారోపణలమీద తొలగించిన ఉద్యోగులను మరల ఉద్యోగాల్లోకి తీసికోవడం, ఉప్పును తయారుచేయడం, కల్లు సారా దుకాణాలముందు పికెటింగ్ చేసుకొనే హక్కును యివ్వడం, పోలీసు లాఠీ చర్యలపై విచారణలు జరిపించడం అనాటి తీర్మానాల్లో ఉన్నాయి. ఉప్పు తయారీ, పికెటింగ్‌లవలన స్వరాజ్యం వస్తుందా? అన్నది అనాటి అప్పన్న వంటి సత్యాగ్రహుల అభిప్రాయం.

1931 మార్చి 23 వ తేదీన భగత్సింగ్, రాజగురు, సుఖ్‌దేవులను ఉరితీశారు. దేశంలో విప్లవశక్తులు విజృంభించాయి. హిందూ, మహమ్మదీయ పోరాటాలు, కాన్పూరు అల్లర్లు జరిగాయి. మహాత్మాగాంధీ రెండో రౌండ్‌టేబుల్ సమావేశానికి వెళ్లక తప్పని పరిస్థితి ఏర్పడింది. దేశంలోని వివిధశక్తులు గాంధీజీని సమావేశానికి వెళ్లవలసినదిగా ఒప్పించాయి. మహాత్మా గాంధీ లండన్ సమావేశానికి వెళ్లేవరకు మార్గమధ్యంలోగల అనేక అస్వతంత్ర దేశాలు, స్వతంత్ర దేశాలు సన్మానించాయి. ఎంతగానో అభినందించాయి. తెల్లదొరలను హడలెత్తించే అత్యంత అద్భుతశక్తిగా ప్రపంచంలో అనాటికే పేరొందిన వ్యక్తి గాంధీజీ. వారిని చూడటానికి ప్రజలు తండోపతండాలుగా వచ్చేవారు. ఆత్మ శరీరాల సంఘర్షణలో తుదకు ఆత్మ జయిస్తుందన్న సత్యానికి ప్రతీకగా నిలిచిన గాంధీజీని చూడటం ప్రతిఒక్కరికి అపూర్వయోగమే.

ఆ గాంధీ స్వరూప స్వభావాలు మాత విచిత్రం. అతి సాధారణవ్యక్తి కన్నా అరుదైన వస్త్రధారణ. అంగవస్త్రం, శరీరం కప్పు కోవటానికి ఒక చిన్నదుప్పటి. సామాన్యమైన చేతికర్ర, అరిగిపోయిన కాళ్ళ చెప్పులు, దారాలతో కట్టబడిన

కళ్లద్దాలు, నడుంబొద్దున తగిలించే వాచీ. నడుముకు కట్టబడిన వాచీ మాత్రం ముఖ్యం. కారణం, ఏ టైముకు ఏ దినచర్యచేయాలో అది చేసి తీరవలసిందే. ఎంతటి అవాంతరమొచ్చినా దానికి సవరణలేదు.

తెల్లదొరలు గాంధీజీని జూచి నివ్వెర బోయారు. వేషభాషల్లోనే ప్రపంచం ఉందని, సంపద ఐశ్వర్యాల్లోనే జీవితం ఉందని భ్రమసిపోతున్న పాశ్చాత్య ప్రపంచం గాంధీజీ రీతి చూచి ఆశ్చర్యపడింది.

రెండో రౌండ్‌టేబుల్ సమావేశం జరుగుతుంది. ఆ సమావేశం అంత ఆశాజనకంగాలేదు. మధ్యలో గాంధీజీని బ్రిటిషురాణి విందుకు పిలిచింది. విందుకు హాజరయిన గాంధీజీ రూపురేఖలను వస్త్రధారణను చూచి నివ్వెరపడిన బ్రిటిషు రాణి "ఏమిటి మీవేషధారణ" అని వ్యంగ్యంగా ఎత్తిపొడిచింది. "ఏంచేయను మహారాణీ మాదేశంలో మా వంటినిండా కప్పుకోవటానికి వస్త్రాలు లేవు. శరీరం చిక్కి శల్యమైపోవటంతప్ప. తినటానికి సరియైన తిండిలేదు. ఏంచేస్తాం మా పాలకులు అవన్ని హరించి తీసికొనిపోతున్నారు" గాంధీజీ జవాబువిన్న బ్రిటిషురాణి ఖిన్నురాలైంది. నోట మాటరాలేదు. విందు సమావేశం ముగిసింది. గాంధీజీ లండన్ సమావేశం ముగించుకొని స్వదేశం తిరిగివచ్చారు. 1931 డిశంబరు 28 నాటికి బొంబాయి చేరుకున్నారు.

రెండవ రౌండుటేబుల్ సమావేశం జరుపుతూనే బ్రిటిషువారు దారుణమైన ఆర్డినెన్సులను జారీచేసారు.

బ్రిటిష్‌వారి ద్వంద్వ వైఖరికి విసిగిన కొందరు స్వాతంత్ర్య పోరాట యోధులు సత్యాగ్రహాలద్వారా, స్వరాజ్య సాధన సాగేపని కాదని దౌర్జన్య పద్ధతులను అవలంబించారు.

ఆంగ్లేయులను భయభ్రాంతులను చేయటానికి విప్లవకారులుగా వ్యవహరిస్తూ కొందరిని చంపి తమ జాతీయతను స్వాతంత్ర్య పిపాసను వెల్లడి చేసికొనేవారు. ఆ మార్గం అనుసరించేవారిని ఆంగ్లేయులు పట్టి బంధించి తీవ్రహింసలకు గురి చేసేవారు. ఉరికంబాల నెక్కించేవారు. మీరట్ కుట్రకేసు, కాకూరిబాంబు కేసుల్లో అనేక మంది విప్లవకారులు ఉరితీయబడ్డారు, కాల్పులకు బలిఅయ్యారు. యువకుల్లో విప్లవభావాలు ప్రజ్వరిల్లాయి.

ఇండియాలో కూడ అతివాద ఉద్యమ ప్రభావం వ్యాప్తి చెందింది. కాకినాడ, మద్రాసులలో బాంబులు పడ్డాయి. అన్నాప్రగడ కామేశ్వరరావు ప్రతివాద భయంకారాచారి, మద్దూరు అన్నపూర్ణయ్య, కాకరాల కామేశ్వరరావు మొదలైన విప్లవ వీరులంతా అనాటికి 30 ఏండ్ల ప్రాయంవారే. ఒక దశాబ్దం పర్యంతం బ్రిటిషు పాలకులకు సింహస్వప్నమయ్యారు.

జాతీయోద్యమాన్ని ఒకవైపు అణచివేయటానికి విశ్వప్రయత్నం, వేరొక వైపు భారతీయులకు స్వయంపాలనావిధానము ప్రతిపాదించటం.

1933లో మూడో రౌండుటేబుల్ సభల్లో వచ్చిన అంశాలను బ్రిటిషు వారు పరిగణనలోనికి తీసుకొని ఒక చట్టం వేయాలని చూస్తున్న దినాలవి. ఇదే తరువాత 1935 ఇండియా యాక్టుగా ప్రకటింపబడింది. మితవాదులకి వ్యవహారం నచ్చినా, అతివాదుల నిది అకట్టుకోలేకపోయింది.

అతివాది అయిన లచ్చన్న 193?లో తీవ్రవాదభావాల పూర్ణ సంకల్పానికి లోనయ్యారు. 'ఏమిటీ మంతనాలు, చర్చలు, సంప్రదింపులు ఎప్పుడు మనకు స్వరాజ్యం వస్తుంది? మన వారే గతించాలా, అంతరించాలా. దెబ్బకు దెబ్బ తీస్తే తప్ప ఆ తెల్లవాళ్ళు క్రిందకు దిగిరారు.' ఇదీ లచ్చన్న ఆలోచనా ధోరణి.

తను బారువాలో చేస్తున్న హరిజనోద్యమం మంచిదే. కల్లు సారా కొట్లవద్ద పికెటింగ్, తెల్లవారిని వెళ్లగొట్టే కార్యక్రమం తన కానాడు కావాలి. ఎదురు తిరగడం, ప్రభుత్వం దండించడం, శిక్షించడం, మళ్ళీ విడిచిపెట్టి వేయడం. స్వరాజ్యం వచ్చేదెప్పుడు? ఎప్పుడు తెల్లవారు కళ్లు తెరిచేది? బలిసిన ఆంబోతు చేనులో పడి తింటుంటే మంచి మాటలతో చెప్పేస్తే పోతుందా! దుర్లభం.

తెల్లవారిని, ఆయుధదారులై ఎదుర్కొంటేనే లభిస్తుంది స్వరాజ్యం. లేనిచో దుర్లభం. లచ్చన్న బారువాలో నుంటూ ఎలా తను తీవ్రవాదిగా మారి, ఆయుధాల్ని సేకరించి విప్లవకారులతో కలసి పోవాలా అని ఆలోచిస్తుండగా తన గ్రామానికి ఒక అతివాది వచ్చారు.

ఇంట్లో ఉన్నవాళ్ళకు, తన సహచరులకు తను రాజమండ్రి జైల్లో ఉండగా తనతో జైలుశిక్ష అనుభవించిన రాజకీయ ఖైదీ అనే యదార్థాన్ని దాచి చెప్పారు. మూడు దినాలుగా విప్లవకారులు లచ్చన్నను విప్లవపంథాలోనికి ఉసి గొల్పారు. అసలే మండుతున్న అగ్ని గోళం, అందుకు తోడు వేసవిగాడ్పు.

విప్లవకారుడు అమితానందభరితుడయ్యాడు. వచ్చిన పని అయింది. ఏదో కొంత ఆర్థిక సహాయాన్ని లచ్చన్నవద్ద నుండి పొంది తన గమ్యస్థానాన్ని వెదుక్కొంటూ ఆ విప్లవకారుడు ఆనాడు బారువానుండి వెళ్లాడు.

లచ్చన్న బారువాలో కాలాన్ని వెళ్లబుచ్చుకో లేకపోయాడు. చేతి నిండా పని కావాలి. వెంటనే బారువానుండి బయలుదేరి ఒకనాడు తనతో రాజమండ్రి జైల్లో శిక్షననుభవించిన అన్నెం అంజయ్య, కాట్రగడ్డ నారాయణరావు లను కలవటానికి వెళ్లారు. వాళ్ళంతా ఏదో తీవ్రవాద కార్య కలాపాల్లో పాల్గొంటున్నారని దినపత్రికలో చూసాడు ఆ కార్య క్రమాల్లో పాల్గొనడం ఏమిటి? జైల్లో వాళ్లంతా ఒక అంగీకారానికివచ్చారు ఏమి చేసిన జతసై అందరం

కలసి చేద్దాం, ఉద్యమాన్ని ముందుకు తీసుకొని వెళ్దాం అని. మరి ఈనాడు వారు మాటతప్పారని లచ్చన్నగారికి వార్తవచ్చె. అప్పుడను. వెంటనే వెళ్లి వారిని కలియాలి.

లచ్చన్న బెజవాడ చేరుకొన్నారు. అక్కడనుండి ముదినేపల్లి అనే గ్రామం వెళ్ళారు. అక్కడనే అన్నెం అంజయ్య నివాస ముంటున్నారు. కథ అంతా విని లచ్చన్నతో ఆ విప్లవ కార్యక్రమాల్ని నడిపింది వారు కాదని మద్దూరి అన్నపూర్ణయ్య, అన్నాప్రగడ కామేశ్వరరావు అని చెప్పారు.

అయితే మన కార్యక్రమం ఏమిటి? లచ్చన్న ఆవేశం ఉత్సాహం దేశభక్తి ఉప్పొంగి మూర్తీభవించిన విప్లవమూర్తిగా ఉన్న లచ్చన్నకు అన్నెం అంజయ్య హితబోధ చేసారు. మన ఆలజడిని ప్రభుత్వం పసికట్టింది. సి.ఐ.డి.లు. ముమ్మరంగా తిరుగుతున్నారు. ఏంచేసినా బైటకు పోకుండా కొన్నాళ్ళు ఆగాలి అని చెప్పారు. లచ్చన్నకు అన్నెం అంజయ్య యిచ్చిన సలహా రుచించలేదు.

తిన్నగా బెజవాడనుంచి బయలుదేరి బారువా వెళ్ళక బెరహంపూర్ చేరారు. పురోగమనం పంథానే అనుసరిస్తున్న లచ్చన్న అన్నెం అంజయ్య సలహా నచ్చలేదు. అందుకే బెరహంపూర్ వచ్చారు. స్వస్థలం వెళ్లాలని మనసులేదు. ఆశయ సాధనలో విజయమందిన తదుపరే మరల బారువా గ్రామం చేరేది అని తీర్మానించుకొన్నారు.

బెరహంపూర్‌లో తనతో చదువుకున్న యజ్ఞనారాయణ స్టేషన్‌లో తటస్థపడ్డారు. ఇద్దరు మిత్రులు ఆలోచించుకొన్నారు. మిత్రుని కూడ ఒప్పించారు. ఆశయ సాధనలో సహాయ పడమని అర్థించారు.

తదుపరి కార్యక్రమం ఏమిటి? మనిద్దరం కాలి నడకను కటకం చేరాలి. "ఇది బాగుంది బెరహంపూర్ ఎక్కడ కటకం ఎక్కడ" మిత్రుని ప్రశ్న. ఒరే బ్రదర్ గాంధీజీ ఏంచేస్తున్నారు పాదయాత్రలు జరుపలేదా మనం కూడా జరుపుదాం – లచ్చన్న.

"నిజమే, కొన్ని దినాలు కొన్ని వారాలు కొన్ని నెలలు పడుతుంది గమ్యస్థానం చేరటానికి". మిత్రుని సందేహం. "పట్టినీ మన ఆశయ సాధనలో మనం నెగ్గాలి" – లచ్చన్న ఇంతకూ మనం రైల్లో వెళ్తే? తప్పా" – మిత్రుడు.

"కాదు అయితే మన వద్దనున్న పైకమెంత? చేతిలోనున్నది కాఫీఖర్చులకు కూడా సరిపోదు. ఇక రైలు ఛార్జీలు ఎవరిస్తారు? ఎవరిని అడుగుతాం? విప్లవ వీరులమైనమనం ఒకరిని యాచిస్తూ ముందడుగేయడం కూడనిది" – లచ్చన్న.

మిత్రుడు లచ్చన్నతో ఏకీభవించాడు. వారిరువురూ కటకంవెళ్లాలి. ఇరువురు ప్రయాణం ప్రారంభించారు. ప్రయాణం రోడ్డు ప్రయాణం కాదు.

రైల్వే ట్రాక్ పక్కన నడుచుకొంటూ పోవడం. ఏ ఒకరిని ఆ దారి ఎటుపోతుంది అని అడగనవసరంలేదు. అంతేగాక మరి యొక ఎత్తుగడ. రైల్వేస్టేషను నుండి మరొక రైల్వేస్టేషన్ మధ్య మజిలీ వేయడం. ఆ రైల్వే స్టేషను మాష్టర్ని అవసరాలకు అర్థించడం ఇది వారి కార్యక్రమం.

రైల్వేలైను ద్వారా నడుస్తూ మధ్య కొన్ని మజిలీలు వేస్తూ చివరికి కటకం చేరారు. కటకంలో ఉన్న పని ఏమిటి? తీవ్రవాదుల విరునామాల ప్రకారం వారిని కలిసి వారితో తీవ్రవాద కార్యక్రమాల్ని చేపట్టడం. అయితే అప్పుడు ఆశ నిరాశ అయింది. కటకంలో ఏఒక్క తీవ్రవాది కన్పించలేదు. రాజమండ్రి జైల్లో తీవ్రవాదులిచ్చిన విరునామాల ప్రకారం వెదికారు. ఏఒక్క తీవ్రవాది ఎదురవలేదు. పోలీసు నిఘా వుంది వారంతా అజ్ఞాతంలో ఉన్నారు.

అచటునుండి నిరాశతో మరల ఇరువురు రైల్వే లైన్ మీద పయనం సాగించారు. "ఖర్దక్" వెళ్లారు. కటక్ నుండి ఖర్దక్ చేరుకొనే సరికి 5 దినాలు పట్టింది. వీళ్ళ వద్దనున్నదేమీ లేదు. ఒకటి రెండు బట్టలు తప్ప.

పాదయాత్రలో ఒక స్టేషన్‌నుండి వేరొక స్టేషన్‌కు చేరుకొనే సరికి వీళ్లలో కొంత సత్తువపోయి నిస్సత్తువ వచ్చేది. సన్యాసులు కాదే అమ్మా బాబూ అని వేరొకరిని అర్థించటానికి - భిక్షమెత్తుకోవటానికి వీరేమీ అగర్భ దరిద్రులుకారు సర్వసంగ పరిత్యాగులు కారు. శరీరాల్లో ఉప్పొంగేది వేడిరక్తం. విప్లవాగ్ని జ్వాలా అభిమానం ఆత్మగౌరవం అచంచల దృఢ విశ్వాసం-ఆశయ సాధనలో పట్టుదల దీక్ష.

తిన్నగా స్టేషన్ మాష్టరు గదిలోనికి వెళ్ళారు. "మాష్టారూ నమస్కారం." "ఏం టిక్కెట్టు లేకుండా ప్రయాణం చేస్తూ వస్తున్నారా" స్టేషను మాష్టారు అడిగాడు. "మాకెందుకు టిక్కెట్టు మేము ప్రయాణంచేది రైలుమార్గం గుండా తప్పించి రైలుమీద కాదుగదా."

అంత వరకు తలదించుకుని ప్రశ్నిస్తున్న రైల్వేస్టేషను మాష్టారు తలెత్తి చూసారు విచిత్రంగా. "వీరు తిక్కమనుషులా తిరుగుబాటు దారులా"

"ఇంతకూ మీరనేదేమిటి? రైల్వేలైన్ మీద రావడం ఏమిటి? అపహాస్యమా?"

"కాదండీ నిజమే! మేము దేశానికి స్వతంత్రం రావాలని కృషి జరుపుతున్నాము."

"ఏమిటి ఈ రైలు రోడ్డువెంబడి పోవడమేనా?"

"గమ్యస్థానం చేరితే తప్ప ఆశయసాధన చేకూరదుగదండీ" లచ్చన్న.

"ఇంతకు మీరు కావలసిందేమిటి? మరల టిక్కెట్టు లేకుండా వేరొక చోటికి మిమ్మలను పంపించాలి?" –మాష్టారు.

"కాదండి. మీరు డబ్బులిస్తామన్నా మేము పుచ్చుకోము. రైలెక్కం. మా వద్ద డబ్బులున్నపుడే రైలెక్కుతాం" -అచ్చన్న.

వీరేదో గమ్మత్తయిన మనుష్యుల్లా ఉన్నారే. ఆశ్చర్యం అతని కళ్ళలో ద్యోతకమైంది.

మేము స్వరాజ్యం కావాలని తెల్లవాళ్ళను ఎదిరిస్తున్నాం. జైల్లోకి కూడా వెళ్ళాం, కావలసి వస్తే రాజమండ్రి సెంట్రల్ జైలుకు ఫోను చేసి తెలుసుకోండి. మేము స్వాతంత్ర్య వీరులం, కాంగ్రెసు కార్యకర్తలం.

ఈ మాటలు విన్న స్టేషను మాష్టారు తనసీటు నుండి లేవకుండా ఉండలేకపోయాడు. ఆనాడు స్వరాజ్యసమరంలో పాల్గొన్న వారిని త్రికరణశుద్ధిగా ప్రజానీకం ఆదరించేకాలం. స్వరాజ్యం కావాలని వాదించిన వారిని పూజించే దినాలు. ఇక స్వరాజ్యం కోసం జైలు శిక్ష పడినవారిని.లాఠీ దెబ్బల్ని తిన్నవారు ఎదురు పడిన–వారి స్వగృహాలకు వెళ్లిన ఎనలేని ఆతిథ్యాన్ని అందించేవారు. వారి పరిచయభాగ్యానికి ఉవ్విళ్ళూరేవారు. గాంధీజీ అన్నా కాంగ్రెసు అన్నా కార్యకర్తలన్నా జనం అపారమైన గౌరవ మర్యాదల నిచ్చేవారు. రహస్యంగా కార్యకర్తలకు అసంఖ్యాక ఉద్యోగస్తులు ఎన్నో విధాలుగా తోడ్పడేవారు. ఒక్కొక్కమారు వారిలో దేశభక్తి ప్రజ్వరిల్లి బహిరంగంగానే ఆనాటి రాజకీయ నాయకులను గౌరవించేవారు. ఆనాటి రాజకీయనాయకుల ధ్యేయం స్వరాజ్య సంపాదన కదా! అదొక పవిత్రమైన కార్యం ఏ ఒకరో తప్పించి, అందరూ స్వరాజ్య సమరంలో పాల్గొనలేరు కదా!

ప్రతీ స్టేషను మాష్టారు వీరి యొక్క సమాచారాన్ని తెలిసి కొన్ని మరుక్షణం వీళ్ళను గౌరవమర్యాదలతో ముంచెత్తేవారు. వాళ్ళ ఇళ్ళలో భోజనాలు చేస్తు పాదయాత్రను కొనసాగించేవారు. ఆ స్టేషను మాష్టర్లు చాలా మంది తెలుగువాళ్లు వీరికి ఎదురు పడేవారు. వీళ్ళను అమిత ప్రేమాభిమానాలతో చూసుకొనేవారు.

నిజానికానాడు దేశంకోసం పోరాడుతున్నామని చెప్పడం అరుదైన విషయం. అందరూ అంగీకరించి తీరవలసిందే. గర్భ దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నా, అవిద్యలో మునిగి యున్నా ఆనాడు మనదేశంలో పోకిరి పోతులు లేరు, మోసగాళ్లుండేవారు కాదు, అబద్ధాలు చెప్పే వారుండటం ఎంతో అరుదైన విషయం. అభ్యాగతికి స్వయం "అతిధి దేవోభవ" అన్న దానాటి సమాజంలో నిలద్రొక్కుకున్న నీతి సూత్రాలు.

ప్రతి గృహస్థు అతిథి తన ఇంటికి రావటం తన జన్మ సార్థక మైందని భావించే దినాలు. ఇక రాజకీయ అతిథులకు అర్థిస నేటి అధికార పదవులందటానికి మాస్తున్న రాజకీయ నాయకుల వంటివారు కాదు. దేశ స్వాతంత్ర్యం కోసం వారి జీవితాలనే అర్పణం చేయాలని సిద్ధపడుతున్న దేశభక్తులు. అటువంటి ప్రజలు ఆదరించకుండా ఉండగలరా? దేశభక్తి లేనివారెవరు.

ప్రతి స్టేషన్ మాష్టారు వారికి భోజనాదులతో సత్కరించి మరల వేరొక స్థలానికి ప్రత్యేక గౌరవంతో పంపిస్తామని చెప్పినా అంగీకరించేవారు కాదు. మా ఆశయం పాదయాత్రలో ఫలానా గమ్యానికి చేరాలని ఉంది. మా దీక్షకు భంగం కలుగకూడదని రైల్వేలైను మీదుగనే ప్రయాణం వీరి అకుంఠిత దీక్షను పట్టుదలని, నమ్మకాన్ని చూసి స్టేషను మాష్టర్లు విస్తుబోయేవారు.

అచ్చన్న పాదయాత్ర బయట ప్రపంచంనుండి మెప్పు నందలేదానాడు. అయిన తన మనస్సులో ఎనలేని ఆనందోత్సాహాల్ని తెచ్చిపెట్టింది. తను ఒక దేశభక్తుడు, స్వాతంత్ర్య సమర యోధుడు కాంగ్రెసు కార్యకర్త, గాంధేయవాది. తను దేశానికి చేస్తున్న సేవలో తను తృప్తిపడిన మధురక్షణం. ప్రతి ఒక స్టేషన్ మాష్టర్ తనకు తన సహచరునకు ఆదరించటంలో చూపిస్తున్న దేశభక్తితోపాటు తన స్థాన మానాడు ఎంతటి విశిష్టమైనదో తన కవగతమైంది.

ఒరిస్సా రాష్ట్రమునగల భద్రక్‌ను చేరిన తదుపరి పాదయాత్రలో పట్టు సడలింది. పాదయాత్రలో పూరి సాక్షి గోపాలం దర్శించగా అనుభూత మధురిమలు, అతని జీవితంలో ఎన్నటికి మరువరానివి.

భద్రక్ నుండి పాదయాత్ర చాలించారు. రైలెక్కి ఖరగ్‌పూర్ చేరుకున్నారు. అచ్చన్న తన సహచరులు యజ్ఞేశ్వర్రావు మిడ్నాపూర్ జిల్లాలో ఉన్న ఖరగ్‌పూర్ స్టేషన్‌లో అచ్చన్న తన మిత్రుడు దిగగానే వారికి తెలిసిన విషయం ఖరగ్‌పూర్ అంతటా కర్ఫ్యూ విధించబడిందని. మిడ్నాపూర్ జిల్లా కలెక్టర్ యూరోపియన్, అతనిని హత్యచేసినందున కర్ఫ్యూ అని తెలిసింది. ఎవరినీ ఖరగ్‌పూర్‌లో అచ్చన్న కలుసుకోలేక పోయారు.

ఖరగ్‌పూర్ నుండి జంషెడ్‌పూర్ వెళ్ళవలసి ఉన్నది. అచ్చన్న చేతిలో పైకం లేదు. మిత్రుడు యజ్ఞేశ్వర్రావు యింటి ముఖం పట్టాలన్న ఆవేదనకు లోనయ్యాడు. ఖరగ్‌పూర్‌లో ఆగిపోయి తన స్వస్థలం, బెరహంపూర్ వెళ్ళి పోయాడు.

అచ్చన్న ఒక్కడే. తనూ అక్కడనుండి ఇంటికి మరలిపోవాలా? తన ఆశయం విప్లవకారుల్ని కలియాలి. దేశమాత సంకెళ్ళను త్రెంచాలి. ఏది ఏమైన వాళ్లను కలియనిదే స్వగ్రామమును చేరుకోను-వెళాలి.

ఖరగ్‌పూర్ నుండి జంషెడ్‌పూర్ బయలుదేరారు. మిత్రుడు కూడ వెంట లేడు, చేతిలో పైసా కూడా లేదు. రైలెక్కాడు తన గమ్యస్థానం చేరాలి. తనకు రైలు టిక్కెట్టుఉందా, లేదా అన్నది తను ఆనాడు ఊహించలేదు. ఎంత వేగం వెళ్లి జంషెడ్‌పూర్‌లో నున్న విప్లవకారుల్ని కలుస్తానా అన్నదే తనదృష్టి వేరొక దృష్టి లేనేలేదు.

అయితే టిక్కెట్టు ఎగ్జామినర్ వస్తే తను ఏమని జవాబిస్తాడు. తను సత్యాగ్రహినని స్వాతంత్ర్య సమర యోధుడునని, తన వద్ద టిక్కెట్టు లేదని చెప్పాలా తన వద్ద సొమ్ములేదు. టిక్కెట్టుతీయలేదని చెప్పాలా ?

తను ఒకరికి లోబడి సమాధానం చెప్పే స్థితిని గుర్తించని స్వేచ్ఛా నాడు లచ్చన్న విప్లవ వీరుడు. తను ఎదుల్లో ఎగిరి ప్రకాశిస్తున్న తన ఆశయాల్ని తను నెరవేర్చుకోవటంలో తనకెవరు అడ్డువచ్చిన ఫలితం అనుభవించ వలసిందే.

లచ్చన్న రైల్లో అనేక మంది టిక్కెట్ కలెక్టర్లు తను కూర్చున్న బోగీలు ఎక్కడం దిగడం చూసారు. వాళ్లు అడిగిన వారిని టిక్కెట్టు అడుగుతున్నారు. అడగని వారిని మరిలేదు ఏ ఒక్కరు లచ్చన్నను టిక్కెట్టు ఏది అని అడగలేదు.

బహుశా అతని విప్లవ శారీరాకృతి, భీకర స్ఫూర్తి నిచ్చే అతని రూపం వెలిగొందుతూ తనముఖ వర్చస్సు – యౌవనంలో తళతళ లాడుతున్న యువక చైతన్యం – విప్లవ వీరుల్లో ఇతడొక విప్లవ మూర్తి అని తీవ్రవాది అని ఆ టిక్కెట్టు కలెక్టరు, అల్లంత దూరంనుండే లచ్చన్నను జూచి తప్పుకొన్నారా ? అయ్యో తన సర్వస్వం త్యాగం చేసి తన సుఖసంతోషాల్ని విసర్జించి, దేశం కోసం పాటు పడుతున్నాడే! అటు వంటి యువకునికి మనం ప్రతిబంధకంగా ఉండేకన్న, కనీసం ఈ విధంగానైనా మనం దేశానికి కృతజ్ఞులం కాగలమేమో అని వారు బహుశా భావించారేమో.

ఏది ఏమైనా లచ్చన్నగారు టాటానగర్ (జెంషెడ్‌పూర్) స్టేషన్‌లో బండి దిగారు. ప్లాట్‌ఫారం నుండి బయటకు నడుస్తుండగా వెనుకనుండి ఒకాయన వచ్చి వీపు చరుస్తూ పిలిచారు. తన పేరును తెలిసినవారెవరిచట అనుకుంటూ లచ్చన్న వెనుకకు తిరిగారు. కిల్లి రామారావుగారి తమ్ముడు కిల్లి జగన్నాథం. లచ్చన్న సహ విద్యార్థి. ఇచ్ఛాపురం హైస్కూల్‌లో సహపాఠి. కిల్లి రామారావు ప్రస్తుతం సిగ్నల్‌మేన్‌గా పనిచేస్తున్నారు.

ఇరువురు కుశల ప్రశ్నలు వేసికొన్నారు. లచ్చన్నను కిల్లి రామారావు తన ఇంటికి తీసికొని వెళ్లారు. చక్కని ఆతిథ్య మిచ్చారు. లచ్చన్నకు కావలసింది ఆతిథ్యం కాదు. తన పోరాటానికి ఆధారం, ఆశ్రయం, ఆవాసం.

మరునాడు లచ్చన్న చక్రధర్‌పూర్ బయలుదేరారు. తన వద్దనున్న చిరునామాల ప్రకారం వెళ్లారు. అయితే ఏ ఒక్కరూ దొరకలేదు. అండర్‌గ్రౌండ్‌లో

ఉన్నట్లు తెలిసింది. మిద్నపూర్ కేసు వలన అండర్‌గ్రౌండ్ అయ్యారని చెప్పారు.

అక్కడ కూడ ఏ ఒక్క తీవ్రవాది తనకు లభించలేదు. లచ్చన్నగారు కావలసిన పైకం తన ప్రయాణానికి స్నేహితుల నడిగితీసుకుని టాటానగర్‌కు తిరిగి వచ్చారు. "ఏమిటి లచ్చన్నా! టాటానగర్ అంతా తిరిగావా? నేను చక్రధర్‌పూర్ వెళ్ళి వచ్చావా, ఏమిటి విశేషం ?" అడిగారు కిల్లి రామారావు.

"విశేషాలు ఏమున్నవి. స్నేహితులను కలియాలని వచ్చాను. ఆ ప్రయత్నమే చేస్తున్నాను" అని లచ్చన్న చెప్పారు. లచ్చన్నకు ప్రయాణ బడలిక వలన జ్వరం వచ్చింది. మూడు రోజులింటి వద్దనే జ్వరంతో గడిపారు.

డాక్టరు వచ్చి పరీక్షించారు. "ఇతని జ్వరం సామాన్యమైనది గాదు టైఫాయిడ్" అని తేల్చారు.

రామారావుగారికి కాళ్ళూ చేతులు ఆడలేదు. ఎంతో సుక్షేమంగా ఉన్న లచ్చన్న తన ఎదుటనే యిలా అయిపోవడం వింత అనిపించింది. లచ్చన్న తీవ్రమైన టైఫాయిడ్ జ్వరంతో ఉన్నారు. వెంటనే హాస్పటలుకు తీసుకొని పరుగెత్తుకొని వెళ్ళి బారువా గ్రామంలో ఉన్న లచ్చన్న తల్లిదండ్రులకు తంతివార్తను పంపించానని నిద్రమైకంలోనున్న లచ్చన్నకు తెలిపారు.

బారువాలో నున్న లచ్చన్న అన్నయ్య సత్యనారాయణగారికి తంతి అందింది. అంతవరకు లచ్చన్న దేశం వెళ్ళాడని ఎచట నున్నదీ తెలియక ఆందోళన పడుతున్న చిట్టియ్య రాజమ్మలకు ఒక వైపు సంతోషం, వేరొక వైపు దుఃఖంతో నున్నారు, ఏమయి పోతాడు అన్న బెంగ బెదురు. వెంటనే సత్యనారాయణ టాటానగరంలో నున్న కిల్లి రామారావుగారికి తంతి యిచ్చారు. తను వస్తున్నట్లు, తను వచ్చేవరకు లచ్చన్నను ఇంటినుండి కదలనీయవద్దని. జ్వరంతో నున్న సోదరునకు తను వస్తున్నాడని తెలిస్తే ఇంటనుండి వెళ్తాడేమో నన్నది లచ్చన్న అన్నయ్యకు భయం.

తంతి ఇచ్చినట్లు లచ్చన్నకు తెలియదు. తన అన్నయ్య ఆనాడు టాటా నగర్ వచ్చి తనవద్దకు రావడం ఆశ్చర్యపడ్డారు.

"మేమే టెలిగ్రాం యిచ్చాం" రామారావు ఇదుల చెప్పారు. 2½ మాసాల నుండి సోదరులు ఒకరినొకరు చూసుకోలేదు. ఆప్యాయతతో పలకరించు కొన్నారు. "ఇప్పటికైన ఇంటికి పోదాం" పద, అని తమ్మునికి నచ్చచెప్పారు. అన్నదమ్ములు ఇరువురు బారువా చేరుకున్నారు. తనకోసం ఎదురు చూస్తున్న తల్లిదండ్రుల కోరిక నెరవేరింది. అతని కోరిక ఒక్కటే. తను విప్లవకారులతో కలసి దేశమాత సంకెళ్లను త్రెంచాలన్న పట్టుదల దృఢదీక్ష.

లచ్చన్నగారి జీవితపంథాలో ముఖ్యమైన మలుపు. తను భావించిన దేమిటి ? ఊహించిన దేమిటి ? విప్లవ మార్గం సరియైన మార్గం. విప్లవవాదిగా మారిపోవాలని తను పడిన శ్రమంతా వృథా. అని తానా పరిస్థితులల్లో భావించినా నిజానికది తన జీవితానికి అవరోధమైనదో అందలమెక్కించగలిగేదో ఆనాడు ఎవరికెరుక ?

మానవ జీవితంలో జరిగిన సంఘటనలు యాదృచ్ఛికమా, ఉద్దేశ పూర్వకమా, యాంత్రికమా ? మానవాతీతశక్తి, మానవ జీవిత చిత్రణలో మహత్తరమైన భాగ స్వామ్యాన్ని అందగలదేమో.

నైట్ స్కూళ్ళు స్థాపన :

గాంధీజీ హరిజన సమస్యపై ఉపవాసదీక్షలను జరిపి ప్రజల్లో చైతన్యాన్ని తెచ్చిపెడుతున్న సమయ మది. ప్రతిదినం బారువా దినపత్రిక వచ్చేది. గ్రామ చావడిపై చర్చావేదిక. బారువాలో పనిచేస్తున్న శ్రీ యం. వి.జి. సత్యన్నారాయణ అనే టీచరు తరచుగా ఆచర్చావేదిక వద్దకు వచ్చేవారు. స్వాతంత్ర్యం గూర్చి దేశంలో జరుగుతున్న సంఘటనలను గూర్చి చెబుతూ ఉండేవారు. యువకులకు ఉత్తేజాన్నిస్తూఉండేవారు. లచ్చన్న అతనిసహచరులకు హరిజనోద్యమాన్ని కొనసాగించటానికి కార్యక్రమాల్ని తీసికోవాలని ప్రబోధించేవారు.

లచ్చన్నగారు అనరికి, స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నందుకు జైలుశిక్ష అనుభవించి వచ్చిన వారు. జైలునుండి విడుదలైన తదుపరి, విప్లవకారునిగా మారి విప్లవ అరుణకిరణమై వెలగడానికి పథకం వేసుకొని విప్లవకారులను కలియటానికి బెంగాల్ రాష్ట్రం వరకు పర్యటించి నిరాశతో తిరిగి స్వగ్రామం చేరుకొని యున్నారు.

స్వగ్రామం చేరిన లచ్చన్న గారి దృష్టిని హరిజనసేవా సంఘాల నిర్మాణం, హరిజన రక్షణ యాత్రలు ఆకర్షించాయి. తీవ్రవాదియైన లచ్చన్నపై గాంధీజీ ప్రభావం ఆదినుండి ఉన్నది. స్వరాజ్యం త్వరగారావాలంటే విప్లవం ఒకదశలో అవసరంగా భావించారు. ఉప్పొంగిన ఉత్సాహం ఉద్రేకం, మెలికలు తిరిగిన కండలు, బలియమైనశరీరం, మిడిసిపడుతున్న వయస్సు అంతగాఅనుభవంలేని, అతనిని పరిపరివిధాలా ప్రతివిషయంపైన ఆలోచింప చేస్తాయి.

లాఠీలదెబ్బలుతిని, జైల్లోగడిపి, బారువాచేరుకొన్న లచ్చన్న పలుకుబడి బారువాలో ప్రక్కగ్రామాల్లోకొంత పెరిగింది. రాజమండ్రిజైలు నుండి వచ్చిన తదుపరి అతని దిన చర్య దేశసేవలో ఒక భాగమైంది. తనను గూర్చి ఆలోచన

గాక దేశంగూర్చి ఆలోచన తనదిప్పుడు. అల్లరిపనులు, చిలిపి పనులుచేసినకాలం వెళ్లింది. తనస్వార్థం తనదాగుగాక, సమాజం కోసం పాటుపడాలి.

ఎరవాడ జైల్లో బంధింపబడిన బాపూజీ "హరిజన సమస్యపై నిరాహారదీక్ష" అన్నవార్త దేశంలో సంచలనంరేపింది. దారువాలో తన సహచరులతో ముచ్చటించి తనూ ఒక కార్యక్రమం తీసికొని ఉధృతాంతంగా హరిజనోద్యమం కొనసాగటానికి తను దోహదపడాలి అన్నది లచ్చన్నగారి ఆలోచన. గాంధీజీ యిచ్చిన హరిజనోద్యమం పిలుపుపై లచ్చన్నగారే అనాడు దారువా గ్రామంలో ఏల ముందు పడాలి? జన్మజన్మాంతర సంస్కారం మానవుడ్ని ఉద్దీపన జేస్తుంది. ప్రారబ్ధ - సంచిత-ఆగామి అని అర్యోక్తి. కమలములకాంతి కమలము క్రిందనే ఉంటుంది తప్ప పనిగట్టలేదు. ఎచటనుంచో తుమ్మెదవచ్చి దాన్ని ఆస్వాదిస్తుంది. ప్రబోధాలు ఎందరో ఎందరికో ఇస్తుంటారు. అయితే ఏ కొందరో ఆ ప్రబోధాలకు ప్రేరితులై ముందంజ వేస్తారు.

యం. వి.జె. సత్యన్నారాయణ పంతులు గారు దారువాలో నిత్య హరిజన సేవాకార్యక్రమాల్ని నిర్వహించమని బోధించినదే తడవుగా లచ్చన్న అతని సహచరులు అందుకు పూనుకున్నారు. పుక్కెవారి సపసంను వారి కార్యాలయంగా ఎన్నుకొన్నారు.

ప్రతీదినం ప్రభాతభేరి జరిపించాలి.
మాలవీధిలో నైట్‌స్కూలు ప్రారంభించాలి.
మంచి నీళ్ళ బావులకు హరిజనులను అనుమతించాలి.
హరిజనులకు దేవాలయ ప్రవేశం కలిగించాలి.

ప్రభాతభేరి :

తను, తనసహచరులు, దుర్భలసాహు, పుక్కెళ్ళ లక్ష్మీనారాయణ - పాడి - వగైరాలు ఆ దినం ప్రభాతభేరి జరపటానికి సిద్ధమైనారు. లచ్చన్నకు చేతినిండ పని దొరికింది. లచ్చన్న ఆ సరికే సత్యాగ్రహిగా పేరుతెచ్చుకున్నారు. అతని దేశభక్తిని ఏ ఒక్కరు ఆ గ్రామంలో ప్రశ్నించలేదు. పూర్తిగా సహకరించారు. గాంధీజీ చిత్రపటం పట్టుకొని లచ్చన్నగారు ముందు నడుస్తుండగా, వెనుక ఒకరు హార్మోనియం, వేరొకరు ముందర, మరొకరు చిరతలు, మిగతావాళ్ళ ముందు ఒకరు పాడుతుండగా, ఆచరణాలనే అనుసరిస్తూ పాడటము, నడుముకుంటూ వీధులన్ని తిరిగి ఊరిచివరగల జగన్నాథ స్వామి, జనార్ధనస్వామి, కోటిలింగేశ్వర దేవాలయానికి చేరడం, దేవాలయానికి లచ్చన్న తదితర సహచరులు వెళ్ళి ప్రసాదం తెచ్చిఅందరికీ పంచి యివ్వడం.

యువకులెల్లరు ప్రతీదినం దారువా వీధుల్లోపడి గాంధీజీ భజనపాటల్ని పాడుతూ కదలి వెళుతుంటే గ్రామం అంతా దద్దరిల్లేది. సవర్ణులలో ఆశ్చర్యం -

హరిజనులలో 'ఆశ' జనించేది. ఆ గీతాల్లో సాంఘిక దురాచారాల్ని ఖండించడం గాంధీజీ అంబేద్కరువంటి ప్రముఖుల గొప్పదనాల్ని విప్పిచెప్పడం ప్రజల్ని ప్రబోధించడం, ప్రభాత భేరి సాగింది.

మాలడై గాంధీజీ మాతోడ ఉన్నాడు
వర్ణాలు వద్దన్ని నెహ్రూజీ అన్నాడు
హరిజనుడు తమ్ముడని అందరూ అన్నారు
అందరితో సరి మేము అంబేద్కరన్నాడు

హరిజనమైతే మాకేమి
మాశక్తి సంపదలులోపేమి

కళ్లువిప్పిన వాలు కనకాభిషేకాలు
పెదవి విప్పినవాలు మణులు మాణిక్యాలు
కదలిమెదలినవాలు కాంతిరేఖలుజిమ్ము
హీనులకు దీనులకు దిక్కను తా గాంధీ
మకుటములేనట్టి మా రాజు మాగాంధీ "హరి"

కులముపెద్దది అన్న కూడదని చెప్పాడు
మతము కన్న స్థిరము మానవతే అన్నాడు
వర్గ సంఘర్షణ వలదు వలదన్నాడు
వర్ణాలు జాత్యి వట్టిదే అన్నాడు "హరి"

వేదాలలో లేనిభేదాలు మనకేల
పుక్కిటపురాణాల విప్పకుర చెప్పకుర
మానవతనే పెంచు గాథలనే చూడర
అన్నివర్ణాల వారందులో నున్నారు "హరి"

ఎంత ఘోషించినా వినిపించుకోలేని మూర్ఖసమాజమిది. మూర్ఖమిరాచార సాంప్రదాయాల్లో మునిగితేలుతున్న సమాజం తట్టలేపిన గుములు దిన్నున్నసంఘం. ఎదురుతిరిగి దౌర్జన్యం నెరపగలసమాజం.

స్వాతంత్ర్యం కోసం, లాఠీదెబ్బలుతిని జైల్లోకి వెళ్లివచ్చినపుడు తనకు ప్రతిఘటనరాలేదు. అయితే హరిజనోద్యమం అనగానే లచ్చన్నతో కొందరు సహకరించక జారుకోవడం ప్రారంభించారు. జైల్లోవాపులు ఇవట ప్రక్కవాడితో పోరాటం కాలాతీతంగా లచ్చన్న మాట్లాడితే ఎదురు మనిషి అధోగతిని అన్వేషిస్తు మాట్లాడతారు. ఏ విషయంలో నైనా ఎదిరించి ఎటువంటి దుష్కర కార్యమైన చేయవచ్చునేమోకాని సంఘాన్ని ఎదిరించడం సులువైనపనికాదు. దైవం అందరిలో ఉన్నాడని చెప్పినందుకు ప్రజాస్వామ్యం మంచిదికాదు

అన్నందుకు సోక్రటీస్, మానవులంతా సరిసమానులన్నందుకు ఏసుక్రీస్తు, సూర్యచంద్రులు గోళాలని భావించినందుకు కోపర్నికస్ ఏమైనాడు ?

"అచ్చన్నబాబూ ఏదో తెల్లవారలు మననేలుతుండడం పోవాలి మనకు స్వరాజ్యం వస్తుందన్నారు. మీరు జైలుకువెళ్ళి వచ్చారు. మేము సంతోషించాం కాని ఈనాడు యీ కానిపని ఏమిటి ? పంచములు మనము సమానులమా అని ప్రశ్నించినవా రున్నారు.

హరిజనులు మనం సమానులమని చెప్పుతున్నది గాంధీ మహాత్ముడు. అతనిని కాదన్న మగాళ్ళమా మనం.

గాంధీజీ స్వరాజ్యం తెస్తారనివిన్నాం. మధ్యలో ఇదేమిటి ? అశ్వర్థా ర్థకం – అమాయకత్వం మనలో కుమ్ములాట ఉంటే మనజాతిలో ఐకమత్యం లేకపోతే మనకుస్వరాజ్యం ఎందుకు ? మనలోమనం కొట్టుకొని చావటానికా ? అందుకే గాంధీజీ నిర్మాణకార్యక్రమాల్ని ప్రకటించారు. దానిని మనమంతా, పాటించితీరాలి. అందులో నున్నదె నేడు మేము అనుసరిస్తున్నాము. అస్పృశ్య తను పాటించవద్దు అన్నారు. మద్యపాన నిషేధం కావాలన్నారు. ఖద్దరు ధరించ మన్నారు. గ్రామాలను పునరుద్ధరింప మన్నారు. వయోజనులకు విద్యను బోధించమన్నారు.

"అలాగా బాబూ సరేలెండి. సవటులలోనే ఒకరుతక్కువ ఒకరుఎక్కువ అని పడి వస్తున్నాం. ఇక హరిజనులు మనతో సరిసమానులంటే మేమేంచెపుతాం" అంటూ అచ్చన్ననుండి జారుకొనేవారు.

అచ్చన్న సహచరులుకూడా తటపటాయించేవారు. ఈ హరిజనులను చూస్తేనే ఆ అగ్రవరాలవారు "దూరంగా పోరా మైలపడిపోతాముర్రా, మాల వెధవా" అని నానాదుర్భాషలాడే వీరిని మనమెలా ఆదుకోగలం.

అచ్చన్న అందుకు తనసహచరులతో తను హరిజనసేవా కార్యక్రమంలో రెండవ భాగాన్ని అములులోనికితేవడం దీనికి మందు అనిచెప్పాడు. హరిజనవాడలో వెంటనే ఒకనైట్ స్కూలుని ఏర్పరచి మొదట వారిలో ఆత్మవిశ్వాసాన్ని తెలివి తేటల్ని తెచ్చిపెట్టాలి.

ఏమిటి అచ్చన్నబాబు అన్నిటికి ముందుకురకారు. అంతా సమకులం ఎలా అయిపోతాం. దేనికయినా పెట్టిపుట్టాలి. గీత ఉండాలి. సృష్టిలోనే సమానత్వం లేదు. మనుషుల్లో ఎలావస్తుంది.

ఈప్రశ్నలను విని అచ్చన్న ఉద్రేకానికి లోనయ్యేవారు. ఉక్రోషం పట్టలేక పోయారు. అయినా తనుసత్యాగ్రహి గాంధేయవాది. అహింసావాది. తన జీవన

---

విధానం – ఈనాడు గతంలో కన్నా పూర్తిగా మారిపోయింది. అస్పృశ్య కాలము నాటి రాజకీయ సాంఘిక ఆర్థికపరిస్థితులుకూడా అటువంటివే. ఆంగ్లేయుల పాలనలో భారతీయుల సంస్కృతి, చరిత్ర దిగజారిపోతున్నదని కొందరు వాపోతుంటే మరికొందరు బ్రిటిషుపాలన భారత్‌లో ప్రారంభించిన తరువాతే భారతీయ సమాజంలో గల అంధ విశ్వాసాలు, దురాచార సాంప్రదాయాలు సన్నగిల్లి విజ్ఞాన వికాసాలు నలుదిశల ప్రకాశిస్తున్నవని చెప్పేవారు.

మామతంలో కులభేదం వర్గ భేదంలేదు వచ్చి చేరండి అని భారతీయులను ముఖ్యముగా హరిజనులను క్రైస్తవ మతం పిలుపునిస్తున్న దినాలు. అనాటివరకు హిందువులచే నిరాకరింపబడిన మాల, మాదిగ, పైడి, రెల్లి పేర్లుగల వంశములు క్రైస్తవమతంలోనికి ప్రవేశిస్తున్నారు. క్రైస్తవమతం చర్చిలను ప్రారంభించింది వైద్యాలయాల్ని స్థాపించింది. పాఠశాలలను తెరచింది. శరీరారోగ్యానికి ఒకటి మానసిక వికాసానికి వేరొకటి, ఈరెండింటిని సమకూర్చిన క్రైస్తవమతం భారతదేశంలో మంచి పట్టును సంపాదించుకోగలిగింది.

ఆంగ్లవిద్య, ఇంగ్లీషు బడులు తెరవడంలో శాస్త్రీయవిజ్ఞానం వికసించింది. అంధవిశ్వాసాల నడ్డి విరిగింది. రాజారాంమోహనరాయ్, దయానంద సరస్వతి - వీరేశలింగం పంతులు, గురజాడ, సాంఘిక దురాచారాలపై దండెత్తారు. అస్పృశ్యులు విద్యార్జనకర్హులై ఉద్యోగాల్ని సంపాదించుకోగలిగారు. సవర్ణులకు కన్నుకుట్టింది. భవిష్యత్‌లో 'మాలవాడే రాజ్యమేలునన్నా' అని బ్రహ్మంగారుకూడా ఆశ్చర్యార్థకంగా ప్రతిపాదించారు. భారత జాతీయకాంగ్రెసు 18 సూత్రాల నిర్మాణాత్మక కార్యక్రమాన్ని ప్రకటించింది. ప్రతి కాంగ్రెసువాదీ, కార్యకర్త, తప్పక ఆ కార్యక్రమాన్ని పాటించాలి. సిక్కులు, మహమ్మదీయుల్లా హరిజనులు వేరేజాతి వారు కాదని గాంధీజీ తీర్మానించారు. ప్రత్యేకజాతి హరిజనస్థాపన కావాలన్న అంబేద్కర్ ప్రతిపాదనలను త్రిప్పికొట్టి హరిజన కార్యక్రమం ప్రారంభించారు. భారతజాతికి వారొక భాగమే అని నిర్ధారణ పరచారు.

అచ్చన్న దుర్వలసాహు, పుక్కల లక్ష్మీనారాయణపాండా తదితర మిత్రులను వెంటనిడుకొని హరిజనవాడ చేరారు. హరిజనులు ముట్టూమూ గారు. ఏమిటీ వింత అని?

మేమంతా కాంగ్రెస్ కార్యకర్తలం. గాంధీజీ ఏమి చేయమని ఆదేశించినా అది చేయడమే మా కర్తవ్యం. మీరు అస్పృశ్యులుకారు. మిమ్మల్ని మాల, మాదిగ, రెల్లి, జగ్గిలవాళ్లు అని పిలుస్తుంటే అంగీకరించం. మీరంతా "హరిజనులు" అని గాంధీజీ చెప్పారు.

అయితే మేమంతా మీ సవర్ణులతో సమానమైపోతాము, అన్న ప్రశ్న వచ్చింది.

సమానులని గాంధీజీ, తిలక్, నెహ్రూ, పటేలు, మహానుభావులంతా చెప్తున్నారా – వారికన్నా గొప్పోళ్ళమా మనం. తప్పయితే వారెందుకు చెప్తారు. అంటూ లచ్చన్న వారికి బోధపరిచారు. మీకున్నది అజ్ఞానం, అమాయకత్వం, దావస్తం – ఈ దేశపు గ్రహచారం, దౌర్భాగ్యం, అపచారం నేను మొన్నటివరకూ అలానే భావించాను. పెద్దలు చెప్పగా విని నిజం తెలిసికొన్నాను. మీకు తెలియజెప్పాలనివచ్చాం. మీవాడలో రాత్రిపాఠశాల పెడుతున్నాం. మీరంతా హాజరై మేముచెప్పిన విషయాలను మీరు నేర్చుకోవాలి. లచ్చన్న వారికి నచ్చజెప్పాలని చూస్తున్నారు.

"మేము అస్పృశ్యులం. మాకు చదువులా" వారి మాటల్లో నిరాశా నిస్పృహలు.

"అదే వద్దన్నాను. అలా అనడం నేను సాంఘికదురాచారం. ఘోరం, పరమ ఘాతుకం. స్వార్థపరులు సృష్టించిన దానవపాతకం. అగ్రవర్ణాలు వెద జల్లిన అపురూప సృష్టి".

"లచ్చన్నబాబూ మీరేదో చెబుతారు. అవి మా బుర్రలకు ఎక్కవు. మీతో మాకెందుకు తగాదా. మేం ఏంచేయాలో చెప్పండి".

"ప్రతిదినం రాత్రిపూట నైట్‌స్కూలుకు మీరంతా హాజరుకావాలి."

"మే మందుకే ఈ దినం వచ్చాం" పాకలలో ఆ దినం పాఠశాల ప్రారంభమైంది. విద్యుద్దీపాలు ఆనాడులేవు. దీపంబుడ్లు, లాంతర్లు తప్ప. గర్భదరిద్రులు అస్పృశ్యులు రాత్రి పాఠశాల పయోజన విద్యార్థులు. గాంధీజీ పిలుపు ఎంతటి శక్తివంతమైందో మారుమూల పల్లెల్లో కూడ పాంచజన్యమై వ్యాపించింది.

బారువా గ్రామంలో సంచలనం రేగింది. మాలవీధిలో నైట్‌స్కూలు! ఆవీధికి సవర్ణులు వెళ్లడమే ఒక వింత, నేరము. మైలపడిపోతాము అని భావిస్తున్నకాలంలో ఆ మాలవీధిలో వారిమధ్యకూర్చుని వారితో కలిసిమెలసి, విద్యను బోధించడం, రాజకీయపాఠాల్ని నేర్పడం, గాంధీజీని గూర్చి స్వాతంత్ర్యం గూర్చి చెప్పడం – నైట్‌స్కూలు ప్రతిదినం ప్రారంభం కావటానికి ముందు – హరిజనులను హెచ్చుగా ప్రోగుచేయడానికి, వారి ఉల్లాసానికి, ఉత్సాహం తెప్పించటానికి, పాటల్ని కార్యకర్తలు పాడేవారు. పాఠశాలలో చదువుతున్న హరిజనబాలురు, బాలికలు కూడ నైట్‌స్కూలుకు హాజరయ్యేవారు.

ఆ దినం స్కూలు ప్రారంభం కానున్న దనగా, లచ్చన్న తన ఎదురుగా నిలచి ఉన్న ఒక హరిజన బాలుడ్ని చూసారు. ఎలిమెంటరీస్కూలు విద్యను నేర్చుకొంటున్న వయస్సు ఆ పిల్లవాడిది. చొక్కా, నిక్కరువేసి ఎంతోముద్దొస్తున్న ఆ

పిల్లవాడ్ని లచ్చన్న దగ్గరగా పిలిచారు. ఆ అబ్బాయి ఎంతో ఉత్సాహంతో లచ్చన్నవద్దకు వచ్చాడు. "చూడు అబ్బాయి, ఈ దినం నీవే పాటపాడాలి పాడ గలవా? మీవాళ్లంతా మెచ్చుకొనేలా పాడాలి" లచ్చన్న గారు అడిగారు.

ఓ పాట పాడగలను....అంటున్న పిల్లవాడిని ప్రేమతో భుజంతట్టి లచ్చన్న పాటపాడమన్నారు. ఆ బాలుడు "కొల్లాయి గట్టితేనేమి మా గాంధి...." అన్న పాటను చక్కగా పాడాడు.

తదుపరి మరికొందరు కార్యకర్తలు యీపాటను పాడారు.

మానవతె చెడుగని మడి కట్టుకున్నారు
మంచివెడులనె మీరు మరచిపోమన్నారు "మాల"
మాలమాలంటారు, మము ముట్ట నంటారు
మా కన్న మీలోన ఉన్నదేమిటి సున్న. "మాల"
మాలలు మమ్మలి మైలబడతా మంటారు
ఎదురొస్తే మమ్మల్ని తొలగిపో మంటారు
మీలోన మాకన్న మెరసె గుణమేమిటి
సాటిమనిషిని మీరు కాటియ లొంటిత్తె. "మాల"
సంపదను సృష్టించె 'శక్తి' మాలో ఉంది
మిము మించి పోయేటి యుక్తి మాకను ఉంది
భూసంపదంతయు మాచేతిలో ఉంది
బిగతొక్కి బుక్కితే మేమేమి జేసేది. "మాల"
మీకుమల్లె మాకు ఊరు పేరున్నాయి
రూపులో గుణములో (మనలోన) భేదమేమున్నది
మరుటము లేనట్టి మారాజు మాగాంధీ
మముబ్రోవ వెలశాడు మారక్ష మాగాంధీ "మాల"

పాటలను ముగించిన తదుపరి మొదటిపాట పాడిన పిల్లవాడ్ని దగ్గరగా తీసికొని లచ్చన్న "ఏంచదువుతున్నావు అబ్బాయి!" అని ఆప్యాయతగా ప్రశ్నించారు. 5 వ తరగతి అని అబ్బాయి సమాధానం చెప్పాడు. నీవు బాగా చదవాలి. ప్రతి దినంవచ్చి మా నైట్‌స్కూల్లో పాటలు ఇలానే పాడాలి. నీవు మేము చెప్పిన పాఠాల్ని నేర్చుకోవాలి.

"ఓ అలానే" అబ్బాయి అన్నాడు. ఆ అబ్బాయి ఎవరోకాదు ఈనాటి పదవీ విరమణచేసిన హైకోర్టు జడ్జి కె. పున్నయ్యగారు. పట్టుబట్టి లచ్చన్న హరిజన పిల్లల్ని స్కూల్లో జాయిన్ అయేటట్లు చూసారు. చదువుకొని యిలా పెరిగి పెద్ద యినవారిలో కె. పున్నయ్య గారొకరు.

కె. పున్నయ్యగారు, బారువాలో చదువు ముగిసిన తదుపరి ఇచ్ఛాపురంలో 1941 లో స్కూలుఫైనల్ చదివారు. లచ్చన్న ఎంతగానో అంతగా నిలచారు

ఇచ్ఛాపురంలో చదువు ముగిసిన తదుపరి విజయనగరం మహారాజావారి కళాశాల రాజావారి హాస్టల్లో ఉంటూ ఇంటర్‌విద్య సర్యసిస్తుండగా, క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంగా గాంధీజీ పిలుపుపై తన సహవిద్యార్థి త్రిపురాన రామత దాసుగారితో కలసి 1942 లో అరెస్టయినారు. జైలునుండి తిరిగివచ్చాక బి. ఏ., బి. యల్. పూర్తి చేసారు. 1946 లో కాంగ్రెసు సేవాదళ్ శిక్షణా శిబిరంలో శిక్షణకూడ పొందారు. సుశిక్షితుడైన కాంగ్రెస్ వాదిగా రూపొందారు. తనన్యాయశాస్త్ర విద్య ముగిసిన తదుపరి శ్రీకాకుళం పట్నంలో ప్లీడరుగా ప్రాక్టీసు పెట్టారు. ఉన్నత విద్య పూర్తిఅయిన తదుపరి కె. పున్నయ్యగారు తన చిన్ననాటి జీవితంనుండి లచ్చన్నగారితో అత్యంత సన్నిహిత తత్వాన్ని పెంచుకొని, చివరివరకు కొన సాగించారు. రాజకీయరంగంలో ప్రవేశించి లచ్చన్నగారి ముఖ్య సహచరునిగా రూపొందారు.

కె. పున్నయ్యగారు విద్యావేత్త, సహృదయుడు, సౌజన్యమూర్తి, చదువరి, సంస్కారి, రాజకీయవేత్త. దళితజనుల నుద్ధరించి, అదుకోవాలన్న సాంఘిక సంస్కరణాభిలాషి. తనవారు అందరితో సరిసమానమైన అవకాశాల్ని అందాలని, అందుకు కృషిచేయమని, విద్యను, విజ్ఞానాన్ని అర్జించమని ప్రతి ఒక్కరికి ప్రబోధించేవారు.

అతని రూపంలో ఎంతో సౌమ్యత ఉట్టిపడుతూ ఉంటుంది. అయినా కె. పున్నయ్యగారు అంతర్గతంగా ఉద్రేకి. అయితే రాగద్వేషాల్ని తనలోనిమిడ్చుకొన గల స్థితప్రజ్ఞుడు. రాజయోగిలా ప్రశాంతంగా కన్పిస్తారు. దేశంలోనే ముఖ్య కార్యక్రమాన్ని నెరవేర్చుకొనగల దిట్ట, మేధావి. వ్యూహం-ఎత్తుగడలను రూపొం దించుటలో అద్వితీయుడు.

లచ్చన్నగారు కాంగ్రెసుపార్టీనుండి విడిపడి కృషికారలోక్ పార్టీలో చేరి నపుడు కె. పున్నయ్యగారు లచ్చన్నతో పాటే కె.యల్.పి.లో చేరారు అపార్టీ అభ్యుదయానికి ఎంతగానో కృషిచలిపారు.

తదుపరి ఆనాటి కృషికారలోక్ పార్టీ పొందూరు (శ్రీకాకుళం రిజర్వుడు నియోజకవర్గం శాసనసభ్యులు కావలి నారాయణరావుగారి కుమార్తెనువివాహం చేసుకున్నారు.

మరల 1955 మధ్యంతర ఎన్నికలు జరిగినపుడు పొందూరు నియోజక వర్గం నుండి పోటీచేసి కె.యల్.పి. పార్టీ శాసనసభ్యునిగా గెలుపొందారు. తదు పరి ఆంధ్ర రాజకీయ రంగంలో కొన్ని మార్పులు చేర్పులు జరిగాయి. క్రమేణ రంగా లచ్చన్న వర్గం నుండి నీలం సంజీవరెడ్డివర్గం వైపు మొగ్గుచూపుతూ వచ్చారు. 1957 లో కాంగ్రెసు పార్టీలోనికి మారిన కె. పున్నయ్యగారు రాజ కీయ జీవితమును విడచి ప్రభుత్వ సేవారంగమున ప్రవేశించ సిద్ధపడి ఇదే మంచి దేమోనన్న అభిప్రాయానికి వచ్చారు.

1957 లో తనను సబ్‌జడ్జిగా ఎంపిక చేసినట్లు టెలిగ్రామ్ అందింది. అదే సమయమున విజయనగరం జిల్లా పార్వతీపురం నుండి కూడ ప్రసిద్ధ క్రిమినల్ లాయర్ నిడగంటి ప్రకాశరావు మేనల్లుడు మధుసూధనరావుగారిని కూడ సబ్‌జడ్జిగా నియమించారు.

1962 లో అనంతపూర్ సబ్‌జడ్జిగా కీర్తిప్రతిష్ఠల నార్జించిన కె. పున్నయ్య గారిని గుంటూరులో జిల్లాకోర్టు జడ్జిగా నియమించారు. తదుపరి 1957 లో ఆంధ్రప్రదేశ్ హైకోర్టు జడ్జిగా నియమింపబడి, ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో తన దంటూ ఒక ప్రత్యేకతను విశిష్టతను నెలకొల్పుకొని చరిమిరా 1985 లో పదవీ విరమణ చేసి ప్రస్తుతం ఆంధ్రుల భాగ్యనగరంలో విశ్రాంతి జీవితాన్ని గడపు తున్నారు. ప్రస్తుత మనరాష్ట్ర మాజీ సాంఘిక శాఖామాత్యులు శ్రీమతి ప్రతిభా భారతి తండ్రిగారే జస్టిస్ కె. పున్నయ్యగారు.

# 22. స్థానిక హరిజనోద్యమం - లచ్చన్న

భారతజాతీయ స్వాతంత్ర్యసమరం ఒకవైపు హరిజనోద్యమం మరొకవైపు దేశంలో కొనసాగుతున్న దినాలు. గాంధీజీ దేశపర్యటన ప్రారంభించారు. దేశంనలు మూలల గాంధీజీ పిలుపు మేరకు హరిజనులు భారతీయులే. అస్పృశ్యత అసలు నేరం. మానవతకే అపచారం అన్న ప్రచారాలు ఉధృతంగా జరుగుతున్నాయి.

హరిజన సేవా దీక్షకు లచ్చన్నతో పాటు, దుర్గి సాహు, హరిజననాయకులు సాకేటి గురువులు, కుట్టిల లక్ష్మీనారాయణ సోదరులు, సహాధ్యాయులు పాపారావు, పార్వతీశం, కార్యరంగంలోకి దూకారు.

1932 లోనే హరిజన రక్షణయాత్ర అంటూ బారువానుండి ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి వరకు నడిపించారు. ప్రజాసమూహాల్ని కదిలించారు. రాష్ట్ర స్థాయిలో కూడా వేముల కూర్మయ్య అధ్యక్షతన హరిజన సేవాసంఘం స్థాపింపబడింది.

హరిపురంలో సోంపేట తాలూకా హరిజనసేవాసంఘ స్థాపన కొరకు సన్నాహాలు ప్రారంభించారు. సాకేటి గురువులు జిల్లా ఆది ఆంధ్ర సంఘానికి అధ్యక్షులు. హరిపురంలో జరిగే సమావేశానికి, ప్రసిద్ధ వేదపండితులు, బంకుపల్లి మల్లయ్య శాస్త్రిగారిని, ప్రారంభోపన్యాసకులుగా పిలచారు. ముస్లిం క్రైస్తవసోదరం ఉపన్యాసకులు ఆ సమావేశానికి హాజరుకాగలరని కరపత్రం ప్రకటించారు.

గ్రామప్రజానీకానికి హరిజనులు అస్పృశ్యులు కారని నమ్మించటానికి లచ్చన్న అతని సహచరులు ఎనలేని ప్రయత్నాలు చేసారు. అగ్రవర్ణాలలో పుట్టి పెరిగిన వ్యక్తివచ్చి ఈ అణగారిన కులా ఆర్థికంగా వెనుకబడినవి తప్పించి జన్మతః కాదని చెప్పిన నమ్మగలరని, గాంధేయవాది, అగ్రవర్ణానికి చెందినవారు, ప్రసిద్ధివడసిన పండితులు అయిన శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారిని, హరిపురం హరిజన సమావేశానికి ప్రారంభోపన్యాసకులుగా తెప్పించారు.

ఆనాటి సమాజం కరడుకట్టిన మూర్ఖసమాజం; పరస్పర అవగాహన కొరవడిన సంఘం—కోరిక తీరికలేని వ్యవస్థ: గుడ్డినమ్మకం: గుణంలో, మూఢ నమ్మకాలలో మూల్గుతున్న జనం. వీరి సాటికులస్థులు సరిసమానస్థులు ఏమి చెప్పినా విశ్వసించరు. వారికన్న గొప్పవారు చెబితే కనీసం వింటారు, ఆలోచిస్తారు వారిలో మార్పువస్తుంది, నిజంతెలుస్తుంది.

విద్యను పొందడం విద్యావంతులుగా నుండటం అనాడు అగ్రవర్ణాలవారికి, బ్రాహ్మణులకే హక్కు ఉండేది. ఇతరులు వారికి విద్యతో అవసరంలేదన్న

భావంతో ఉండేవారు. కావాలని ఎవరైన అభిలషించిన తిరస్కారం తిప్పలు దాపురించేవి.

హరిపురంలో నాటి సమావేశం ప్రారంభమైంది. పుల్లెల శ్యామసుందరం అధ్యక్షులుగా ప్రసంగించారు. ప్రసిద్ధి పడసిన పండితులు గాంధీజీ పిలుపుపై కాశీలో హిందూమత ధర్మాన్ని నిర్ణయించడానికి వెళ్లిన వేదపండితులు, వేదాల్ని క్షుణ్ణంగా తెలిసినవారు, గాంధేయవాది, బ్రాహ్మణుడు అయిన శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారు వేదికపై "హరిజనులు అస్పృశ్యులు కారు, వీరూ మన హిందువులే. మనతో సరిసమానులు" అని ఆనాడు చెప్పడం శాస్త్రిగారి అభ్యుదయదృక్పథానికి తార్కాణం. శాస్త్రిగారిపై అమిత ప్రేమాభిమానాలున్న ప్రజానీకానికి ఎంతగానో అతని బోధనలు రుచించాయి. బహిరంగ సభలో అన్ని కులాలు ఒక్కటే అస్పృశ్యత కల్పించినదే అని శాస్త్రిగారు ఉద్ఘాటిస్తూ శాస్త్రరీత్యా శ్లోకాలు చదివి నిరూపిస్తుంటే ఒక్కరు నోరుమెదపలేకపోయారు. ఆనాటి ఛాందస బ్రాహ్మణ సమాజం ఖండించలేకపోయింది. బ్రాహ్మణకులంలో పుట్టిన అగ్రవరాలవారి మనిషిగా పేరొందిన శాస్త్రిగారు ఆనాడు ఇచ్చిన ఉపన్యాసం కటిక అజ్ఞానాంధకారంలో వెలిగిన విజ్ఞానపు కాంతిరేఖ. పంచమజాతి కులజాతి అని మధ్యలో స్వార్థపరులిచ్చిన బిరుదులు. మానవతిలో లేనిది మధ్యలోనే వచ్చినదని, మేధావి శాస్త్రిగారు వివరించారు. అసామాన్య పండితులు వేదాలపై పట్టువున్న శాస్త్రిగారు. చెప్పిన ఇక నమ్మనిదెవరు?

హరిపురంలో సభ ముగిసిన తదుపరి శాస్త్రిగారిని ఆరాత్రికి దారువా గ్రామం తీసుకొని వచ్చారు. దారువా బంగాళాలో విడిదిచ్చారు. తండోపతండాలుగా వచ్చినవారినెల్లరి, సందేహాల్ని నివారించారు లచ్చన్న అతని [illegible]లు. శాస్త్రిగారివద్ద అవసరమైన విషయాలన్ని సేకరించి ఆ మరునాడు శాస్త్రిగారిని, [illegible] పంపించారు.

[illegible] మహాత్మాగాంధీ, హరిజనవాడల్లో ప్రవేశించి, అక్కడనే రాత్రి వేళల బసచేస్తున్నట్లు వారితో కలిసి మెలసి ఉంటున్నట్లు ప్రతిదినం పత్రికల్లో వార్తలు వచ్చేవి.

గాంధీజీ హరిజనులకు దేవాలయ ప్రవేశాన్ని కల్పిస్తున్నట్లు వార్తలందేవి. ఆనాడు [illegible] దినపత్రికలు అందుబాటులో లేకున్నా అందుబాటులో ఉన్నవారే ప్రతి ఒకరికి వార్తలను పిలచి పిలచిమరీ చెప్పేవారు. వారి కానాడున్న దేశభక్తి అటువంటిది.

1932 లోనే గాంధీజీ హరిజన యాత్రను ప్రారంభించి రాజకీయాల్లో దీనిని ముడివెయ్యక పోయినా అది రాజకీయాల్లో ఒకభాగమై కూర్చుంది. హరిజన సమస్య అఖిల భారత సమస్య అయింది. కార్యకర్తలు, నాయకులు, విద్యావంతులు

గాంధీజీ పిలుపుపై ఉద్యమించారు. దేశంలో సంచలనం లేచింది "అస్పృశ్యతను పాటించడం మహానేరం. మానవతకు మచ్చ" అని గాంధీజీ ఉద్ఘాటించారు హిందూమతంలో ఇది కూడనిది లేనిది, అని భారతీయులను ఒప్పించారు.

గాంధీజీ ఉప్పు సత్యాగ్రహం ప్రారంభించిన మొదటదినాల్లో బ్రిటిషు వారందుకు భయపడతారా అని ప్రశ్నించారు కొందరు. ఈ హరిజనోద్యమం కూడ అంతే అని భావించినవారు పివరకు తెలుసుకున్నారు. ఇదొక మహోద్యమం ఏ ఒకరు దీనికి ఎదురు తిరిగినా ఎదురు పడినా కాదనిన ఏఒకనినైనా తుద ముట్టించగలనైతిక బలాన్నిది తెచ్చిపెట్టింది. రౌండు టేబుల్ సమావేశాల్లో పాల్గొన్న దళిత జాతుల వైతాళికుడుగా, అంబేద్కర్ నిమ్నజాతులకు పరి పాలనలో భాగస్వామ్యం కోరారు. నిమ్నజాతులకు ప్రత్యేక నియోజక వర్గాలుం డాలని వాదించారు. గాంధీజీతో కొన్ని విషయాల్లో అంబేద్కర్ విభేదించారు. అయినప్పటికి 1932 ఆగష్టు 14న బ్రిటిష ప్రధాని కమ్యూనల్ అవార్డు ప్రక టించారు. నిమ్నజాతులకు ప్రత్యేక నియోజకవరాలు ఏర్పాటు అవకాశం లభిం చింది. అంబేద్కర్ గాంధీజీ మధ్య ఒక ఒడంబడిక కుదిరింది. అదే పూనా ఒడం బడిక. శాసన సభలలో నిమ్నజాతులకు ప్రత్యేక స్థానాలు కేటాయించడం అగ్ర వరాలు నిమ్న జాతులను అస్పృశ్యతా దృష్టితో చూడరాదు. నిమ్నజాతుల నుద్ధరించటానికి ప్రత్యేకమైన రక్షణలు తీసుకోవాలి.

హరిజనసమస్య — పెద్దలపై తిరుగుబాటు :

ఆనాడు రాత్రి నైట్‌స్కూల్లో లచ్చన్న హరిజనులకు పాఠాల్ని బోధిస్తు న్నారు. అనుచరులు సహచరులు చెరి ఒకరు హరిజనులతో సమంగాకూచ్చుని వింటున్నారు.

"బాబూ లచ్చన్నగారూ ! మాకెందుకండి పాకల్లోపాఠాలు. అచ్చరాల్ని నేర్చుకొంటే ఆకలి తీరుతుందా ? కాస్త బువ్వపెట్టే పనేదైన ఉంటే చెప్పండి." ఒకసారి హరిజన యువకుడు యిలా ప్రశ్నించేసరికి ఆ హరిజనులలోనే మరొకరు లేచారు.

"ఒరే ఏమిటి నీవాలకం. బువ్వ కాదురా, మనకు గౌరవం కావాలి. ఏదో కూలినాలిజేసి బతకలేక కాదురా, గంగమ్మతల్లి ఎలానూ ఉంది. ఆ సముద్రం ఒడ్డుకి పోతే ఏదో దొరక్క పోదురా ? గౌరవంఏది ?

ఓసబ్బో నీ ఆశ అంతంగాదు. నీవేమిటి ? ఆ బాబుగారేమిటి ? ఆళ్ళతో మనం సమానులమై పోతామా ! ఆదేవుని గుడిలోనికి మనల్ని రానివ్వరు. కమనకాదేవుడు ఇచ్చేదేమిటి ?" మరియొక హరిజనుని అభిప్రాయం.

"దేవుడు ఇవ్వనిదే మనకు బట్టా పాతా, కొంపా గూడూ కలుగుతాయా! ఒరే రామిగా నీవైనా చెప్పరా మనోడికి" మరియొకని సమ్మకం.

"మీలో మీరు మాట్లాడక చెప్పేదేదో నాతో చెప్పండి. దేవుని గుడికి వెళ్లితే మీకు అన్నీ ఆ దేవుడే ఇస్తాడు అని మీరునమ్మితే అలానే వెళ్దాం పదండి. గాంధీజీ హరిజనులను దేవాలయ ప్రవేశం జరిపిస్తున్నారుకదా! మన మంతా రేపు మన ఊరులో కోటిలింగేశ్వర దేవాలయానికి, జనార్దన దేవాలయానికి వెళ్దాము" అన్నాడన్నగారన్నారు.

అదేమిటి బాబు! మేము ఆ దేవాలయములవైపు వెళ్తే ఇంకేమైనా ఉందా? నవర్ణులు కర్రలు పట్టుకొని పరుగెత్తుకొనిరారూ! జరిగేపని చెప్పండి బాబూ జర గని పని చెప్పడం దేనికి."

హరిజను లెంతటి దీనావస్థలో ఉన్నదీ లచ్చన్నకు తెలిసింది. ఆ మానసిక స్థైర్యమే వారిలో లేదు. అసర్ణులమని భావిస్తున్నారు.

లచ్చన్న జవాబియ్యక తప్పలేదు. "కులం, వర్గం కూడనివి. మనం తెచ్చిపెట్టుకొన్నవి. మన పెద్దలు చెబుతున్నారు దైవందృష్టిలో మనమంతా సమానులం. అవకాశాలువస్తే అందరివలె మీరూ గొప్పవాళ్లు కాగలరు, విద్యా బుద్ధుల్ని నేర్చుకోగలరు; ఉద్యోగాల్ని చేయగలరు; ఊళ్ళేలగలరు."

ఆ మాటలు విన్న హరిజనులు "అంతా అలానే చెబుతారు కానీ క్రియకు వచ్చేసరికి ఎవరి కులం ఏనులు వారే చేస్తారు. ఎవరైనా చేసి చూపెట్టాలి. మాటలు ఎన్నైనన చెప్పవచ్చు" అంటూ నిరాశపడిన హరిజనులను జావి కార్యకర్తలు "మీకు మాటలు చెప్పడం రాదు. చేసి చూపెడతాము. మా వీధికి వచ్చి పాఠాలు చెప్పలేదూ. మమ్మల్ని నమ్మండి. మిమ్మల్ని దేవాలయాల్లోకి తీసకొనివెళ్తాము" అంటూ ఆరాత్రి నైట్ స్కూలును ముగించి తన సహచరులతో లచ్చన్న ఇల్లుచేరారు. లచ్చన్న తన సహచరులు యిచ్చిన ఉపన్యాసాలు, బోధించిన పాఠాలు బుర్రకెక్కి హరిజనుల్లో క్రొత్త ఆశలు రేకెత్తాయి. హరిజనులు కూడ మేము అందరితో సమానమే అన్న భావంతో మెలగే ప్రయత్నం చేసేవారు. ఇది పసిగట్టిన నవర్ణులు ఒకమారు హరిజనులను పిలచి "చూడండి మీరు మాల, మాదిగలు. మీరేనాడైనా గుడిలోనికి వెళ్లారా? మీ తాత ముత్తాతలు వెళ్లారా? దేవాలయం మైలుపడిపోతుంది. అంతేగాక ఆ పాపం మీ పీక చుట్టుకుంటుంది. అంతే. మీరంతా రక్తం కక్కుకుంటూ చస్తారు. జాగ్రత్త" అంటూ నవర్ణులు కొంతమంది బెదిరించారు.

"అదేమిటి బాబుగారూ! గాంధీగారు హరిజనులను దేవాలయాల్లోనికి తీసికొనివెళ్తానన్నారటకదా! ఆ పాపం ఆ గాంధీగారికి తగలదా? గాంధీగా రంతటివారు తప్పుచేస్తారా?" అని హరిజనులు వారిని ప్రశ్నించారు.

"ఓహెూ ! మీకు రాత్రిపాఠశాల చదువు అబ్బినట్లుంది. మీకు ఎలా బుద్ధి చెప్పాలో మాకుతెలుసు. రేపటినుండి మా పొలాల్లోనికి పనిపాట్లకు మీరు మరి రావద్దు" అని గద్దించారు.

"పోనీలేబాబూ ! ఏలటానికి ఊళ్ళు దొరకవుగానీ, కూలినాలి జేసికోవటానికి దొరకవా ? సముద్రతీరానికిపోతే ఏదో పని దొరక్కపోతుందా ?" అంటూ జారుకున్నారు.

సవర్ణులకు దిక్కు తోచలేదు. ఇక లచ్చన్నవద్దకు వెళ్లి ప్రాధేయపడటమో, బెదిరించడమో చేయాలి అన్న ఉద్రేకంతో ఉన్నారు.

ఆ గ్రామపెద్దలు దండోరా వేయించి గ్రామసభ జరుగుతుందని ప్రజలందరిని రమ్మని కోరారు. గ్రామ తలారిని పిలచి లచ్చన్నను గ్రామపెద్దలున్న చావిడికి పిలిపించారు.

లచ్చన్నగారు ఏ ఒకరిని లక్ష్యపెట్టనిరకం అన్నది ప్రతి ఒక్కరికి తెలుసు. అయితే గ్రామం యావత్తూ అతనిని దండించాలన్నది ఎత్తుగడ. లచ్చన్నగారు ధైర్యంతో వెళ్లి గ్రామసభకు జవాబు చెప్పడమే మంచిదని భావించి తన సహచరులు పాడి దుర్గభసాహు, లక్ష్మీనారాయణ వెంటరాగా గ్రామసర్పంచ్ తిట్టి బలరామయ్య (బలరాం) ఇంటివద్దకు వెళ్లారు. ఇంతలో గ్రామ ప్రెసిడెంట్, రైతునాయకులు తిప్పల పున్నయ్య అక్కడకు చేరారు.

ఇంతలో గ్రామ ప్రెసిడెంట్ "ఏమయ్యా ! నీవ్యవహారం ఏమీ బాగాలేదు. నీవు మాలవడమేగాక వూరందర్నీ మాల చేస్తున్నావట. ఈ యొక్క మాలల ప్రఖ్యాత భేరీలు అన్నీ మానేసి ఉంటావా, లేక ఊరువిడచి పోతావా ? గ్రామ కట్టుబాట్లకు లోబడి ఉండాలంటే ఉండండి, లేదా గ్రామం విడచిపొండి."

ప్రెసిడెంటుగారి మాటలు విన్న లచ్చన్న ఏమాత్రం జంకక ధీమాగా [illegible] సంఘ కార్యక్రమాలు యధావిధిగా జరుగుతాయి. [illegible] వెళ్ళే పరిస్థితి వచ్చినప్పుడు మీ పెద్దలలో ఒక [illegible]" అని అన్నారు. అచ్చన్న జవాబు విన్న పెద్దలు [illegible] సంఘబహిష్కారం చేస్తున్నాం. ఎలా మీరు గ్రామంలో [illegible]" అంటూ లేచారు. పర్యవసానంగా లచ్చన్నకు తది [illegible] బహిష్కరణ జరిగింది. తను, తన కార్యకర్తలు గ్రామంలో [illegible] తన ఆశయసాధన విడిచిపెట్టలేదు.

[illegible] తర్కం తెలిసినా, లచ్చన్న అంతస్థాయిలో [illegible] ఏదిచెప్పినా వెంటనే నమ్మనికాలం. [illegible]జ్ఞానం, [illegible] దినాలు. లచ్చన్న ప్రశ్నకు లోలోన తిట్లు

చీవాట్లు, శాపనార్థాలు. అయినా లచ్చన్న తనొక ఘన కార్యాన్ని సాధించానన్న ఆత్మ సంతృప్తిని కలిగి ఉండేవారు.

హరిజనులు — మంచి నీళ్ల బావి :

బారువాలో ఎండలు మెండుగా కాస్తున్నాయి. వేసవి తీవ్రత హెచ్చింది. సముద్రతీరం, చల్లనిగాలులకు కొదువలేదు. ఉల్లాసపరచే పిల్లగాలులకు కొరత లేదు. అయితే దప్పిక తీర్చటానికి దరిలో నున్న సముద్రుడు ఉపకరించడు కదా !

గ్రామంలో గల మంచి నీళ్ల బావులన్నీ ఎండిపోయాయి. చెఱువులు కన్పించాయి. అయితే ఆ గ్రామంలో గల బావిమాత్రం 'గంగా భవాని' వంటిది. ఎంతటి వేసవి తీవ్రతకైనా ఏనాడూ ఎండి ఎరుగదు. ఆ బావిలో నిత్యం నీళ్లు లభిస్తూనే ఉంటాయి. ఆ గ్రామ సవర్ణులందరికి ఆ బావే మంచి నీళ్లకు ఆధారం. మిగత బావులన్నీ ఎండినరోజున హరిజనులకు మంచినీళ్లకొరత తీరేదెలా? సవర్ణులు తోడుకొనే మంచినీళ్ల బావిలో హరిజనులు నీళ్లు తోడుకోవడమా! అసంభవం. ఆనాడు హరిజనులంతా లచ్చన్నను ఆశ్రయించారు. "బాబూ ! మంచినీళ్లులేక దప్పికతో బాధపడుతున్నాం. మీరు చీకటింట్లో దీపంపెట్ట గలవారు. మా మంచినీళ్ల బావులు పూర్తిగా ఎండిపోయాయి."

"అయితే మీరుకూడ సవర్ణులు తోడుకునే మంచినీళ్ల బావి వద్దకు వెళ్ళి నీళ్ళు తోడుకొని వెళ్లండి" అన్నారు లచ్చన్న. "ఇది జరిగేపనేనా ? సవర్ణులు ఊరుకుంటారా?" హరిజనులు. "ఊరుకొనకపోతే ఉరివేసుకొని చావమనండి. హరిజనుల నందరినీ చంపేస్తారా ?" లచ్చన్న మాట్లాడుతుండగా అతని సహచరులు వచ్చి చెప్పారు. "హరిజనులను మంచినీళ్ల బావివద్దకు తెప్పిస్తే మనమంతా ఊరు విడచి వెళ్లినట్లు చేస్తారట."

"ఎవరా మాటన్న మొనగాడు ? వాళ్లు ఎంతగా ప్రతిఘటిస్తుంటే అంత పట్టుదల మనలో కలుగుతుంది. ఇదీ మంచిదే. మనం చేస్తున్నది మంచిపని. గాంధీగారు చెప్పినపని. ఈ గ్రామస్తులకు బంతిని ఎంత బలంగా నేలకుకొడితే అంత ఎత్తు ఎగిరి పడుతుందని తెలియదు. మీరంతా ధైర్యంగా ఉండండి. రేపే హరిజనులు మంచినీళ్లను తోడుకొనే కార్యక్రమానికి ప్రారంభోత్సవం జరుగుతుంది.

లచ్చన్న మాటలు విన్న హరిజనులు ఒక్కమారు ఎగిరి గంతేసారు. నీటికి కటకటలాడుతున్నవారికి గుక్కెడు నీరు దొరికినట్లయింది. సవర్ణులు తోడుకొనే బావిలో వారు నీళ్లుతోడుకోవడం ఎంతగానో హరిజనుల్లో ఉత్సాహం వచ్చింది.

మరునాడుదయం బాజాభజంత్రీలు, భజనకార్యక్రమం మామూలే. బారువాలో నున్న కాంగ్రెసు కార్యకర్తలు చుట్టు ప్రక్కలవాళ్ళు వచ్చారు. ఊరేగింపుగావెళ్లి హరిజనులను సవర్ణులు నీరుతోడుకొనే బావినుండి నీరుతోడు కొనేలా చేయాలి. హరిజన స్త్రీల సందడి హెచ్చింది. కొత్తకుండలను కొని తెచ్చారు. వాటికి పూజలు పునస్కారాలు చేసి, పసుపు కుంకుమ బొట్టులు పెట్టారు. వాటిని నెత్తిన పెట్టుకొని, చేతుల్లో చేదల్ని పట్టుకొని ఊరేగింపులో పాల్గొన్నారు.

సవర్ణులకు ముందే ఈ విషయం తెలిసింది. సవర్ణులంతా ముందుగానే మంచినీళ్ల బావివద్ద కర్రల్ని పట్టుకొని కాసుక్కూర్చున్నారు. ఊరేగింపుగా వస్తున్నవారిని బావివద్దకు రాగానే ఎదురుగా వెళ్లి అడ్డగించారు.

"బావిలో నీరుతోడుకొనిపోతాం. ఇందులో మీరు చెడిపోయిందేమిటి ?" లచ్చన్న.

"నిజానికి నీవే అందరినీ చెడగొడుతున్నావు. కులాలన్నీ ఒకటే అని మా పరువు తీస్తున్నావు. చివరకు ఆ మాలవాళ్లకూడా మనతో సమానమని చేయరాని పనులు చేస్తున్నావు. మేముపోసే గంజికోసం ఎదురుచూసే వీళ్ళను పులుల్నిచేసి మామీదకు ఉసిగొల్పుతున్నావు. మా ఉసురు నీకు తగులుతుంది" వారు ఆగ్రహాన్ని వ్యక్తంచేసారు.

"మీరు మంచి చెడు తెలియకుండా మాట్లాడుతున్నారు" లచ్చన్న. "మాకంతాతెలుసు సత్యాగ్రహాలని, సభలని చట్టుబండలని ఇన్నాళ్లూ అంటే ఊరు కున్నాం. ఈనాడు హరిజనులనే ఇళ్ళల్లోకి పంపిస్తావా ? ఎన్ని గుండెలు నీకు ? నిన్ను గ్రామంనుండి గెంటివేస్తేనేగానీ లాభంలేదు. వారి ఆగ్రహావేశా లింకా పెరుగుతున్నవి కానీ, తగ్గలేదు.

లచ్చన్నగారు ఒక్కమారుగా బావివద్దకు లఘించారు. "ఎవరొస్తారో రండి" అంటూ చేతిలో చేదనందుకొని బావిలో వేసారు. హరిజనుల నందరినీ రమ్మని, నీళ్లు తోడమని గద్దించారు. లచ్చన్న భీకరాకారం, ఉద్రేకం జూచిన గ్రామ ప్రజ నివ్వెరపోయారు. ఏ ఒక్కరూ ముందడుగు వేయలేకపోయారు. నిజానికి వారిలోనున్న నైతిక బలం ఏమిటి ? లచ్చన్నతో పోరాడటానికి సాటి మానవులను వారి హక్కులను తిరస్కరించడం ఏమంత సులభమైన పనికాదు. సవర్ణులు వెనుకకు తగ్గారు. హరిజనులెల్లరు ఒక్కమారుగా బావివద్దకువెళ్లి మంచి నీళ్ళు తోడుకోవడం ప్రారంభించారు.

ప్రతీ దినం హరిజనులు వచ్చి ఆ మంచినీళ్ల బావినుండి మంచినీళ్లు తోడుకొని పోవడం సవర్ణులకు కళ్ళుకుట్టాయి. అంతేగాక ఆ గ్రామ హరిజనులు లచ్చన్న గిని పొగడి ఆకాశానికి ఎత్తడం వాళ్లకు కంటగింపుగా ఉంది.

రాత్రికిరాత్రి కుళ్లినచేపల్ని, మలమూత్రాల్ని ఆ బావిలో వేశారు. ఎవరు వేశారన్నది తెలియకుండా చేసారు. వ్యక్తుల్లో ఈర్షాద్వేషం అలముకొన్ననాడు ఉచ్చనీలస్థితు బేధం తెలియదు. లచ్చన్నకు ఎదురుగావెళ్లి జయించ లేమని ఈ దుర్నీతికి పాల్పడినట్లు తెలిసిపోతూనేఉంది. లచ్చన్న సత్యాగ్రహి. అయితే వాళ్ళకు దురాగ్రహిగా కన్పించారు. సాధుజీవి అయినా వాళ్లకు అరివీర భయంకరుడు. సహనశీలి అయినా అభివృద్ధి నిరోధకులపాలిటి అగ్నిగుండం. గాంధేయవాది—ఎదిరించినవారిని తుదముట్టించాలన్న పద్ధతిని ఏనాడో విడవి పెట్టినవారు.

ఉదయం లచ్చన్న కీ వార్త తెలియగానే అనుచరులతో వెళ్లి బావిలోనున్న నీటి నంతటినీ బయటకు తోడించారు. నీళ్లను శుభ్రపరచే పొటాషియం పర్మాంగనేటును ఉపయోగించారు. మరల ఆ బావిని మంచి నీళ్ల బావిగా తీర్చిదిద్దారు. లచ్చన్న చేసిన ఈపనిని ఆ గ్రామంలో ఎందరో మెచ్చుకొనక తప్పలేదు. కష్టాల్లోఉన్న ప్రజలను లచ్చన్న పనిగట్టుకొని ఆదుకొంటాడన్నది అందరికి తెలిసింది.

### కలరా, మశూచి – గ్రామప్రజల సేవ :

లచ్చన్నగారి సాంఘికసేవ, నలుగురినీ కష్టాల్లో ఆదుకొనే మంచితనం ఎంతఉన్నదీ అందరూ తెలిసికొనే అవకాశం వచ్చింది. గ్రామంలో అకస్మాత్తుగా కలరా, మశూచి వ్యాధులు వ్యాపించాయి. తినటానికి సరియైన పుష్టికరమైన ఆహారంలేక ఆరోగ్యకరమైన వసతిలేక శుద్ధిచేయబడిన మంచినీళ్లులేక అనారోగ్య పరిస్థితులలో జీవిస్తున్నవారికి వచ్చే వ్యాదులవి. అయితే ఆ మూఢప్రజలు ఈ జబ్బులకు "దేవతే" కారణమని భావించారు. మురికిగుంటల్ని ముందుంచుకొని బ్రతికే కూలినాలి జనం వచ్చిన జబ్బుల్ని ఆ దేవతవలన కలిగినవిగా భావిస్తూ ఆలోచిస్తున్నారు, ఆ దినం బారువాలో సుమారు 10 మంది చనిపోయారు.

రెండవదినం సుమారు పదిమంది, మరొకదినం ముప్పదిమంది. కలరా మశూచి జబ్బులయినందున, ఎవ్వరూ ఏ ఒకరి ఇంటికి వెళ్లలేక భయంతో వణికి పోతున్న దినాలవి. ఆజబ్బులతో మరణించినవారిని దహనపరచే దిక్కుమొక్కు లేక ఎన్నో శవాలు గ్రామాల్లోనే ఉండిపోతున్న ఘడియలు.

కలరా మశూచిం సోకినవాళ్ళదగ్గరకు ధైర్యంగా వెళ్ళడమేగాక, వాళ్ళకు సపర్యలు చేయటానికి కూడా లచ్చన్న తన అనుచరులు సిద్ధమైనారు. డాక్టర్లను తెప్పించి వారిని అన్నివిధాలా ఆదుకొన్నారు లచ్చన్నగారు. అంతేగాక మరణించిన వారి శవాలను తరలించుకొనిపోయి దహనసంస్కారాల్ని చేసారు.

లచ్చన్న ఆతని సహచరులు చేస్తున్న ఈ సాంఘికసేవను జూచి గ్రామ ప్రజలంతా అబ్బురపడి సిగ్గుతెచ్చుకొన్నారు. లచ్చన్న ప్రజలకు ప్రమాదకారి కాదు. ఉపయోగకారి, ప్రజోపకారి అని తెలుసుకొన్నారు. చెరువుల్లో, బావుల్లో మందులు చల్లించారు. లచ్చన్నబలగం ఆపదలో ఉన్నపుడు అందచేసిన యీ సంఘసేవను ప్రజలు అభినందించకుండా ఉండలేకపోయారు.

లచ్చన్న గ్రామాభిమాని, దేశాభిమాని, మనందరి అభిమాని. గండం గట్టెక్కింది. మనమంతా గ్రామదేవత పండుగ జరిపించుకొందామన్న పైరు పండగ జరుపుకోవడం మంచిదే అయితే వచ్చిన కలరా, మశూచి రోగాలకు గ్రామదేవతకు సంబంధంలేదు అని ప్రజలకు బోధించారు లచ్చన్న.

# గురు శిష్యులు: రంగా - లచ్చన్నలు

గురు శిష్యులు అనే జంటపదం మన చరిత్ర సంస్కృతిలో బలీయమైన ధాన్యతను సంతరించుకొన్నది. అయితే గురుశిష్యులు ఆధ్యాత్మికరంగంలో చ్చుగా కన్పిస్తారు. రాజకీయరంగంలో ఏ ఇరువురినీ మనం గురుశిష్యులుగా వం. అయినా మతపరమైన ప్రభావం హెచ్చుగానున్న మన సమాజమున జకీయరంగంలో పేర్వడసిన ద్వయానికి, గురుశిష్యులుగా సమాజం పిలవ లపిస్తుంది.

పౌరాణికయుగంలో కృష్ణార్జునద్వయం గురుశిష్యులు. ఒక లక్ష్యసాధనలో ్మంచి కృతార్థులయినవారు. లోకానికి గీతోపదేశం వినే అవకాశం కల్పించిన ు. సీతారామాంజనేయ గురుశిష్య సంవాదము లోక ప్రసిద్ధమైనది.

ప్రాచీనయుగంలో మనదేశాన గౌతమబుద్ధుడు, ఆనందుడు గురుశిష్యులు. ద్ధధర్మప్రచారంలో సమాజాన్ని చైతన్యమొనరించి ఎనలేని కీర్తిప్రతిష్టల నందిన రు. పాశ్చాత్యదేశాన సోక్రటీసు, ప్లేటో గురుశిష్యులు. ఆధునిక తాత్త్విక ద్ధాంత ప్రతిపాదనల కాధారమైన నిజజీవిత సత్యాలను, సూత్రాలను ప్రబోధించిన రు.

ఆధునిక యుగములో రామకృష్ణ, వివేకానందులు గురుశిష్యులు. ఆధ్యా ్క ప్రపంచానికి, పుంభానర సరస్వతి పుత్రులై ప్రకాశించారు. ఆధ్యాత్మిక శక్తి ుపదలను ఎంతగానో ప్రసరింపచేశారు. వీరబ్రహ్మం, సిద్ధుడు లోకానికి మానత్వం సమభావాల్ని చూపి మహనీయులై వర్ధిల్లినారు.

మత ధార్మిక విషయాలలోనే పైన తెలిపిన గురుశిష్యుల ద్వయం లోకానికి యుగలిగిన మహోపకారం చేసి వెళ్లారు. మతవిషయాల చర్చల్లోనే గురుశిష్యులు ుపొందుతారు. ఒకరు బోధకుడు! మరొకడు బోధకుడు. అయితే రాజకీయ ంగాన గురుశిష్యులుగా ఏ ఇరువురూ రూపొందుటకు పిలవబడుటకు అవకాశమే ు. కారణం రాజకీయసిద్ధాంతబోధన ఏ ఒకరో, ఏ ఒకరికో ప్రత్యేకంగా చేయ ుసింది కాదు. ఎందరో రాజకీయ నాయకులు, ఎంతో మంది ప్రజానీకానికి బోధింపవలసిఉన్నది. ఏ ఇరువురు ఇందుకు కారకులని చెప్పటానికి వలను తదు.

అయితే రాజకీయ ఉద్యమాలు నడపుటలో స్వీయసిద్ధాంత ప్రచారంలో ెరికొకరు ఉద్దీపనశక్తిగా నిలచి, సమైక్య పోరాటం సలపడంలో విజయం ంచిన ఇరువురిని గురుశిష్యులుగా లోకం భావించుకొనుటలో తప్పిద మేమీ ుు.

సమకాలీనయుగంలో పాశ్చాత్యదేశాన, కారల్ మార్క్స్ – ఏంగిల్స్, గురుశిష్యులుగనే చెప్పబడతా రనటానికి, మార్క్స్ ఏంగిల్స్‌కు హితోపదేశం చేసాడని కాదు. ఇరువురూ ఒక రాజకీయ లక్ష్యసాధనకై అహర్నిశలూ శ్రమించి పాటుపడ్డారు. ఒకరి గురుత్వాన్ని వేరొకరు అంగీకరించరు. ఒకరి శిష్యత్వాన్ని వేరొకరు అభిమానంతో స్వీకరించరు. ఇక గురుత్వం – శిష్యత్వం అన్నదేమిటి?

మనదేశాన మహాత్మా గాంధీజీ, నెహ్రూజీ గురుశిష్య సంబంధాలను పెంపొందించుకొన్నారని, మనం భావించుటలో విప్రపత్తిలేదు. బాపూజీని నెహ్రూజీ, నెహ్రూని బాపూజీ ఒకరినొకరు ప్రేమించుటలో ఆత్మీయతలను ఎంత గానో పెంచుకున్నారు. భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమాల్ని నడుపుటలో, అంతరంగికంగా గురుశిష్య భావాలనే ప్రతిబింబించేలా నిత్యం వ్యవహరించేవారు. తుదకు తన అభిమానం వలన గాంధీజీ నెహ్రూపక్షపాతి అన్నమాట తెచ్చారు.

మన ఆంధ్రలో రైతు రంగా, రైతోద్యమ నాయకుడు లచ్చన్న ఇరువురిని, గురుశిష్యులుగా, ఆంధ్రప్రజానీకం భావిస్తూంది. రైతోద్యమాలను నడుపుటలో స్వీయపార్టీని ప్రజాభిమతం మేరకు కొనసాగించుటలో రంగాగారి అభిప్రాయానికి, ప్రవచనానికి లచ్చన్న ఎంతగానో, విలువిచ్చేవారు. తనపార్టీ హితమాశించిన లచ్చన్న ఏమి చెప్పినా విని దానిని పార్టీపరంగా అమలుచేసేవారు రంగా. రంగా గారు అందుకే ఒకమాట అన్నారు "లచ్చన్న తనకు దేవుడిచ్చిన వరం" అని. మరొక ఉదాహరణ చెప్పారు. ధాన్యం గాలికి పోస్తే పొల్లుగింజలన్నీ పోయి తుదకు గట్టిగింజ లచ్చన్న గారే తనకు మిగిలారని. ఇక లచ్చన్నగారు రంగా గారిని తన దైవంగా, గురువుగా భావించడమే కాదు; దైనందిన జీవితంలో, పార్టీ కార్యక్రమాలలో తన గురువాజ్ఞను అక్షరాలా పాటిస్తూ వచ్చారు.

1932లో ప్రొఫెసర్ రంగా రాజకీయ ఖైదీగా జైల్లో శిక్ష అనుభవిస్తుండ గనే ఆ జైల్లో గల ఇతర రాజకీయ నాయకులతో కార్యకర్తలతో సంప్రదిస్తూ జైలునుండి విడుదలై వెంటనే రైతోద్యమం నడపాలన్న నిర్ణయానికి వచ్చారు.

1802 చట్టం మేరకు సంస్థానాధిపతులు, జమీందారులు, మొకాసా దారలు, ఇనాందారులు, రిసర్వే-రిసెటల్‌మెంట్ ఆపరేషన్ మేరకు శిస్తులు దస్తులు బిగించారు. పన్నులను హెచ్చించారు. భూవిస్తీర్ణాన్ని 10.1 అడంగులలో ఎక్కించి పెంచారు. రిసెటల్‌మెంట్ పేరుతో హెచ్చు శాతం పన్నులను వసూలు చేయ డం ప్రారంభించారు. అందుకు గంజాం జిల్లాలోనున్న కళ్ళికోట సంస్థానంనుండి నెల్లూరునుండి వెంకటగిరి సంస్థానం వరకు, ఎస్టేటు రైతుశిక్షణ సంఘాలను ఏర్పరచాలన్న నిర్ణయానికి వచ్చారు రంగాజీ. రిసర్వే-రిసెటిల్‌మెంట్ తగదని హెచ్చు పన్నులు వసూలు చేసిన రైతాంగం ఇబ్బందులు పడుతుంది. నివారణకు ఉద్యమం నడపాలి.

1802 లో సెటిల్‌మెంట్ ప్రకారం నగరశిస్తు పెంచారు. పంటలో భాగం యివ్వాలి. 1930–32లో గవర్నమెంటు కిట్టింటో రేటును కూడ పెంచారు. జమీందార్ల రిసర్వే-రిసెటల్‌మెంట్ ప్రారంభించి పన్నులు వేయడం ప్రారంభించారు. బ్రిటిష ప్రభుత్వం రైతుపై జమిందార్లని, ఇనాందార్లని పురమాయించింది. శిస్తు దస్తులను వసూలు చేసికొనే హక్కును ఇచ్చి వారినుండి పెష్కల్‌ను పొందే అధికారాన్ని పొందింది. ఆ మేరకు చట్టం చేసింది. ఇక జమిందారుల, ఇనాం దారుల ఇష్టారాజ్యమైనది.

మద్రాసు రాష్ట్రంలో ఆంధ్రా ప్రాంతాన జమీందార్లు ప్రభుత్వంరా ఇది. అన్ని పరిస్థితులు అందువలన రిసెటిల్‌మెంట్ కార్యక్రమంపై బెజవాడ సమావేశంలో ప్రారంభమైనది. దండు నారాయణరాజు, అయ్యదేవర కామేశ్వరరావు, వెంకట గిరి దాయాది కల్యాణరావు, మాగంటి బాపినీడు, జమీన్‌రైతు వారపత్రికల ఎడి టర్ నెల్లూరు వెంకటరామినీడు న్యాయస్థానాల ద్వారా మొదట ప్రతిఘటిస్తారు. రైతులు తదుపరి రైతు మహాసభల ద్వారా ఉద్యమం నడిపిస్తారు. ఇదే అఖిల భారత కిసాన్‌కినాంది పలుకుతుంది.

1933 నవంబరు 7వ తేదీన ప్రతీ రాష్ట్రమున జిల్లా స్థాయిలో రైతు రక్షణ యాత్రలను జరిపి, రైతురక్షణ సంఘాలేర్పడి, ఆ జిల్లాకలెక్టరుగారిని, రైతుల కష్టాలను దెలుపుతూ మహజరుఅన్న పిలుపు నిచ్చారు. రైతు రంగా యిచ్చిన పిలుపుపై గంజాంజిల్లా ఆంధ్ర ప్రాంత రైతు సంఘాధ్యక్షులు పుల్లెల శ్యామసుం దరం జిల్లా అంతట పర్యటనలను జరిపారు. రైతుయాత్రలు జరగాలని రైతు సంఘాలు ఏర్పడాలని తీవ్రంగా కృషి సలిపారు.

ఒకనాడు తన పర్యటనలో భాగంగా పుల్లెల శ్యామసుందరం బారువా వచ్చి. రైతుసభను ఏర్పాటు చేసారు అసరికే స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, జైలు శిక్ష అనుభవించి స్థానిక హరిజనోద్యమం నడుపుటలో గట్టి కృషి సలిపి గ్రామ ప్రజల అభిమానం పొందిన రాజకీయ కార్యకర్తగా పేర్వడసియున్న లచ్చన్న సహజంగానే ఆ రైతుసభను ఏర్పాటు చేయగల ప్రధాన పాత్ర వహించారు. అంతే గాక బారువా ఎస్టేటు రైతులసభ జరుగకముందునుండే లచ్చన్నగారికి, పుల్లెల శ్యామసుందరంగారితో పరిచయమున్నది. పుల్లెల శ్యామసుందరంగారి భూసంబం ధమైన ఆస్తిపాస్తులు బారువాలోనే ఉన్నాయి. అంతేగాక గంజాంజిల్లా ఆంధ్రా కాంగ్రెసు నాయకునిగానున్న శ్యామసుందరం కాంగ్రెసు అభిమానిగా దేశాభిమా నిగా ఉన్న లచ్చన్నకు తెలియని వ్యక్తిగా ఉండలేరు కదా!

సభ అనంతరం బారువా బంగళాలో కార్యకర్తల సమావేశం జరిగింది. పుల్లెల శ్యామసుందరం అందరిలో ప్రముఖంగా కన్పిస్తూ, కార్యక్రమాన్ని అం విజయవంతంగా నడిపించిన లచ్చన్నగారిని పిలచి "లచ్చన్నా! తీవ్రవాద ర

ఖులు మనకెందుకు ? ఉద్యమాల్ని చక్కగా నడిపే నేతలు మనకున్నారు. వారినే మనం అనుసరిద్దాం" ఆప్యాయంగా చూస్తూ అన్నారు.

"నిజమేనండి. మనల్ని ముందుకు నడిపే నాయకత్వం ఏది? మనదేశం బాగుపడే మార్గం ఏది ?" లచ్చన్నగారి సందేహం.

"మనకు నాయకత్వం ఉంది. దేశస్వాతంత్ర్యంకన్నా మనకు తక్షణ సమస్య ఒకటుంది. ఎస్టేట్స్‌లోనున్నా భూమిని దున్నే రైతులు బానిసబ్రతుకుల్ని బ్రతుకుతున్నారు. మనమే మనకంటితో చూస్తున్నాము. తరతరాలుగా వాళ్లు కష్టిస్తున్న ఆ భూములపై వాళ్లకు హక్కులు లేవు సరికదా సరైన భుక్తి కూడా లేదు. ఆ పండిన ఫలితం జమిందారులది. మిగిలినది భగతలది."

"అయితే మనం ఏం చేయలో చెప్పండి లచ్చన్నా" ఈ ప్రాంతంలోనిదే ఈ సమస్య కాదు. అఖిలభారత సమస్య. అందుకు ప్రొఫెసర్ రంగా అఖిలభారత కిసాన్‌సభను స్థాపించారు. దీని కేంద్రం ఢిల్లీ. వీరానాడు ఒక పిలుపు ఇచ్చారు. భారతదేశంలోనున్న రైతాంగం యావత్తు తమతమ సమస్యల పరిష్కారానికి, హక్కుల సాధనకు మెమొరాండమ్‌లను తయారుచేసికొని ఆయాప్రాంతాల జిల్లా కలెక్టర్లకు ఈ నవంబరు 7వ తేదీన స్వయంగా రైతాంగం యావత్తూ కదలి యివ్వాలి.

"ఆ మహానుభావుడెవరో కానీ కన్నీళ్లతో కష్టాలతో కాలం గడుపుతున్న వీరికి కాంతిరేఖలా వున్నారు." లచ్చన్న "ఎవరో కాదు; మన కాంగ్రెసు నాయకులు ప్రొఫెసర్ రంగా. రైతుకుటుంబంనుండి వచ్చిన వ్యక్తి రైతులకష్టసుఖాలను తెలిసిన వ్యక్తి. రైతాంగాన్ని ఆదుకోవాలని పిలుపునిచ్చారు."

"మరి మనస్వతంత్రంమాటేమిటి లచ్చన్నా!" జాతీయ పోరాటం సాగుతూనే ఉంటుంది. తెల్లవాళ్లు మనల్ని విభజిస్తూ పాలించాలని జూస్తున్నారు. మన కాంగ్రెసు నాయకత్వం దేశప్రజలకు మార్గదర్శకత్వాన్ని వహిస్తూనే ఉంది. అయితే భారత దేశంలో పీడిత రైతాంగాన్ని దోపిడీ చేస్తున్నవారిని, వెంటనే తుదముట్టించాలని ప్రొఫెసర్ రంగాగారి అభిప్రాయం.

దేశంలో అంతరంగికమైన సమస్యలున్నాయి. వాటిని కూడా పరిష్కరించుకోవాలి. స్వరాజ్య సాధనకు ఇవి ఆటంకంకావు. ప్రజలలో చైతన్యాన్ని తెచ్చి స్వరాజ్య సాధనకు ఉపకరిస్తాయికూడ అని రంగాజీ చెబుతున్నారు. గాంధీజీ హిందూ, ముస్లిం సమైక్యతకై అహర్నిశలు కృషిచేస్తున్నారు. డా॥ అంబేద్కర్ భారతదేశాన గల దళితజనుల నుద్ధరించ దీక్షకంకణం కట్టుకొని, దేశవ్యాప్తంగా తిరుగుతున్నారు ప్రొఫెసర్ రంగా గారు. ఈనాడు బక్కచిక్కిన రైతులను ధొక్క లెండిన రైతుకూలీలను జమిందారుల కబంధ హస్తాలనుండి రక్షించటానికి భారత రైతాంగానికి పిలుపునిచ్చారు. పుల్లెల చెప్పేవదంతా లచ్చన్న శ్రద్ధగా విన్నారు.

"నిజమే! మన ప్రక్కవాడి దౌర్భాగ్య స్థితికి మన ప్రక్కన జీవిస్తున్నవారు కారణమవుతుంటే వాడిపని పట్టాల్సిందే. మనప్రాంతం రైతాంగం బాగుపడి తీరుతుంది." లచ్చన్న " అయితే ఇక మనం సిద్ధం కావాలి. రైతుకూలీ రక్షణ యాత్రను మనం జరపాలి. పర్లాకిమిడి ఎస్టేట్సులో నున్న వారణాశినుండి గంజాం జిల్లా హెడ్క్వార్టర్సు చైత్రపూర్కి మనం రైతురక్షణయాత్రను నడిపించాలి." పర్లాకిమిడికి, గుణుపురానికి మధ్యనున్నది వారణాశి.

అక్టోబరు మూడవవారంలో వారణాశిలో, రైతులు సమావేశమైనారు. ఆనాటి గంజాంజిల్లా నాయకులు న్యాయపతి నారాయణమూర్తి, పుల్లెల శ్యామ సుందర్రావు ఈ రైతు రక్షణయాత్రకు నాయకత్వం వహించారు. గేదెల చంద్రయ్య నాయుడు, భారన నందిప్ప, ఊన రామ్మూర్తి, మాజీ మంత్రులుకలావు లక్ష్మణ దాసు, తండ్రి పర్లాకిమిడిలో దుక్క రాజేంద్ర రెడ్డి, కన్నెపల్లి సత్యన్నారాయణ, బోయిన అప్పలస్వామి, స్థానిక నాయకులు రైతులకు నాయకత్వం వహించి ముందుకు నడిపారు. ఆనాటి యువనాయకత్వం లచ్చన్నగారిది.

లచ్చన్న బారువానుండి పరాకిమిడి ఎస్టేటులోనున్న వారణాశికి చేరుకున్నారు. తనకానాటికి రైతాంగానికి నాయకత్వం వహించేస్థితి ఇంకా రాలేదు. ఉత్తేజంలో ఉత్సాహంలో యువకులకు అధ్వర్యం వహిస్తూ జండా పట్టుకొని నినాదాలనిస్తూ, రైతులను హుషారెక్కించే యువనాయకుడు లచ్చన్న.

వారణాశినుండి ఛత్రపూర్కి దాదాపు 120 మైళ్ల దూరం. అక్టోబరు మూడవ వారంలో ఇటనుండి బయలుదేరిన రైతు రక్షణయాత్ర నవంబరు 7వ తేదీకి ఛత్రపూర్ చేరుకోవాలి.

వారణాశిలో ఆనాడు రైతు మహాసభ జరిగింది. ఆనాటివరకు రైతుల కష్టసుఖాల గురించి పట్టించుకొనే నాధుడే లేడు. రైతాంగం ఆనందంతో పొంగి పోయింది.

సభ అనంతరం రక్షణయాత్ర ప్రారంభమైంది. నాయకులు జండాలు చేతుల్లో పట్టుకొని జైజై నినాదా లిచ్చుకుంటూ గ్రామాల్ని దాటుకుంటూ వెళ్తున్నారు. గ్రామగ్రామాన రైతు రక్షణయాత్రలు కలుస్తున్నాయి. మధ్యనున్న గ్రామాల్లో బసలు, మజిలీలు. వచ్చిన రైతులను రక్షణయాత్రలో పాల్గొన్న వారిని, గ్రామస్తులు సకలమర్యాదలతో ఆదరించి, వారికి అన్నిసౌకర్యాల్ని కల్పించేవారు.

గ్రామగ్రామాల్లో సభలు జరిపించుకొంటూ రక్షణయాత్ర 1933 నవంబరు 7వ తేదీకి ఛత్రపూర్ చేరుకున్నది. ఆ తేదీకే రక్షణయాత్ర జిల్లాకేంద్రం చేరి కలెక్టరుగారికి విజ్ఞాపనపత్రం ఇవ్వాలి.

ఆ తేదీ ప్రొఫెసర్ రంగా గారు జన్మించిన తేదీ, పవిత్రమైనదినం. భారత దేశానికి వెన్నెముక రైతాంగమని ప్రప్రథమంగా భారతదేశమున గుర్తించిన దేశ రాజకీయ నాయకుడు, స్వాతంత్ర్య సమర రణరంగంలో ముందడుగేస్తున్న మూర్తీభవించిన జాతీయవాది.

రైతుసమస్య దేశసమస్య అని గుర్తించిన ఆర్థికవేత్త. పాడిపంటల్ని పండించే రైతు దోపిడీకి గురి అవుతున్నాడన్నది అతని ఆవేదన. జమీందార్లు జలగల్లా వారిని పీల్చి పిప్పిచేస్తారన్న దతని వాదన.

వారణాశినుండి బయలుదేరిన యాత్ర ఒలియా పుట్టి, బాపర, గాదబంద, గొప్పరి, మందస, బారువా, సోంపేట, ఇచ్ఛాపురం, బరహంపూర్ మీదుగా వారం దినాలు ప్రయాణంచేసి భద్రపూర్ 7–11–1933కి చేరుకుంది.

అసంఖ్యాక రైతాంగం భత్రపూర్ రైల్వేస్టేషన్‌కు వెళ్లి, ఢిల్లీనుండి వస్తున్న ప్రొఫెసర్ రంగాను సభాస్థలానికి మేళతాళాలతో తోడ్కొని వచ్చింది. భత్రపూర్ నలుమూలల ఆనాడు కనిపించేది రైతాంగమే. ఏ ఒకరినోట వెలువడే మాటలు రైతాంగానికి చెందినవే. అదేతేదీకి ఒరిస్సానుండి – విశ్వనాధదాస్ శరత్చంద్రరథ్, దివాకరపట్నాయక్‌ల అధ్వర్యములో కళ్లికోట సరంగి ఎస్టేట్ చీకటిఎస్టేట్ ఒరిస్సా ప్రాంతం జమీందారుల యాత్రకూడ వచ్చి చేరింది.

శ్రీ పుల్లెల శ్యామసుందరంగారు ఆ రైతుమహాసభకు అధ్యక్షత వహించారు. ఆ సభకు ముఖ్య అతిధి ముఖ్య ఉపన్యాసకులు ప్రొఫెసర్ రంగాగారు. అసంఖ్యాక రైతాంగంతో సభ కళకళలాడుతున్నది. నాయకులు ఏమిచెబు తారోనని రైతాంగం నిరీక్షిస్తున్నది. వేదిక నలంకరించిన ప్రొఫెసర్ రంగా "రైతుసోదరులారా ! సోదరీమణులారా ! రైతాంగానికి ఒకమాట చెప్పటానికి వచ్చాను. రైతులంతా సమైక్యమై కట్టుబాటుగా ఉండి ఉద్యమించకపోతే ఈ జమిందారులనుండి మనకు విముక్తి కలగదు. ఈనాడు మనమంతా జిల్లాకలె క్టర్లకు విజ్ఞాపనపత్రా లిచ్చామంటే మన సమస్యలు ఆకలెక్టర్లు తీర్చేస్తారనీ కాదు. మీలో చైతన్యం తేవటానికి కార్యక్రమం రూపొందించాను. ఈ కలెక్టర్లు ఆ తెల్లదొరల బానిసలు. ఈ జమిందార్లు ఆ తెల్లవాళ్లకు అడుగులకు మడుగు లొత్తుచు తిరిగే దాసానుదాసులు. అయితే రైతాంగం పై తామే అధినేతలమని, భూమిపై హక్కు వారిదేనని విర్రవీగుతున్నారు. మీరంతా ఈ జమీందారులను ప్రతిఘటించాలి. యువక రైతాంగం ఇందుకు నడుంకట్టాలి. రైతోద్యమాల్ని నడపాలి. రైతులకు భూములపై హక్కులను కల్పించాలి. ఈనాటితో ఈ ఉద్యమాన్ని ముగించడం కాదు. ప్రతీ సంవత్సరం నవంబరు 7వ తేదీన మీరంతా తప్పక రైతురక్షణయాత్రను జరపాలి. రైతోద్యమాల్ని నడపాలి. రైతులకు హక్కులు కల్పించాలి. అందుకు మీరంతా ముందుకు వచ్చి

పోరాడాలి, జై ! భారత్‌కి జై ! మహాత్మాగాంధీజీకి జై, జై!" అంటూ రంగా గారు తన ఉపన్యాసం ముగించారు.

ఉపన్యాసాన్ని అత్యంతాసక్తితో విన్న లచ్చన్న రంగాగారి విశిష్ట వ్యక్తిత్వానికి, ఆశయసాధనలో గల అచంచల విశ్వాసానికి, నమ్మకానికి, తన ఆత్మలో జోహార్లు అర్పించారు. కారుచీకటిలో కాంతిరేఖలా రంగాజీ లచ్చన్నగారికి కన్పించారు. బక్కచిక్కిన రైతును బాగుపరచాలి. డొక్కలెండిన కూలీకి బ్రతుకు పెట్టాలి, తన ఆశ ఎంత ఔన్నత్యం కలదో గదా, రైతులపాలిట రాజతడు, రాజపదం పవిత్రమైనది. అయితే ఈ పదానికి అపఖ్యాతి తెచ్చారు, ఆనాటి రాజులు ప్రజల్ని దోచుకుంటూ. దేశంలో ఉన్న అసంఖ్యాక ప్రజానీకమంతా రైతాంగమే. మిగిలిన వ్యక్తులలో నున్నది ఏ కొద్దిమంది మాత్రమే. భారతమాత తప్పక ఇతనిని తన మనసారా దీవిస్తుంది.

ప్రజానీకం, రైతాంగం, రంగాజీ ఉపన్యాస ధోరణిని విని నివ్వెరపోయారు. తెల్లదొరలను బహిరంగంగా ఆనాడు దూషించడం, ఆ తెల్లదొరలకు ప్రియమైన జమిందారుల నెదిరిస్తూ మాట్లడటం సామాన్యమా, ఇతడెవరో కాని ఉద్దండుడే, ఉండవలసిన రైతునాయకుడే! ఆంధ్ర రైతాంగంలో సంచలనం తెస్తున్న ప్రొఫెసర్ రంగా.

శ్రీరంగా అవిభక్త మద్రాసు రాష్ట్రమున గుంటూరుజిల్లా నిడుబ్రోలులో జన్మించారు. రైతుకుటుంబీకులు. ఇండియాలో విద్యాభ్యాసం ముగిసిన తరువాత పై చదువులకు పాశ్చాత్య దేశాలకు వెళ్లారు. ప్రారంభదశలోనే చేరిన 6 మాసాల్లోనే – గాంధీగారిచ్చిన – ఉప్పుసత్యాగ్రహోద్యమంపై పిలుపునివ్వగా ఇండియా వచ్చి చదువుకి స్వస్తిచెప్పారు – అయితే మరల విదేశాలకు వెళ్లి లండన్ ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో ఆర్థికశాస్త్రవేత్తగా డిగ్రీ అందుకున్నారు. ఉన్నతమైన చదువులను చదివి కృతార్థులై ఇండియా వచ్చారు. విదేశాలకు వెళ్లి విద్య నభ్యసించడం, మరల రావడం – ఆనాడు మహోన్నతమైన జీవనస్థాయికి నిదర్శనం. ఉన్నతోద్యోగాల్ని లిప్తకాలంలో వారు పొందగలరు. ఆనాటి బ్రిటిషు ప్రభుత్వం అటువంటివారిని, వెంటనే పిలిచి ఉద్యోగాలిచ్చేది.

రంగాగారు ప్రభుత్వ పరిపాలనశాఖలో ఉద్యోగం చేయటానికి ఎందుకో ఇష్టపడలేదు. లెక్చరర్‌గా మద్రాసు పచ్చయప్ప కళాశాలలో చేరారు. ఆనాడు మద్రాసు పచ్చయప్ప కళాశాల అన్న ఈనాటి యూనివర్సిటీకన్న మిన్నగా ఉండేది. ఒక్కొక్క రాష్ట్రానికి ఒక్కొక్క కళాశాల మాత్రమే ఉండేది. పరమ దౌర్భాగ్యపరిస్థితి అది, ఆనాటి మన భారతీయ దుస్థితి. రంగాగారు ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నా అతని దృష్టి దేశసమస్యలపై పడింది. ప్రతీ ఒక్క విద్యావంతుడు, విద్యను గడించిన తదుపరి తన బాగోగుల్ని జూచుకొనే స్థితికి దిగజారితే ఇక దేశం గురించి, పాటుపడేవారెవరు ? త్యాగశీలురు, దేశభక్తులు అయితే తనెందుకు

కాకూడదు ? కష్ట నష్టాలు వస్తాయి; భరిద్దాం. దేశానికి స్వరాజ్యాన్ని సంపాదించాలి. బానిసబ్రతుకు లెందుకు ? స్వేచ్ఛలేని బ్రతుకు చేవలేని చెట్టువంటిది. ఇదీ రంగాగారి ఆలోచనాధోరణి.

ఇంతలో మహాత్మా గాంధీజీ విద్యావంతులకు, ఉద్యోగస్తులకు, విద్యార్థులకు కూడ పిలుపు నిచ్చారు. దేశమాత దాస్యశృంఖలాల్ని ఛేదించ ముందుకు రండి అని ప్రబోధించారు. మహాత్మా గాంధీజీ వ్యక్తిత్వానికి, ఆశయసిద్ధికి మెచ్చుకొంటూ ప్రొఫెసర్ పదవికి రాజీనామా ఇచ్చి తన స్వగ్రామం నిడుబ్రోలు చేరుకున్నారు.

అనాటినుండి రంగాగారిని ప్రొఫెసర్ రంగా గారని పిలుస్తారు. ఒక విషయంలో పరిపూర్ణమైన అవగాహన ఉంటూ; ఆ విషయాన్ని సిద్ధాంతీకరించే శక్తి యుక్తులున్నవారిని, ప్రొఫెసర్ 'అనిపిలుస్తారు. కళాశాలలో సిద్ధాంతాలను వివరిస్తూ ఆ సిద్ధాంతాలను పునర్నిర్ధారణ పరిచే ప్రతిభాసామర్థ్యాలున్న రంగా గారు ప్రొఫెసర్ రంగా అని పిలువబడుతూ వచ్చారు.

విద్యాధికులు రాజకీయాల్లోనికి రావడం ఈనాటి వలె కాదానాడు. ఆనాటి విద్యాధికులకు వారు కోరిన మరుక్షణం ప్రభుత్వోద్యోగాలు లభించేవి. జీవితాన్ని హాయిగా, ఆనందంగా గడుపుకోవచ్చు. తనవరకు తన పిల్లలవరకు భోగ భాగ్యాల్ని పొందవచ్చు.

అటువంటి భోగభాగ్యాల్ని కాలదన్నుకొని రాజకీయాల్లోకి ప్రవేశించాలి. అంతటితో పరిపోదు; కారాగార శిక్షలకు సిద్ధంగా ఉండాలి. అవసరమైతే ఉరికంబమెక్కాలి, చిత్రహింసలకు సిద్ధపడాలి. త్యాగం, ఆత్మార్పణం తప్పించి వారికి అన్యథా శరణం నాస్తి. ఆనాటి రాజకీయాలు దేశభక్తి త్యాగంతో కూడుకొన్నవి. దేశస్వాతంత్ర్యానికి పోరాడాలి, కష్టాల్ని అనుభవించాలి. స్వార్థ చింతనకు ఆనాడు తావులేదు పదవులలో. అధికారాల ప్రశ్నే లేదు. లాఠీదెబ్బలుతిని స్వంత ఆస్తిపాస్తులను పోగొట్టుకొని జీవించాలి.

ఆనాడు ఈనాటి పార్టీ రాజకీయాల సుడిగుండా లుండేవి కావు. అందరిదీ ఒకే ఆశయం, ఒకే మార్గం— దేశమాతను చెరనుండి విడిపించడం. ప్రొఫెసర్ రంగా అన్నవా రెవరన్నదీ నేటి యువకులకు లోతుగా వెళ్లి గత చరిత్రలోనికి తొంగిచూడనిదే అవగాహనకు రాదు. అతని గొప్పదనం ప్రతిభాసామర్థ్యా లేమిటో తెలియబడవు. సమకాలీన రాజకీయ పరిస్థితుల నవగాహన చేసుకోవటంలో పత్రికలు సహాయపడతాయేమో గానీ, దేశ రాజకీయ పరిణామ చరిత్రను, ఆ చరిత్రను సృష్టించిన ప్రొఫెసర్ రంగాగారివంటి జీవితచరిత్రలను పఠించనిదే నిజమైన దేశ రాజకీయ ఆర్థిక, సామాజిక స్థితిగతులు ఏ ఒకరికి [illegible] కాదు.

ఛత్రపూర్‌లో ఆనాటి రంగాగారి ఉపన్యాసం లచ్చన్నగారిని ఉద్రేక పరచడమే కాదు; ఉత్తేజితుడ్ని చేసింది. తను చేయవలసింది ఎంతో ఉందని చాటి చెప్పింది. తనచుట్టూ ఉన్న రైతాంగాన్ని కాపాడితీరాలి అని తనను ఆదేశించినట్లయింది. తన స్వగ్రామం చుట్టూ ఉన్న గ్రామాలన్నీ జమిందారీ గ్రామాలే. జమీందార్ల దోపిడీకి గురియవుతున్న రైతాంగంలోనే తను జీవిస్తున్నాడు. ఆ రైతుల్లోనే తను మెలగుతున్నాడు.

లచ్చన్న ఉద్యమం ఆనాడు ద్విముఖంగా భాసిల్లింది. తన ప్రాంతంలోనే ఉన్న దోపిడీ జమీందారులపైన, తన దేశాన్ని పాలిస్తూ, తమను బానిసలుగ చూస్తున్న తెల్లదొరలపైన తను ఇకనుండి పోరాడాలి. పోరాట ఉద్యమాల్ని సాగించాలి. జిల్లా నాయకులు పుల్లెల శ్యామసుందరరావు, న్యాయపతి నారాయణరావు లచ్చన్నకు అన్నివిధాల ప్రోత్సాహ ప్రోద్బలాల నందించేవారు.

తనున్నది 'బారువా' జమీందారీగ్రామం. ఇక ఉత్తరాంధ్రలో జమీందార్ల కొరత లేదు. తన ప్రాంతంలోనే బారువా, చీకటి, జంత్రా, మందసా, తర్లా, నందిగాం, టెక్కలి, పలాసా, చెముడు, కురుపాం, విజయనగరం, పర్లాకిమిడి, జైపూర్ ఉండేవి. ఎస్టేట్ పేరులో కురుపాం ఎస్టేట్ ఉండేది.

జమీందారీగ్రామాల్లో నున్న రైతులకు భూములపై హక్కు లేదు. పట్టాలు లేవు. దుర్భర దారిద్ర్యంతో రైతుకూలీలు మునిగి తేలుతున్నారు. పండించిన పంటలను జమీందారులకు అప్పగించి పస్తులు పడటం, నానా కష్టాలకు లోనై బ్రతుకును సాగించే రైతుకూలీలను ఆదుకోవాలన్న జిజ్ఞాస, విజ్ఞానాన్ని అచ్చన్నలో కలిగించిన ఘనత ప్రొఫెసర్ రంగాగారికే దక్కుతుంది.

నాయకులు: ఆంధ్రా: ఒడి వెంకటరెడ్డి నాయుడు అట్రాడ కృష్ణమూర్తి, ప్రధాన రామన్న—అంతా టెక్కలి. పర్లాకిమిడి: దుకార రాజాన రెడ్డి, కన్నెపల్లి సత్యన్నారాయణ, బోయిన అప్పలస్వామి, లుకలాపు లక్ష్మణదాసు తండ్రి.

1922–23లో ఏర్పడిన మితవాదవర్గం ఢిల్లీ శాసనసభలో ప్రవేశించి పరిపాలనలో భాగస్వామ్యం అందితేనే మంచిదని భావించారు. నెహ్రూజీ తండ్రి మోతీలాల్ నెహ్రూ, C. R. దాస్ 1934లో స్వరాజ్యపార్టీని స్థాపించారు. దేశస్థాయి కాంగ్రెసుపార్టీలో ముఠాలు ఏర్పడినాయి. సిద్ధాంత విభేదాలు పొడసూపాయి. అతివాదవర్గం, మితవాదవర్గం.

అదేస్థాయిలో దేశమునందలి ప్రతి రాష్ట్రమున (ఆనాడున్నది 9 రాష్ట్రాలే) ఆ వర్గాలు ఏర్పడినవి. తమిళనాడు కాంగ్రెసులో రాజగోపాలాచారి వర్గం, శ్రీ సత్యమూర్తిగారి వర్గం, ఆంధ్రాకాంగ్రెసులో పట్టాభి సీతారామయ్య, ప్రకాశంగారు, రంగాగారు వర్గాలుగా ఏర్పడినారు.

కాంగ్రెసులో సోషలిష్టు ఫోరం ఏర్పడింది. జై ప్రకాష్ నారాయణ్, అచ్యుత పట్వర్ధన్, అశోకమెహతా, రామ్మనోహర్ లోహియా, పట్టం థానుపిళ్లె, ఆచార్య నరేంద్రదేవ్ దీనిని నడిపించేవారు.

1933 డిశంబరు నెల 24వ తేదీన గాంధీజీ అస్పృశ్యత మద్రాసు రాష్ట్రమున పర్యటన జరిపారు. ఆంధ్రరాష్ట్రమున కాకినాడ, రాజమండ్రి వఖల్లో ప్రసంగించారు. బారిష్టర్ కంచల వీరరాఘవస్వామి, బులుసు సాంబ మూర్తి సెంట్రల్ డెల్టా నాయకుడు కళా వెంకటరావు, టంగుటూరి ప్రకాశం పంతులు, నడింపల్లి సుబ్బరాజు ప్రభృతులు గాంధీజీకి స్వాగతం పలికినవా రిలో ఉన్నారు. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కొండా వెంకటప్పయ్య, చిక్కాల వెంకటరత్నం, పట్టాభి సీతారామయ్య, శ్రీమతి దుర్గాబాయి, తెన్నేటి విశ్వనాధం ఆనాటి కాంగ్రెస్ అతిరథ మహారథులు.

హరిజనోద్యమం, కిసాన్ ఉద్యమం రెండూ అతి తీవ్రస్థాయిలో జరుగుతున్న దినాలవి.

సంస్థానాల స్వరూపాలు :

బ్రిటిష్‌వారు మనదేశమునందలి సంస్థానాల్ని ఒక్కొక్కటి స్వాధీనం చేసుకున్నారు. డల్‌హౌసీ రాజ్యసంక్రమణ సిద్ధాంతం ద్వారా కొన్నిటిని, వెల్లస్లీ సైన్య సహకార పద్ధతి మేరకు కొన్నిటిని, దండించి దండయాత్రలు కొనసా గించి మరికొన్నింటిని తుదకు భారతదేశాన్నంతటిని తమ బ్రిటిషు సామ్రాజ్యంలో కలుపుకున్నారు.

సంస్థానాధిపతులు సామంతులయినారు. బ్రిటిషు వారికి కప్పములు చెల్లించే స్థితి గతులకు లోనయ్యారు.

బ్రిటిషు ఇండియాలో గవర్నర్లు పాలించే ప్రాంతాలు, సంస్థానాధిపతుల ప్రాంతాలు అను రెండువిధాలైన పరిపాలనా పద్ధతులు ఏర్పడినవి. బ్రిటిషువారు ప్రత్యక్షంగా పరిపాలన జరిపే వారు. సంస్థానాధిపతుల ప్రాంతాల సమస్యలు వేరు.

బ్రిటిషువారు పర్మినెంటు రెవెన్యూ సెటిల్‌మెంట్ పద్ధతిని ప్రవేశపెట్టి వారి తాబేదార్లు గవర్నర్లద్వారా అమలుపరచారు. అయితే అదేప్రభుత్వం సంస్థానాధిపతులకు వారి సంస్థానాల్లో గల రైతులపై శిస్తులు దస్తులు వసూలు చేసుకోవటం పూర్తి స్వతంత్రత నిచ్చింది. వీరికి కావలసింది వీరినుండి కప్పమును రాబట్టుకోవటమే. సంస్థానాధిపతులు, జమీందారులు అలా ఏర్పడినారు. ఉదాహరణకు బొబ్బిలి సంస్థానం, కురుపాం జమీందారీ రైతులనుండి శిస్తు దస్తులను వసూలుచేసుకోవటంలో రెండూ ఒకే రీతి నీతులను కలిగియున్న ప్పటికీ పాలకంగా రెండూ విభిన్నమైనట్టివి.

## రైతాంగ విద్యాలయాలు :

లచ్చన్న ఆ కార్యక్రమంలో ద్విగుణీకృతోత్సాహంతో పాల్గొనడం జరిగింది. అదే లక్ష్యాన్ని ఆశయాన్ని సాధించుకోవటానికి ప్రొఫెసర్ రంగా, రామినీడు వేసవి రైతాంగవిద్యాలయాలను తన స్వగ్రామం నిడుబ్రోలులో ప్రారంభించి రైతోద్యమంలో పాల్గొనదలచిన యువకులను విద్యార్థులను రాజకీయ నాయకులను పాల్గొనమని పిలుపునిచ్చారు.

ఆ సరికే 1930లో రి-సెటిల్‌మెంట్ సర్వే రావటం రైతుకూలీలనెంతగానో బాధపెడుతూ ఉండటం, జరుగుతున్నది. శిస్తులు రెండింతలు పెంచారు. అంతేగాక రి-సెటిల్‌మెంట్‌తో అదనంగా భూముల విస్తీర్ణత కూడా పెరిగింది. సాగుభూముల విస్తీర్ణత పెరిగితే ఆ భూములను వేరే రైతుల కివ్వడం శిస్తుదస్తులు వసూలు చేసుకోవడం ప్రారంభమైంది.

సర్వే సెటిల్‌మెంట్ కోర్టులు వెలిసాయి. రైతులు సంస్థానాలు కోర్టులకు వెళ్లడం జరిగింది. అయితే తీర్పు జమిందారులవైపే వచ్చింది. సంస్థానాధిపతుల భూముల శిస్తేగాక గవర్నమెంటు జరాయితీ భూములపై కూడ శిస్తుదస్తులను అమితంగా పెంచేవారు. 1930 నుండి శిస్తును నగదు రూపంగా చెల్లించే విధానం అమలులోనికి వచ్చింది. ఆ కాలంలో రైతు ఏకాస్తో కొద్దో పంటలను కళ్లజూచేవాడు తప్పించి కానీ పరక సంపాదించడం కలలోని మాట. వస్తువులకు కొనుగోలుధర ఏదిఉన్న జనాభా అత్యల్పము. అతిస్వల్పము. పుట్టెడు ధాన్యం అమ్మిన ఒకరూపాయి వచ్చేకాలం. పదికుంచాలు రాగులు ఒక రూపాయికు లభించేవి. వస్తుమార్పిడి చాలా వరకు ఉండేది. చాలవరకు గ్రామీణప్రజలు వస్తుమార్పిడిమీదే ఆధారపడి ఉండేవారు. కరెన్సీ నోట్లు రానికాలమది. వెండిరూపాయిలు చలామణీలో నున్న కాలం. దమ్మిడీలు, టోలీలు, ముక్కోనీలతో నిత్యదైనందిన జీవితం గడిచే నిరాడంబర యుగం.

జమీందార్లు రైతులను పట్టి పీడించడం రైతోద్యమానికి మంచి ఊపు నిచ్చింది. ఆ సరికే రైతు రంగా రైతోద్యమానికి పిలుపు నిచ్చియున్నారు. సంస్థానాధిపతులు క్రూరంగా రైతులను హింసిస్తూశిస్తుల్ని వసూలు చేస్తున్నారన్నది సర్వత్రా వినబడుతున్న సత్యం. ఉద్యమం అవసరమే.

ఈ నేపధ్యంలో పుల్లెల శ్యామసుందరంగారు బారువా వచ్చి లచ్చన్నను రైతు రంగా పెడుతున్న వేసవి రైతు విద్యాలయానికి వెళ్లి శిక్షణ పొందమన్నారు.

"శ్యామసుందరంగారూ! ఇదేమి విచిత్రమండీ! నేను రైతును కాను. మాకు భూములు లేవు.వ్యవసాయ రంగంలో నాకేమి అనుభవంలేదు. నేను రైతు విద్యాలయంలో శిక్షణ కోసం వెళ్లడమా?" లచ్చన్నగారు ఆశ్చర్యంగా అడిగారు. "రంగాగారు దేశస్థాయిలో కాంగ్రెస్‌నేత. వారు నడుపుతున్న విద్యాలయం రాజకీయాలను నేర్పక పోవడం ఏమిటి? పేరుకు రైతు విద్యాలయమైనా అచట బోధించేవి దేశీ రాజకీయాలే! రైతోద్యమం కూడ స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమేకదా! రంగాజీ కూడా అదే మనకు చెప్పారుగా! కాదనక నీవువెళ్లు. అవసరమైన ఖర్చువెచ్చాలను నేను సమకూర్చుతాను" శ్యామసుందరంగారు ఆప్యాయతతో చెబుతూ ఆదేశించారు. లచ్చన్నను అత్యున్నత వ్యక్తులలో నొకనిగా చేయటంలో శ్యామసుందరంగారు కనబరచిన ప్రేమాభావాలు చిరస్మరణీయములు లచ్చన్న గారే వాటికి మరచిపోలేనివి. వ్యక్తిలో ఎంతటి ఉత్సాహ ఉద్రేకాలున్నా వాటిని ప్రోత్సాహించి వెన్నుతట్టి లేపే వాళ్లుండిలి. ఆనాడే వ్యక్తి ఎందులోనైనా ముందంజ వేయగలడు.

లచ్చన్నగారు కాదనక రైతోద్యమ రాజకీయాలను నేర్చుకొనే విద్యార్థిగా గుంటూరు జిల్లా నిడుబ్రోలు వెళ్లారు. 'రామినీడు' రైతు విద్యాలయంలో చేరటానికి - తనవలే ఆనాడు అనేకులు ఆ విద్యాలయంలో చేరటానికి వచ్చారు. ఆ వేసవి రాజకీయ పాఠశాలకు రంగాజీ తన తాత పేరు పెట్టారు.

ప్రప్రధమంగా భారతదేశమున గల ఆంధ్ర భూభాగమున రైతు విద్యాలయాన్ని నడిపిన రంగాజీ ముందుగానే రైతోద్యమాన్ని నడిపించటానికి శిక్షితులయిన యువకులుండాలని భావించి యుంటారు.

1934లో వేసవిలో ఆ విద్యాలయం ఆనాడు ప్రారంభమైంది. రంగారు ప్రారంభకులు ఆ విద్యాలయములో చేరిన విద్యార్థులకు ఉపన్యాసాలివ్వటానికి రాజకీయాల్లో అనుభవం గడించినవారిని సిద్ధాంత రాజకీ

యాలను నడిపిస్తున్న వారిని రంగారావు ఆహ్వానించగా వచ్చారు. ఆరైతు విద్యాలయం పార్టీలకు అతీతమైనది. కేవలం రైతుల నుద్ధరించటానికి మనం అనుసరించవలసిన పద్ధతులు ఏమిటి? ఏ సిద్ధాంతముపై వీరికి రైతాంగాన్ని ఉద్ధరించాలి? రైతు విద్యాలయం కాంగ్రెస్ అధ్యక్షుడు బాబు రాజేంద్రప్రసాద్ – శిక్షణ పొందటానికి వచ్చిన రాజకీయ విద్యార్థులంతా వచ్చి ముందుకూర్చున్నారు. వేదికమీద నుండి రంగాలేచి శిక్షితులకు కొన్ని సూచనలను పాటించాలని కోరారు :

(1) 1. మీరు రైతాంగానికి ప్రజాసేవకు సిద్ధంగా ఉండాలి;
2. మీరు వివాహితులైనచో సంతాన నిరోధాన్ని పాటించాలి;
3. రైతుకూలీ ప్రజారాజ్యాన్ని స్థాపించటానికి సహకరించాలి, ఉద్యమించాలి;
4. ప్రతీ సంవత్సరం మే, జూన్ నెలలల్లో జరిపే వేసవి పాఠశాలకు విధిగా హాజరు కావాలి;
5. ఆల్ ఇండియా కిసాన్‌సభ ఆదేశించిన కార్యక్రమాల్ని తు.చ. తప్పక పాటించాలి;
6. హరిజనోద్యమంతో పాటు రైతోద్యమంవైపు దృష్టి సారించాలి;
7. భారత స్వాతంత్ర్య సమర రణరంగంలో నిత్యం దూకడానికి సంసిద్ధులై ఉండాలి.

(2) ఈ పాఠశాలలో ఆనాడు చేరి రాజకీయ పాఠాలను నేర్చుకొన్న ఆనాటి మన లచ్చన్న సహ విద్యార్థులు మాకినేని బసవపున్నయ్య, కందుల ఓబుల్‌రెడ్డి, పెద్దిరెడ్డి, తిమ్మారెడ్డి, బాలరెడ్డి వగైరాలు.

శ్రామిక జనరాజ్యం రావాలని కావాలని, ఒకనాటికి వచ్చితీరుతుందని కారల్‌మార్క్స్ సిద్ధాంతీకరించారు. ఏనాటికైనా శ్రామికులదే ఈ రాజ్యం; వేరొకరిది కాదు. శ్రమశక్తికి ఏనాటికైనా అధికారం వస్తుంది; వచ్చితీరుతుంది అని ఆనాడు ఉపన్యాసకునిగా వచ్చిన ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు డాంగే ఉద్ఘాటించారు. రంగాజీ అధ్యక్షత వహించారు. శిక్షకులందరూ విన్నారు. నోట్సు వ్రాసుకున్నారు.

మరొక దినమున ఉపన్యాసకునిగా వచ్చిన జై ప్రకాష్ నారాయణ ప్రొలిటేరియన్ డిక్టేటర్‌షిప్ శ్రామిక వర్గ నియంతృత్వము సమాజానికి

ఉపకరించదు. సమసమాజం కావాలి. సోషలిజం రావాలి. ప్రజానీకంలో గల వ్యక్తులు వారివారి ప్రతిభా సామర్థ్యాల మేరకు జీవనాలను పొందాలి తప్ప వారివారి అవసరాల మేరకు కాదు. లేనిచో వ్యక్తులలో చొరవ, ఉత్సాహం, స్వంత ఆస్తిపై ఉన్న మమకారం దెబ్బతిని జాతీయ ఆదాయాన్ని దెబ్బ తీస్తాయి. ఉత్పత్తి శక్తులు సన్న గిల్లుతాయి. సరిసమానావకాశాలు స్వేచ్ఛా, సమానత్వాలు సర్వులకు అందించే సోషలిస్ట్ సమాజం కావాలి; రావాలి" అని జయప్రకాష్ నారాయణ ఉద్ఘాటించారు. శిక్షకులు నోట్స్ వ్రాసుకున్నారు.

వేరొక దినమున వచ్చిన ఉపన్యాసకుడు పుచ్చలపల్లి సుందరయ్య కారల్‌మార్క్స్ సమాజాన్ని రెండువర్గాలుగా విభజిస్తూ వచ్చారు. యజమానుల బారినుండి ఆధునిక యుగంలో పెట్టుబడిదార్లు, కార్మికులు వర్గ విభజన ఇంతకన్నా శాస్త్రీయంగా చేయడం వేరొకరికి సాధ్యపడనిది. ప్రపంచంలో కనరానిది, వినరానిది. అందువలన ఈ సమా.ంలో పీడించేవారు, పీడించబడేవారు, దోపిడీ చేసేవారు, దోపిడీకి గురి కాబడినవారు ఉంటారు. అంతే తప్పించి మరల మనం కొత్తగా సమాజాన్ని వర్గీకరించడం, రైతులను పేర్కొనడం సమంజసం కాదేమో అని సుందరయ్య ఉపన్యాసం కొనసాగింది. శి క్షకులు నోట్సువ్రాసుకున్నారు.

మాగంటి బాపినీడు, ఆంధ్రకేసరి ప్రకాశం, పట్టాభిసీతారామయ్య, గాడిచర్ల హరి సర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు మున్నగు కాంగ్రెసు నేతలు వచ్చారు. వేసవి పాఠశాలలో, తమ సిద్ధాంతాలను వివరించటానికి రంగాజీ పిలుపుపై సామ్యవాదం పెట్టుబడిదారీ విధానం ఆచరణలో రెండూ విఫలమవుతాయి. దేని అవలక్షణాలు దానికున్నాయి. మన భారదతదేశానికి అనుగుణమైన రాజకీయ సిద్ధాంతాన్ని మనం అన్వయించుకోవాలి. మనది గ్రామీణ భారతి. సామ్యవాద సమాజంగాక సామ్యవాద తరహా సమాజాన్ని మనం ఏర్పరచుకోవాలి. మిశ్రమ ఆర్థిక వ్యవస్థే మనకాధారం. ఇదే ధనిక నిర్ధనిక వ్యత్యాసాల్ని తుడిచిపెట్టించాలి. సమానావకాశాల్ని సర్వులకు ప్రసాదించాలి. దళిత జనాలను గిరిజనుల, హరిజనుల నుద్ధరించే ప్రత్యేక కార్యక్రమాలను ప్రభుత్వం తీసికొని సంక్షేమ రాజ్యాన్ని స్థాపించాలి. అంటూ ముగించారు కాంగ్రెసునేత. విద్యార్థులు నోట్ చేసుకున్నారు.

ఆ రైతు విద్యాలయానికి రంగా పిలుపుపై రాజనీతి సిద్ధాంత కర్తలు రాజనీతి విజ్ఞానులు, రాజకీయ నియకులు వస్తూనే ఉన్నారు. వీరు చెప్పిన

సిద్ధాంతాలనందలి ముఖ్యాంశాల్ని విద్యార్థులు గుర్తిస్తున్నారు. లచ్చన్నగారు ప్రత్యేకాభిరుచిని ప్రదర్శిస్తూ ఒకగ్రంథంపై ముఖ్యులు చెప్పిన విషయాలను వ్రాసుకొనేవారు. కారణం రంగాగారు ముందే వీరికి చెప్పియున్నారు. వివిధ రాజనీతిజ్ఞులు, రాజకీయ నాయకులు చెప్పిన వషయాలను బహిరంగంగా అందరి ఎదుట చర్చించబడతాయి. ఆ చర్చలో ప్రతి ఒక్క రాజకీయ విద్యార్థి తప్పక పాల్గొనాలి. తన అభిప్రాయం చెప్పాలి.

దేశంలో గల ఆనాటి ప్రముఖ రాజకీయ నాయకులు ఆ వేసవి పాఠశాలకు విచ్చేసేవారు. రంగాగారు అఖిలభారత స్థాయిలో కిసానుసభను స్థాపించిన రాజకీయవేత్త, సిద్ధాంతవేత్త. నరేంద్రదేవ్, రామ్మనోహర్ లోహియా, మద్దూరి అన్నపూర్ణయ్య ప్రభృతులు వచ్చి ఆ పాఠశాలలో ప్రసంగించిన వారిలో నున్నారు. ప్రసంగాల తదుపరి రంగాగారు శిక్షితులకు సమన్వయం చేస్తూ ప్రసంగించేవారు. తన సిద్ధాతాలలో రైతాంగ విద్యాలయంలో ఉపన్యాసకులిచ్చిన విషయాలు సిద్ధాంతరీత్యా విభిన్నమైనవి. ఒకరు ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తే మరొకరు దీనిని ఖండిస్తూ మాట్లాడినారు మరి సమన్వయం ఎలా? వేసవి పాఠశాల విద్యార్థుల ప్రశ్న.

"ఆ సమన్వయాన్ని సాధించటానికి మీ ఎల్లరిని ఇచ్చటకు పిలవటం జరిగింది." అన్నారు రంగా. వివిధ సిద్ధాంతాల మధ్య సమన్వయం అంత తేలిక అయిన విషయంకాదు. మీరు విద్యార్థులుగా చేయవలసిన పనికాదు. అయితే ఏ సద్ధాంతం ఆచరణలో మంచి ఫలితం యివ్వగలదో, ఏ సిద్ధాంతం చెడు ఫలితం యివ్వగలదో మీరు చెప్పినట్లు ఏ ఒకరు ప్రజలకు దూరంగా ఉంటూ సిద్ధాంతాల్ని రూపొందించినవారు చెప్పజాలరు.

అందువలన చర్చ పెడుతున్నాను. ప్రతి ఒకరు లేచి, మీమీ అభిప్రాయాలను ఆయా సిద్ధాంతాలపై తెలపండి. ఆచరణలో అవి ఏ మాత్రం ఉపకరించగలవో చెప్పండి. అనడమే తరువాయి లచ్చన్న లేచి వేదికపైకి లంఘించారు. లచ్చన్నగారు ప్రసంగిస్తుంటే ప్రసంగం జలపాతం ప్రవహిస్తున్నట్లయింది. కంఠంలో వేయి గంభీర గర్జనలు ప్రస్ఫుటమవుతూ ఉంటాయి. కరుకయిన విషయాలను కఠినమైన సత్యాలను అలవోకగా తీయని తెలుగు మాటలతో తేటతెల్లమైన పదజాలంతో చెప్పగలదిట్ట. తనొక విషయం చెప్పాలన్నా ముందుగనే భావం పరుగెత్తుకుంటూ పోతుంది. యుక్తి చమత్కృతి

అందుకు తోడై ముందుపడతాయి. ఆయన ప్రసంగాలు అమృతఝరీ ప్రవాహంలా కొనసాగుతూనేఉంటాయి. అక్షరం ముక్కరాని రైతులను అమాయక ప్రజలను మూఢనమ్మకాలతో మూలపడి మూల్గుతున్న సమాజాన్ని తట్టిలేపటానికి అతనికున్న ఆయుధాలివే. విన్నవారికి హాయిహాయి అనే ఆహ్లాదాన్ని కలిగిస్తూనే ఉంటాయి. లచ్చన్న మధ్యమధ్య విసిరిన చమత్కారాలు చమత్కృతులు, సామెతలు, వ్యంగ్యాలు, హాస్యోక్తులు, సభికులను ఎంతగానో ఆకట్టుకుంటాయి.

తనకు సభాస్థలినే కాదు ఎవట మాట్లాడిన భయమన్నదే ఎరుగని సహజ సిద్ధమైన మాటకారి. ప్రసంగాల్లో వినయవిధేయతలు ఉట్టిపడుతూంటాయి. ప్రత్యర్థుల హృదయాల్లో అగ్నిజ్వాల ఎగిరి పడుతుంటాయి. అందుకే లచ్చన్న అందరినీ ఆకర్షిస్తాడు.

వేదికపై ప్రసంగిస్తున్న లచ్చన్నను తదేక దృష్టితో పరిశీలించిన రైతురంగా సభాముఖంగానే ఆతని వచో నైపుణ్యాన్ని సిద్ధాంతావగాహనను మెచ్చుకున్నారు. సభానంతరం లచ్చన్నను దగ్గరగా పిలిచి ప్రత్యేకంగా ఊరుపేరు అన్ని విషయాలనడిగి భుజంమీద చేయివేసి "శభాష్ ! నాకు తగిన అనుచరుడవే" అన్నట్లు భుజం తట్టి దీవించారు. రంగాగారు ఆనాడు ఇచ్చిన దీవెన ఆశీస్సులే లచ్చన్న జీవితంలో మార్పులను తెచ్చిపెట్టి విప్లవాగ్ని జ్వాలలను ఒకవైపు తెల్లదొరలపై చూపిస్తూనే వేరొకవైపు రైతులను పట్టి పీడిస్తున్న జమిందారీ విధానంపై సంస్థానాధిపతులపై ప్రసరించేటట్లు చూసాయి.

రంగాగారు పాఠశాల ముగింపు సమావేశంలో అన్ని సిద్ధాంతాలను సమన్వయపరుస్తూ శిక్షితులకు వారి మనసులను ఉద్వేగపరిచేలా, ఉత్తేజపరిచేలా త్రికరణశుద్ధిగా నమ్మేలా చెప్పారు. తన సిద్ధాంతం రైతుకూలి ప్రజారాజ్య స్థాపన అని తేల్చారు. శ్రామికవర్గ నియంతృత్వం మన సమాజానికి పరిపడదని నిర్ధారణపరచారు. 1933లో ప్రారంభించిన శిక్షణా శిబిరం ముగిసింది.

రంగాగారు రైతు విద్యాలయాన్ని నడపడం, అభివృద్ధి నిరోధక చర్య అని కమ్యూనిస్టులు రంగా సిద్ధాంతంపై దాడిచేశారు. శ్రామికులను, రైతులను

కూలీలని (కార్మికులు)పునర్విభజించడం కమ్యూనిష్టు ఉద్యమాన్ని నిర్వీర్యం చేసే ఎత్తుగడ అని ప్రచారం చేయడం ప్రారంభించారు. రంగా భూస్వామ్య విధానాన్ని పునరుద్ధరిస్తున్నారని, భూమిపై రైతుల పట్టాలిప్పిస్తూ భూమిపై ఆధార పడి పట్టాలు లేని కూలిజనాన్ని సృష్టిస్తున్నారని విమర్శలు ప్రారంభమైనాయి.

అయినా రంగా తను నమ్మిన సిద్ధాంతానికి కట్టుబడి నిలిచారు. రైతుకూలి ప్రజారాజ్యం కావాలని ఉద్ఘోషించారు. ఆనాడు రఃనాటికి సోషలిష్టు తరహా సమాజమే కావాలని, రావాలని ఆశిస్తున్నారు.

రైతు విద్యాలయంలో శిక్షణపొందిన రాజకీయ విద్యార్థులు రాష్ట్రం నలుమూలలనుండి వచ్చినవారు. రంగా అందించిన రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని తమతో తీసికొని వెళ్లి ప్రచార రంగంలోనికి దుమికారు.

లచ్చన్న బారువాలో పుల్లెల శ్యామసుందరరంగారు న్యాయపతి నారాయణరావుగారిని కలసి తన భవిష్యత్ కార్యక్రమాన్ని చెప్పారు. రంగాజీ కార్యక్రమం వివరిస్తారు. కాంగ్రెస్ నాయకత్వం కూడా లచ్చన్నకు అండగా నిలవటానికి అంగీకరించింది. ఇక రైతు సంఘాల ఏర్పాటు జమిందారీ-రైతుల పోరాట ఉద్యమం ఉత్తరాంధ్రలో ఉద్యమించింది.

14 వ ప్రకరణము :

# ఉత్తరాంధ్రలో జమిందారీ విధానం – పుట్టుపూర్వోత్తరాలు

## ఆంధ్రుల గత చరిత్రాధారాలు శిలాశాసనాలు, ప్రాచీన లిఖిత గ్రంధాలు – జనశృతి

క్రీ.పూ. ఒకటి రెండు శతాబ్దాల కాలంలో శాతకర్ణి సమకాలికునిగా కళింగ భూమి నేలిన ఖారవేలుడు భావించబడినట్లు నానీఘాట్ శిలాశాసనం మనకు తెలిపింది. శాతవాహనులు మన తాతలు కాదనలేం. కాకతీయులకు మనం వారసులమే. ఇదే ఆంధ్రుల చరిత్రలో అక్షరాలలో లిఖించబడింది.

ప్రాచీన చరిత్ర నేటికి వివాదగ్రస్తముగనే ఉంది. ఆంధ్రులు ఆర్యు లని కొందరు, అనార్య జాతులకు చెందినవారని మరి కొందరు నిర్ధారణ పరచారు. క్రీ.పూ. 221-1981 నుండి క్రీ.శ. 1565 వరకు శ్రీకృష్ణదేవ రాయల పరిపాలనాంతం వరకు ఆంధ్రలో అనేక రాజరికాలు పరిపాలనను వెలగబెట్టాయి. మొగలాయిల కాలంలో పరిపాలనలో చాలా మార్పు లొచ్చాయి. పర్షికాలమున మండలాలు ఏర్పడ్డాయి. సైనిక ఖర్చులక్రింద కొన్ని ప్రాంతాలు కొంతమందికి దఖలు పరచడం జరిగింది.

శ్రీముఖుడు – కృష్ణ, శాతకర్ణి – శాతకర్ణి (II), హాలుడు, గౌతమీపుత్ర శాతకర్ణి, శాతవాహనరాజులు, హాలుడు, హాలుడు (II), రుద్రదేవుడు, మహా దేవుడు, గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు, కాకతీయరాజులు, వారైనా, వీరైనా చేసిన ఘనకార్యాలు, సంస్కృత భాషలో గ్రంథాల్ని రచింపజేసారు. వర్ణాశ్రమధర్మాల్ని కాపాడటానికి కంకణం కట్టుకున్నారు. గాదాసప్తసతిని హాలుడు రచించాడు. గుణాఢ్యుడు పైశాచిక భాషలో బృహ త్కథను రచించాడు.

ఇక ఆంధ్రభాషా రచన జరగడం కాకతీయుల కాలంలో తెలుగు కవిత పరవళ్ళు త్రొక్కడం కవిత్రయంవారి భారతం తెలియటం తెలుగులో

వరి కాలములోనే అందరికి సుభోధకంగా వర్ణాశ్రమధర్మాలను బోధించటానికి అనుసరింప చేయటానికి, తాత్వికధార్మిక, నైతిక విషయాలను ప్రభోధించటానికి ఒకనాటి సామాజిక స్థితిగతులను సమకాలీన సమాజము నందు గ్రంథబోధన ద్వారా నెలకొల్పటానికి నీతిశాస్త్రం, బసవపురాణం, సుమతిశతకం ఈ కోవకు చెందినవే.

శాతవాహనులు వైదిక మతవిశ్వాసమును కలిగియుంటూనే ఇతర మతాల నాదరించేవారు. బౌద్ధ, జైన మతాలను అభినందించారు. అయిన ప్పటికీ వర్ణాశ్రమ ధర్మములనే పాటించారు.

ఇక శ్రీకృష్ణదేవరాయల కాలంలో తెలుగుభాషకు కవితకు స్వర్ణా భిషేకం జరిగింది. కవులను అష్టదిక్పాలుర స్థాయికి గొనిపోయి అష్టదిగ్గజము లని పేరిడి కృతులను అంకితం తీసికొని తన శాశ్వత కీర్తిప్రతిష్టలకు నాందీ వాక్యం పలికారు. తనే ఆముక్తమాల్యద అను గ్రంథాన్నికూడా వ్రాశారు.

ఆముక్తమాల్యదలో రైతుల పరిస్థితిని శ్రీకృష్ణదేవరాయులు ముచ్చ టించారు. రాజ్య సుస్థిరతకు వారు అవసరమని రాజుగారు గుర్తించినట్లుంది.

అంతవరకు ఏ గ్రంథమున "ప్రజల సుఖశాంతులతోనుండిరి" అని అయ్యవారి దీవనలా ప్రవచించడమే తప్పించి ఏ ప్రజలు అన్నది నిర్ధారణ పరచలేదు.

నాల్గువర్ణాలవారు వర్ణాశ్రమ ధర్మాల మేరకు సుఖశాంతులతో నుండి రనే మనం అర్థం చేసుకోవాలి. అయితే ఆనాటికి కృషి, గోరక్ష, వాణిజ్యం, వైశ్యకర్మ, స్వభావజం, అన్న గీతావాక్యం మేరకు ఆధునిక చారిత్రిక యుగము నాటికి వైశ్యుల వర్ణాశ్రమధర్మంగా పై నుదహరించిన కృషిని చేసినదొక వర్ణం. వాణిజ్యం వ్యవహారాలు జరిపేదింకొక వర్ణం అన్నది బాగానే ఏర్పడిపోయినది. 'పరిచర్యాత్మకం శూద్రం కర్మస్వ భావజమ్' అన్నదిగాక పరిచర్య లొనరించుటే శూద్రకర్మలగా కృషిచేశాయడం, గోవులను సంరక్షించడం వీరి ముఖ్య విధులుగా మారాయి. అగ్రవర్ణాలవారికి సేవలొనరిస్తూనే వీటిపై వీరికి పట్టుకలిగి బానిస యజమానులుగా రూపొందారు.

శాతవాహనుల కాలంలోనే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులతోపాటు సమన్వయం అంతకంతటికీ విశ్లేషణం చెందడం వలన

మరికొన్ని జాతులవారు వర్ణాలవారు ఏర్పడటానికి అవకాశం యిచ్చింది. క్షత్రియులకు అమాత్యులు కావలసి వచ్చారు. వారికి దండనాధులు తదుపరి రాజభటులు, వెలసారు. అధికార మధ్యతరగతి ప్రజానీకానికి బీజాలు ఏర్పడతాయి. పాలనలో వివిధ రాచరిక పదవులు సృష్టించ బడినాయి. లేఖకుల పదవులు సృష్టించబడియు.

నిర్జనారణ్యాలు అటవీ ప్రాంతాలు నదీమైదానప్రాంతాలలో జన బాహుల్యం విస్తరిస్తున్న కొద్దీ సమాజావసరాల్ని తెచ్చే వర్తక వాణిజ్య సంఘాలు ఏర్పడ్డాయి.

తదుపరి లేఖకులు సువర్ణకారులు, వైద్యులు ప్రతిఒకరికి అందు బాటులో ఉన్న వ్యక్తులు. కొందరికే తప్పించి అందరికీ అందని నైపుణ్యం, ప్రావీణ్యతగల వ్యక్తులవారు వెలసారు. బలియమైన మూడవ వర్గంగా రూపొందారు.

సమాజమున గల నాల్గవ వర్గం వర్ణం వ్యావసాయకభూముల్లో నున్నవారు, చేపలవృత్తిలో నున్నవారు, మంగలి, చాకలి, ఎరుకలి మొదలగు బానిస సమాజం అభివృద్ధి చెందుతున్న కొద్దీ వీరుకూడ సంఖ్యలో పెరుగుతూ వచ్చారు.

సమాజమీ విధంగా బహుముఖస్థాయిలో పెరుగుతూ, అభివృద్ధి చెంద టానికి అనేక కారణాలుండాలి. ఒక్క అధికారం సమాజాన్ని తీర్చిదిద్దలేదు. అంతకుమించిన విశ్వాసం, నమ్మకం ఉన్నవాని సమాజం మనగలగలేదు, కొనసాగలేదు. అందువలననే వర్ణాశ్రమధర్మాలు, మతవిశ్వాసాలు సమాజంలో వెలసాయి. వీటిని పెంచి పోషంచటానికే అర్హతలున్నవారు కేవలం వివేకాంశ గలవారే. వారినే ఆదినుండి బ్రాహ్మణవర్గంగా పిలవబడుతూ వచ్చారు.

కాకతీయుల కాలంలో జైన మతం ప్రభవించింది. తదుపరి శైవం విజృంభించింది. మల్లికార్జున పండితారాధ్య శైవమతాన్ని వ్యాప్తికి తోడ్పడినారు. ఆంధ్రదేశమన్నది బాగా ఋజువు పడింది. శైవ దేవాలయాలు, జైనమతాలు వ్యాప్తిని పొందాయి.

కాకతీయుల కాలంలో వ్యవసాయం అభివృద్ధిచెందిందని వ్రాశారు. పెలియేళ్ళను, చెరువులను, నూతులను మరమ్మత్తుచేసే పని ప్రారం భించారు. బంజరులకు సాగులోనికి తెచ్చే ప్రయత్నం కూడా జరిగింది.

విజయనగర సామ్రాజ్యం పతనమైన తదుపరి ఆంధ్రప్రాంతం ముస్లింపాలనలోనికి వెళ్లింది. ఇక 17, 18 శతాబ్దాలలో విదేశీయుల రాక ప్రారంభమైనది. పోర్చుగీసువారు ప్రథమంగా, తదుపరి ఆంగ్లేయులు మన దేశం వర్తక వ్యాపారాల్ని, జరపటానికి వచ్చారు. ఆంగ్లేయులకు, డచ్‌వారికి సంఘర్షణ ప్రాంభమైనది.

1635లో లండన్ వర్తకులు బ్రిటిష్ రాజు చార్లెస్‌నుండి అనుమతిని పొంది ఇండియాలో సర్ విలియమ్ కార్టీన్ అధ్యక్షతన ఒక కంపెనీ రూపొందింది. ఇదే 1698లో తూర్పు ఇండియా కంపెనీ రూపొందింది. తదుపరి యావత్ భారతదేశాన్ని ఆక్రమించింది.

మౌర్యుల పరిపాలనాకాలంనుండే ఆంధ్రుల చరిత్రకు లిఖిత సాక్ష్యాధారాలు లభిస్తున్నాయి. ఇండికా అను గ్రంథంలో మెగస్తనీస్ ఆంధ్రులను గూర్చి ప్రస్తావించారు. మౌర్యుల పాలన అంతంలో శాతవాహనుల రాజ్యం ప్రారంభమైనది. నిజానికి క్రీ.పూ. 268 ముందే శాతవాహనుల పాలన కొనసాగింది.

ఇక పౌరాణిక గాధలోనికి అడుగిడితే ఐతిరేయ బ్రాహ్మణలో క్రీ.పూ. 1000 సం.ల క్రిందట ఆంధ్రులు ప్రస్తావించబడినారు. ఇకమన భారతంలో కౌరవ పక్షం ఉన్నవారు ఆంధ్రులని ప్రతీతి. జనశృతి, పౌరాణిక గాధ. ఇక మత్స్య వాయుపురాణాల్లో రాజుల కథలు ప్రస్తావించ బడినాయి.

పై తెలిపిన చారిత్రిక పౌరాణిక ప్రస్తావనలు ఎలాఉన్నా, కోస్తా ఆంధ్రప్రదేశ్‌లో లచ్చన్న జన్మించిన గడ్డపయి అసంఖ్యాక జమిందారీలు వెలసాయి. రాజులు ఒకే తెగకు చెందినవారుగా చెప్పుకుంటున్నా వారిరువురి పుట్టుపూర్వోత్తరాలు ఒకటిగా లేవు. ఈ జమిందార్లలో మూడురకాల వాళ్లున్నారు. త్రివిధమైన జాతులు కోస్తా ఆంధ్రాలో జమిందార్లుగా మన గలుగుతూ వచ్చారు.

కృష్ణానదీ తీరప్రాంతమున వెలసిన వెలమ నాయకులు (ఉదా : బొబ్బిలి సంస్థానం)

ఉత్తర (గోదావరీ పర్వత ప్రాంతాలలో వెలసిన రాచరికాలు ఉదా : విజయనగర (రాజులు)

శ్రీకాకుళం జిల్లాలో గణపతి సామ్రాజ్యం అంతరించిన తదుప

వెలసిన ఒరియా నాయకులు (ఉదా : కురుపాం ఎస్టేట్).
జమిందారీలు సైనిక శక్తిని కూడ కలిగి ఉంటాయి. జమిందారీకి సేవకవర్గం ఉండేది. వీరికి నగదు రూపేణా జీతాలు చెల్లించేవారు.
జమిందారులు "మొఖాసా" దారులను ఏర్పరచి వారికి కొంతభూమిని జీతభృత్యాల క్రింద ఇచ్చేవారు. వీరు అజమాయిషీ చేసిన ప్రాంతాలను మొఖాసాలాగా పిలువబడతాయి.
సాంవత్సరిక భృతిపై యుద్ధాలు అనివార్యమైనపుడు వచ్చి పాల్గొనే సాయుధ రైతాంగం.

ఉత్తర సర్కారులున్న భూములు రెండు విధాలుగా వర్గీకరించబడినవి.

(1) జమిందారీ భూములు, (2)ప్రభుత్వ భూములు ఉత్పత్తిలో 1/8 వంతు శిస్తు చెల్లించుట, భూమిపై రైతులకు యాజమాన్యం లేరు, హక్కులేదు.. రైతాంగాన్ని దోపిడిచేసి పిల్చిపిప్పి చేసుకొనే రీతి నీతులను జమిందార్లు పాటించడంవల్లనే తుదకా విధానం రద్దు కావలసిన పరిస్థితి ఏర్పడింది. రైతోద్యమాలు లేచాయి.

శిస్తుతో పాటే (custom) సుంకాల్ని కూడా జమిందార్లు వసూలు చేసేవారు. దీనికి తోడు ఇతర విధాలైన పన్నుల వడ్డింపులూ ఉండేవి.

ఆంధ్రదేశములోని వివిధ జమిందార్లు – రాజులపాలనలోనున్న భూభాగాల్ని తన వశంచేసుకోవటానికి తూర్పు ఇండియా కంపెనీకి సుమారుగా 50 ఏండ్లు పట్టింది. కోస్తా జిల్లాల్లోనున్న స్థానికి జమిందారీ వర్గం తూర్పు ఇండియా కంపెనీని ఎంత ప్రతిఘటించినా తుదకు లోకువవక తప్పలేదు.

గంజాం జిల్లాలో గల గుంసార్ (gumsur) పర్లాకమిడి జమిందార్లు తూర్పు ఇండియా కంపెనీని సర్వవిధాలా ప్రతిఘటించారు. ప్రస్తుత మీ ప్రాంతాలు ఒరిస్సా రాష్ట్రంలో నున్నవి. లచ్చన్న పుట్టిన ప్రదేశాలకు దగ్గరగా.

విశాఖజిల్లాలో గట్టి ప్రతిఘటన తూర్పు ఇండియా కంపెనీకి విజయనగరం మహారాజా నుండి వచ్చింది. విశాలమైన జమిందారీ ప్రాంతం గలది. ఈ సంస్థానం విశాఖ రాజమండ్రి నుండి ఫ్రెంచివారిని తరిమి కొట్టి [illegible] ఆనంద గజపతిరాజుకు లభిస్తుంది. ఇతని తరువాన వచ్చిన

విజయరామరాజు 1760 నుండి 1794 వరకు పాలించారు. అన్నదమ్ముల తగాదాలలో కంపెనీ డైరక్టర్లు విజయరామరాజుకు తోడుగా మన్న బ్రిటిషు వారికి చెల్లించవలసన పేష్కష్ (pescush) చెల్లిచలేక బకాయి పడినందున ఈతనిని పదవినుండి తొలగించినారు. పెన్షన్ ఇస్తూ జమిందారీని స్వాధీనపరచుకొన్నారు. 1793 ఆయష్టు నెల 2వ తేదీన విజయనగరం పోర్టును ఆక్రమించారు. విజయనగరం సంస్థానాన్ని మూడు రెవెన్యూ జిల్లాలుగా విభజించి అధికరులను నియమించాగా దీనిని సహించని విజయరామరాజు ఆంగ్లేయులను ధిక్కరించి యుద్ధానికి సిద్ధమైనా, తుదకు అపజయానికి లోనై ప్రాణాల్ని పోగొట్టుకోవడం జరిగింది.

అయితే తన 8 ఏండ్ల వయస్సుగల వారసుడు నారాయణబాబును వైజాగ్ జిల్లాలో గల మక్కువ ప్రాంతం పర్వతాలలో రక్షణ పొందటం జరిగింది. ఆదిమవాసులు పెద్దలు ఉదారపరులు ఈ తని రక్షించదలచిరి. కొండప్రాంతంపై దండెత్త దలచిన కంపెనీ మరల తన మనస్సును మార్చుకొని మధ్యవర్తిగా సంప్రదింపుల కంగీకరించి రావలసిన 50 లక్షల బకాయి పేష్కష్‌తో సహా కప్పం చెల్లించే అంగీకారం మేరకు నారాయణబాబుకి ఎస్టేటును అప్పగించడమైనది.

1802లో శాశ్వత పన్ను విధానం (పర్మినెంట్ రెవిన్యూ సెటిల్‌మెంట్) అమలులోనికి వచ్చి విజయనగర జమిందారులు సంవత్సరానికి 6 లక్షల పేష్కష్ చెల్లించవలసినదిగా నిర్ణయించారు. దీనివలన కంపెనీ ప్రభుత్వానికి సుస్థిరమైన ఆదాయం లభించింది. జమిందర్లుని స్వేచ్ఛగా తమ భూములపై శిస్తులు విధించి వసూలు చేసుకొనే హక్కు లభించింది.ఇతర కోస్తా జిల్లాల్లో కూడ జమిందారులు ఎదురు తిరగడం తుదకు ఆంగ్లేయ పాలనకు లోబడి ఉండటం జరిగింది.

19వ శతాబ్దం ప్రధమార్ధమునకు ఆంధ్రలో కంపెనీ తన ఆధిపత్యాన్ని సుస్థిరం చేసుకున్నది. ఆంధ్రప్రాంతాన్ని వివిధ జిల్లాలుగా మరల, పునర్విభజించింది. రెవెన్యూ వసూలు కలెక్టర్ ముఖ్య బాధ్యతగా ప్రకటించింది. కోస్తా ఆంధ్రప్రాంతం 5 జిల్లాలుగా విభజించబడింది. (1) గంజాం, (2) విశాఖపట్నం, (3) గోదావరి, (4) కృష్ణా, (5) నెల్లూరు. జిల్లా పరిపాలకునిగా కలెక్టరును రూపొందించారు. రయలసీమ ప్రాంతమంతా ఒకే జిల్లా కలెక్టర్ పరిపాలనలో నాడుండేది.

కంపెనీ కొత్తగా స్వాధీన పరచుకున్న భూభాగములనుండి సుస్థిర మైన రెవెన్యూ ఆదాయం పొందాలన్న ఉద్దేశంతో రెండు విధాలైన విధానాలను అమలునందుంచింది. (1) జమిందారీ విధానం, (2) రైత్వారీ విధానం. కోస్తా ప్రాంతంలో అధిక సంఖ్యలో జమిందార్లున్నందున కంపెనీ జమిందార్లకే రైతులనుండి శిస్తుదస్తులను వసూలు చేసుకొనే హక్కును దఖలుపరుస్తూ వీరినుండి ఏక మొత్తంగా పన్ను పెష్కష్ రూపంలో ప్రతీ వత్సరం తను పొందే విధానాన్ని రూపొందించింది. ఇదే జమిందారీ విధానం. అయితే రాయలసీమ ప్రాంతంలో జమిందార్లు అంతగా లేనందున రైత్వారీ విధానాన్ని అమలుపరచి ప్రభుత్వమే రైతులనుండి నేరుగా శిస్తుదస్తులు వసూలు చేసే విధానంను ప్రకటించింది. భూమిపై రైతుకు హక్కు కలిగించి రైతు ప్రభుత్వానికి శిస్తు చెల్లించేవారు. మధ్యవర్తి (జమిం దారు) ఇచటలేడు. ఇదే రైత్వారీ విధానము.

ఇందులో ఏ విధానం మంచిదని చెప్పడంకాదు. ఒక విధానం వలన రైతులకు భూములపై హక్కులేదు. బానిసలుగా జీవించాలి. వేరొక విధానంలో భూమిపై హక్కు ఉన్న భూకొలతలు సరిగా ఆనాడు లేనందున సరిహద్దులు సరిగా తెలియబడనందున భూముల్లో తరాలవారీ నిర్ణయింప బడనందున రైతాంగం ఆ విధానం వలన ఎంతో నష్టపోయేది. కంపెనీ పాలన అంతమై బ్రిటిషు పాలన వచ్చిన తదుపరి భూములకు సర్వే జరిగింది. వర్గంవారి భూముల వర్గీకరణ జరిగింది. భూమిపై యాజ మాన్యం హక్కు ఈ విధానంలో రైతు కలిగియుండేవారు. భూస్వామిగా పిలవబడేవారు.

ఆంగ్లేయుల పరిపాలనలో సమాజపరంగా అనేక మార్పులు చేర్పులు జరిగాయి. బ్రిటిషు వారు రాజకీయ, ఆర్థిక, సాంఘిక విషయాల్లో జోక్యం చేసుకుంటున్నారన్నది భారతీయులలో ప్రబలి తుదకిది కంపెనీ పాలనకు స్వస్తి వాక్యంపలికి బ్రిటిషు రాచరికానికి మార్గం ఏర్పరచింది. తుది ఫలితం విక్టోరియా మహారాణి ప్రకటన :

1. మా రాచరికానికి, లోబడిన రాజవంశీకులకు, వారి భూభాగాలకు మా రక్షణ ఉంటుంది.
2. మతవిషయాల్లో జోక్యం చేసుకోము.
3. ప్రభుత్యోగులుగా హిందువులను నియమిస్తాం ;

4. ప్రజా సంబంధమైన పనులనె నిర్వహిస్తాము, పరిశ్రమలను స్థాపిస్తాము.

ఇంతవరకు మా హక్కులు పోయాయని వాపోతున్న హైందవ రాజులు మరల విజృంభించారు. బ్రిటిషు ప్రభుత్వం వారు వీరి పరిపాలనా వ్యవహారాల్లో జోక్యం చేసుకోము అని హామి ఇచ్చింది కదా ! బ్రిటిషు వారికి పేష్కుత్‌ను మాత్రం చెల్లిస్తే సరిపోతుంది.

బ్రిటిషు ప్రాంతాలు అని ఆక్రమిత ప్రాంతాలు అని రెండుగా ఇండియా విభజించబడింది. బ్రిటిషుప్రాంతాలపై బ్రిటిషు ప్రభుత్వమే ప్రత్యక్షంగా పరిపాలనకొనసాగించేది. ఆక్రమిత ప్రాంతాల్లో అధికారం రాజులు, జమిందారులది. పరిపాలనలో జోక్యం చేసుకోవటానికి వీలు పడదు. విక్టోరియా రాణి ప్రకటించిన హక్కుల పత్రంలోనిదిది.

బ్రిటిషు రాచరికం పరిపాలనలోనికి వచ్చిన ఆంధ్రభూమిలో 1856 సంవత్సరానికి 8 జిల్లాలుగా మద్రాసు ప్రెసిడెన్సీలో ఏర్పడినాయి.

మద్రాసు ప్రెసిడెన్సీకి ఉత్తర దిశగా చివరనగల జిల్లాయే గంజాం. ప్రస్తుతం ఇది ఒరిస్సా రాష్ట్రంలో ఉంది. 1766లో చికాకోల్ సర్కార్ ప్రాంతం బ్రిటిష్ అధికారంలోనికి వచ్చింది.

భౌగోళికంగా ఈ జిల్లా పర్వతప్రాంతాలుగాను, మైదాన ప్రాంతాలు గాను విభజింపబడింది. ఆదిమ తెగలున్న కొండప్రాంతాలను ఏజన్సీ ఏరియాగా పిలవ బడుతూ వస్తున్నది.

రాష్ట్ర గవర్నర్ ప్రతినిధిగా ఏజన్సీ ఏరియాను అదుపు ఆజ్ఞలలో ఉంచే అధికారాన్ని 1839 చట్టం మేరకు పొందగలిగారు.

రెండు విభిన్నమైన ప్రాంతాలు జమిందారీ ట్రాక్ట్‌ఆయకట్ రైత్వారీ ట్రాక్ట్ ఆయుకట్టు భూములు మరియు ఇనామ్ ట్రాక్ట్ ఆయకట్టు భూములుగా, రెవెన్యూ జిల్లాగా పిలవబడేవి.

19వ శతాబ్దం చివరలో పిండారీలు గోండులు రాజకీయంగా తిరుగుబాటు చేయడం జరిగింది. కర్రమూలయ్య నాయకత్వంలో గిరిజన పోరాటాలు జరిగాయి

## వడ్డీ వ్యాపారుల, స్థలదారుల హింసాకాండ :

అప్పులనిచ్చి అత్యధిక వడ్డీని గుంజేవారు మైదానప్రాంతాల్లో గల వర్తకులు దోపిడీ అధికారుల అక్రమ ప్రవర్తనలు అవినీతి - గిరిజనులను రెచ్చగొట్టాయి. ప్రభుత్వం ఆ తిరుగుబాటును అణచివేసింది.

ఆంధ్రలో అత్యధిక సంఖ్య ప్రజానీకానికి ఆధారం వ్యవసాయం - వరిపంట ప్రధాన పంట, ఇతర వాణిజ్యపంటలు. అయితే ప్రభుత్వం నీటి పారుదల సౌకర్యాలపై శ్రద్ధ జూపలేదు. రైతుల దుస్థితి వర్ణనాతీతం. పన్నుల విధానం లోపభూయిష్టమైన కౌలుదారు చట్టాలు ఏర్పడినాయి.

వ్యావసాయక సాగుభూముల్లో నాలుగువంతుల్లో మూడు వంతులు జమిందారీ విధానానికి చెందేవి. రైతులు చెల్లించే శిస్తులు దస్తులు ఇంతనిలేదు. జమిందారీల దయా దాక్షిణ్యాలపై ఆధారపడి ఉండేవి. పెంచడం, పెంచమనడం అంతా వారి ఇష్టమే. రైతులకు సాగుహక్కు అనేది ఆనాడు కలలోని మాట.

నిజానికి 1884కి ముందు ఎస్టేట్ రైతులకు కాపాడే శాసనాలే లేవు. రైత్వారీ విధానం గల ప్రాంతంలో కూడ పరిస్థితి మరెలా ఉండేది. 1885కి భూముల సర్వే మరియు సెటిల్‌మెంటు జరిగిన వ్యావసాయిక మదుపులను భూసారాన్ని బట్టి భూముల్ని పరిగణలోనికి తీసికొని శిస్తును మదింపు చేసే ప్రగతిని చేపట్టలేదు.

అందువలన 1859లో మద్రాసు స్థానిక సంఘంవారు బ్రిటిషు వారికి ఒక వినతి పత్రం సమర్పించారు. 1861లో వేరొక పత్రాన్ని యిచ్చారు. రెవెన్యూశాఖలో గల లోపాల్ని ఎత్తి చూపింది. రైత్వారీ విధానం అమలు పరమటలో అధిక మొత్తాలుగా భూమిపై శిస్తులు వేస్తారు. శిస్తులు చెల్లించని రైతుల ఇళ్ళను ఊడబెరికేవారు. దున్నుకునే నాగళ్లను, పనిముట్లను, ఎద్దులను, విత్తనాలను, తదితర ఆస్తిపాస్తులను స్వాధీనంచేసి ఆక్రమించుకొని జప్తులు చేసేవారు. వాటిని వేలందార్లు అమ్మి సొమ్ముచేసికొని రెవెన్యూను రాబట్టుకొనేవారు. రైతులనుండి జప్తులద్వారా స్వాధీనం చేసికొన్న శిస్తుల వలన కట్టవలసిన రైత్వారీ పన్ను లభించకపోతే ఆ రైతులను జైల్లో పెట్టి

బంధించేవారు. అంతేగాక ఆ రైతులను చెరువులనుండి నీరు తీసికొనుటకు గాని, ఆవసరాలకు నారుకొనుటకు గాని అనుమతి నిచ్చేవారు కారు.

జమీందారీ విధానం అమలులోనున్న గంజాం, విశాఖ, కృష్ణాజిల్లాలలో రైతుల పరిస్థితి హీనాతి హీనంగా నుండేది. జమిందారీ విధానంక్రింద జమిందార్లు ప్రభుత్వానికి 30 శాతం నామినల్‌గా పేచేసేవారు. వారి వాటాగా 15 శాతం ఉంచుకొనే వారు. మిగతా 50 శాతం పంటను వ్యవసాయదారునికి విడిచిపెట్టేవారు. రైతు తన వ్యవసాయ ఖర్చులను దీని నుండి పొందాలి. తదుపరి దర్బార్ పన్ను చెల్లించాలి. అంతేగాక జమిందారు ఖర్చులను తను భరించాలి. చివరికి రైతులకు మిగిలేది వళ్లు గుల్లవడమే.

రైత్వారీ జమిందారీ విధానాలు రెండు లోపభూయిష్టంగా ఉన్నందున (1) జమిందార్ల ప్రమేయంలేకుండా వ్యక్తులనుండి పన్ను వసూలు గాక ఏకమొత్తంగా ఒక గ్రామానికి ఇంత అని ప్రభుత్వమే నిర్ణయిస్తూ వసూలు చేస్తుంది. ప్రభుత్వోద్యోగులనుండి నిర్బంధ వసూలును ఆపాలి. (2) నష్టం అవినీతి - ఈ విధానానికి ప్రతిబంధకాలు, (3) భూమిశిస్తులో అసమానతలను అసమర్ధతను పారద్రోలాలి. (4) వ్యావసాయక ఫలసాయాన్ని బట్టి అంచనాలు రూపొందాలి. (5) కలెక్షన్ ఛార్జీలను విపరీతంగా తగ్గించ వలసి ఉంటుంది. (6) వివేకవంతమైన శిస్తువిధింపు విధానము వ్యవసాయ సాగుబడిని పెంచి విపరీతమైన ఆదాయాన్ని తెస్తుంది. వర్తకంపై, వృత్తుపై పన్నులు వేస్తే మంచిది. అధిక మొత్తాలలో రెవెన్యూను పెంచే విధానాలను అరణ్యాల్లో కలప కొట్టుకున్న పన్నులు కట్టాలి. అడవుల్లో ఆలమందల్ని మేపుకొన్న పన్ను, పాకలకు గడ్డిని తెచ్చుకోవాలన్న పన్ను కట్టాలి. అతిపేదలు కూడ పన్నులు చెల్లించ వలసిన దుస్థితి ఉండేదని పై అంశాలతో కూడిన వినతి పత్రం మనకు తెలుపుతుంది.

అందువలననే 1875లో లోక్‌రంజని అనే తెలుగు జర్నల్ బ్రిటిష్ రాచరిక ప్రభుత్వము కన్న కంపెనీ పాలనే మిన్న అని చెప్పవలసి వచ్చింది.

1919 సంవత్సరము చరిత్రలో చెప్పుకోదగిన సంవత్సరం. మహాత్మాజీ స్వాతంత్ర్య సమరం సాగించుటకు ఉద్యమించిన సంవత్సరం. భారత జాతీయతను పెంపొందే శుభఘడియలు ప్రారంభమైనాయి.

1919లో మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన సమావేశమైన కాంగ్రెస్ మౌంట్-ఫోర్డ్ సంస్కరణలను బలపరచింది. అయితే C. R. దాస్ - తిలక్ ఈ విషయంలో భేదించారు. బాధ్యతాయుతమైన ప్రభుత్వం కావాలి. స్వయం నిర్ణయాధికారం గల ప్రభువులు భారతీయులకు కావాలి. 'స్వరాజ్యమే నా జన్మ హక్కు' - తిలక్ రాజకీయ రణభేరి మ్రోగించారు. 1920లో ఈ చట్టం మేరకు ఎన్నికలు జరిగాయి.

1920లో కలకత్తా కాంగ్రెస్ సమావేశమున ఆంధ్రనుండి కొండా వెంకటప్పయ్య, పట్టాభి సీతారామయ్య, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, ఎ. కాళేశ్వరరావు, పేట బాపయ్య హాజరయినారు. ఈ సమావేశములోనే అసహాయర నిరాకరణోద్యమం జరపాలని తీర్మానించడమైనది గాంధీజీ సారధ్యంలో. ఈ తీర్మానం వలన కాంగ్రెస్ రాజకీయ పదవులను త్యజించింది. ఎన్నికలను బహిష్కరించింది. ఇదే అదనుగా భావించి జస్టిస్ పార్టీ రంగం లోనికి దిగింది. మద్రాస్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో గల 98 సీట్లలో 63 సీట్లను గెలుచుకొంది. శ్రీ సుబ్బరాయలు ముఖ్యమంత్రిగా జస్టిస్ పార్టీ మంత్రి వర్గం ఏర్పడింది. ఆనాటి మంత్రులు పనగల రాజు, వి.వి. రెడ్డి నాయుడు.

ఇదే సమయాన ఆంధ్రాలో అల్లూరి సీతారామరాజు విశాఖ, తూర్పు గోదావరి గిరిజన ప్రాంతాల్లో గిరిజన పోరాటాన్ని నడిపారు. తెల్లవారు ప్రక్కలో బల్లెమై గిరిజనుల కష్టాలను కళ్లకు కట్టేటట్లు పాలకులకు తెలిపారు. అయితే ఈ ఉద్యమం కాంగ్రెస్ ఆదేశానికి, అనుమతికి లోబడినది కాదు. ఇదొక స్వతంత్రమైన గిరిజన పోరాటం. నాయకుడు అల్లూరి సీతారామరాజే. ఈ పోరటం ఏజెన్సీ ఏరియాలో 1922 నుండి 1924 వరకు కొనసాగింది. మలబార్ పోలీసులను రప్పించి వారు ఈ ఉద్యమాన్ని అణచివేశారు.

1897లో జన్మించిన సీతారామరాజు క్షత్రియుడు. అహింసాత్మకంగా కాక, దౌర్జన్యం ద్వారానే శత్రువును ఎదిరించాలని, బెంగాల్ విప్లవకారులతో 1921లో చేతులు కలిపారు. మరల స్వస్థలానికి తిరిగి పాలకులపై తిరుగుబాటు చేసారు. స్థానిక పరిస్థితులు అతనిని ఎంతగానో ఉద్రేకపరచాయి.

1. స్థానిక తహశీల్దారుల దుశ్చర్యలు ;
2. ముఠాదారీ విధానంలో గల దోపిడీ విధానం ;
3. అరణ్యాల అదుపులలో గల అక్రమాలు
4. గిరిజనుల దైన్యస్థితీ, వారిని దోచుకోవడం.

స్వరాజ్యోద్యమాన్ని అదుపులో నుంచటానికి బ్రిటిష్‌వారు, అనేకమైన ఎత్తుగడలను వేసేవారు. కొత్తకొత్త వ్యవహారాలను సమకూర్చే వారు. అందులో ఒక భాగమే 'సైమన్ కమిషన్'. ఇండియాకు 1927-నవంబరు 8న రావడం పర్యటించడం, భారతీయులెల్లరు ఈ కమిషన్‌ను బహిష్కరించారు.

సైమన్ గోబాక్ అని నినాదాలిస్తూ ఎదుర్కొన్నారు. నాటి శ్రీకాకుళం మున్సిపల్ కౌన్సిల్ ఒక తీర్మానాన్ని కూడా ఆమోదించింది. న్యాయపతి సుబ్బారావు కూడా దీనిని ప్రతిఘటించారు. శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు గారు ఈ కమిషన్‌ను ధిక్కరించినందుననే ఆంధ్రకేసరిగా పేరందినారు. తన ధైర్యానికి స్వాతంత్ర్య దీక్షకు వెన్నొడ్డి పోరాడారు.

సైమన్ కమిషన్ రిపోర్టు ప్రాతిపదికగా 1930లో ఒరిస్సా సింధు రాష్ట్రాలు ఏర్పడినవి. ఆనాటి వరకు ఆంధ్రాలో నున్న గంజాం జిల్లా ఒరిస్సాలో కలిసిపోయింది. ఇచ్ఛాపురం నుండి ఇటువైపుగల ప్రాంతాన్ని మాత్రం వైజాగులో కలిపి ఉత్తర విశాఖగా పేరిడినారు. నేటిమన రాష్ట్ర సరిహద్దు మన ఇచ్ఛాపురం. రౌండ్‌టేబిల్ సమావేశానికి గాంధీ హజరైనారు. అయితే చర్చలు విఫలమైనవి. ఉద్యమం ప్రారంభమై సత్యాగ్రహ శిబిరాలు వివిధ జిల్లాల్లో ఏర్పడినవి. భారతీదేవి రంగా ఈ ఉద్యమంలో పాల్గొన్నారు.

గాంధీజీ శాసనోల్లంఘనోద్యమం పిలుపు నందుకొని ప్రభావితులైన వారిలో పేర్కొన దగిన వారు ప్రొఫెసర్ రంగాగారు. మొదట్లో వామపక్ష భావాలు గల రంగా గారు అఖిల భారతీయ కిసాన్ సభను ప్రారంభిస్తూ రైతోద్యమంలో ముందడుగు వేసి రైతు రంగాగా ప్రఖ్యాతి గాంచినారు.

రంగా గారికి అతి సన్నిహితులుగా అనుచరులుగా అత్యంత ప్రీతి పాత్రులుగా ఉన్న అసంఖ్యాక అభిమానులలో నాటి గంజాం జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ నాయకులయిన పుల్లెల శ్యామసుందర రావు, గౌతు లచ్చన్న

శ్రీకాకుళం జిల్లా రైతులు జమీందారులను ప్రతిఘటించడంలో ముందంజ వేయడమే గాక పుల్లెల శ్యామసుందరం గౌతు లచ్చన్న గార్ల ఆధ్వర్యంలో కిసాన్ ఉద్యమానికి బలమైన పునాదులను ఏర్పరిచారు. ప్రొఫెసర్ రంగాగారి నాయకత్వంలో ఆల్ ఇండియా కిసాన్ ఉద్యమానికి స్వాగతం పలికారు.

1934 జూన్‌నెలలో సోషలిస్టు పార్టీకి ఆంధ్రశాఖ ఏర్పడింది. అధ్యక్షుడు ప్రొఫెసరరంగా సెక్రటరీ మద్దూరి అన్నపూర్ణయ్య. సత్యన్నారాయణ రాజు, కె. లింగరాజు, పి. సుందరయ్య, పి. రాజేశ్వరరావు ఇందు కార్యవర్గ సభ్యులుగా నుండేవారు.

తదుపరి 1935లో ఆంధ్రా కమ్యూనిష్టు పార్టీ ఏర్పడినది. ఆనాటి కాంగ్రెస్ పార్టీ నాయకులు వెంకటప్పయ్య, నాగేశ్వరరావు పంతులు, గోపాలకృష్ణ, టంగుటూరి, సీతారామయ్య, ప్రొఫెసర్ రంగాగార్లు.

ఆంధ్రాప్రావిన్స్ ఏర్పడాలని వి.వి. గిరి, ఎ.పి. పాత్రో, యం. రామచంద్రరావు, బొబ్బిలి రాజా మొదలైనవారు ప్రయత్నించి విఫలమైనారు. ఆదే సమయాన ప్రయత్నించిన పర్లాకిమిడి మహారాజా ఒరిస్సా రాష్ట్రమును సాధించుకొన్నారు.

1926 ఎన్నికలలో స్వరాజ్య వాదులు 41 సీట్లను గెలుచుకొనగా, జస్టిసు పార్టీ 22 సీట్లను మాత్రమే గెలుచుకున్నది. స్వతంత్రులు 36 మంది ఎన్నుకోబడినారు. స్వతంత్ర అభ్యర్థి ముఖ్యమంత్రి పదవి చేపట్టినారు.

మరల 1930లో బి.మునుస్వామినాయుడు, 1936లో బొబ్బిలి రాజా జస్టిస్‌పార్టీ మంత్రివర్గాన్నేర్పరచి మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రులైవారు.

శాసనోల్లంఘనోద్యమం విఫలమవటం సోవియట్ రష్యాను సందర్శించి తిరిగి వచ్చిన నెహ్రూ సోషలిజం కావాలని రావాలని తేవాలని అనటం, ఆంధ్రలో వామపక్ష భావాలు గలవారికి బలం ఏర్పడింది.

1936 సంవత్సరం నాటికి మద్రాస్ రాష్ట్రంలో హద్దిలి కొనసాగుతున్న జమిందారీ ఎస్టేట్లలో ముఖ్యమైన కొన్నింటిని పుట్టుపూర్వోత్తరాలతో వివరిస్తాను.

## విజయనగర సంస్థానం :

ఉత్తరాంధ్రలో గల సంస్థానాల్లో అగ్రస్థానం విజయనగరం సంస్థానానిదే. కుమిలో (క్రుంబిన్మోపురం) మొదట ఆనందరాజు మట్టితో తన కోటను నిర్మించుకొన్నాడు. తదుపరి 1713లో గాజులరేగకు అతి సమీపానగల పెద్ద చెరువువద్ద పేటను నిర్మించదలచారు. 14 పరగణాల రాజ్యాన్ని పాలించేవారు.

తన కుమారుడు విజయరామరాజు తన పట్టణానికి విజయనగరం అని పేరిడినారు. పెద విజయరామరాజు 1756కి కోటను పూర్తి చేసాడు. తదుపరి సంవత్సరమే బొబ్బిలి యుద్ధం జరిగింది. (1757) విజయ రామరాజు మరణించగా వేరొకనిని దత్తత తీసికొని ఆతనికి విజయరామరాజని పేరిడెను. ఈతని కాలమున కోట పని పూర్తి అయింది.

ఓణంలో బురుజు ఉంటుంది. దీని మొత్తం విస్తీర్ణం 76 ఎకరాలు.. గోడల ఎత్తు 30 అడుగులు. కోటలోపల రౌండ్ మహల్, మోతీమహల్, రాణీమహల్, రాజదర్బార్, ఈతకొలనులు ఉద్యానవనాలు ఏర్పడినాయి.

1944 జూన్ 3వ తేదీన ఈస్టిండియా కంపెనీ కోటను స్వాధీనం చేసుకొని అప్పటి పాలకుడైన పూసపాటి చిన విజయరామరాజును తరిమి కొట్టారు. ఓటమితో విజయనగరం విడచి పద్మనాభపురం చేరుకొని అటనుండి బ్రిటిషు వారిని ఎదుర్కొని వీరమరణం పొందారు. అయితే ఈ కుమారునికే నారాయణ గజపతికి, ఎస్టేట్‌ను అప్పగించారు. పద్మనాభ యుద్ధం చరిత్ర ప్రసిద్ధి కెక్కింది.

1669 నుండి పాలించిన సీతారామరామచంద్రరాజు 1686లో ఔరంగజేబుకి గోల్కొండ ముట్టడిలో సహకరించి అతనినుండి బహుమతు లందుకొనారు.

ఆనందగజపతి కాలమున విజయనగరం ఆస్థానం విజ్ఞానవేత్తలు, కవులు, గాయకులు, కళాకారులు ఎందరినో ఈ ఎస్టేట్ పోషించి పెద్ద చేసింది. గురజాడ, ఆదిభట్ల, కోడి రామ్మూర్తి వారిలో ప్రసిద్ధులు.

## బొబ్బిలి సంస్థానం :

1757లో బొబ్బిలి యుద్ధం జరిగింది. సేనాధిపతులు కాకతీయ సామ్రాజ్యాన్ని స్థాపించినట్లు చరిత్ర దాఖలాలున్నాయి. వెలమ ప్రభువులుగా వీరు ప్రఖ్యాతి గాంచారు.

వెలమ కులస్థులలో అనేక తెగలు ఏర్పడినాయి. ఆ తెగలలో పద్మ నాయిక వెలమలు, రేచెర్ల గోత్రంతో బొబ్బిలిని పాలించారు. మొదటి వెంకన్నగిరి పాలకులుగా నుడేవారు. ఢిల్లీ పాదుషాకు, నైజాం నవాబుకు వీరు సామంతులు. వీరి ఇంటిపేరు మొదట వెలగోటి కారన్నియ్య లోచనేని "రావువారు" గా స్థిరపడినట్లు దాఖరాలున్నాయి.

రాజాంలో ఈ సంస్థానం "రావిడప్ప" చే ఏర్పరచబడి తదుపరి బొబ్బిలిని కూర్చబడినది. రాజాం కమిటి సీతానగరం ఠాణాలు బొబ్బిలి కోట వితడే నిర్మించారు. ఢిల్లీ పాదుషానుండి బహుమతుల నందారు. ఈతని తదవంతరం ఈతని కుమారుడు లింగప్ప సంస్థానానికి ప్రభువయ్యాడు.

చికాకోల్ (శ్రీకాకుళం) నవాబయిన షర్ మహమ్మద్‌ఖాన్‌ను మెప్పించి వందువ ఖాన్‌గారు లింగప్పకు రంగారావు అని బిరుదు నిచ్చారు. ఇదే బిరుదు బొబ్బిలి సంస్థానాధిపతులకు పేరు చివరన రాణిస్తూ వస్తున్నది. లింగప్పను షేర్ అనిపిలుస్తుండేవారు. నవాబు షేర్ అన్న బెబ్బులి అని అర్థం చెప్పాతి.

రాజగోపాలకృష్ణ రంగారావు పాలిస్తున్న కాలమున నిజాం నవాబు ఫ్రెంచి సేనాని బుస్సీదొరకి లొంగి పోయి సర్కార్, జిల్లాల్లో శిస్తువసూలు చేమకొవేహక్కుమ దఖలుపరచారు. ఆనాడు విజయనగరాన్ని పాలిస్తున్న పెద విజయరామరాజా, బుస్సీకి బొబ్బిలిపై లేనిపోనివి చెప్పి కయ్యానికి ఉసికొల్పినట్లు చరిత్రలో లిఖించబడింది. తత్ఫలితంగా 1757లో బొబ్బిలి యుద్ధం జనవరి 23వ తేదీన జరిగింది.

యుద్ధం వల్ల ధ్వంసమయిన కోటను [illegible] చినరంగారావు కొత్తకోటను నిర్మించాడు. 1802లో పాలించిన రాయుడప్ప శ్రీ వేణు [illegible]

1932 నుండి 1936 వరకు ఉమ్మడి రాష్ట్రానికి రంగారావు బహద్దర్ ముఖ్యమంత్రిగా పనిచేసారు. వీరి కుమారుడు ప్రస్తుతం కుమార రాజా శ్రీ రాజా వెంకట గోపాలకృష్ణా రంగారావు నేటి బొబ్బిలి సంస్థానాధిపతులుగా పిలవబడుతున్నారు. ఆంధ్రపౌరుషానికి ప్రతీకగా తాండ్రపాపారాయుడు మరియు బొబ్బిలివీరులను చరిత్ర కారులు పేర్కొంటారు.

# 15 వ ప్రకరణము

# ఎస్టేట్ రైతాంగం పోరాటాల్లో లచ్చన్న

## (జమిందారీ రైతు రక్షణ సంఘాల నిర్మాణం)

### రైతోద్యమ కార్యకర్తగా లచ్చన్న :-

రైతాంగాన్ని ఉద్ధరించిన రాజకీయ నాయకుడుగా దేశస్థాయిలో కీర్తి గాంచి, స్వాతంత్రోద్యమంలో ఒక భాగంగా రైతోద్యమాన్ని నిర్వహించటానికి పూజ్య బాపూజీనుండి ఆశీస్సులనంది రైతాంగానికి ఎంతోసేవ చేసినందున 'రైతురంగా' అని పేరొందిన ప్రొఫెసర్ యన్. జి. రంగా కాంగ్రెస్ పార్టీ రాష్ట్ర రాజకీయ నాయకుడుగా 1935లో ప్రతి జిల్లా 'స్థాయిలో రైతు రక్షణ యాత్రలను జరిపి నవంబరు 7వ తేదీన ఆ జిల్లా కలెక్టర్లకు రైతుల కష్ట నిష్టూరాలతో కూడిన వినతిపత్రాలను సమర్పించుకుని జిల్లానాయకులను రైతునాయకులను కోరడంతో రైతోద్యమానికి నాంది ప్రస్తావన జరిగింది.

ఉత్తరాంధ్రలో ఆనాటికి వ్యాపించియున్న జమిందారీ ఎస్టేట్‌లు జలగల్లా రైతులను పట్టుకొని పన్నులు వసూలు చేస్తూ వారి రక్తమాంసాల్ని తినివేస్తున్న దినాలు. అ విద్య, అజ్ఞానం, అమాయకత, మూఢనమ్మకం బాగా వ్యాపించియున్న ఆనాటి పల్లెల్లో గల రైతాంగాం జమిందారీల రాటుపోటులను భరించడం తప్ప అన్యధా ఎదురించి పోరాడే స్థితిలో ఉండేది కాదు. పైగా ఎస్టేటు దారులు హక్కు భుక్తందారులని పాలకులని, ప్రజ్ఞా నిధులని, దైవాంశ సంభూతులని జనం, బాగా నమ్ముతున్న దినాలు. కొన్ని ఎస్టేట్ల పేర్లను ఇచట ఉదహరిస్తాను. 1) చీకటి ఎస్టేట్ తలతంపర ముఠా, 2) జలంతర ఎస్టేట్,3) మాందసా ఎస్టేట్, 4) గుడాంసింగ్ ఎస్టేట్, 5) బారువాపేట ఎస్టేట్, 6) తర్లా ఎస్టేట్, 7) నందిగాం ఎస్టేట్, 8)టెక్కలి ఎస్టేట్ 9)పర్లాకిమిడి ఎస్టేట్ 10)ఉర్లాంపాడు ఎస్టేట్, 11) కురుపాం ఎస్టేట్, 12) బొబ్బిలి ఎస్టేట్, 13) సాలూరు ఎస్టేట్, 14) పాచిపెంట ఎస్టేట్. విజయనగరం ఎస్టేట్‌లో ఉన్న రైతాంగాం నాటికి తమ శిస్తుదమ్ములను చెల్లించుటలో ఎటువంటి బాధలకు గురికాలేదని,

రీసెటల్‌మెంటు విధానం అమలు పరచి, భూముల శిస్తులను పెంచటానే లేదని రైతులపాలిట విజయనగరం మహారాజు ఒక వరం అని నాటికి నేటికి ఒక ప్రతీతి, జనశ్రుతి. పై ఎస్టేట్‌లకు తోడు రైతులపై అజమాయిషీ అధికారాలను అమలుజరుపుతూ హక్కుభుక్తులనందిన కొన్ని సీనియర్ ఇనాందారులు 1) ప్రియాగ్రహారం 2) లుకలాం ఇనాం 3) లక్కం దిడ్డ 4) ఎలమంచిలి ఇనాం, శ్రీకాకుళంజిల్లా, ఇనాందారు ప్రభలరామకృష్ణారావు. 5) బూడిదవలస ఇనాం 6)సరుగుజ్జులు ఇనాం. ఈ చివరి రెండు ఈనాం దారులు రావికంట జగన్నాధం పంతులు, విద్యార్థి లచ్చన్నగారి గురువులు.

పై ఎస్టేటుల రైతాంగంపట్ల అనుసరిస్తున్న దారుణ స్థితిగతులను తెలుసుకున్న ఈస్టిండియా కంపెనీ తన స్వార్థం మేరకు 1802లో ఒక చట్టం చేసింది. ఆ చట్టంలోని ప్రధానాంశాలు ఇవి.

1) రైతులు శిస్తులు చెల్లించాలన్న డిమాండ్ నోటీసు ఇవ్వాలి.
2) భూమి వివరాలను, భూతరాలను ఏ ఫసలీలో ఎంత శిస్తు బాకీ, కరెంటు శిస్తులు ఎంతవుండాలి అన్నది ఉండాలి.
3) శిస్తు కట్టడానికి గడువు ఇవ్వాలి.
4) రైతు తన పంట నష్టాన్ని తెలియచేసి రెమిషన్ కోరే హక్కుండాలి.
5) పంటలో 2 అణాలుకన్న తక్కువ పంట వేసిన పూర్తి శిస్తు మాఫీ చేయాలి.
6) 8 అణాల పంట పండిన శిస్తు రెమిషన్ ఇవ్వాలి.
7) కోర్టులో డిక్రీ పొందితేనే తప్ప రైతుభూమి నుండి తొలగించే హక్కు జమిందారుకు లేదు.
8) భూముల నుండి రైతులను తొలగించడం చట్టరీత్యా జరగాలి.జమిందారుల ఇష్టారాజ్యాం కుదరదు.
9) కోర్టు ఆదేశాల మేరకు జప్తులు జరగాలి.

కంపెనీ ఆధీనంలో నున్న ఎస్టేటుదారులు చట్టాలు చేసినా ఏ ఒకటిని వారు ఖాతరు చేయలేదు. తమ ఇష్టానుసారంగా రాజ్యం చేసే వారన్నది ప్రతీతి. జన నానుడి చారిత్రిక పరమైన సాక్ష్యాదారాలు కూడా ఉన్నవి. అందువలననే రైతోద్యమం లేచింది. జమిందారుల ప్రతిఘటించడం ముందుపడింది.

అభివృద్ధి సామాజికి చైతన్యం ఏర్పడినగాని లభించదు. చైతన్యం ఎవరో ఎప్పుడో ఎచట ఎలా ప్రారంభిస్తారన్నది గొప్ప విషయం. చైతన్యం తెచ్చిపెట్టిన మరుక్షణం కొందరికి సత్ఫలితాల్ని, మరికొందరికి దుష్ఫలితా ల్నిచ్చిన అసంఖ్యాకులకు కొండంత ప్రయోజనాన్ని చేకూర్చినపుడు ఏ కొద్దిమందికో, గోరంతప్రతికూలత తటస్థించిన విచారించ నవసరంలేదు. వ్యక్తిస్వార్థంకాదు. సామాజిక శ్రేయస్సు ముఖ్యం. వ్యక్తులు, వర్గాలు గాక మానవజాతి అంతా సుఖించాలి.

జాతీయ స్థాయిలో 1933లో ప్రారంభమైన రైతోద్యమ తీవ్రస్థాయికి చేరుకోబోతున్నది. గంజాంజిల్లా ఆంధ్రా కాంగ్రెస్ సంఘం నాయకులు పుల్లెల శ్యామసుందరం, న్యాయపతి నారాయణమూర్తి, వెంకట రమణమూర్తి, అట్టాడ కృష్ణమూర్తి గారు రైతుల్లో చైతన్యం తేవాలని కార్య క్రమాల్ని రూపొందించారు. ఆనాటికే రంగాగారు బరహంపూర్ విచ్చేసి బారువా నుండి ఇచ్ఛాపురం వరకు జరిగిన రైతు రక్షణయాత్ర ప్రాతిపదికగ బరహంపూర్ రైతురక్షణ మహాసభలో ప్రసంగించి వెళ్లారు. లచ్చన్నగారు ప్రప్రథమంగా రైతురంగాను సందర్శించిన చత్రపూర్ బహిరంగ సభలోనే యువకార్యకర్తగా ఉప్పొంగిన దేశభక్తితో నొప్పారు. లచ్చన్నను ఆ మహాసభలోనే పలువురు కాంగ్రెస్ నాయకులు గుర్తించారు.

రైతురక్షణయాత్రలను జరపడం రైతు సంఘాలనేర్పరచడం, నిడుబ్రోలులో రంగాగారి రామినీడు రాజకీయ పాఠశాలలో లచ్చన్న 1935, 1936, 1987లో వరుసగా మూడుసార్లు వేసవికాలమున వెళ్ళి రాజకీయ విద్యను నేర్చుకొన్నారు. రైతోద్యమ నాయకునిగా శిక్షణ పొంది వచ్చారు. ప్రతీ సంవత్సరం వేసవిలో పాఠశాలకు వెళ్ళడం మరల వచ్చి జిల్లాలో ఆనాటి రైతోద్యమనాయకులు శ్యామసుందరం, అట్టాడ కృష్ణమూర్తిలతో పాటు పర్యటిస్తూ రైతుసభల్లో పాల్గొనడం లచ్చన్న జేసేవారు.

## ఒకనాటి సామాన్య కార్యకర్తగా లచ్చన్న:

గ్రామీణ భారతి అసంఖ్యాక రైతాంగం కలది. వ్యవసాయమే ఆధారంగా గల దేశం గంజాం జిల్లాలో పుల్లెల శ్యాముసుందరం

ఆధ్వర్యమున వివిధ ప్రాంతాల్లో పర్యటించి ఎస్టేటు రైతు సంఘాలను ఏర్పరచడం కార్యక్రమం. అందుకు రైతులను సమీకరించాలి. రైతుసంఘాన్ని పటిష్టం చేయాలి. జమిందారులను దోపిడీ విధానాన్ని త్రిప్పికొట్టాలి. ఉద్యమాలను లేపి రైతు పోరాటాల్ని కొనసాగించాలి. మన జాతీయ స్వాతంత్ర్య పోరాటం బలపడాలన్న రైతోద్యమం కూడ బలపడాలి. రైతురంగా యిచ్చిన పిలుపు మేరకు జిల్లా రైతునాయకుడు శ్యామసుందరం యిచ్చిన ప్రోత్సాహ ప్రోద్బలాలతో యువక లచ్చన్న పల్లెల్లో తిరిగి రైతులను సమీకరిస్తూ వారిని చైతన్యపరచాలన్న పడక కుర్చీ రాజకీయాలు పనికిరావుకదా! కదలివెళ్ళాలి. అసంఖ్యాక రైతుకూలీలతో కలిసి పోవాలి. వారిమధ్యనే మెలగి వారి కష్ట సుఖాలను తెలుసుకోవాలి. వారి కష్ట సుఖాల్లో భాగం పంచుకోవాలి. రాష్ట్రస్థాయిలో రంగా నాటి జిల్లా రైతోద్యమ సారథి పుల్లెల శ్యామసుందరం. జిల్లా రైతోద్యమ పోరాట నాయకుడు లచ్చన్న.

జిల్లా రైతోద్యమ నాయకులు జమిందారీ విధానంపై తిరుగుబాటు జెండా ఎగరవేసినా పుల్లెల శ్యామసుందర్రావు (ఇచ్ఛాపురం), గౌతు లచ్చన్న (బారువా), కార్యకర్తలను కూడగట్టుకొని కార్యోన్ముఖులైనారు. ఎస్టేటు రైతుసంఘాల నేర్పరచటానికి ఊరూర తిరగటానికి కార్యక్రమాన్ని రూపొందించారు. ముఖ్య కార్యకర్తలు సహచరులు అనుచరులు అభిమానులు రైతురంగా ఇచ్చిన పిలుపు నందుకొని పుల్లెల శ్యామసుందరం, న్యాయపతి నారాయణమూర్తి, అట్టాడ కృష్ణమూర్తి, లచ్చన్న గార్లు రైతోద్యమం ప్రారంభించారు. ఆనాడు లచ్చన్నగారితో జరిగిన జిల్లాస్థాయి కార్యకర్తలు ఎందరో ఉన్నారు. అందులో కొందరిని ఉదహరిస్తున్నాను. 1) పుండరీ కాచారి (గుళ్లసీతారాంపురం), 2) కూనిశెట్టి వెంకట నారాయణ (సాలూరు), 3) గొర్లె సూర్యనారాయణ (పార్వతీపురం), 4) యాళ్ల సింహాచలం నాయుడు (బందలుప్పి), 5) వెలికాని రంగనాయకులు (బొబ్బిలి), 6) కలికోకిల కోళ్ల సన్యాసిరావు (సాలూరు), 7) లింగం నారాయణ, 8) గరిమెళ్ల కామేశ్వర్రావు (పాలకొండ), 9) పల్లె శివు న్నాయుడు (కొమరాడ), 10)మార్పు రాజారావు, మార్పు పద్మనాభం (మధనాపురం), 11) బెందాలం గవరయ్య అట్టాడ లచ్చన్న(కుండపల్లి), 12) బొడ్డ కామయ్య (మదనపురం), 13) గుప్తా సూర్యనారాయణ రెడ్డి (మిలియ పట్టె), 14) కొర్ల హరికృష్ణ (బొడ్డ కొత్తూరు), దుర్లభసాహు (బారువా) 15) నరద

కృష్ణమూర్తి (కనిమోలు), 16) కిల్లి అప్పలనాయుడు (పురుషోత్తమ పురం), 17) సుబ్బా శ్రీనివాసరెడ్డి (ఉమరపల్లి), 18) ఉప్పాడ రంగబాబు (ఇచ్ఛాపురం), 19) రెడ్డి (టెక్కలి).

రైతోద్యమానికి ప్రభావితులై రైతురంగా ఇచ్చిన పిలుపు మేరకు పల్లె పల్లెలను తిరిగి గ్రామీణ ప్రజానీకానికి, చైతన్యాన్ని అందించటముతో పాటు రంగాగారిచ్చిన రైతోద్యమం పిలుపునకు ఎంతగానో ప్రభావితులైనారు.

లావణ్యాదొరై (మిలియాపుట్టి), బల్లెడ అప్పలస్వామి (ప్రగడపుట్టక కవిటి), గేదెల చంద్రయ్య నాయుడు.

ఆనాటి గ్రామీణ ప్రాంతం "దారి డొంకలు లేని ఊళ్లన్నామన పల్లెకొంపలు దమ్మిడీకి పనికి రావన్నా" అని దేశభక్తులు ప్రచారం చేసేవారు. తెల్లవారివి తిట్టిపోసేవారు. మన పల్లెల దౌర్భాగ్య స్థితిని జూచి, ఎంతో ఆవేదన పడిపోయేవారు.

కాలినడకతో ప్రయాణం సాగించాలి. సైకిళ్ళపై తిరగాలి. గుర్రింబండ్లపై రైలెక్కి వెళ్లాలి. గ్రామానికి గ్రామానికి రహదార్లు లేని దుస్థితి. జిల్లాలో ఏం జరుగుతున్నది ఒకరి కొకరికి తెలియని పరిస్థితి. విద్యుశ్చక్తి ఆకాశవాణి, పత్రికలు యింకి అందుబాటులోనికి రాని కాలం. పాగబండ్లు నిర్దేశించిన దూరాల్లో వెళ్లాలి. జాతీయ రహదార్లలో బొగ్గు బస్సులే తిరిగేవి. లారీలు అతి అరుదుగా కన్పించేవి. జీపులు తిరిగే కాలమే కాదది. ఇంకా జీపులను తన కళ్లతో చూడని గ్రామీణ భారతమది.

రిచ్చన్న అనుచరులు వెంట రాగా ఉత్తరాంధ్ర గంజాం జిల్లాలో గల ఒక పల్లెలో ఒకనాడు ప్రవేశించారు. సైకిళ్లను అద్దెకు తీసికొని వెళ్లారు. వచ్చినవారు కొత్తవారు. చొక్కా, పంచె, పైజామా వేసుకొని వచ్చినారు. గ్రామ ప్రజలందరికి వింతకారణం. ఆ గ్రామములో ఏ కొద్ది మందికో తప్ప ఏ ఒకరికీ వంటనిండ గుడ్డలేని పరిస్థితి. మాసి వెరుగని తలలంతా పల్లెల్లో కన్పించాయి. పాత [illegible] వారికి తోడునీడ బక్కచిక్కిన [illegible] పోయే [illegible] పిల్లలు [illegible]గారు. రైతులు

లచ్చన్న తన అనుచరులు సైకిళ్ళనాపి ఊరి మధ్యగల రచ్చరాయి పైకి చేరారు.

"మేము వచ్చింది మీ కోసమే. మేము చెప్పింది మీ కూలినాలి పెరగాలి. మాతో చేయి కలిపి నడవాలి". గుమిగూడిన బక్కచిక్కిన రైతులతో లచ్చన్న మాటలివి. "ఏమిటి బాబూ మీరనేది? ఇంతవరకు మా తాతల కాలంలోగాని మా తండ్రుల కాలంతో గానీ, మా కాలంలో గాని ఎవరో వచ్చి ఏదో చెప్పడం, సభల్ని పెట్టడం, మాకు తెలియనిది. ఇంతకూ మీరు చెప్పేదేమిటి?" అమాయక రైతు అడిగిన మాటలు.

"మీరు పండించిన పంటను అంతా రాజుగారికి శిస్తు క్రింద చెల్లిస్తున్నారు. నిన్నమొన్నటి వరకు జమిందార్లు మీ నుండి పన్నును వస్తురూపంలో పొందేవారు. ఈనాడు డబ్బురూపంలో ఇమ్మంటున్నారు. అగ్రహారంబు గల ఇనాం భూసాదు ఆ భూములపై పండిన పంటను భుక్తం చేసుకుంటున్నారు. పండిన పంటనంతా ఆ పన్ను క్రిందే జమ కడుతున్నారు. ఆ బుగతలకే యిస్తున్నారు. మరి మీరు బ్రతికేదెలా?" లచ్చన్న స్వరం గంభీరంగా పలికింది.

"అదేమిటి బాబూ! రాజు గారికి పన్ను కట్టకుండ ఎలా? తరతరాలుగా వస్తున్న ఆచారం, సాంప్రదాయం. మా వశమా! ఈనాడు కాదనటానికి మీరెవరు?" వయసుమళ్లిన ఒక రైతు ఆవేదన.

"మిమ్మల్ని పన్నులు కట్టవద్దని అనలేదు. లచ్చన్న వివరించారు. మీ భార్య పిల్లలు మీరు కడుపుల్ని మాడ్చుకొని పండించిన పంటను ఆ జమిందారీకు కట్టబెట్టాలా? మీరు తినగా మిగిలినదే పన్నుగా యివ్వాలి"

మరి రాజుగారు ఒప్పుకుంటారా? మంత్రిగారికి కోపం రాదూ? దివాన్ గారు సముద్దర గారు వచ్చి ఊరుకుంటారా? మా గతి ఏమవుతుంది? రైతుల ప్రశ్నలు ఒక్కమారుగా పెల్లుబికాయి.

"జమిందార్లపై తిరుగుబాటా? అమ్మబాబోయ్! మా కొద్దు. మేము దున్నుతున్న భూములన్ని ఆ ఏలిన సాములవే! కోపంవస్తే ఆ

భూములనుండి మమ్మలని ఆ భూములనుండి వెళ్లగొడతారు. అపుడు మా పెళ్లాం పిల్లల గతి ఏం కావాలి?" ముఖాల్లో ఆందోళన కన్పించగా ఆక్రందనతో భయకంపితులై ఆడిన మాటలు.

అచ్చన్నలో ఉద్రేకం పెరిగింది. "ఆ భూములు జమీందారులవా ? ఎవడిచ్చాడతనికి ?"

"దేవుడు బాబు ఎవరికి ఎంత రాసి పెట్టి ఉంటుందో అంతేకాక ఏమి వస్తుంది. ఏరా రామయ్యా కాదంటావా?" అని ప్రక్క రైతును అడుగుతున్న రామయ్యను భుజం తట్టి అచ్చన్న "రామయ్యా ! ఎవరు ఎవరికీ ఏమి రాసి పెట్టలేదు. రాజుగారే మీకు పంగనామాలు మీ ముఖంపై రాసి పెట్టాడు ? దేవుడుకి మన మందరమూ బిడ్డలమే! దేవుని సంతానం కానిదెవరు ? మనలో బలమున్న వారు బలంలేని వాళ్ళను చావగొట్టి ఆస్తి పాస్తుల్ని కాజేసినట్లే. మొదట్లో రాజులు తమ కండ బలంతో సైనిక బలంతో ప్రజలను వశం చేసికొని భయపెట్టి వారి పాదాల క్రింద పడి ఉండేటట్లు చేశారు. వారు రాజులుగా, మనం సేవకులుగా ఉండాలని శాసించారు.

"ఒరే సోమయ్యా! ఇదేదో తిరుగుబాటులా ఉంది. రాజులతో మనకెందుకురా తగాదా వాళ్ల ఉప్పు తిని బ్రతుకు తున్న వాళ్లం పదండి. మనకెందుకీ తగవు? ఇపుడు దొరకుతున్న ఈ కాస్త గంజి నీళ్ళు కూడా ఇక దొరకవు. అంటూ రైతుల్లో కొంతమంది జారుకోవడం ప్రారంభించారు.

అచ్చన్న తన అనుచరులు ఎంత చెప్పినా విననిదే రాజుగారిపేరు చెబితే గజగజ వణికి పోతున్నారు. జమీందారు అంటే జన్మలో వారు దైవంతో సమానులు బాబూ అని అంటున్నారు. మరి వీరిలో ఎలా చైతన్యం వచ్చేది. ఇక తిరుగుబాటు గగనకుసుమం. అంతే నిరుత్సాహపడిన కార్యకర్తలను అచ్చన్న సముదాయించారు.

"ఈ రైతులంతా మనల్ని విడిచి వెళ్లారు. ఈ రాత్రి మనం ఉండేదెలా? ఎవరింటికి పోయి మనం కాస్త విశ్రాంతికి చోటు అడిగిన అది వారికి ప్రాణాంతకం అవుతుందేమోనని వారు భయపడుతున్నారు" అచ్చన్న దీర్ఘంగా ఆలోచిస్తూ అన్నారు.

సహచరులు ఉపాయం కనిపెట్టారు. అచ్చన్నగారూ! రండి ఆ ఎదురుగా కన్పిస్తున్న టీ దుకాణం వద్దకుపోదాం. అచట కాస్త టిఫిన్ తిని, టీ త్రాగుదాం. ఆ టీ కొట్టాయననే "ఏమయ్యా కాస్త టీ నీళ్లు పోసి తినటానికేమైన ఉంటే పెడతావా?" అచ్చన్న అడిగారు.

"బాబు! పాలు అయిపోయాయి. డికాషన్ కలిపి టీ ఇమ్మంటే ఇస్తాను. ఇక చిలక గారెలు మూడు రోజుల క్రిందట చేశాను. చల్లగ ఉన్న ఫరవాలేదు బాబూ! చాలా బాగుంటాయి. రండి, తినండి" అని ఆ టీ కొట్టువాడు చెప్పాడు.

అచ్చన్న అనుచరులు ఒకరి ముఖం ఒకరు చూసుకొన్నారు. తినక తప్పదు. ఫలహారం, టీ పూర్తయింది. "బాబుగారూ! మీరేదో ఆ వీధిలో ఉపన్యాసం చెప్పగా ఎవరో విని నాతో చెప్పారు. మీరంతా రాజులను ఎదిరిస్తున్నారని, ఇది మనవల్ల అయ్యేపనేనా, బాబూ? అయినా నాకెందుకు సరకులను అమ్ముకొనేవాడ్ని".

"చూడు శెట్టి ! నీకు కావలసింది సొమ్ము. బేరం మావల్ల నీకు వచ్చిందిగా ఈ రాత్రికి కాస్తమేము ఉండటానికి చోటు యిస్తే రేపు ఉదయం వెళ్ళిపోతాము. అయినా మేము ఒకటి అడుగుతాం, చెప్పండి. ఈ రైతులను కూలీలను బాగుచేద్దామని ఇంత కష్టపడి నడచి కొంతదూరం, సైకిళ్ళపై కొంతదూరం ముము వస్తే వీళ్లంతా మా మాటల్ని విని పారిపోతారేమిటి?" అడిగారు అచ్చన్న.

. మెల్లగా మాట్లాడండి బాబూ! గోడలకు చెవులుంటాయి". అంటూ శ్రేష్టిజీ చెప్పడం ప్రారంభించారు. ఈ రైతులంతా అమాయకులు. తెల్లని వన్నీ పాలు, నల్లనివన్నీ నీళ్ళనుకొనే రకం. ఈ గ్రామంలో ఏం జరిగినా తెల్లారే సరికి మా రాజుగారికి తెలిసిపోతుంది.

అదేమిటి? మీ రాజుగారు ఎంతో దూరంలో ఉన్నారుగా, వారికీ విషయం ఎలా తెలిసేది? అన్న ప్రశ్నకు నేను చెపుతాను వినండి". అంటూ ఒక వ్యక్తిల దుకాణంలోనికి ప్రవేశించాడు.

ఆ, రా నాయనా! వెంకటేశం బాబు ఇతడేనండి. అచ్చేసిన ఆంబోతు కోడిలా ఊరుమీద పడి తిరుగుతుంటాడు. ఎవరిని ఏమి అడిగినా ఇవ్వకపోతే తిరగబడతాడు, ముఖ్యంగా నామీద బాబూ! ఎప్పుడు తీసికొన్న బాకీ ఇవ్వడం తెలియదు. అంది అతని భాగోతం' అంటూ శ్రేష్టి చెప్పడం ప్రాంభించాడు.

ఏం, షావుకారూ! పరిహాసాలాడుతున్నావా?
నోర్మూసుకోవోయ్. నేనెవరినో తెలుసా?"

"నాకెందుకు తెలియదు, బాబూ! లచ్చన్న వైపు తిరిగి చూడండి బాబులూ! ఇతడేమో మున్సబు గారి బామ్మరది. ఎన్ని అనుకున్న మీ లాంటి వాడే బాబూ! అన్యాయం ఎక్కడున్న ఎదిరిస్తాడు". అన్న మాటలకు లచ్చన్న అదేమిటి షావుకారుగారూ! ఇంతవరకు అతనిని ఏవేవో అని మరల -----" అడిగారు.

"మా కేమి పట్టింపులు లేవు బాబూ! నా కతను వరసకు బామ్మరిది. మా పరిహాసాలు అలా ఉంటాయి. వీరివురి వరసజూచి లచ్చన్న అందుకున్నారు.

"ఇంతకూ ఏదో చెబుతామన్నారు?" లచ్చన్న ప్రశ్న.

"చెప్పటానికి చాలా ఉంది. రచ్చరాయిపై మీరు చెప్పిన మాటలన్నీ రైతులకు వచ్చాయి." షావుకారు సమాధానం. "అయితే ఒక్కరూ ముందుకు రారేం?" అని లచ్చన్న ప్రశ్న

"ఎలా వస్తారు? వస్తే మరునాడికి వారికి అధోగతే! రాజాగారి రౌడీలు వారి ప్రాణాలు తీయరూ?"

"ఆ రాజాగారికి అంత శక్తి ఉందా? ప్రజలు ఊరుకుంటారా? ప్రజలలో ఉన్నవారే రాజాగారికి వంతపాట పాడుతారు కదా! చిన్న చేపల్ని పెద్దచేప తింటుందన్నట్లు, చిన్న రైతులను తిన్న పెద్దరైతు రాజుకి ఎదురు చెప్పడు. ఇక రాజాగారి సేవకులే గ్రామాల్లో పెద్దలు. మీకు తెలియనిదా? కరణీకంలో గ్రామాన్ని అదుపులో ఉంచేవాడ్ని మున్సిఫ్‌గా, కంత్రీ

లెక్కలలో పన్నుల గారడీ చేసినవాడ్ని కరణంగా, - ఈ ఇద్దరిని నిత్యం పొట్ట నింపటానికి సాధనమై ఉపయోగపడుతున్న పరిచముడ్ని తలారిగా ఆ రాజుగారే కాదా ఇచట ఉంచారు".

"అది సరేనండీ! అన్ని గ్రామాల్లోను వీరున్నారుగా అందరూ ఇలానే వారిని చూచి పారిపోతున్నారా?"

"మీరు ఏ గ్రామాల గూర్చి చెబుతున్నారో గాని అనేక గ్రామాల్లో పరిస్థితి ఇదే. మీకు ఈ రైతులు ఆదరించారని తెలిసిన వెంటనే ఆ జమిందారు రౌడీలు కాకుల్లా వచ్చి వీరిని మరి బ్రతకనివ్వరు"?

"అలా అని పిరికి పందల్లా ఎన్నాళ్లు మీరు ఎదిరించక జీవిస్తారు?" అచ్చన్న ప్రశ్నించారు.

"బాబూ! ఈనాడు మీరు వచ్చి మేము ఉన్నాం. మీరు ఎదిరించండి అంటున్నారు. ఈనాడు మీరు వచ్చి నలుగురినీ ఒకచోట చేర్చి నాలుగు మాటలు చెముతున్నారు. ఈనాడు మీరు వచ్చి ఆ రాజులు వట్టిపోతు రాజులను ఎదిరించి బాగుపడండి అని గద్దిస్తున్నారు. ఇంతవరకు ఎవరైన వచ్చి ఈ రైతులను ఈ కూలీలను భుజం తట్టి లేపారా? మీరే కదండీ, మొదటగా వచ్చి ఈ రైతులను కూలీలను కదలమని చెప్పమన్నది. ఇంతకు ముందు ఎవరొచ్చారని, ఏమి చెప్పరని?"

అచ్చన్న ప్రభృతులు అతను చెప్పిన దానిలో సత్యం కొంత ఉంది అన్నది అంగీకరించారు. "నీవు చెప్పింది నిజమే, వెంకటేశ్! కనీసం నీవు మాకు ధొరికావు. మీ గ్రామం వచ్చినందుకుమాకు ఫలితం దొరికింది".

"ఎంతమాట అచ్చన్నబాబూ! మీరు ముందు నడవండి. అనుచరునిగా మీ వెంట నడుస్తాను". అచ్చన్న ఆప్యాయతతో భుజం తట్టారు. ఇంతకూ మనకీ రాత్రి "నిద్ర చేయడమా? ఇదిగో ఈ చావడి లేదా? ఈ వీధి అరుగు ఈ శెట్టిగారిదే. పెద్దగానే ఉంది. ఇచ్చటనే పడుకొని తెల్లారగానే మీరు మీ ఉద్యమానికి వెళ్లవచ్చు".

అంతా ఆ రాత్రి అరుగులపై పడుకున్నారు. తెచ్చిన గావంచాలే తలదిండులు. ఇచ్చిన ఈతచాపలే దూది పరుపులు. చుట్టుప్రక్కల చెట్ల కొమ్మలే విసనకర్రలు. కార్యసాధకుడు ఒకచో నేలను పవళించు వేరొకచో హంసతూలికా తల్పమున పరుండు! అని భర్తృహరి ఎంత చక్కగా చెప్పాడో.

మరునాడు ఉదయం లేచారు. వీళ్లను చూసి రైతులు తప్పుకొని దూరంగా వెళ్లిపోతున్నట్లు లచ్చన్న ప్రభృతులు భావించారు. అయితే ఊరువిడిచి వెంటనే వెళ్ళిపోవాలన్నది లచ్చన్న అభిమతం కాదు. అతనికి పట్టుదల,తీవ్రత మనసులో పెరిగింది. ఉదయం కాలకృత్యాలను తీర్చుకొని వచ్చి ఆ గ్రామం వీధి దుకాణంమీద కూర్చొని బాతాఖానీ ప్రారంభించారు. దుఖాణానికి వచ్చినవారు చుట్టూమూగక తప్పలేదు. ఈతడెవరో గట్టి పిండమేసుమా! గడగడలాడించేస్తున్నాడు. మన గ్రామపెద్దలతో సహా రాజావారి వరకు అందరికీ చెడాపెడా వాయించేస్తున్నాడు. అని లోలోన భావిస్తున్న రైతులు గుండెధైర్యం లేక మూగనోము వ్రతం పట్టారు. చెప్పిన మాటలు వారికి వినసొంపుగా ఉన్నాయి.

లచ్చన్న అందరిమీద చెప్పడమే తప్ప ఏ ఒక్కరు మరోమాట లేదు. లచ్చన్నను కవ్వించి నట్లయింది.

"మీ గ్రామంలో పెద్దలెవరండి" లచ్చన్న అడిగారు. "ఇంకెవరు? ఊరును పాలిస్తున్న మునసబు గారు, కాగితం మీద కలంవేసి రాసే కరణం గారు, శిస్తులు దస్తులు వసూలు చేసి పెట్టడానికి రాజుగారి రెవెన్యూ మున్సిఫ్ గారట. అదిగో నండి, ఆ పెద్దిల్లు రామినాయుడు బాబుది. అతనే మా గ్రామానికి పెద్దమనిషి తగవులు, తంటాలు తీర్చటానికి మునిసబ్, కరణంగారికి తోడవుతూ ఉంటారు. అమాయక రైతు వివరాలన్ని ఇచ్చాడు, లచ్చన్నకేమీ తెలియదన్నట్లు.

"రాజాగారికి శిస్తులు వాళ్ళు చెల్లిస్తున్నారా?" లచ్చన్న ప్రశ్న. "వాళ్ళు మారాజులు. శిస్తులు వసూలు చేసేది వాళ్ళే కాదండీ! ఇక వారు చెల్లిస్తున్నదీ, లేనిదీ ఎవరి కెరుక?"

"లోకంలో ఏం జరుగుతున్నదీ తెలుసుకోకుండా ఇలానే మీరుంటే, మరికొన్ని వందల ఏండ్ల వరకు మన పరిస్థితి ఇంతే. వాళ్ళేదో, పెట్టి పుట్టినట్లు మీ, 'గీత' ఇలా ఉందన్నట్లు మీరుండటం చ్చాలా తెలివి తక్కువ" లచ్చన్న మాటవినిన రైతుకూలి జవాబివ్వకుండా ఉండలేకపోయారు.

"మనమంతా ఒక్కటే అంటారా బాబు" అన్న సందేహానికి అన్నమాటే కాదు; ఉన్నమాటే అది. ఎవరెలా పెద్దవారయ్యారో చెబుతాను, వినండి "లచ్చన్నగారు వారికి అర్ధమయ్యేలా వివరిస్తునారు.

తుపాకి మందు కనిపెట్టక ముందు ఎవ్వరైతే జబ్బ సత్తువ కలవాడో, వాళ్ళే చుట్టునున్న జనులకు నాయకులు అయ్యేవారు. పురాణాల్లోకి వెళ్ళండి. అర్జునుడు భీముడు, కీచకుడు, బకుడు బలశాలురని తెలుస్తుంది. ఆనాడు అందరినీ వాళ్ళే అజమాయిషీలో ఉంచేవారు. ఆయుధాలు లేనిదే ఏ ఒక్కరు ఏనాడు వెలకెక్కలేదు. విష్ణుమూర్తికి చక్రము, దుర్యోధనుడికి గద, రామునికి బాణము ఏ దేవుళ్లను చూడండి. ఆయుధాలు లేని దేవుడే లేడు". లచ్చన్న వ్యంగ్యంగా చెపుతుంటే వాళ్లందరూ ఉత్సాహంగా వింటున్నారు.

" ఆ కోవకు చెందిన వారే ఈనాడు మన భూముల్నిబుక్కుతున్న బుగతోళ్ళు. భూములకు శిస్తులు దస్తులు చెల్లించనిదే డొక్క చీలుస్తామని బెదరిస్తున్న జమిందారీ బాబులు. వీళ్ళే సరాసరి ఆ దేవలోకం నుండి ఊడిపడలేదు. మనలోనున్నవారే. భుజబలం, బుద్ధిబలం ఉపయోగించుకొని ప్రక్కనున్న వారిని పాలించడం నేర్చుకునారు"

"అయితే బాబుగారూ! మా గ్రామంలో నున్న యీ పెద్దోళ్ల అలాంటివారేనండి?" ఆశ్చర్యంగా అడిగారు.

గోచీపాత కట్టుకుని చుట్ట పీక ముట్టించుకుంటూ ప్రక్కనున్న బక్కచిక్కిన రైతు, డొక్కలెండిన కూలి అడిగిన ప్రశ్న.

"వీళ్లు అంతే! ఎవడైతేపల్లెలో కాస్త పొలం. డబ్బు ఉండి జబర్దస్తీ చేసి కరప్రెత్తనం చేయగల్గాడో, ఎవనికి కాస్త కండ బలం, జాతి, కులబలం ఉండేవాడిని, ఆ గ్రామానికి అధికారిగా ఉండమని చెప్పి వాడిద్వారా మనందరిని

దోచుకోవటానకి మనల్ని పరిపాలిస్తున్న రాజులు తరతరాలనుండి ఆడిని ఆడుతున్న నాటకంలో ప్రథమభాగం. వాడినే గ్రామ మున్సబ్ అని ముద్ర వేసారు.

ఎవడైతే కాస్త చదువుకొని ఆనాటికి కాగితంపై అక్షరాలను వ్రాసి, అంకెలను కూడగలడో నలుగురినీ నానా తిప్పలు పెట్టి ప్రజలను మడత పేచీలతో ముంచెత్తగలడో వాడికి గ్రామంలోనుండి ఏరికోరి కరణం అని పేరిడి కాగితం కలం ఇచ్చి గ్రామజాతకం వ్రాసి శిస్తుదస్తులు లెక్కలు తేల్చమని అణాపరక జీతంతో యితనికి ఒకనాటి రాజవ్యవస్థ నిర్ణయించింది.

"అదేమిటి బాబూ! మున్సిబ్‌గారికి జీతం లేదా? "మొదట్లో వాళ్ళకు జీతాలు లేవు. ఆ గ్రామపెత్తనం అప్పగించమని రాజుగారి దివానులు ఉద్యోగులు భుజంపై చేయి వేయగానే తనకు జీతం కావాలన్న విషయమే నాయుడు మరచిపోయాడు. గ్రామాన్ని పాలించే వాడికి జీతం ఎందుకు? ఎవర్ని అడిగితే ఏమి ఇవ్వరు గనుక ఇవ్వనిచో ఏ ఒక్కరు ఎలా బ్రతుకగలరు కనుక. ఇతనిని ఏవిషయం అడగనిదే ఎవరేమిచేయగలరు కనుక. ఇక జీతం ఉన్నా గాని, వారికి కావలసిన లెక్కలను వీడురాయడు. వీడిచేత రాయించలేదు కదా. అందుకు కారణం ఉండాలి. పాపంచేసినది అది తనదికాదు. చేయించినవాడిదే. ఇక ఇంతటితో పోలేదు ఆగ్రామములో అంటరాని వారుగా మూలపడి మూల్గుతున్న పంచములనుండి ఒకరిని "తలారి" ని చేసివాడి చేత ఈ గ్రామపెద్దలకు అడుగులకు మడుగులు ఒత్తుతూ నీగులాపోడ్ని దొరా, నీ బానిసను దొరా అని నిత్యం అనిపించారు. నీ ప్రక్కనున్నవాడ్ని నిత్యం ఒకర్ని బాబుగారూ దండాలండీ గొప్పవారండీ మీరు మా కన్న పెద్దవారండీఅని అంటుంటే మీరు మాత్రం కొన్నాళ్ళు అనకుండ పోతారా అలాగా జరిగింది. ఆ తలారితో పాటు ఈనాడు మీ పల్లె రైతులు, కూలీలు అందరూ మీ గ్రామ పెద్దలకు తలవంచి బ్రతుకుతున్నారు. లచ్చన్న స్వరం హెచ్చుస్థాయికి చేరింది. "బాబుగారు మీరు అలా అంటారు. వాళ్ళదగ్గరకు పోనిదే మా బతుకులు తెల్లారవు. దీనంగా అన్న రైతు మాటవిని నిజమే వాళ్ల దగ్గరకు ఎందుకు పోతావు. నీవు ఈనాడు ఏ భూమిని దున్ని శ్రమించి పంటలు పండిస్తున్నావో ఆభూమి నీది కాదని, ఆ మున్సబ్, కరణం దయా క్షిణ్యాం నీ. ఆ రాజుగారిదీ భూమిఅని నీవు భావిస్తున్నావు. అది నిజం

కాదు. నిన్న నా మీటింగులో నే చెప్పాను. ఆభూమిపై హక్కు నీదే. రాజు గారికి శిస్తు చెల్లించాలి అంతే, చెల్లిద్దాం. అయితే నీవు చెల్లించే స్థితిలో నున్నావా? నీ చేతికి అందిన పంట నీ బ్రతుకునకు సరిపోతున్నదా? నీవు దున్నే భూమిని తీసికొని మరల వేరొక రైతుకు యిచ్చే హక్కు ఆ జమిందారికి ఎవడు ఇచ్చాడు? భూమిపై తరతరాలనుండి జీవిస్తూన్న రైతు బ్రతుకు ఏమి కావాలి శిస్తు కట్టనంత మాత్రాన నీ బండిని బక్కను వేలం వేయటమేనా?"

ఏబది ఏండ్ల క్రిందట లచ్చన్నగారి నోటనుండి ప్రతిధ్వనిస్తున్న నినాదాలివి. ఇవన్నీ జరిగేవా? గగనకుసుమాలే. కలలోని మాటలే అని నిరాశ నిస్పృహలతో చూచే రైతాంగం కూలీలు.

లచ్చన్న ప్రభృతులు ఆ పల్లెలో ప్రకటిస్తున్న నినాదాల మాటలు ఎదుర్కొనే మొనగాడెవడో వాదనకు రమ్మనండి అని రొమ్ము విరుస్తూ సైకిళ్ళు ఎక్కారు. వేరొక గ్రామం చేరుకోవటానికి. నినాదాలు వారి మాటల్లో

(1) పంటలు పండలేదే శిస్తుకట్టమనికాదు కట్టలేము

(2) రి సెటల్మెంటు వలన శిస్తులు పెరిగాయి, తగ్గించాలి.

(3) రైతులను భూములపై నుండి తొలగించరాదు భూమి హక్కు దారులు రైతులే.

లచ్చన సహచరులు నిత్యం ప్రాంతమంతా తిరిగేవారు. కిల్లి అప్పలనాయుడుగారు, దుక్క సూర్యనారాయణరెడ్డి గారు, బెందళం గవరయ్య, పిన్నింటి కృష్ణమూర్తి, బల్లెడ అప్పలస్వామి వగైరాలు అయితే తను ఏ ప్రాంతం వెళ్లిన ఆ ప్రాంతంలో లచ్చన్న తన వాక్పటిమతో ఎంతోమందిని తన సహచరులుగా చేసుకొనే శక్తి సామర్థ్యాలున్న నాయకుడు.

శ్రీ లచ్చన్న గారిది తిరుగులేని వాగ్ధాటి. గంగా జలపాతంలా గలగలా ప్రవహిస్తుంది. ఆచి తూచి మాట్లాడటంలో ఆయన కాయనేసాటి. జాతీయ నానుడిలను జనవాహినికి అర్థమయ్యేరీతిలో అందించుటలో అందెవేసిన చేయి. ప్రజల భాషను ప్రతిధ్వనింపజేయుటలో ప్రజ్ఞానిధి. అతి తేలికయిన పదాలతో తేట తెల్లమైన భావాలను రైతుకూలీ ప్రజానీకం మనస్సుల్లో

వాటుకొవేలా "తూటాల్ని"వంటి మాటల్ని వాడటంలో వజ్రపుతునక వంటి వారు లచ్చన్న. వాగ్ధాటి సాగిపోతుంటే అంతకన్న వేయిరెట్లుగా ముందుగా భావం పరుగెత్తుకొనిపోతూ ఉంటుంది. దానిని మించి యుక్తి పరుగిడుతూ ఉంటుంది. అందులోనుండి సహజత్వం ఉట్టిపడే రీతిని సిద్ధాంతం వెలువడుతుంది. బీదసాద జనాల్లో రైతుకూలీ ప్రజల హృదయాల్లో దూరి ఉర్రూతలాడిస్తుంది. చప్పట్లు నినాదాలతో సభ మార్మోగిపోతుంటుంది. ఇక తన ఉపన్యాసం వింటున్న జనావళి ఆనంద తరంగాలలో తేలిపోతునే ఉంటారు.

లచ్చన్న ఉపన్యాసంలో తళుకులు చెణుకులు సిద్ధాంతాలు అక్షరాస్యులకు కావలసినన్ని దొరుకుతాయి. ఇక నిరక్షరాస్యుల అమాయకత్వాన్ని మూర్ఖత్వాన్ని బ్రద్దలుకొట్టి రైతాంగాన్ని పై కెగసిపడేలా చేసిన అగ్నికణాలు దొర్లుతాయి. వారిని ఊరట పరచే అమృతపుబాసలు లభిస్తాయి. అందుకే లచ్చన్నగారి ఉపన్యాసం అన్న వ్యక్తులు తరలి రావటంకాదు గ్రామగ్రామాలే తరలివచ్చేవి. అందరినీ ఆకర్షించ గల విశిష్ట వ్యక్తిత్వం కలవారు లచ్చన్న.

ఆనాడు తన సహచరులతో మారుమూలనున్న గ్రామానికి ప్రయాణం, నడచి వెళ్లాలి తప్పించి కనీసం సైకిల్ కూడా వెళ్లదు. జాతీయ రహదారి నుండి 20కి.మీ నడవాలి. నడుస్తున్నారు.

"ఇంతకు లచ్చన్నగారు మనం ఊరూర తిరుగుతున్నాం ఫలితం ఏమైనా ఉంటుందా? సహచరుని ప్రశ్న. ఆ లేకపోవడం ఏమిటి, వెళ్ళినచోట మన అనుచరులు ఏర్పడలేదా అది ఫలితం కాదా లచ్చన్న.

"నిజమే వాళ్లు అమాయక రైతులుకదా, వాళ్లేంచేయగలరు, ముందుకు రాగలరా అవసరమైన ముడుకు పెత్తనం చేయగలరా? ఎదురించ గలరా?" అనుచరులు వేసిన ప్రశ్నతో లచ్చన్న ఆలోచించారు.

"మీరు చెప్పిన మాటల్ని కాదనను. మన వ్యూహాన్ని మార్చుదాం. కొత్త ఎత్తుగడను వేద్దాం. గ్రామం లోనికి ప్రవేశిస్తూనే ఆ గ్రామపెద్దల ఇళ్లల్లోకి జొరబడి వారిని [illegible] చేసి వీధుల్లోనికి తీసుకొని వచ్చి ఊరు రాంభజనపై

మీటింగు పెడదాం. ఇకనుండి ఈ ప్రయత్నం ఎలా ఉంటుందో చూద్దాం. అనుచరులు అంతా సై అని ఊకొట్టారు. చేరవలసిన గ్రామము చేరుకొన్నారు.

"నమస్కారం అండీ నాయుడుగారు లచ్చన్న ప్రభృతులు గ్రామం ముందొక తన కళ్లం పశువుల దొడ్లో ముందరన తన చుట్టు నలుగురైదుగురు రైతులు తనతో మాట్లాడుతుండగా చుట్ట వెలిగించుకొని, ఠీవితో దర్జా వెలగ పెడుతున్న నాయుడుగారు పిలుపుతో ఉలిక్కిపడి చూచారు.

"రండి రండి, ఏ గ్రామం బాబూమీది? మా గ్రామం ఇలా వచ్చారే మిటి? ఏమైనా వ్యవహారమా చుట్టరికమా ఎడతెగని ప్రశ్నలతో ముంచెత్తారు నాయుడుగారు.

లచ్చన్న అనుచరులకు కొంచెం మనసు బాధపడింది. ఇదేమిటి, రాత్రి అనక పగలనక పెళ్లాం పిల్లల్ని విడచిపెట్టి గ్రామం గ్రామం తిరుగుతూ రైతు కూలీల బాగుకోసం పాటుపడుతున్న వారికి చుట్టాల్లా పలకరింపులా? "ఏమండీ నాయుడుగారు మా సంగతే ఇంతవరకు మీకు తెలియదా? మన జమిందార్లు మన రైతులకు ముప్పతిప్పలు పెట్టి మూడు చెఱువుల నీళ్ళు త్రాగిస్తున్నారు కదా వాళ్లను ఎదిరించాలని యిలా మేము తిరుగుతున్నాం. మీవంటి వారి వద్దకు వచ్చి సహాయం కావాలని అడుగుతున్నాం. లచ్చన్న అనుచరులు కొంచెం తీవ్ర స్థాయిలోనే అడిగారు.

"అదేమిటి బాబూ, మాకేమీ తెలియదు. ఎక్కడ ఏం జరుగుతున్నా తెలియని ఈ పల్లెలో మేమున్నాం. రేడియోలంట, పత్రికలంట ఆ పేర్లు వినటమే తప్పించి మా కెరుకలేదు. అన్నీ పట్నాల్లోనేకదా ఉంటాయి. మాకెలా తెలుస్తుంది బాబూ చెప్పండి. నాయుడు గారు దీనంగానే అన్నారు. "నిజమే నాయుడు గారు మీకు తెలిసిందల్లా జమిందారు గారంపిన సముద్దారు గారు వాడి బంట్రోతు డఫేదారు. జమీందారీ రౌడీలు ఎందుకంటే వాళ్ళు ముక్కు పిండి పన్నులను రైతులనుండి వసూలు చేస్తారు. లచ్చన్న గారన్నారు. "బాగా అన్నావు. బాబూ నేను గ్రామానికి నాయుడును అయిన ఈ రైతులు కూలీల బాధలు పోవాలనీ నాకూ ఉంది. అయితే ఇది సాధ్యమా" నాయుడూ "మీరు సహకరించండి, మేము సాధించి చూపెడతాం లచ్చన్న మాటతో నాయుడు లేచి ఊరు మధ్యలో గళ రామ

మందిరానికి పిల్లను తీసికొని వెళ్లారు. "తలారిని" పిలిచి ఎవరో పెద్ద వాళ్ళువచ్చారు.అందరిని భజన వద్దకు రమ్మని దండోరా వేయమని చెప్పారు.

ఇంతలో కరణం గారు వచ్చారు. రెవెన్యూ మున్సబుగారు హజరైవారు. భజన మీద పెద్దలున్నారని వినగానే ఆ గ్రామ మోతుబరి రైతులంతా మెల్లగా చేరుకున్నారు. ఇంతమంది పెద్దలు కొత్తగా వచ్చిన నాయకులు వున్నపుడు పల్లె ప్రజలకంతకు విడ్డూరమే పని పాట్లను ప్రక్కకు నెట్టి అందరూ హజరైవారు.

తమ చుట్టూ మూగిన జనాలను చూచి అచ్చన్న హృదయం ఆనందం ఉప్పెన ప్రవహించింది. ఎంత స్థాయిలో జన సంఖ్య ఉంటే అంత స్థాయిలోని తన ఉత్సాహం, ఉద్రేకం వెళ్లి నిలుస్తాయి. వేదిక అంటూ ఏమీ లేదు. తను కూర్చొన్న రామ మందిరమే వేదిక. తన ముందు కూర్చున్న వారు యింకా దూరదూరంగా నిలుచుని ఏం చెబుతారు. చూస్తున్న వారు ఆ గ్రామ స్త్రీలుకూడా. అల్లంత దూరంలో నిల్చుని ఎవరో నాయకులు వచ్చారంట ఏమి చెబుతారో అని ఎదురు చూస్తున్న వారే ఇక ఆబాల గోపాలం అంతా అచ్చటనే గుమికూడి ఉన్నారు. నిశ్శబ్దం ఆవరించింది. అచ్చన్న లేచారు. ఉపన్యసించటానికి, గ్రామ పెద్దలకు అభివందనలు తెలిపి ఉద్యమించాలని ప్రబోధించారు జరుగుతున్న అన్యాయాలను వర్ణించారు. వాటిని ఎలా తిప్పికొట్టాలో బోధించారు.

ఈ జమిందారీలోగల గ్రామాలన్నింటిని తిరిగి ముఖ్యలను కార్యకర్తలుగా చేసికొని జమిందారీ రైతు సంఘాల్ని ఏర్పాటు చేస్తున్నాం. ఆ సంఘం ఈ జమిందారీతో పోరాటం సాగిస్తుంది. రైతు కూలీల హక్కులను కాపాడుతుంది. మీరంతా మాకు తోడ్పడాలి.

1. [illegible] కట్టమని కాదు కట్టలేము. కట్టము. కరువు కాటకాలు- కటిక దారిద్ర్యం కారణాలు [illegible]

2. [illegible] పెంచారు. భూమి పెరగలేదు. శిస్తులు [illegible]

3. భూములనుండి రైతులను తొలగించరాదు. తొలగించె హక్కు జమీందారీకి లేదు.
4. జప్తుల్ని జరిపిన రైతులను బాధపెట్టిన రైతాంగం ప్రతిఘటిస్తుంది.
5. శిస్తు బకాయిలను రద్దు చేయాలి.
6. చెరువులను మరమ్మత్తు చేయాలి.
7. జమీందారీ జులుం అంతరించాలి.
8. శిస్తు హెచ్చింపుపై కోర్టులో వ్యాజ్యాలు వేయాలి.
9. జమీందారీలను రద్దు చేయాలి.

పల్లె ప్రజానీకం ఆనందోత్సాహాలతో మునిగిపోయింది. తరతరాల దాస్యంతో మునిగిపోయి నిత్యదారిద్ర్యం అనుభవిస్తున్న రైతుకూలీలకి మాటలు అమృతపు సొనలుగా వినిపించాయి. అచ్చన్న గారికి జై అన్న నినాదాలతో సభ ముగిసింది.

## గంజాం జిల్లా జమీందారీ రైతు రక్షణ సంఘాల నిర్మాణం చీకటి జమీందారీ – రైతు సంఘం :

రైతు సమస్య తీరనిదే దేశ సమస్య తీరదు, దోపిడీకు గురవుతున్న రైతాంగం బ్రతికి బట్టనిదే దేశం బాగుపడదు. రైతుల గోడు ఎవరు పట్టించుకొనక పోతే వారెలా చైతన్యవంతులవుతారు. దుర్భర దారిద్ర్యంలో మునిగి ఉన్నారు. గ్రామాల్లో గల రైతాంగం కూడు గుడ్డ వసతి లేక కుమిలి పోతున్నారు. పండించిన ఆ కాస్తా పంట ఆ జమీందారీకే భుక్త మవుతున్నది. ఆ ఇనాందారులకే భుక్తం అవుతున్నది. ఇక రైతాంగం బ్రతికే బట్ట గట్టేదెప్పుడు ?

ఉత్తరాంధ్రలో విరివిగా రైతు సంఘాల్ని ఏర్పాటు చేయాలన్న నిర్ణయానికి వచ్చారు. అందువలన మొదటగా చీకటి ఎస్టేట్ రైతు సంఘాన్ని ఏర్పాటు చేయాలి. జమీందారు గ్రామమైన తలతంపర గ్రామంలో రైతు మహాసభను 16-8-1834 న జరపాలని నిర్ణయించాం. జమీందారీ రైతులు యావన్మందికి సభకు హాజరు కావాలని కోరుతున్నాం. రాష్ట్ర రైతు

నాయకులు జిల్లా రైతోద్యమ నాయకులు పుల్లెల శ్యామసుందరం రైతు పోరాటనాయకుడు గౌతు లచ్చన్నతో స్వాతంత్ర నాయకులు పాల్గొందురు.

ఇట్లు
కన్వీనర్స్,
చీకటి ఎస్టేటు రైతు రక్షణ సంఘం
తలతంపర
చెందాళం లచ్చయ్య నాయుడు
పిన్నింటి కృష్ణమూర్తి

కరపత్రం అన్న కాగడాగా భావించిన దినాలవి. ఆనాడున్న చదువరులే అతి స్వల్పం. ఆనాటి సమాజాన్ని అదుపు ఆజ్ఞలలో ఉంచినది వాళ్లే కాస్త చదివిన వారు ఇటు జమిందారీ పంచల్లో దొరకడమో లేక అటువంటి పాలనలో నౌకరీకి చేరడమో జరిగేది. ఇక ఆ కాస్తాలో మిగిలిన కాస్త చదువరులు. ఈ రైతోద్యమానికి ఊపునిచ్చి ముందుకు రావాలి. జడంతో గడ్డకట్టుకు పోయిన రైతాంగాన్ని కదిలించే పోరాట చైతన్యాన్ని యీరిక కలిగించాలి.

ఆనాటి వరకు ఏనాడూ కరపత్రాలు పంచడం బహిరంగ సభలు జరగడం తెలియని ప్రజలు రైతు మహాసభల్లో పాల్గొనటానికి ఆ ప్రాంతం రైతులు పోటీ పడుతున్నారు. అందులో జమీందారులున్నా హడలెత్తి పోతున్న రైతాంగానికి ఆ జమీందారులనే ఎదిరించ జబ్బ చరుస్తున్న నాయకులను జూడటానికి రినా రైతులుంటారా, పల్లెల్లో గల రైతు లెల్లరుజండాలు పట్టుకొని తలతంపర రైతుల మహాసభకు తండోప తండాలుగా వచ్చారు.

ఆ సమావేశానికి హాజరయిన నాయకులు కార్యకర్తలలో ముఖ్యులు పుల్లెల శామసుందరం, గౌతు లచ్చన్న, బెందాళం గవరయ్య, మార్పు పద్మనాభం, తరణి ఆచారి, దుర్గఢ సాహు మొదలగు వారు హాజరయ్యారు.

గౌతు లచ్చన్నగారు సభలో కొన్ని తీర్మానాల్ని ప్రవేశ పెట్టారు. చీకటి ఎస్టేట్ తలతంపర ముఠా రైతు సంఘానికి, రావణ్యాద్వారై న: శ్వకటురీగా ఈ సభ తీర్మానిస్తుంది.

చీకటి జమీందారీ రైతు వ్యతిరేక విధానాలను మనం త్రిప్పి కొట్టాలి. 1930 జమీందారీ చట్టంలో రిసెటల్‌మెంట్ పేర శిస్తులు పెంచటానికి ఎత్తుగడ వేశారు. దీనిని మనం తిరస్కరించాలి. సంఘం వారికి తెలియకుండా ఒకరు శిస్తులు చెల్లించరాదు. అనగా శిస్తు దరఖాస్తుల్లో పన్నులను కట్టము అని కాదు. ఆర్థిక పరిస్థి తుల వలన పన్నులను కట్టలేము అని చెప్పాలి. సభ ఇంత కన్నా రైతుకు కావలసిందేమిటి "ఇక ఏక్కడ బుక్కడు" రాజుగారు రంకె వేయరు ఆ తీర్మానాన్ని ఆమోదించారు.

ఇంతలో ఆ సభలోనుండి ఒక రైతు లేచాడు. "బాబుగారూ పన్నులు కట్టకపోతే రాజుగారు దౌర్జన్యం చేస్తాడు బాబు", మీరేమి తక్కువ వారా? రాజుగారు వారి సేవకులు ఎంతమంది ఉంటారు. మీరెంత ఉంటారో లెక్క వేయండి. మిమ్ములను మీరు మరచిపోకండి. మీ బలాన్ని మీరు తక్కువ అంచనా వేయకండి. ఎదిరించండి. నిలబడండి. మీహక్కులను కాపాడుకోండి. లచ్చన్న ధైర్యం చెప్పారు. "పన్నుల్ని చెల్లించలేవని మా ఆస్తుల్ని జప్తులు చేస్తారు బాబూ", మరొక దీన రైతు ఆవేదన. అదే సభలో "ధాన్యాన్ని జప్తుచేసిన మన గాదెల్లోనే కద ఉంచుతారుకద, వాళ్ళువెళ్ళిన వెంటనే ఆ సీలులను ఊడబెరికి వాడుకోండి". లచ్చన్న ఉద్రేకంతో ప్రకటించారు. వేదికపై ఉన్న పెద్దలు లచ్చన్నను తగ్గించుటకు సూచనలిచ్చినా, ఆవేశాన్ని ఆపుకోలేకపోయారు లచ్చన్న. ఇంకా మనం ఎన్నాళ్ళు ఈ రైతులు కుక్కి మంచాల్లో కునుకుతీయాలి, కలోగంజో త్రాగుతూ బ్రతకాలి. ఎవడిచ్చాడీ జమిందారీకి హక్కులు. ఈ రైతుల్ని పీల్చి పిప్పిచేసే అధికారం. వీడి భోగభాగ్యాలకు దర్జాలకు హోదా అంతస్తుల్ని దోచుకుంటున్నాడు. ఇందుకు ఎందరో నాయకులు వత్తాసు పలికారు.

ఈ జమిందార్లకు ఈ జమిందారీలు ఎలా వచ్చాయో మనకు తెలుసు గదండీ, మన దేశాన్ని పాలించిన మొగలులనుండి నైజాం నవాబు నుండి బ్రిటిషువారినుండి ఈ జమిందారులు ఈ జమీన్‌లను (భూములు) పొంది ఒక్కొక్క ప్రాంతం జమీన్‌లకు ఒక్కొక్క జమిందారు ఏర్పడినాడు. అంతమాత్రాన దుర్భిక్షం పెట్టక మీ చెఱువులకు మరమ్మత్తులు చేయకపోయిన, మీ పంటలు పాడయిన మీరు పన్నులు చెల్లించాలా, చెల్లిస్తారా చెప్పండి కార్యకర్తలు నిలదీసి సభిక రైతాంగాన్ని ప్రశ్నించారు.

పన్నులను కట్టలేము - రైతాంగం ఘోషించింది. ఆ మాటమీదే మీరుండాలి. మీ జమీగ్రామాల్లో 21 గ్రామాలున్నవి. అదనపు శిస్తుల్ని వెంటనే రద్దుచేయాలి. మీరంతా రేపటినుండి ఎవరు మీవద్దకు వచ్చి పన్ను అడిగిన కట్టమని చెప్పకండి, కట్టలేము అని ప్రకటించండి. మీ సంఘనాయకులకు ఏం జరిగినా చెప్పండి. మేము వెంటనే వచ్చి ఆదుకుంటాం. ముఠాకి బెందాళం గవరయ్యను అచ్చయ్య నియమించిన లావణ్యా ద్వారైను ఈరైతు మహాసభను దిగ్విజయం చేసినందుకు అభినందిస్తున్నాను.

పన్నుల నిరాకరణోద్యమం, శాసనోల్లంఘనోద్యమం కొనసాగుతున్న దినాలవి. భారతదేశ స్థాయిలో కొనసాగుతున్న ఉద్యమానికి చీకటి "ఎస్టేట్" రైతు రక్షణ సంఘం యిచ్చిన పిలుపు కూడ ప్రత్యక్ష పన్నుల నిరాకరణోద్యమమే.

పన్నులు కట్టవద్దన్న అచ్చన్నను రైతన్న ఎన్నదగిన నాయకునిగా ఎన్నుకోవడంతో అచ్చన్న రైతాంగానికే ప్రాణప్రదంగా నిలిచిపోయారు.

## (2) మందసా ఎస్టేట్ - రైతు సంఘం :

ఇంతవరకు అడ్డు అదుపులేకుండా కొనసాగుతున్న జమిందారుల దౌర్జన్యాలకు ప్రతిఘటన పిలుపు వచ్చింది. "దుర్భిక్షం - శిస్తులను రద్దు చేయండి - చెఱువులకు మీ తాత ముత్తాతలనుండి మరమ్మత్తులే లేవు. మీకు పన్నులెలా చెల్లిస్తాం. ఎందుకు చెల్లించాలి ? సెటిల్‌మెంట్, పేర భూముల విస్తీర్ణం పెంచి మా శిస్తుల్ని రెండింతలు వసూలు చేయడం అన్యాయం. భూములపై హక్కులేని రైతులు ఆ భూములను ఎలా బాగు చేస్తారు. ఎందుకు బాగు చేయాలి. మీకు శిస్తుకట్టలేదని అక్రమంగా ఆ రైతును తొలగిస్తే, ఆ భూములనే నమ్ముకొన్న రైతు బ్రతుకు ఏం కావాలి. ఎక్కడకు పోగలడు శిస్తు మాఫీలు జరిగిన రెమిషనులు మంజూరు అయిన మానుండి బకాయిలను రాబట్టుకోవటానికి. మా ఆస్తుల్ని జప్తుచేయడమేమిటి? రాజావారి దివాన్‌ను ఎదిరిస్తాము అంటూ అచ్చన్న - గేదెల చిట్టెయ్య - కొండపల్లి కామేశ్వరరావు. అబ్బూరి రామస్వామి గిరిజన నాయకులు వైరా కార్యకర్తలు ఉద్యమాన్ని నడిపారు.

ఆపండి మీ ప్రేలాపనల్ని ఎవరి ముందు మాట్లాడుతున్నారో తెలుసా? గద్దించాడు దివాన్ రామకృష్ణ మందసా రాజావారి కోటలో కొలువు తీరుస్తూ చిత్తగించండి ఆ మాటలన్నది మేముకాదు ప్రభూ మన ఎస్టేట్‌లో ఏ గ్రామం వెళ్లినా రైతు అన్న మాటల్ని విశదం నిమిత్తం ప్రభువులవారికి విన్నవించాం అంతే, సమాధానం ఇచ్చారు ఎంతో దీనంగా భయంగా. సమూద్దర్‌గారు పన్నులు వసూలు చేయటానికి జమిందారులుచే నియమించబడిన అధికారి, దివాన్‌గారు ఏం శెలవిస్తారో అని ఎదురు చూస్తూ చేతులు కట్టుకొని నిలుచున్నారు దఫేదారు. తలారులు జమిందారీభటులు, గ్రామాల నాయుళ్ళు, కరణాలు, ఇతర సిబ్బంది.

రైతులు అంతవరకు వచ్చారా? దివాన్ గర్జించాడు. రాక ఏంచేస్తారు ప్రభూ ఏదో రైతు రక్షణ సంఘమంట వీళ్ళని అది రక్షిస్తుందంట.

"ఎవడ్రా రైతు ర క్షణ సంఘాన్ని పెట్టినవాడు" - దివాన్ ప్రశ్న.

ఇంకెవరు మీకు తెలుసుగా ఈ ప్రాంతంలో తిరుగుబాటుదారునిగ పేరుపొందిన పుల్లెల శ్యామసుందరం, అతని శిష్యుడు లచ్చన్న వగైరాలు. "ఏమిటి వారంత వరకు వచ్చారా! మనకెదురొచ్చేటంతటి మొనగాళ్లా వీరు దివాన్ ఆశ్చర్యపడ్డారు. "అబ్బో వాళ్ల జబ్బ సత్తువ చూపిస్తారట చూడటానికి. గొప్ప పొగరుబోతులు ఏ ఒకరు వారిని ఎదిరించక ముందు పడటానికే జంకుతారు ప్రభూ - "ఆపండి వారిలో లేని గొప్పదనాన్ని చూసి బెదరిపోతున్న చాతకాని దద్దమ్మలు మీరు" దివాన్‌గారు మండిపడ్డారు. "ప్రభువులు మన్నించాలి వారిని ఏమన్నా రైతులంతా ఒకమారుగా అతనిని వెనకేసుకొని వస్తున్నారు. అతనిని ఏమన్నా సహించమని హెచ్చరికలు చేస్తున్నారు ప్రభూ

"ఓహో అంత నాయకులా వీరు ఆ పుల్లెల శ్యామసుందరరావు, లచ్చన్నను ఈ బక్కచిక్కిన రైతులు ఎలా రక్షిస్తారో చూస్తాను. రాజు నౌకర్లను చూస్తూ మీరంతా మాకోటలో దున్నపోతుల్లా తిని బలుస్తూ ఉండటమేనా లేక మనల్ని ఎదిరిస్తున్న వారిని ఎదిరించలేరా, మీరున్నదెందుకు, అందుకే "శలవియ్యండి రాజా, ఆ లచ్చన్నను పట్టి కాళ్లు విరగ్గొడతాము" భటులు పలికారు.

బుద్ధిలేని గాడిదలు బాహాటంగా అతనిని చేతుల్ని మీరు విరగ్గొడితే రైతులంతా ఒక్కమారీ కోటపైబడి మా బుర్రల్ని ఎగరగొడతారు. అందుకు మూడోకంటికి తెలియకుండా పని జరగాలి. మనకు ఎదురు తిరిగినవారికి ఎటువంటి గతిపడుతుందో మనం చెప్పకుండానే అందరికీ తెలియాలి వెళ్లండి. భటులు ఈ మాటలు విన్న తరువాత అక్కడనుండి కదిలారు.

"ఎవరక్కడ" చిత్తంబాబూ సేవకులు వచ్చి నమస్కరించారు. మన ఎస్టేటు ఆఫీసరును పిలుచుకొనిరండి. తమకోసం చూస్తున్నారని చెప్పి తోడ్కొని రండి. చిత్తం ప్రభూ సేవకులు నిష్క్రమించారు.

దివాన్‌జీ పిలుపునందుకొని కోర్టు ఆఫ్ అవార్డు క్రింద సర్కార్ వారి చేత నియమించబడిన అధికారి వచ్చారు కోటలోనికి. మందసా రాజా శ్రీనివాస మహారాజాగారికి సంతానం లేదు. అతని పెంపకం కొడుకే తనకు వారసుడు. వారసుడు మైనర్ అయినందున కోర్టు ఆఫ్ అవార్డు క్రిందకు వచ్చింది. సర్దార్‌వారు ఎస్టేట్ వ్యవహారాల్ని చూడటానికి, ఆఫీసరుని నియమించింది. ఆ నియమించిన ఆఫీసర్ గత రాజుల విషయాలను త్రవ్వి చూడటం ప్రారంభించారు. తనవిధిని తాను నిర్వర్తించు కొనిపోయే పరిస్థితిని మించి తన ప్రవర్తన కొనసాగుతుంది. ఉండేది తనకున్న ఆవగింజంత అధికారంలో చిటికెన వేలంత పనిని నిర్వర్తించమని సర్దారువారు తనను ఆదేశిస్తే తనకు కొండంత అధికారం ఉందని భూమండలాన్నే పరిపాలించటానికి సిద్ధమయ్యాడు ఆ అధికారి.

వచ్చిన ఆఫీసరుకు ఉచితాసన మిడి కుశలప్రశ్న తదుపరి దివాన్‌జీ మాట కదిపారు. మా ఎస్టేట్ రైతులు బకాయిలను కట్టలేదట. పైగా ఏదో రైతురక్షణ సంఘమట పన్నులను చెల్లించరట ఆఫీసర్‌గారు ఏమిటిదంతా మీరు చక్కబెట్టాలి. దీనంగా ప్రార్థిస్తున్న వదనంతో అడిగారు దివాన్‌జీ. దివాన్ తనను దీనంగా అర్థించడంతో ఆఫీసరు ఒక్కమారుగా తను భూలోకం విడచి దేవలోకంలో ఉన్నట్లయింది. "నా తడాఖా చూపిస్తా మీరు అధైర్య పడకండి. ఈ రైతులు, రైతు సంఘాలు, ఈ నాయకులను ఊడ్చి పారేస్తాను. శిస్తుదిస్తులు వసూలు చేస్తాను". గంభీరంగా ఉపన్యసిస్తున్న ఆఫీసర్ను అభినందిస్తూ దివాన్‌జీ నమస్కరిస్తూ తన పాచిక పారిందని లోలోన సంతోషించారు.

సబ్ కలెక్టర్ స్థాయిలోనున్న ఆఫీసర్ తను ఆ కాలంలో అతనికున్న అధికారాలు తిరుగులేనివే. వారి పాలనలో మనకున్న అధికారాలు పూజ్యమే. బానిసలుకి అధికారాలెలా వస్తాయి.

పోలీసుల్ని పిలిపించారు. సబ్‌కలెక్టరు ముందుకారును తోలుకుంటూ పోతుంటే వెనుక పోలీసులు పరుగెత్తుకొని వెళ్తున్నారు. సబ్‌కలెక్టరు బయలుదేరారు. ఏ గ్రామముమీద పడతాడో రైతులు భీతావహం చెంది పోతున్నారు.

ఎదురుగా రాజావారి సముద్దార్‌గారి తదితర సేవకులు వచ్చి సబ్‌కలెక్టరుకు నమస్కరిస్తూ శొండిపూడి గ్రామం నుండి వస్తున్నాం. ప్రభువులు చిత్తగించాలి. అచ్చట ఈ దినం రైతురక్షణ కమిటీవారు సభ జరుపుచున్నారు బాబూ, నాయకులు కూడా వచ్చియున్నారు బాబూ. "ఎవరా నాయకులు" సబ్‌కలెక్టరు గద్దించారు. "చిత్తం పుల్లెల శ్యామసుందరం గారు, గౌతు లచ్చన్నగారు" ఆపండి వాళ్ళ సంగతేమిటో నేను చూస్తాను. ఇక ఈ సంఘంలో ఉన్న రైతుల పేర్లను చెప్పండి. వాళ్ళపేర్లనునోట్ చేయండి అని ఆదేశంచడమే తరువాయి సేవకులు వ్రాసుకున్నారు.

సబ్‌కలెక్టరు ప్రవేశించారు. రైతులు, నాయకులు చుట్టు మూగారు. మనసుల్లో భయాందోళనలు చెలరేగాయి. అయినా తమ నాయకులు న్నారన్న ధైర్యం కొంత ఊరట కలిగించింది.

నాయకులు, రైతులు కలెక్టర్ వద్దకు సవినయంగానే వెళ్లారు. కష్టనిష్ఠూరాలను చెప్పుకోవాలన్న తలంపుతోనే ఉన్నరు. సర్కార్ మనిషి జమిందారీ ఉద్యోగికాడు కదా న్యాయం చేస్తాడేమో నన్నది వీళ్ళ ఆశ.

చట్టం ప్రకారం శిస్తులు వసూలు చేస్తుంటే బకాయిలను చెల్లించమంటే ఎవరో ఎదురు తిరుగుతున్నారట ఎవరువారు? సబ్‌కలెక్టరు ఠీవిగా అన్నడు. "రైతులే ఎదురు తిరుగుతారు ఇంకెవరు ఎదురుతిరుగుతారు" లచ్చన్న. మీరెవరు? సబ్‌కలెక్టరు "మీకు తెలిసే ఉంటుంది అయిన చెప్తు న్నాం మేము రైతులను రక్షింపచూస్తున్న సామాన్య కార్యకర్తలం" సంస్కారం ఉట్టిపడేలా లచ్చన్న యిచ్చిన సమాధానం.

మీరెవరండీ వాళ్లను రక్షించటానికి? జమిందారులున్నారు, ఆ పైన "సర్కారు" వారున్నారు. సర్కార్ అధికారులం మేమున్నాం" సబ్‌కలెక్టరు మాటలకు "మీరు రక్షిస్తారన్న ఆశతోనే మీముందుకు వచ్చి నిలుచున్నాం లేకపోతే మేము రాకపోయి యుండేవారం" లచ్చన్న సమాధానం.

ఏమిటీ నీ డొంక తిరుగుడు సమాధానం సబ్‌కలెక్టరు గద్దించారు. చూడండి మీరు బాధ్యత గల సర్కార్ ఉద్యోగస్తులు గద్దిస్తే సరిపోదు రైతుల పరిస్థితిని చూడండి. మీరెవరు? అని పుల్లెల శ్యామసుందరం వైపు తిరిగి అడిగాడు. ఈతనే గంజాం. జిల్లా రైతు సంఘానికి ప్రెసిడెంటు పుల్లెల శ్యామ సుందరం.నేనీ సంఘానికి సెక్రటరీని లచ్చన్న తీవ్ర స్వరంతో జవాబిచ్చారు.

"మీరు సంఘాలుగా ఏర్పడటం శాసనాల్ని ధిక్కరించటానికా అన్యాయాలు జరిగితే న్యాయస్థానాలకు వెళ్లండి రీ సర్వే సెటల్‌మెంటు కోర్టు యిచ్చిన తీర్పు మేరకు శిస్తులు వసూలు చేస్తున్నాం" సబ్‌కలెక్టరు దౌర్జన్య స్థాయినుండి కొంచెం దిగివచ్చి చెప్పారు.

శిస్తులు పెంచటానికి తీర్పు ఇచ్చిన కోర్టులను మీరు బలపరుస్తున్నారు మరి ఆ శిస్తులను మాఫీ చేయమని, రిమిషన్‌లు యిమ్మని, సర్కార్ వారు ఆదేశించిన మీరెంత వరకు అమలు పరచారు. లచ్చన్న ఆ విధంగా అడిగే సరికి ఆఫీసర్‌తో వివేకం సన్నగిల్లింది. చట్టరీత్యా మీరు చేయవలసింది మీరు చేస్తే మేము చేయవలసింది మేము చేస్తాం. అంటూ శ్యామసుందరం లచ్చన్నలు అటనుండి వెళ్లారు.

పుల్లెల శ్యామసుందరంగారు లచ్చన్నగారు ఆ దినం కొండిపూడి అనే గ్రామం చేరుకున్నారు. అందరిమధ్య నున్న లచ్చన్నను బయటకు పిలిచి చెవిలో ఏదో చెప్పారు. మరల అందరితో కలిసి చర్చలు కొనసాగించారు. చర్చలు కొనసాగుతూనే ఉన్నాయి. తదుపరి కొందరు రైతులను వెంట బెట్టుకొని గ్రామం అవతల వీధిలోనికి వెళ్ళివస్తామని బయలుదేరారు లచ్చన్నగారు. పోలీసులు కుమ్మక్కయి శిస్తులు వసూలు, రైతులంతా ఏమి చేయాలో తోచని స్థితిలో పడిపోయారు. ఇంతలో ఒక తంతివార్తను చేత్తోనా సర్కార్ సేవకుడు గుఱ్ఱంపై కొండిపూడి గ్రామం చేరుకున్నారు. సబ్ కలెక్టర్ వారికిచ్చిన తంతి వార్త అది. "మీరు వెంటనే దౌర్జన్యంగా

జరుపుతున్న శిస్తు వసూళ్ళను ఆపండి. మీరు ఒక వైష్ణవ స్త్రీని ఆ పల్లెలో బలాత్కరించడం హీనాతి హీనమైన నీచపుపని, ఇందుకు మీ పై క్రమశిక్షణ చర్య తీసికోబడుతుంది.

ఇట్లు,

కలెక్టర్ మద్రాస్ ప్రెసిడెన్సీ సబ్ కలెక్టర్ గుండెలు జల్లుతున్నాయి. ఆనాడు కలెక్టర్ ఈనాటి గవర్నర్ కన్నా మించిన వాడని చెప్పిన అతిశయోక్తి లేదు. కంపెనీ పాలనకు అతడే ప్రతినిధి. తెల్లదొరకు తప్పించి వేరొకరికి ఆస్థానం దొరకనిది.

సబ్ కలెక్టర్ దిగాలు పడటంతో చుట్టు సేవక బృందం చేరారు. ఏమి జరిగిందో వారికి తెలియలేదు. చూడండి సముద్దార్‌గారు నిన్నగాని, మొన్నగాని ఈ గ్రామంలో ఉన్న వైష్ణవ కులస్థురాలయిన స్త్రీ ఇంటికి వెళ్లి జప్తు చేసారా? అధికారి అనగానే రికార్డు పరిశీలించారు. ఎవరెవరింట్లో అన్నట్లు జప్తులు చేసిన చిట్టా తెరచారు సముద్దార్.

"లేవండి బాబుగారు మేమింకా వాళ్ల ఇంటికి జప్తు చేయటానికి పోలేదు." జవాబు విన్న సబ్ కలెక్టర్‌కు మతి చలించింది. ఉక్రోషంతో ఉలికిపడి లేచారు. "వెంటనే ఆ వైష్ణవ స్త్రీని ఇచటకు తీసికొని రండి. ఆదేశం అందడమే తరువాయి, భటులు పరుగెత్తుకొని వెళ్లారు.

గ్రామంలో ఉన్న నాయకులతో బాటు రైతులందరికీ వార్త తెలిసిపోయింది. రైతులు స్త్రీలు పిల్లలు వృద్ధులు అంతా గుమికూడారు. సబ్ కలెక్టరుగారు వైష్ణవమ్మను ఎందుకు తన "మకాం" కు పిలుస్తున్నారు. ఒకవేళ ఆస్తి జప్తు చేయాలన్నా వాళ్ల ఇంటికి వెళ్లాలి కదా! నాయకుల చుట్టూ మూగిన రైతుల ప్రశ్న.

పిల్ల రైతు నాయకుడు "ఏమో ఎవరికెరుక, ఒకవేళ ఆ ఆఫీసరు గారికి ఈ వైష్ణవమ్మ మీద మనసుపడిందేమో, ఎంతయినా అందగత్తె కదా! ఈ మాట విని కొందరు నవ్వు కున్నారు. మరి కొందరు ముక్కు మీద వేళ్లేసు కున్నారు.

ఆ వైష్ణవమ్మను ముందు నిడుకొని పోలీసులు, సబ్ కలెక్టర్ మకాంకి తీసికొని వెళ్లడం చూస్తున్న ఊరు జనమంతా వెనుకకు వెళ్లడం ప్రారంభించారు. సబ్ కలెక్టర్ వద్దకు చేరుకొనేసరికి ఊరుకి ఊరు అచట సమావేశమై నట్లయింది.

ఎదురుగా వస్తున్న వైష్ణవమ్మను చూచి ఉగ్రుడై సబ్‌కలెక్టర్ ప్రశ్నించారు. "ఏమమ్మా నిన్ను నేను బలాత్కరించానా? సరసానికి రమ్మని నిన్ను జబ్బ పట్టుకొని లాగానా, ఊ చెప్పు, నిజం చెప్పు. వైష్ణవమ్మ తటపటాయిస్తూ చూస్తున్నది. సబ్‌కలెక్టర్ మాటలు విన్న పల్లె ప్రజలకు ఏమీ అర్థం కాలేదు. పిల్లి రైతునాయకులలో ఒకరు ముందుకు వచ్చి "ఏం వైష్ణవమ్మ జరిగింది చెప్పటానికేం, ఏం జరిగిందో, చెప్పు మేమంతా వింటాం". అడిగాడు.

చెప్పటానికేముంది బాబూ, చెప్పలేక సిగ్గు పడి చస్తున్నాను. మరల వీధిలోనికి పిలిచి నన్నిట్లా అవమానపరుస్తున్నారు". అని ఆమె అన్న మాటలకు "నిన్ను అవమాన పరిచిందెవరు" సబ్ కలెక్టరు అడిగారు. మీరే నన్ను జబ్బ పట్టుకొని సరసానికి రమ్మని లాగలేదా? మీరునా మీదపడి బలాత్కరించలేదా? నీవు అంగీకరిస్తే మీ భూములకు పన్ను కట్టనవసరంలేదు. మీ ఆస్తుల్ని జప్తు చేయను ఆ సొమ్మంతా నేనే కట్టేస్తాను నా కోరిక తీర్చు అని అనలేదా? అందుకే నేను మద్రాసు కలెక్టరు వారికి తంతి ఇచ్చాను. నాకు ఘోరం జరిగిందని, రక్షించమని అందరి ఎదుట గంభీరంగా అంటున్న వైష్ణవమ్మకు ఏం సమాధానం చెప్పాలో సబ్‌కలెక్టరు వారికి అర్థంకాలేదు. ఇది తనపై బనాయించిన కేసు అని తనకర్థమై పోయింది. ఇదిగో తోక అన్నా అదిగో పులి అన్నట్లు ఒక్కమారుగా అచట మూగిన జనం అంతా ఛీ ఛీ అనడం వినిపించింది. ఎంత ఆఫీసరైతే మాత్రం మన ఆడవాళ్లమీద చేయిచేసుకుంటాడా? అని ఒకరు అధికారం ఉంటే పన్నులు వసూలు చేసికోమను. జప్తులు చేసుకోమను. స్త్రీలను బలాత్కరిస్తారా?

అంతవరకు వారి వారి ఆస్తులను దయాదాక్షిణ్యం లేక నానా దుర్భాషలాడి, వారి స్త్రీలను కూడా నానా విధిలుగా తిట్టిపోసి నోటికి వచ్చినట్లు దూషించిన కలెక్టరును ఎదిరించటానికి ఆ పల్లెల్లో గల ఏ ఒకరు వెనకపడలేదు.

ఈ అన్యాయం జరిపిన ఆఫీసర్‌ను వెంటనే దండించాలి. ఈతనిని వెంటనే శిక్షించాలి. పల్లెజనంలో నుంచి ఆందోళన చెలరేగింది. సబ్‌కలెక్టరు గ్రహించడు తను బెట్టుసరిచేస్తాడా, తన ఉద్యోగానికే ముప్పు తప్పదని తెలుసుకొన్నారు. అందరి ఎదుట లబోదిబోమని అరుస్తూ ఏడుస్తూ వైష్ణవమ్మ తన యింటికి వెళ్లింది.

శిస్తుల వసూలు ఆపమని – స్త్రీలపయి అత్యాచారాల్ని మానమని – తగిన విధంగా శిక్షిస్తామని సబ్ కలెక్టర్ వెంటనే రైతునాయకులను రమ్మని కబురంపారు. తనతో మంతనాలు జరపమని కోరారు. రైతురక్షణ సంఘాన్ని రైతునాయకులు మాత్రమే లోనికి రానిచ్చారు. తనపై బనాయించిన కేసునుండి తను తప్పుకోవాలి. ఇదీ ఆఫీసరుగారి ఎత్తుగడ.

"చూడండి, మీరంతా రైతునాయకులు పెద్దలు. నేను చేయని నేరాన్ని నా నెత్తిపై వేయడం న్యాయమా? అని దీనంగా ప్రశ్నించాడు సబ్‌కలెక్టరు. ఏమి జరిగిందో మేము చూడలేదు. ఆ భగవంతునికే తెలియాలి.ఇక మీరావిడను రెక్కపట్టుకొని లాగడం ఎంతమంది రైతులు చూచినట్లు చెబుతున్నారు. సాక్ష్యం కూడా పలకటానికి సిద్ధంగానున్నారు.

"అన్యాయం, నేను వాళ్ల ఇంటికి వెళ్ళనేలేరు" సబ్‌కలెక్టర్

"చూడండి సబ్‌కలెక్టరు గారూ, మీరు ప్రతి ఇంటికి వెళ్ళి రైతులను దూషించినట్లు తెలిసింది. కొందరు స్త్రీలను కూడా మీరు తిట్టినట్లు తెలిసింది. కొందరు రైతులను బెదరించినట్లు తెలిసింది. ఇటువంటి పనులను జేసిన మిమ్మల్ని మేము ఎలా వెనకేసుకుని వెళ్లగలం" లచ్చన్న దెప్పిపొడిచారు.

"లచ్చన్నగారూ ఏదో ప్రాధేయపడుతున్నారు. అధికారి ఏమైనా వీలున్న సహాయం చేయండి. శ్యామ సుందరంగారు అన్నారు. మన చేతుల్లో ఏమిలేదు. సాక్ష్యం బలంగా ఉంది. అయితే మనం చెప్పి చూద్దాం! లచ్చన్న.

"మీరు నన్ను కాపాడాలి. నా ఉద్యోగం ఉండేటట్లు చేయాలి. ఇకపై నేనున్నంత వరకు రైతులకు ఆస్తిపాస్తుల్ని జప్తు చేయనని, జమిందారీ

ఉద్యోగులు చేసినా ఒప్పుకోనని మీ ముందర ప్రమాణం చేసిచెబుతున్నాను. నమ్మ నమ్మండి. ప్రాధేయపడుతున్న సబ్‌కలెక్టర్‌తో అయిన మీకు బదిలీ తప్పదేమో" అచ్చన్న. బదిలీ పరవాలేదు. ఎచటికోపోయి బ్రతుకుతాను. గండం తప్పించిన మిమ్ముల్ని ఏనాడు మరచిపోను. మీకేం భయంలేదు. ఇకపై రైతుల ఆస్తులను జప్తుచేకండి. మకాం ఎత్తండి అని శ్యామసుందరం అన్నారు. అంటూ నాయకులు మకాంనుండి వెలుపలికి వచ్చారు. రైతులంగా చుట్టూమూగారు. ఏం జరిగింది బాబూ అంటూ, ఏమీ జరగలేదు ఇకపై మీ ఆస్తులను ఎవరూ జప్మలోచేయరు. ఈ దినమే మకాం ఎత్తుకొని సబ్ కలెక్టరు గారు మందసా వెళ్ళిపోతారు" అంటూ వారికి చెప్పారు.

నాయకుల మాటలు విన్న రైతాంగం ఆశ్చర్యపోయింది. "అంతటి దౌర్జన్యపరుడైన అధికారిని మన నాయకులు ఎలా ఇంత వేగంగా బుట్టలో వేసుకో గలిగారు" అని.

నాయకులు నడుస్తున్నారు. రైతులు అనుసరిస్తున్నారు. వారిని సాగ నంపటానికి. ఇంతలో వైష్ణవమ్మ ఎదురుగా వచ్చి నవ్వుతూ నమస్కరించింది.

జరిగిన అవమానానికి క్రుంగిపోక ఏమిటీ వైష్ణవమ్మ యిలా వీధిపడి నవ్వుకుంటున్నది. ఆశ్చర్యపడ్డారు. "అసలంటూ జరిగితే కదా బాధ పడటానికి ఒక నాయకుని జవాబు.

"ఏమిటి బాబు ఆ ఆఫీసరుగారు ఈ వైష్ణవమ్మను బలాత్కరించలేదా" రైతుల్లో కొందరు అడిగారు. చిలిమింత ఊరిలో అటువంటి తప్పుడు పని జరిగితే చిటికెలో తెలిసిపోతుంది. "చూడండి దీనిని మీరు మనసుల్లో పెట్టుకోవద్దు. మనం అనుకున్నది సాధించాం. జప్తులు ఆగిపోయాయి. అధికార్ల జులుం అంతరించాలన్న మనం సామదాన బేధదండోపాయాల్ని వినియోగించాలి అన్న నాయకుల ముఖాల్లో ఆనందం చూచి నాటకమా, ఇదొక అంతర్నాటకం కాబోలు అని అందరూ అనుకున్నారు.

## 43. తర్లా ఎస్టేట్ – రైతు సంఘం :

పొందేట తాలూకాలో నున్న చీకటి ఎస్టేట్ మందసా ఎస్టేట్ రైతు సంఘాల నిర్మాణంతో జిల్లా అంతటా మంచి ప్రచారం వచ్చింది. ప్రతీ

ప్రాంతానగల రైతాంగం జమిందారులనుండి రక్షణ పొందాలని ఉవ్విళ్ళూరారు. చీకటి ఎస్టేట్‌లో నున్న తలతంపర ముతా రైతులు మందసా ఎస్టేట్‌లో నున్న రైతాంగం జమిందారీలను ఎదిరిస్తున్న తీరును చూచి ఇరువైపులానున్న రైతాంగం, పోరాటానికి సిద్ధపడింది, నడిపింది, మన లచ్చన్నవగైరా నాయకులే.

బారువాలో నున్న లచ్చన్న గారికి తర్లా ఎస్టేట్‌లో నున్న గ్రామాల రైతులనుండి ఉత్తరాలు వచ్చాయి. కాశీబుగ్గ నుండి అబ్దుల్ రహింమాన్ ఖాన్, వజ్రపు కొత్తూరునుండి శివన్నారాయణ, పి.టి నాయుడు, బ్రాహ్మణతర్ల నుండి వైల రామస్వామి, గాలి నాయుడు, మంతుల జగన్నాథం, చంద్రయ్యనాయుడు, కొర్ల హరికృష్ణచౌదరి.

ప్రియమైన లచ్చన్నగారు మీరు ఎస్టేట్ రైతురక్షణ సంఘాలు పెడుతున్నట్లు విని ఎంతగానో సంబరపడిపోతున్నాం. మా గ్రామాల్లో జమిందార్లు అతి జులుం ప్రదర్శిస్తున్నారు. కవుల భూములనుండి రైతులను తొలగించి వేరే వారికి సాగుచేయటానికి ఇస్తున్నారు. రి సర్వే సెటల్‌మెంటు అని శిస్తులు పెంచారు. మీరు మన నాయకులు వచ్చి రైతుల నాదుకోవాలి. జమిందార్లు తమ కవుల దార్లనుండి - పంట పండిన - ఎండిన - వారినుండి శిస్తుదస్తులు వసూలు చేయడమే ధ్యేయం చెల్లింపని వారి ఆస్తులను జప్తు చేయడం అసలు వారి హక్కు. ఆస్తి బండి - చెక్క - బింది - ఇంటి తలుపులు - వంట పాత్రలు - వీటిని జప్తు చేయడం ఎంత దారుణమో

ఏ ఒక రైతు శిస్తు చెల్లించకపోయినా ఆ రైతు భూమిని వేరొక రైతు తీసికొనడానికి సిద్ధమైనారని తెలిసిన వెంటనే కార్యకర్తలు గద్దిస్తూ అరవడంతో, అంతవరకు ఆ రైతులను తొలగిస్తే ఆ భూములను మా కివ్వండి బాబూ అని సముద్దర్ ముందే కూర్చున్న ఏ ఒక్క రైతునుండి ఉలుకు లేదూ, పలుకూ, లేదు. చుట్టు ముట్టిన నాయకులను, చుట్టు జేరిన జనాన్ని చూచి వారికి ఊపిరి ఆడలేదు.

సముద్దర్ గారు మీకు బోధపడిందా? అంతేకాదు శిస్తులు హెచ్చింపుకు అంగీకరించడం జమిందారీ ప్రభువులు ఏనాడేనా ఏ చెఱువుపైన మరమ్మత్తులు చేసారా, నీరు లేనిదే పంటలు ఎలా పండిస్తారు.

మీ కెలా శిస్తులు చెల్లిస్తారు? బకాయిలను రద్దుపరచమని సర్కారు వారిని కోరాం. అంతవరకు వసూళ్లను నిలుపుదల చేయండి. ఆస్తులను జప్తుచేయడం ఆపండి. "ఏమిటి మీ దౌర్జన్యం" దౌర్జన్యం చేస్తున్నది మీరా? మేమా? అన్నారు రైతు కార్యకర్తలు

"ఒరే తలారి పదరా ఏమండీ నాయుడుగారు, కరణంగారూ రండి ఆ జప్తులు చేయవలసిన రైతుల చిట్టా తీయండి." సముద్దార్‌గారు వడివడిగా లేచి వీధిలోనికి ప్రవేశించారు. అధికార్లు కిమ్మనకుండా వెనకపడ్డారు. ఒక రైతు ఇంట్లోదూరి కుండల్ని, పాత్రసామాన్లను బయటకు తీసారు. బండి బక్కను కూడ సంగ్రహించారు. నౌకరులతో వీధిలోకి గ్రామ చావడిలోనికి తీసుకొనివచ్చి జప్తునోటీసు మేరకు వేలం వేయటానికి సిద్ధపడినారు.

రైతు నాయకులంతా దూరంనుండి ఇదంతా గమనిస్తున్నారు. "ఎవరు వేలం పాడతారో ముందుకు రండి, మీరు వేలం పాడేది రైతు ఆస్తినే కాదు రైతునే. మిమ్ములని ఒకనాటికి వేలం వేస్తాము అని గుర్తుంచుకొండి జనంలో నుండి లచ్చన్న గంభీర స్వరంతో పలికారు. ఏ ఒకరు ముందుకు రాలేకపోయారు.

"ఈ వస్తువులను కోటలోనికి తీసికొని పోదాం పదండి. పశువుల బళ్లు కావాలి పద్ పూయించండి". ఏ రైతు ముందుకు వచ్చి బండి పూయలేదు. సముద్దార్ నివ్వెరపోయాడు. ప్రక్కనున్న మున్సబ్ కరణాలపై గుడ్లురిమాడు. పాపం వాళ్లు చేయగలిగేదేముంది. బాబూ చిత్తం అని చేతులు నలపడం తప్పించి ఎదిరించటానికి, ఇటుజీతభత్యాలిస్తున్న జమిందారు అటు రైతులు. వాళ్ళ అభిమానం పోయిననాడు వీరి బ్రతుకులు పల్లెలో చావు బ్రతుకులే.

ఎందుకండీ సముద్దార్‌గారు ఆవేశపడిపోతున్నారు. మీ బళ్ళను తెచ్చిన తరువాతనే జప్తులు చేయండి. అంతవరకు వాళ్ల సామానులు వాళ్ల వద్దనే ఉంటాయి. మీరు పిల్లు వేసిన వాటిని ఊడదీయడమే మంత కష్టం కాదు. వెంగళ్రావుగారితో అన్న లచ్చన్న మాటలను సముద్దార్ గ్రహించారు. [illegible] చెప్పించుకోవడం మినహా గత్యంతరం లేదు. అనుకుంటూ [illegible] అక్కడనుండి వెళ్లిపోయారు సముద్దార్‌గారు.

రైతులంతా నాయకులను చుట్టుముట్టారు. జై అంటూ ఆనందం పట్టలేక నినాదాలిచ్చారు. నాయకులపట్ల వారికి గల అభిమానాన్ని ప్రదర్శిం చడంలో ఒకరినొకరు పోటీపడి. రైతు సంఘంలో చేరటానికి అంతా సిద్ధమైనారు.

## 4) జలందర్ ఎస్టేట్ రైతు సంఘం :

1910లో బ్రిటిషువారు ఎస్టేట్‌ను వేలం పాటమీద వేరొకరికి కట్టబెట్ట వలసి వచ్చింది. జమిందారు వసూలు చేసిన పన్నులను స్వాహా చేసి సర్కార్ వారికి కట్టవలసిన పేష్కుత్ కట్టలేకపోయాడు. ఆ వేలం పాటలో విజయనగరం మహారాజుగారు ఈ ఎస్టేట్‌ను కొన్నారు. ఈఎస్టేట్ సోంపేట తాలూకాలోనిదే. ఈ ఎస్టేట్ రైతు సంఘం సభ్యులు రున్న ఎర్రయ్య, ఉట్లూరి వీరయ్య, తమరాలకొండన్నాయుడు, సింది రామస్వామి, చింతాడ అమ్మన్నాచారి, రంగోలు దండాసి, కూర్మారపు లక్ష్మణరావు, చంద్రమణిరెడ్డి, కొండ భీమారావు వగైరాలు. అచ్చన్నగారే నిర్మాణకర్త.

## 5) పర్లాకిమిడి ఎస్టేట్ రైతు సంఘం :

ఇదొక సర్వస్వతంత్రమైన ఎస్టేట్ దీనిని పాలించేవారు పర్లాకిమిడి మహారాజా అని పిలవబడేవారు. జమిందారునికి దొడ్డ ప్రభువు అని పరిగణించే వారు ఆనాటి ప్రజలు. 1908 ఎస్టేట్ లాండ్ ఆక్ట్ మేరకు శిస్తులు దస్తులు వసూళ్లకు జమిందార్లు స్వంతసిబ్బంది కలిగి యుండవచ్చు. సర్కారు వారికి సాగి మొక్కుతూ ఆనాటి ప్రజలనుండి గొప్పప్రభువలని పేరందుకొన్నారు.

ఎస్టేట్‌లో అత్యధిక భాగం దుర్గమారణ్యాలతో కూడి యుంటుంది. మైదానం ప్రాంతం కూడ చెప్పుకోదగినదిగనే ఉంటుంది. సవరులు, కోదులు కొండదొరలు ఉన్న కొండప్రాంతాల్ని కొన్ని ముఠాలుగా ఏర్పరచి, ఒక్కొక్క ముఠాకి ఒక్కొక్క కొండ దొరను నాయకునిగా నియమించి ఆ ముఠా నాయకుని ద్వారా ఆ కోదులనుండి, ఆ కొండ దొరలనుండి కొండ పంటలతో పాటు అడవి దినుసులను రాజుగారు తమపన్నుగా స్వీక రించేవారు. దీనికి తోడు రుసుం వసూలు చేయుట, అడవిపంటకు అమ్మకం

జరిగే చోట కొన్నచోట, రెండు స్థాయిలలో రుసుం వసూలు రాజా ఖజానాకు హెచ్చుమొత్తాల్ని తెచ్చిపెట్టేది.

ఇక పల్లపు గ్రామాల్లో ఉండే సిబ్బంది సముద్దార్ దఫేదారు ఇతర సిబ్బంది తలారి గ్రామనౌకరు మరింకా నాయుడు కరణం వగైరా మనుషులు.

మహారాజును ఎదిరించి నిలవడం మాటలా! అన్నదానాటి నానుడి. ఏ ఒక్కరు ఎంత అన్యాయం జరిగిన నోరువిప్పని సంఘటనే రైతురక్షణ సంఘం ఏర్పడే వరకు గత చరిత్రలో కన్పించనే కన్పించదు. తిరుగులేని అధికారంతో మహారాజాగారు కొలువు తీర్చేవారు.

రైతురక్షణ సంఘంలో చేరినవారు ఊన రామమూర్తి, కన్నేపల్లి సత్యనారాయణ, అయనవరపు కృష్ణారావు, సాంబమూర్తి, దుక్కి రాజా నరేంద్ర, లుకలాపుల లక్ష్మదాసు తండ్రి గేదెల చంద్రయ్య నాయుడు, తుంపరశాస్త్రి, దుక్క రాజారెడ్డి, పారనంది ఈశ్వరరావు మొదలగువారున్నారు.

పండించిన భూములను వ్యావసాయిక యోగ్యంగా ప్రభువులు చేస్తున్నందున వారికి రైతులు పన్నులు చెల్లించాలన్నది ఆనాటి నియమం కాదు. వారు ప్రభువులు దైవాంశ సంభూతులు మనం సేవకులం. వారు దొడ్డవారు, పెట్టిపుట్టినవారు. మనల్ని వారు రక్షిస్తారు. ఎవరినుండి - క్రూర మృగాలనుండి, బలహీనులను బాధపెట్టే బలవంతులనుండి సంఘంలోగల ఆచార సాంప్రదాయాలను కాదని ఎదురు తిరిగే వారిని పట్టి బంధిస్తారు. ధర్మ రక్షకులు కూడ.

అయితే అటువంటి మహారాజులు ప్రజల కష్టాల్ని పట్టించుకొనకపోతే ఏం చేయాలి. వారే బలవంతులై బలహీనులను కాలరాచి దౌర్జన్యం చేస్తుంటే ఏం చేయాలి. మానవజాతికి పంటలు పండించి ఇంత తిండి పెడుతున్న రైతును బక్కచిక్కిన రైతుగా మారుస్తుందే. ఈ కూలీ జనాలను [illegible]గా మారుస్తుందా? ఏం చేయాలి.

[illegible] సంఘంద్వారా సామ్యాన్ని రైతాంగంనుండి రాబట్టు [illegible] పెద్ద కష్టాల్ని పట్టించుకొనకపోతే వారి కష్టాల్ని

నివారించటానికి ఒక నాయకుడు జన్మించక తప్పదు. దోపిడికి గురి అవుతున్న జనావళి ఒకనాటి దోపిడిని త్రిప్పికొట్టే శక్తిని పొందక తప్పదు. అణచివేత ఏ స్థాయిలో ఉంటుందో అదే స్థాయిలో దానిని త్రిప్పి కొట్టే శక్తి ఉద్భవిస్తుంది. పాలసముద్రాన్ని మందర పర్వతం మధించి నందునే హాలాహలం పుట్టింది. వేరొకరిని హరించటానికి అమృతం కూడా ఉద్భవించింది. వేరొకరిని బ్రతికించటానికి.

పర్లాకిమిడి ఎస్టేట్‌లో నున్న వారణాశి నుండే ఒకనాడు 1933 నవంబరు 7వ తేదీన రైతురక్షణ యాత్ర జరిపి జిల్లా కేంద్రమైన చిత్రపూర్ చేరి కలెక్టరు వారికి ప్రొఫెసరు రంగా ఆధ్వర్యమున వినతి పత్రం అందించారు.

రాజుగారు అన్యాయం చేస్తున్నారన్న ఆనాటి మూర్ఖ దురాచార దుర్మార్గ సంఘం విని భరించలేక పోయేది. వెంటనే ఎదురు తిరిగేది. రాజు ఏనాడు తప్పు చేయడు. (king do never wrong) అనేది ఇంగ్లీషు సామెత. తప్పు చేసేది మనం మానవులం, రాజు దైవంతో సమానం, మనల్ని కాపాడటానికి భూమిపై పుట్టిన ర క్షకుడు రాజు. ఇలా భావిస్తున్న ప్రజల్ని రాజుమానవుడే. మానవుడి కున్న దుర్గుణాలు వాడిలోను ఉంటాయి. వాడు మిమ్ముల్ని దోపిడీ చేస్తున్నారు అని చెప్పుతూ నిలిచే మొనగాడు ఎంతటి వాడై యుండాలి. ఎంతటి గుండె ధైర్యం కలిగి ఉండాలి. ధృఢ విశ్వాసంతో నుండాలి.

గంజాం జిల్లా రైతుసంఘం అధ్యక్షులు కార్యదర్శులు శ్యామసుందరం, గౌతు లచ్చన్నగార్లు, 1934-38లో పర్లాకిమిడి ఎస్టేట్ క్రమ సంఘ నిర్మాణానికి రైతు మహాసభను జరిపి, రైతు సంఘాన్ని రూపొందించారు.కన్నెపల్లి రాజానరెడ్డి, గజదు శీతాపతి, బారనంది ఈశ్వరప్ప ఈనాటి లుకలాపు లక్ష్మణదాసు తండ్రి గేద్దెల చంద్రయ్య నాయుడు బోయిన అప్పలస్వామి, మిరియాపల్లి రామ్మూర్తి ప్రభృతులతో జీవరత్నం నాయుడు లతో రైతు సంఘం రూపొందింది.

కార్యక్రమం - ఇది -

1. ఎస్టేట్‌లో ఎచ్చట జప్తులు జరిగిన వెంటనే మీరు వెళ్లాలి మాకు తెలియజేయాలి.
2. భూములనుండి రైతులను తొలగిస్తే ఎదుర్కోవాలి.
3. కొండ పంటలపై సుంకం అక్రమమని వాదించాలి.
4. శిస్తుల్ని తగ్గించమని ఆందోళన చేయాలి.
5. పన్నులు చెల్లించరాదన్నది రైతుల్లో బాగా నినాదాన్ని బలపరచాలి.

## (6) బారువా ఎస్టేట్ రైతు సంఘం :

లచ్చన్న గారి జన్మస్థలం - బారువాలో గల ఎస్టేట్ రైతులపై పన్నులు వేసి, చెల్లించనిచో వారి ఆస్తుల్ని పరచేది - ఇంట గెలచి రచ్చ గెలవాలి కదా - లచ్చన్న జమిందారీకి ఎదురు నిలచి వారి దురాగతాల్ని ఆపమని హెచ్చరిక చేయడమేగాని, వాళ్లని ఆపమని ముందుపడి స్థానిక రైతుల వలన సెభాష్ అనిపించుకొన్న వాడు లచ్చన్న, తాను నివసించు సంఘాన ఏ ఒకరు కీర్తి గాంచిన ఇలను ఘనమే ననిపించు.

గంజాంజిల్లా రైతు రక్షణ సంఘం కార్యదర్శి గౌతు లచ్చన్న గారి స్వగ్రామం. ఈ బారువాపేట ఎస్టేట్‌లోనే ఉంది తన గ్రామానికి చేరువగనే ఉందీ ఎస్టేట్. జిల్లా అంతటా ఎస్టేట్ రైతురక్షణ సంఘాల్ని నిర్మించిన లచ్చన్న - శ్యామసుందరం మొదటగా ఈ బారువాపేటలోనే రైతు సంఘాన్ని ఏర్పాటు చేసారు.

ఒకవాడు జమిందారీ విధానం రద్దు కావాలని రైతు యాత్రను జరిపి పర్లాకిమిడి నుండి బయలుదేరి బారువా మీదుగనే బరహంపూర్ వెళ్ళి తుదకు ఛత్రపూర్ చేరుకోవడం జరిగింది. రైతుయాత్రలో లచ్చన్నగారిని రైతు సమస్యల పరిష్కారంలో దృష్టి మరలింది. దేశ వ్యాప్తంగా రైతోద్యమాన్ని నిర్వహిస్తున్న ప్రొఫెసర్ రంగాగారి అడుగుజాడల్లో నడవటానికి ఆనాటినుండి లచ్చన్నగారు సిద్ధమైనారు.

బారువా ఎస్టేట్ జమిందారీ అతి చిన్నది. అయితే సమస్యలు పెద్ద జమిందారీ కున్న జటిల సమస్యలు ఇచ్చటకూడా ఉన్నాయి.

మొదటినుండి కోళ్ల జగన్నాయకులు మిడి సూర్యనారాయణ తనతో దేశసేవలో పాల్గొంటున్న దుర్లభసాహు కుటుంబం - పాడిగారి కుటుంబం, పుక్కల లక్ష్మీనారాయణ కుటుంబం - కర్రి అప్పారావు. లచ్చన్న గారికి అన్ని విధాలా సహకరించేవారు.

బారువాపేట ఎస్టేట్‌లో రైతు సంఘాన్ని ఏర్పరచి అన్ని ఎస్టేట్ రైతు సంఘాలకు మార్గదర్శకంగా నిలచేలా కార్యక్రమాల్ని రూపొందించి తన అధ్వర్యమున జమిందారీ విధానంపై లచ్చన్నగారు పోరాటం నడిపారు. దుర్లభసాము అప్పన్న పాడి వగైరా ప్రభృతులు సంఘ కార్యవర్గ సభ్యులుగా ఉండేవారు. ఖడంగ బారువాపేట బక్షీ బారువా జమిందారు ఇది తన స్వగ్రామంలో గల ఎస్టేట్ ప్రియాగ్రహారం, లక్కందొడ్డి ఇనాందార్లు కన్నెపల్లి మార్కండేయ శర్మ నిజానికి, ఇనాందారీ రైతోద్యమానికి అండదండలుగా ఉండి ప్రోత్సాహమిచ్చిన వ్యక్తి గుడారు సింగ్ ఎస్టేట్ M.S పట్నాయక్ రైతు సంఘ ముఖ్యకార్యకర్త. శిస్తులు దస్తులను చెల్లించనే అక్కర్లేదన్న ధీమాతో రైతాంగం ఉండేది. అన్నింటికి లచ్చన్న ఉన్నాడుగా వారి దగ్గిర అన్నది వాళ్ళ ధీమా.

## (7) ఉర్లాం ఎస్టేట్ రైతు సంఘం :

నరసన్న పేట తాలూకాలో నున్న ఉర్లాం ఎస్టేట్ రైతు సంఘానికి కార్యవర్గ సభ్యులుగా నుండే దార్ల జమ్మునాయుడు - ఎస్టేట్ రైతు సంఘానికి - ఇనాందరీ రైతు సంఘానికి నాయకత్వం వహించేవారు. జమిందారీ రైతు, ఇనాం రైతు ఈతి బాధలు ఒకటికావు.

## (8) ప్రియాగ్రహారం ఇనాం దారీ :

ఏలిన వారు కొన్ని గ్రామాలను బుగతలకు దానం యివ్వగా ఏర్పడిన ఎస్టేట్. ఆ గ్రామాలను అగ్రహారాలని పిలుస్తారు. ఆ గ్రామాల్లో బుగతలు, రైతులు అనే రెండు వర్గాలు కొట్టొచ్చినట్లు కన్పిస్తారు. రైతులు కష్టించి పండించి, బుగతలకు పంటలో పాలు భాగాలు యివ్వాలి. 1935లో నరసన్నపేట తాలూకా మండపేటలో రైతు మహాసభ జరిగింది. ముద్దాడ

వెంకటప్పలనాయుడు, భైర అప్పలస్వామి నాయుడు, కరీం నారాయణ అప్పలనాయుడు, అచ్చన్నలు ప్రధాన కార్యకర్తలు.

## (9) నందిగాం ఎస్టేట్ రైతు సంఘం :

టెక్కలి తాలూకాలో నున్న నందిగాం ఎస్టేట్ రైతుసంఘాన్ని బడి వెంకటరెడ్డి నారాయణగారి ఆధ్వర్యమున రూపొందించారు. గంజాం జిల్లా అధ్యక్ష కార్యదర్శు లిరువురు శ్యామసుందరం, అచ్చన్న నందిగాంలో బస చేసి అచట రైతుల సమస్యలు అవగాహన చేసికొని ఆ ఎస్టేట్‌లో పోరాడటానికి పథకాలు వేశారు.

కొత్తూరు నుండి ప్రధాన రామన్న రావివలస టెక్కలినుండి బడి వెంకటరెడ్డి నాయుడు, సీతాపురం గ్రామం నుండి బెండి కూర్మన్న, పాత టెక్కలినుండి అట్టాడ వెంకట నరసమ్మ, పెద్దింటి కృష్ణమూర్తి, కొండ తెంబూరు రామకృష్ణ కార్యకర్తలుగా ఆ రైతు సంఘం నడిచేది. శ్రీకాకుళం రైతు సంఘానికి బగ్గు శ్రీనివాసులు రెడ్డి లెక్కల కృష్ణమూర్తి ముఖ్య కార్యకర్తలుగా రైతు ఉద్యమాన్ని నడిపారు.

## బొబ్బిలి ఎస్టేట్ రైతురక్షణ సంఘం :

1934లో నెల్లూరు వెంకట రామానాయుడు గారి నాయకత్వమున శ్రీకాళహస్తిలో జరిగిన ఆంధ్రప్రదేశ్ జమిందారీ రైతు మహాసభలకు గంజాం జిల్లానుండి ముఖ్యప్రతినిధిగా పాల్గొనటానికి వెళ్ళిన అచ్చన్నగారికి అచట మంచి గౌరవ స్థానం లభించింది. గంజాం జిల్లాలో రైతు రక్షణ సంఘాల నిర్మాణ కర్తగా అచ్చట మన్ననల నందారు.

అఖిల భారత స్థాయిలో కిసాన్‌సభను స్థాపించి నడుపుతున్న ప్రొఫెసర్ రంగాగారు గంజాం జిల్లాలో రైతోద్యమాన్ని ఎంతో ఉత్సాహంతో నడుపుతున్న పుల్లెల శ్యామసుందరం గారిని, అచ్చన్న గారిని అందరి ఎదుట అభినందించకుండ ఉండలేక పోయారు.

గంజాం జిల్లా రైతురక్షణ సంఘం వ్యవస్థాపకులు అధ్యక్షులు పుల్లెల శ్యామసుందరం, [illegible] గారు అచ్చన్న ఆ జిల్లా రైతాంగంలో తెచ్చిన

చైతన్యాన్ని ప్రక్క జిల్లా రైతాంగం, రైతు నాయకులు పరికిస్తూనే ఉన్నారు. విశాఖజిల్లా రైతు సంఘం ఏర్పడింది. విశాఖజిల్లా రైతు సంఘం శక్రటరీ ఆర్గనైజర్ యన్.యన్ మూర్తి (1936 నుండి 1939). ఈ జిల్లాలో గల ఎస్టేట్ దారులను ఎదిరించి ఎస్టేట్ రైతులను కాపాడాలి అన్నదానాటి ఈ ప్రాంత రైతు నాయకులకు కలిగింది. కొల్లి కూర్మినాయుడు (పిరిడి), చెలికాని రంగనాయకులు (బొబ్బిలి), గొర్లె సూర్యనారాయణ (పార్వతీపురం), ముదిలి బాబూ పరాంకుశం (లఖణాపురం రావివలస), అందజాల వేంకటేశం (బలిపనేట), పుండరీకాచారి (రాజాం), కునిశెట్టి వెంకట నారాయణదొర (సాలూరు), గరిమెల్ల వెంకట రమణమూర్తి (శ్రీకాకుళం), కిల్లి అప్పలనాయుడు, (పురుషోత్తమపురం), పురజాల అప్పారావు (పాలకొండ), దరిమెల్ల కాళేశ్వరరావు (పాలకొండ), కవికోకిల సన్యాసినాయుడు(సాలూరు), కరీం లక్ష్మి నారాయణ (వెదుల్లవలస), వాంపల పారన్నాయుడు (ఉత్తరావెల్లి), పల్లె శివున్నాయుడు (కొమరాడ), నాగూరు నాయుడు, యం.వి. రామూర్తి పంతులు (పార్వతీపురం), బందలప్పి సింహాచలం నాయుడు (బందలప్పి). బొబ్బిలి ఎస్టేట్ ఇనాందారుల - రైతు మహాసభలకు - కృష్ణాజిల్లానుండి వచ్చిన ఆచారిగారు నిర్వహించారు. ఇదే సభలకు ఆచార్య రంగా అధ్యక్షత వహించారు.

గ్రామాల్లో పలుకుబడి మంచితనం కలవారై రైతులు దీన స్థితిని కళ్లారాజూచిన వీరంతా, మొదటిగా చైతన్యమూర్తులై జమిందారీలను ఎదిరించి రైతులను ఆదుకోవాలన్న సంకల్పంతో ఉన్నవారు. నూనూగుమీసాలతో ఆనాటి నవయౌవ్వనంతో ఉన్నవారు, వీరిని ముందుకు నడిపే నాయకుడు దొరకాలి గాని, వీరెల్ల రైతునాయకులుగా ఒకనాటికి స్థిరపడి పేరు ప్రఖ్యాతులను పొందగల ధైర్యస్థైర్యములున్న వారే జమిందారీల దౌర్జన్యాలను పసిగట్టినవారే. ఉద్యమం లేవదీయటానికి సిద్ధపడుతూ ఉన్నవారే. వీరితో పాటు రైతాంగానికి సేవ చేయటానికి, వీరితో సమానులు అనేకులు న్నారనటంలో అతిశయోక్తికూడ లేదు.

స్వాతంత్ర్యోద్యమం ఒకవైపు రంగా స్థాపించిన అఖిల భారతీయ కిసాన్ సభ పిలుపుపై లచ్చన్న ఆధ్వర్యంలో కొనసాగుతున్న రైతురక్షణ యాత్రలొక వైపు, జమిందారీలపై పోరాటం సలుపుతున్న గంజాం జిల్లా

స్టేట్ రైతు సంఘాలొక వైపు ఆనాటి విశాఖ జిల్లా రైతాంగానికి కనువిప్పు కలిగించాయి. ఆంధ్రప్రాంతంలో రంగా నడుపుతున్న రైతాంగ విద్యాలయం రైతునాయకులకు తర్ఫీదునిచ్చే కేంద్రంగా రూపొందింది. వివిధ ప్రాంతాల రైతు నాయకులు ఆ కేంద్రంలో శిక్షణ పొందిరావడం జరుగుతూనే ఉన్నది.

స్వాతంత్ర్యోద్యమాన్ని సాధించడం అందరి భారతీయుల ప్రధమ కర్తవ్యంగా భావిస్తున్న ఆ రోజుల్లో పల్లె భారతిలో గల రైతాంగాన్ని చైతన్య పరచి రైతుకూలీ ప్రజారాజ్యానికి నాందీ ప్రస్తావన చేయాలన్నది రంగాగారి అభిమతం ఆశయం. ఆ రైతుకూలీ ప్రజా ఉద్యమం ఎస్టేట్ రైతులు జమిందారులతో జరిపిన పోరాటాలతో ప్రారంభం కావాలి.

ఈనాడు మూడు నాలుగు రాష్ట్రాలుగా విభజించబడిన మద్రాసు ప్రెసిడెన్సీని బ్రిటిష్ రాచరికంలో ఒకే ఒక గవర్నర్ పాలించేవారున కాంగ్రెస్‌లో అతివాదులలో తిలక్, చిత్తరంజన్ దాస్ వంటివారు అంగీకరించక పోయిన కాంగ్రెస్‌లో మితవాదులు మాంటేగ్ చేమ్సుఫర్డు సంస్కరణల మేరకు రాష్ట్రాల శాసన సభల్లో ప్రజలచేత ఎన్నుకోబడుతూ ప్రవేశించ దలచారు. ఆనాడు ఓటు హక్కు కేవలం భూవసతి ఆస్తిపాస్తులున్న వారికి, అక్షరాస్యునికి మాత్రమే ఉండేది. వయోజన ఓటింగు విధాన మానాటికి లేదు. దరిమిలా 1952లో వచ్చింది.

మద్రాసులో బ్రాహ్మణ, నాన్ బ్రాహ్మణ వర్గాలు ఒకదానిపై ఒకటి తలపడటానికి సిద్ధమయి నాన్ బ్రాహ్మణ వర్గాలు జస్టిస్ పార్టీగా రూపొందింది. 1926 ఎన్నికలలో కాంగ్రెసు రాష్ట్ర శాసనసభలో స్వరాజ్య వాదులు (కాగ్రెసు మితవాదులు) 41 సీట్లు గెలుచుకొనగా జస్టిస్ పార్టీ 22 సీట్లను గెలుచుకొన్నది. స్వతంత్రులు 36 మంది ఎన్నుకోబడినారు.

నాటి జస్టిస్ పార్టీ అగ్ర నాయకులలో ఒకరిగా ప్రఖ్యాతి గాంచిన బొబ్బిలి రాజాను ప్రతిఘటించాలి. సాధ్యమా? 1930లో జస్టిస్ పార్టీ మంత్రి వర్గాన్ని ఏర్పరచింది. మంత్రివర్గంతో సభ్యునిగా ఉన్న బొబ్బిలి రాజావారి ఎస్టేట్‌లో ఎస్టేట్ రైతురక్షణ సంఘ నిర్మాణం అంత తేలికయిన పనికాదు కదా! [illegible] ప్రతిఘటన వచ్చి తీరుతుంది. [illegible] హరిస్తుంది.

అయితే ఈశ్వరునిలా వచ్చి ఆ హాలాహాన్ని దిగ్రమింగి అపాయంలేని
అదిమి పెట్టగల వారెవరు? ఆ ఉప్పెనను తట్టుకొని నిలవ గలిగేదెవరు
న్యులే. రంగా, లచ్చన్న యిరువురూ అసాధ్యులే. 1935 జూన్
నే ఆంధ్రలో కాంగ్రెస్ సోషలిష్టు పార్టీకి ఒక శాఖ ఏర్పడింది.
డు ప్రొఫెసర్ రంగా, శ్రకటరీ మద్దూరి అన్నపూర్ణయ్య, సత్యనా
ు రాజు పి. సుందరయ్య, సిజ రాజేశ్వర్రావు, లచ్చన్న కార్యవర్గ
ు, అతివాద మితవాద భావాలు గల వ్యక్తులంతా ఒకే గూటిలోనుండి
్యమాల్ని, రైతోద్యమాల్ని నడపటానికి రాచబాట వేస్తున్న దినాలవి.

ఒకవైపు బొబ్బిలి ఎస్టేట్ రైతు రక్షణ సంఘం ఏర్పడి ఒకవైపు
రైతులను దోచుకొంటున్న సంస్థానాన్ని ప్రతిఘటిస్తూ పోరాడాలి.
ైపు కాంగ్రెస్ పార్టీకి అంకుశంగా నిలచి స్వరాజ్య సాధనలో అడ్డు
్న జస్టిస్ పార్టీ నాయకుడు బొబ్బిలి రాజాను అన్ని విధాలా ఓడించి
ుం పాలుచేయాలి. కాంగ్రెస్ పార్టీని శక్తి మయంచేసి, స్వాతంత్ర్య
నికి మార్గాన్ని సుగమం చేయాలి. రైతోద్యమ నాయకుడు లచ్చన్న
్నుండి బొబ్బిలి రైతు నాయకులకు వచ్చిన లేఖలోని ప్రధానాంశ
విశాఖజిల్లా బొబ్బిలి ఎస్టేట్ రైతు మహాసభలను ఏర్పాటు చేయండి.
ల్గొంటాం. లచ్చన్న తనకు తెలిసిన రైతు నాయకులతో చెప్పిన
. ఇదే విషయాన్ని పార్వతీపురం – బొబ్బిలి ప్రాంతాల రైతు
ులకు జాబులు ద్వారా తెలిపారు.

కరపత్రం వెలిసింది. బొబ్బిలి ఎస్టేట్ రైతు మహాసభలు జరిగే కార్య
పకటించింది. ముఖ్య అతిధులుగా వక్తలుగా రైతోద్యమ నాయకులు
శ్యామసుందరం గౌతు లచ్చన్నగార్లు రాగలరని ప్రకటించింది.
బొబ్బిలి ఎస్టేట్ రైతులు అనుభవిస్తున్న కష్టాలను విశదంగా
చింది. రైతోద్యమానికి పిలుపు నిచ్చింది. ఈ రైతోద్యమాలకే –
చారిగారి కుటుంబం రైతు సేవకే అంకితమయినది.

ుతులనుండి భూములను బట్టి గాక అన్ని వర్గాల భూములకు ఒకే
ధమైన శిస్తును జులుం ఉపయోగించి వసూలు చేస్తున్నారు.
ాగునీటి వసతులను చెఱువులను బాగు చేయించకనే పన్నులను
ను వసూలు చూస్తున్నారు.

(3) భూములనుండి కవులదార్లను తొలగిస్తూ వేరే రైతులకు కట్టబెడుతున్నారు.

(4) బంజరు భూములను రాజా వారి సాగుబడి ఎస్టేట్‌గా ప్రకటిస్తూ కూలీల చేత వెట్టి చాకిరీ చేయిస్తున్నారు.

(5) అధిక శిస్తులు రెట్టింపు శిస్తులు వసూలు చేస్తు చెల్లింపు లేని ఆస్తుల్ని జప్తులు చేస్తున్నారు.

(6) బకాయిలను ప్రకటించకనే వారికిష్టమైనంత మొత్తాన్ని బకాయిలా జూపించి రాబడుతున్నారు.

(7) ఆస్తుల్ని జప్తులు చేసి, వేలంవేసిన సొమ్ము చాలకపోతే వారిని జైలు పాలు చేయటానికి కూడా ఎస్టేట్ సిబ్బంది వెనకాడలేదు.

(8) సర్కారు వారు శిస్తు రెమిషన్ యిచ్చిన, మాఫీ చేసిన తెలుసుకోలేని అమాయక రైతు వద్ద పూర్తిగా శిస్తులు వసూలు చేస్తున్నారు.

(9) ఏ భూమికి ఎంత నికరమై (శిస్తు తెలియ నందున) రైతు నశిస్తూ కట్టిన యింకా రైతు బకాయి పడ్డాడనే చిట్టా వ్రాస్తున్నారు.

(10) రైతుల సాగుహక్కును త్రోసిరాజని, రైతాంగాన్ని భూములనుండి వెళ్లగొడుతున్నారు.

రంగా లచ్చన్నగారలు ఆధ్వర్యమున రైతాంగం యావన్మంది ఏకోన్ముఖులై జమిందారీతో పోరాటం సాగించాలి అని కరపత్రం ప్రకటించబడింది.

నవంబరు 7వ తేదీన బొబ్బిలి రైతు మహాసభ జరిగింది. రంగాగారి జన్మదినమది. బలిజపేట నుండి అంగజాల వెంకటేశం, కొల్లి కూర్మి నాయుడు సిరిడి నాయుడు వలస సీతానగరం రైతులు చెలికాన రంగ నాయకులు పుండరీకావారి ప్రభృతులు విశేషమైన ప్రచారం చేసి రైతాంగాన్ని సభకు విచ్చేసేలా చేశారు. అసంఖ్యాకంగా మహాసభకు రైతులు హాజరయ్యారు.

రంగా, లచ్చన్నగారల ఆధ్వర్యమున రైతాంగం యావన్మంది ఏకోన్ముఖులై జమిందారీతో పోరాటం సాగించాలి అని కరపత్రం తెలిపింది. విశాఖ జిల్లా రైతు రక్షణ సంఘం పేర కరపత్రం ప్రకటించబడింది.

బొబ్బిలి సంస్థానాధిపతులు వారి అనుచరులు అభిమానులు సభను భగ్నం చేయడానికి కుట్రలు పన్నారు. కుతంత్రాలు జరిపారు. కూకటి వ్రేళ్ళతో లాగి రైతు నాయకత్వాన్ని కుదపాలని జూచారు. అడ్డంకుల్ని కల్పించటానికి అనేక ఎత్తుగడల్ని వేసి వ్యూహాన్ని నిర్మించారు. రైతు మహాసభ నిర్వీర్యం కావాలి. రైతు సంఘం ఏర్పడ కూడదు.

అప్పన్న గారు కొల్లి అప్పలనాయుడు గారు అట్టాడ కృష్ణమూర్తి, సూర్యనారాయణరెడ్డి, గొల్లి సూర్యనారాయణ, కొల్లి కూర్మినాయుడు ప్రభృతులు వెంటరాగా సభావేదిక వద్దకు వచ్చారు. రైతాంగం ఘనంగా స్వాగత మిస్తూ సభాస్థలికి తోడ్కొని వచ్చారు.

ఇంతలో సభలో ఒక వైపునుండి అరుపులు కేకలు చిలిపి పనులు చేసారు. మరికొంత సేపటికి రాళ్ళ బెడ్డలు సభికులపై పడటం ప్రారంభించాయి. రైతులు చెల్లాచెదురై పారిపోవటానికి ఉద్యమిస్తున్నారు.

అప్పన్న వేదిక నెక్కి కోపోద్రేకంతో సభనుద్దేశిస్తూ హెచ్చరిస్తూ ప్రసంగం కొనసాగిస్తున్నారు.

"రైతు సోదరులారా ధైర్యంతో ముందుకు రండి. బెదిరిపోకండి. పిరికివారై పరుగెత్తకండి గర్జించే సింహాల్లా వెధవపనుల్ని చేసే వారిని అదమాయించాలి. ఈ రాళ్ళు మనల్ని బెదిరించేవి. రైతుల్ని పట్టిపీడిస్తున్న ఈ జమిందార్లని ఎదుర్కొని పోరాడాలి. ఇప్పటికే న్యాయస్థానాల్లో వ్యాజ్యాల్ని ఎస్టేట్స్ పై రైతు సంఘాలు వేసి ఉన్నాయి. శిస్తులు కట్టమని కాదు. కట్ట లేము అని ప్రకటించండి. హెచ్చించిన శిస్తుల్ని కట్టమని చెప్పండి. భూముల నుండి తొలగిస్తే అంగీకరించమని తెలపండి.

రైతులకు పట్టాల నివ్వక భూములతో వారికి వెట్టిచాకిరి పనిచేయించి వారి జీవితాలతో ఆడుకుంటున్న ఈ సంస్థానాన్ని మీరంతా ఎదిరించాలి "వాళ్ళు మహారాజాలు వాళ్లైతే మనం ఎలా ఎదిరిస్తాం" ప్రజలనుండి పొలికేక.

ఏం వాళ్ళు ఆకాశంనుండి ఊడిపడ్డారా? దేవలోకంనుండి దిగి వచ్చారా? దేవుడు అనేక అవతారాలెత్తినట్లు అనేక అవతారాలెత్తి రావాలా [illegible]

జమీందారీ అవతారంలో ఉన్నారువీరు. రాబోయే కాలంలో వీరు మరల అవతారం ఎత్తక తప్పదు.

చక్రవర్తులకు పెట్టిపుట్టిన మహారాజులకు సైనికంగా సేవచేస్తూ సంపాదించిన ఎస్టేట్స్-ఎస్టేట్ భూములు ఇటువంటి జమీన్‌దార్లను చూచి మనం భయపడాలా? రైతుశక్తిని ఎదిరించే శక్తి లేదు. మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నర్ నిరంకుశమైన అధికారాల్ని కలిగిన వాడు. బ్రిటిషు ఉద్యోగి బ్రిటిషువారు ఈ జమీందారులు చేస్తున్న పాపకార్యాలన్నింటిని అతనికి వినతి పత్రం ద్వారా తెలపాలి. అన్యాయాలు జరిగిన చోట ఎదిరిస్తూ, న్యాయ స్థానాల్లో పోరాడాలి. జప్తులు జరిగితే రైతులందరు ఏకమై ప్రతిఘటించాలి. ఇప్పటి ఉత్తరాంధ్రలో అనేక రైతు రక్షణ సంఘాలు ఏర్పడి ఉన్నాయి ఎస్టేట్స్ బ్రిటిషు రాచరికం ఇప్పటికే అనేక చోట్ల పర్మినెంటు రిలెన్స్ సెటిల్మెంటు విధానాన్ని ప్రవేశపెట్టింది. మధ్య దళారిలను రద్దుపరిచింది. ఈ జమీందారీలనుకూడా రద్దు పరచాలి. సర్కార్ వారిని రైతులకు మధ్య దళారిగా వున్న జమీందారీలను రద్దుపరచి రైతులకే భూములపై హక్కుల్ని దఖలు పరచాలి. జమీందారీ విధానమే రద్దు కావాలి. అదే మన ధ్యేయం కావాలి.

ఆనాటి ఉపన్యాస ప్రసంగం విన్న అసంఖ్యాక ప్రజానీకం మిన్ను ముట్టేటట్లు కరతాళ ధ్వనులను చేశారు. బానిసలుగా చూడబడుచున్న రైతులకు హక్కులు వస్తాయట జమీందారీలే పోతాయట, పోవాలట. రైతాంగం దినాలు అతి దగ్గరలోనే ఉన్నాయట. రైతాంగం సభానంతరం ఉపన్యాసము మాట్లాడుకుంటూ జమీందారీలపై జబ్బ చరుస్తున్న ఈతని గుండె నిబ్బరమెంతటిదో రైతాంగం హృదయాల్లో మెదులుతున్న ప్రశ్న.

## పార్వతీపురం తాలూకా జమీందారీ రైతు రక్షణ సంఘం :

[illegible] రాష్ట్రాల ఉత్తర సరిహద్దున గల పార్వతీపురం [illegible] ఉండినది. ఉత్తరమువగల ఒరిస్సా రాష్ట్రం [illegible] పార్వతీపురం సమీపానగల [illegible]

జంఝావతీ నదిలో కలుస్తున్నది. ఇరు రాష్ట్రాల సరిహద్దుల్లో గల పార్వతీపురం కాలక్రమంగా వర్తక వాణిజ్యాలకు నెలవై పెద్ద రవాణా మార్గాల కూడలి స్థలంగా మారి పాడి పంటలకు ప్రసిద్ధి గాంచినది. నేడు విజయ నగరం జిల్లాలో నున్న నాలుగు మున్సిపాలిటీల్లో జిల్లా కేంద్రాన్ని మినహాయిస్తే పార్వతీపురం చెప్పుకోదగినది.

ఉత్తరాంధ్రలో విజయనగరం బొబ్బిలి సంస్థానాల తరువాత చెప్పుకోదగిన ఎస్టేట్స్ పార్వతీపురం ప్రాంతాన వెలసాయి. ఈస్టిండియా కంపెనీ 1837లో ప్రకటించిన అధికార పూర్వకమైన మన్యపు దొరలని ఆఎస్టేట్స్‌ను మన్య దొరల మొఖసాలగా పేర్కొన్నారు. జమీందారీ విధానం రద్దయిన నేటికి ఆ సంస్థానాల రాజులు "షెడ్యూల్డ్ ట్రైబ్స్ గా నేటికి పరిగణించబడటానికి" ఆ గజిట్ ప్రకటనే కారణం.

పార్వతీపురం ప్రాంతంలో గల ఎస్టేట్స్‌లో ముఖ్యమైనది నందాపురం (పార్వతీపురం) జమీందారులు, కురుపాం జమీందారులు, సంగంవలస, చినమేరంగి, ఆంద్ర, పాచిపెంట, జమీందారులు, ఒరిస్సా రాష్ట్రమున ఉత్తర దిశలో పార్వతీపురానికి 200 కి.మీ. దూరంలో జైపూర్ ఎస్టేట్ ఉండేది. ఈ ఎస్టేట్‌ను పాలించిన విక్రమదేవ మహారాజే ఆంధ్రా యూనివర్సిటీకి ఎనలేని ఆర్థిక సహాయమందించి విశ్వకళాపరిషత్ విశ్వ వ్యాప్తిలో చేయుటకు ఎంతగానో సహాయపడిన ఉదార వంతుడు. కళాభి మాని కళాపోషకుడు. జైపూర్ ఎస్టేట్‌లో చిన్నచిన్న ఎస్టేట్‌లో అంత ర్భాగంగా ఉండేవి. గుణుపురం ఎస్టేట్ అటువంటిదే పార్వతీపురంలోనే కలహిండి రాణిగారి పేర వెలసిన బంగ్లా వుంది. జైపూర్ ఎస్టేట్ వారు నిర్మించిన సత్రం దేవాలయం ఉంది. ఈ ఒరిస్సా రాష్ట్రము ఒక రైతు సంఘం పనిచేసేది. ఆ సంఘానికి నాయకునిగా విశ్వనాధ దాస్, శశిభూషణ్ రదో, దివాకర్ల పట్నాయక్‌లు ఉండేవారు.

గంజాం జిల్లా రైతు రక్షణ సంఘం అధ్యక్షులు పుల్లెల శ్యామసుందరం శక్రటరీ లచ్చన్నలు చేస్తున్న రైతోద్యమ కార్యకలాపాల్ని 1936లో ఒరిస్సా రాష్ట్ర నిర్మాణం తదుపరి ఉత్తర విశాఖ జిల్లా రైతాంగం ఒక కంట కనిపెడుతూనే ఉంది. అందలి ఎస్టేట్ రైతు రక్షణ సంఘాలు చేస్తున్న పోరాటాల్ని పసి గడుతూనే ఉంది. దానిలో కలిసిపోయి పంచుకోవడానికి

పాల్గొనటానికి ఉవ్విళ్లూరేవారు.అట్టివారిలో ప్రధముడు అగ్రగణ్యుడు చెప్పుకో దగిన జాతీయోద్యమ అభిమాని యం. వి. రామ్మూర్తి పంతులు ఆనాటి స్వాతంత్ర్యోద్యమ కర్తలుగా దేశ సేవకులుగా చెప్పుకోదగిన వారు.

1. యం.వి. రామ్మూర్తి పంతులు
2. కాళ్లకూర్తి కృష్ణమూర్తి
3. వారణాసి సుందరనారాయణ
4. గౌతుల చిన్నయ్య
5. అయ్యగారి జగన్నాధరావు.
6. మోపిదేవ విజయన్న పంతులు
7. దవళ సూర్య ప్రకాశరావు
8. తాతా జగన్నాధం పంతులు
9. వారణాసి సుందరరావు
10. బుగత జగన్నాధ శెట్టి ఇంకను అనేకమంది ఇతరులు..

వారు రైతోద్యమాన్ని నడిపారు. వీరు జాతీయోధ్యమాల్ని నడిపారన్నది లేదు. అందరూ అటు రైతోద్యమంలో ఇటు స్వాతంత్ర్యోద్యమంలో అవసరమైనపుడెల్లా దుమికేవారు అందరి ధ్యేయం, ప్రజాక్షేమం, జాతీయతా రక్షణ, దోపిడీ దారులను ఆంగ్లేయులయిన జమీందారాలైన వారిని ఎదిరించి పోరాడుటమే అందరి ఉద్యమ లక్ష్యం. ఏ ఒకరిది మితిమీరిన దేశభక్తి ప్రజా సేవ తప్పించిస్వయ ప్రయోజనాల మేరకు వ్యవహరించడమన్న ప్రశ్నేలేదు.

1936 లో పార్వతీపురం జమీందారీ రైతు సంఘం కార్యవర్గం రైతోద్యమానికి శ్రీకారం చుట్ట దలచింది. రాష్ట్ర నాయకుడు గంజాం జిల్లా కాంగ్రెస్ నాయకుడు రంగాను గంజాం జిల్లా కాంగ్రెస్ నాయకుడు పుల్లెల శ్యామసుందరం గారు గంజాం జిల్లా రైతోద్యమ శక్రటరీ లచ్చన్న గారిని పార్వతీపురం రైతు రక్షణ సంఘం ఆహ్వానించింది.

సమావేశ స్థలం ఆనాటి రైతు సంఘ సభ్యుల్లో ప్రధాన భూమిక వహిస్తే ఘన కార్యకర్తయై, పేరుగాంచి, సోషలిష్టు భావాలతో ఉద్యమం అన్న ఎగిరి గంతేయాలని చూస్తున్న ముదిలి బాబూ పరాంకుశం గారి జన్మస్థలం లఖణాపురం రావివలస. తదుపరి కాలమున వీరినే ఉనుకూరు ప్రజానీకం

తమ శాసన సభ్యునిగా ఎన్నుకొన్నది. పరాంకుశం గారికి నిత్యం చేదోడు వాదోడుగా ఉంటూ ఉద్యమానికి తన మేరకు ఊపిరి పోసే భాగస్వామి అని నిరూపించే మరి శర్ల వెంకటనాయుడు గారిది కూడా ఆ లఖణాపురం గ్రామమే. మంతిన తవిటి నాయుడు, అప్పలస్వామి నాయుడు, వెంకటస్వామి నాయుడు, వగైరాలు తనకండ నిలువగా పార్వతీపురం రైతురక్షణ సంఘం ఆధ్వర్యంలో రాత్రింబవళ్లు సైకిళ్లపై గ్రామాలన్నీ పర్యటించి అసంఖ్యాక రైతాంగాన్ని లఖణా పురంలో హాజరు పరచారు.

ఆ సమావేశానికి రైతు రంగా, తిమ్మారెడ్డి శ్యామ సుందరరావు, లచ్చన్న ప్రభృతులు హాజరయినారు. మహాసభలు దిగ్విజయమైనాయి. ఇనాందారులపై పోరాటాన్ని ఆ లఖణాపురం సభనుండి ప్రారంభమైంది. ఆ మహాసభలు ముగిసిన తదుపరి మరచటి దినమున బందలుప్పి యాళ్ల సింహాచలం నాయుడు తదితర రైతు పెద్దలతో కలిసి బ్రహ్మాండమైన రైతు మహాసభను రంగా, శ్యామసుందరం, లచ్చన్న గారలను తెప్పించి బందలుప్పిలో నిర్వహించారు. అసంఖ్యాక రైతాంగాన్ని భోజన వసతి సదుపాయాల్ని కలిగించడమే కాక రైతుల్లో ఎంత చైతన్యం తేవటానికి కారణ భూతుడైనాడన్న కీర్తి ప్రతిష్టలు స్వర్గీయ సింహాచలం నాయుడు గారికి లభించాయి. మితభాషి, అజాత శత్రువు, నిర్మలాంతరికరణుడు దేశ సేవాభిలాషి,నిస్వార్థజీవి.రచయితగారి స్వగ్రామం పార్వతీపురం తాలూకా పెదబొండపల్లికి దగ్గరయినదే బందలుప్పి గ్రామం.

లచ్చన్న గారికి పార్వతీపురం ప్రాంతంతో పరిచయం కావటానికి ప్రాతిపదిక రైతు మహాసభలే. అందరి వక్తలతోపాటు రైతాంగం ఆనాడే లచ్చన్న గారి వాగ్ధాటి పోరాట పదము, నాయకత్వ లక్షణాల్ని చూడగలిగింది. రైతోద్యమ నాయకునిగా గుర్తించింది. తదుపరి కాలమున లచ్చన్న గారికి ముఖ్య అనుచరునిగా మెలగిన వంగపండు పార్వన్నాయుడుగారు ఈ ప్రాంతం వారే - పార్వతీపురం నివాసి.

ఆనాడు వరకు కొందరి చేత ఎర్రి మొద్దుల్లా అనిపిలవబడుతూ [illegible] ప్రతకడమే తప్ప వారి శ్రేయస్సుకు రైతు పెద్దల ముఖం ఎరుగని పార్వతీపురం రైతాంగానికి రైతు సభలు కాంతిరేఖల్ని ప్రసాదించాయి.

ఒకవైపు రైతోద్యమం జమీందారులపై, ఒకవైపు జాతీయోద్యమం బ్రిటిషు వారిపై ఒకటి తమ జీవనాధార సమస్య, జీవిత సమస్య వేరొకటి స్వాతంత్ర్యం స్వేచ్ఛ తెచ్చి పెట్టినది. ఏ ఒకటి లేకుండా ప్రజాలు మనలేని పరిస్థితి, తరతరాలుగా బానిసలమని భావిస్తూన్న ప్రజానీకం తమ నాయకులు అనంత శయనం అయ్యంగారు, యన్.జి. రంగా కాశీనాధ నాగేశ్వరరావు పంతులు, వరాహగిరి మొదలగువారు ఢిల్లీ సెంట్రల్ అసెంబ్లీలో సభ్యులుగా ఉండటం ఎంతయిన చైతన్యాన్ని వారిలో తెచ్చి పెట్టింది.

1938లో పార్వతీపురం ప్రాంతానికి ఎన్నికల సందర్భంగా ప్రొఫెసర్ రంగా డాక్టరు సరోజినీ నాయుడు చెరకువాడ వెంకట నరసింహం పంతులు, భోగరాజు పట్టాభిశీతారామయ్యగారు వచ్చి ముఖ్యమైన గ్రామాలను సందర్శించడం నాటి పల్లె ప్రజల్లో చైతన్యపు జ్యోతులు వెల్లి విరిసాయి. కిట్టించేరేటు చెల్లించే వారిని రేటు పేయర్సును నాటి అక్షరాస్యులను ప్రతినిధులను ఎన్నుకోమని చెప్పటానికి ప్రచారానికయి వచ్చారు. కాకినాడ వేదాంతం కమలాదేవి గొప్ప దేశభక్తురాలు పార్వతీపురంలోవారు తిరిగిన లచ్చన్న కాలంలో మకాం వేసి మరీ పట్టుదలతో కాంగ్రెస్ అభ్యర్ధిని గెలిపించారు. నా జన్మ స్థలమైన పెదబొండపల్లికి వీరంతా రాగా అతిచిన్న వయసులో రచయితకు వారిని గాంచిన మహద్భాగ్యం కలిగింది.

స్వాతంత్రోద్యమం ఒకవైపు రైతోద్యమం ఒకవైపు బాగా పుంజుకున్నాయి. ప్రజల్లో ఒక ఊపు వచ్చింది. స్వాతంత్ర్య పిపాస ఆకాంక్ష లేచింది. అంతవరకు అణగారియున్న సమాజం అన్యాయాలను దోపిడీని ఎదుర్కోవటానికి సిద్ధమైంది.

గంజాం జిల్లా ఆంధ్ర రైతు రక్షణ సంఘం శక్రటరీగా లచ్చన్న విశాఖజిల్లా రైతుసంఘం శక్రటరీ రైతోద్యమ కర్త యన్. యన్ మూర్తి కలసి ఎస్టేట్ గ్రామాలన్నింటినీ పర్యటించి ఉత్తరాంధ్ర జమిందారీల దోపిడిని అరికట్టాలని ప్రభోదించి రైతులను శిస్తులను కట్టమని కాదు, కట్టలేము అన్న నినాదాన్ని పలికేలా తీర్చిదిద్దిన రైతోద్యమ నాయకుడు లచ్చన్న రైతురంగా తీర్చిదిద్దిన రాజకీయ మాణిక్యం, రైతన్నల రత్నం.

రైతోద్యమంలో అచ్చన్న సహచరులు అనుచరులు (1) కొత్త అప్పలనాయుడు (2) దుక్కిన సూర్యనారాయణరెడ్డి (3) బెందాళం గవరయ్య - బోయిన అప్పలస్వామి - దుక్కాన రాజన్నరెడ్డి - ప్రధాన రామన్న - బెండికూర్మన్న - అట్టాడ కృష్ణమూర్తి - మండల పారన్న, [illegible] వెంకటరెడ్డి - చెలికాని రంగనాయకులు - కోళ్ల కూర్మినాయుడు - గొర్లె సూర్యనారాయణ - బాబూ పరాంకుశం - అంగజాల వెంకటేశం - యం.వి. రామూర్తి పంతులు - కొలికవెల సన్యాసిరావు - పుండరీకాచారి - కునికెల్ల వెంకటనారాయణదొర - పరశురాంనాయుడు కరీం నారాయణ అప్పలనాయుడు - మార్పు పద్మనాభం - నిచ్చెర్ల రాములు దుర్లభసాహూ - పుక్కళ్ళ లక్ష్మీ నారాయణ - గౌన్న ఎర్రయ్య సరంగి నీలాద్రి - అక్కన సాహు - దుర్గ జమ్మినాయుడు పిందిరి రామస్వామి మొదలగువారు.

## విజయనగరం జమిందారీ ఎస్టేట్ రైతు సంఘం

ఉత్తరాంధ్ర అంతటికీ విస్తరిస్తున్న రైతోద్యమం విజయనగరం సంస్థానం వరకు వచ్చింది. పూసపాటి, రేగల్ ఫలానాతేదీన రైతు మహాసభ అని ప్రకటించారు.

రైతు మహాసభకు ముఖ్య వ్యవస్థాపకులుగా ముఖ్య అతిథులుగా [illegible] ముందరం అచ్చన్న ప్రభృతులు హాజరైనారు. రైతులు [illegible] గ్రామాలనుండి అసంఖ్యాకంగా తరలి వచ్చారు. నాయకులు [illegible] పోటాపోటీ. అచ్చన్నతో సహ అందరు వక్తలు గంభీరోపన్యాసాల్నిచ్చారు. రైతు కష్టాల్ని వివరించారు. జమిందారులు జరుపుతున్న దౌర్జన్యాలను [illegible]. రైతు సంఘాన్ని ఏర్పరచి ఆ మహాసభలోనే ప్రకటించారు.

[illegible] సభ ముగిసింది. రైతు సంఘంలో చేసిన సభ్యులు తప్ప రైతుల్లో ఏ ఒక్కరు [illegible] సమావేశం ముగిసే వరకూ ఉండలేదు. మధ్యలో చల్లగా [illegible] జారుకొని పోవడం కనిపించింది. ఏ ఒక్క రైతుకు చీమకుట్టి [illegible] ఏదో వింత తేపట్లు నిమ్మకు నీరెత్తినట్లుగా ఉంటూ [illegible] వారయ్యారు.

వేదికపై ఉన్నవారు రైతు సంఘం సభ్యులు మాత్రం మిగిలారు. ఈ రైతులు మనమెంత చెప్పిన వినకుండా పోతున్నారే అచ్చన్న సంఘ సభ్యుని ప్రశ్నించారు. "నిజానికి చెప్పాలన్నా మా విజయనగరం మహారాజు గారన్నా మాకెవరికి ద్వేషంలేదు, కోపంలేదు పైగా వారన్న మా అందరికీ అభిమానమే.

అచ్చన్న నిర్ఘాంతపోయారు. ఇంతవరకు తనకిటువంటి పరిస్థితి ఎదురుపడలేదు. కారణమేమిటని అచ్చన్నగారు ప్రశ్నించారు. "మా మహారాజా ఆనంద గజపతిరాజుగారు రైతులను బాధపెట్టవద్దని తన సంస్థానం ఉద్యోగుల్ని ఆదేశించారట నిజమేమిటో మాకు తెలియకపోయిన అన్నీ ఎస్టేట్స్ రిసర్వే సెటిల్‌మెంటు మేరకు భూముల పరిధిని పెంచి రెట్టింపు శిస్తుల్ని బనాయించినట్లు తెలిసింది. కాని మా విజయనగరం ఎస్టేట్ రిసర్వే సెటల్‌మెంట్‌చేసికొనవచ్చు.1930 Act ఉన్నాచేయలేదట.శిస్తుల్ని హెచ్చించ లేదు. బకాయిలను ఏనాడూ అడగలేదు. అంతేకాదు రైతులు శిస్తు కట్టిన, మానిన ఏ ఒకరి ఆస్తి పాస్తుల్ని జప్తు చేయకూడదు. ఇది మహారాజుగారి ఆజ్ఞ. మేము జప్తుల్ని ఎరుగము. భూములనుండి ఏ రైతును తొలగించిన పాపాన పోలేదు. కట్టిందే శిస్తు వచ్చిందే ఖజానా అన్నది మా రాజావారి విధానం ఇక నీటి సదుపాయాల్ని అడిగినదే తడవుగా మా రాజుగారు రైతులకు కలిగిస్తారు. ధర్మ ప్రభువులు పూసపాటి ఆనంద గజపతి అన్నిటిలో కూడా. మరిచ్చట దేనికి రైతు రక్షణ సంఘం, ఒక సభ్యుని ప్రశ్న "రైతు రక్షణ సంఘం అవరమయింది. ఈనాం భూములు రైతుల్ని జిరాయితి భూముల రైతుల్ని కూడ మనం ఆదుకోవాలి కదా సర్కార్ వారితో కూడ మనం అవసరమైనపుడు తలపడాలికదా ! అందుకు రైతు రక్షణ కమిటీ అవసరమే అచ్చన్న మాటను అందరూ అంగీకరించారు.

చీకటి జమీందారీలో రైతుల దీనావస్థకు కారణమైన జమీందారులను జూచి చిందులు త్రొక్కిన అచ్చన్న ప్రభృతులు విజయనగరం జమీందారీ రైతులకు విజయ నగర రైతులకు విజయ నగర మహారాజా వెలుగును ప్రసాదించడం జూచి ఎంతో శాంత మూర్తిగా కన్పిస్తూ తమ రైతు రక్షణ సంఘాల నిర్మాణ ఆనంద దాయికంగా ముగిసినందుకు రైతాంగానికి అభినందనలు తెలిపారు. ఎంతగానో లోలోన సంతసించారు రైతు నాయకులు. శ్యామసుందరం, అచ్చన్నలు.

# 16 వ ప్రకరణము

# కాంగ్రెస్ సోషలిష్టు ఫోరం-జస్టీస్ పార్టీ – అచ్చన్న

## టెక్కలి రైతుల ఆకలి యాత్ర :-

నిడుబ్రోలులో నెలకొల్పిన రైతు విద్యాలయంలో ప్రతీ సంవత్సరం జూన్ నెలలో రాజకీయ పాఠాల్ని రైతు నాయకులకు బోధించడం శిక్షణ నివ్వడం 1935 నుండి రాష్ట్ర వ్యాప్తికి రైతోద్యమ కార్యక్రమాలు రూపొందాయి. ఆంగ్ల ప్రభుత్వ పాలన క్రింద నున్న జమీందారీలలో అతి నికృష్ట జీవితాల్ని గడుపుతున్న రైతాంగాన్ని ఉద్ధరించ రైతోద్యమ నాయకులు దీక్షా కంకణం కట్టుకున్నారు. జమీందారీ వ్యతిరేక పోరాటాల్లో తలదూర్చారు. రైతుల వెన్నుతట్టి వారికి అన్ని సదుపాయాలు లభించేలా పోరాడటమే రైతు నాయకుడు అచ్చన్న ధ్యేయం.

రైతు రక్షణ యాత్రలు శిస్తు నిరాకరణ ఉద్యమాలు బాగా పుంజుకున్నాయి. అచ్చన్న ప్రభృతులకు లభిస్తున్న ప్రజాదరణ జూచి తీరవలసిందే తప్ప వ్రాతల్లో వర్ణించనలవి కానిది. రైతోద్యమాలకు సారద్యం వహిస్తూనే బలహీన వర్గాల పురోభివృద్ధికి అహర్నిశలు కృషి చేసిన చేస్తున్న నాయకుడు శ్యామ మందరం, అచ్చన్నలు రైతుల కడగండ్లను నివారించుటలో అందె వేసిన చేతులు.

జమీందారీ గ్రామాల్లో తదితర గ్రామాల్లో రైతు సంఘాలు రైతుల కష్టాల నివారణకై అహర్నిశలు అచ్చన్న నాయకత్వంలో కృషి చేస్తున్నాయి.

1934లో టెక్కలి ప్రాంతం కరువుకు లోనయ్యింది. దుర్భిక్షంతో రైతాంగం గడ్డ కట్టుకొని పోయింది. పశువులకు మేత లేక రైతుకు తిన తిండిలేక విలపిస్తూ కృంగి పోయే పరిస్థితి దాపురించింది. పలాసా నుండి కోటబొమ్మాళి వెళ్లే వరకు కరువు ప్రాంతంగా గుర్తించబడింది.

గంజాం జిల్లా రైతు రక్షణ సంఘం అధ్యక్ష, కార్యదర్శులు ఇరువురు రంగంలో కడుగిడినారు. దుక్క సూర్యనారాయణ వగైరా ప్రభృతులతో ప్రాంతం అంతా పర్యటించి కరువు రాకాసిని కళ్లారా చూచారు. మద్రాసు ప్రెసిడెన్సీ గవర్నర్ గారికి వినతి పత్రాన్ని యివ్వాలని భావించారు. గంజాం జిల్లా రైతు సంఘం వెంటనే మద్రాసు గవర్నర్‌ను వచ్చి కరువుకు గురియైన రైతాంగాన్ని ఆదుకొనవలసినదిగా తంతి వార్తను అంపించారు. ఆనాటి దిన పత్రికలు ఈ విషయాన్ని ప్రకటించాయి.

ఆనాటి కేరళ రాష్ట్రంలో పర్యటిస్తున్న ప్రొఫెసర్ రంగా పేపర్లో పడిన వార్తను చూచి వెంటనే గంజాం జిల్లా రైతు రక్షణ సంఘం అధ్యక్ష, కార్యదర్శులకు టెలిగ్రాం యిచ్చారు. కరువు ప్రాంతంలో తన పర్యటన కార్యక్రమాన్ని రూపొందించవలసినదిగా రంగాగారు ఆ తంతిలో కోరారు. తాను వెంటనే బయలు దేరి వస్తున్నట్లు తంతిలో తెలిపారు.

రంగాగారు వస్తున్నారని తెలియగానే జిల్లా రైతాంగంలో ఉత్సాహ ఉద్రేకాలు ఒక్కపెట్టున పైకి లేచాయి. గంజాం జిల్లా విశాఖ జిల్లా రైతు సంఘాల అధ్యక్ష కార్యదర్శులు ఇరువురు టెక్కలి చేరుకున్నారు.

టెక్కలి చేరుకున్న రంగా పుల్లెల శ్యామసుందరం, లచ్చన్న ప్రభృతులను వెంట నిడుకొని ప్రతిపల్లె పల్లెకు వెళ్లి ప్రజలను పరామర్శించి ఓదార్చారు. ప్రభుత్వం వెంటనే మీకు అన్ని సౌకర్యాలు చేసేలా చూడ గలనని వారికి హామీ నిచ్చారు. రంగాగారు తమ పాలిట దేవునిగా భావించారా రైతులు. రంగా గారి అనుమతితో టెక్కలిలో కరువు రైతు మహాసభను నిర్వహించారు. 50 వేల మంది రైతులతో కరువు ర క్షణ యాత్రను నడి పించారు. జిల్లా రైతాంగం అంతా కదలి నడిచినట్లయింది. మద్రాసు నుండి "ఫేమిన్ కమిషనర్" ను వెంటనే రమ్మని అర్థించింది.

రంగా ప్రతి దినం కొన్ని గ్రామాలను సందర్శించిన తదుపరి ఆ గ్రామాల్లో నున్న పరిస్థితిని వెంట వెంటనే నివేదికలుగా వ్రాసి మద్రాస్ గవర్నర్‌కు పంపేవారు. అతని వెంట ఒక టైపు రైటర్ ఉండేది. అతనే స్వయంగా టైపుచేసికొని ప్రభుత్వానికి రిపోర్టులను పంపేవారు. రంగాగారి అభ్యర్థనలలో ప్రభుత్వం కదిలి వచ్చింది. ఫేమిన్ కమిషనర్‌కే, టెక్కలి

రైతాంగం వినతి పత్రం అందించింది. వెంటవచ్చిన కలెక్టర్‌ను కమిషనర్ ఆదేశించింది. శిస్తుల్ని వసూలు చేయరాదు. నిలుపుదల చేయాలి. గంజి కేంద్రాలు వెంటనే తెరవాలి. చెరువుల మరమ్మత్తును వెంటనే చేపట్టాలి. 15 లక్షల రూపాయలు మంజూరు చేస్తూ ఉత్తర్వులు జారీ అయినవి. ఆకాలంలో 15 లక్షలు అన్న ఈ కాలంలో కొన్ని కోట్లకు సమానమన్నది మనకు తెలిసినదే.

ఈ ఉద్యమం కూడా సాఫీగా జరగలేదు. అడ్డంకులుకొన్ని ఎదురయాయి. 50,60 గ్రామాలు పర్యటించి రైతు నాయకులు రైతుల నుండి వినతి పత్రాలపై వేలి ముద్రల సేకరణలో జమీందారు గ్రామాల్లో నున్న జమీందారీ తొత్తులు అడ్డుపడేవారు. నౌపడం శిబిరాన్ని ఏర్పరచుకున్నారు. ప్రభుత్వానికి కరువు పనులు చేపట్టండని మహాజర్లపై వేలి ముద్రలు వేయమన్న, వద్దన్న సమాజాన్ని ధిక్కరించి నడచింది రైతు రక్షణ సంఘం. ఆకలి యాత్ర రోజున కొన్ని గ్రామాల అధికార్లు అడ్డుపడిన సముద్ర తీర ప్రాంతం నుండి శిబిరానికి వేల సంఖ్యలో రైతులు వచ్చారు. తదుపరి టెక్కలి చేరుకున్నారు. టెక్కలి మిషనరీల బంగళాలో నున్న రెవెన్యు బోర్డుమెంబరు వద్దకు ఊరేగింపుగా వెళ్లి లచ్చన్న మహాజరు అందచేసారు. తత్ఫలితమే శిస్తు వసూలు నిలుపుదల గంజి కేంద్రం ఏర్పాటు, చెఱువుల మరమ్మత్తు వగైరాలు. టెక్కలి ప్రాంతాన్ని కరువు ప్రాంతంగా ప్రకటించజేసిన ఘనత రైతు రక్షణ సంఘానిదే.

## రైతోద్యమానికి కమ్యూనిష్టుల ప్రతిఘటన :

మద్రాసు ప్రెసిడెన్సీ ఆంధ్రా ప్రాంతంలో దేశ స్థాయిలో కిసాన్ సభ పిలుపునిచ్చి రైతు ర క్షణ సంఘాల్ని స్థాపించడంలో రైతు రక్షణ యాత్రలను నడపడంలో విజయ పతాకం ఎగుర వేస్తు రైతోద్యమాలను నడుపుతున్న లచ్చన్న రైతు రంగాలను జూచి కమ్యూనిష్టు పార్టీ భయపడింది. తుదకిది భూస్వామ్య వ్యవస్థను సుస్థిర పరచటానికి ఉపయోగపడుతుందని దుష్ప్రచారంలోనికి తెచ్చింది. భూములపై ప్రత్యేకమైన హక్కులు పొందిన రైతాంగం. శ్రామిక వర్గానికి వ్యతిరేకతను తెలుపుతుంది తప్పించి శ్రామిక వర్గ [illegible]త్వానికి శ్రామిక జన శ్రేయో రాజ్యానికి, రాచబాట వేయదని వారి

అభిప్రాయం. సోషలిజాన్ని గాక మరల పెట్టుబడి దారీ విధానాన్ని భూస్వామ్య విధానాన్ని మరల తెస్తుందని కమ్యూనిస్టు నాయకులు రైతు రక్షణ సంఘాల నిర్మాణాన్ని వ్యతిరేకించారు. అంతటితో సరిపెట్టుకోనక కమ్మ సంఘానికి చెందిన పెద్ద రైతు రంగాను అభివృద్ధి నిరోధకుడు అని ముద్ర వేశారు. సామ్యవాద సిద్ధాంతాన్ని త్రోసిరాజని రైతులకు పట్టా హక్కులన్ని కలిగించి భూస్వామ్య విధానానికి రూపం ఇస్తున్న సామ్యవాద వ్యతిరేకి రంగా అని ప్రచారం ప్రారంభించారు.

ఎంత వీరు ఘోషిస్తున్నా రంగా దిగ్విజయంగా తన రాజకీయ పాఠశాలను నడిపిస్తున్నారు. అసంఖ్యాక రైతు సంఘాల ఆవిర్భావం జరిగిపోతూనే ఉన్నాయి. యువజనులు విద్యాధికులు విద్యార్థులు కూడా రంగా గారిస్తున్న ఉపన్యాసాలకు ముగ్ధులై తన శిష్యులుగా చేరిపోయారు. ప్రజల్లో రంగా పలుకుబడి పెరిగి పోవడంతో చివరికి "రైతు రంగా" అన్న కీర్తిని గడించుకొన్నారు.

రంగాగారి ఉద్యమాన్ని దెబ్బతీయాలని, కమ్యూనిస్టులు ఒంగోలు దగ్గరలి కొత్త పట్నంలో 1936 లో ఒక రాజకీయ పాఠశాలను తెరచారు. రంగా గారినే వచ్చి ఆ పాఠశాలలో ఉపన్యాసాలిమ్మని ఒకనాడు పిలిచారు. నమ్మిన సిద్ధాంతాన్ని ఏ పరిస్థితులలోను విడనాడని మనో ధైర్యం గల రంగా తన శిష్య రత్నం లచ్చన్న గారిని వెంట నిడుకొని ఉపన్యసించటానికి వెళ్లారు. అయితే ప్రప్రథమంగా భారతదేశానికి రాజకీయ పాఠశాలను ప్రవేశ పెట్టిన ఘనత రంగాజీకే దక్కుతుంది.

అయితే ప్రభుత్వం ఆ సరికే ఆ పాఠశాలపై విధి నిషేధాన్ని విధించింది. రంగా గారు నిషేధాజ్ఞను ధిక్కరించి హాజరయిన రాజకీయ విద్యార్థులనుద్దేశిస్తూ ప్రసంగిస్తూనే ఉన్నారు. సభలోనికి జొరబడి పోలీసులు లాఠీ ఛార్జి చేయడం ప్రారంభించారు. కొంత మందిని అరెస్టు చేసి తీసుకొనిపోయారు. ఎందువల్లనో రంగా గారిని లచ్చన్న గారికి అరెస్టు చేయలేదు. వారిపై లాఠీచార్జి చేయలేదు.

దరిమిలా పామర్రులో జరిగిన రైతు మహాసభలో రంగాగారు. లచ్చన్న, కొటగడ్డ రాజగోపాలరావు రాజకీయ పాఠశాలపై జరిగిన లాఠీ

చార్జీని నిరసించారు. ఒకరి అభిప్రాయాలను విని గౌరవించిన తన స్వీయ అభిప్రాయాలను రక్షించు కొనుటలో అప్రమత్తతగా నుండటయే ప్రజాస్వామ్యము యొక్క ముఖ్య లక్షణం అని రంగా ప్రకటించారు.

## కాంగ్రెసు సోషలిష్టు ఫోరం :

వామపక్ష భావాలుగల కమ్యూనిష్టు రాజకీయ పాఠశాలను నిషేదిస్తూ ఆజ్ఞల్ని ప్రభుత్వం జారీ చేయడం మిత వాదులను బ్రిటిష్ రాచరికం పెంచి పోషించటానికా అన్నట్లుంది.

నిజానికి భారతదేశానికి స్వతంత్రం కావాలని పోరు సలుపుతున్న కాంగ్రెస్ పార్టీలోనే వామపక్ష భావాలున్న వారు కోకొల్లలు.

1935 లోనే కాంగ్రెస్ పార్టీలో బలమైన స్థానం గల జయప్రకాష్ నారాయణ నూటికి నూరుపాళ్లు సోషలిష్టు భావాలు గల దేశ నాయకుడు సామ్యవాదాన్ని భారతదేశం అమలు పరచాలని నిత్యం ఉవ్విళ్లూరే దేశ స్వాతంత్ర్య యోధుడు గాంధీజీ, నెహ్రూ, బోస్ లకు అత్యంత సన్నిహితుడు సామ్యవాద సిద్ధాంత వేత్తగా జయప్రకాష్, విప్లవ మూర్తిగా సుభాష్ చంద్రబోస్ చెరియొక మార్గంలో వెళ్లనందుననే గాంధీజీ తన అడుగుజాడల్లో నడువగల నెహ్రూను తన వారసునిగా ప్రకటిస్తూ యుండేవారు.

కాంగ్రెస్‌లో సోషలిష్టు వర్గానికి జయప్రకాష్ నారాయణ నాయకుడు. నెహ్రూ మధ్యే మార్గంగా వెళ్లనందున బాపూజీ ఆశీస్సుల నంద గలిగారు. వ్యక్తిత్వం, స్వతంత్ర భావాలు గల సర్దార్ వల్లభాయి పటేల్ కాంగ్రెస్‌లో ఒక వర్గాన్ని నడిపించగలిగిన అందరి మన్నవల నందుటలో సిద్ధాంత రీత్యా విభేదిస్తూనే ఉండేవారు.

1934 లోనే గాంధీజీతో అత్యంత సన్నిహితునిగా మెలగుతున్న స్వరాజ్యసాధనకై బ్రిటిషు వారితో పోరాడుతున్న జయప్రకాష్ విశాఖపట్నంలో జరిగిన వార్షిక ఆంధ్ర రాజకీయ మహాసభలకు విచ్చేసారు. ఆంధ్ర రాష్ట్ర సోషలిష్టు తరఫున సీనియర్ కంభంపాటి సత్యనారాయణ, జొన్నలగడ్డ రామలింగయ్య, చండ జగన్నాధం, రంగా, గోపాలరెడ్డి గారలు

హాజరైనారు. తెన్నేటి విశ్వనాథంగారు సభకు అధ్యక్షత వహించారు. కాంగ్రెసు సోషలిస్టు ఫోరం ఏర్పడింది. ప్రథమ సదస్సులో తెన్నేటి అధ్యక్షునిగా మద్దూరి అన్నపూర్ణయ్య ప్రధాన కార్యదర్శిగా లచ్చన్న, అల్లూరి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య కార్యవర్గ సభ్యులుగా రాష్ట్రంలో సోషలిష్టు ఫోరం ఏర్పడింది.

## కాంగ్రెస్‌లో వర్గ పోరాట రాజకీయాలు :

స్వరాజ్య సాధన తన ధ్యేయంగా ప్రకటించిన కాంగ్రెసులోనున్న అతివాద మితవాద వర్గాలు రెండుగా విభజింప బడక తప్పలేదు.

1936లో జరగనున్న లక్నో కాంగ్రెస్ మహాసభ సమావేశానికి, సోషలిష్టు భావాలున్న వారిని సభ్యులుగా చేర్పించి తీసికొని రావలసిందిగా 1935లో జయప్రకాష్ బాహాటంగానే పిలుపిచ్చారు. ఆంధ్రనుండి వామ పక్ష భావాలుగల లచ్చన్న, సుందరయ్య, సత్యనారాయణ రాజు, మద్దూరి అన్నపూర్ణయ్య లక్నో సమావేశానికి కలసి ఒక రైల్లో ప్రయాణిస్తూ సుమారు 14 ప్రతినిదులు వెళ్లారు. 1935 లో కాంగ్రెస్ సోషలిష్టు ఫోరం సామ్యవాద సంఘ నిర్మాణం జరిగి కాంగ్రెస్ వాదులంతా అంగీకరించిన, కాంగ్రెస్ వాదుల్ని వేరువేరుగా కూడగట్టుకోవడానికి ప్రయత్నాలు జరిగాయి.

లక్నో సభలో జయప్రకాష్ ఒక తీర్మానం ప్రవేశ పెట్టారు. స్వరాజ్యం కోసం పాటుపడే కాంగ్రెస్ ఆశయం స్వరాజ్యానంతరం సోషలిజం భారతదేశ ఆర్థిక విధానంగా ఉండాలన్నదే తీర్మాన సారాంశం. సర్దార్ వల్లభాయి పటేల్. ఆ తీర్మానాన్ని ఎదిరిస్తూ ప్రసంగించారు. నెహ్రూ ఆ తీర్మానానికి ఔననక, కాదనక చర్చల్లో పాల్గొనక మౌనం వహించారు. తీర్మానాన్ని ఓటింగుకు పెట్టారు. నెహ్రూ చేయెత్తలేదు. వల్లభాయిపటేలు సమర్థించలేదు. తీర్మానం వీగి పోయింది. సోషలిష్టు అనిపించుకొని నిత్యం సామ్యవాదాన్ని పారాయణం చేసే నెహ్రూ తీర్మానాన్ని బలపరచక పోవడం వామపక్ష వర్గీయులు అసంతృప్తి చెందారు.

దేశ స్థాయిలో కాంగ్రెస్‌లో వర్గాలు ఏర్పడటంతో గాంధీజీ కాంగ్రెస్ నుండి తప్పుకోగలనని 1934 లో ప్రకటించడం కూడా జరిగింది. ఒక

వరం మింటోమార్లే సంస్కరణలు మాంటేగు చేమ్స్‌ఫర్డ్ సంస్కరణల మేరకు దేశ రాష్ట్ర శాసనసభల్లో ప్రవేశించాలని కోరిన మరొక వర్గం భారత దేశానికి సంపూర్ణ స్వరాజ్యం తప్పించి అన్యథా అవసరం లేదని కాదని వాదించింది.

రాష్ట్రాల స్థాయిలోనే వర్గాలు ఏర్పడ్డాయి. తమిళనాడు కాంగ్రెస్‌లో రాజగోపాలాచారి వర్గం సత్యమూర్తి వర్గం ఆంధ్రా కాంగ్రెస్‌లో పట్టాభి సీతారామయ్య వర్గం, ప్రకాశం వర్గం, రంగా గారి వర్గం, చిత్రమేమంటే వీరంతా ప్రముఖ కాంగ్రెస్ నాయకులు గానే ప్రజలచేత గుర్తించబడేవారు. అనుచరులను కూడా దీనియందులోను పార్టీ పదవుల్ని పొందటంలోనే గ్రూపులు తప్పించి స్వరాజ్య సాధనలో వీరెల్ల శుద్ధమైన కాంగ్రెస్ పార్టీ వారే 1936 లక్నో కాంగ్రెస్ సమావేశం తరువాత కాంగ్రెస్ నేతలు కాంగ్రెస్ సోషలిస్టుల పెరుగుదలపై దృష్టి నిలిపి ఉంచారు. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో అన్ని రకాలకు చెందిన నాయకత్వములు ఉండేవారు. ఈ దశలో రాష్ట్రంలో గల కమ్యూనిస్టు వాళ్ళ వ్యూహాన్ని ఎత్తుగడను మార్చారు. ఇంతవరకు వారు వ్యతిరేకిస్తున్న రైతు రంగాను అన్నన్న గార్ల రైతు రక్షణ సంఘాలను బలపరచటం ప్రారంభించారు. కాంగ్రెస్ జండా ఎర్రజండా ఏకమై నించింది. రైతునేనే ప్రధానాంశంగా గల రంగా గారు రైతు సంఘాల్లో కమ్యూనిస్టు ప్రవేశాన్ని వ్యతిరేకించలేరు. కమ్యూనిస్టులు అన్నన్న, రంగా కలిసి కొంత కాలం ఉద్యమాలను నడిపించారు. స్వాయ పార్టీ కాంగ్రెస్‌లోనే పార్టీ పరమైన ప్రవృత్తి అందుకే [illegible] పోటీలు ఏర్పడినాయి. 1936 లో ఆంధ్రా కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పట్టాభి, రంగా పోటీ చేయగా రంగా ఓడిపోయారు. పట్టాభి అధ్యక్ష పదవి చేపట్టారు.

కొ [illegible] లో 1934 నుండి నాలుగు కాంగ్రెసు సమావేశం [illegible] ప్రారంభించిన [illegible] నేత నాయకులు [illegible]. సత్యాగ్రహ శకం [illegible] శాసనసభ ప్రవేశం ఆరంభమై వచ్చింది. 1936లో మోతీలాల్ నెహ్రూ [illegible] నాయకుడుగా ఉండటం కూడా జరిగింది. జస్టిస్ పార్టీ [illegible] పార్టీ ఏర్పడింది. మద్రాసు ప్రెసిడెన్సీలో [illegible] ఉండేవారు.

[illegible] సమావేశాల ఫలితంగా మాంటేగ్ చేమ్స్‌ఫర్డ్ [illegible] రూపొందించబడిన చట్టం 1935 రూపొందింది. 1938

తో దీని ప్రకారం ఎన్నికలలో పోటీ చేసి గెలుపొందాలని కాంగ్రెస్ పార్టీ తీర్మానించింది.

## 1935 చట్టం గంజాం జిల్లా ఒరిస్సాలో అంతర్లీనం :

మరల 1938 లో ఎన్నికలు వచ్చాయి. అక్షరాస్యులు, రేట్ పేయర్స్ మాత్రమే ఓటింగ్‌లో పాల్గొనటానికి అర్హులు. ఇండియా 1935 యాక్ట్ మేరకుమాత్రమే ఒరిస్సా రాష్ట్రం ఏర్పడి గంజాం జిల్లాలోగల అత్యధిక భాగం అందులో విలీనమయింది. మిగతా భాగాన్ని ఉత్తర విశాఖ జిల్లాలగా మార్చారు. దీనితో రాజకీయంగా ఎంతో చైతన్య వంతమైన ఆంధ్రప్రాంతాన్ని విడగొట్టి కాంగ్రెసును బలహీన పరచాలన్నది పరమరాం ప్రాత ప్రత్యేకమైన పథకం. బ్రిటీషు ప్రభుత్వం ఆంధ్రా ప్రావిన్సు కావాలని ఎంతమంది నాయకులు ఎంత వాదించిన ఎన్ని వినతి పత్రాలందించినా పట్టించుకోని బ్రిటీషుప్రభుత్వం పర్లాకిమిడి మహారాజా లండన్ వెళ్లి అడగడమే తడవు ఒరిస్సా రాష్ట్రాన్ని ఏర్పరచింది. తెలుగు ప్రజలసంఖ్యాకంగా ఉన్నారని, లెక్కల ద్వారా చూపిన గంజాం కొరాపుట్ జిల్లాలో ఒరిస్సాలో తర్లీనం చేశారు. ఆ రెండు జిల్లాలు తెలుగు వారివే అని న్యాయమందరం రు అచ్చన్నగారు ఎంతో పట్టుబట్టి ప్రజాబలాన్ని కూడదీసిన ప్రభుత్వాన్ని ప్పించలేకపోయారు. కుట్రతో కూడిన బ్రిటీషు వారిని వారెలా ప్పించగలరు. బరహంపూర్ - పర్లాకిమిడి - పత్రపూర్ అస్కార్ కళాకోట లూకాలో 55% శాతం దాటించి ఆంధ్రులున్నారని చాటి చెప్పారు. యినా ఫలితం శూన్యం. సాక్ష్యాధారాల్ని చూపించిన ఆ రెండు జిల్లాల్ని ల్పించి ఒరిస్సా రాష్ట్రానికి ప్రీమియర్ కాగలిగాడు పర్లాకిమిడి మహారాజాగారు.

## స్టిస్ పార్టీతో, కాంగ్రెస్ పార్టీ పోటీ :

1938 లో 1935 చట్టం మేరకు కేంద్ర శాసన సభకు రాష్ట్రాల ంబ్లీలకు ఎన్నికలు ప్రకటించారు. అక్షరాస్యులు, రేట్ పేయర్స్ త్రమే ఓటింగ్‌లో పాల్గొనటానికి అర్హులు. రేట్ పేయర్లు నిరక్షరాస్యులు యినందున ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం పోటీ చేస్తున్న పార్టీలకు ర్థులకు రంగు రంగుల పెట్టెలను ఓట్లు వేయడానికి కేటాయించింది.

కాంగ్రెస్ పార్టీది పచ్చపెట్టి. జస్టిస్ పార్టీది ఎర్ర పెట్టి. ఆనాటి మద్రాసు ప్రెసిడెన్సీలో స్వతంత్ర అభ్యర్ధులున్నా ముఖ్యమైన పోటీ కాంగ్రెస్ పార్టీ జస్టిస్ పార్టీ మధ్యనే. జస్టిస్ పార్టీ మద్రాసు ప్రెసిడెన్సీకి లోగడ జరిగిన ఎన్నికలలో అత్యధిక శాతం సీట్లను సంపాదించి మంత్రి వర్గాలను కూడ ఏర్పరచింది. జస్టిస్ పార్టీని ఆనాడు కేవలం కాంగ్రెస్‌లోని స్వరాజ్య పార్టీ వారులే ఎదుర్కొన్నారు. వారికి తోడు స్వతంత్ర అభ్యర్ధులు రంగంలో ఉన్నారు.

అయితే 1938 లో పరిస్ధితి అది కాదు. అఖిల భారత కాంగ్రెస్ పార్టీ, కేంద్ర రాష్ట్ర స్ధాయిలో జరుగుతున్న ఎన్నికలలో పోటీ చేయటానికి తీర్మానించింది. కాంగ్రెస్ పార్టీలోనికి అతి వాద వర్గాల వారు మిత వాద వర్గాల వారు రెండు ఎన్నికల రంగంలోనికి దుమికారు. కాంగ్రెస్ పార్టీని గెలిపించాలన్న పట్టుదల వహించారు. పార్టీలో గల వర్గాలను విస్మరించారు.

జస్టిస్ పార్టీకి కాంగ్రెస్ పార్టీకి పోటీ తీవ్ర స్ధాయికి చేరుతుంది. జస్టిస్ పార్టీ అగ్రనాయకులలో ఒకరిగా నుంటూ మద్రాసు ప్రెసిడెన్సీకి 1936 లో ప్రిమియర్‌గా పనిచేసిన బొబ్బిలి మహారాజును ఎన్నికలలో ఓడించటానికి కాంగ్రెసు వ్యూహాన్ని ఎత్తుగడను రూపొందించింది. సర్వశక్తుల్ని సమీకరించింది.

విశాఖ జిల్లాలో గల బొబ్బిలి సీటుకి కాంగ్రెస్ వారు వి.వి. గిరిని నిలబెట్టగా జస్టిస్ పార్టీ తరపున బొబ్బిలి రాజా నామినేషన్ వేశారు. నార్త్ వైజాగ్‌లో నున్న టెక్కలి సీటుకు కాంగ్రెస్ వారు పుల్లెల శ్యామ సుందరాన్ని పోటీ పెట్టగా జస్టిస్ పార్టీ ఎ. పరశురాం పాత్రోను పెట్టింది. చల్లా నరసింహాలును శ్రీకాకుళం సీటుకు, కాంగ్రెస్ పార్టీ పోటీకి నిలిపింది.

అయితే గంజాం జిల్లాలోనే గాక విశాఖ జిల్లాలో గల రైతోద్యమాల్ని నిర్వహించిన లచ్చన్న గారిని కాంగ్రెస్ పార్టీ పోటీలో నిలువమని కోరలేదు. త్యాగము, మానవసేవ, దేశభక్తి చూపవలసి వచ్చినపుడు ఒకరు పదవి అధికారం సంపద ప్రభావిస్తాయన్నపుడు ఇంకొకరు ముఠాలు వర్గాలు ఏకాలమున లేనిది ఎన్నటికీ ఉండక తప్పనిది. ప్రజోద్యమాల్ని నడిపిన వ్యక్తి, ప్రజానాయకుడు కాగలిగినపుడే సమాజానికి క్రాంతి, శాంతి.

లచ్చన్న పార్టీ ఆదేశానుసారం. విశాఖ జిల్లాలో గల కాంగ్రెస్ అభ్యర్థుల్ని గెలిపించ కంకణం కట్టుకున్నారు. ఒకరు శ్యామసుందరం. తన గురువు తన కాదర్శమూర్తి తనను పెద్ద జేసిన వారు వి.వి. గిరి బరహంపూర్, చత్రపూర్ నివాసిగా లచ్చన్న గారికి అతి సన్నిహితుడు అమిత ప్రేమాభిమానాలుకలవారు.

బొబ్బిలి సీటు ప్రెస్టీజ్ సీటుగా మారింది. పరువు నిలుపు కోవాలన్న పంతం తీరాలన్న బొబ్బిలి సీటులో గెలవాలని, రెండు పక్షాలు తీవ్ర స్థాయిలో ప్రచారానికి దిగాయి. వాలంటీర్ దళాల్ని ఏర్పాటు చేశారు. జన సామాన్యం అంతగా తెలివి తేటలను ఆనాటికి కలిగి యుండలేదు. బాకా ఊది కేక వేస్తేనే తప్ప ముఖ మెత్తి పైకి చూడని స్తబ్దత గల సమాజం.

బొబ్బిలి రాజావారు జస్టిస్ పార్టీ ప్రచారకులను రంగంలోనికి దించారు. పాటలను ప్రచారంలోనికిదెచ్చారు. బుర్రకథ దళాలను ప్రవేశపెట్టారు. భజనల పోటీలు, ఆటలలో పల్లె పల్లె ఎన్నికల ప్రచారంలో హోరెత్తిపోతున్నది.

ఎర్ర పెట్టెలో ఓటు వేయరా రైతన్నా
రాజుగారే మన కురక్షకుడు ఓరన్నా !
మడులు మాన్యాలను మహారాజా యిస్తాడు
పన్నులను తగ్గించి పయిస పరకిస్తాడు
దున్నుకుంటే మీకు భూములే యిస్తాడు ॥ ఎర్ర ॥

రైతే మా అన్నని రంకెలేస్తున్నారు
చేతిలో ఏముంది చిల్లి గవ్వలేదు
దేశభోక్తలు వారు దేశభక్తులు కారు
దేశాన్ని పాలించ దేవురిస్తున్నారు ॥ ఎర్ర ॥

ప్రభువులను మరచావా పతనమై పోతావు
నాయకుల నమ్మేవా ? నరకానికెళ్తావు
మాయమాటలు జెప్పి మరపించ చూస్తారు
అందలం ఎక్కేగ గంగలో తోస్తారు ॥ ఎర్ర ॥

బొబ్బిలి పట్నంలో చుట్టుపట్లున్న పల్లె గ్రామాల్లో నియోజకవర్గ మంతా పాటల సందడి జోరు పెచ్చింది. కాంగ్రెస్ పార్టీ కూడ ప్రచార కులను రంగంలోకి దించింది. యువకులను దళాలుగా జేసి వీధుల వెంట జెండాలిచ్చి నడిపించింది.

పచ్చ పెట్టెలో ఓటు వేయరా ఓయన్న
పసిడి పంటలు నీకు దక్కురా ఓయన్నా
శిస్తులని దస్తులని భుక్కుతున్నాడురా
శిస్తు కట్టకపోతే జప్తు చేస్తాడురా
నీటి పదుపాయాలనే వాడు చేసాడు
ఏ కష్టసుఖములను ఏనాడు చూసాడు ||పచ్చ||

ఎన్నాళ్ళు ఈ రాజా ఏలుబడి చేసాడు
ఏలుబడిలో నీవు ఏమి సాధించావు
బండి బక్క ఉందా ఉండ ఇల్లు ఉందా
బతుకు బండయిపోయె బాధలే మిగిలేను ||పచ్చ||

కుక్కి మంచంమీద కునుకుతీస్తున్నావు
గంజి అంబలి త్రాగి బ్రతుకుతున్నావు
కొంపగూడు లేక దుంపలా ఉన్నావు
కట్ట వస్త్రము లేక మోడ్లాలా ఉన్నావు
బాగుపడి రైతులు భాగ్యమందాలన్న
పాగువాక్కులు నీకు చక్కగా వస్తాయి ||పచ్చ||

దివంగత మాజీ భారత ప్రధాని నెహ్రూ మద్రాసు ప్రెసిడెన్సీలో కాంగ్రెసు పార్టీ ప్రచారానికి వచ్చారు. పర్యటన కార్యక్రమం తయారయింది. బొబ్బిలి బలిజ పేటలో బహిరంగ సభలను నిర్ణయించి ఉపన్యాస వేదికల్ని రూపొందించారు. కాంగ్రెస్ నాయకులు వి.వి. గిరి, శ్యామసుందరం, లచ్చన్న ఇతరులు ఎదురేగి నెహ్రూను వేదిక వద్దకు తీసుకొని పోయారు. వేదిక బొబ్బిలి కోటకు అతిదగ్గరలో బస్టాండు వద్ద నిర్మించారు. కాంగ్రెసు జెండాలు రెపరెపలాడుతున్నాయి. అసంఖ్యాక రైతులు ప్రజలు హాజరయినారు.

నెహ్రూ ఉపన్యాసం ప్రారంభించారు. ఇంతలో యుద్ధభేరి మ్రోగినట్లుగా ఉరుముతూ మండే తీవ్ర ఎండలో. రెండు మేఘాల ధ్వనులు

మిన్నుముట్టాయి. నెహ్రూ చెప్పేనది సభికులకు వినిపించలేదు. సభలో కోలాహలం చెలరేగింది. ఈ పరిస్థితుల్ని తిలకిస్తూనే నెహ్రూ ఒక్కమారుగా వేదిక మీదనుండి క్రిందకు లంఘించి తిన్నగా బ్యాండు మేళాల్ని విపరీత ధ్వనులలో వాయిస్తున్నవారి వద్దకు వెళ్లారు. వారి చేతుల్లో వున్న ఒక సాధనాన్ని లాగికొని ఒక్కమారు వారిని లాఠీచార్జి చేసినట్లుగా లంఘించారు. ఇంతలో కాంగ్రెస్ వాలంటీర్లు కాంగ్రెసు నాయకులు నెహ్రూ చుట్టుముట్టి నచ్చజెప్పి మరల వేదిక వద్దకు తీసికొని వచ్చారన్నది ప్రతీతి జనశృతి.

బొబ్బిలి సమావేశం తదుపరి నెహ్రూ బలిజపేట సమావేశానికి తన కారులో బయలుదేరారు. బలిజపేటకు ముందు ఒక ఖానా సమీపాన రోడ్డును 10 అ సొడవున అడ్డంగా త్రవ్వి మన్నును బయటకు పారబోసి- దానిపై కర్రలను పేర్చి దానిపై మట్టిని పోసారు. బయటకు చూడడానికి అది రోడ్డు వలె భ్రమింపచేసిన వెళ్ళిన కారు అందులో పడటం ఖాయం.

నెహ్రూ కారు అతివేగంగా పోతుంది.అల్లంతదూరంలోనే సెక్యూరిటీ గార్డు పసిగట్టి ఆ ప్రమాదం నుండి తప్పించారు. నెహ్రూ బలిజపేట వెళ్లడం జరిగింది. అచట ప్రచారసభ కూడా జరిగింది. అయితే ప్రమాదం తప్పింది. అని చెప్పారు లచ్చన్న.

అయితే నెహ్రూ ఈ సంఘటనలపై తన అభిప్రాయాన్ని స్వీయ చరిత్రలో ఎచట వ్రాయలేదు. బహుశా అతని దృష్టిలో ఇవి చాలా స్వల్ప మైన విషయాలు కావచ్చు.మేరునగసమధీరుడు నెహ్రూ ఈపాటి కోతిముచ్చ టలకు కొండంత ధైర్యంగల మనిషి క్రుంగిపోతాడా ?

నెహ్రూ వచ్చి వెళ్లిన తదుపరి కాంగ్రెసు పార్టీవారు రంగా గారి పర్యటన కార్యక్రమాన్ని నియోజకవర్గంలో ప్రకటించింది. కాంగ్రెస్ వారి సభలను భగ్నం చేయాలన్నదే అవతలపార్టీవారి ఆశయం. ఏ పరిస్థితుల లోను కాంగ్రెసుపార్టీ మహాసభ విజయవంతం కావాలని కాంగ్రెసువారి పట్టు దల.ప్రొఫెసర్ రంగా తన అనుచరులను లచ్చనగారిని తనవద్దకు పిలిచి ఏదో రహస్యాన్ని వారి చెవుల్లో వినిపించారు.

సాయింకాలం 4.1/2 గంటలయింది.ఊరేగింపు సాగింది. అచ్చన్న స్థానిక రైతు నాయకులు - దేవకీనందన రామకృష్ణ, పరమహంస ప్రభృతులు ఊరేగింపుకు ముందు నడుస్తున్నారు. ప్రొఫెసర్ రంగా, శ్యామసుందరం, వి.వి.గిరి వగైరా ప్రభృతులు వేదిక వద్దనే ఉన్నారు. ఇక షరా మామూలే. అడ్డంకులు అరవడాలు, ప్రేలుడులు, దుండగుల దుశ్చర్యలు వేదికనుండి ముందుకు సాగిపోతున్న కాంగ్రెసు ఊరేగింపు వెనుక ఈ దుండగుల కిరాయిగాళ్లు నడవటం, ప్రచారం చేస్తూ, పాటలు పాడుతున్న కార్యకర్తలను దబాయించడం, ఎదురుబడి కలబడడం, వారితో కలహించడం, కొట్లాడటం, సంఘర్షణలు అయిన ఊరేగింపు ఆగలేదు. ముందుకు సాగిపోతూనే ఉంది. ఈ కిరాయిగాళ్లు దుండగులు కాంగ్రెసు కార్యకర్తల వెంట పడుతూనే ఉన్నారు. ఊరిమధ్యకు ఊరేగింపు వెళ్లిందని తెలిసికొన్న ప్రొఫెసర్ రంగా వెంటనే లేచి వేదికమీదకు వెళ్ళి బాకా పట్టుకొని పురజనులను రమ్మని తను చెప్పేనది వినమని కోరారు. గట్టిగా బాకాలో అరుస్తున్న ప్రొఫెసర్ రంగాను వేదికమీద్దనున్న తదితర పెద్దలను జూచి అటుయిటు వెళ్తున్నవారు సభ జరిగితే వినిపోదామని వచ్చియున్నవారు చాలామంది హజరైనారు. రంగాగారు ఇంకను జవాన్లిన్ని రమ్మని ప్రేరేపిస్తున్నారు. వీధి గుమ్మంలో నిలుచుని దూరంనుండి చూస్తున్న మహిళలను పౌరులను ఎలుగెత్తి పిలుస్తూ "మీరంతా రాజుగారి బానిసలా, మీరు స్వతంత్రులు కారా, మీరు స్వేచ్ఛ లేకుండానే బ్రతుకుతున్నారా, మానవులంతా సమానులని మీరు భావించలేదా ? ఇంతగా దిగజారి ఒకరికి భయపడిపోతున్న మీకు మనదేశము దాస్య శృంఖాలాల్ని ఎలా భేదించగలరు ? రండి, రాజుగారి నిరంకుశత్వాన్ని ఎదిరించండి". రంగాగారు ఉద్రేకంలో అన్నమాటలు ప్రజల్లో బాగా పనిచేసాయి. పదినిమిషాల్లో పదివేలమంది వరకు ప్రోగయినారు. అది బొబ్బిలిలో కూడలి స్థలం. అసంఖ్యాకంగా గుమిగూడిన జనాన్ని చూచి రంగా ఉప్పొంగిపోయారు. జవాల్ని ప్రభోదించారు. జస్టిస్‌పార్టీని గెలిపించిన ఎంత నష్టపోతారో తెలిపారు. కాంగ్రెసు పార్టీని గెలిపించమని అర్థించారు. సభ ప్రశాంతంగా కొనసాగిపోతూనే ఉంది. మధ్యలో ఎట్టి అవాంతరాలు లేవు. రాత్రి 8 గంటలు కావస్తుంది. రంగా సభను ముగించారు. సభ జయప్రదమైనందుకు కాంగ్రెసు కార్యకర్తలు ఉప్పొంగిపోయారు. బొబ్బిలిలో బహిరంగసభను ప్రశాంతంగా నిర్వహించిన ఘనత రంగాగారికి

దక్కుతుంది. ఇంతలో ఊరేగింపుకి వెళ్లిన కాంగ్రెస్ వాలంటీర్లు వేదిక వద్దకు చేరుకున్నారు.

రంగాగారి పథకం విజయవంతమైనది. అటు ఊరేగింపు మీద దండయాత్ర చేస్తున్న దుండగులు, ఇటు వేదిక మీద రంగాగారు ఉపన్యసించడం, సభను నిర్వహించడం పసిగట్టలేకపోయారు. వారున్నది వెళ్ళినది నగరం మధ్యలో గల వీథుల్లోకి ఊరేగింపును అరికట్టాలని.

మరుసటి దినమున రంగా, పట్టాభి, వి.వి.గిరి. లచ్చన్న, శ్యామసుందరం ప్రభృతులు నియోజకవర్గంలో పర్యటించారు. పార్వతీపురం, బటిజపేట, సాలూరు, రాజాం పట్నాలను గురుగుబిల్లి, పెదబొండపల్లి, కొమరాడ, మక్కువ వంటి పెద్ద గ్రామాలను సందర్శించి కాంగ్రెసు పార్టీకి ఓటు వేయాలని అక్షరాస్యులను రేటోపేయర్లను అర్థించారు.

ఎన్నికలలో జస్టిస్‌పార్టీ ఓడిపోయింది. కాంగ్రెస్‌పార్టీ గెలిచింది. జస్టిస్‌పార్టీ నామరూపాలు లేకుండా పోయింది. బొబ్బిలి నుండి వి.వి.గిరిగారు, శ్రీకాకుళం నుండి చల్లా నరసింహులుగారు, టెక్కలి నుండి పుల్లెల శ్యామసుందరంగారు గెలుపొందారు. మద్రాసు ప్రెసిడెన్సీలో కాంగ్రెసు పార్టీ మంత్రివర్గాన్ని ఏర్పరచగల సంఖ్యాధిక్యతను పొందింది. కాంగ్రెస్ పార్టీనేత చక్రవర్తుల రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగా, ప్రకాశంపంతులుగారు ఆర్థికమంత్రిగా పదవీస్వీకారం చేసారు మద్రాసు ప్రెసిడెన్సీకి.

లచ్చన్నగారు ప్రత్యేక వాలంటీరు దళాల్ని ఏర్పరచి టెక్కలి ప్రాంతాల్ని సముద్రతీరం రాత్రింబగళ్లు తిరిగి పరశురాంపాత్రోను ఓడించారు. శ్యామసుందరంగారిని గెలిపించారు. గంజాం జిల్లాలోగల ఆంధ్రప్రాంతం ఒరిస్సాలో కలసిపోవటానికి కారకుడు ఈ పరశురాంపాత్రోయే అని లచ్చన్నగారికి గట్టి నమ్మకం. అందువలననే లచ్చన్న అతనిని పట్టుబట్టి ఓడించారు. ఆంధ్రలో ఈశాన్య ఆంధ్రపాంతాన్ని ఆంధ్రకాంగ్రెస్‌గాని, ఆంధ్రమహాసభగానీ అంతగా పట్టించుకోలేదు. నిజానికి ఆంధ్ర, రాయలసీమ, సర్కారు ప్రాంతం అని కృష్ణా, గుంటూరు, ఉభయగోదావరి జిల్లాలకే సర్కారు ప్రాంతం పరిమితమన్న చిన్నచూపు వచ్చింది. మొన్నమొన్నటివరకు లచ్చన్న

ఆంధ్రరాజకీయాలలో అగ్రగణ్యునిగా రాణించేవరకు ఉత్తరసర్కార్లపై దృష్టి ఏ ఒకరికి అంతగాలేదనేదాక అసవాదు.

నాడు విశాఖ గంజాంజిల్లా ఒరిస్సాలో 1936లో కలిసిపోయిన తదుపరి విశాఖ -విశాఖజిల్లాలుగా పిలువబడి మరల విశాఖ శ్రీకాకుళం జిల్లాలుగా పిలువబడి నేడు శ్రీకాకుళం - విజయనగరం - విశాఖపట్నం జిల్లాలుగా ఉత్తరాంధ్ర రూపందాల్చింది.

పుల్లెల శ్యామసుందరంగారు, అంగజాల వెంకటేశం, న్యాయపతి, నారాయణమూర్తి, కవ్వెపల్లి సత్యనారాయణ, జోగయ్యపంతులుగారు, లచ్చన్నగారు, యంతి వెంకటనారాయణ, ఆంధ్ర కాంగ్రెస్ వీరికి ప్రేరేపణ నివ్వకపోయిన, వీరే ఆంధ్రా కాంగ్రెస్‌కిచట జీవం పోసి, పెంచి పెద్దజేసారు. రైతోద్యమాలను నడిపి రైతాంగాన్ని చైతన్యవంతంచేసి జమీందారీ విధానాన్ని రద్దుచేసేటంతవరకు వెళ్ళారు. ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షపదవికి మరల 1937లో ఎన్నిక జరిగింది. రంగాగారు, ప్రకాశం పంతులుగారు పదవి నధిష్ఠించ పోటీపడ్డారు. మరల రంగాగారు ఓడిపోయారు. రంగాగారిని బల పరచిన ఉత్తరాంధ్ర నాయకులు లచ్చన్న, శ్యామసుందరం గారలు ఈశాన్య ఆంధ్ర ప్రాంతం ముందుపడలేకపోతున్నది కదా అని బాధపడ్డారు.

ఉత్తరాంధ్రలో జాతీయభావం బలపడి స్థిరపడి 1938 ఎన్నికలలో కాంగ్రెసు పార్టీని స్థిరం చేసింది. స్వరాజ్య సాధనకొరకు ఆయుధంగా ఆనాటికే కాంగ్రెస్ పార్టీ రూపొందింది.

# 17.వ ప్రకరణము

# రైతు రక్షణ మహాయాత్ర

## (ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు)

కాంగ్రెసుపార్టీలో అంతర్భాగమైన స్వరాజ్యపార్టీకి చెందిన మితవాదులు 1936వ జరిగిన ఎన్నికలలో పాల్గొనగా, 1938లో జరిగిన ఎన్నికలలో అఖిల భారత కాంగ్రెసు పాల్గొని 7 రాష్ట్రాలలో విజయంగాంచింది. మంత్రివర్గాలవేర్పరచింది. అయినప్పటికీ అతివాదులకు ఈ శాసనసభా ప్రవేశం అంతగా రుచించలేదు. దేశస్వాతంత్ర్యం రావటానికి ఉపకరించదని దేశస్వాతంత్ర్యాన్ని వెనుకకు నెట్టివేయటానికిదొక కుట్ర అని భావించారు. రాష్ట్రాలలో కేంద్రంలో మంత్రివర్గాలు ఏర్పడిన ప్రయోజన మేమిటి ? రాష్ట్రాలలో గవర్నర్ కేంద్రంలో గవర్నర్ జనరల్ సర్వాధికారి వారిదే అంతిమ తీర్పు ఇక శాసనసభలు ఆ కేంద్ర శాసనసభ చేసేదేముంది, పన్నులు వేయడం, వసూలే చేయడం తప్పించి మనల్ని మనం పరిపాలించాం అన్న తృప్తి తప్పించి - సంపూర్ణ స్వరాజ్యం లభించనిదే వ్యక్తి స్వేచ్ఛ ఎలా సాధ్యము సమానత్వం ఎలా సంప్రాప్తమౌతుంది.

ప్రథమంగా రైతోద్యమానికి బీజాలు వేసిన మహావ్యక్తి ప్రొఫెసర్ రంగా - ఆల్ ఇండియా కిసాన్ సభలను స్థాపించి రైతోద్యమానికి శ్రీకారం చుట్టారు. ఆంధ్రలో ఉత్తరాంధ్రానవిలోనున్న శ్యామసుందరంగారిని, లచ్చన్న గారిని తన అనుచరులుగా చేసుకొని తన ఆశయాన్ని సాధించుకొన్నారు.

జస్టిస్‌పార్టీని ఓడించి శ్యామసుందరంగారిని గెలిపించుకొన్న లచ్చన్న తదితర కాంగ్రెసు నాయకులు, ఒక దినమున శ్యామసుందరంగారిని అభినం దన సభలో ప్రసంగిస్తున్నారు. "వక్తలు" ఎన్నికలలో నెలిచి మనం ఏమి సాధించాం దేశ స్వాతంత్ర్యాన్ని సాధించాలి అవాడే మనం గర్వించాలి. ఇదీ వారి ధోరణి. లచ్చన్న లేచారు. దేశస్వాతంత్ర్యానికి ముందు మనం వేరొక స్వాతంత్ర్యాన్ని సాధించాలి అదే రైతు స్వాతంత్ర్యం. సభ నిశ్శబ్దం అయింది. పరిపాలన వద్దు మనకు, వారిని మనం ఇచట నుండి తరిమివేద్దాం. ఎందుకు మనల్ని వారు ఏంచేస్తున్నారని ? వారు మన సంపద దోచేస్తున్నారని అంతే

కాదు వారు మన స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను హరిస్తున్నారని స్వేచ్ఛాస్వతంత్రం సమానతకొరవడిన బ్రతుకులో బానిసత్వం తప్ప ఏమీకన్పించదు గనుక. అయితే మీరంతా ఆలోచించండి. బ్రిటిష్ వారు అధికారులు మనమంతా బానిసలం ఎటువంటి వారం మనకు సంపద, స్వేచ్ఛ లేదు. అయితే సంపద ఉండి స్వేచ్ఛలేని వారున్నారు. వారెవరు ? రైతాంగం. రైతాంగానికి ఎవరివలన స్వేచ్ఛకొరవడింది. బ్రిటిషువారి వలన కాదు. జమీందారీ ప్రభువుల వలననే వీరి స్వేచ్ఛవలననే మనం మొదట పోరాడాలి.

అందువలన మొదటిగా ఈజమీందారులను ప్రతిఘటించాలి. రైతుకు స్వేచ్ఛను హక్కులను తెప్పించాలి. అందుకే జమీందారీ విధానాన్ని రద్దు పరచాలన్న మన నాయకుడు రైతు రంగా నినాదాన్ని మనం బలపరచాలి.

సభలో కరతాళధ్వనులు మ్రోగాయి. సభాముఖంగా తీర్మానిద్దాం. జిల్లా అంతట రైతు సంఘాల్ని ఏర్పరచి జమీందారులతో పోరాడుతునే ఉన్నాం. అయితే అంతటితో మన ఉద్యమం ఆగదు. ఈ జమీందారీ విధానం రద్దయ్యేవరకు మనం నిద్రపోవద్దు.

మన కాంగ్రెసు ప్రభుత్వమే రాష్ట్రములో మంత్రి వర్గాన్నేర్పరచింది. మన రాజగోపాలాచారి ముఖ్యమంత్రి, మన పంతులుగారు రెవెన్యూమంత్రి మనమంతా ఏకోన్ముఖులమై ఒక మహారైతు యాత్రకు ఇచ్ఛాపురంనుండి మద్రాసువరకు జరపాలి మీరంతా అందుకు తోడ్పడాలి. జిల్లా రైతాంగమంతా మాతో వచ్చి ఆ యాత్రలో పాలుపంచుకోవాలి. రైతు రంగా ఆదేశించిన ఈ ఉద్యమానికి మనమంతా ప్రాణం పోయాలి అన్నారు.

లచ్చన్న, శ్యామసుందరం ప్రభృతులు జిల్లా అంతట తదుపరి పర్యటించారు. రైతు నాయకులను కూడగట్టుకొని వచ్చారు. రైతు సంఘాల అధ్యక్ష కార్యదర్శులను రమ్మని ఆహ్వానించారు

జిరాయితీ రైతు సంఘాలు
యినాం రైతు సంఘాలు
జమీందారీ రైతు సంఘాలు

కరపత్రాల్లో వాటి వాటి సాధకబాధకాల్ని ప్రకటించాయి. వినతిపత్రాలను రూపొందించాయి. ఆ వినతిపత్రాన్ని మద్రాసులో నున్న రాష్ట్ర రెవెన్యూ మంత్రిగారు సమర్పించాలి. ప్రభుత్వాన్ని ఒప్పించాలి.

రైతోమద్యమాన్ని మెప్పించాలి. జమీందారీ విధానాన్ని రద్దు చేయించాలి.

ప్రభుత్వ దృష్టికి తీసికొనివచ్చినంత మాత్రాన సరిపోదు. ప్రజల దృష్టికి తీసికొని రావాలి. అందుకే జనయాత్ర జరగాలి. జనంలో జాగృతి కలగాలి. ప్రజాభిప్రాయం బలంగా ఏర్పడాలి. ప్రజాభిప్రాయాన్ని పాటించని ప్రభుత్వాలు పతనమవకతప్పదు కదా.

అందుకే రైతు మహాయాత్రను ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు నడిపించ సంసిద్ధులైనారు కాంగ్రెసు నాయకులు శ్యామసుందరం, లచ్చన్న ప్రభృతులు.

రంగాగారి జన్మదినం నవంబరు ఏడవతేది రైతు యాత్ర ఇచ్ఛాపురం నుండి ప్రారంభం. ఆ దినమున ఇచ్ఛాపురానికి సుమారు 20 వేల మంది రైతులు హాజరైనారు. రైతు మహాసభ జరిగింది. సభకు అధ్యక్షత వహించిన వారు పుల్లెల శ్యామసుందరంగారు, శాసనసభ్యులు ఇచ్ఛాపురం నుండి మద్రాసు 900 మైళ్లు కాలినడకన ప్రయాణించాలి ఇంచుమించు రెండు నెలల ప్రయాణం.

ఆ రైతుయాత్ర ప్రారంభదినమున హాజరయినవారు ఆంధ్ర ప్రాంతం రైతు సంఘం అధ్యక్షులు కొమ్మారెడ్డి సూర్యనారాయణ, కార్య దర్శి చలసాని వాసుదేవరావు, సహాయ కార్యదర్శి జొన్నలగడ్డ రామ లింగయ్య, వేరొక సహాయ కార్యదర్శి యాత్రను నడిపిస్తున్న సూత్రధారి లచ్చన్నగారే.

ఇంతటి రైతు మహాయాత్రను ప్రారంభించినవారు లచ్చన్న గురువర్యులు ప్రొఫెసర్ రంగాగారుగాక వేరొకరు కాగలరా ! రంగాగారి రాకతో జిల్లా రైతాంగమే కదలి వచ్చినట్లయింది.

ఆనాటి మహాసభకు పుల్లెల శ్యామసుందరం అధ్యక్షత వహించగా వక్తలు ఉపన్యసించిన తదుపరి రైతుమహాయాత్రను లాంచనప్రాయంగా రైతు రంగా కొమ్మారెడ్డి సూర్యనారాయణ, శ్యామసుందరం, లచ్చన్న ప్రభృతులు ముందుకు నడవగా వెంట రైతాంగ జనసమూహం వెంట నడిచింది. బారులుకట్టి వీధుల్లో తీరులు తీరుస్తూ సాగిపోతున్న జనాలనుండి రైతాంగానికి జై భారత్ మాతా కీ జై అన్న నినాదాలతో బాటు జమీందారీ

విధానం అంతం కావాలి. జమీందారుల దౌర్జన్యాలు అంతరించాలి. భూములపై హక్కులు రైతులకు లభించాలి. దేశానికి వెన్నెముక రైతే. రైతే రాజు. రైతు బాగుపడనిదే దేశం బాగుపడదు. రైతు రంగా జిందాబాద్. శ్యామసుందరం జిందాబాద్ నినాదాలు మిన్నుముట్టుచుండగా రైతు మహాయాత్ర కొనసాగించి గమ్యంవైపు ఆ రైతు మహాయాత్ర తన నిరతి వ్రతంలో మద్రాసు రాష్ట్ర శాసనసభబడ్జెట్ సమావేశాలు జరిగే లోగా మద్రాసు చేరుకోవాలి.

దళాధిపతిగా కొమ్మారెడ్డి సూర్యనారాయణ గారిని నియమించారు. రైతు మహాయాత్ర ధ్యేయం జమీందారీ విధానం అంతం చేయాలని, జమీందారుల వద్ద ఇంతవరకు కోర్టుల్లో నడుస్తున్న వ్యాజ్యాల వలన రైతాంగం బాగుపడేది ఏమీలేదు పైగా కోర్టుతీర్పులు జమీందారులకు అనుకూలంగా కొన్ని వచ్చాయి.

నంద కృష్ణమూర్తి, చౌదరి సత్యనారాయణ, వెంకటగిరి జమీందారి నాయుడి కళ్యాణరావు. వెల్లూరు వెంకటరామినాయుడు జమీందారులనెలా ఎదుర్కోవాలో ఎదుర్కొంటూనే ఉన్నారు.

లచ్చన్న బృందం రైతు మహాయాత్ర వెంట కదలింది. రైతు మహాయాత్ర ట్రంకురోడ్డు వెంట సాగలేదు. రైతు యాత్ర ధ్యేయం ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు గల గ్రామీణ ప్రాంతాల రైతులను సమీకరిస్తూ ఉద్యమంలోనికి ఆహ్వానిస్తూ వారిని రైతుయాత్రలో కలిపి నడవాలని కోరడమే.

రైతుయాత్రను సాగనంపిన తదుపరి న్యాయపతి నారాయణమూర్తి, పుల్లెలశ్యామసుందరం, ఇచ్ఛాపురానికి మరలివచ్చారు.యాత్రను నడిపించారు.

రైతుమహాయాత్ర కొనసాగుతుండగా మధ్యమధ్యన వచ్చి కలుస్తానని చెప్పి రైతు రంగా తన దేశస్థాయి రైతోద్యమ కార్యక్రమం మేరకు యాత్రను విడచి వెళ్ళారు. ఇక మిగిలింది రైతాంగం వెంట మద్రాసు వరకు నడచిన లచ్చన్నగారు, లచ్చన్న బృందమే.

మద్రాసు వరకు రైతాంగంతో నడచిన లచ్చన్నతో పాటునడచిన ఇతర రైతునాయకులు సీడిపాటి బుచ్చిప్రసాదరావు, మండ జగన్నాథం, చింపాని వాసుదేవరావు, కొమ్మారెడ్డి సత్యనారాయణ, జొన్నలగడ్డ రామలింగయ్య, గర్లె సూర్యనారాయణ దినమునకు సుమారు 25 మైళ్ళ చొప్పున నడకకొనసాగించారు. దారిలో గల రైతు సంఘాల ఆహ్వానంపై రైతోద్యమాన్ని ప్రచారించే వారు రైతునాయకులు పి.వి. రమణ, కొత్తపేట

సిరపల్లి సింహాచలంనాయుడు – వాడపల్లి సూర్యనారాయణరాజు – గేదెల చంద్రయ్యనాయుడు – నీరుకొండ రామారావు – నాగినేని వెంకయ్య – కె. ఓబులరెడ్డి – పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి – బాల్‌రెడ్డి – అచ్చన్న ప్రభృతులు.

రామదండుతో గ్రామంలోనికి వచ్చిపడిన రైతాంగాన్ని జూచి ఆ గ్రామ రైతులు ఎంతో ముచ్చటపడిపోయేవారు. ఎక్కడ ఇచ్ఛాపురం, వారింతగా శ్రమకోర్చి రైతుయాత్రను జరపడమేమిటి, మనమేమి తక్కువ వారమా? అని ఆ గ్రామస్థుల్లో కొందరు ఆ రైతుయాత్రలో కలిసిపోయేవారు.

అచ్చన్నగారు వ్యక్తిత్వం గలవారు ఓ. ఒకరికి లొంగనివారు. ఎవరాదేశించిన తలొగ్గని మనోధైర్య స్థైర్యంగలవారు. అయితే తన నాయకత్వాన్ని తన నాయకునికి ఏనాడూ తను తిరస్కరించలేదు. వినయం – నాయకత్వానికి రాచబాట అన్నదతని సిద్ధాంతం. గ్రామాల నుండి సాగిపోతున్న రైతు మహాయాత్ర మద్రాసు ప్రెసిడెన్సీలో గొప్ప సంచలనం తెచ్చిపెట్టింది. కాంగ్రెసు నాయకులకు గర్వకారణం గావించింది. రైతులు ఉద్యమిస్తున్నారు సుమా! వీరిని ఆదుకోవాలి లేనిచో ప్రజాప్రభుత్వం పతనమవుతుందేమో!

జమీందారులు ఈ ఉద్యమాన్ని జూచి దీనిని ఎలా రూపుమాపా లన్న ఆలోచనల్లోపడ్డారు. అయితే వారికి జనబలం లేదన్నది 1936, 1938లో జరిగిన ఎన్నికలు ధృవపరచాయి కాంగ్రెస్ జమీందార్ అనుకూల వైఖరిని ప్రదర్శించిన ప్రజాభిమానాన్ని కోల్పోవడం ఖాయమన్నది తెలిసికోగలిగింది.

ఆంధ్రలో వ్యవసాయం ప్రధానవృత్తి. ప్రతి పల్లెలో ప్రత్యక్షమయ్యేది రైతాంగమే. వారిపై బ్రతుకుతున్న కూలీనాలీ జనాలు అసంఖ్యాక జనులా వాడున్నది పల్లెల్లోనే. అత్యధిక సంఖ్యాకుల వృత్తి వ్యవసాయమే. రైతులను ఎదిరిస్తూ ఏ రాజకీయనాయకుడు ఏ పల్లెలను ప్రవేశించి చేయగలిగిందేమీ లేదు.

ఆనాడు రైతు మహాయాత్ర భీమవరం తాలూకాలో కొనసాగు తున్నది. రంగాగారు వచ్చి మధ్య దారిలో కలిసారు. రైతులతో న[illegible] సాగేవారు. తమ ఏకైకనాయకుడని నమ్ముకున్నారు. సామాన్య రైతుగా [illegible]

జేస్తూ తమ వెంట నడుస్తున్న రంగాను చూచి రైతాంగం ఆనందంతో కేకలు వేస్తూ నినాదలిస్తూ నడక సాగించింది. ఏ గ్రామంలో చేరిన వీరికి ఆ గ్రామం రైతులు ఎదురుగా వచ్చి వీరిని సాదరంగా తీసికొని పోయి, ఆతిథ్యమిచ్చి గౌరవించేవారు. రైతుయాత్ర కొనసాగుతున్నదన్న విషయం మద్రాసు ప్రెసిడెన్సీ అంతటికీ వార్తాపత్రికల ద్వారా ఏనాడో తెలిసిపోయింది. రైతులు కాంగ్రెసు జండాలు పట్టుకొని యాత్ర కొనసాగిస్తుంటే ఎదురుగావస్తున్న జనం అనేవ విధాలుగా వీరిని ప్రశ్నిస్తూ ఉండేవారు. లచ్చన్న, సూర్య నారాయణరెడ్డి, రామలింగస్వామి ప్రభృతులు వారికి సమాధానాలిస్తుండేవారు. రైతు బాబుల్లారా దేశం నుండి తెల్లదొరకను వెళ్లగొట్టాలని కాంగ్రెసు జెండా పట్టింది. మరి మీరు ఈ జెండా తెల్లవారికే కాదు మన దేశంలో రైతులను పీల్చి పిప్పి చేస్తున్న జమీందారీలనుండి వాళ్ళ జమీన్‌లను లాగుకొని రైతులకిమ్మని జెప్పటానికి కూడా ఉపకరిస్తుంది. మరి స్వాతంత్ర్యోద్యం మాట ప్రశ్న – రైతుల్లో చైతన్యం రానిదే, వారు దోపిడీనుండి విడివడనిదే అసంఖ్యాక రైతాంగం కల భారతదేశం స్వరాజ్యాన్ని ఎలా సంపాదిస్తుంది ? లచ్చన్న జవాబిచ్చారు. మీరంతా ఈ ఉద్యమంలోనికి దూకితే – మరి స్వరాజ్యోద్యమం? తెలివి తక్కువ ప్రశ్న. ఉద్యమమేదైన ఉద్యమ లక్షణం ఒక్కటే. స్వరాజ్యం కావాలన్న మహాత్ముడు హరిజనోద్యమాన్ని నడప లేదా? స్వరాజ్యం వచ్చేవరకు వాళ్ళకష్టాలను చూస్తూ గాంధీజీ ఊరుకోలేదు. హరిజనులను సామాజికదోపిడీ నుండి కాపాడాలని పిలుపునిచ్చారు కదా. ఆవిధంగానే రైతులనాదుకోవాలని జమీందారీ విధానం పోవాలని, పిలుపునిచ్చిన రైతు రంగాను మా నాయకుడని గుర్తిస్తూ మేమీనాడు రైతుయాత్రను కొనసాగిస్తున్నాం. ఈ మహారైతుయాత్రను ఆపే శక్తి ఏ ఒకరికి లేదు. ఇది ప్రజాశక్తి. పీడిత జనశక్తి. కష్టజీవుల శ్రమ బిందువులనుండి ఆవిర్భవించినదే ఈ రైతు మహాయాత్ర.

గ్రామాలు దాటి ప్రాంతాలనధిగమించి జిల్లాల సరిహద్దులను త్రొక్కి రైతుయాత్రలో వచ్చినవారు వస్తుండగా మధ్యలో మరికొందరు కలుస్తుందగా కొంతదూరం వచ్చి కొందరు నిష్క్రమిస్తుండగా రైతుయాత్ర ప్రారంభమైన స్థలంలో ఏ సంఖ్యలో నున్నదో అంతకుమించిన సంఖ్యగల రైతాంగంతో రైతు యాత్ర మద్రాసు నగరంలో అడుగిడింది.

ఎదురుగా ఆనాటికి మద్రాసు ముందుగా చేరుకున్న రైతు రంగా ఇతర పెద్దలు వచ్చి రైతు యాత్రకు స్వాగతం చెబుతూ మద్రాసు శాసనసభాస్థలికి తీసుకొని వెళ్లారు. మద్రాసు నగరంలో సాగిపోతున్న రైతాంగాన్ని జూచి ప్రభుత్వం రైతాంగం శక్తి ఎంతటిదో గ్రహించింది.

రైతుయాత్రను నడిపింది కిసాన్ కాంగ్రెసు వారే. ఆనాటి రాష్ట్ర ప్రభుత్వాన్ని నడుపుతున్నది కాంగ్రెస్ ప్రభుత్వమే. మద్రాసు ప్రెసిడెన్సీ రెవెన్యూ మంత్రిగానున్న టంగుటూరి ప్రకాశంపంతులుగారి వద్దకు వెళ్లి రైతు మహాయాత్ర నాయకులు వినతిపత్రాల్ని సమర్పించారు.

ప్రకాశం పంతులుగారు ప్రజాభిమాని. ప్రజానాయకుడు, ఉద్యమ నాయకుడు, ప్రజాస్వామ్యవాది రంగాగారిని, లచ్చన్న, పుల్లెల శ్యామసుందరం, చలసాని, చుండి జగన్నాథం ప్రభృతులను అభినందించకుండ ఉండేలేక పోయారు.

మీ మహాజరునుపరిశీలిస్తానుఅనిఅన్నారుపంతులుగారు పరిశీలించడమే కాదు. ఈ ఉద్యమానికి మీరు ప్రాణం పోయాలి అన్నారు రంగా –

పంతులుగారూ మనది ప్రజాస్వామ్య ప్రభుత్వం బ్రిటిషు వారుపైనున్న రాష్ట్ర ప్రభుత్వం మన కాంగ్రెస్ చేతుల్లోనే ఉంది. గాంధీజీ కూడ రైతు బాగుపడాలనే నినాదాన్నిచ్చారు. మీకు తెలిసినదే మీరు రెవెన్యూమంత్రిగా ఈ విషయాన్ని సానుకూలంగా పరిశీలించి రైతాంగానికి న్యాయం చేయాలి – రైతు రంగా అభ్యర్ధన.

తప్పక న్యాయం చేకూరుస్తాను. నాకు రైతాంగంపై అమితాభి మానముంది. రాజులు పరిపాలనలో వారు "రాళ్లుగా" వారి జీవితాలు మారి పోయాయి. మన రాష్ట్ర ప్రధాని రాజగోపాలాచారిగారితో సంప్రదించి శాసన సభలో ప్రస్తావించి, మంత్రివర్గం సరియైన న్యాయం చేకూరుస్తాం.

తదుపరి జమీందారీ ఎబోలిషన్ ఎంక్వయిరీ కమిటీని నియమించారు. ఈ కమీసన్‌కి రెవెన్యూ మినిష్టరు ప్రకాశం పంతులుగారు అధ్యక్షులు. సదరు కమిటీకి సహాయపడటానికి, సాక్ష్యాదారాలు సేకరించడానికి

ఆంధ్ర కిసాన్ కాంగ్రెస్ తరఫున సబ్‌కమిటీ మెంబర్లు – వెజ్జాప్రగడ మందేశ్వరశర్మ, వెల్లూరు వెంకట రమణనాయుడు, ఆచార్య రంగాజీ, పుల్లెల శ్యామసుందరం, గౌతులచ్చన్న.

జమీందారీ ఎబాలిషన్ ఇంక్వయిరీ కమిటీ అధ్యక్షునిగా ఉభయపక్షాలవారి వాదనలను వినటానికి వినతి పత్రాలను స్వీకరించడానికి ప్రకాశం పంతులుగారు విశాఖపట్నం వచ్చారు. జమీందారీ విధానం ఉండి తీరాలన్న దానికి సాక్ష్యాధారాల్ని కొందరు చూపారు. జమీందారీ విధానం అంతరించి రైత్వారీ విధానం రావాలన్న దానికి తగిన సాక్ష్యాధారాల్ని "మేము" చూపాము. ఆ కమిటీకి నివేదిక నందించడంతో లచ్చన్న, శ్యామసుందరంలు అహర్నిశలు శ్రమించారు. జిల్లా అంతటా తిరిగి సంస్థానాలన్నిటి పాత రికార్డులను సంపాదించి నైజాం నవాబునుండి బ్రిటీష్‌వారి నుండి వారికా సంస్థానాలు ఎలా దాఖలు వచ్చాయో చూపే సాక్ష్యాధారాలను రాగిరేకులను పత్రాలను కమిటీకి అందించటంతో రైతాంగం ఏనాటికీ మరచిపోలేని, అంతటి నిర్విరామకృషి జరిపిన వారిలో లచ్చన్న ప్రథములు. తరువాత శ్యామసుందరం, న్యాయపతి నారాయణమూర్తి, గొట్టిపాటి బుచ్చి అప్పారావు ప్రభృతులు చెప్పుకోదగినవారలతో కొందరు ఇంకను జమీందార్ విధానం రద్దుకావాలని రైత్వారీ విధానం రావాలని సహకారమందించినవారు వారివారి వాదనలను వినిపించిన వారెందరో అందరికీ రైతాంగం తప్పక జోహారు లర్పిస్తూ కృతజ్ఞతాభావాన్ని నిత్యం త్రికాలాల్లో అందిస్తూనే ఉంటుంది.

జమీందార్ ఎబాలిషన్ ఇంక్వయిరీ కమిటీ అధ్యక్షునిగా ఉంటూ జమీందారీ విధానాన్ని రద్దుపరచమని సిఫార్సు చేసిన టంగుటూరిని ఆంధ్రరైతాంగమెన్నటికీ విస్మరించలేదు.

# 18 వ ప్రకరణము

# ఆల్ ఇండియా కిసాన్ సభలు – లచ్చన్న

1938లో జరిగిన త్రిపుర కాంగ్రెస్ సమావేశంలో అధ్యక్షో పన్యాసమిస్తూ – సుభాష్‌చంద్రబోస్ "మన స్వాతంత్ర్యాన్ని బలపరుస్తున్న దేశంలోని ప్రతిఒకరిని మనం గౌరవించాలి. వారికున్న రాజకీయ అభిప్రాయాలు వారివి. వాటితో మనకు పనిలేదు. వారెవరైన వారి నుండి స్వరాజ్య సాధనలో మనం సహాయం పొందడంలో అనౌచిత్యమేమీలేదు. సోవియట్ డిప్లమసీని మనం నిజానికి మనం అనుసరించాలి. ఈ అభి ప్రాయంలో నెహ్రూ ఏకీభవించలేదు. తన అభిప్రాయాన్ని దేశం పాటిస్తున్నదన్న విశ్వాసం నెహ్రూలలో ఉంది.

కాంగ్రెస్ హైకమాండ్‌ను బాహాటంగానే బోసు ఎదిరించాడు. త్రిపుర కాంగ్రెస్ సమావేశంలో కాంగ్రెసు అధ్యక్షునిగా మరల హైకమాండ్ వద్దన్న పోటీచేసి గెలుపొందారు. తత్ఫలితమే 1939 ఆగష్టు నెలలో కాంగ్రెసు వర్కింగ్ కమిటీ బోసును 3 ఏండ్ల పార్టీ పదవులకు అనర్హుడని ప్రకటిస్తూ తీర్మానించడం.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. బ్రిటిష్ ప్రభుత్వం అఖిలభారత కాంగ్రెస్ నాయకులను రాష్ట్రాలలోనున్న కాంగ్రెసు. మంత్రివర్గాలను సంప్రదించకనే ఇండియా కూడ యుద్ధరంగంలో నున్నట్లు ప్రకటించారు. స్వేచ్ఛ ప్రజాస్వామ్య రక్షణకే యుద్ధరంగంలో ప్రవేశించినట్లు కాంగ్రెసు నాయకులు ప్రశ్నించారు. కాంగ్రెసుపార్టీ తన అయిష్టతను ప్రకటించింది. యుద్ధంలో సహాయపడుటకు అసంగీకారాన్ని తెలిపింది. రాష్ట్రాలలోనున్న కాంగ్రెసు వర్గాలకు వెంటనే రాజీనామాలనిమ్మని కోరింది. తత్ఫలితంగా రాష్ట్ర శాసనసభలు కేంద్రశాసనసభ రద్దయినవి.

1939లోనే హైదరాబాదు సంస్థానంలో కమ్యూనిష్టు పార్టీ రూపందాల్చింది. కమ్యూనిష్టు లీడరు రాజేశ్వరరావు భువనగిరిలో జరిగిన

ఆంధ్రమహాసభకు హాజరయి, తెలంగాణా రైతుపోరాటాన్ని జరిపించారు. నిర్బంద ధాన్య సేకరణ విధానాన్ని ఎదుర్కొన్నారు. గవర్నమెంటువారు యిమ్మన్న ధరకు రైతు తన ధాన్యాన్నివ్వాలి. ఇదెక్కడ న్యాయం. ఇక ధాన్యం తూకంలోను చెల్లిస్తున్న సొమ్ములోనూ అక్రమాలే. ప్రజా నాట్యమండలి అనుపేర ఒక సాంస్కృతిక దళాన్ని ఏర్పరచి రైతుల కష్టాల్ని జనాలకు వినిపించే కార్యక్రమాల్ని తీసికొన్నది.

1938లో జమీందారీ ఎబోలిషన్ ఎంక్వయిరీ కమీషన్ వేసి జమీందారీలను రద్దుపరచాలని కమిటీ 1939లో నివేదిక యిచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వాలు పార్టీ ఆదేశంపై రాజీనామాలిచ్చిన ఆ కమిటీ నివేదిక అమలుజరగలేదు. ఆచార్య రంగా ఆల్ ఇండియా కిసాన్ సభ వ్యవస్థాపకునిగా దేశస్థాయిలో రైతోద్యమాన్ని నడిపి రైతు రక్షణ యాత్రలను కొనసాగేలా కార్యక్రమాల్ని తీసికొన్నారు. ఆంధ్రలో కిసాన్ ఉద్యమాన్ని లచ్చన్న, శ్యామసుందరరంగార్లు ఆధ్వర్యమున తీవ్రతరం చేయు పథకాలు చేశారు. 1939లో కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామాలు సమర్పించిన వెంటనే గవర్నర్ పాలనలోకి 8 రాష్ట్రాలు వచ్చాయి. మూడు రాష్ట్రాల్లో మిశ్రమమంత్రివర్గాలు ముస్లిం లీగ్ సమావేశంలో పాకిస్థాన్ ఏర్పాటు వాదనను ఏ ఒక శక్తి అడ్డలేదన్న వాదనను జిన్నా ప్రకటించ సన్నాహాలు చేస్తున్నారు.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రకటించబడింది. బ్రిటిషువారికి సానుకూల్యతను ప్రకటించడంలో కాంగ్రెసు అధిష్టానవర్గం ఏకాభిప్రాయాన్ని కోల్పోయింది. సుభాష్‌చంద్రబోసు కాంగ్రెసునుకాదని రాజీనామా యిచ్చి ప్రత్యేకంగా సమావేశమై ఫార్వర్డ్‌బ్లాక్ పార్టీని స్థాపించారు. తీవ్రవాద నినాదాన్ని చేపట్టారు.

హరిపూర్ కాంగ్రెస్ త్రిపుర కాంగ్రెస్ ఫయజపూర్ కాంగ్రెసు మహాసభలు - దేశరాజకీయాలలో పెనుమార్పులకు దోహదం చేశాయి. అతివాద మితవాదులు బాహాటంగా ఒకరినొకరు ఎదిరించుకొని, ఎవరి సిద్ధాంతాన్ని వారు ప్రచారంలోనికి తేవటానికి నడుంకట్టారు.

హరిపురం కాంగ్రెస్‌కి డెలిగేట్‌గా వెళ్లి గౌతులచ్చన్నగారు సుభాష్, పట్టాభి సీతారామయ్యలకు అధ్యక్షపదవికి పోటీ జరిగితే సుభాష్‌చంద్రబోస్‌ను

సమర్థించి ఓటు వేశారు. బోసు గెలిచారు.

త్రిపుర కాంగ్రెస్‌లో బోసు ప్రసంగం చేశారు. కాంగ్రెస్ సంఘాల విభేదాలు ప్రజ్వరిల్లాయి. సిద్ధాంత వైషమ్యాలు చెలరేగాయి.దేశానికి స్వరాజ్యం ఎలా సంపాదించాలన్న నీతిరీతిలో విభేదించాయి. ఫయిజ్‌పూర్ కాంగ్రెస్ మహాసభలలో దక్షిణాదినుండి హాజరైనవారిలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులైన ప్రొఫెసర్ రంగా డెలిగేట్సుగా గౌతు లచ్చన్న ఇతరులు ఉన్నారు.

హరిపురం కాంగ్రెస్‌లోనే రంగా తన ఆల్ ఇండియా కిసాన్ సభ ప్రాముఖ్యతను కాంగ్రెస్ పార్టీకి తెలిపి దీనిని పార్టీలో అంతర్భాగంగా భావించాలని నడపాలని కోరారు. రైతోద్యమం లేనిదే భారతదేశానికి స్వాతం త్ర్యం సమకూరదని వాదించారు. పుల్లెల శ్యామసుందరం, గౌతులచ్చన్న తదితర నాయకులు రంగాను సమర్థిస్తూ వాదనలు చేసారు.

కాంగ్రెసు మహాసభలు జరుగుతుండగా, కిసాన్‌సభలను కూడా జరిపించాలని జరుపుకోవటానికి అంగీకరించాలని, కాంగ్రెస్ అగ్రనాయకులను రైతు రంగా, లచ్చన్నలు అభ్యర్థించారు.

ఇతర కాంగ్రెసు పెద్దలు కొందరు తటస్థత వహించిన మరికొందరు వారి అభిప్రాయాలను వారి వరకే ప్రకటిస్తున్న సర్దార్ వల్లభాయి పటేలు మాత్రం బాహాటంగా ఎదురుపడి కిసాన్ మహాసభలను ఎదిరించారు. "ఏమిటి మీ విధానం రైతాంగం దోపిడీకి గురియై జమీందారీ పంచల్లో పడి బానిస బ్రతుకులతో కాలం వెళ్ళబుచ్చుతుంటే చూస్తూ మనం ఊరుకోవాల" రంగా ప్రశ్నించారు. లచ్చన్న తదితరులు సమర్థించారు. కిసాన్ సభలను జరప డానికి సర్దార్‌పటేల్ వ్యతిరేకించిననూ, జరపడానికి రంగా తదితర కిసాన్ నేతలు నిర్ణయించారు. రంగా, సహజానంద సరస్వతి, రాహుల్ సాంకృత్యా యన్, ఇందూలాల్, పుల్లెల శ్యామసుందరం, గౌతులచ్చన్నలు కిసాన్ ఉద్యమానికి ఉక్కుపిడికిళ్ళి బిగించారు.

ఫయిజ్‌పూర్ సమావేశాల్లోనే తన కిసాన్ సభలను జరిపారు. అసంఖ్యాకంగా హాజరైన భారతీయ రైతులను ప్రభావితం చేస్తూ రంగా ప్రసగించారు. జమీందారీ విధానం అంతరించాలి. రైతు రాజ్యం రావాలి,

కావాలి అని నినాదం ఇచ్చారు. ఈ ఉద్యమంలో ప్రొఫెసర్ రంగాగారు దేశవ్యాప్తమైన కీర్తిప్రతిష్టల్ని సంతరించుకోవడమేగాక, తనదంటూ ఒక వర్గం దేశస్థాయిలో ఏర్పడింది. ఇక ఆంధ్రరాష్ట్రంలో పుల్లెల శ్యామసుందరం, గౌతులచ్చన్నగారలీతనిని రైతోద్యమం నడపటానికి కొందంగ అండగా ఉండేవారనటంలో అతిశయోక్తిలేదు. అత్యుక్తి కాదు.

రైతులకు భూమిపై హక్కు కలిగించి జమీందారీ పెత్తనం తొలగించడము, భూస్వామ్య విధానమా ? కోట్లాది ధనము గల పెట్టుబడి దారులను పెంచి పోషిస్తున్న సమాజం దానిని కాదనలేని సమాజము ఈ కాస్త భూమిపై రైతులు హక్కులను పొందడం. భూస్వామ్యమై పోతుందా ? అతడు లాండ్‌లార్డ్ అయిపోతాడా కల్టివేటర్, లాండ్‌లార్డ్ ఒకటెలా అవుతారు. ఒకడు దోచుకొనబడేవాడు. ఒకరు దోపిడీదారుడు, అని సమర్థిస్తూ కమ్యూనిస్టు నాయకుడు రాహుల్‌సాంకృత్యాయన్ కిసాన్ మూవ్‌మెంటును రంగాను సమర్థించారు. బీహార్ రాష్ట్రం నుండి రైతాంగంలో మంచిపేరు ప్రఖ్యాతులున్న సహజానంద సరస్వతి - రైతోద్యమంలో చేతులు కలిపారు. మహారాష్ట్రం నుండి యాగ్నిక్ కిసాన్‌సభకు మద్దతు ప్రకటించారు.

ఆల్ ఇండియా కిసాన్ సభలు ఆంధ్రలో పలాసాలో జరగాలని హరిపురం కిసాన్‌సభలో పుల్లెల శ్యామసుందరం ప్రతిపాదించగా గౌతు లచ్చన్నగారు లేచి తీర్మానాన్ని బలపరచారు. ఆ సభలు రాహుల్ సాంకృత్యాయిన్ ఆధ్వర్యమున జరగాలని తీర్మానించారు. రాహుల్ సాంకృత్యాయిన్ సామాజికవాది, సామ్యవాది. అఖండ ప్రతిభాశాలి. ఓల్గాసే గంగా తీరం అను గ్రంథమును వ్రాసి ప్రాచీన భారతదేశ నాగరికతను ప్రతిభావంతం చేసిన మహనీయుడు.

ఆల్ ఇండియా కిసాన్ సభలను ఆంధ్రలో తన స్వస్థానములో స్వప్రాంతంలో జరగాలని భావించిన లచ్చన్న, శ్యామసుందరంగార్ల అభిప్రాయం నెరవేరింది. ఇక మహాసభలు జరిపించడం మాటలతో పనికాదు కదా. జనం, ధనంతోకూడిన మహా ఘనకార్యమైన ప్రజోద్యమం, జాచైతన్యకరదీపిక, అందున రైతు సభలు రైతాంగాన్ని కూడగట్టుకొని పవలపిప మహాసభలు.

పలాసా సభలు : ఆల్ ఇండియా కిసాన్ సభను పలాసాలో 1940 మార్చి 26 నుండి 30 వరకు జరపాలని ఆహ్వాన సంఘం నిర్ణయించింది. ఆహ్వాన సంఘం అధ్యక్షులు శ్యామసుందరం, జనరల్ సెక్రటరీ గౌతులచ్చన్నగారు, జాయింట్ సెక్రటరీ జొన్నలగడ్డ రామలింగయ్యగారు.

కిసాన్‌సభ ఏదో ఒక పార్టీకి చెందినదికాదు. అన్నిపార్టీలవారు దీనిని బలపరచవచ్చు, ప్రోత్సహించవచ్చు. కిసాన్ ఉద్యమం ఆనాడు వినువీథుల్లో ఎగరేయబడుతున్న అనేక జండాల్లో చెప్పుకొనవలసిన జండాలు ఎర్రజెండా, పచ్చజెండా మన ప్రాంతాన కాంగ్రెసు - కమ్యూనిష్టు పార్టీలు ప్రసిద్ధ వడసిన పార్టీలుగా నాడుండేవి.

మహాసభకు కార్యక్రమం రూపొందింది. ఆహ్వాన సంఘం అన్ని రైతు రక్షణ సంఘాలనాహ్వానించింది. రాహుల్‌సాంకృత్యాయన్ సభకు అధ్యక్షత వహిస్తారని రంగా, స్వామి సహజానంద, ఇందులాల్‌యాగ్నిన్ సభకు విచ్చేయుదురని రైతాంగమంతా వచ్చి సభను జయప్రదం చేయాలని విజ్ఞప్తి చేసింది. కరపత్రాలను పంచిపెట్టింది. లచ్చన్నగారి ఆధ్వర్యంలో రైతాంగం బృందాలుగా ఏర్పడి జిల్లాల్లో సంచరించి సభను నిర్వహించటానికి తగిన ఆర్థిక వనరులను సేకరించింది. రైతు నాయకులను సమీకరించింది.

మహాసభను జరిపించడానికి విద్యుత్ కావాలి ఆనాటికి విద్యుత్ గ్రామీణ ప్రాంతాల్లో కొన్ని పట్టణాల్లో కూడా లేని దుస్థితి, అయితే పలాసా రైల్వేస్టేషన్‌కు అతిదగ్గరలోనే మహాసభనేర్పాటు చేస్తున్నందున రైల్వే అధికారులను లచ్చన్న విద్యుత్‌నిమ్మని అర్థించారు. ఆనాటికి ఇండియన్ రైల్వే ఏర్పడలేదు కదా, బి.ఎన్.ఆర్. గా పిలవబడేది. వ్యక్తుల యాజ మాన్యంలో ఉండేది. అడిగినదే తడవుగా యిస్తామన్న బి.యన్.ఆర్. ఉద్యో గులు మరుసటి దినమున కబురంపారు. విద్యుత్‌ను సభకు సరఫరా చేయనసక్తులమని.

మీకు తగిన పైకము చెల్లిస్తాం, మీకు అభ్యంతరం ఏమిటి, ఇంతలోనే మీరు విద్యుత్ యివ్వమనటానికి కారణం లచ్చన్నగారు వెళ్లి ప్రశ్నించారు. పైకము గాదు. పైనుండి మా పెద్ద అధికారులు సభకు విద్యుత్ సరఫరా

చేయుటకు అంగీకరించవద్దని మా head office కలకత్తానుండి ఆదేశాలందాయి.

ఇంతమాత్రాన సభను జరిపించక మానతామా ? కార్యకర్తలను ఆదేశించారు. క్షణాల్లో పెట్రోమాక్సు లైట్లు, గాస్ లైట్లు వచ్చిపడ్డాయి. ఆనాటి ఇచ్ఛాపురం గ్రామ ప్రెసిడెంటు శ్యామసుందరం, బారువా ప్రెసిడెంటు లచ్చన్న, ఆయిర్మార్ము అధ్యక్షులు వారి పంచాయితీ ఆధీనములో కొన్ని లైట్లు తెప్పించారు. సభను కొనసాగించుటకు ఆటంకం తొలగిపోయింది.

ఇక సభను ఎచ్చట ఏర్పాటుచేయాలన్నది చర్చనీయమే వివాదాస్పదమే. లచ్చన్నగారు ఒక ప్రభుత్వ స్థలాన్ని ఎంపికచేసి అందులో పందెళ్లు వేయించారు. పర్లాంగుల కొద్దీ పొడవు వైశాల్యంగల పచ్చని తోరణాలతో పందిళ్ళు వేయించారు. అసంఖ్యాక రైతాంగం రేయింబవళ్లు కృషిసల్పి నిర్మించారు. ప్రతినిధులు ఆంధ్రనుండి వచ్చారు. గుజరాత్ నుండి ప్రతినిధులు వచ్చారు. మహారాష్ట్ర, పంజాబ్, ఉత్తరప్రదేశ్, కర్ణాటక, బీహార్, రాజస్థాన్, ఒరిస్సా నుండి వచ్చిన అసంఖ్యాక ప్రతినిధులతో పలాసా ప్రాంతం నిండిపోయింది. జిల్లాలనుండి వచ్చిన రైతు రక్షణ సంఘాల నాయకత్వాలు, సభ్యులు, చుట్టుపట్లగల రైతాంగమేగాక జిల్లాలనుండి వచ్చిన రైతాంగం, ఎచ్చట చూచిన జనసందోహమే, రైతాంగమే, చిత్రం విచిత్రం నాలుగయిదువేలమంది గిరిజనులు చద్ది అన్నంమూటలు కట్టుకొని మహా సభకు హాజరయినారన్ని సభ ఎంతటి చైతన్యాన్ని తెచ్చిపెట్టిందీ అవతగతం కాగలదు. రైతు మహాసభలకు జనరేటర్ పెడదామన్ని సభానిర్వాహకుల తలంపు. అయితే ఆనాటి మద్రాసు గవర్నర్ అంగీకరించలేదు.

కాశీబుగ్గ ట్రావలెర్సు బంగళాను కార్యకర్తలతో వెళ్లి లచ్చన్న స్వాధీనం చేసుకొన్నారు. కాపలాదారుడు కిమ్మనక తాళం చెవి గుత్తును లచ్చన్న గారికి అప్పజెప్పారు. పోలీసు మైదానంలోనే మహాసభలు పర్మిషను లేకుండానే ఏర్పాటుచేయడం జరిగింది. అడిగితే యిచ్చేది లేదు కదా మహాసభలు జరిగితీరవలసిందే అన్న పట్టుదలలో ఉన్నారు లచ్చన్న ప్రభృతులు.

ఒక రోజున పబ్లిక్ ప్రోగ్రాం, ఒక దినమున జనరల్ బాడీ సమావేశం,

వేరొక దినమున డెలిగేట్ల సమావేశం, మహాసభలు జరపాలి, 27, 28, 29 తేదీల్లో కార్యక్రమం రూపుదాల్చింది. మహాసభలకు అధ్యక్షత వహించుటకు స్వస్థలం నుండి బయలుదేరి పలాసా వస్తున్న రాహుల్ సాంకృత్యాయన్‌నకు మార్గమధ్యముననే ప్రభుత్వం డిటెన్యూ ఉత్తర్వును జారీ చేసింది.

స్వామి సహజానంద సరస్వతి మహాసభలకు అధ్యక్షత వహించ వలసివచ్చింది. ఇందూలాల్ యాగ్నిక్ ప్రారంభోపన్యాసం యిచ్చారు. రంగా కిసాన్ లక్ష్యాలను వివరించారు. ప్రొఫెసర్ రంగా తన కిసాన్ సభలకు అధ్యక్షత వహించవలసిందిగా రాహుల్ సాంకేత్యాయన్‌ను కోరినందున కమ్యూనిష్టులు రంగా అభిమానులు రైతాంగంలో తక్కువ అన్ని తప్పు అభిప్రాయానికి వచ్చారు. అత్యధిక సంఖ్యలో కమ్యూనిష్టు వారి సభ్యులను మహాసభకు తీసుకొనివచ్చారు. కిసాన్‌సభ ఎన్నికల్లో తమ సభ్యుల సంఖ్యను పెంచాలన్నది వాళ్ల అభిమతం. అయితే రంగా, అచ్చన్నల కృషి రైతాం గంలో అభేద్యము ? కిసాన్ సభ ఎన్నికలలో అంతా రంగా, అచ్చన్న అభి మానులే విజయాన్ని పొందగలిగారు. కిసాన్ ఉద్యమం రైతు రంగాదే అనిపిం చారు. సుమారు 1.1/2 లక్షలమంది ప్రజలు హాజరైన పలాసా కిసాన్ సభ చారిత్రకంగా ఎంతో ప్రాముఖ్యతను సంతరించుకొంటుంది. జమీందారీ విధానం అను పేరిట ఒక పెద్ద గడ్డిబొమ్మను తయారుచేసారు. ఎత్తు సుమారు 18 అడుగులు. ఆ గడ్డిబొమ్మను రైతాంగం ఉమ్మడిగా ఒకచోట చేరి తగులబెట్టారు. జమీందారీ విధానమే దగ్ధమైపోయిందన్న ఆనందంతో చప్పట్లు, అరుపులు, నినాదాలు మిన్నుముట్టేలా రైతాంగం చేసింది.

ఇంతలో సబ్ కలెక్టర్ చక్రవర్తి పోలీసు బలగాన్ని వెంటబెట్టుకొని పలాసా వచ్చి క్యాంపు చేసారు. సభలను జరిపించే వారిపై చర్య తీసుకోవాలని సభను జరగకుండా చూడాలని అతని అభిప్రాయం.

144 సెక్షన్ అమలుపరుస్తూ ఆజ్ఞలను జారి చేసారు. అమలు జరపమని పోలీసుబలగాన్ని పంపారు. జనసమూహంలోనికి పోలీసులు వెళ్ళి చెప్పి జూచారు. ఒకచోట పదిమంది చేరిన చట్టవిర్ధుమని, ఎదిరిస్తే చర్య తీసుకుంటామని. వీరి మాటల్ని పట్టించుకొనేదెవరు. జనంలేనిదెచ్చట.

వీథుల్లో జనం. సభలో జనం. మైదానంలో జనం. ఎచ్చట చూచినా జనవాహిని. లోపలికి వెళ్ళిరావటానికే ఏ ఒకరికి అంత సులభం కాదు. క్రిక్కిరిసిన ప్రజానీకంతో సభలు జరుగుతున్నాయి. పోలీసులు పోయి కలెక్టరువారికి విషయం విన్నవించారు. కాల్పులకు అనుమతినిమ్మని సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు కోరారు. "ఆ పని మీరు చేయవద్దు. విపరీతమైన ప్రమాదం సంభవిస్తుంది. అసంఖ్యాక జనం కాల్పుల్లో మరణిస్తారు" సబ్ కలెక్టర్ జవాబిచ్చారు. ప్రభుత్వోద్యోగులమై విధినిర్వహణ చేయకుండా ఎలా ఉండగలమో దొరగారే ఆలోచించాలి. సూపరింటెండెంట్ ప్రశ్న ఆలోచించాను. మీరే వెళ్ళండి. స్వయంగా వెళ్ళి విషయం తెలుసుకోండి అనగానే డి.ఎస్.పి. లేచి పోలీసు బృందంతో సభాస్థలికి వచ్చారు.

ఆ సమయానికి విషయ నిర్ణయ సభలు జరుగుతున్నాయి. డి.ఎస్.పి. కి పోలీసు బృందంలోనికి వెళ్ళటానికి దారిదొరకలేదు. అసలులోనికి వీరు వెళ్ళటానికి రైతాంగం ప్రజలు అంగీకరించలేదు. లోపల మా నాయకులు విషయనిర్ణయ సభలు జరుపుతున్నారు. మీరు వెళ్లటానికి మేము అంగీకరించం మమ్మల్ని ఏమి చేస్తారో చేయండి అని వాదిస్తున్న రైతాంగాన్ని ప్రజల్ని చూచి డి.ఎస్.పి. నివ్వెరపోయాడు. డెప్యూటీ సూపరింటెండెంట్ విధానాన్ని మార్చాడు. నాయకులకు వ్యక్తిగత నోటీసులను సర్వ్‌చేసి సభను నిలుపుదల చేయాలన్నీ సబ్ కలెక్టర్ ఎత్తుగడను అమలుచేయాలి. మీరు కనీసం డి.ఎస్.పి.గారు వచ్చి బయట ఉన్నారు. మిమ్ములను కలుస్తారట అని మీ నాయకులకు చెప్పండి. వారు ఏమన్నదీ మాకు తెలపండి.

డి.ఎస్.పి.గారు అన్నమాటల్ని తమ నాయకులతో చెప్పటానికి కొంతమంది కార్యకర్తలు లోపలికి వెళ్లారు. విషయ నిర్ణయసభనుండి లచ్చన్న లేచి వచ్చారు. ఏమిటి సంగతని ప్రశ్నించారు. డి.ఎస్.పి.గారు మిమ్ములను కలియాలని చూస్తున్నారు అని చెప్పగా ఆయన ఆలోచించి వచ్చి కలుస్తానన్నారు. వద్దనటం పిరికితనమని భావించారు. అయితే డి.ఎస్.పి. గారు లోనికి ప్రవేశిస్తే అడ్డుపడవద్దని మన కార్యకర్తలతో చెప్పండి. డి.ఎస్.పి. గారిని రమ్మనమనండి. లచ్చన్న కార్యకర్తలనాదేశించారు. సభలోనికి ప్రవేశించటానికి దారి దొరికింది. డి.ఎస్.పి. పోలీసు బృందంతో నాయకులున్న సభాస్థలికి వెళ్లారు. లచ్చన్నగారే మరల వచ్చారు. ఈ సభలను జరిపిస్తున్న నాయకులుగా రంగా, సహజానంద సరస్వతి,

ఇందూలాల్ యాగ్నిక్, శ్యామసుందరం, గౌతులచ్చన్నగారలని ప్రభుత్వం గుర్తించింది. సూపరింటెండెంట్‌ని ఏమంటారు లచ్చన్నగారడిగారు.

ఈ సభను నిర్వహించవద్దని మీ ఆరుగురికి వ్యక్తిగత నోటీసులను ప్రభుత్వం జారీచేసింది. వీటిని మీకందించటానికి వచ్చాం. అంతమాత్రానికే మీరు రావాలా ఏ ఒకరిని పంపించినా తీసుకొనేవాళ్లం కదా, లచ్చన్న అన్నారు. నోటీసుల్ని నాయకులంతా తీసుకొన్నారు. నోటీసుల్ని అందుకున్నాం అయినా మేము సభను నిర్వహిస్తాము ప్రభుత్వం ఏమి చేయదలచుకొన్నదీ - లచ్చన్న ప్రశ్న. అది మాదొరగారు నిర్ణయిస్తారు అని సూపరింటెండెంట్ అన్నారు. అయితే వెళ్లి మీదొరగారితో చెప్పండి. సభలను మీరు నిషేదించిన మేము జరుపుతాం ప్రభుత్వాన్ని ఎదిరిస్తాం అని లచ్చన్న తీవ్రంగా అన్నారు.

పోలీసు సూపరింటెండెంట్ అచటనుండి జారుకున్నారు. మన పోలీసు బృందంతో ఇదంతా చూస్తున్న ప్రజానీకం ఏమి జరుగుతుందో అని ఉత్కంఠతతో ఎదురుచూస్తున్నది. సభలు రద్దయిపోతాయా లేక కొనసాగుతాయా నాయకులు ప్రభుత్వానికి లొంగిపోతారా లేక ఎదురుతిరిగి పోరాడుతారా ? జనంలో ఆరాటం పెరిగింది.

సభావేదికపైకి నాయకులంతా విచ్చేసినారు. లచ్చన్నగారు ప్రజల నుద్దేశిస్తూ ప్రసంగిస్తూ ప్రజలారా వినండి. ప్రభుత్వం వారు మాకు సర్వ్ చేసిన నోటీసులను మీముందటనే చించిపారేస్తున్నాం. దమ్మింటే ప్రభుత్వం నాపై కాల్పులను జరుపుకోవచ్చు కాచుకునే గుండె నిబ్బరం నాకుంది. ఎదురుతిరిగే పోరాడేశక్తి నాకు ఉన్నది. అంటూ తన చేతిలోనున్న ప్రభుత్వ నోటీసును ముక్కలుగా చించి గాలిలోనికి విసిరేశారు.

ఒక పెట్టున ప్రజాధ్వని మిన్నుముట్టింది. రంగాగారికీ జై అంటూ లచ్చన్నగారినభినందిస్తూ చప్పట్లు చరిచింది, నినాదాల్ని చేసింది. ర॥ దృశ్యాల్ని ప్రక్కనే ఉన్న ప్రొఫెసర్ రంగా జూస్తు తనలో తాను ఉప్పొంగిపోయారు. దగ్గిరగా వచ్చి ప్రజానీకం ఎదురుగనే లచ్చన్న భుజం తట్టి సెబాష్ లచ్చన్న, సర్దార్ అనిపించావు. నీవు ఇకనుండి గౌతు లచ్చన్నవు కాదు. సర్దార్ గౌతులచ్చన్నవు. రైతు రంగా యిస్తున్న బిరుదును అందుకొని రైతు నాయకునిగా చిరకాలంవర్ధిల్లు ఇదే నా ఆశీస్సులు. అద్భుతవ భావిలో జరగబోయే శ్రీకాకుళం ప్రజాపోర సన్మానానికి ఒకనాటికి ప్రతీకగా నిలుస్తూ నేనిచ్చిన యీ బిరుదే ఆనాటికి స్థిరపడుతుంది.

రంగాగారు లచ్చన్నను సభాముఖంగా ప్రస్తుతిస్తు రంగాగారు అభిభాషిస్తున్న విషయాన్ని వింటున్న స్వామిసహజానంద సరస్వతి, జొన్నలగడ్డ రామలింగయ్య, శ్యామసుందరరావు, ఇందూలాల్ యాగ్నిక్ కరతాళధ్వనులు చేయగా యావన్మంది రైతాంగం చేతులు కలిపింది.

బహిరంగ సభలో ప్రభుత్వం యిచ్చిన వ్యక్తిగత నోటీసులను దిక్కరిస్తూ త్రోసిపుచ్చిన ప్రభుత్వాన్ని నిరసిస్తూ ఉపన్యాసాలిచ్చిన 144 సెక్షన్ దిక్కరించిన ఈ ప్రభుత్వం లచ్చన్న వగైరా రైతు నాయకులను ఏమీ చేయలేకపోయిందిరా అని తమలో తాము అనుకుంటూ ఉత్సాహతరంగాల్లో తేలిపోయారు రైతాంగం. గవర్నమెంటు ఏమీ చేయలేకపోయారు సరికదా అసలు గవర్నమెంటు ఉందా. లేనేలేదు మననాయకులే మన గవర్నమెంటు. వాళ్ళు చెప్పిందే మనకు వేదవాక్యం. అనుసరించడమే మన ధర్మం. రైతులు కష్టాలు గట్టెక్కిపోతున్నాయి. జమీందారీలు అంతరించిపోతాయి అంటూ రైతాంగం సభలనుండి కదలివెళ్లింది.

పలాసా అఖిల భారత్ కిసాన్ సభలు జయప్రదంగా ముగియడంతో లచ్చన్న తదితర జిల్లా నాయకులలో విశ్వాసం, నమ్మకం మేరు పర్వతమంత స్థాయికి ఎదిగింది. రైతాంగంలో పట్టుదల పంతం పెరిగింది.

పలాసా సభలను ముగించుకొని రైతు రంగా మద్రాసు ప్రయాణ మయ్యారు. మద్రాసు సెంట్రల్ రైల్వేస్టేషన్‌లో దిగీదిగడంలోనే ప్రభుత్వం రంగా గారిని అరెస్టు చేసింది. ఆ విధంగానే పలాసా నుండి బయలు దేరి, కలకత్తా చేరటానికి హౌరా స్టేషన్‌లో దిగుతుండగా సహజానందసరస్వతి తన కస్టడీలోనికి ప్రభుత్వం తీసుకొన్నది.

నాయకులిరువురు అరెస్టు కావటానికి పలాసా కిసాన్ సభలో పాల్గొనడమే గాక వేరొక కారణమున్నది. ప్రథమ ప్రపంచ యుద్ధములో కాంగ్రెస్ పార్టీ బ్రిటిషువారిని బలపరచిన రెండవ ప్రపంచ యుద్ధములో సహాయనిరాకరణ చేయటానికి కాంగ్రెస్ తీర్మానించింది. సామ్రాజ్యవాదుల యుద్ధంగా పరిగణిస్తూ కాంగ్రెసు వ్యష్టి సత్యాగ్రహాన్ని జరిపించ పిలుపు నిచ్చింది. కాంగ్రెస్ తీర్మానం వెలువడిన మరుక్షణం కాంగ్రెసు వర్కింగ్ కమిటీ సభ్యులను అరెస్టు చేసింది ప్రభుత్వం.

పలాసా కిసాన్ సభలు విజయవంతం కావడంతో గంజాం జిల్లా రైతాంగం విప్లవ పంథాను చేపట్టగల స్థితిగతులను పొందే మానసిక అవగాహనకు వచ్చింది. రైతాంగమున్న భావనకు లోనయ్యింది. ఇక జమీందారీ విధానం పోక మిగులుతుందా అన్న ధీమా రైతాంగంలో కలిగింది.

# 19 వ ప్రకరణము

# మందసా కాల్పులు

## (చరిత్రాత్మక మందసా రైతుల పోరాటం)

గంజాంజిల్లా ఆంధ్రా క్రాంగెస్ నాయకత్వం నడుపుతున్న రైతోద్యమం బాగా పుంజుకొంది. ప్రతి సంవత్సరం నవంబరు ఏడవతేదిన రైతు రక్షణ యాత్ర జరపడం, ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు రైతు మహా యాత్రను నడపడం పలాసాలో ఆల్ ఇండియా కిసాన్ సభలను నిర్వహించడం, గంజాం జిల్లా రైతాంగాన్ని ఎంతగానో వెన్నుతట్టిలేపింది. ఉద్యమానికి పురిగొల్పింది.

గంజాం జిల్లా సోంపేట తాలూకాలోని మందసా ప్రాంతం ఎస్టేట్‌లోని రైతులు గుడారి రాజపురంలో సమావేశమైనారు. రైతు నాయకులను ఆహ్వానించలేదు. చుట్టుప్రక్కల గ్రామాల రైతులు ఒక [illegible] సమావేశమైనారు. మందసా జమీందారుని మనమంతా ఎది[illegible] రైతు "ఎలాను మన పెద్దలు ఎదిరించమని చెప్పా[illegible]రద్దాం ।। రైతు ।। రైతు "ఈ జమీందారుడు మనమేం చే... సుమారు 500 మంది అదుపుచేస్తున్న మననాయకుల్ని ఏమీ చేయుతా... ఇంతలో అడవిని కాపలాకాస్తున్న రాజు సేవకులు, సుల్ని చింపిపారేసిన ... అడ్డుగావచ్చి "కలపను నరికారా ! మిమ్మలని కోటలోనికి చిన మన ... న పోయి బందిస్తామని" బెదిరించారు. ఎదురుగా వస్తున్న ఫారెస్టు గార్డుల చుట్టూ మూగిన రైతులు ఒక్కుమ్మడిగా వారిమీద పడ్డారు. చేతికి వచ్చిన దెబ్బ కాళ్ళకు దొరికిన తన్నుతన్నారు. తప్పించుకొని పారిపోతూ ఉంటే మీ బాబు దగ్గరకు పోయి చెప్పుకోండిరా" అని గద్దించారు.

అడవి పాలం ఆడారు. కలపను బళ్ళకెత్తారు. కలపతో బళ్ళన్నీ నిండియున్నాయి. కడుపుకాలే వానికి కాసిన్ని గంజినీళ్లు దొరికితే ఘనంగా భావించారు. కనీసం ఈ మాత్రానికి నేనే నోచుకోలేదా ? అని భావిస్తారు. రైతాంగం రాజుగారి అడవిలో కలపను నరికి తెచ్చుకుంటున్నాం.

కండబలం, గుండెబలం
ఉండి మనకు తిండిలేదె
ఉండ మనకు ఇల్లు లేదె
కట్టమనకు బట్ట లేదె

జమీందారు డెవడురా
అడ్డుపడితే మెడ్డెద్దాం ॥ వేదిక ॥

బతుకులెల్ల బుగ్గిచేసి - బురుదలోన నానవేసి
ఎండలోన ఎండ కట్టి కండలన్ని కరిగిపోవ
బతుకు దారి మురిగిపోవ

జమీందారీ రైతన్నను
జలగలాగ పీల్చినాడు ॥ రైతు ॥

జమీందార్ "సర్కార్"కి
సాగి సలాం కొడతాడు
రైతులంతా రాజుకొన్న "రాయిలా" అవుతాడు

పల్లెజనం మనకేమిటి అడవిపాలం ఆడేద్దాం
పారలు గునపాలు బట్టి పెళ్ళగించి పారేద్దాం ॥ రైతు ॥

రెండువందల ఎడ్లబండ్లతో సుమారు 500 మంది అదుపుచేస్తున్న అడవిలో జొరపడ్డారు. ఇంతలో అడవిని కాపలాకాస్తున్న రాజు సేవకులు, ఫారెస్టుగార్డులు అడ్డుగావచ్చి "కలపను నరికారా ! మిమ్ములని కోటలోనికి తీసికొని పోయి బందిస్తామని" బెదిరించారు. ఎదురుగా వస్తున్న ఫారెస్టు గార్డుల చుట్టూ మూగిన రైతులు ఒక్కుమ్మడిగా వారిమీద పడ్డారు. చేతికి వచ్చిన దెబ్బ కాళ్ళకు దొరికిన తన్నుతన్నారు. తప్పించుకొని పారిపోతూ ఉంటే మీ బాబు దగ్గరకు పోయి చెప్పుకోండిరా" అని గద్దించారు.

అడవి పాలం ఆడారు. కలపను బళ్ళకెత్తారు. కలపతో బళ్ళన్నీ నిండియున్నాయి. కడుపుకాలే వానికి కాసిన్ని గంజినీళ్లు దొరికితే ఘనంగా భావించారు. కనీసం ఈ మాత్రానికి నేనే నోచుకోలేదా ? అని భావిస్తారు. రైతాంగం రాజుగారి అడవిలో కలపను నరికి తెచ్చుకుంటున్నాం. ఇది

తప్పుకాదా అని అనిపించలేదు. కనీసం వాళ్ళ కనీసావసరాలకు ఉపయోగపడే ఈ కలపను కూడా వారు తీసికొనిపోవడం తప్పెలా అవుతుంది. వారికి మాత్రం జీవించే హక్కు లేదా దీనికి భయమేల ? జంకేల అన్నట్లు అడవినుండి తిరుగుముఖం పట్టారు.

అడవినుండి వస్తున్న ఎడ్ల బళ్ళన్నింటినీ మందసా రాజుగారి కోట దేవిడీ మీదుగా వెళ్తున్నారు. దొంగతనం మాకేల అంటూ చేతుల్లో జండాలు పట్టుకొని ఊపుతూ నినాదాలిచ్చుకొంటూ కోటమార్గంనుండే మందసా మీదుగనే వస్తున్నారు. అంతకుముందే అడవి గార్డులనుండి కబురు విన్న దివాన్‌జీ ఆ రైతులను ప్రతిఘటించమని తన నౌకర్లను ఆదేశించారు. ఎదురుగా వస్తున్న రెండువందల ఎడ్ల బండ్లు, ముందుకు నడుస్తున్న సుమారు మూడు నాలుగువందలమంది రైతు జనం - రాజుగారి నౌకర్లు అటకాయించారు.

ప్రశ్నిస్తున్నది రాజు - రాజుగారి సైన్యం అన్న భావనే రైతాంగానికి కలగలేదు. రైతులంతా ఒక్కమారు వాళ్ళపై విరుచుకుపడ్డారు. నౌకర్లు వెంటనే అరవడం ప్రారంభించారు. "బళ్ళను ఆపండి. రాజుగారి అనుమతి లేకుండా అడవిని నరికి తేవడం నేరం. దుక్కి దున్నుకొని బ్రతికే మీకు ఇంతటి సాహసం ఎలా వచ్చిందిరా ?" అంటూ తిడుతూ ఎగిరిపడి వస్తున్న రాజుగారి నౌకర్లు రైతులను అటకాయించారు. "ఒక్క అడుగు ముందుకు వేశారా మీ కాళ్ళు చేతులు విరిచి కాకులకు గ్రద్దలకు వేస్తాం" రైతులు ఎంత ధైర్యంరా మా కోట గుమ్మం దగ్గరకు వచ్చి కారుకూతలా ? మా వెనుక ఎవరు నిలిచియున్నారో చూసారా అని తమ వెనుకనే దూరంగా నిలిచియున్న దివాన్‌గారిని జూపించి భయపెట్టజూచారు.

బళ్ళను ముందుకు తోలండి అని రైతులను బళ్ళమీదనున్న రైతులను కోరినదే తడవుగా మరల బళ్ళు కదలడం ప్రారంభమైనది. ఇది సహించలేని రాజుగారి నౌకర్లు అడ్డువచ్చినదే తడవుగా రైతులంతా వారిని కర్రలతో ఒక్కమారుగా బాదడం ప్రారంభించారు. రాజుగారి దివాన్, నౌకర్లు ఇంతటి సాహసాన్ని రైతులు ప్రదర్శిస్తారని కలలోనైన భావించలేదు. రైతులను తట్టుకోలేకపోయారు. వెళ్లానెదురై కోటలోనికి పారిపోవటం ప్రారంభించారు. వెంటనే కోట దేవిడీని మూసివేశారు. కోటలోనికి కూడ

దూరి రాజావారి కుటుంబాన్ని దివాన్ తదితరులను కూడ మట్టు బెడతారేమోనన్న భయం అనాడు కోటలో నున్న వారికి కలిగింది.

అయితే రైతులు తమనెదిరించిన వారిని చావబాది కోట మార్గం గుండా తమ బళ్ళను నడిపించుకొని వెళ్ళిపోయారు. రాజుగారిపై దండయాత్ర చేసిన కోట తలుపుల్ని మూసుకొని రాజుగారు తమను జూచి బెదరిపోయారన్న ఆనందములో ఇళ్ళకు కలప బళ్ళతో చేరారు.

ఈ దృశ్యాన్ని కోటలో అల్లంతదూరాన నిలచి చూస్తున్న దివాన్ రామకృష్ణదేవ్‌కు ఎంతో గగుర్పాటు ఆశ్చర్యాన్ని కలిగించింది. తోకత్రొక్కిన భుజంగంలా ఎగిరిపడ్డాడు. శ్రీనివాసమహారాజాగారు మరణించారు. రాణిగారి పాలనలో ఉంది మందసాకోట. రాణిగారికి వరుసకు తమ్ముడయిన దివాన్ రామకృష్ణదేవ్ రైతులు తమపై తిరుగుబాటు చేయడం రాజాస్థానానికే తీరని అవమానమని గ్రహించారు. ప్రతీకారం తీర్చుకోవాలన్న పంతం పట్టుదలకు వెళ్లారు. తన రాజరికానికే జరిగిన అవమానంగా భావించి వెంటనే సర్కార్ వారికి తంతి వార్తను పంపారు. కలెక్టరు వారికి ఫిర్యాదుచేస్తూ తగు రక్షణలను జమీందారీకి కలిగించవలసినదిగా విజ్ఞప్తి చేసారు.

1-4-1940వ తేదిన సబ్ కలెక్టర్ చక్రవర్తి స్వయంగా మందసాలో కేంపు వేసి విచారణ జరపటానికి వచ్చాడు. రిజర్వు పోలీసు తహసీల్దార్ వెంట రాగా సబ్ కలెక్టరు గుడారి రాజపురంలో ప్రవేశించారు. చుట్టు ప్రక్కల గ్రామాల రైతులు ఆ గ్రామాన్నే తమ పోరాట కేంద్రంగా జేసుకొని అచటనుండి అడవికి బయలుదేరారు. గుడారి రాజపురం మధ్యాహ్నం 2 గంటలకు సబ్‌కలెక్టర్ చేరుకున్నారు. రాజపురం వీథుల్లో అడవినుండి తెచ్చిన కలప కుప్పలుకుప్పలుగా పడిఉన్నాయి.

రైతులను కబురు పెట్టారు. అందరు రైతులు వచ్చి సబ్ కలెక్టరు వద్ద నిలుచున్నారు. "ఈ కలపను ఎవరు అడవినుండి తెచ్చారు ?" సబ్ కలెక్టరు ప్రశ్న. "మేమే రైతులం" రైతుల జవాబు. "అడవినుండి కలప నరికి తెచ్చుకోవడానికి మందసా ఎస్టేట్ జమీందారునుండి మీరు అనుమతిని పొందారా?" "లేదు" ముక్తసరిగా రైతులిచ్చిన జవాబది. "ఇది నేరమని మీకు తెలియదా?" ఎందుకు నేరమవుతుంది. కలపలేకుండా మాయిళ్ళను ఎలా

కట్టుకోగలం. ఉండటానికి ఇళ్ళు కట్టుకోవడం నేరమా? రైతులు తీవ్రంగానే స్పందించారు. సబ్‌కలెక్టరు సావధానంగానే వింటున్నాడు. "అడవి మీదు కాదు కదా!" కలెక్టర్ ప్రశ్న. "మాదిగాక ఇంకెవరిది. భూమిమీద పుట్టినోడిదే భూమి. ఈ భూమిమీదనున్న కర్ర కలప మాదిగాక ఇంకెవరిదవుతుంది. భూమిని ఈ జమీందారు పుట్టించాడా? భుక్తం చేసుకోవడానికి. మాకంతా తెలుసు. మా నాయకులు చెప్పారు. "రైతులు ధీమాగా ఇస్తున్న జవాబులు విని కలెక్టరు లోలోన ఆశ్చర్యపడ్డారు. శృతిమించిన లాభంలేదని గ్రహించారు. రెండు దినాల క్రిందటనే పలాసాలో కిసాన్‌సభ జరిగింది. "రైతాంగం హక్కులకోసం పోరాడాలి" అని తీర్మానించింది. రైతాంగం కలిసికట్టుగా ఉందన్నది సబ్‌కలెక్టరుకు అర్థమైంది.

సరే మీరంతా ఏదో చెబుతున్నారు. విన్నాను. జమీందారుల హక్కులను కూడా మేము కాపాడాలి. కలప మీ గ్రామంలో ఉంది. అడవి పొలం మీరు చేసినట్లు రూఢియైనది. జమీందారుకు మీకు మధ్య నేను సంధానకర్తగా నుంటాను. జరిగిన విషయం మరచిపోండి. సమస్యను పరిష్కరించుకొందాం. నాతో మీరు రండి. సబ్ కలెక్టర్ ఈ విధంగా రాజీకి వస్తారని రైతులు భావించలేదు. కలెక్టరు వారు రైతులందరినీ తనతో రమ్మంటున్నారు. "తనతో తీసుకొని వెళ్ళి మనల్ని అందరినీ అరెస్టు చేయటానికి" దూరంగా నిల్చున్న యువ రైతు జవాబిచ్చాడు. అంతవరకేల ఇచ్చటనే సబ్‌కలెక్టరువారు మనల్ని అరెస్టు చేయవచ్చుకదా! వేరొకరి స్వగతం బయటకు ప్రకాశించింది. "అదెలా సాధ్యం. మందసానుండి పొలాల మధ్యనుండి గట్ల మీద నడచి మన గ్రామం రావాలి. రాకపోకల సౌకర్యాలేవి ? లారీలు రావు. జీపులు రాలేవు. దొరగారు ఎలానో వచ్చారు అందుకు మనల్ని అందరిని మాయమాటలు జెప్పిమందసా అడ్డరోడ్డువరకు నడిపించుకొని వెళ్ళి అచ్చట పోలీసులతో మనల్ని అందరినీ అరెస్టు చేయమని జెప్పి కోటలోనికి దూరతాడు. అప్పుడు మనమేమైపోతాం" రైతాంగం తమలో తాము తర్జనభర్జనలు పడ్డారు. సబ్‌కలెక్టరు వెంట రైతులంతా సామరస్యంగా నడచివెళ్ళాలా ? అక్కర్లేదా ? "వెళ్ళనవసరం లేదు" అని దూరంనుండి అరుస్తున్న ఒక స్త్రీ గొంతు వినిపించింది. అందరూ అటువైపు జూచారు. వస్తున్నది గున్నమ్మ. ఆమె నోరు పెద్దది. ఘాటైనది. తెంపరితనానికి ఆ గ్రామంలో పెట్టింది పేరు. నడివయసులోనున్న

అడ్డధి. మాటలనాడటంలో అందెవేసిన చేయి. నోరు విప్పితే అదుపు ఆపూ లేదు. ఒకరికి జడసి భయపడేది కాదు. "ఏం బాబుగారు. మాయమాటలు జెప్పి మా మగాళ్ళను రోడ్డు వరకు తీసుకొని పోయి, కొట్లో వేయటానికా" అంటూ బారలు చాచుకుంటూ సబ్‌కలెక్టరు ముఖాన చెయ్యెత్తిపెట్టి అరచింది.

సబ్‌కలెక్టరు నివ్వెరపోయారు. సబ్‌కలెక్టరు జాతీయవాదే. తొందర పాటు మనిషికాదు. "అదేమిటమ్మా, రైతులను నేనేం చేయను రాజుకి రైతుకీ రాజీ చేస్తాను". సబ్‌కలెక్టరు శాంతంగానే జవాబిచ్చారు. వాతావరణాన్ని ఉద్రేకపరచడం ఆతని ధ్యేయం కాదు గదా ! అతని మనసులో ఏదో ఒక ఆలోచన ఉన్నది ఆ మేరకు జరగాలన్నది సబ్‌కలెక్టర్ అభిప్రాయం. "ఏమిటండీ మీ నంగనాచి బుంగమూతి కబుర్లు. అడవికెళ్ళిన మేక గడ్డి మేయకుండా ఉంటుందా ? అన్నట్లు దొరగారు పోలీసులతో ఎందు కొచ్చినట్లు ? రాజీకయితే వీళ్ళందరూ ఎందుకు బాబు ? అని సాగదీస్తూ దీర్ఘాలు తీస్తూ ప్రారంభించింది. గున్నమ్మతో విప్లవాగ్ని కణాలు విజృం భించాయి. జమీందారు తొత్తు ఈ సబ్ కలెక్టరు, వీని మాటలు విని మీరంతా మోసపోకండి ఎవడా జమీందారుడు. వాడితో మనకు రాజీ ఏమిటి. మీరంతా గాజులు తొడిగించుకొన్నారా ? పొమ్మనండి సబ్‌కలెక్టర్‌ని ఏం చేసు కొంటాడో, చేసుకోమనండి. జబ్బబలం జూపి అడ్డుకుందాం" అంటూ గుండెలపై తనచేతిలో చరుస్తూ తడాఖా చూపిస్తాం. కలెక్టరూ ఏంచేస్తావో చేసుకో అంటున్న గున్నమ్మను జూచి రైతులు గాని సబ్‌కలెక్టరు గాని కిమ్మనక ఊరుకున్నారు.

సాయింత్రం కాబోతున్నది, వేలకొలదీ రైతాంగం ఆసరికే ఒకే చోట కూడి ఉన్నారు. సబ్‌కలెక్టరు ఊరు మధ్య రచ్చరాయి ఆసనంపై కూర్చుని ఉన్నారు. "సబ్‌కలెక్టరు వారు రాజీ అంటున్నారు. రాజీపడిపోదాం పదండిరా" అని అన్నాడు ఒక వయసు మళ్ళిన రైతు. సరేనని రైతులు ఊకొట్టారు. సబ్‌కలెక్టరు, తహశీల్దారు ముందు మధ్యలో రైతులు, వెనుక రిజర్వు పోలీసులు, సబ్‌ఇన్‌స్పెక్టర్ దారి వెంట నడుస్తున్నారు. అయితే చాలామంది రైతుల్లో బేడీలు వేయకుండ మంచి మాటలతో రోడ్డువరకు తీసికొని వెళ్ళి అరెస్టు చేస్తారేమోనన్న భయం

లేకపోలేదు. మందసారోడ్డు రాజపురంనుండి ఒక కిలోమీటరు దూరంలో ఉంది. ఊరు విడచి అందరు దారిలోనికి వచ్చారు. నడుస్తున్నారు.

సమయం మించిపోతున్నదని గ్రహించిన గున్నమ్మ గ్రామంలోనికి పరుగెత్తింది. ఒసే అచ్చమ్మ, ఒరే పోలమ్మ, ఒరే చిట్టమ్మ రండర్రా రండి మన మగాళ్లను ఆ పోలీసులు తీసికొని పోతుంటే మీరు ఇళ్లలో కులుకుతూ కూర్చుంటారా ? సిగ్గు లేదు. రండి మనమంతా పోయి సబ్‌కలెక్టర్‌ను ఎదిరించి మన వాళ్లను విడిపించుకొని వద్దాం. గున్నమ్మ కేకవేయడమే తరువాయి రాజపురంలోనున్న ఆడవాళ్లంతా ఇళ్లనుండి బయటకు వచ్చారు. గున్నమ్మ బారలుచాచుకుంటూ, ఆ జమీందారు మాసిపోను, ఈ సర్కారోడు సంతకెళ్లా. పోలీసు నాయాల్లంత ఆ కాటికెళ్లా – వీళ్ల పనిపడదాం రండి అంటూ ముందు పరుగుతీసింది. వెనకాల ఆడ పటాలం పడింది. అప్పటికే రైతులు సబ్ కలెక్టర్ ఆ గ్రామం దాటి మందసా రోడ్డుకి అతి దగ్గరోనికి వచ్చారు. సబ్‌కలెక్టరు రైతులు పోలీసులు పొలం గట్టు మీద నడుస్తున్నారు. ఆ పొలం చెఱకు తోటలోనుంది. చుట్టు కర్రలతో కంచె వేసి ఉంది. గ్రామం నుండి బయలుదేరిన గున్నమ్మ పొలాల మధ్య నుండి అడ్డంగా వచ్చి ఎదురుగా నిలచింది. సబ్‌కలెక్టరును అడుగు ముందుకు వేసారా మీ పనిపడతాం అంటూ తనతో వచ్చిన ఆడవాళ్లనందరితో సబ్‌కలెక్టరును చుట్టుముట్టింది. ఆడవాళ్లంత సబ్‌కలెక్టరు చుట్టుముట్టి దారణ చేస్తుంటే రైతులు ప్రక్కనే నిలబడి ఊరకచూస్తున్నారు ఏం జరుగుతుందో అని. "మా మగవాళ్ళను విడచిపెడతావా ? లేదా ?" గున్నమ్మ మరల గద్దించింది. ఈ అడవి ఎవరి సొత్తురా మా రైతులదేరా". సబ్‌కలెక్టరు కొంచెం తీవ్రస్థాయిని చేరారు. "చూడమ్మా రెచ్చిపోతున్నావు. ముందు వెనుకచూడకపోతే నీకే ప్రమాదం సుమా" సబ్‌కలెక్టరు హెచ్చరించారు.

"నన్ను బెదిరిస్తున్నావురా నీవు ఆ జమీందారీ తొత్తువురా ఆ సర్కారోడి బానిసవురా, ఏమన్యాయం చేసారని మ మగాళ్లను తీసికొని వెళ్తున్నావు. వీర గున్నమ్మ తీవ్ర స్వరంతో ఆలాపించింది. ప్రక్కనే ఉన్న సబ్‌ఇన్‌స్పెక్టర్ ఒరే అని సంబోధించడం. నానా విధాల నోటికి వచ్చినట్లు అనడం జూచి సహించలేకపోయాడు. "ముందు నీవు ప్రక్కకు తప్పుకుంటావా లేదా ? అని గర్జించాడు సబ్‌ఇన్‌స్పెక్టర్. ఓరి నీ పెళ్ళాం ముండ

మొయ్యి. నన్ను బెదిరించిన వాడవురా. ఒరే గండ నీ కండ పీకుతానురా. నీవు గులామోడివిరా. నీకెందుకురా అంత పౌరుషం. మా మగాళ్లను విడచిపెట్టి ముందుకు నడవండి. ఆడవాళ్లందరూ గట్టిగా నినాదాలివ్వడం ప్రారంభించారు.

సబ్‌కలెక్టరు పరిస్థితి చాలా దీనంగా ఉంది. చుట్టుముట్టిన ఆడ వాళ్ళను త్రోసిరాజని బయటకు రావాలి. రాలేకపోతున్నాడు. ఏమాత్రం కదలిన అడ్డుగావచ్చి గున్నమ్మ అడ్డుకున్నది. సబ్‌ఇన్‌స్పెక్టర్ కలెక్టరుకి అడ్డుపడుతూ నానామాటల్ని అంటున్న గున్నమ్మ వక్షస్థలంపై తుపాకి మడంతో పొడుస్తూ దూరంగా నెట్టిపోయాడు. గున్మమ్మ వీరావేశమైన వీర గున్మమ్మయి, మహంకాళీ శక్తిలా విజృంభించింది. "ఒరే గండా, ఆడదాని రొమ్ము మీదే పొడుస్తావురా. నీకు చావు మూడిందిరా" అంటూ ఒక్క పెట్టున మీద కెగిరి, తన కాళ్లతో బలంగా సబ్‌ఇన్‌స్పెక్టరు గుండెలపై ఒక తన్ను తన్నింది. ఆ తావుతో సబ్‌ఇన్‌స్పెక్టర్ మడిగట్టుమీదనుండి క్రింద నున్న పొలం మడిలోనికి పడిపోయాడు. ఇంతలో జనంలో కోలాహలం చెలరేగింది. ఏంజరుగుతుందో ఎవరికీ తెలియని పరిస్థితి. పశ్చిమాద్రిని భానుడు చేరుకుంటున్న సమయం. చీకటి ప్రవేశిస్తున్నది. మరల అరుణో దయానికి విప్లవకిరణం అంతమౌతున్నది. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ తుపాకిని గురిపెట్టి వీరగున్నమ్మను కాల్చాడు. వీర గున్నమ్మ అంతిమ విజయం ఏనాటికి రైతుదేరా అంటూ హాహాకారాలు చేస్తూ, నేలపైబడి అశువుల్ని బాసింది వీర గున్నమ్మ.

ఈ దృశ్యం జూచిన రైతాంగం వెర్రెత్తిపోయింది. ఆడవాళ్లు కూడా విజృంభించారు. మసకమసక చీకటిలో పెను సంఘర్షణ ప్రారంభమైనది. చెఱకుతోటకు పెండిగా పెట్టిన కఱ్ఱలను తీసికొని రైతాంగం పోలీసులను చావబాదడం ప్రారంభించారు. రైతులు పోలీసులపై విరుచుకుపడటం జూచి కాల్పులు జరిపారు. పోలీసులు నలుగురు రైతులు హతులయ్యారు. ఒక్క పోలీసు ప్రాణాలు అంతరించాయి. సర్కిల్ ఇన్‌స్పెక్టర్ రైతులు చావమోదగా స్పృహతప్పిపడిపోగా చనిపోయాడని భావించి విడచిపెట్టారు. సబ్‌కలెక్టరు స్పృహతప్పి నేలకొరిగాడు. వీర గున్నమ్మను తుపాకితో కాల్చిన సర్కిల్ ఇన్‌స్పెక్టర్ తప్పించుకొని పారిపోయాడు.

మందసా రైతుల ఆక్రందన కాదది. పోరాటం వీరోచిత సాహస ప్రక్రియ. నిరాయుధులు ఆయుధాలతో సమరానికి సిద్ధపడిన గుండెబలం ఉన్నవారు. గుండెబలమే కదా ఈ బ్రహ్మాండాన్ని జయించగలది. "క్షుద్రం హృదయ దౌర్బల్యం" అని కదా గీత. మందసా రైతుల్లో తెగింపు వచ్చింది పిస్తోలు ఒకవైపు పేలుతున్నా తుపాకులు ఒకవైపు ఘోషిస్తున్నా రైతులు తమ మనో నిబ్బరాన్ని వీడలేదు. కొందరికి రెక్కలు తెగిపడుతున్నాయి. కొందరి తలలు నేలపడుతున్నాయి. మరికొందరి శరీరాల్లో తూటాలు దూరి రంధ్రాలేర్పడి రక్తపుటేరులు ప్రవహిస్తున్నాయి. అయిన భీతావహంలో రైతాంగం పరుగెత్తలేదు. తమపై కాల్పులను నిర్దాక్షిణ్యంగా జరుపుతున్న వారిని విడచిపెట్టలేదు. చేతిలోనున్నది కర్ర అయినా దానినే వజ్రాయుధంగా భావించారు. గాంధీజీలా తలపోసారు. సర్కారు బానిసలను తలలు తెగిపడిపోయాయి. విషాదాగ్ని జ్వాలలు మిన్నంటాయి. ఆవేదనాగ్ని విజృంభించింది. ప్రతీకారాగ్ని ప్రజ్వరిల్లింది. ఒక్క క్షణంలో ఆరుగురు నేలపై కొరిగిన భీతావహం చెందక కొందరికి గాయాలు తగిలి హాహాకారాలు సలుపుతున్నా భీకర సంగ్రామంలో వెనుకాడలేదు. ఎదురుపడిన సర్కార్ సైనికులను చావమోదుతూనే ఉన్నారు.

సర్కిల్ ఇన్స్పెక్టర్‌ను చావమోదగ స్పృహతప్పి పడిపోయారు. మరణించాడని విడచిపెట్టి ఉంటారు సబ్‌కలెక్టరు తలపగిలేలా కర్రలు ఎగిరిపడ్డాయి. వీర గున్నమ్మతో సహా 5గురు రైతులు మరణించగా సర్కార్ సైనికుడు ఒక్కడు మరణించాడు. రిజర్వు పోలీసులు నేలనుపడియున్న సబ్‌కలెక్టరును సర్కిల్‌ఇన్స్పెక్టరును మోసుకొని తీసికొనిపోగా, మరణించి రైతులను విడచిపెట్టి క్షతగాత్రులైన రైతులను మోసుకుంటూ రైతాంగం స్వగ్రామం వైపు మరలారు. ఇంతలో ఆ సాయంత్రం 6 గంటలకే బీభత్సం జరిగిందని తెలుసుకొన్న మధనాపురం వాస్తవ్యులు మార్పు పద్మనాభం హుటాహుటిని రాత్రికి రాత్రి శ్రీకాకుళం వెళ్లారు. లారీలో విశాఖజిల్లా కాంగ్రెసు మీటింగులోనున్న పుల్లెల శ్యామసుందరంగారికి, లచ్చన్న ప్రభృతులకు ఈ వార్తను అందించారు. మీటింగునుండి సరాసరి మీటింగునకు అద్దెకు తెచ్చిన కారులో శ్రీకాకుళం నుండి మందసా రాత్రి 10 గంటలకు శ్యామసుందరం లచ్చన్న సంఘర్షణ జరిగిన చోటుకి వెళ్ళారు.

గురిచేస్తున్నారు. జమీందారులనెదిరించడం మీ తరంగాదు. మేముండగా అది జరిగే పనికాదు అనేలా సర్కారు వారు రైతాంగాన్ని రాజావారితోటలోకి బంధిస్తున్నారు. తగని బాధలను పెడతూ మీసాల్ని దువ్వుకొంటున్నాం. రైతాంగంలో భీతావహం చెలరేగింది. చెట్టుకొకపిట్టయి రైతులంతా బెదరిపోయారు. ఏ గ్రామంలో జూచిన నిర్మానుష్యమే. ఆడవాళ్లు తప్పించి మగపురుగు కన్పించలేదు. చిన్న పిల్లలు స్త్రీలు వృద్ధులు తప్పించి మచ్చుకు ఒక మగాడు కూడ ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో కన్పించలేదు. కన్పించిన వారినెల్ల పోలీసులు కోటలో బంధిస్తూనే యున్నారు.

లచ్చన్నగారు దెబ్బతిన్న పులిలా విజృంభించారు. కారులో బయలుదేరి కలెక్టరును కలుద్దామని వెళ్లారు. ఇంటర్వ్యూ ఇవ్వనిదే. అరెస్టు అయిన వారితో మాట్లాడటానికి కూడ అంగీకరించనిదే. ప్రభుత్వానికి ఇంత బెట్టుసరా. ఈ ప్రభుత్వాన్ని భేదిస్తాం. ఛేదిస్తాం. ఇదే మా ప్రతిజ్ఞ అంటూ లచ్చన్న గ్రామాలపై సంచరించటానికి బయలుదేరారు. లచ్చన్నను మార్పు పద్మనాభం, రాజారావు, తరుణాచారి మొదలగు వారు అనుసరించారు.

శవాలను అప్పగించిన అరెస్టయినవారితో లచ్చన్నగారు కలిసిన ప్రజల్ని సమీకరించి విప్లవాన్ని ఉధృతం చేస్తారేమోనన్న భయం, ప్రభుత్వ ఆఫీసరులలో కలిగింది. అందుకు ససేమిరా వాళ్లు అంగీకరించలేదు. గ్రామాల్లోని రైతులు పగటిపూట ఎటనోదాగి ఉండి రాత్రివేళల ఇళ్లకు వస్తారేమోనని పోలీసులు రాత్రి వేళల కూడా రైతుల ఇళ్లల్లో దూరి ఉన్నారో లేదో అని వెదకేవారు. రైతులు యావన్మంది పోలీసుల సృష్టించిన భీతావహంవల్ల అడవుల్లోనికి పారిపోయారు. ఆడవాళ్లే గ్రామాల్లో మిగిలారు.

లచ్చన్నగారు ఒక పథకం వేసారు. మరల రైతాంతానికి ధై[illegible] చెప్పాలి. ఒక్కొక్క గ్రామానికి ముగ్గురు నలుగురు వా[illegible] జిల్లా జేసారు లచ్చన్న. ఆ గ్రామంలో జరుగుతున్న వి[illegible] లచ్చన్న అందజేయాలి. హరిపురం సత్రంను [illegible]చేందుకు నుండి. సరాసరి తుళ్ల రక్తాశిబిరంగా [illegible] శ్రీకాకుళం నుండి మందసా రాత్రి సముకొని గ్రామా[illegible] లచ్చన్న సంస్మరణ జరిగిన చోటుకి వెళ్ళారు.

ఫలితాలు ఎలా ఉంటాయన్నది ఏ ఒకరు ముందుగా నిర్ణయించుకోలేని పరిస్థితి. పరిస్థితి ఎలా పరిణమిస్తుందో ?

అందుకు నాయకులంతా హరిపురం సత్రంలో సమావేశమైనారు. మందసా కాల్పుల డిఫెన్సు కమిటీని ఏర్పాటు చేశారు. రైతాంగం ఒక సామాజిక శక్తిగా పోరాడాలి తప్పించి వ్యక్తిగా పోరాడలేదు. కమిటీకి అధ్యక్షుడు పుల్లెల శ్యామసుందరం, కార్యదర్శి గౌతులచ్చన్న, దుక్కా సూర్య నారాయణరెడ్డి, సహాయ కార్యదర్శి తరుణాచారి, మార్పు పద్మనాభం, మార్పు రాజారావు, కామరాజు, బొడ్డా కామయ్య, బెందాళం గవరయ్య, డి. నీలాంబరం. తెలుకల దుర్లభసాహు మరి నలుగురు సభ్యులు, కార్యవర్గం సభ్యులుగా నియమించబడ్డారు. పుల్లెల శ్యామసుందరంగారిని కష్టడీలోనికి తీసికొన్నందున గౌతులచ్చన్న డిఫెన్స్ కమిటీ అధ్యక్షునిగా, దుక్కా సూర్యనారాయణరెడ్డి కార్యదర్శిగా వ్యవహరిస్తూ వచ్చారు. పోలీసుల అర్థరాత్రి పూట ఇళ్లల్లో జొరబడి మీ మగవాళ్లున్నారా అని ప్రశ్నిస్తూ ఆడవాళ్లను భయపెట్టి వేధించడాన్ని డిఫెన్సు కమిటీ ఖండించింది.

గ్రామాల్లో పెట్రోమాక్సు లైట్లు పట్టుకొని తిరుగుతున్న డిఫెన్సు కమిటీని జూచి ప్రభుత్వం జమీందారులు నివ్వెరపడసాగింది. కేసుకి సంబంధించిన సాక్ష్యాధారాలు కూడ ప్రభుత్వానికి సంపాదించడం కష్టమైపోయింది. తుదకు రాజావారి ఫారెస్టు గార్డులే సాక్ష్యం పలకటానికి ముందుకు రాలేదు. మిమ్ములిని ఎవరెదించారు అన్న ఏమని చెప్పగలం ఎవరని చెప్పగలం మూకుమ్మడిగా అంతా మాపై పడ్డారని చెప్పేవారు. ఏ ఒకరి పేరు చెప్పటానికి జంకిపోయారు. డిఫెన్సు కమిటీ వారికి ఒక పెనుభూతంలా కన్పించేది.

డిఫెన్సు కమిటీ గ్రామగ్రామాన సభ జరిపి పోలీసుల దౌర్జన్యాలను బాహాటంగా ఖండించేది. పరాయి ప్రభుత్వం దమననీతిని ఎదిరించేది పీడిత ప్రజలంతా ఏకమై ఈ జమీందారులను, పరాయి ప్రభుత్వాన్ని ఎదుర్కోవాలని ఏ ఒకరు భయపడనవసరంలేదని, భుజంతట్టి ధైర్యం చెప్పేది. ప్రభోదించేది. అయిన పోలీసుల జులుం తగ్గలేదు. బెదిరింపు ఆగలేదు. డిఫెన్సు కమిటీకి అనుకూలమైన సంఘటన ఒకటి జరిగింది.

పుచ్చపాడు గ్రామంలో ఒకరాత్రి ఒక రిజర్వు పోలీసు ప్రవేశించి ఒక ఇంట్లోకి దూరారు. మంచి నీళ్లు కావాలని ఆ యింటి ముసలమ్మను లేపారు. అది అర్ధరాత్రి వచ్చినవాడు వయసులో ఉన్న పోలీసు తన ఇంట్లో యౌవనంలో ఉన్న తన కూతురు పార్వతమ్మ ఉంది. ముసలమ్మ సహజంగానే భయపడింది. మంచి నీళ్లు త్రాగుతూ అందంగా ఉన్న ముసలమ్మ కూతురిపై కన్నేసారు. ఏకాంతంలో ముసలమ్మ తప్ప ఏ ఒకరు లేరు కదా. మగవాళ్లు ఆ గ్రామంలోనే లేరు అన్న ధీమా, ముసలమ్మను తొలగించి పార్వతి చేయిపట్టుకున్నాడు. సరసానికి రమ్మని లాగాడు 20 ఏండ్ల పార్వతమ్మ బీద కుటుంబీకురాలు. పైగా పల్లెటూరు పడుచు. విద్యావిహీనురాలు. తనేమో ప్రభుత్వోద్యోగి. తను కోరితే కాదంటుందా అన్న అహంభావం కూడ తనలో చోటు చేసుకున్నది.

అయితే సరసం బెడిసికొట్టింది. పార్వతమ్మను బెదిరించారు. ఆ పల్లెటూరి పిల్ల అమాయకురాలైనా అసాధ్యురాలే. సిరి ఉందని చిందులేయకురా. నీకు పోగాలంరాను నన్ను రమ్మంటావా? అంటూ గట్టిగా కేక లేయడంతో చుట్టుప్రక్కల ఆడవాలం లబోదిబోమంటూ వచ్చి అరవడం అల్లరిపెట్టడంతో కానిస్టేబుల్ హడలెత్తి పోయి పరుగుతీయడం ప్రారంభించాడు. చేసిన పని తప్పని తెలియగానే మనిషి భీరులై నీరుగారిపోతారు కదా. ఎంత సత్తువ గల మనిషైనా నిస్సత్తువలోనికి వస్తారు. అధికారం చేతుల్లో ఉన్నా అల్లాడిపోతారు.

మరునాడు ఆ గ్రామ ఆడదండు ఒక్కుమ్మడిగా వెళ్లి హరిపురం సత్రంలో మకాం వేసుకొని వీళ్ళ కష్టసుఖాల్ని చూస్తున్న డిఫెన్సు కమిటీకి జరిగినదంతా చెప్పుకొని గోలపెట్టారు. డిఫెన్సు కమిటీ వెంటనే రంగంలోనికి వచ్చింది. ప్రభుత్వానికి తంతినొకదానిని పంపించారు. ఫలానా కానిస్టేబుల్ ఫలానా స్త్రీని ఫలానా గ్రామంలో ఫలానా తేదీన చెరబట్టటానికి సిద్ధమైనారు. ఆ పోలీసును వెంటనే రక్షించాలి. స్త్రీలను ప్రజలను నానా యిబ్బందులకు గురిచేస్తున్న రిజర్వుడు పోలీసుల్ని ఉపసంహరించుకోవాలి. న్యాయవిచారణ జర్గపాలి. లేనిచో ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తుంది.

ఇట్లు,
డిఫెన్సు కమిటీ,
హరిపురం.

డిఫెన్సుకమిటీ టెలిగ్రాముల ద్వారా మహాజర్లు విజ్ఞప్తులు ప్రభుత్వానికి అందించారు. ఆంధ్రా కాంగ్రెస్ కమిటీకి ఒక మహాజరును పెట్టారు. దీనిపై విచారణ జరిపించి ప్రభుత్వానికి పార్టీ రిపోర్టు యివ్వాలని డిఫెన్సు కమిటీ కోరింది. అయితే జమీందార్లు వడ్డి విశ్వనాథాన్ని చేతిలోనికి తీసికొని, లచ్చన్నగారితో గల స్నేహాన్ని విస్మరించి ఏ కానిస్టేబుల్, ఏ పల్లెలోను, ఏ పిల్లను బలవంతం చేయలేదని, అదంతా కట్టుకథని, పత్రికల్లో విశ్వనాథంగారి చేత ప్రకటనలు యిప్పిస్తారు.

ప్రభుత్వం దిగి వచ్చింది. రిజర్వుడు పోలీసుల్ని ఉపసంహరించు కున్నారు. సాయుధ పోలీసుల్ని వెనుకకు పిలిపించారు. డిఫెన్సు కమిటీకి ప్రథమ విజయం లభించింది. మందసా కాల్పులు డిఫెన్సు కమిటీ వారంద జేసిన మహాజరుపై ఆంధ్ర కాంగ్రెసు కమిటీ విజయవాడలో సమావేశమైంది. ఆనాటి ఆంధ్రా కాంగ్రెసు కమిటి అధ్యక్షులు టంగుటూరి ప్రకాశం పంతులు, జనరల్ సెక్రటరీ కళా వెంకట్రావు, ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ మందసా కాల్పులపై విచారణ చేసి ఒక నివేదికను పార్టీకి సమర్పించడానికి ఒక విచారణ సంఘాన్ని నియమించింది. ఆ సంఘంలో కళా వెంకటరావును, మాగంటి బాపినీడును, అయ్యదేవర కాళేశ్వరరావులను సభ్యులుగా నియమించింది.

కాంగ్రెస్ పార్టీ తరపున దర్యాప్తు సంఘం, విశాఖజిల్లా విచారణ జరప టానికి వస్తుంది. ఆనాటి ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెస్ కమిటీ ప్రెసిడెంటు గేదెల చంద్రయ్య నాయుడు, జనరల్ సెక్రటరీ గౌతులచ్చన్నగారు విచారణ కమిటీకి ఆదరణపూర్వకమైన ఆతిథ్యమిచ్చి మందసా అడవులకు తీసుకొని వెళ్లి రైతులు అడవిలో ఎచ్చటెచ్చట కలప నరికినదీ, ఏవిధంగా బళ్ళపై తీసికొని వచ్చినదీ వారికి ప్రత్యక్షంగా చూపెడతారు.

ముతా రాజకీయాలు ముసురు ప్రారంభమైనది. భవిష్యత్ రాజకీయా కాశాన ఉరుములు మెరుపులు మెరసి జడివానగానో, ఉప్పెనగానో మారనున్నదేమో !

విచారణ కమిటీలోనున్న కళా వెంకట్రావుగారికి, లచ్చన్న గారన్న లోలోన కడుపుమంట. కిసాన్ ఉద్యమనేత రంగాగారికి అనుచరుడు లచ్చన్న. కళా వెంకట్రావుగారికి రంగాగారికి పొంతనలేనేలేదు.

మందసా ప్రాంతమంతా తిరిగి తన పర్యటన విచారణ ముగించుకొని కమిటీ విజయవాడ చేరుకొంది. విజయవాడలో పత్రికలవారికి విచారణ కమిటీ ఒక ప్రకటన యిచ్చింది. మందసా డిఫెన్సు కమిటీ వారి అభ్యర్థనపై ఆంధ్ర కాంగ్రెసు కమిటీ ఒక విచారణ కమిటీవి వేసి, మందసా కాల్పులపై న్యాయవిచారణ జరిపించింది. ప్రభుత్వానికి ఒక రిపోర్టును పంపించింది. ఆనాటి పత్రికలకు యిచ్చిన స్టేట్‌మెంటు.

మందసా కాల్పులు జరగటానికి కారకుడు ఉత్తర విశాఖ జిల్లా జనరల్ సెక్రటరీ గౌతులచ్చన్నగారే. ఇందులో సందేహంలేదు. కమ్యూనిస్టులతో చేతులు కలిపి మందసా రాజావారిపై రైతులను పురికొల్పి ఈ దౌర్జన్యకరమైన పనిని చేయిండాడీతడే కారణం. లచ్చన్న అతివాది. వ్యక్తి సత్యాగ్రహానికి వ్యతిరేకి. రైతులను లచ్చన్నగారు రెచ్చగొట్టినందువలననే వీరు అడవిలో చొరబడి కలపను అనుమతి లేకుండా తెచ్చుకొన్నారు తప్పించి ఆ రైతులు అమాయకులు. వారిని తప్పు పట్టవలసిన పనిలేదు. ఈ పరిస్థితులలో ప్రభుత్వం వారు కాల్పులు జరుపక తప్పనిపరిస్థితికి లోనై ఉంటారు. ప్రభుత్వాన్ని తప్పుపట్టవలసిన పనిలేదు. ఇక రైతులు వారు నిరపరాధులు. వారిని క్షమించి విడిపెట్టవలసినదిగా ప్రభుత్వాన్ని అర్థించారు.

ఉత్తర విశాఖ జిల్లాలో తిరుగులేని కాంగ్రెసు నాయకునిగా భావించబడుతూ రైతాంగం ఆదరణాభిమానాల్ని అందుకుంటున్న లచ్చన్నగారిని పట్టి ప్రభుత్వానికి అప్పగించడం ఆంధ్రకాంగ్రెస్ కమిటీ వేసిన ఇంక్వయిరీ కమిటీ అభిప్రాయమని కమిటీ బ్రిటిషువారు మాట్లాడినట్లు మాట్లాడారని ఆనాటి ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెసు నాయకులు భావించారు. వెంటనే ఆ స్టేట్‌మెంటును ప్రతిఘటిస్తూ పక్షపాతంతో కూడిన ఇంక్వయిరీ కమిటి రిపోర్టును ఖండించారు. లచ్చన్న ప్రభృతులు అంతేగాక వెంటనే వేరొక కమిటీ వేసి న్యాయ విచారణ జరిపించాలని ఆంధ్ర కాంగ్రెసు కమిటి అధ్యక్షులు ప్రకాశం పంతులు గారిని మందసా డిఫెన్సు కమిటీ కోరింది. ఇంక్వయిరీ కమిటీ యిచ్చిన రిపోర్టును ప్రక్కకు బెట్టి స్వయంగా ఆంధ్రా కాంగ్రెస్ అధ్యక్షులే విచారణ నిమిత్తం మందసా వచ్చారు. హరిపురం పక్షంలోనే వారికి విడిది ఏర్పాటుచేసి స్వయంగా వీరే వారికి వండివార్చి భోజన పదుపాంతాలు చేసారు.

ప్రకాశం గారిని కూడ మందసా అడవుల్లోనికి తీసుకొని వెళ్లి రైతులు వెళ్ళి వచ్చిన బాటలను కలపను నరికిన ప్రదేశాలను చూపించారు. కారులో కొన్ని గ్రామాలు త్రిప్పారు. రైతాంగం వచ్చి ప్రకాశంగారికి వారి కష్టసుఖాలు విన్నవించుకున్నారు. ప్రకాశంగారికి తన పర్యటనలో రెండు విషయాలు అవగాహనకు వచ్చాయి. ఒకటి ఉత్తర విశాఖ జిలో అచ్చన్నగారికి ఉన్న పలుకుబడి, ప్రజల్లో అతనికున్న గౌరవం అర్థమైంది. రెండు మందసా రైతులు పోరాటం ఒక ప్రజా ఉద్యమం తప్పించి ఏ ఒకరు ప్రేరేపించి నదికాదు.ఇదొక సామూహిక తిరుగుబాటు. సామూహిక నిర్ణయం. సామూహిక చర్చ. ఇంక్వయిరీ కమిటీ యిచ్చిన రిపోర్టును కాదని ప్రకాశంగారు ప్రభుత్వానికి అన్ని వివరాలతో అధ్యక్షుని హెూదాలో పోలీసుల కుమ్మక్కుతో జమీందారులు చేసిన దౌర్జన్యం ఫలితమే మందసా రైతులపై జరిపిన కాల్పులని, తన రిపోర్టులో ప్రకటిస్తూ ఒక వివరణ పత్రాన్ని సమర్పించారు. పత్రికలవారికి ప్రభుత్వానికి.

పత్రికల్లో మద్రాసు మాజీ రెవెన్యూమంత్రి ప్రకాశంగారిచ్చిన వివరణ ప్రకటించబడింది. రైతులది ప్రశాంత విప్లవం అని పోలీసులు జమీందారులు జరిపిన దౌర్జన్యం అని ప్రకాశం గారిచ్చిన వివరణ పత్రం రైతాంగంలోను డిఫెన్సు కమిటీని మంచి నైతిక పరమైన బలాన్ని తెచ్చి పెట్టింది.

పోలీసుల బీభత్స కాండ ఆగింది. ప్రాంతంలో మందసా డిఫెన్సు కమిటీ మంచి అనుకూల వాతావరణ పరిస్థితులను నెలకొల్పింది. కాంగ్రెసు పార్టీ కూడా రైతాంగాన్ని సమర్థిస్తూ వచ్చింది. ఇక పోలీసులకు గత్యంతరం చార్జి షీటు ఫైలు చేయడమే బలమైన సాక్ష్యాలను సేకరిస్తే తప్ప మందసా కాల్పులు కేసు నిలవడమే కష్టం ప్రభుత్వం వారాడినదంతా భూటకమని తేలుతుంది.

నయాన్నో భయాన్నో కొంతమంది సాక్షులను సేకరించడానికి పోలీసులు తంటా పడుతున్నారు. ప్రాసిక్యూషన్ సాక్షులను సేకరించుటలో మందసా దివాన్ రామకృష్ణ దేవ్ విశ్వ ప్రయత్నం చేస్తున్నారు. రహస్య పోలీసులు కోటలో మకాం వేయడం. విషయాలను సేకరించి ప్రభుత్వానికి అంపడం జరుగుతున్నది. పుచ్చలపాడు గ్రామంలో పోలీసు కానిస్టేబుల్ అసలు ఏ యువతిపై కూడా అఘాయిత్యానికి తలపడలేదని అదంతా కట్టుకధ అని, రహస్య పోలీసుల రిపోర్టులు వ్రాయడం జరిగింది.

మందసా కాల్పుల్లో ప్రభుత్వం అన్ని విధాలా అడ్డుతగులు తున్న మందసా డిఫెన్సు కమిటీ శక్రటరీ గౌతు లచ్చన్న నెలా అయినా పట్టి బంధించాలని ప్రభుత్వం జమీందారీల ఎత్తుగడ వేశారు. సరియైన సాక్ష్యాధారాలు లేనిదే మనిషిని కష్టడీ లోనికి తీసికొన్న అది నిలబడదు.

మందసాలో లచ్చన్న గారు బస చేసిన వడ్డె విశ్వనాధం గారింటికి వెళ్లి లచ్చన్నపై ఆరా తీసారు. పోలీసులు వడ్డె విశ్వనాధం గారు లచ్చన్న గారిపై తనకున్న అభిమానాన్ని మరచి పోయారు. జమీందారీ ప్రలోభానికి లొంగి ప్రభుత్వానికి వశమై లచ్చన్నపై రిపోర్టును ఇచ్చారు. లచ్చన్న గారే కాల్పులకు బాద్యుడని ప్రభుత్వానికి తెలిపారు. ఒకవైపు లచ్చన్న అభిమానిగా నుంటూ వేరొక వైపు లచ్చన్నపై దెబ్బ తీసారు. శల్య సారధ్యం చేశారు. లచ్చన్న గారి అభిమాని అనుచరుడు లచ్చన్న గారిపై రిపోర్టు యివ్వడం ప్రభుత్వానికి కొంత ఆధారం దొరికినట్లయింది. పోలీసులు ఏ గ్రామం వెళ్లి సాక్షులుగా ఉండమని అర్ధిస్తే అదే గ్రామానికి అదే దినమున లచ్చన్న బృందం వెళ్లి సా క్షులుగా నిలచిన విపరీత పరిణామాలు సంభవిస్తాయి. జాగ్రత్త అని హెచ్చరికలిచ్చి వచ్చేవారు.

ఇక ప్రభుత్వం అడ్డదారికి త్రొక్కడానికి సిద్దపడింది. లచ్చన్న గారిని కష్టడీ లోనికి తీసికొననిదే ప్రాసిక్యూషన్ చేయడానికి సాక్షులను సేకరించడం దుర్లభం అన్నది గుర్తించింది.

ఇటు చార్జిషీటు మందసా కాల్పుల సంఘటనను ఫైలు చేస్తు అటు గౌతు లచ్చన్నకు ఇంటర్నమెంట్ ఆర్డర్‌ను 1940 జూన్ 3 వ తేదీన జారీ చేసింది. బారువాలో నున్న లచ్చన్న గారికి సర్వ్ చేసింది.

ఇద్దరు పోలీసులు బారువాలో ప్రత్యక్షమయ్యారు. రాత్రింబవళ్లు లచ్చన్న గారికి కాపలా. లచ్చన్న గారు ఏమి చేస్తున్నది ప్రభుత్వానికి ప్రతి దివం తెలపాలి. రాత్రి వేళల్లో పోలీసు వాళ్లను బారువాలో హాయిగా గుర్రు పెట్టి నిద్రే తీసే పరిస్థితిలో నుంచి లచ్చన్న గుర్రపు బండిమీద చుట్టు ప్రక్క గ్రామాల కెళ్లి మందసా కాల్పుల్లో ప్రభుత్వానికి ఏ ఒక్కరూ సాక్ష్యం పలకడం, రైతాంగానికి ద్రోహం చేయడమేనని ఉద్ఘాటించేవారు. కొన్నాళ్లు ఈ రాత్రి వేళల్లో పర్యటనలు కొనసాగాయి.

అయితే రాత్రి - పగలు - డిఫెన్సు కమిటీ పోరాడితేనే తప్ప ప్రభుత్వాన్ని ఎదుర్కోవడం కష్టమని భావించారు. లచ్చన్నను డిటెన్యూగా

ప్రకటిస్తూ ఉత్తర్వులు జారీ కానిదే మందసా ఫైరింగ్ కేసులు ప్రాసెక్యూషన్ జరుపలేదని పోలీసు అధికారులు కలెక్టరు గారికి నివేదిక నందించారు.

మందసా ఫైరింగ్ కేసు సెషన్స్‌కు కమిట్ చేస్తున్నారనగానే లచ్చన్న గారిని డిటైన్ చేయడానికి తనకనుమతి నిమ్మని, జిల్లా కలెక్టర్ మద్రాసు గవర్నర్‌ను అర్ధిస్తూ వ్రాసిన నోటు ఆర్డర్‌ను తెలిసికొని విశాఖపట్నం నుండి ఒక స్నేహితుడు ఒక కుర్రవాడి ద్వారా బారువాలో నున్న లచ్చన్న గారికి తెలియ చేశాడు. జాగ్రత్త పడమని హెచ్చరిక చేశాడు.

ఆ సాయంత్రానికి శ్రీకాకుళం నుండి కాంగ్రెస్ నాయకులు కార్యకర్తలు రైతు సంఘాల నాయకులు బారువా వచ్చేలా నలుదిక్కులకు కబుర్లు అంపారు. గరిమెల్ల రమణమూర్తి, గేదెల చంద్రయ్య నాయుడు, మార్పు పద్మనాభం, మార్పు రాజారావు, బెందాళం గవరయ్య, కిల్లి అప్పలనాయుడు ప్రభృతులు సాయంత్రానికి బారువా చేరుకున్నారు,

ఆ రాత్రి బారువా సముద్రతీరంలో గల సరుగుడు తోటలో రహస్య సమావేశం జరుగుతున్నది సభ్యులు తమ అభిప్రాయాలను ప్రకటిస్తున్నారు.

లచ్చన్న గారు వెంటనే అండర్‌గ్రౌండ్ లోనికి వెళ్ళి పోవాలి. లచ్చన్న గారు పట్టుబడి జైల్లోకి వెళ్లడం జరిగితే యిచ్చట Defence Committee ని నడిపించేదెవరు ? మనకు నాయకత్వం వహించేదెవరు ? కిల్లి అప్పల నాయుడు ఆవేదనతో అన్నాడు.

లచ్చన్న గారు ప్రభుత్వానికి దొరక కుండా బయటనే తిరగాలి. అండర్ గ్రౌండులో ఉన్నత బలంతో డిఫెన్సు కమిటీ పని చేస్తుంది. విజయం సాధిస్తాం దుర్లభ సాహు, బెదాళం గవరయ్య, సూర్యనారాయణ రెడ్డి లు వారి అభిప్రాయాలు తెలిపారు.

లచ్చన్న "మౌనంతో అంగీకరించారు సంఘ నిర్ణయం కాదనటానికి లేదు నేను అండర్‌గ్రౌండ్‌లో ఉన్నందున మన ఆశయాల్ని సాధించు కోగలమని మీరు భావిస్తే తప్పక నేటి నుండి అండర్ గ్రౌండ్ లోనికి వెళ్తాను" లచ్చన్న గంభీరంగా ఉదార భావంతో తన అభిప్రాయం ప్రకటించారు.

అయితే ప్రస్తుత కర్తవ్యం - కిల్లి అప్పలనాయుడు గార్లు డిఫెన్సు కమిటీకి నా స్థానంలో దుక్క సూర్యనారాయణ రెడ్డిని నిలపాలని నా అభిప్రాయం వారి నాయకత్వంలో మీరంతా శ్రద్ధ కృషి చేయండి. అండర్ గ్రౌండ్‌లో నేను పనిచేస్తా అన్ని విధాలా తోడ్పడుతాను.

లచ్చన్న ప్రతిపాదనను అందరూ అంగీకరించారు. డిఫెన్సు కమిటీకి సూర్యనారాయణ రెడ్డిని అధ్యక్షునిగా చేస్తారు. మీరు అండర్ గ్రౌండ్‌కు వెళ్లి పోతున్నారు. ఇక మా బారువా గ్రామం పరిస్థితి ఏమిటి? దీన వదనంతో దుర్లభ సాహు, అనగానే లచ్చన్న గారి వదనంలో ఆవేదన అభిమానం పొంగి పొర్లింది. నిజమే తన ఉద్యమానికి ఊపిరి పట్టుతన స్వగ్రామమే కదా !

లచ్చన్న గారానాటికి బారువా గ్రామం ప్రెసిడెంట్‌గా నుండేవారు. గ్రామ పంచాయితీ అధ్యక్షునిగా ఉన్న తన కాలంలోనే ప్రథమంగా బలహీన వర్గాల వారి "కోలనీ" ఉండాలని మొదటిగా మెరసింది, తొంగి జూచింది లచ్చన్నగారి మెదడులోనే. లచ్చన్నగారు కాలాతీత వ్యక్తి కాలానికి ముందుపడి ఆలోచించే కాలజ్ఞానం గల సామాజిక కార్యకర్తగా ఆనాటి కాంగ్రెస్ పార్టీ నాయకుడు తన చుట్టు సమావేశంలో నున్న పంచాయితీ మెంబర్లను ఒప్పించారు. బారువాకి తన స్థానంలో లక్ష్మి నారాయణ పాణిగ్రాహి ఉండాలని ఆ మేరకు ఒక తీర్మానాన్ని వ్రాసి అందరి సభ్యులచేత తన ఎదుటనే సంతకాలు చేయించారు. తను అనివార్య కారణాల వలన రాజీనామా యిచ్చినట్లు ఆ రాజీనామాను ఆమోదిస్తు పాణిగ్రాహిని ఎన్నుకొన్న ఆఫీసు రికార్డుల్లో తీర్మానం చేయించారు. తన స్థానంలో గరిమెల్ల రమణమూర్తిని ఉంచారు.

ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెస్ జనరల్ శక్రటరీకి వీడ్కోలు చెప్పి మందసా డిఫెన్సు కమిటీకి వందవమాచరించి గ్రామ సర్పంచ్‌కు తిలోదకాలిడి గౌతు లచ్చన్న చీకటిలో పడి పోరాడటానికి సిద్ధపడినారు. చీకటితోనే పోరాటం సాగించాలి. విషాదాన్ని జ్వాలలు విహరించాలి. పెను తుఫానుల్లో ప్రేమాభిమానాల్ని పొంగించాలి. అండర్ గ్రౌండ్‌లో చేరి అఖండ విజయానికి మార్గమేర్పరచాలన్న ఆతని మహత్తరబృహత్తర ఆశయసాధన సిద్ధించుగాక.

లచ్చన్న కారు చీకట్లోనికి అడుగిడుతున్నారు. కాంతిరేఖల్ని విరజిమ్మటానికే అయిన తన కానాడు భుజం తట్టి ధైర్యం చెప్పి ఓదార్చి తనకన్ని విధాలా తండ్రిలా గురువులా స్నేహితునిలా పెద్దలా, ఉపదేశికునిలా దైవంలా తోడ్పడుతూ వచ్చిన కరుణార్ద్ర హృదయుడు. స్వాతంత్ర్యోద్యమ యోధుడు. కష్టడీలో మంటూనే కన్నుమూసిన దేశ భక్తుడు, పుల్లెల

శ్యామసుందరం గారు తన వద్దలేరు. పరమపదించారు. ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు.

కదన రంగం నుండి కదలిపోయారు. తనచేయి పట్టి ఉద్యమం లోనికి లాగుకొని వెళ్లిన ఆదేశ భక్తుడు తనను విడిచి తన జీవితాన్ని ముగించుకొని వెళ్లిపోయాడు. తనకు స్ఫూర్తినిచ్చిన ఆ మహానుభావుడు తనలోనే ఉన్నాడు. తన కీర్తి ఇనుమడించటానికి ఎంతగానో తోడ్పడిన తన ప్రాణానికి ప్రాణం పుల్లెల శ్యామసుందరం తననా స్వర్గం నుండి దీవిస్తారు.

ఉత్తర విశాఖ జిల్లా కాంగ్రెసు కార్యకర్తలు మందసా డిఫెన్సు కమిటీ సమావేశం ముగిసింది. మందసానుండి వెంటనే తెల్లవారేసరికి లచ్చన్న గారు వెళ్లిపోవాలి. ఎచ్చటుకు వెళ్ళిందీ ఎవరికీ తెలియకూడదు. అందుకు ఏ ఒక్క అనుచరుడు లచ్చన్న వెంట వెళ్లటానికి వలనుపడదు. ఆ రాత్రికి కార్యకర్త లంతా బారువా విడచి వెళ్లారు.

రాత్రి 12 గంటలయింది. ఆ గ్రామ నివాశి బడి నీలాంబరం కందులను గుర్రపుబండిని తెమ్మని కబురిచ్చాడు. సోంపేట రైల్వే స్టేషన్‌కి చేరుకొని కందులను గుర్రం బండిని తీసికొని మరల బారువా వెళ్ల మన్నారు.

కందులు లచ్చన్న గారిని సోంపేట రైల్వే స్టేషన్‌లో విడిచి గుర్రంబండితో మరల సోంపేట ప్రవేశించగానే పోలీసు ఎదురయినాడు.

"లచ్చన్న గారిని ఎచ్చటుకు తీసికొని వెళ్లావు"

"అసలు నా బండిలో లచ్చన్న గారు ఎక్కనిదే" కందులు

"నోర్మూయ్ నీ తోలు వలుస్తాను చెప్పు" హుంకరించాడు పోలీసు

"నా పీక పోయినా చెప్పను. అసలు నాకేమీ తెలియదు"

"ఏ వైపు ట్రయిన్ టిక్కట్టు తీసారో చెప్పు" అడిగారు పోలీసులు

అసలు లచ్చన్న ట్రయిన్ మీద వెళ్లందే కందులు నిర్భయంగా అబద్దం ఆడుతున్నట్లు పోలీసులు పసిగట్టారు . పశువును బాదినట్లు బాదారు. కానీ నిజం తెలుసుకోలేక పోయారు. లచ్చన్న గారికిది ప్రధమ విజయం.

# 20 వ ప్రకరణము

## పుల్లెల శ్యామసుందరం - లచ్చన్న

చరిత్రలో ఏ ఒక వ్యక్తి వేరొక వ్యక్తివలన గాని, శక్తివలనగానీ ప్రేరణ ఆదరణ నందనిదే బాగుపడిన దాఖలాలు ఎచ్చట కన్పించవు. అటువంటి వ్యక్తి శక్తి ఏ ఒకరికి లభించిన వారికి జీవన్ముక్తి మోక్షం లభిస్తాయన్నది నిర్వివాదాంశం. సృష్టిలో గూడ ఈ విచిత్రం ఉంది. తనకు తనేమి ప్రజ్వరిల్లదు వేరొకటి అందుకు తోడ్పడాలి. ఏ ఒక మహానుభావుని చరిత్ర తిరగేసిన నేనింతటి వానిని కాగలుగుటకు ఏ ఒకరో కారణమని చెబుతారు. ఏదేశనాయకుని జీవితం పరిశీలించిన ఆతనంతటి ఘనకీర్తినందటానికి ఏ ఒకరో కారణమని శలవిస్తారు. గాంధీజీ లేని, నెహ్రూను రామకృష్ణ పరమహంస లేని వివేకానందుని మనమూహించి వారి ఘనతను వర్ణించలేము. సోక్రటీసు వినాప్లేటో మహాశయుని పొగడలేము.

అయితే వ్యక్తి జీవితం, అనేక స్థాయిల్లో అనేక దశలకు చెంది యుంటుంది. ఒకే వ్యక్తి జీవితంలో గల అన్ని స్థాయిల్లో,దశలలో జీవన గురువుగా దైవంగా శక్తిగా తోడ్పడవచ్చు తల్లి శైశవ దశలో తండ్రి యౌవనదశలో, గురువు ప్రయోజనదశలో ఉపకరిస్తారన్నది సామాజిక సూత్రం. అన్ని దశలలో పరమాత్మ జీవికి తోడ్పడతాడన్నది దైవిక సూత్రం. విశ్వాసం, నమ్మకలు ఏర్పడినగాని మనిషికి విశ్వం బోధపడదు. జీవితానికి అర్థం తెలియదు. తన ఔన్నత్యానికి ఉపయోగపడిన వారి పట్ల విశ్వాసం, నమ్మకల్ని ప్రదర్శిస్తేనే తప్ప మనిషికి జీవన్ముక్తి కలుగదు. లచ్చన్నగారు ఆరాత్రి 2గంటలకు వచ్చిన మెయిల్ ఎక్కారు. కలకత్తా వైపు ప్రయాణం. టిక్కెట్టు తీసారు తన గమ్యస్థానం తనకే తెలియదు. అండర్‌గ్రౌండ్ లోనికి వెళ్తున్న మనిషికి స్థానమేమిటి "ఆశ్రయమేమిటి" ? ఎవరివ్వగలరు ? ఇచ్చిన ఉండటానికి వలనుపడదే, అనుక్షణం పోలీసులు వెంటాడుతూనే ఉంటారు. ఎచ్చటున్నది పసికడుతూనే ఉంటారు.

రైలువేగంగా పరుగుతీయడం ప్రారంభించింది లచ్చన్న గారికి నిద్రపట్టలేదు. తన ఆశయసాధనలో తను నాడు అండర్‌గ్రౌండులోనికి



ప్రథమ ఆంధ్ర రాష్ట్ర గవర్నర్, చందూలాల్ మాధవలాల్‌తో మంత్రివర్యుడు లచ్చన్న



వెళ్లడం జూచి శ్యామసుందరం గారున్న ఎంతపొంగిపోయేవారో గదా ! అనాటివరకు తన కన్నివిధాలా తోడ్పడి నీడనిడిన శ్యామసుందరంగారు తన మనసులో మెదలాడారు. అచ్చన్నగారికి కళ్ళంటనీళ్ళు అ ప్రయత్నంగా జారిపడుతున్నాయి."తన జీవితాని కింతకీర్తి ప్రతిష్టలను తెచ్చిపెట్టి ఆమహానుభావుని అంతిమక్షణంలో ఆతని భౌతిక కాయాన్ని కూడ చూడనోచుకోలేని దౌర్భాగ్యుడ్ని" అంటూ మనసు వేధించడం ప్రారంభమైనది.

అనాడు బారువాలో తనను ఇంటర్నమెంటు చేసారు. పోలీసులు కాపలా కష్టడీ లోనికి ప్రభుత్వం తీసికొన్న ఏ ఒక చోటికి వారి పర్మిషను లేనిదే కదలటానికి వలనుపడదు.

1940 జూన్ 16 వ తేదీన పుల్లెల శ్యామసుందరంగారు తన స్వగ్రామం. ఇచ్ఛాపురం లోనే బ్రెయిన్‌లో నరాలు పగిలిపోయినందున ఆకస్మాత్తుగా పరమపదించారన్న పిడుగులాంటి వార్త అచ్చన్నగారి చెవిలో పడింది. కష్టడీలోనే ఉంటు పోయిన కాంగ్రెసు నాయకుని, మరణవార్త కష్టడీలోనే ఉన్న గౌతులచ్చన్న గారికి చేరింది. ఎంతటి దురదృష్టకరమైన పరిస్థితి, అచ్చన్న ఒక్క మారుగా హతాశులై నిర్వీర్యులై నిశ్చేష్టులయ్యారు. క్రుంగిపోతూ కూలబడినారు. ఎంతటి ధైర్యస్థైర్య పరుడింతగావేలబడి మూలబడటమా? బారువాప్రజానీకమంతా ముక్కుపై వేలేసుకుంది. అచ్చన్న గారి శరీరంలో అనాటి వరకు ఉన్నవి ఆ శ్యామసుందరంగారి బలతేజాలేమో. అది నిజమనిపించారు అచ్చన్న. కూలబడిన అచ్చన్న అప్రయత్నంగా లేచారు. ఆ గ్రామంలో ఉన్న పోష్టాఫీసుకి పిచ్చెక్కిన మనిషిలా దౌడుతీస్తూ వెళ్ళారు. ప్రభుత్వాన్ని అర్థిస్తూ ఒకటెలిగ్రాం పంపించారు, "దయతో నన్ను అనుమతించండి. ఇచ్ఛాపురం వెళ్లనివ్వండి నాగురువు నాప్రాణం, నానాయకుడ్ని అంతిమదర్శనం చేసుకోవటానికి పర్మిషను ఇవ్వండి."

కలెక్టరుకు అంతదయ కలుగుతుందా. అది పరప్రభుత్వం పెట్టి బంధించడమే తనపని. అచ్చన్న ఇంటి ముఖం పట్టారు. అయిన ఇంటిలో ఉండలేకపోతున్నారు. వీధిలోనికి వచ్చారు. తన మనసు తనను ఉండనివ్వలేదు. "పరుగెత్తుకొని ఇచ్ఛాపురం వెళ్లి నీ నాయకుడ్ని [illegible] ఋణం తీర్చుకో" అని తొందరపెట్టసాగింది.

అంతే బారువా నుండి బయలు దేరారు లచ్చన్న తనను కాపలా కాస్తున్న పోలీసు లిద్దరు తనకడ్డుగా వచ్చి మొదట బ్రతిమలాడుతూ తదుపరి విరోధించారు. లచ్చన్న తీవ్రవేదనతో నున్నారు. ఉప్పెనలా ఎగిసిపడ్డారు. చండప్రచండభాముని వలెనున్నారు. అగ్నిజ్వాలలా ఎగిరిపడుతున్నారు. ఈ ఇరువురు పోలీసులా తనను అడ్డగించేది. తిన్నగా బారువా బస్స్టాండు చేరుకున్నారు. ఇంతలో బస్ వచ్చింది. బస్ ఎక్కి ప్రయాణానికి సిద్ధమై వెంటనే బస్సు నడిపించమని అర్థించారు. ఇంతలో సోంపేట పోలీసు స్టేషనుకి కబురు అందింది. ఇన్స్పెక్టరు పోలీసులు ప్రత్యక్షమై బస్సు అడ్డుగా నిలుచున్నారు. "లచ్చన్నగారూ మీరు ఇంటర్నులో ఉండగా విధినిషేదాల్ని ధిక్కరించి ఇచ్ఛాపురం వెళ్లడం క్రమవిరుద్ధమైన చర్య ఇన్స్పెక్టర్ గద్దించారు. "ఎవరడ్డుపడిన మీరేం చేస్తారో వెళ్తీరుతాను నానాయకుడ్ని అంతిమ దర్శనం చేసుకుంటాను. మరేంచేస్తాం చేయండి అన్నింటిని తెగించాను. రండి నా ముందుకు" గద్దించిన లచ్చన్నను ఒప్పించడం మినహా గత్యంతరంలేదని సబ్ఇన్స్పెక్టర్ గ్రహించారు. లచ్చన్నపై కాల్పులు జరపడం తప్పించి అతనికి గత్యంతరంలేదు అది అతనా పరిస్థితులలో చేయలేని పరిస్థితి. లచ్చన్న ఆనాటికి పేరు ప్రఖ్యాతులందిన నాయకునిగా గుర్తింపబడినారు. కాంగ్రెసు నాయకులలో చెప్పుకోదగిన వారు స్వాతంత్రోద్యమంలో జైలుకెళ్లి పర ప్రభుత్వంతో పోరాడుతున్న స్వాతంత్రయోధుడు. అటువంటి లచ్చన్న గారిని సబ్ ఇన్స్పెక్టర్ పోలీసులు భయపెట్టి లొంగదీసికోగలరా !

"లచ్చన్నగారూ మీరు పెద్దవారు కాంగ్రెసు పార్టీనాయకులు మీవంటివారే ప్రభుత్వం ఉత్తర్వులను ఉల్లంఘిస్తే ఉద్యోగాలు చేసుకునే మా పరిస్థితి ఏంకావాలి ? మీరు కొంచెం ఆలోచించండి. మిమ్మలని విడిచి పెట్టారా? మాఉద్యోగాలు ఊడిపోతాయి. మిమ్మల్ని నిరోధించామా మీకు ఈ ప్రజలకు మేము బలియైపోయే పరిస్థితి. "సబ్ఇన్స్పెక్టర్ దీనంగా అడగడంతో ఉద్రేకంతో ఉన్న లచ్చన్న ఊరటచెందారు. - అప్పటికే బస్ రెండు గంటలు ఆగిపోయింది. బస్సు నిండా జనం. తను తెలియని దెవరికి [illegible] అభిమానం లేనిదెవరికి ? లచ్చన్నగారన్న పట్టుదల అభి [illegible] శ్యామసుందరం గారన్న ప్రేమాభిమానాలకు [illegible]

లచ్చన్న శ్యామసుందరంగార్లకున్న అనుబంధం ప్రజలకు బా॥ తెలుసు. లచ్చన్నగారు వెళ్లి తీరవలసందేనని లచ్చన్న గారిని సమర్థిస్తూ వచ్చారు తప్పించి వెళ్లవద్దని చెప్పలేకపోయారు.

పోలీసులు దీనావస్థలో పడ్డారు. "బాబూ మీ దయ. మీరు ఇచ్చాపురం వెళ్లిన మా పెళ్లాం పిల్లల గతి అంతే మిమ్మల్ని అని నిందించలేం. ఇక మీదయ అంటున్న పోలీసుల ముఖాల్లోనికి లచ్చన్నగారు చూచారు.

తను ప్రజలకు నాయకుడు ఏ ఒకరిని బాధించడము తనకు బాధాకరమే ఇంతమందిని దెబ్బతీయడం భావ్యంకాదు. ఆ మహానుభావుని అంతిమదర్శనం చేసుకునే భాగ్యం నాకు లేదు." అంటూ దీనవదనంతో లచ్చన్నగారు బస్ దిగారు. మౌనంగా లచ్చన్నగారి వెంట సానుభూతిగా నడచి వెళ్లారు.

శ్రీకృష్ణ నిర్యాణమును కళ్లారా జూచిన అర్జునుడు, ధర్మజునితో అన్నట్లు మన సచివుడు బాంధవుడు మార్గదర్శి మన రక్షకుడు మరి మనకు లేడు అన్నట్లు లచ్చన్న ఏ ఒకరు ఎదురు అడిగిన కళ్లనీరు పెట్టుకుని చెపుతూ వెళ్తున్నారు.

పుల్లెల శ్యామసుందరంగారు 1920 లోనే విజయనగరం మహారాజా వారికళాశాలలో విద్యనభ్యసించారు. మాజీ మద్రాస్ రెవెన్యూ మంత్రుల కళా వెంకట్రావు - పుల్లెల శ్యామసుందరం ఒకే తరగతి విద్యార్థులు. గాంధీజీ పిలుపు నందుకుని చదువుకి స్వస్తి చెప్పి స్వాతంత్రోద్యమ సమరంలో దూకిన స్వాతంత్ర్యయోధుడు, దేశభక్తుడు, నిస్వార్థజీవి. నిరాడంబరపరుడు, అలోచించి ఏదైనా చేయాలన్న మనస్తత్వం కలవారు. అందరిలా ఉద్రేకం పడి ఉగ్రూతలూగే మనిషికాదు. దండిగా ఆస్తిపాస్తులున్న మనిషి దేవుడిచ్చిన సంపదను దేశస్వాతంత్ర్య సమరానికి వెచ్చించ తలపడిన మహనీయుడు.

రాజకీయవాదిగ మారిన శ్యామసుందరం ఉన్న తన ఆస్తిని పదింతలు పెంచుకోవటానికి ఏనాడూ ప్రయత్నించలేదు. స్వరాజ్యసాధన అంటూ కాంగ్రెసు పార్టీని బలపరిచారు. కాంగ్రెసు నాయకునిగా నిలిచారు.

స్వరాజ్యాన్ని సురాజ్యంగా మార్చటానికి అనువైన రైతుకూలీ ఉద్యమాన్ని జిల్లాల్లో పటిష్టం చేయటానికి అహర్నిశలు పాటుపడిన రైతునాయకుడు.

శ్యామసుందరం గారి స్వగృహం ఇచ్ఛాపురంలో నున్న తనక్కు వారసత్వంగా వచ్చిన పొలం, తోటా, దొడ్డి అన్నీ బారువాలో ఉండేవి. తరచూ శ్యామసుందరంగారు "బారువా" గ్రామం వచ్చేవారు. లచ్చన్న ఉన్నది కూడా బారువాలో అయిన వారి దృష్టిని ఆకర్షించే స్థితిగతులు ఆనాటికి లేవు.

1930 లో బరహంపూర్ జైలునుండి లచ్చన్నగారు విడుదలయిన తరువాత పర్లాకిమిడిలో స్వాతంత్ర్య యోధుల సన్మాన సభ జరిగింది. లచ్చన్న ఆ సభకు స్వాతంత్ర్యయోదునిగా వెళ్లి పాల్గొన్నారు. ఆ సభలో పాల్గొన్న శ్యామసుందరం లచ్చన్నగారిని ఎంతగానో అభినందించారు. లచ్చన్నగారి వయసానాటికి 21 సంవత్సరాలు. యువకుడు లచ్చన్నగారిలో నున్న జవసత్వాలను పట్టుదల కార్యదీక్షను నిరంతరం ప్రజాసేవను చూచిన శ్యామసుందరంగారు ఆనాటి నుండి లచ్చన్న గారిని చేరదీసి అనుక్షణం లచ్చన్న తన మార్గంలో ప్రయాణించేలా చేసారు. నిరంతరం వెన్నుతట్టి "నేనున్నాను భయంలేదు ముందడుగు వేయటానికి జంకకు" అని అభయం ఇచ్చేవారు.

స్వాతంత్ర్య యోధునిగా చిన్న వయసులోనే శ్యామసుందరం గారి వద్దనుండి ఆనాటి సభలో తను సన్మానం పొందారు. తదుపరి బారువా గ్రామం పొలం వ్యవహారాలు చూడటానికి శ్యామసుందరంగారు తరచు బారువా వచ్చే వారు రావడమే తడవు లచ్చన్న గారికి కబురు పెట్టి యోగక్షేమాలు పరామర్శించేవారు. దేశ సేవ ఎంత వరకు వచ్చిందీ అని భుజంతట్టేవారు. మహాసభ ఆదేశం మేరకు కల్లు కొట్టుల వద్ద పికటింగ్ జరిగింది. బారువాలో శిబిరం ప్రారంబ మయింది. విదేశీ వస్తు దహనము "పికెటింగ్‌కు ప్రోత్సాహమిచ్చిన వారు శ్యామసుందరం. "లచ్చన్నా నీ తోడి వారంతా ఉద్యోగాలు పద్యోగాలని ఎగబడి పారిపోతున్నారు మీ అన్నయ్య మాష్టరు గిరి [illegible] ఉద్యోగం మానుకొని ఈ దేశభక్తి రాజకీ[illegible] ఆనాటి వరకు ఈ రంగంలో ఉంటావా" శ్యామసుందరం [illegible] లచ్చన్నతో అన్న మాటలు "మీ

దయ కదండీ, మీ వంటి నాయకుల అండ నాకుండాలిగాని ఆ కొండలనైనా నా కండలతో కరగించేస్తాను. ఎవరికైనా భుజబలంతో బుద్ధి చెబుతాను". లచ్చన్న ఉడుకు రక్తంతో అంటున్న మాటల్ని విని శ్యామసుందరం ఉప్పొంగి పోయేవారు.

"నిజమే లచ్చన్న మీ వంటివారుండనిదే మనకీ స్వాతంత్ర్య సమరంలో జయం చేకూరదు. ఆస్తిపాస్తులున్నా చదువు సంధ్యలున్నా, దేశం గురించి ఆలోచించేవారు మరొక దారి త్రొక్కేవారుగా నుండరు.

"ముందు ముందు మనం తీసికొనగల కార్యక్రమాల్లో నీవు ముందు పడాలి జైలు కెళ్ళి వచ్చిన వాడవు. నీవుయిన్ని కార్యాలు చేస్తావన్న విశ్వాసం నమ్మకం నాకున్నాయి. "అంటూ తనను ప్రోత్సాహించిన శ్యామసుందరాన్ని జూస్తూ లచ్చన్న ఉప్పొంగి పోయారు. ఎంతో వినయాన్ని భక్తిని అతని పట్ల ప్రదర్శింస్తుండేవారు.

సహోదరులవలెఇరువురు మెలగేవారు. చూపరులకిద్దరూ అజేయుల్లా కన్పించేవారు. ఒకరు ఆదేశించే వారు ఒకరు ఆచరించేవారు. "రామాజ్ఞను పాలించే హనుమాన్ లా లచ్చన్నకు శ్యామసుందరంగారు ఏమి చెప్పిచేయమన్నా లచ్చన్న వినకపోవడం, చేయకపోవడం అంటూ ఏమీలేదు చేసి చూపెట్టి వారు. నాయకుని పట్ల తన కృతజ్ఞతా భావాన్ని ప్రదర్శించేవారు శ్యామసుందరం గారు కూడా తనేమి తలపెట్టిన లచ్చన్నను పిలచి జెప్పనిదే అతని సలహా సంప్రదింపులు లేనిదే చేసేవారుకాదు.

లచ్చన్న గారిలో గల నిరాడంబరత సేవా దృష్టి, నిస్వార్థ రాజకీయ సేవా భావం శ్యామసుందరం గారిని ఎంతగానో ఆకర్షించాయి. శ్యామసుందరం గారిలో గల వాత్సల్య భావం. ప్రక్కవానిని పెద్ద చేయాలన్న మహోన్నత ఆశయంగల శ్యామసుందరం లచ్చన్న గారినే గాక పలువురి మన్ననలను అభిమానం పొందుతూ ఉండేవారు. దేశ ఆర్థిక వ్యవస్థకు పునాది రైతుల ఆర్థిక స్థితి అని భావించిన శ్యామసుందరం గారు రైతో ద్యమాన్ని మొదటినుంచి బలపరుస్తూ వచ్చారు.

1934లో ప్రొఫెసర్ రంగా నిడుబ్రోలులో రాజకీయ రైతాంగ విద్యాలయాన్ని స్థాపించి దేశంలో గల యువకులనాహ్వానించగా శ్యామసుందరం గారు పని గట్టుకొని బారువా వెళ్లి లచ్చన్న గారిని పిలిచి ఆ రైతాంగ విద్యాలయానికి హాజరై రాజకీయ పాఠాల్ని నేర్చుకొని రమ్మని సాదరంగా పైకమిచ్చి అంపిన ఉదార స్వభావుడు - మహోన్నతుడు.

1935లో వారణాశి నుండి చక్రపూర్ వరకు రైతురక్షణ యాత్ర జరిగినపుడు లచ్చన్నను ముందునిడి ఆ రైతు రక్షణ యాత్రను నిర్వహించే ముఖ్య బాధ్యతలను కట్టబెట్టి లచ్చన్నకు రైతునాయకునిగా తీర్చి దిద్దుటలో ఉపకరించిన వదాన్యుడు.

ఎస్టేటు రైతు రక్షణ సంఘాలని నిర్మాణంలో శ్యామసుందరం లచ్చన్న గారికిచ్చిన ప్రోత్సాహం ప్రోద్బలాలు వర్ణనాతీతం. పదార్థమితడు చైతన్య మతడన్న అత్యుక్తి కాదు కానేరదు. 1939లో జమీందారీల పుట్టుపూర్వోత్తరాలను జమీందారీలను రద్దు పరచటానికి, సంపాదించటానికి శ్యామసుందరంగారు లచ్చన్నగారితో కలిసి ఆంధ్రప్రాంతం అంతట తిరిగి చేసినకృషినివరైనాఅంచనావేయగలరా ?

పలాసా కిసాన్ సభలు నిర్వహణలో శ్యామసుందరం నిర్వహించిన పాత్ర లచ్చన్న ఘనకీర్తి ప్రతిష్ఠల్ని వినువీధిలో విహరింపచేయటానికి రాచబాటలా ఉపయోగ పడింది.

ఇచ్ఛాపురంనుండి మద్రాసు వరకు రైతు మహాయాత్ర శ్యామసుందరంగారు వేసిన బీజమే. రైతురంగా ఆశించిన ఆశయం నెరవేరటానికి లచ్చన్నను వెంతకుపిలచి నేనున్నాను. మహాయాత్ర సాగించు, అని ధైర్యం చెప్పిన మహానుబావుడు. లచ్చన్న జన్మలో మరచిపోగలరా?

మందసా రైతుల పోరాటం ఆరంభదశలో ఇంతలోనే అస్తమించి పోయారే, లచ్చన్నకు మార్గదర్శికులేరి తనతో సమానుడని పించుకొన్న లచ్చన్నను తమకందరికి రాజకీయ గురువు రైతురంగా చేతిలో లచ్చన్నను పెట్టి శ్యామసుందరం దీవించాడేమో.

లచ్చన్న కుటుంబంతో కూడ శ్యామసుందరం అత్యంత సన్నిహిత [illegible] లచ్చన్న తండ్రి చిట్టయ్య నెంతో గౌరవించే

వారు. శ్యామసుందరం బాబుగారి వద్దనే అన్నివిషయాల్లోను లచ్చన్న గారి తండ్రి వచ్చేవారు. తన కొడుకు లచ్చన్న శ్యామసుందరం మాటను సుగ్రీవాజ్ఞగా బావిస్తాడని పలువురితో లచ్చన్న తండ్రి చిట్టియ్య చెబుతూ ఉండేవారు. చిట్టయ్య అభిప్రాయం అక్షరాల నిజం. శ్యామసుందరం గారి మాట లచ్చన్నగారికి వరాలమూటే.

శ్యామసుందరం గారు బహుదాప్రశంసనీయులు. అభ్యుదయవాదులు సంస్కరణప్రియులు, హేతువాదులు, విజ్ఞానవివేకాలు ఎచటనున్న గౌరవించి తీరాలి అన్న స్వభావంగలవారు. 50 ఏండ్ల క్రిందట సమాజాన్ని ఒకమారు ఏ ఒకరు ఊహించిన శ్యామసుందరం గారు లచ్చన్నగారికి చేయూతనిచ్చ రాజకీయ రంగంలో నిలద్రొక్కుకొనేలా చేయడం ఎంత అబ్బురమో అన్పిస్తుంది. అగ్రకులాల వారు వెనుకబడిన కులాలవారిని నీచంగా హీనంగా చూచే పరమ నికృష్ట నిర్దయనిర్భాగ్య సమాజమది మనుషుల్లో అంటరాని వారున్నారని నమ్మే మూర్ఖదురాచార సాంప్రదాయ సమాజం కులాన్ని బట్టి వర్గాన్ని బట్టి గౌరవాన్ని గొప్పదనాన్ని పొందుతున్న కాలమది. వెనుకబడిని కులాలవారికి వెలుగు చూడటానికే అధికారంలేదని అసలు అనర్హులని చాటిచెప్పి సమాజంలోని దళిత వర్గాలను వెనుకబడిన జాతులను త్రొక్కి పెట్టి చాందసులున్నదినాలవి.

ఆసమాజమున గల శ్యామసుందరం, ఆసమాజమునగల లచ్చన్న, హెచ్చుతగ్గులవర్ణాలకు ప్రతినిధులుగా నిలచారు. శ్యామసుందరంగారిలో నిజానికి అంతా సమానులే అన్నభావం కొరవడిన మన లచ్చన్న గారింత వటానికి కారణభూతులు అవుతారా 'అటువంటి వారినే మనం మహాను భావులని పిలుస్తాం పిలవాలి. సంకుచిత స్వార్ధం స్వయ ప్రయోజనాలతో ఇతర కులాలను అణచి పెడుతూ, మదబలిసిన వారెంతటి ఉన్నత గౌరవస్థానాల్లోమున్న ఎంతటి విజ్ఞాన విశేషాలనందిన వారెన్నటికి మహానుభావులనిపించుకోరు.

లచ్చన్నగారి కులం తక్కువ అని వెనుకబడిన కులస్థుడు సమాజాన్ని నడిపే నాయకుడా? చేతులు కట్టుకొని ఒకరివద్ద బానిసగా పడి యుండే జాతికి చెందిన వ్యక్తి, జాతీయ పోరాటంలో నాయకుడా? దేశ భక్తికి త్యాగానికి మారుపేరుగా ఉండే అర్హత అంతస్థులిన్ని అతడు కలిగి యున్నాడా?

ుని అనుమానించి, అవమానించి ఎదురుపడే దమ్ములేక ఆ ప్రక్క ఈ ప్రక్క చీదరించుకుంటూపోయే దుష్టశక్తుల్ని తలదన్ని ఎదిరించే శక్తుల్ని అదిమిపెట్టి ముందుపడిన మొనగాడు లచ్చన్న. అట్టి లచ్చన్నకు బాసటగా [illegible] మహావ్యక్తి పుల్లెల శ్యామసుందరంగారు. నిజానికి లచ్చన్నగారు గాంధేయవాదిగా రూపొందటానికి ముఖ్యమైనటికి కారణం పుల్లెల శ్యామసుందరం గారు గాంధేయ మార్గాన్ని అనుసరించి ఆచరించినడవడమే.

1938లో జమీందారీ పుట్టుపూర్వోత్తరాల సేకరణలో నిమగ్నమై దూరంగా నున్న శ్యామసుందరం లచ్చన్నగారలకు లచ్చన్న గారి తండ్రి తీవ్రవారోగ్యంవలన ప్రమాద పరిస్థితిలో నున్నట్లు తంతి వార్త అందింది. హుటాహుటిన ఇరువురు ప్రయాణమై బారువాచేరుకున్నారు. తండ్రి చిట్టియ్య మరణశయ్యపై నున్నాడు. తల్లి ప్రక్కనరోదిస్తూ కూర్చున్నది. శ్యామసుందరం లచ్చన్నలు రావడం జూచిన చిట్టయ్యలో ఆనందం పెల్లుబికింది. శ్యామసుందరం గారిని దగ్గరకు రమ్మని సంజ్ఞ చేసారు. కొడుకు లచ్చన్న ముఖం తనివితీరా చూస్తూ "దగ్గరకు పిలిచారు. శ్యామసుందరంగారి వైపుచూసి "చూడుబాబు నా చిన్న కొడుకు వట్టి అమాయకుడు ఎప్పుడు ఒకరి గురించి ఆలోచన తప్పించి, తనగురించి ఆలోచించడు ఎలా బాగుపడతాడో ఏమో" నిట్టూర్పు విడిచాడు చిట్టయ్య. ఏ చిన్నకొడుకు బాగోగులు నేను చూస్తాను నీవేమీ బెంగపడవద్దు చిట్టయ్య. నామీద నమ్మకం ఉంచు". శ్యామసుందరం గారు చిట్టయ్య చేతుల్లో చేయినిడి చెప్పారు. "ఎంతమాటబాబు, మీరున్నారనే నాకు కొండంత ఆశ. నా పెద్దవాడు వాడి బ్రతుకు వాడు బ్రతుకుతున్నాడు. ఇకమిగిలిందల్లా ఈ చిన్నోడి బ్రతుకు ఇవిగో నావద్దనున్న ఈ రెండువేల రూపాయలే "అంటూ చిట్టయ్య ఎంతో కష్టంమీద తలఎత్తి తన తలదిండు క్రిందనున్న నగదు మూటను తీసి శ్యామసుందరం గారి చేతిలో పెడతారు. చుట్టుచేరిన వారి కళ్ళల్లో నీళ్ళు చేరాయి.

[illegible] ఈ డబ్బు ఎందుకో తెలుసా? మాచిన్నోడికి మీరే పెళ్ళి [illegible] మాకున్న పొలం పుట్ట పోయింది, మా [illegible] ఉన్న ఆకల్లంగడి అవ్యాపారం మూలబడ్డాయి, [illegible] ఏంచేయగలడు" అని దిగాలు పడి

చెబుతున్న చిట్టియ్యను వారిస్తూ "చిట్టయ్య మీ అబ్బాయి పెళ్ళి నేనే జరిపిస్తాను నీవు నిశ్చింతగా ఉండు. అనేకుల బ్రతుకులను బాగుచేయటానికి సిద్ధపడి తన జీవితాన్నే త్యాగం చేస్తున్న మీ అబ్బాయికేమిలోటయ్యా, శ్యామసుందరం ధైర్యం చెప్పారు. చివరిగా అన్ని మాటలు విన్న చిట్టయ్య మరుసమాధానం చెప్పలేదు. బహుశాలోలోన అది నిజమో సుమా అని ముమ్మాటికి తనమనసులో భావించే యుంటారు. అంతచేత తన జీవితాన్ని తనిద్దరు కొడుకులు, తనకూతురు, తన భార్య చెంతనుండగా ముగించాడు. చిన్న కొడుకును శ్యామసుందరంగారి చేతిలో పెట్టాను ఇకవాడి బ్రతుకు బాగుపడుతుందని బావిస్తూనే పరమపదించి యుంటాడు.

శ్యామసుందరంగారు తరువాత ఆ సొమ్మును లచ్చన్నగారి తల్లికి అందజేసి తన కొడుకు పెళ్ళికి ఒక చోట దాచి ఉంచమన్నారు.

లచ్చన్నగారు దేశానికి స్వాతంత్ర్యంరానిదే పెళ్ళిపెటాకులు చేసుకోనని ప్రతిజ్ఞ చేసియున్నారు. దేశానికి స్వాతంత్ర్యం రావడం ఎప్పుడు, తనపెళ్ళి ఎప్పుడు ఆనాడు ఏ ఒకరు జవాబు చెప్పలేనిది.

తన చిన్నకొడుకు లచ్చన్నను, తన భార్యగాని, తన పెద్దకొడుకు గానీ బాగుచేస్తారన్న నమ్మకం చిట్టియ్యకు కలగలేదేమో. పుల్లెల శ్యామ సుందరంగారికే చిన్న కొడుకు పెళ్ళి భారం అప్పగించారు. లచ్చన్నగారి కుటుంబానికి ఆ కుటుంబంలో నున్న వారికి శ్యామసుందరం గారన్న ఎంతటి భక్తి ప్రపత్తులుకలవో, ఇంతకన్నా వేరొక ఉదాహరణ ఇవ్వ నవసరమేలేదు.

నిజానికి చిన్న కొడుకు పెళ్ళిని కూడ చిట్టియ్య జరిపించేసా డేనాడో అయితే అది కలసిరాలేదు. 1923లోనే లచ్చన్న గారికి తన 14 ఏండ్ల వయసులో వివాహం జరిగింది. బాల్య వివాహాలు తరచుగా జరుగు తున్న దినాలవి. అందులో వెనుక బడిన కులాలవారు అత్యంత ప్రీతి పాత్రంగా చిన్న పిల్లల వివాహాలు జరిపే కాలమది.

లోగడ ఒకమారు చిట్టయ్యకు ఒక పెద్ద జబ్బు చేసింది. బ్రతికి బయటపడి బట్టకట్టగలనో లేదోనని ఇరువురు కొడుకులకు పెళ్ళిళ్ళు

నిశ్చయించి కులాచారం మేరకు పెళ్ళిళ్లు జరిపారు. పెట్రోమాక్సులైట్లు తెప్పించి అప్పటి కులాచారాల ప్రకారం పెళ్ళిళ్లు జరిగాయి. మశూచికం వ్యాధి రావడము అన్నెంపున్నెం ఎరుగని లచ్చన్నగారి మొదటి భార్య పసుపు కుంకుమలతోనే వెళ్ళిపోయింది.

పుల్లెల శ్యామసుందరంగారు అతి చిన్నవయుసులోనే తన 40ఏటనే స్వర్గస్తులైనారు. లచ్చన్న పెండ్లి జరపాలన్న స్వాతంత్రం రావాలికద మనకు స్వాతంత్ర్యం ఎపుడు లభిస్తుంది. పోరాటంలో నున్న శ్యామ సుందరం లచ్చన్నలకే తెలియాలి. దేశ స్వాతంత్ర్య బానోదయాన్ని చూడక మునుపే శ్యామసుంధరం గతించి పోయారు. ఇక ఆదేశ స్వాంతంత్ర సమపార్జనలో దీక్షాకంకణం కట్టుకొని లచ్చన్న అండర్‌గ్రౌండ్‌లోనికి వెళ్లారు. శోధించి పరిశోదించటానికి ప్రగతిని కొనిరావటానికి.

# 21 వ ప్రకరణము

# అండర్ గ్రౌండ్ పోరాటంలో – లచ్చన్న

అండర్‌గ్రౌండ్ పోరాటాల్లోనే అనేక రాజ్యాలు ఓడిపోయి వారి అధికార పీఠాలు బ్రద్దలై పోయాయి అన్న భావంతో స్వగ్రామం బారువా నుండి బయలుదేరి రాత్రి 2 గంటలకు సోంపేటలో మెయిల్ ఎక్కి కరఖ్ పూర్‌లో దిగారు. అచటనుండి నాగపూర్ చేరుకొని హైదరాబాద్ వెళ్ళారు. హైదరాబాదు నుండి మరల కర్నూలు వెళ్ళారు.

అభిమానులు వసూలు చేసిన సొమ్ములో లచ్చన్న ప్రయాణం సాగిస్తూ చివరికి కర్నూలు దగ్గరలోనున్న గార్గేయపురం చేరుకొన్నారు. ఓబులరెడ్డి లచ్చన్న గారికి అన్ని ఏర్పాట్లు చేసారు. ఓబులరెడ్డి లచ్చన్నతో రంగా రైతాంగ రాజకీయ పాఠశాల విద్యార్థి సిమ్మ శివారెడ్డి ఇల్లు ఒకకోటలా ఉంది. అందులో ఎవరున్నా ఏ ఒకరు అంతవేగంగా గుర్తించలేరు.

"ఏమిటి లచ్చన్నగారూ అండర్‌గ్రౌండు పోరాటం మనకవసరమా? శివారెడ్డి ప్రశ్నించారు.

"మనం అండర్ గ్రౌండులోనికి వెళ్ళకపోతే ఎలాను ప్రభుత్వం మనల్ని పట్టి బంధించి చెఱశాలలో వేస్తుంది. చెఱశాలకు వెళ్ళి మనం ఒక మూల కూర్చోవడం తప్ప మనం చేసేదేముంది. ఎన్నాళ్ళు మనం సత్యాగ్రహాల్ని చేసి ఉపవాసాల్ని జరిపి, ఈ తెల్ల వాళ్ళను వెళ్ళగొట్టగలం" లచ్చన్న అన్నారు. మన నాయకుడు రంగాగారు గాని గాంధీజీ నెహ్రూలుగాని మనకు పిలుపు నివ్వనిదే మనమేం చేస్తాం" ఓబులురెడ్డి అడిగారు.

"వాళ్ళుమాత్రం వెలుపలనున్నారా వాళ్ళూ జైలులోనే ఉన్నారుగా మన రైతునాయకుడు రంగాను మద్రాసు రైల్వేస్టేషనులో మా జిల్లాలో జరిగిన పలాసాకిసాన్ సభలకు హాజరయి వస్తుండగానే అరెస్టు చేసారు కదా" లచ్చన్న గారన్నారు.

అందుకేగా భారతదేవి రంగాను రంగా స్థానే ఆల్ఇండియా కిసాన్ సభకు అధ్యక్షునిగా ఎంపికచేయడం జరిగింది. ఏది ఏమైన మనం

ఉద్యమించవలసిన దినాలివి. ఏమరుపాటుపడి విశ్రమించవలసిన సమయం కాదిది.

తమ అనుచరుడయిన అచ్చన్న మాటలు విన్న రామిరెడ్డి ఓబులురెడ్డి లోలోన సంతోషించారు. రైతు సభలనేర్పాటు కార్యక్రమాల్ని చేపట్టడం ప్రారంభించారు. భీమవరం చేరిన తదుపరి రాజకీయ కలాపాలను ముమ్మరం చేసారు. గ్రామాల్లోకి వెళ్లి రైతు సమావేశాన్ని ఏర్పాటు చేయడం ప్రసంగించడంతో ప్రభుత్వం కన్నుపడింది. రహస్య జీవితం గడిపేవారు.. రచ్చబండపై నిలబడి ఉపన్యాసాలిస్తే తన రహస్యం బయటపడకుండా ఉంటుందా?

గార్గేయపురం నుండి నంద్యాల చేరుకున్నారు. రాజకీయ సహచరుడు కిసాన్ నాయకుడు, రామిరెడ్డి గారి ఆహ్వానం మేరకు నంద్యాల నుండి భీమవరం చేరుకున్నారు. రామిరెడ్డి గారి పెద్దన్నయ్య రామసుబ్బారెడ్డి జస్టిస్ పార్టీలో ప్రముఖ నాయకుడు. అన్ని పోలీస్ స్టేషనులకు వైర్‌లెస్ ద్వారా పోలీసులు ఉత్తర విశాఖ జిల్లానుండి తెలియ చేశారు. అచ్చన్న అనే వ్యక్తి డిటెన్యూ చేయబడినారు. ప్రభుత్వ ఉత్తర్వులను ఉల్లంఘించి అండర్ గ్రౌండ్‌లో ఉన్నారు. ఎచ్చట కన్పించిన పట్టి బంధించాలని ఆదేశాలు జారీ అయ్యాయి. అచ్చన్నను పట్టుకోవడానికి వలపన్నారు.

అచట నుండి కందుల ఓబులరెడ్డి అత్తవారు ఊరు వెళ్లారు. వస్తూన్న ఒక జట్కాను పోలీసులు ఆపారు. కర్నూలు నుండి నంద్యాల పోతున్నదా జట్కా. బండి తోలుతున్నవాడు ముస్లిం కుర్రవాడు. పోలీసులు పరదా ఎత్తి చూడటానికి భయ పడ్డారు. అది ముస్లింల హెచ్చు సంఖ్యలో నివశిస్తున్న ప్రాంతం. ముస్లిం వనితలు ఇతరుల చూపు తమపై ప్రసరించకుండా ఉండటానికే పర్దాలు ధరిస్తారు. పర్దాలు పెట్టుకొన్నవారి నెలా పరీక్షిస్తారో ముఖాన్ని కప్పుతూఉన్న పర్దావలన వ్యక్తి పోలిక జరగదు. అచ్చన్న గారు స్త్రీ వేషం ధరించక తప్పలేదు. పోలీసులు తమ ఆడవారిని అవమానించిన మరు క్షణం కలహాలు చెలరేగి తుద కది మత కలహాలకు దారితీస్తుందేమో అని భయపడుతూ పోలీసులు ఆ జట్కాను ముందుకు పోనిచ్చారు.

[illegible] బర్హంపూర్ స్టేషన్ చేరుకొని బర్హంపూర్

బారువా గ్రామం కార్యకర్తలు ఇద్దరు నీలాంబరరావు, ఉరప్కందులు, మార్పు రాజారావు ఇద్దరిని తీసుకొని కాలినడకన బారువాలోనున్న గొరకల సూర్యనారాయణ సర్పంచ్‌గారి కొబ్బరితోటకు చేరాడు లచ్చన్న.

సోంపేట తెల్లవారేసరికి లచ్చన్న బారువాలో కార్యకర్తల సమావేశం ముగిసిన తరువాత మదనంపురం మార్పు రాజారావు గారింటికి చేరుకొన్నారు. అచటన నుండి సోంపేట మేజిస్ట్రేట్ కోర్టులో ప్రాసిక్యూషన్ సాక్షులుగా నున్న వారియొద్దకు (మందసాపైరింగ్ కేసు) తన అనుచరులను పంపించి కేసు విషయంలో తమకేమి తెలియదని చెప్పమని చెప్పించారు.

మూడు వాయిదాల తదుపరి కేసు సెక్షన్ కోర్టుకు కమిట్ చేసారు. సదరు కేసును నిర్వహించిటానికి తగిన నిధులను ప్రజలనుండి ప్రోగు చేసి సూర్యనారాయణ రెడ్డికిస్తారు. లచ్చన్నగారు అండర్‌గ్రౌండ్‌లో ఉంటూ కేసుకు-అన్ని విధముల సాయి పడ్డారు. అండర్‌గ్రౌండ్‌లో ఉండడమంటే ఏ ఒక్కచోటనో ఉండటానికి వీలుపడదు. పోలీసు నిఘా ఇట్టే కనిపెట్టేస్తుంది.

మామిడిపల్లి చేరుకొని తరుణాచారి గారింట్లో కొన్నాళ్లు, మూలపాలెం చేరి మూల ఎర్రయ్య నివాసంలో కొన్నాళ్లు, తలతంపరముతా మండవల్లి హేమలడ్ బంజరి అనే గ్రామంలో బిర్యాలం గవరయ్య గారి చెల్లిలింట్లో కొన్ని దినాలుంటూ అండర్ గ్రౌండ్ పోరాటం నడిపారు. అచటనుండి ప్రగడ పుట్టిక జల్లెడ అప్పలస్వామిగారు ఏర్పాటు చేసిన బండిరంగ స్వామిగారింట్లో కొన్నాళ్లు గడిపారు. మాదానుపురం కొబ్బరి తోటల్లో కొన్నాళ్లు నివాసం ముండగా మందసా ఎస్టేట్‌లో గల మదనాపురం దగ్గరగా నున్న గోవిందపురం సిద్దాబత్తుల వల్లభయ్య ఇంట్లో కొన్నాళ్లుంటు కేసులు నిర్వహించటానికి నిధులను సమకూర్చారు.

సెషన్ కోర్టులో కేసు జయప్రదంగా నిర్వహించటానికి ప్రఖ్యాత క్రిమినల్ లాయర్ హెూంశాస్త్రి విశాఖపట్టణం చేరారు. లచ్చన్నగారు రాత్రిపూట కలసారు. విశాఖపట్టణంలో తమున్నన్నాళ్లు, తన రహస్య స్థావరం ప్రస్తుతం మాజీ రెవిన్యూ శాఖామాత్యులు నల్లపురెడ్డి శ్రీనివాసులుగారు విద్యాభ్యాసంకు నివసిస్తున్న గది. తదుపరి మరల ఉత్తర విశాఖజిల్లాలో

అండర్‌గ్రౌండ్ పోరాటానికి సిద్ధపడతారు.

ఈ సందర్భంలో కిల్లి అప్పలనాయుడుతో కలసి జిల్లా అంతటా రహస్యంగా పర్యటించి మందసా ఫైరింగ్ కేసుకు కావలసిన నిధులు సమీకరణ చేస్తారు. ఇందుకు లచ్చన్న గారికి ఈ క్రింద నుదహరించినవి రహస్య స్థావరాలుగా నుపయోగపడ్డాయి. పలాసా సబ్ తాలూకాలో రెంటికోట - గ్రుల్లలపాడు - పాతటెక్కలి - కోటపాడు - గోపాలపురం - నందిగామ - వెంకటాపురం బొడ్డు నాయుడు కొత్తూరు - ఇచ్ఛాపురం పెద్ద కొజ్జిరి - వాతపుట్టుక దేవాలయ ద్వార్లపుట్టనే - నరసన్నపేట తాలూకాలో తెనాలి దగ్గర గుగ్గిలి - పల్లిపేట వెదుర్లు వలస - ఆముదాలవలస దగ్గర పురుషోత్తంపురం, తోటాడ, - కనిమెట్ట - షేక్ మహమ్మదపురం - శ్రీకాకుళం సాగువీధి - ఉమ్మరి విల్లి - నాపడా - రాళ్లపేట దూసుపేట - మద్దూరు . పాతపట్నం తాలూక కొమ్ముసరి మల్లెపురం బత్తిలి - హిందూ మండలం - తెనాలి వద్ద అలూరు - లక్ష్మినరసన్నపేట దగ్గర కిట్టాడ - దూసిపేట వద్ద వేములవలస - పార్వతీపురం వద్దగల నాగూరు - గుమ్మ లక్ష్మీపురం - అంబాజీపేట వద్ద లుకలాం - లక్కందిద్ది -.

అండర్‌గ్రౌండ్ పోరాటంలో అతనికి సహాయపడిన సహచరులు - దరిమెల రమణమూర్తి - బండి అప్పలనూరి, మూర్పు రాజారావు - కిల్లి అప్పలనాయుడు - దుక్క సూర్యనారాయణ రెడ్డి - బత్తిలి తవిటి నాయుడు. లచ్చన్నగారికి టెక్కలి దరి రిట్టపాడు మకరాంపూరం పూండి బైరాగి మఠం కొబ్బరితోట, ఉద్యాన ప్రాంతం - గూడ్డిబద్ర, రహస్య స్థావరాలు. తదుపరి అండర్‌గ్రౌండ్ పోరాట పథంలో గుంటూరు చిత్తూరు జిల్లాలోనికి ప్రవేశించారు.

మదనపల్లి దగ్గరగా నున్న టిపదంలో నున్న రాటకొండ రంగారెడ్డి గారింట్లో తన బస. రంగారెడ్డి రైతోద్యమంలో మునిగి తేలుతున్న తన వంటి ఉద్యమ నాయకుడు. అగ్నికి వాయువు తోడయినట్లు లచ్చన్న రంగారెడ్డి ఇరువురు కూడి రహస్య మంతనాలు జరిపి ఒక రైతు అధ్యయన కేంద్రం రహస్యంగా నడపాలని నిర్ణయించుకొన్నారు.

రాత్రివేళల్లో రైతులు గుమి గూడేవారు. దేశ పరిస్థితులను వ్యాఖ్యా

తెలియ జెప్పి దేశ స్వాతంత్ర్యంలో రైతు పాత్రను వివరించే వారు రైతు చైతన్య మూర్తి కావాలని ఉద్ఘోషించేవారు. అది ఒక యినాందారీ గ్రామం ప్రభుత్వం రైతులపట్ల ప్రదర్శిస్తున్న వైఖరిని దుయ్యబట్టి రైతుకు భూమిపై సంపూర్ణ హక్కులు రావాలని బోధించేవారు.

పోలీసులు టిపదం గ్రామంలో ప్రవేశించి ప్రతి ఇల్లు సోదా చేయడం ప్రారంభించారు. ఏ ఒకరు మాకు తెలియదు, ఏ ఒకరు వచ్చి మాకు ఏమీ చెప్పనిదే, ఏ నాయకుడు మా గ్రామానికీ రాలేదంటూ రైతులు ఏకరువు పెట్టారు. గ్రామమంతా గాలించిన అచ్చన్న గారు దొరకలేదు. పోలీసుల అలికిడి చూచాయగా గ్రహించిన మరు క్షణం అటనుండి అచ్చన్న అతి చాకచక్యంగా తప్పించుకొని బయటపడి తిన్నగా గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా లోనున్న ఈడుపులపాడు చేరుకున్నారు.

## గుంటూరుజిల్లా ఈడుపులపాడు

రాయలసీమ రైతులకన్న సర్కారు రైతులు అన్నిటిలో ముందంజ వేయగలిగిన వారు. అచ్చన్న రాయలసీమ రైతాంగానికి బోధించిన తీరులో ఇచ్చట బోధించలేదు. రైతులనందరిని తనంతటివారుగా భావించి అందరూ ప్రజాఉద్యమం లో చేరాలి. కాంగ్రెసు కోసంస్థకు రైతోద్యమం మద్దతుగా నిలబడాలి. మన రైతురంగా నాయకత్వాన్ని మనం బలపరచాలి, అని ఉద్ఘాటించారు.

ఈడుపులపాడులో అద్యయన కేంద్రం మంచి రక్తికట్టింది. రైతుల్లో అత్యధిక సంఖ్యాకులు చదువరులు పైగా కమ్మకులస్థులు. అభ్యుదయం, చైతన్యం,అన్నింటిలోముందడుగు వేసేవారేతప్పవెనుకడుగు అన్నప్రశ్నే లేదు.

## ఉప్పల కోడూరు

తదుపరి ఉప్పలకోడూరులో ఒక రైతు అద్యయన కేంద్రాన్ని గోగినేని లక్ష్మినారాయణ అండదండలతో, ప్రారంభించారు. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొని మనమేం సాధించగలం. త్వరలో ఏదో ఇక

ప్రజాఉద్యమం వచ్చి తీరుతుంది. వ్యష్టి సత్యాగ్రహంలో పాల్గొవడమన్నా జైలుకెళ్లి కూర్చోవడమేకదా ! అంత మాత్రాన బ్రిటిష్ వారు చలిస్తార్రా ? మదగజం చలిచీమలకు చలిస్తుందా అంకుశాల్లా మనం తయ్యారై ఆ గజాన్ని పిచ్చెత్తేలా పొడవాలి. ఆనాడే మనల్ని విడచి హడలెత్తి పారిపోతుంది. మనమంతా ప్రజోద్యమంలో చేరటానికి సిద్ధంగా ఉండాలి. లచ్చన్న ప్రసంగం విన్న వారెంతగానో ఉద్రేకం చెంది, స్వరాజ్యం సాధించుకొంటాం అంటూ ప్రతిజ్ఞలు చేస్తూ సభలో నిలుచుని శపధాలు చేసేవారు. ఆనాటి యువకుల్లో దేశభక్తి పదవి అధికారం, సంపదల నాశించి పుట్టింది కాదు మాతృదేశ దాస్య శృంఖాల్ని భేధించి తీరాలన్న స్వేచ్ఛ సంకల్పాలనుండి ఉద్భవించింది.

లచ్చన్న తదితర డిఫెన్సు కమిటీ బృందం జిల్లా అంతా తిరిగి సేకరించిన ధనంతో మందసా డిఫెన్సు కమిటీకేసును విజయవంతంగా నడిపింది.

సెషన్సు కోర్టులు సరియైన సాక్ష్యాధారాలు పోలీసువాళ్లకు దొరకనందున చాలామందిని నిర్దోషులని విడిచిపెట్టారు. అండర్‌గ్రౌండ్‌లో నున్న లచ్చన్న ఏనిమిషాన ఎవరిమీద వచ్చి పడతాడో ఏంచేస్తాడో అన్న భీతాహం ఏ ఒకరు పోలీసుల పోలీసుల పక్షాన నిలబడి సాక్ష్యం చెప్పడానికే ససేమిరా అంగీకరించలేదు. ఏదో కాస్తా వారికి దొరికిన సాక్ష్యాధారాలు కేసును నడిపించలేకపోయేవి.

ఉన్న సాక్ష్యాలను కూడ బలహీన పరచటానికి విశ్వప్రయత్నం చేసా లచ్చన్ని సాధించారు. సెషన్సు కోర్టులో కొందరికి మాత్రమే శిక్షపడింది. డిఫెన్సు కమిటీ హైకోర్టుకి అప్పీలు చేయగా అందరినీ విడచిపెట్టి 12 మందికి మాత్రం ఒక సంవత్సరం జైలుశిక్ష ఖాయపరచారు.

లచ్చన్నగారు అండర్‌గ్రౌండ్‌లో నున్నందున డిఫెన్సు కమిటీ అధ్యక్షునిగా దుక్కా సూర్యనారాయణ రెడ్డిగారే నడిపి విజయం సాధించారు. డిఫెన్సు కమిటీ లక్ష్యం నెరవేరిన లచ్చన్న అండర్‌గ్రౌండునుండి బయట పడలేదు. వ్యష్టి సత్యాగ్రహం చేయమని కాంగ్రెసు అధిష్టాన వర్గం పిలుపు [illegible] జిల్లా కాంగ్రెసు కార్యదర్శిగా చేయాలి. అయితే తను వ్యష్టి [illegible] జైలుకు వెళ్ళడమే కదా. జైలుకెళ్లి [illegible] వెలిశాలతో మగ్గేకన్న [illegible] ప్రజోద్యమానికి జనాల్ని సిద్ధం చేయాలి

తను అండర్‌గ్రౌండులో నుండక తప్పదు.

## ఉత్తర విశాఖ జిల్లా మండవల్లి :

తలతంపర ముఠాలో చినమండవల్లి అనే గ్రామంలో ఒకరాత్రి బెండాళం గవరయ్యగారి సోదరి ఇంట్లో బసచేసి వీధి అరుగుమీదువ్న గదిలో లచ్చన్నగారు నిద్రిస్తుండగా, వీధి గుమ్మానికి అడ్డంగా గవరయ్యగారు మంచం వేసుకుని నిద్రిస్తున్నారు. గవరయ్య గారి మీద వారంటులేదు.

ఆరాత్రి ఒక కానిస్టేబుల్ వచ్చి ఆవీధిలో కన్పించారు సర్వర జ్ఞ భ్రాంతి కలిగింది. అతడు సివిల్‌డ్రెస్సులో ఉన్న పోలీసు అయిన గవరయ్య గారి చెల్లెలు హడావిడిగా తన సోదరుని లేపి విషయం చెప్పింది. గవరయ్య గారు లేచి లచ్చన్న గారిని హడావుడిగా లేపాడు. ఇద్దరూ ఆతురతతో కాగితాలు ఫైల్సు ఉన్న సూటుకేసును తీసుకుని ఇంటిపెరటి మార్గం గుండా బయటపడ్డారు. ఊరిచివర కొబ్బరితోట ఉంటే అందులో చేరారు. ప్రక్కనే ఒక గుడి ఉంది. ఆ గుడి లోనికి పోదామని ఆ చీకటిలో పరుగిడుతుండగా లచ్చన్నగారు బలమైన ఒక తెంపరిమోతే మీద పడ్డారు. ఒక పేడు కుడిమోకాలు దగ్గర లోపలికి దిగిపోయింది. విపరీతంగా రక్తం బయటకు వచ్చింది. బలము ఉపయోగించి దానిని తన చేతిలో తీసి బయటకు పారవేయ్యాలని లచ్చన్నగారు ప్రయత్నించారు. అయిన అదికొరుకుడు పడలేదు. నడపడం మహాకష్టతరం అయింది. ఎలానో కాళ్లీడ్చుకుంటూ గవరయ్య గారి భుజం పట్టుకొని ఒంటికాలితో గెంతుకుంటూ దగ్గరలో నున్న గుడిశలోనికి చేరుకున్నారు. శరీరం ముచ్చెమటలు పోసినందున దాహం తీవ్రత పెరిగింది. ఆ కొబ్బరితోటను కాపలా కాస్తున్న వాడ్ని కొబ్బరి బొండాలను యిమ్మని చెప్పడమే తరువాయి అతడు తెచ్చియిచ్చాడు. ఆకాపరికి లచ్చన్నగారిని బాగా తెలుసు. తెల్లవారింది తోటకాపరిని మాత్రం మేము వేరొక గ్రామానికి వెళ్లేవరకు తోటనుండి కదలనివ్వలేదు. రహస్యం బయటపడుతుందేమో.

గవరయ్యగారు రహస్యంగా గ్రామంలోనికి ప్రవేశించి ఒక బండిని కట్టించుకుని వచ్చారు. ఆబండినెక్కి రాత్రిపూట గవరయ్యగారి మేనత్తగారి

ఊరులో మకాం పెట్టారు.

పల్లెటూర్లో ఇళ్లు బంగ్లాల్లైపులో ఉండవు కదా! ఇళ్లన్నీ వరుసగా నుంటాయి. గడప భాగానికి వచ్చేసరికి అన్ని ఇళ్లు కలిసినట్లుంటాయి. అందుకు లచ్చన్నగారు ఏ యింట్లో ఉన్న ఆక్షణంలో తెలిసిపోతుంది. అందుకు లచ్చన్నగారు ఆ యింట్లో ఒక దేవుడి గది ఉంది. అందులో కూర్చొనేవారు పడక అక్కడే. ఆఖరికి మలమూత్ర విసర్జన అక్కడే. బయటకు వచ్చాడా, కధ కంచికి పోతుంది.

దేవుడి గదిలోనున్న లచ్చన్నగారికి లచ్చన్నగారి మలమూత్రాల నెత్తి బయటకు ప్రతీదినం పారేస్తున్న ఆయింటి ఇల్లాలికి దైవంపట్ల హీనభావం లేదు. దేవుని గది అపవిత్రం అవుతుందేమోనన్న శంకలేదు. కారణం వారిద్దరి మనసులో నున్నది దైవకార్యానికి మించిన కార్యం. దేశంకోసం జీవితాన్ని త్యాగం చేస్తున్నానని ఒకరు ఒక దేశసేవకునికి సేవ చేసే భాగ్యం కలిగిందని ఒకరు భావించారేమో. అపవిత్రము వారి మనసుల్లో లేదు. పవిత్రమైన దేశమాత ఋణం తీర్చుకుంటున్నారు. లచ్చన్న పట్ల ఆ కుటుంబానికి గల అభిమానం తను చేస్తున్న దేశసేవకు తను అందుకున్న గౌరవం, అదరణ ఆనాటి సమాజాన్ని స్వాతంత్ర్యయోధులకు అందబట్టే ఆనాడు మనం స్వరాజ్యం సాధించగలిగామేమో లచ్చన్నగారిని తలమీదిడుకుని పూజించేవారు. ప్రజలు అన్నదీ అర్ధంలోనే మనం చూడాలి.

ప్రస్తుతం లచ్చన్న గారున్నది బారువా గ్రామానికి అతిదగ్గరలోనున్న గ్రామంలోనే. అందుకు బయటకు వెళ్లిన ఎవ్వరైన గుర్తించవచ్చు.

లచ్చన్నకాలిమీద గాయం మానలేదు. దిగబడిన పేడు బయటకు రాలేదు. లచ్చన్నగారికి ఒక ఆలోచనతట్టింది. హాస్పిటల్ సౌకర్యాలు ఉన్న చోటికి పోయి ఆపరేషన్ చేసి తీస్తేనే తప్ప ఈ క్రపేడు రాదు. ఆలస్యం చేసిన విషమించవచ్చు.

## ఖర్గపూర్ సత్రగంజ్ :

ఖర్గపూర్ కలకత్తా మధ్యనున్న సత్రగంజ్‌కు రహస్యంగా గవరయ్య [illegible] చేరుకున్నారు. ఆచ్చెలు లచ్చన్న సహాధ్యాయుకుడే. భాస్కర్

రావు రెల్వేలో ఉద్యోగం చేస్తున్నారు. లచ్చన్న వెళ్లగానే ఆదరించి ఆపరేషన్‌కి తగిన ఏర్పాట్లు చేసారు. రైల్వే హాస్పిటల్‌కు తీసుకుని వెళ్లి తనదగ్గర బంధువు లచ్చన్న అని చెప్పి ఆపరేషను జరిపించారు. ఉత్తరం వేయగా బారువానుండి రాజమ్మగారు కొడుకు ఏమి కష్టాలు పడుతున్నాడో అని 400 రూపాయల్ని రహస్యంగా కొడుకు ఇచ్చిన చిరునామాకు అంపింది.

లచ్చన్నగారు కోలుకున్నారు. గాయంమానింది. తనచోట నుండ వలసిన పనిలేదు. పైసాకూడ జేబులోనుంది. అచటనుండి ప్రయాణమై కలకత్తా వెళ్లారు. బెంగాల్లో ఏం జరుగుతున్నదీ స్వయంగా చూడాలి. అది ఆతని తపన. దేధంలో ఏమూల ఏంజరుగుతున్నదీ తనకు తెలియాలి. దేశనాయకులు దేశ స్వాతంత్ర్యం కోసం ఏమి చేస్తున్నారన్నది తను తెలుసుకోవాలి. తన ఉద్యమాన్ని సాగించుకోవాలి. బోల్షివిక్ పార్టీ ఆ రోజుల్లో రష్యాప్రభుత్వాన్ని నడిపేది, దీనిశాఖ కలకత్తాలో నుండేది. దీనికి నాయకుడు ముఖర్జీ. లచ్చన్న వీరింటిలోనే బస.

కలకత్తా లచ్చన్న రావటానికి వేరొక ముఖ్యకారణం ఉంది. రంగా అరెస్టు చెయడంలో కిసాన్‌సదస్సుకి ఆంధ్రశాఖకు భారతీదేవి రంగాగారు అధ్యక్షులయ్యారు. లచ్చన్నగారు అండర్‌గ్రౌండులో ఉన్నారని అమెకు రహస్యంగా వార్త అందిండి. లచ్చగారిని వెళ్లి చూద్దామని. అమె అభిలాష లచ్చన్నగారన్న పుత్ర్యవాత్సల్యం అమెకు. రంగాగారు లచ్చన్నగారిని తమ కుమారునిగా భావిస్తూ ఆదరిస్తారు.

భారతీదేవి రంగా ఒక ఉత్తరం వ్రాశారు ఫలానాతేదీన వస్తానని అయితే వెంటనే లచ్చన్నగారు కృతజ్ఞతలను తెలుపుతూ ఉత్తరం వ్రాశారు. "ఎంతమాత్రం మీరు రావడానికి వీల్లేదు, అని మీరు వస్తే నేనున్న రహస్య స్థలం తెలిసిపోతుంది. అంధ్రకు ఇప్పట్లో నేను రాలేను. మీరే కలకత్తా వచ్చి మీరెక్కడున్నదీ చిరునామా ఇస్తే వచ్చి మిమ్ములను దర్శిస్తాను." అన్న ప్రత్యుత్తరం వెళ్లింది.

భారతీదేవి రంగా కలకత్తా చేరుకొనగానే లచ్చన్నగారు అమెయిచ్చిన చిరునామా ప్రకారం వెళ్ళి కలిసారు. అమె ఉద్యమాన్ని ఎలా తీవ్రతరం

చేయాలో కొని సూచనలను సలహాలనిచ్చింది.

మారువేషంలో వెళ్లి కలకత్తాలో భారతీదేవి రంగాగారిని కలవటానికి పాంటు షర్టు హేట్, సూటు, బూటులతో వేషం మారింది. తనను రహస్య పోలీసు అనుమానించకుండా జాగ్రత్తపడ్డారు. కలకత్తానుండి వెనుకకు మరలి గంజాంప్రాంతం ప్రవేశించి అండర్‌గ్రౌండు వర్కు ప్రారంభించారు. ఇచ్ఛాపురం తాలుక కమిటి వద్ద ఉన్నదే ఉద్దానం. ఆఉద్దానంలో నున్న అనేక గ్రామాల్లో ప్రగడ పుట్టుక ఒకటి లచ్చన్నగారు దీనిని కేంద్రంగా చేసుకున్నారు. ఉద్దానం కొబ్బరితోటలమయం. నారీకేళీవనాలల్లో అందంగా విలసిల్లి దివ్యానందర సానుభూతిని కలిగిస్తుంది. సముద్ర తీరం ఇసుకదిబ్బలపై అలరారే ఈ నారికేళ వనావళి అసంఖ్యాకుల జీవనాధారమై అలరారుతువ్నది. ఒకప్రక్క సముద్రతరంగాలు ఎగిరిపడుతూ ఉంటాయి. ఇసుకదిబ్బలు నిబ్బరంగా ఉట్టిపడుతూ కన్పింస్తుంటాయి. పశ్చిమ వైపునుండి ఉద్దానంలో దూరితే మరల తూర్పున ఉన్న సముద్రపు ఇసుక తిన్నెలలోన తేలేది చుట్టుక్రమ్మిన కొబ్బరితోటలలో ఉద్దానం జూడముచ్చటగా నుంటుంది.

ప్రతి ఒక రైతుకు ఉద్దానంలో కాస్తాకూస్తో భూభాగముటుంది. ఆభూభాగమున విరగకాచే కొబ్బరికాయలే వారికి జీవనాధారం.

లచ్చన్నగారి నివాసం ఉద్దానం రాత్రి వేళల గ్రామాల్లో బడి ఉపన్యాసాలు రైతులను ప్రోగుచేయడం ఉద్యమాన్ని బలపరచమని చేరమని ప్రోత్సహించడం.

కలెక్టరు లచ్చన్న మరికొంతమంది తీవ్రవాదులు ఉద్దానంలో ఉన్నారని పసిగట్టి వలువైపుల పోలీసులవలయం ఏర్పరచ ఆర్డరు వేశారు.

ఉద్దానం దాటి వెలుపలకు రావటానికి లచ్చన్నకు వలనుపడలేదు. [illegible] ఉన్న చిన్న చిన్న పల్లె కొంపలలోనే ఉంటూ [illegible] పోలీసుకాపల్లాగ గట్టిపరచారు.

## ప్రగడ పుట్టుక :

కొబ్బరిబొండాలతోనే ఆకలి దప్పికల్ని తీర్చుకుంటూ దినాల్ని గడిపేవారు. ఒకరోజు సంధ్యమరుగున ఒక చిన్న పల్లె కొంపలో దూరి ఆపాకలోనున్న ముసలమ్మను పిలచారు "అమ్మా ఏమైన ఉంటే పెడతావా, అకలి వేస్తున్నది, నేను లచ్చన్నను - "అన్న లచ్చన్న మాటలు విన్న ఆముసలమ్మ బయటకు వచ్చి తొంగిచూసింది. ఏనాడు లచ్చన్నను ఆమె చూడకపోయిన ఆపేరును అందరు కథలుగా చెప్పుకొంటేవిని ఉన్నది," ఎవరు బాబూ, లచ్చన్న బాబువా, మాఅమ్మ నాతండ్రీ, పేదరాలిని బాబు, కాస్తాకాచిన అంబలి ఉంది పెట్టనా, ముసలమ్మ అప్యాయతతో అన్న మాటలు "అంతకన్నా నాకేమి కావాలి. అకలితో ఉన్నవానికి ఆహారం, కావాలి గాని, ఏ ఆహారమని కాదు కదా" అని అన్నారు. ముసలమ్మ మట్టిచట్టితో అంబలిని కడుపార లచ్చన్ని గ్రోలారు.

లచ్చన్ని అంధ్ర రాష్ట్ర ఆమాత్యులుగా ఆప్రాంతం పర్యటించినపుడు ఆముసలమ్మ దగ్గరగా వచ్చి లచ్చన్నను ప్రేమతో పలకరిస్తే లచ్చన్న దగ్గరగా తీసికొని ఆనాడు తనకు ఆమాత్రం తోడ్పడినందుకు భక్తితో నమస్కరించారు. పోలీసులు తలపై గట్టి నిఘా ఏర్పరచారని తెలిసికొన్న లచ్చన్న తన కేంద్రాన్ని మార్చి హరిపురం వద్ద మదనాపురం కొబ్బరితోటలోనికి వెళ్లారు. కొబ్బరితోటలోనికి రైతులు వచ్చే ఏర్పాటు చేసుకున్నారు. బహు సన్నిహితంగా ఉన్నవారే.

ఎచ్చట ఉన్నా లచ్చన్న గారికి భోజనం ఒక పెద్ద సమస్యగానుండేది. పల్లెటూరిలో వండించి తీసుకుని వెళ్లడం రహస్యంగా జరిగేపనికాదు. పల్లెజనం ఎప్పుడు పల్లెలో ఏమూల ఏది పడుతుందా ? ఏం జరుగుతుందా ? అని నిత్యం కనిపెట్టుకొని ఉండే మనస్తత్వం. అంతకు మించినపని వారికిలభించదేమో. తోటలోనే బెడ్డలతో రాళ్లతో పోయి పొక్కళ్ళు పెట్టి దొరికిన వస్తువు లేదా దానిపై వేడి చేసుకుని తినడం వీలయినపుడు వండివార్చి తినడం, స్నానం చేయడం, బట్టలు మార్చుకోవడం ప్రతీమారు జరిగే పనిగాదు. గెడ్డగీసుకోవాలన్న తలంపేలేదు పెనువృక్షంలా పెరుగుతూనే ఉంది. అన్వేషణలో వ్యక్తి ఉన్నపుడు ప్రకృతిని జయిస్తూ పోవటానికి ఉద్యమిస్తూనే ఉంటాడు.

గుల్లలపాడు పోలీసులకు ఆచూకి తెలిసిందని లచ్చన్న గ్రహించి మరుక్షణం కాశబుగ్గ వద్దగల నల్లలపాడుకి వచ్చారు. రైతురక్షణ సంఘాలు బలంగా ఉన్న చోటపల్లెల్లోనే రహస్యంగా ఉండి ఉద్యమాన్ని తీవ్రతరం చేసేవారు.

## నరసన్నపేటలో బర్మాకాందిశీకుల రక్షణసంఘం :

విశాఖపట్నం లోను రంగూన్‌లోను జపనీయులు బాంబుల వర్షం కురిపించారు. కళింగపట్నం - బారువారేవుల నుండి బర్మా రంగూన్ చేరిన భారతీయులు యుద్ధవాతావరణానికి భయపడి భారతదేశానికి వచ్చారు.బర్మా కాందిశీకులు జాబితాలో వారెల్లా చేరిపోయారు.

వారికి రక్షణ కలిగించాలి. తను అండర్‌గ్రౌండులోనున్న రంగాగారిని పలాసా తెప్పించి, అండర్‌గ్రౌండులో తను పనిచేసి బర్మా కాందిశీకుల మహాసభను "నరసన్నపేట" లో జరిపించారు.

బర్మా కాందిశీకుల రక్షణ సంఘం ఏర్పాటయింది. ఆ సంఘం భారతదేశానికి మరలివచ్చిన కాందిశీకులకు అన్ని విధాలా తోడ్పడుతూ తగురక్షణ - సౌకర్యాల్ని కలిగించేది. ఆపదలో వారిని ఆదుకొనటానికి ఆ సంఘం రూపొందింది.

**కొమ్మపరియాపల్లి :** పాతపట్నం తాలూకా కొమ్మపరియాపల్లి సమావేశం జరిగింది. జిల్లా అజ్ఞాతవాసులు సమావేశమయినారు. కన్నేపల్లి మల్లిపురం కొండనున్న కన్నేపల్లి సాంబమూర్తి గృహంలో సమావేశం జరిగింది. ఆ సమావేశంలో క్విట్ ఇండియా ఉద్యమాన్ని ప్రజ్వరిల్లి జేయటానికి కొన్ని నిర్ణయాలు తీసికొన్నారు.

## అండర్‌గ్రౌండ్ పోరాటం :

ఉత్తర విశాఖలో శ్రీకాకుళం దగ్గరగల పురుషోత్తపురంలో రాజకీయ పాఠశాలను కిల్లి అప్పలనాయుడుగారి ఆధ్వర్యమున అండర్‌గ్రౌండులోనే లచ్చన్న ఏర్పాటు చేసారు, మహావైభవంగా 20 దినములు రాజకీయ

మహాసభలు జరిపించారు. భారతీదేవి రంగాను, గోగినేని లక్ష్మీనారాయణు ఆహ్వానించి సభలు జరిపించారు. సభలు జరుగుతున్నందువలన పోలీసులు పసికట్టారు. ఆ గ్రామంలోసమావేశం ఒక పట్నాయక్ గారితో ఒక పాఠశాలలో నడిచింది. పోలీసులు దాడి చేస్తారన్న వార్త అరచింది. లచ్చన్న వెంటనే అప్పలనాయుడుగారు స్వగ్రామం ప్రక్కనున్న పూరిగుడిసెలోకి మారుతారు. పోలీసులు మారువేషాలతో అప్పలనాయుడు గారింటికి వచ్చి వాళ్లబ్బాయిని మంచినీళ్లవ్వమని అడుగుతారు. విషయం తెలుసుకున్న లచ్చన్న అప్పలనాయుడు గార్ల ఇంటివెనకవైపునుండి బయలుదేరి పురుషోత్తమపురం విడిచి, ఏరుదాటి తోటాడ తోటలోనికి వస్తారు. ఆతోటలో ఒక చెట్టెక్కి కూర్చొంటారు లచ్చన్న.అప్పలనాయుడుగారు మరల నింటికిచేరిన తదుపరి పోలీసులు ఇంటిని సోదా చేసారు. తరువాత లచ్చన్న తోటాడ బెండి సూర్యనారాయణ గారింట్లో కొన్నాళ్లున్నారు.

పురుషోత్తమపురం : పురుషోత్తమపురం కిల్లి అప్పలనాయుడు గారి స్వగ్రామం, ఏవిషయానికి కేసరిలా విజృంభించి వీరవిహారం చేయగల గుండెధైర్యం గల కార్యకర్త అప్పలనాయుడు లచ్చన్నగారికి కుడిభజం, ఉద్యమాన్ని నడపడంలో.

ఆగ్రామం అప్పలనాయుడు గారి కనుసన్నలలో మెలగేది అతడన్న ఆగ్రామస్తులకంత ఆదరణాభిమానాలుండేవి. అండర్‌గ్రౌండ్ పోరాటం సలుపుతూ తన గ్రామం ఏ తెంచిన లచ్చన్నగారికి ఉద్యమ నిర్వహణలో తోడ్పడినాడు.

రైతుల అధ్యయన కేంద్రం గ్రామంలో తెరవాలి, సాయింత్రం రైతాంగాన్ని సమావేశపరచండి. "లచ్చన్నగారనగానే అప్పలనాయుడు గారు మొదట నసిగారు". నిజమే లచ్చన్నగారూ, ఆ పోలీసు నాకొడుకులు అమాంతం వచ్చి పడితే మీరు దొరికిపోతారేమో చూడండి. అన్నారు అప్పలనాయుడు.

లచ్చన్నగారు నవ్వుతూ అన్నారు. మీరు అధైర్యపడుతున్నారేమిటి, ఫరవాలేదు, మాగ్రామం ముందు కొంతమందిని కాపలాపెట్టండి. గ్రామంలోనికి

ఎవరైన వస్తున్నారని తెలియగానే మవసమావేశాన్ని ముగిద్దామన్నారు అచ్చన్న. "మరి మీ మాట" అప్పలనాయుడు అడిగారు "వాళ్లనుండి తపించుకునే మార్గం నాకుంది" అన్నారు అచ్చన్న. నాయుడు కాదనలేక సాయంత్రం రైతులు వచ్చి చుట్టుకూర్చున్నారు. మధ్యలో అచ్చన్న, నాయుడు.

ఇంతలో వారు గ్రామం ముందుంచిన కాపలాదారులు వచ్చి పోలీసులు గ్రామంలోనికి వచ్చారని చెప్పారు. ఆమాట విన్న రైతులు ఆందోళన పడిలేవబోయారు. అచ్చన్నగారు లేచిగట్టిగా చెప్పారు. ఏఒక్కరు కదలకండి. నాయుడుగారు మీరీ మీటింగును కండక్టు చేయండి. వారడిగితే మేమే రైతులం కూడి ఏదో చర్చించుకుంటున్నామని చెప్పండి. అంటూ అచ్చన్నగారు సభ నుండి తప్పుకుని వెలుపలికి వచ్చారు.

అచ్చన్న వెంట వెళ్లదలచిన ఒకరిద్దరిని వారించారు. మీరెవరూ రావద్దు, నేనివీధిలో నుండి వెళ్లి ఎచటనో దాక్కుంటాను. మీరు వెళ్లండి. అచ్చన్న వెళ్లిపోయారు. ఇంతలో పోలీసులు వచ్చారు. "ఎవరిచ్చట మీటింగు పెట్టేది అన్న ప్రశ్నకు మేమే బాబూ రైతులం" అంటూ వయసు మళ్లిన రైతులు జవాబిచ్చారు.

అచ్చన్న ఈ ప్రాంతంలో ఉన్నాడని తెలిసింది. మాగ్రామంలోనే ఉన్నాడని కూడ తెలిసింది. ఎచ్చట ఉన్నారో చెప్పండి లేదా మీ ఎముకలను విరగదన్నుతాం అంటూ తుపాకులమడమలనెత్తారు రైతులపై.

అచ్చన్న గారిని ప్రభుత్వమే జైల్లో పెట్టిందని విన్నాం బాబూ. చాలాకాలం నుండి మాకు కనిపించలేదు. ఒక ముసలిరైతు ప్రశ్నించారు.

ఏం [illegible]తున్నావా, పోలీసు, జైల్లోనే అచ్చన్న ఉంటే అతనికోసం [illegible] పడిగాపులు పడి తిరగాలి.

[illegible] చెప్పిందంతా చెబుతారా ఏమిటి?

లచ్చన్నగారికి ఏంజేసారో ఏమిటో అని ఆరైతు అనగానే తుపాకీ మడంతో ఒక పోటు పొడిచాడు. పోలీసు అప్పలనాయుడుగారు అడ్డుపడ్డారు. "మావాడు ఏంచేసాడని, కొట్టిచంపుతున్నారు అన్నారు. ఇంతలో పడిలేచిన రైతు, నడివయసులో ఉండే పంతం పౌరుషం కలవాడు గాంధీజీ గారికీ జై, భరతమాతా జందాబాద్ అని అరవగానే ఒక్కపెట్టున రైతులంతా జై అని కేకపెట్టారు.

వచ్చిన పోలీసులు లోలోన ఉడుక్కున్నారు. వారినందరినీ ఏంచయటానికి వారికి ఆసరికి ఉత్తర్వులు లేవు. జైల్లోకి పదండీ అంటే రావటానికి సిద్ధమే అన్నట్లుంది వాళ్ల వ్యవహారం.

అందుకు ఏడుపు మొఖాల్లోనికి నవ్వుతెచ్చుకుని, దుక్కిదున్నే రైతులు మీరు, మీరు జై అంటే స్వరాజ్యం వచ్చేస్తుందిరా భికారుల్లారా " అన్నారు పోలీసులు.

అప్పలనాయుడుగారు అసలే తీవ్రవాది అడ్డుపడి మాట్లాడాడు. మీరునోటికి వచ్చినరీతిగా మాట్లాడకండి అరుష్టుచేయాలన్న మమ్మల్ని అరెష్టుచేసితీసికుని వెళ్లండి. "మీరు చదువుకున్నవాళ్లు రైతుల జై అన్న స్వరాజ్యం వస్తుందా అన్నారు దేశమాతకీ 'జై ' అన్న జనావళికి "జై" అనేకదా, జనమే దేశంకదా ! తనకు తనే వినదిస్తే తప్పా, ముందుకురికితే తప్పా, మా స్వరాజ్యం మాకే వస్తుంది" అప్పలనాయుడుతో వాదన ఎందుకని పోలీసులు జారుకున్నారు, వీధుల్లో ఇళ్లల్లో జూచారు, నిరాశయులై వెడలిపోయారు.

అందరూ లచ్చన్నగారెచ్చట అని వెదక నారంభించారు. ఇంతలో పశువులశాలనుండి దాని అటక మీద నుండీ దిగుతున్నారు లచ్చన్నగారు. ఆ అటకమీదనే వరిగడ్డినిమీద వేసుకుని ఎవరికీ కనపడకుండా దాక్కొని యున్నారు.

లచ్చన్నగారు కలకత్తాలో భారతీదేవి రంగాతో కలిసి రాజకీయ చర్యలు ముగిసిన తదుపరి, మద్రాసులో సంగం వాహినీ పత్రిక ఆఫీసు కెళ్లారు. రంగాగారు రైతోద్యమానికి ఊపిరినిస్తున్న పత్రిక వాహిని అప్పటి

కొన్నాళ్లున్నారు. ఆ పత్రికాధిపతి పండితారాధ్యులు నాగేశ్వర్రావు. మరల మద్రాసు నుండి ఉత్తర, విశాఖజిల్లా చేరుకున్నారు. ఈ కాలంలో రంగాగారు జైలులో ఉన్నారు. ద్వితీయ ప్రపంచయుద్ధం ముగింపులో బ్రిటిష్ కాంగ్రెస్ నాయకులను ఓదార్చటానికి ప్రయత్నించింది. ఈ సందర్భంలో రంగాజీ జైలునుండి విడుదల అవుతారు.

రైతు అధ్యయన కేంద్రాలు :- లచ్చన్న మరల విశాఖ జిల్లాలో ప్రవేశించిన తదుపరి గ్రామాల వెంట తిరగడం ప్రారంభించారు. వెళ్లిన గ్రామం వెళ్లకుండా తనున్న దెచటన్నది తెలియకుండా కార్యక్రమం రూపొందించి రైతు రక్షణ సంఘాలు లచ్చన్నగారి కవచాల్లా ఉపయోగపడినాయి. రైతు అధ్యయన కేంద్రాల స్థాపన ప్రారంభం రైతు రక్షణ సంఘాలు జమీందారులను ప్రతిఘటించి తమ హక్కుల సాధన కోసం రైతు అధ్యయన కేంద్రాలు రైతోద్యమంలో రైతును భాగస్వామ్యం చేసి చైతన్యపరిచి దేశస్వాతంత్ర్యోద్యమానికి మద్దతునిచ్చే బలీయమైన శక్తినిచ్చే సాధనాలుగా రైతు అధ్యయన కేంద్రాలను ప్రారంభించారు లచ్చన్నగారు.

లచ్చన్నగారు అండర్‌గ్రౌండ్‌లో నుండగా లచ్చన్నగారి చిరునామా అనుచరులనుండి రహస్య పద్ధతిలో సేకరించి, లచ్చన్నగారిని స్వయంగా కలిసి మాట్లాడటానికి రైతురంగాగారు ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు వర్కింగ్‌కమిటీకి హాజరై అక్కడనుండి కలకత్తా చేరుకుని మెయిల్లో వచ్చి పలాస స్టేషన్‌లో దిగారు, తన పెట్టె బెడ్డింగును స్టేషన్ మాస్టరు రూంలో ఉంచి, పాసింజరులో లచ్చన్నగారున్న దగ్గర స్టేషన్ దిగారు.

అచటనుండి ఏఒక్కరిని వెంటనిడుకొనక ఒక్కరే అడ్డదారిని నడచి మధ్యాహ్నం 2 గంటలకు లచ్చన్నగారున్న రహస్య స్థావరానికి చేరుకున్నారు రంగాగారు. అల్లంతదూరాన నుండి ఎదురుగా వస్తున్న రంగాజీని లచ్చన్నగారు జూచి పోల్చుకోలేకపోయారు. ఎవరేమోనని భయపడ్డారు కూడా.

ఉత్తరీయాన్ని తలకు చుట్టి పంచకట్టు కట్టి పంచెపైకి దోపారు ఎవరో బక్క రైతులా వచ్చి లచ్చన్నగారి ముందు నిలచారు. తలగుడ్డ [illegible] లచ్చన్నగారు రంగాగారికి గుర్తించలేదు.

రంగాజీకి భక్తితో నమస్కరించారు, అచ్చన్నగారు. దగ్గరగా వచ్చి భుజం తట్టి ఉద్యమం కొనసాగుతున్నది కదా. అని అడిగారు.

"మీ దయవలన రహస్యోద్యమాన్ని చేతనయినంత మేరకు నడిపిస్తున్నాను".

"నీ శక్తి యుక్తులు నాకు తెలియనివా అచ్చన్నా, చేయవలసిన పనికన్న రెట్టింపు పని చేసి పెట్టగల సాహసివి. ఉద్యమదారుడవు నీతో రహస్యంగా చర్చించాలని వచ్చాను."

"ఆదేశించండి తప్పక ఆచరిస్తాను,"

అచ్చన్నగారూ, ఒక ప్రజాఉద్యమం త్వరలో రానున్నది మూకుమ్మడి ప్రజాసత్యాగ్రహం జరుపవలసి ఉంటుంది. ప్రజలను కార్యకర్తలను మీరు సిద్ధం చేయాలి"

"తప్పక చేస్తాను" అచ్చన్న అన్నారు.

"కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో ప్రస్తావనకి విషయం వచ్చింది గాంధీజీ తన హరిజన పత్రికలో కూడ పరదేశీయులను భారత్‌నుండి వెళ్లగొట్టవలసియుంటుందన్న అర్థంతోవ్యాసాన్ని వ్రాశారు కూడా" రంగా.

"గాంధీజీ ఆమేరకు తీర్మానం చేసాక కాంగ్రెస్ పార్టీలో కాదనేవారెవరుంటారు." అదే ఆలోచన ఉంది. మౌలానా అబుల్ కలామ్ ఆజాద్, నరేంద్రదేవ్, మహదేవ్ దేశాయ్ - నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్, మన ఆంధ్ర తమిళ నాయకులు మనమంతా గాంధీజీని అనుసరించ సిద్ధంగానే ఉన్నాం ఈ విషయంలో కాంగ్రెసు వర్కింగ్ mass struggle వైపే మొగ్గు చూపింది. ఈ సంవత్సరం (1942) లో జరిగిన వర్కింగ్ కమిటీలో ఇదే విషయం చర్చించబడుతూ ఉంది. రాబోయే సమావేశంలో ప్రవేశపెట్టబోయే క్విట్ఇండియా తీర్మానానికి బలమైన పునాదులు పడ్డాయి. మీరంతా సిద్ధంగా సుండాలి, అని చెప్పి ఆదినం అచ్చన్నగారితో ఉండి మరునాడు పలాసా చేరుకుని మెయిల్లో మద్రాస్ చేరుకున్నారు.

## క్విట్ ఇండియా తీర్మానం :-

రంగాగారు వెళ్లిన తదుపరి అచ్చన్నగారు తన అండర్‌గ్రౌండ్

స్థావాన్ని మార్చారు. తీరప్రాంతంలోనున్న కళింగపట్నం చేరుకున్నా తనరాజకీయ గురువు రంగాగారి ఆదేశం మేరకు రైతులను రహస్య సమావేశపరచి రాబోయే మాస్ట్రగుల్‌లో పాల్గొనాలన్న ప్ర... అందించారు. వెళ్లినచోటల్లా ప్రజల్ని ప్రోగుచేసి దేశభక్తిని ప్రదర్శించవలసిన సమయమాసన్నమైందని ప్రసంగించారు.

1942 ఆగస్టు నెల 7వ తేదీన బొంబాయిలో ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సమావేశమైనదని చరిత్రాత్మకమైన క్విట్ ఇండియా తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి చర్చ ప్రారంభించింది. క్రిప్సు రాయబారం విఫలమవడంతో కాంగ్రెసు నాయకులు గ్రహించారు. బ్రిటిష్ ... మోసగించే విధానమని స్వాతంత్ర్యాన్ని ఇవ్వటానికి అంగీకరించరని 1942 ఆగస్టు నెల 8వ తేదీన రాత్రి "క్విట్ ఇండియా" తీర్మానం బలపర్చి వర్కింగు కమిటీ ఏక గ్రీవంగా ఆమోదించింది. తెల్లదొరలు ఇండియానుండి వెంటనే వెడొలగాలని ఉద్ఘాటించింది. ప్రజలందరిని ఉద్యమంలో పాల్గొనవలసిందిగా కోరింది. తీర్మానం ఆమోదించిన మరుక్షణమే ప్రభుత్వం వర్కింగు కమిటీ సభ్యులందరినీ అరెస్టు చేసింది. ఒక స్పెషల్ ట్రయిన్‌లో వర్కింగు కమిటీ సభ్యులందరిని తీసుకొని వెళ్ళి పూనాదగ్గరలో ... చించువార్డ్ వద్ద ఉంచింది. గాంధీజీని ఆగాఖాన్ ఇంట్లో నిర్బంధించింది. ... పూనాలో నిర్బంధించింది. సరోజినీ నాయుడుని అహ్మమద్‌నగర్ కోట్లలో బంధించింది.

కాంగ్రెస్ పార్టీకి క్విట్‌ఇండియా తీర్మానాన్ని ఆమోదించినట్లూ ... పోరాటానికి సిద్ధపడమని ఆదేశమిచ్చినట్లు ఆల్ ఇండియా రేడియో ... వార్తలో ఆగస్టు 8వతేదీ రాత్రి తెలిపింది. దేశనాయకులందరినీ బ్రిటిష్ ప్రభుత్వం నిర్బంధించినట్లు పేర్కొన్నది.

గాంధీజీ అభిప్రాయాన్ని గాంధీజీ కార్యదర్శి ప్యారేలాల్ దేశ ప్రజలకు అందించారు. ప్రతి ఒక శాంతియుత స్వాతంత్ర్య సమరయోధుడు స్వాతంత్ర్యం సాధిస్తాను లేదా స్వాతంత్ర్య సాధనం కోసం అసువులనర్పిస్తాను ... నినాదాన్ని తమ ధరించిన [illegible] ...

దేశనాయకులందరినీ నిర్బందించినట్లు తెలియగానే యావత్ భారతప్రజానీకం సింహగర్జనల్ని చేయముందుకురికింది. రవి అస్తమించని తెల్ల రాజ్య · రధచక్రాలను కదలించ మాటువేసింది. దేశంలోనున్న ఆబాలగోపాలం స్వాతంత్ర్య సమర రణరంగంలో కాలిడ సిద్దపడింది.

"బ్రిటిషు పాలకులారా ఇండియానుండి వైదొలగండి లేదా ప్రాణాల్ని తీయండి అని ప్రభుత్వంపై విరచుకుపడుతున్న ప్రజావెల్లువను ప్రభుత్వం తట్టుకోలేక పోతున్నది. ఆగష్టు నెల 9వతేదీన భారతదేశమంతా అగ్ని జావలలా ఎగిరిపడింది. ఒక్కొక్కరు పళ్ళు బిగించి పిడికిళ్ళు బిగించి ప్రభుత్వ కార్యాలయాల్ని ప్రభుత్వ స్థలాలను ధిక్కరించ ముందుకడుగేనారు. రైలు వంతెనల్ని రైలు స్టేషన్లను దగ్దంచేస్తున్నారు. పోలీసు స్టేషన్లను పోస్టాఫీసుల్ని తగలబెడుతున్నారు. పెద్దపెద్ద కర్మాగారాల్ని దగ్గంచేస్తున్నారు. ప్రభుత్వం పతనమై పోవాలి ప్రభుత్వాన్ని దిగ్బందించాలి ప్రభుత్వం దిగ్బందించిన మననాయకులు విడుదల కావాలి ప్రజాతిరుగుబాటు ఉడుకెత్తిన ఉప్పెనలా విజృంభించింది. జైమహాత్మా గాంధీకి జై, జై భారతమాతాకు జై అని నినాదాలు భూలోకాలకు దద్దరిల్లేలా లేచాయి.

దేశంలో విప్లవ పోరాటం చెలరేగింది. ఆంధ్రలో పౌరుషానికి ఏ ఒక్కరికి తీసిపోరు. ఆంధ్రుల ప్రతాపాగ్నిని ఎన్నో ప్రభుత్వాలు లోగడ రుచిచూసే ఉన్నాయి.

ఆంధ్రతీర ప్రాంతంలో విప్లవం చెలరేగింది. సమ్మెలు హర్తాల్ విజృంభించాయి. ఆగష్టు 12వ తేదీన తెనాలి కాల్పుల్లో 9 మంది, గుంటూరులో 13 మంది, భీమవరంలో 17 · మంది మరణించారు. జైళ్ళలోనికి వెళ్తున్న దేశభక్తుల సంఖ్య వేలకు వేలు మించి పెరిగిపోతున్నారు. మాకు స్వరాజ్యం యివ్వండి, మానాయకులను విడచి పెట్టండి లేదా మమ్మల్ని నిర్బందించండి అంటూ ముందుకు వస్తున్న జనవాహిని, ఏ జైలులో బంధించగలరు వీరందరినీ బంధించి జైళ్ళలో పడవేయటానికి ఉన్న జైల్ల పంఖ్యలన్ని బ్రిటిషు ప్రభుత్వం లోన హడలెత్తి పోతున్నది. విప్లవాన్ని ఎలా త్రిప్పికొట్టాలో ఆలోచిస్తూ ప్రతీకార చర్యల్ను తీవ్రంగానే తీసుకుంటున్నది.

ఉద్యమం క్విట్ఇండియా ఉద్యమం విజృభించి తారాస్థాయికి చేరిందని అచ్చన్నగారు కళింగపట్నంలో నుంటూ రేడియోద్వారా విన్నారు. ఎదురు చూస్తున్న ఉద్యమం రానే వచ్చింది. ఇక తనవంతు వచ్చింది. ఉద్యమాన్ని తీవ్రతరం చేయాలన్న ఉద్రేకంతో ఊరూర తిరిగి జనాన్ని ప్రోగుచేసారు. అసంఖ్యాక కాంగ్రెసు కార్యకర్తలు అచ్చన్న చుట్టుముట్టారు. తనున్నది అండర్‌గ్రౌండ్‌లోనన్నది విస్మరించారు. అచ్చన్న ఎవరైనా స్తాడోరాని వాడ్ని ఎదిరించి ఎదురు దెబ్బతీస్తా అన్న ధోరణిలో ఆనాటి నడిచింది. అచ్చన్న ఆనాటి పల్లెటూళ్లో రచ్చబండలపై రాజకీయ ప్రకాశిస్తున్న దినాలు అచ్చన్న చెప్పిందే వేదమని భావిస్తున్న ప్రజానీకం రైతాంగం.

ప్రజలంతా దేశస్వాంతంత్ర్యాన్ని తెచ్చుకోవాలన్నదే ప్రభావం పెంచుకుంటూ "గందకంలా" ఉండేవారు. అచ్చన్నగారు వెళ్ళి "రంజకం" లా పనిచేసి గుప్పుమనిపించేవారు. అగ్నిజ్వాలలు ప్రభుత్వ ఆస్తులు వగైరాలు అందుకు ఆహుతి కావడం సర్వసాధారణ విషయంగా విశాఖజిల్లాలో మారింది.

నిజానికి అచ్చన్నగారు వెళ్ళినందుననే ఆ ఉద్యమం అచ్చట ప్రబలిందని ఉద్యమం ఇచ్చట నిలిచి కాలిడినది అన్నది ఏ ఒకరు నిలచి నిర్ధారణపరచలేనిది. అచ్చన్నగారున్నది అండర్‌గ్రౌండ్‌లో కదా ఎవరికిమాత్రం ఎలా ఏమెరుక, ఏమి జరిగిందని, ఎవరు వేశారని, విద్యార్థులు తారాజువ్వలుగా పనిచేస్తు జైభారత్‌కే జై అంటూ నినాదాలు వీధుల్లో పడి చేస్తున్నారు. జైల్లోకి వెళ్తున్నారు రైతాంగం. జైమహాత్మాకి జై అంటూ చెరశాలలో దూరుతున్నారు. విద్యాధికులు వీరత్వంతో ముందడుగు వేస్తున్నారు. ఉద్యోగులు కూడ ఎందరో వారి ఉద్యోగాలకు తిలోదకాలిడి ఉద్యమంలో దూరిపోతున్నారు. మహిళల్లు కూడ చేత జండాలని ధీకొని వీధుల్లోనికి దిగి పోరాటానికి సిద్ధపడుతున్నారు. దేశం అంతా విప్లవాగ్ని జ్వాలలు ప్రసరిస్తున్న దినాలవి. బ్రిటిషువారిని అంతం చేయాలన్న ప్రతీకార దాహాన్ని.

మొదట్లో రెండవ ప్రపంచయుద్ధం సామ్రాజ్యవాదుల [illegible] తెగడిన భారతకమ్యూనిస్టులు రష్యా దేశం అమెరికా

బ్రిటనులతో కలసి జపాన్‌లో యుద్ధానికి తలపడేసరికి రెండవ ప్రపంచయుద్ధాన్ని గట్టిగా సమర్ధించారు. స్వేచ్ఛా సమానత్వాన్ని ప్రపంచంలో నిలబెట్టటానికి నియంతృ నాజిజర్ పాసిజం"తో జరుగుతున్న యుద్ధంగా పేర్కొన్నారు.

కమ్యూనిష్టుల అభిప్రాయం తమకు అనుకూలంగా మారినందున జైల్లోనున్న కమ్యూనిష్టు నాయకులను విడచి పెట్టారు. పి.సిజోషీ, రణదివే, డాంగేను జైళ్ళనుండి విడచి పెట్టారు. ఆంధ్రలో పుచ్చలపల్లి సుందరయ్య జొన్నలగడ్డ రామలింగయ్యను, కంభంపాటి సత్యన్నారాయణ, చుండి జగన్నాధం వగైరా కమ్యూనిష్టులు విడుదలైనారు. ద్వితీయ ప్రపంచ యుద్ధం జరుగుతుండగానే బోసుబాబును జైల్లో నిర్బంధించడం అనారోగ్య కారాణాలవలన (నిరసన వ్రతం పూనినందును) విడచిపెట్టడం జరిగింది.

ఇంటికి చేరిన సుభాష్ చంద్రబోసు తన జీవనవిధానాన్ని మార్చినారు. నిత్యంధ్యానంలో నిమగ్నమైనారు. ఎవరూ దర్శించటానికి వీల్లేదు. భగవధ్యానం తప్పించి మరి ఏ ఇతరసక్తిలేదని పత్రిక ప్రకటనలు వెలువడినాయి. సీక్రెట్ పోలిసులు కూడా బోసు ఐహిక సుఖాలనుండి దూరమై ఆధ్యాత్మిక ప్రంచానికి అడుగిడబోతున్నట్లు భావించారు.

ఈ పరిస్థితులలో సుభాష్ బోసు ఒకరాత్రి పఠాన్ వేషం వేసుకొని ఇండియా కనుమల ద్వారా కాబోలు నగరానికి చేరుకున్నారు. "కాబాల్ బాబువలెనే తయారయి నిజాగారంబు వోనాడి "ఆఫ్ఘనిస్థాన్‌లో ఆసరికే సిద్ధంగానున్న జర్మన్ వైమానిక దళం అంపెన విమానంలో జర్మనీ చేరుకున్నారు. హిట్లర్‌తో చేతులు కలిపారు. జర్మనీలో ఖైదీలుగా నున్న భారతీయులతో ఆజాద్‌హింద్‌ఫౌజ్ స్థాపించారు. ఆంగ్లేయులను దెబ్బతీయటానికిదే అదను అని భావించి జర్మన్, జపాన్ దేశాలతో కూడి సైనిక నాయకుని వేషం ధరించి యుద్ధరంగమున ప్రవేశించి సైన్యాలను బ్రిటిషు సైన్యాలకెదురుగా నడపి రణభేరీ మ్రోగించారు.

భారతదేశంపై జర్మనీ, జపాన్ దేశాలు దాడిచేయ వెనకాడాయి. భారతీయ ప్రవాస ప్రభుత్వాన్ని ఏర్పరచి ప్రకటించిన నేతాజీ ఆజాద్ హింద్‌ఫౌజ్ వీరులతో బ్రిటిష్ వారిని ఎదుర్కొంటున్నాడుకదా ఆ

విప్లవాగ్నికిది ఆజ్యంలా ఉపయోగించింది. ఉత్తరాంధ్రలో కాంగ్రెసు పార్టీ ఉద్యమాన్ని పటిష్టపరచి ఉధృతం చేసింది. అసంఖ్యాక దేశభక్తులు ఉద్యమంలోకి దూకారు.

క్విట్ఇండియా తీర్మానాన్ని ఆల్ఇండియా రేడియో ప్రసారం చేసింది. అపరికి కళింగపట్నం వద్ద గల పల్లెపేటలో కప్పగంతుల సుబ్బారావు గారింట్లో లచ్చన్న గారున్నారు. వెంటనే లచ్చన్నగారు ఉద్యమం తీవ్రతరం చేసారు. మరునాడుకల్లా రాజబాల రెడ్డి ముఠాను, అప్పారావును వెంట పెట్టుకొని కళింగ పట్నం పోస్టాఫీసుపై దాడి చేసారు. స్టాంపులను స్వాధీనం చేసుకొని కుర్చీలను విరగొట్టగా ఉన్న డబ్బును చిందర వందర చేసారు.

లచ్చన్న ప్రభృతులు క్విట్ ఇండియా ఉద్యమాన్ని తీవ్రరూపం దాల్చాలన్న ఉద్రేకంతో కలకత్తా నుండి మద్రాసు మందుగుండు సామానులు ఆయుధాలు తీసుకొని పోతున్న మిలిటరీ గూడ్సు ట్రైనును పడదోయుటకు రైలు పట్టాలను తొలగించారు. ఇందుకు తనతో సహకరించిన సహచరులు మారుప్రోలు రాజారావు, దుమ్ము గురుమూర్తి, హరి నారాయణ, లోలాండరాదూ ముకుందరావు, కర్ర అప్పారావు, పర్యవసానంగా ప్రభుత్వం లచ్చన్న సోదరుడు సత్యనారాయణ గారిని, కర్ర అప్పారావును, దూర్ల బషావాను ఆటవ్యాలగా బంధించి, తంజావూరు జైల్లోకి పంపించారు. అంతేగాక బ్రిటిష్ ప్రభుత్వం లచ్చన్న గార్ని పట్టి ఇచ్చిన వార్కి, కోరిన ఉద్యోగం ఇవ్వడమేగాక పదివేలు బహుమానము ఇస్తామని ప్రకటించారు.

లచ్చన్నగారు అండర్గ్రౌండ్ పోరాటంలో తమ ఉద్యమాన్ని తీవ్రం చేసారు. బత్తిలి వద్దగల తహసీల్దారు ఆఫీసును తగులబెట్టారు. పాలకొండయాలో గల గవర్నమెంటు బంగళాలన్నింటిని తగులబెట్టడానికి ... పేటలో ఉన్న ఉప్పు డీలర్ పొట్టూరు సాంబాబు పెద్దలు ... లక్ష్మణమూర్తి వద్దకు వెళ్లి ముఠాడు డబ్బాలు అయిలు, పెట్రోలు ... ఇంతవరకు చిన్న చిన్న సంఘటనలు. తగులబెట్టడాలు ... సంఘటన జరగాలన్నది తలంపు.

[illegible]

[illegible] గవర్నమెంటు ... లచ్చన్న ...

కాల్చివేయమని ఆర్డర్సు జారీ చేసింది.

ఈ పోరాటానికి కలకత్తా వెళ్లి మందుగుండు సామానులు తెచ్చుకోవాలా - లేక ఆసరుకే ధర్మతేజ వార్త వచ్చినందున మద్రాసు నుండి లభిస్తాయా అన్నది చర్చించడానికి కొమ్ము సరియాపల్లిలో సమరగ్రామం మల్లిపురంలో కన్నేపల్లి సాంబమూర్తి గారింట్లో జిల్లాస్థాయి సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పాల్గొన్నవారు గరియెల రమణమూర్తి, కిల్లి అప్పలనాయుడు, లూకలాపు లక్ష్మణరావు.

విశాఖజిలో బారువా ప్రాంతంలో రైలుపట్టాలు తొలగించబడ్డాయి. ఇది విద్రోహచర్యగా పత్రికలో ప్రకటించబడినాయి. రైలుపట్టాలు కప్పింది ప్రభుత్వం నేరారోపణ చేసింది. అయితే కాంగ్రెస్ పార్టీ ఖండించింది అహింసాయుత పోరాటం, కాంగ్రెస్ ధ్యేమని త్రిప్పికొట్టింది.

బారువాలో ఉన్న లచ్చన్న అన్నగారు సత్యనారాయణ గారిని కష్టడీలోనికి తీసికొన్నారు. తన తమ్ముడు లచ్చన్న చేసిన పనే అని ప్రభుత్వం భావన - అండర్‌గ్రౌండులో ఉన్న తన సోదరుని అన్ని విదాలి తను సహాయపడుతున్నాడన్నది అతనిపై మోపిన అభియోగం.

ఒకనాడు ఒక ప్రాంతాన పోష్టాఫీసు వేరొకచోట తాలూకాఫీసు తగులబడినాయి. అండర్‌గ్రౌండులో నున్న లచ్చన్న మీదే ప్రభుత్వం కన్ను వెనుకనుండి వీటిని జరిపిస్తున్నాడేమో కాని సాక్ష్యాధారాలు ఏమి లభించలేదు. అయిన లచ్చన్నగారు కనిపిస్తే కాల్చివేయమని ప్రభుత్వంవారు ఉత్తర్వ్యులు జారీ చేసారు. పట్టియిచ్చిన వారికి 10వేలు రుపాయిల బహుమానం ప్రకటించారు. ఆనాటి కాలమున పదివేలు పదిలక్షలు కదా.

పర్లాకిమిడి, మందసాప్రాంతాల్లో తిరుగుబాట్లు ప్రజాందోళనలు, ఉమ్మడి పోరాటాలు.

కలెక్టరు సూపరింటెండ్ ఆఫ్ పోలీసు ఒక ఆర్డరు జారీ చేసారు. "అండర్ గ్రౌండులోనున్న లచ్చన్నను పట్టియిచ్చిన లేక తన జాడ నెరిగించిన పదివేల రూపాయిల్ని బహుమతిగా యిస్తారు. విశాఖజిల్లాల్లో

ఉద్యమం చల్లబడాలన్న అండర్‌గ్రౌండ్‌లోనున్న లచ్చన్న పట్టి బందించాలని ప్రభుత్వం తీవ్రమైన కట్టుదిట్టాలని చేసింది. అన్ని పోలీసు స్టేషన్స్‌కి వార్తలనందించింది.

ఒక చిరునామా తెలియని ముద్రణాప్రెస్ నుండి కొన్ని సంచికలు వెలువడుతూ ఉండేవి. కొన్ని సంచికలు విజయనగరంలో రంగచారి ప్రెస్‌లో రహస్యంగా అచ్చు అయ్యేవి. కొన్ని రహస్య ప్రదేశాల్లో రైతుల అధ్యయన కేంద్రాలు పని చేసేవి.

ఆ ఉద్యమం తొలిదశ గడిచింది. క్విట్ ఇండియా తీర్మానం మేరకు రెండవ దశను ఎలా నడపాలన్నది లచ్చన్న ప్రభృతులు ఆలోచనలో పడ్డారు. అంతవరకు తీవ్రంగా నడిచిన క్విట్ ఇండియా ఉద్యమం మధ్యలో కొంత ఊపు తగ్గిందేమోనన్న భయం కాంగ్రెస్ కార్యకర్తలలో కలిగింది.

ఇంతలో మద్రాసులో విద్యార్థిగా ఉన్న నేటి మన డా.ధర్మతేజ సంపత్‌కుమార్ మద్రాసులో ఒక సమావేశం జరుపుతున్నట్లు రమ్మని ఒక ఉత్తరం వ్రాసి సంపత్‌కుమార్ క్విట్ ఇండియా ఉద్యమంనడపటానికి ఆంధ్రా డిక్టేటర్ "లచ్చన్నగారూ" మీరు మరి కొంతమంది కార్యకర్తలు మద్రాస్‌లో జరగనున్న "దక్షిణదేశ ఉద్యమ డిక్టేటర్ల సమావేశానికి తప్పక హాజరు కావాలి.

మీరు మరి కొందరి ముఖ్యులను తీసికొని మద్రాసు నగరానికి చేరుకోవాలి. లచ్చన్నగారు ఉత్తరం చదివి ప్రక్కనున్న కిల్లి అప్పలనాయుడు గారికి విషయం వివరించాడు.

ఉత్తరాంధ్రలో అండర్‌గ్రౌండ్‌లో నుంటూ ఉద్యమం నడుపుతున్న లచ్చన్న మద్రాస్ నగరానిరిక ప్రయాణమమటానికి సిద్దమయ్యాడు కిల్లి అప్పలనాయుడు గారితో.

అదే సమయానికి విజయనగరం కాలేజీ విద్యార్థులు ఉద్యమానికి మద్దతుగా సమ్మె చేస్తున్నారు. అసరకే ఆ కళాశాలలో విద్యనభ్యసిస్తున్న త్రిపురాన తాపసదాసునుకి పున్నయ్య గారిని ప్రభుత్వం నిర్బంధించి జైల్లో పెట్టింది. విద్యార్థుల ఉద్యమం విఫలమవుతుందన్న వార్తను కూడ లచ్చన్న

విన్నారు.

అందువలన అప్పలనాయుడు గారిని మరికొందరిని తనవెంట బెట్టుకొని రహస్యంగా విజయనగరంలో కిలాంబి రంగాచారి గారింట్లో మీటింగు పెట్టి విద్యార్థి నాయకులను పిలిపించి వారికి ధైర్యం చెప్పి ముందడుగు వేయాలని ప్రభోధించారు.

విజయనగరం నుండి మద్రాస్ వెళ్ళి దక్షిణాదిడిక్టేటర్ల సమావేశంలో పాల్గొనాలన్నది లచ్చన్న అభిమతం. అప్పలనాయుడుగారు తనతో రావటానికి సిద్దమయ్యారు.

రాత్రి ఒక జట్కాను మాట్లాడి జామి వెళ్లి అచ్చట గల కాంగ్రెస్ నాయకుడు గొట్టిపాటి బుచ్చి అప్పారావును కలిసి ఉద్యమం గూర్చి చర్చించారు. వారి భవిష్యత్ కార్యక్రమాన్ని వివరించగా బుచ్చి అప్పారావు దీవించి విజయుడివై రమ్మని ఆశీర్వదించి అంపాడు.

జామినుండి ఒక నాటుబండిని ఏర్పాటు చేసుకున్నారు. ఎడ్ల బండిపై అడ్డమార్గాన అనకాపల్లి చేరుకొన్నారు. అనకాపల్లిలో డా.ధర్మతేజ గారి బావగారు శ్రీ శేషగిరిరావుగారున్నారు. వారింట్లో ఆనాడు బసచేసారు.

చౌదరి సత్యన్నారాయణగారిని ముందుగనే రాజమండ్రి అంపించి యున్నారు. వసతి ఏర్పాట్లు చూడమని సత్యన్నారాయణగారి తమ్ముడు ఆ సమయానికి రాజమండ్రిలో కో ఆపరేట్ ఆఫీసరుగా శిక్షణ పొందుతున్నారు. ఆయన తల్లిగారు అక్కడే ఉండేవారు.

అనకాపల్లిలో కొందరి ఉద్యమదారులను కలసి, ఉద్యమం తీవ్రతను పెంపొందించజేయగల ఆశ్యకతను వివరించారు.

*

అనకాపల్లి నుండి లచ్చన్నగారు కిల్లి అప్పలనాయుడు గారు రాజమండ్రి చేరుకోవటానికి రైల్వే స్టేషన్‌కి చేరుకొన్నారు. గమ్యస్థానానికి చేరిన తరువాత చేరువవుదామన్న తలంపుతో ఇరువురు రైలెక్కారు.

ఏదో చేద్దామని సాదిద్దామని ఏ ఒకరు నడవని దారిలో ఏ కొందరో

నడుస్తారు. అందరికిదీసాధ్యంకాదు, కొత్తదారిని త్రొక్కాలన్న గుండెబలం ఉండాలి. ఆశయసాధనలో నమ్మకం విశ్వాసం ఉండాలి. లక్ష్యాన్ని చేరుకోవాలన్న తపన ఉండాలి. తనలక్ష్య సాధనలోనే తన జీవితానికి తృప్తి ముక్తి ఉందన్న మానసిక ఔన్నత్యాన్ని అందుకోవాలి. అదే జీవిత పరమార్థం అని త్రికరణ శుద్ధిగా భావించాలి." ప్రగతి స్వేచ్ఛలు జీవకర్రలు" "ప్రొద్దు- పొడవని బ్రతుకు వ్యర్థం" పొద్దు గడవని బతుకనర్థం

# 22వ ప్రకరణము

# మూడవసారి రాజకీయ ఖైదీగా – లచ్చన్న

క్విట్ ఇండియా ఉద్యమానికి దక్షిణాది నుండి బలమైన ఊపునందించాలి క్విట్ ఇండియా ఉద్యమం రెండవదశను గూర్చి రహస్యంగా మద్రాసు దక్షిణాది రాష్ట్రాల కాంగ్రెస్ డిక్టేటర్ల కార్యకర్తల సమావేశ మవుతున్నది. ఆంధ్రా డిక్టేటర్ సంపత్ కుమారుగారు ఆ సమావేశానికి హాజరు కావలసినదిగా లచ్చన్న ప్రభృతులకు వర్తమానం పంపారు.

ఈవార్త ధర్మతేజ లచ్చన్నగారికందించారు. ఒకనాటి ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, నాయకుల బర్హంపూర్ నివాసస్థులు జాతీయవాదులు, జయంతి వెంకట నారాయణ భార్య తనయుడే ఈ ధర్మతేజ, స్వర్గీయ జయంతి ధర్మతేజ తదుపరి ప్రముఖ అంతర్జాతీయ పారిశ్రామి క వేత్తగా రూపొందిన విషయం మనకెల్లరికి విదితమే. ధర్మతేజ మద్రాసు నుండి బారువా చేరుకొని లచ్చన్న సహచరుడైన పుక్కల పార్వతీశాన్ని తీసుకొని సరాసరి పాతపట్నం తాలూకా కొమ్మసర యపల్లి గ్రామం ప్రక్కనున్న మల్లిపురం అనే సవర గ్రామంలో కన్నపల్లి సాంబమూర్తిగారింట్లో అండర్‌గ్రౌండ్ కార్యకర్తల సమావేశంలో లచ్చన్న గార్ని కలిసి ఈ వార్త నందించారు. ఈవార్త అందిన వెంటనే లచ్చన్న గారు మరికొందరు ముఖ్యులను తీసికొని మద్రాసు నగరానికి చేరుకోవాలని, విజయనగరం మీదుగా బయలు దేరారు. విజయనగరంలో విద్యార్థుల సమ్మెకు మద్దతునిస్తు అటనుండి జామికి చేరుకొని అనకాపల్లిని చేరుకొన్నారని మనం తెలిసికొన్నాం.

కన్నపల్లి సాంబమూర్తి, బెండిఅప్పలసూరి, పైడికురుములు, నందకృష్ణ మూర్తి, షిల్లా రాజులు రెడ్డి, ఇక ఆమోదించిన తీర్మానం గిరిజనులను సమీకరించి వారి తోడ్పాటుతో జిల్లా వ్యాప్తంగా ఒకే దినమున జిల్లా కేంద్రాల్ని. తాలూకా కేంద్రాల్ని సబ్ ట్రెజరీలను కొల్లగొట్టాలి అని ఆనాటి పథకం.

లచ్చన్న, అప్పలనాయుడుగారా దినం అనకాపల్లి నుండి బయలుదేరి రైలెక్కారు. రాజమండ్రిలో బసచేసి మద్రాసు వెళ్లాలన్నది వాళ్ల కార్యక్రమం.

రైల్లో లోయర్ బెర్త్‌పై నాయుడుగారు అప్పర్ బెర్త్‌పై లచ్చన్నగారు పడుకున్నారు. నిద్రపట్టడంలేదు దేశసమస్య తన సమస్య దేశంలో నాటికి అన్నీ సమస్యలే ఎడతెగని సమస్యలు ఆందోళనలు, స్వరాజ్య సాధనకు ఆటంకాలున్నవని తలమకొన్న దేశభక్తునికి నిద్ర ఎలా వస్తుంది.

మానవుని మనస్తత్వం నాయకుడయిన కవియైన ఈ మానసిక స్థితికి లోనవకతప్పదు. ప్రపంచ సమస్యలన్ని తన సమస్యలగా భావించే కవి శ్రీశ్రీ తన సమస్యనే ప్రపంచ సమస్యగా రూపొందించి రోదించే కవి కృష్ణ శాస్త్రి ఒకరు ప్రపంచానికి సమస్య వేరొకరు తనకు తనే సమస్య.చలం ఉవాచ -

దేశనాయకుని అంతరంగం దేశ పరిస్థితిపై పడింది. దేశ స్వాతంత్ర్యయోధుని ఆలోచన దేశమాత సంకెళ్ల నెలా త్రెంచబడతాయి. అవరోధాలను ఎలా గడచి గట్టెక్కాలి. తెల్లదొరలు దేశాన్ని కల్లోల పరుస్తున్నారు. దేశంలో గల విచ్ఛిన్నకర పరిస్థితులను విభేదాలను విదానాలను వారి స్వప్రయోజనాలకు వినియోగించుకొంటున్నారు.

"స్వేచ్ఛా సమానత్వాలకోసంపోరాడుతున్నాం. భారతీయులు మా బ్రిటిషు రాచరికానికి మద్దతు నివ్వాలి. గవర్నర్ జనరల్ అభ్యర్థన. ఎవరి స్వేచ్ఛా సమానత్వాలకు నెహ్రూ ఎదురుప్రశ్న.

"భారతదేశానికి స్వాతంత్ర్యాన్నివ్వండి మహాత్మాగాంధీ "ముస్లిం, హిందువులంటూ విభజన చేసి ఆ యిచ్చిన స్వరాజ్యమేదో ఇవ్వండి" ముస్లిం లీగ్ నాయకుడు జిన్నా

"బ్రిటిషువారిని అహింసాత్మకంగా ఎదిరించి భారతదేశం నుండి వెళ్ళగొట్టాలి" గాంధీ స్వాతంత్ర్యం సంపాదించాలి. ఆజాద్‌హింద్ ఫౌజ్ నాయకుడు సుభాష్ హిందువుల్లో సవర్ణులు తరతరాలనుండి మమ్ముల్ని మాలలని మాదిగలని దూరంగా పెట్టి అస్పృశ్యతను పాటించే మీ హైందవరాజ్యం మాకక్కరలేదు" అంబేద్కర్ గర్జన "ప్రపంచంలో రంగురూపభేదాలు విజృంభిస్తున్నాయి,

మనదేశంలో నీచమైన వర్ణవిభేదం కొనసాగుతున్నది. ఈ పరిస్థితి నెదుర్కోవాలి" మేధావి వర్గం.

లచ్చన్న దీర్ఘంగా ఆలోచిస్తూ ప్రక్కవైపు చూసారు. ఎవరో ఇద్దరు వ్యక్తులు తదేక దీక్షతో తనవైపె దృష్టిసారిస్తున్నట్లున్నది అంతరంగంలో వీరొక వేళ సీక్రెట్ పోలీసులేమో అన్నది మనసులో మెదలాడింది. మరల నిద్రించేలా నటించి కొంతసేపయిన తదుపరి మరల తలతిప్పి చూడగా వాళ్ళిద్దరూ తన వైపుచూస్తూ ఏదో తమలో తాము మాట్లాడుకుంటున్నారు.

లచ్చన్న ప్రక్కనుండి లేచారు. లేవటరీలోనికి జొరబడ్డారు. ప్రక్కనున్న అద్దాల్ని పగులగొట్టి లేదా ట్రయిన్ ప్రయాణం ఆగిన సమయంలో ట్రయిన్ నుండి గెంతి దౌడుతీద్దామన్న నిర్ణయానికి వచ్చారు. అయితే మనసులో మరల ఆరాటం బయలుదేరింది. ఇన్నాళ్ళు అండర్‌గ్రౌండులోఇంతకన్న దుర్ఘటన సంఘటల్ని ఎదుర్కోవలసి వచ్చింది. దూకటానికి వీలుపడక మరల వచ్చి తన బెర్త్‌పై పడుకున్నారు.

ఈలోగా రైలు తెల్లవారుఝామున 4 గంటలకు రాజమండ్రి చేరింది. గమ్యస్థానం చేరుకున్న సంబరంలో కొంతమంది గమ్యస్థానం చేరుకోవాలన్న ఆకాంక్షతో మరికొంతమందితో స్టేషన్ అంతా సందడిగా నుంది. లచ్చన్నను వెనుకనుండి పిలచారు. ఎవరోకాదు చౌదరి సత్యన్నారాయణ గారే ముగ్గురు స్టేషను నుండి తిన్నగా వారికోసం ఉద్దేశించిన బసకు వెళతారు. కాఫీ ఫలహారాల్ని సేవించటానికి ప్రక్కనున్న హెూటలుకు వెళ్లారు. వారేదో దూర ప్రదేశాల్లో నున్నామన్న భరోసాతో వాళ్లు ఉన్నది వచ్చేపోయేవారితో కూడుకున్న స్థలమని కూడ విస్మరించి పిచ్చాపాటి కబుర్లు ప్రారంభించారు.

నాయుడు రాత్రి ట్రయిన్ పై నీవు హాయిగా నిద్రపోయావు నాకంటికి మాత్రం కునుకు పట్టలేదు లచ్చన్న టిఫిన్ తింటూ అన్నారు.

"నీకు నిద్రపట్టడానికి దేశానికి స్వరాజ్యం రావాలికదా" సత్యన్నారాయణ వ్యంగ్యోక్తి విసిరారు.

"రాత్రి రైల్లో మేము వస్తుండగా ఇద్దరు వ్యక్తుల అదేపనిగా మమ్మల్ని

పరిశీలించడం చూసాను. నేనేదో భయపడి పోయాను. మనల్నివారు గుర్తించారేమోనని ఇంకాచూస్తే ఏమీలేదు అంటూ అందరూ నవ్వుకొని యింటికి మరలారు.

నాయుడు బడలికవలన నిద్రపోతున్నారు లచ్చన్నగారిది విరామమెరుగుక పరిశ్రమించే మనస్తత్వం. కలం పట్టి తను నడుపుతున్న రణభేరి పత్రికకు వ్యాసం వ్రాస్తున్నారు.

ఇంతలో బయటనుండి బూట్లు చప్పుడు వినబడింది ఎవరో ఏమో రాత్రివలె మరల అనుమానించడమేమిటని తనపనిలో తను నిమగ్నమై యున్నారు లచ్చన్న. లోనికి ప్రవేశించిన సబ్ ఇన్స్పెక్టర్ చేతిలో కర్ర ఆడిస్తూ ఎవరు మీరు ఎచ్చటనుండి వచ్చారు. ప్రశ్నిస్తున్న వారెవరా అని ముఖమెత్తి చూచారు లచ్చన్న. మనసులో గతుక్కుమన్న మొక్కవోని ధైర్యంగల లచ్చన్న ఏమీ చలించనట్లు "మేము రైతులం ఏంకావాలి మీకు?" లచ్చన్న కుర్చీలో నుండి లేవకుండానే ధీమాతో ప్రశ్నించారు. "మీరు ఎవరవ్వది మాకు తెలియాలి" ఇన్స్పెక్టర్ మాట హెచ్చరించారు చెప్పున్నాంగా అదిగో ఆ నిద్రిస్తున్నది అప్పారావు గోపాలపురం రైతు నాపేరు లక్ష్మణ చక్రపూర్.

ఇక్కడకు ఎందుకువచ్చినట్టు ఇన్స్పెక్టర్ వ్యంగ్యోక్తి

మామిడిమొక్కలు ఇచ్చట ప్రసిద్ధికదండి కొనిపోదామని మామిడి తోట వేద్దామని "లచ్చన్న జవాబు.

మామిడి మొక్కలు రాజమండ్రిలో దొరుకుతాయా" ప్రశ్న.

కడియంలో దొరుకుతాయికదండి అది ఇచ్చటకు దగ్గిరేకదా" లచ్చన్న రెట్టించారు. రాజమండ్రినుండి మావారిని తీసుకొని వెళ్ళి మొక్కలు కొందామని

"ఎందుకండి లచ్చన్నగారూ అబద్దాలనాడటం మేమే మిమ్మల్ని గుర్తించలేమనుకున్నారా ఇన్స్పెక్టర్ నవ్వుతూ అన్నారు.

"మేము లచ్చన్నను అని తెలిసికూడా మీరలా తెలియనట్లు అడగడమేమిటండి"

లచ్చన్న ఎదురుప్రశ్న.

ఇంతలో నిద్రిస్తున్న నాయుడులేచారు. "లచ్చన్నగారు మిమ్మలిని ఇన్స్పెక్టరు ముగించకముందే లచ్చన్న మమ్మల్ని అరెష్టు చేస్తారని మాకు బాగా తెలుసు. మేమే బయటపడి పరుగెత్తుకొని పిరికివానిలా పారిపోయే పరిస్థితి లేదు. అరెష్టులకు భయపడిన ఆశయాల్ని సాధించగలమా" అని అన్నారు. మీ పట్టుదల ఆశయసాధనలో మీకున్న నమ్మకం నాకు తెలియనిదా" ఇన్స్పెక్టర్ కుర్చీలో కూర్చుంటూ అన్నారు. లచ్చన్నగారు ఆశ్చర్యపోయారు. ఏమిటి మీరు రాజమండ్రిలో నుంటూ నావిషయం అంత నిక్కచ్చిగా చెబుతున్నారు. నవ్వుతూ లచ్చన్నగారూ నా పేరు డి.వి. సుబ్బారావు. నా స్వస్థలం బారువాయే. మీరు నేను ఒక బడిలో చదువుకొనే వాళ్ళం. మీరు సీనియర్ తరగతుల్లో ఉంటే మేము జూనియర్ తరతగతుల్లో నుండేవాళ్లం. ప్రతిదినం ఏదో హడావిడి అల్లరిచేసిన మిమ్ములను విద్యార్థిగా మరచిపోతానా, మా మామగారే యడవల్లి సూర్యనారాయణ.

దానితో అతను తన మాష్టారుగారి కొడుకు అన్నది తెలిసింది లచ్చన్నకు. అలా నాపై తరగతులలో నున్నవారు క్రింది తరగతుల వారిని వెనుదిరిగి చూడటం మన సమాజంలోనే లేదు. పాఠశాలల్లో ఉంటుందా లచ్చన్న సమర్ధించుకున్నారు తనను తాను తెలిసికోలేదన్న విషయాన్ని.

"నిజమేనండి మీరు మీ సీనియర్లను పరిశీలిస్తారు. మేము జూనియర్లను జ్ఞప్తిలో నుంచుకోగలమా? ఇన్స్పెక్టర్ తన స్థాయిని సమర్ధించుకొన్నారు. ఏదిఏమైన మనమిరువురము సహాయోధ్యాయులమే అంటూ మనసుతీరా ఇరువురు నవ్వుకున్నారు.

ఇద్దరు ఒకటే అయిన తదుపరి తన స్వీయ జీవితాన్ని చక్కదిద్దు కోవడంలో తన యావచ్ఛక్తిని చదువును తెలివితేటల్ని వినియోగించుకొని ప్రభుత్వ ఉద్యోగియై తన విధి నిర్వహణలో నున్నారు. వేరొకరు తన జీవిత బాగోగులను ప్రక్కకు నెట్టి పదిమంది బాగుపడాలి. స్వేచ్ఛా సమానత్వాలు పలువురూ పొందాలి, స్వరాజ్యం రావాలి అని ప్రతిజ్ఞ చేస్తూ పడరాని పాట్లు (మనదృష్టిలో) పడుతూ తనదేశ భక్తిని ప్రదర్శిస్తున్నారు.

ఇంతకూ టిఫిన్ చేశారా "ఆప్యాయతతో ప్రశ్నించారు. సహా

ద్యాయి ఇన్స్పెక్టర్ ఆ యింటి ముసలమ్మ ఆమాట మీదనే దోసెల్ని తెచ్చి ముందు పెట్టింది. అందరూ కలసి తినండి అని. ఇన్స్పెక్టరు పోలీసులు వాళ్ళింటికి వస్తే వీధిలోనున్న వారెల్ల ఏదో జరిగిపోతుందని ఆత్రుతతో ఎదురుచూస్తుంటే వీళ్ళు చుట్టాలు వచ్చినట్లు వారి ఆదరణను జూపుతు గౌరవించడం అందరికీ వింతగా తోస్తున్నది. డి.వి.సుబ్బారావు గారన్న ఆ ప్రాంతీయులకు చండశాసనుడని ప్రతీతి. కర్కోటకుడని, పేరుగాంచాడుట. మాటికి మూరుపాళ్ళు ప్రభుత్వం పట్ల విధేయత తప్పించి ఎదిరించిన వారితో పోట్లాడటం తప్పించి కనికరం ఏమాత్రం చూపనివాడని ప్రతీతి.

అయిన లచ్చన్న విషయంలో సాధుజంతువుగా ప్రవర్తిస్తున్నారు. గత అనుబంధం మనిషికి ఎనలేని గురుతర బాధ్యతలను కలిగిస్తుంది కదా.

పోలీసువ్యాను బయట సిద్ధంగా ఉంది. లచ్చన్న, నాయుడుగారు, ఇరువురిని వ్యాన్‌లో తీసికొని వెళ్ళి రాజమండ్రి పోలీసుస్టేషన్‌లో "లాకప్" లో పెట్టారు.

విగూఢత్వమే విధిన్నిర్ణయం అంటారు కొందరు కాదని కొందరు. ప్రపంచంలో జరిగిన ప్రతి ఒక సంఘటన యాంత్రికమా! దైవికమా! యాధృశ్చికమా? గత కాలంనుండి నేటివరకు ఈప్రశ్న నమ్మకం విశ్వాసాలను బట్టి జవాబులు తప్పించి అన్యదా దొరకలేదు. దొరకదు.

లాకప్‌లో లచ్చన్న బాగా అలసి ఉన్నందున నిద్రలోకి జారారు. నాయుడికి నిద్రపట్టలేదు. ఇంటిలోనుండగా నాయుడుగారికి మత్తునిద్ర ముంచుకొచ్చింది. లచ్చన్న గారికి నిద్రపట్టక ఏదో వ్యాసాంగం చేస్తున్నారు.

వీరిరువురి మవస్తత్వాలు జైల్లోనున్నా మనగానే మానసికవైకల్యం జైలు అనుభవం అంతగాలేని నాయుడుకు కలుగవచ్చు. ఈబోడి జైలూ చట్ట బండలూ నాకేం చేస్తాయి అన్న ధీమా పట్టుదల గల మనస్సులో నున్న లచ్చన్నగారికి హాయిగా ఆ రాత్రి నిద్రపట్టింది.

రాత్రి 11 గంటలయింది. స్పెషల్ బ్రాంచి ఇన్స్పెక్టర్ ముస్లిం వచ్చారు. లచ్చన్న సూటుకేసు తెరచి అంతకుముందే స్వాధీనం చేసుకొన్నారు లచ్చన్నగారి డయిరీని, ఉత్తరాలను పరిశీలించారు. అతనికి ఏ అర్థంకాలేదు. అన్ని విప్లవ అంకెలు గుర్తులు తప్పించి డైరీలో

ఏముంటాయి. ఉన్నపేర్లు చిరునామా కూడా మారు వ్రాతలలో నున్నాయి. అవి మ ౹ిఉ రూపాల గల పేర్లు. చిరునామాను చూసిన ఇట్టే తెలిసిపోతుంది.

సి.ఐ.డి.ఇన్స్పెక్టరు రాత్రి సమయమున వచ్చి జైలును తెరువమని ఆదేశించారు స్టేషన్ బ్రాంచి ఇన్స్పెక్టర్. ఇది రాత్రిసమయం. ఎందుకయ న మంచిది లాకప్ తెరవమని మీరు వ్రాతపూర్వకంగా యిచ్చిన తెరుస్తాం.

స్టేషన్లో ఇన్స్పెక్టర్.

"దీనిని వ్రాసిపెట్టాలా" స్టేషన్ బ్రాంచి ఇన్స్పెక్టర్.

"ఆవ్యక్తి అసాధ్యుడు తెరచే సమయాన అతడు మన కంట్లో దుమ్ముకొట్టి పారిపోయిన పారిపోగల సమర్థుడు" స్టేషన్ ఇన్స్పెక్టరు అన్నాడు.

స్టేషను బ్రాంచి ఇన్స్పెక్టర్ కొంచెం తగ్గాడు. నిజానికి అతడు నిద్రపోతున్నట్లు నటిస్తున్నాడేమో, మనిషిని జూస్తే అగ్గజంగ్గానే ఉన్నారు. ఏ ప్రక్క దుమికిన దుమకవచ్చు అని రాత్రి ఒంటి గంట వరకు ఉండి స్పెషల్ బ్రాంచి ఇన్స్పెక్టర్ లచ్చన్నను ప్రశ్నించకుండా సర్కిల్ ఇన్స్పెక్టరు ఇంటికి మరలి పోయారు.

లచ్చన్నగారు నిద్రలోనే ఉన్నారు. జరిగిన తతంగం అంతా నాయుడు నిద్రలేనందున గమనిస్తూనే ఉన్నారు.

లాకప్లో అంతప్రశాంతంగా నిద్రపోవడం,ప్రక్కన సందడి జరుగుతున్నా నిద్రనుండి లేవలేదు. అదేమైన ఇల్లా, పట్టెమంచం పరుపా ఉన్నది లాకప్లో, జైల్లో ప్రమాదకరమైన పరిస్థితిలో. రేపు ఏం జరుగుతుందో, ఎన్నాళ్ళు శిక్షిస్తారో తెలియని దారుణ పరిస్థితి.

అయిన లచ్చనగారు ప్రశాంతంగా నిద్రపోయారు. లాకప్లో ప్రశాంతంగా నిద్రించినవారు ప్రయాణ చేస్తు సుఖ నిద్రను పొందగలరు. ఏ పరిస్థితిలలో నెచ్చటనున్న సుఖనిద్రనందగలరు. ఎంతటి గొప్పదైన మానసికి ప్రజ్ఞఅది. శరీరానికి కావలసింది కావలసినంత నిద్ర. నిద్రలేమి శరీరాన్ని నిర్వీర్యం చేస్తుంది. నిర్వీర్యుడు, నిరాశ, నిస్పృహల్ని తెచ్చిపెట్టి

మానసిక దౌర్బల్యాన్ని పొందగలరు. అనారోగ్యాన్ని అందగలరు.

అందుకే ఒక్క "స్థిత ప్రజ్ఞానికే" కర్మేంద్రియములను స్వాధీన పరచుకునే శక్తి ఉందని గీత వక్కాణించింది. "కూర్మం" లా వ్యవహరించ గలదని నిర్ధారణ పరచింది. "కష్టములో నించుక కలతపడరు, సుఖములందెడి ఆశకుధఖలుపడరు" సమాన స్థితొగతులనందాలని, "క్షుద్రం హృదయ దౌర్బల్యం" అని గీత వక్కాణించింది. భర్తృహరి కూడా కార్యసాధకుడు. "ఒకచో నేలనుపవ్వళించు, వేరొకచో నుయ్యెలలూగు అని పేర్కొన్నాడు.

వారం దినాల తదుపరిలచ్చన్న, నాయుడు గారిని ఆర్.డీ. ఓ ముందు హాజరు పరచారు. పోలీసులు రానందున ఇన్స్పెక్టరు స్టేషనులో లేనందున విచారణలు మేజిస్ట్రేటు వారికి సబ్ఇన్స్పెక్టరు వారికి చెప్పిట్లే చెప్పాం.

"మామిడి మొక్కలు కొనడానికి కడియం వచ్చి రాజమండ్రిలో మండగా మమ్మొల్ని లరెస్టు చేశారు అని బోను ఎక్కిచెప్పారు. పోలీసు 10 దినాలవరకు రిమాండ్ పీరియడు ఉందని భావించారు. 7 దినాల్లో పూర్తి అయిందని భావించలేదు.

అదివిన్న ఆర్.డి.వో చిరులెత్తారు. "ఈ పోలీసులు కపిపించిన వాడెల్లా దుండగుడు అని, విప్లవకారుడు అని, జైల్లోపెట్టాలనే జూస్తారు. వీళ్ళకు మనుషులందరూ ప్రమాదకారులే" అని అంటూ కాగితంపై వీరి ప్రక్క ఒకమారు జూచి ఏదో వ్రాయటానకికి తన కలాన్ని సంధించారు. బాహాటంగా పోలీసుల్ని విమర్శించిన తను వీరిని విడుదల చేస్తారనే భావించారు.

ఇంతలో ఆర్.డి.ఓ వారికి మనసు మారిందేమో, పోలీసు స్టేషనుకు ఫోను చేసి కనుక్కోమన్నారు. ఈ సారి స్టేషనులో నున్న సబ్ఇన్స్పెక్టరు ఫోనులో చెప్పాడు.

"లచ్చన్న ప్రమాదకారుడని, అండర్గ్రౌండ్లో ఉన్న వ్యక్తి అని తప్పించుకొనిపోతూ ఉంటే రాజమండ్రిలో పట్టుపడ్డారని" సబ్ ఇన్స్పెక్టరు రిపోర్టు యిచ్చారు. వెంటనే మోటారు సైకిల్పై కోర్టులోనికి వచ్చి.

ఆర్.డి.ఓ. విస్తాంతపోయారు. అతడు మరల ఆలోచించకపోతే

ఉద్యోగం ఏమై ఉండేదో గతుక్కుమన్నాడు. వెంటనే లచ్చన్న, నాయుడు గారిని రెవెన్యూ డివిజన్ ఆఫీసరు వద్ద హాజరుపరచండి అని ఆదేశించారు. కేసును వాయిదా వేసారు. ఈ విచారణ రెండు మాసాలు జరిగినది. ప్రభుత్వంపై కుట్ర కేసు, వీరు సాయుధ ఆయుధాలు మారణాయుధాలతో తిరుగుతున్నారని చట్ట వ్యతిరేక విధానాలను అవలంబిస్తున్నారని అభియోగాలు.

విచారణలో "అప్పలనాయుడు గారు నాకు పరిచయస్తులే అయితే తనపనిపై తాను రాజమండ్రి రాగా నేను కనిపించిన వెంటనే తన వారింటికి తీసికొని వెళ్లారు " అని లచ్చన్నగారు చెప్పడంతో అప్పలనాయుడు గారిని నిర్దోషి అని విడుదలచేశారు. తదుపరి కోర్టు విడుదల చేసినా మరల కోర్టు వరండాలోనే అప్పలనాయుడు గారిని డిటెన్షన్‌గాప్రకటించింది.లచ్చన్నగారికి ఒక ఏడాదిపాటు శిక్ష చెప్పారు. సి క్లాసు ఖైదీగా శిక్షను అనుభవించమని తంజావూరు జైలుకు పంపించారు. లచ్చన్నగారిని రాజమండ్రి నుండి బళ్ళారి ఆలంపూర్ కేంపు జైలుకు పంపారు. ప్రభుత్వంపై కుట్ర జరిపాడన్న ఆరోపణను ధృవీకరిస్తూ.

## 1943లో బళ్ళారి ఆలీపూర్ జైల్లో (అక్టోబరు)

బళ్ళారిలో జిల్లాలోనున్న ఆలీపుర్‌కేండి జైలు అది విశాలమైనది. బళ్ళారి జైలు అని ప్రసిద్ధి చెందింది. బ్రిటిషువారు దేశం నలుమూలల నుండి రాజకీయ ఖైదీలను తెచ్చి బళ్ళారి జైల్లో పెట్టేవారు.

రాజకీయ ఖైదీలుగా ఆంధ్రులు,తమిళులు, కన్నడలు మళయాళీ భాషలో మాట్లాడే వారుండేవారు మద్రాసు ప్రెసిడెన్సీనుండి ఆంధ్రరాష్ట్రం ఏర్పడినపుడు బళ్ళారి జిల్లా కన్నడులు 'అత్యధికులున్నారని, కర్ణాటకలో కలిపిన అధికసంఖ్యాకులు తెలుగువారున్నారు. నిజానికి తెలుగు భాష కన్నడ భాష లిపి పోలినట్టుగా ఉంటుంది.

ఆ జైల్లో అనేక బారక్‌లున్నవి. ఒక్కొక్క బారక్‌లో 100 నుండి 120 మందివరకు రాజకీయ ఖైదీలుగా నుంచేవారు. లచ్చన్న ఉత్తరాంధ్ర

మండి వెళ్లిన స్వాతంత్ర్య సమరయోధుల్లో ఒకరు. అచ్చట లచ్చన్నగారు ఆ కాంపులో ప్రవేశించిన సమయానికి ఉన్న బెజవాడ గోపాలరెడ్డిగారు శ్రీ భూపతిరాజు సుబ్బతాత రాజు దండు నారాయణ ప్రభుతులు గుంటూరు సీమకు చెందినవారు. కాంగ్రెస్ పార్టీవారే. కమ్యూనిష్టు ఇతర పార్టీల వారు కూడ ఉండేవారు.

బెజవాడ గోపాలరెడ్డిగారు (A) తరగతి బారక్‌లో ఉంటూ ఏ ఒకరికి అంటక ముట్టక ముభావంగా జైలుజీవితం గడిపేవారు. ఏ ఒక్కరినీ ఔననక, కాదనక ఏఒక్కరిని పట్టించుకొనక తన 'బారక్' లో తాను మెదలేవారు నిజానికి జైల్లో తరగతులనేవి జితేంద్ర మరణించాక ఢిల్లీ సెంట్రల్ అసెంబ్లీ చర్చించడం వల్ల వచ్చాయి.

రాజకీయ ఖైదీలం కదా మనమంతా ఏ ఒకరం ఏ తరగతి రాజకీయ ఖైదీలుగా ఉన్న మనందరి ధ్యేయం. స్వాతంత్ర్యమే కదా. ఇందులో మనమే "మనవారివి కాదని వ్యవహరించడం దేనికి ప్రక్క నున్న రాజకీయ ఖైదీ ఎవరిని గూర్చి మీరన్నది" ప్రశ్న

వేమవేదేముంది చూస్తే తెలుస్తుంది కదా. కొందరేదో వారే దేశానికి, పెద్ద అని ఇతరులు కాదన్నట్లు వ్యవహరిస్తారు,

ఎవరికిచ్చిన రేషన్ వారికి సరిపడేదీ. అయితే భీమవరం రైతులకిది సరిపోయేదికాదు. అందరిపైన అపేక్ష, ప్రేమ కనపరచేవారు. అన్ని సమస్యలు తీర్చటానికి ఖైదీ సౌకర్యాలు తీర్చటానికి ఏర్పరచుకున్నదే. పలకల్ని తెప్పించి రహస్యంగా ఏ వార్తాపత్రికలనందలి. ముఖ్య మైనవార్తలును వాటిమీద వ్రాపి అందరికి చదివి వినిపించడం ఆవార్తలపై వ్యాఖ్యానాలు వేయడం. ఉత్తరాలను అందించడం, రాజకీయ ఖైదీలకు నిబంధనల ప్రకారం జరుపవలసిన సౌకర్యాలన్ని జరుగుతున్నయా కాదా అన్న దానిని అన్నదానివి పరిశీలించటానికి కమిటి వేసుకున్నారు..

రెండవ ప్రపంచ యుద్ధము చివరదశలో రష్యాపై నాజీలు దాడి వేయగా రష్యా ,ఇంగ్లాడ్,అమెరికా, మిత్రపక్షంగా కూడి జర్మన్‌పై దండయాత్ర చేస్తున్న సమయమంది. అంత వరకు సామ్రాజ్యవాదుల యుద్ధమని పరాగం చేస్తున్న బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకిస్తున్న కమ్యూనిస్టు పార్టీ ప్రజా

యుద్ధమని ప్రకటించింది. బ్రిటిష్ వారిని మెచ్చుకుంది.

జైలులో ఉన్న కమ్యూనిస్టులు బ్రిటిష్ వారిది ప్రజాయుద్ధమని వాదించసాగారు. అందుకని కిసాన్ కాంగ్రెస్ రాజకీయవాదులు పూర్తిగా వ్యతిరేకత తెలుపుతూ వాదించేవారు.

నిన్నటి వరకు బ్రిటిషువారు జరుపుతున్నది సామ్రాజ్యవాద యుద్ధ మని కేకవేసి, మరల ఈనాడు అది ప్రజాయుద్ధమని తోకలు ముడుచుకుని జైలునుండి పారిపోవటానికా" అని కాంగ్రెస్ రాజకీయ ఖైదీలు వాదించేవారు. ఈ వాదనలు తీవ్రరూపం దాల్చి సంఘర్షణ పడే పరిస్థితిని సృష్టించేవి.

ఇంతలో లచ్చన్న వైపు కొందరు ఆ వ్యక్తి వైపు కొందరు వాదనలోనికి దిగారు. అదెంతో తప్పు అని ఆవ్యక్తి వైపు కొందరు వాదనలోనికి దిగారు. మీసంగతి చూడండి, మీసంగతి చూస్తారండి అని భుజబలాన్ని రంగం లోనికి దింపారు.

ఇక ఆ దినంనుండి వారి దొక రాజకీయపాఠశాల వీరిదొక రాజకీయ పాఠశాల. లచ్చన్న గారికి నిడుబ్రోలులో రైతాంగ విద్యాలయంలో పొందిన రాజకీయ శిక్షణ ఉందిగా. రంగాగారు తీర్చిదిద్దిన లచ్చన్న వాదనలో వెనుకబడడం అన్నది లేదు.

ఇరువర్గాల వారొకరితో ఒకరు పలకరింపుల్ని కూడ విరమించు కున్నారు. ఎవరి శిబిరంలో వారు రాజకీయ పాఠాల్ని నేర్చుకున్నారు. నేర్పే గురుత్వం వారిదే, శిష్యరికం వారిదే. ఆత్మ అంతరాత్మల్లా, ఆత్మ పరమాత్మల్లా వారు పరస్పరం రంజకాలుగా నుండేవారు.

కొన్నాళ్ళ తదుపరి జైలునుండి కమ్యూనిష్టు నాయకులను అభిమానులను విడుదల చేయడం ప్రారంభమైనది. ఆ కమ్యూనిష్టు నాయకులంతా జైలునుండి వెళ్లారు.

రాయలసీమ నాయకులు విడుదలయ్యారు. విడుదలయిన తదుపరి లచ్చన్న గారికి మరల "డిటెన్యూ" చేయకుండా జైలునుండి తప్పిద్దాం అని

మాట యిచ్చి వెళ్లారు. అచ్చన్నగారిని తీసుకు వెళ్లడమే జరిగితే, వెళ్తున్న రైలు నుండి తప్పించటానికేర్పాట్లు రాయలసీమ నాయకులు చేస్తామన్నారు.

అచ్చన్నగారిని సంవత్సరం శిక్షకాలం గడిచిన మరుక్షణం విడుదలయి జైలు గేటు వద్దకు వచ్చారు, రాయలసీమ మిత్రులు ఒక్కరు కన్పించలేదు. డిటెన్సు ఉత్తర్వులతో మరల పోలీసులు ప్రత్యక్షమైనారు.

అచ్చన్నగారు మిమ్మలిని డిటెన్యూ ప్రకటిస్తూ అచ్చన్న గారిని తీసుకెళ్లడమే జరిగితే, వెళ్తున్న రైలు నుండి తప్పించటానికేర్పాట్లు రాయలసీమ నాయకులు చేస్తామన్నారు. తరువాత పెరోలుపై. విడుదలయినవారు, పెరోలు నాశించకున్న వారిలో ప్రకాశం, కళావెంకట్రావ్, మద్దూరు అన్నపూర్ణయ్య, అల్లూరి సత్యనారాయణ, అంజయ్య, గౌతు అచ్చన్న, సుమారు 50 మంది ఉండేవారు.మరల జైల్లో బంధిస్తున్నాం. ఇవిగో ఉత్తర్వులు. మిమ్మల్ని విడిచి పెట్టడం హానికరమని ప్రభుత్వం భావించినందున మరల ఈ ఉత్తర్వులను జారీచేసింది అని అంటున్న పోలీసులు "మరల డిటెన్యూ" అనడం విడుదల చేయడం దేనికి ?

"మీరీ జైల్లో ఇన్నాళ్లు ఖైదీగా ఉన్నారు ఈ దినం నుండి డిటెన్యూ కష్టడీలోనుంటారు ఖైదీగాకాదు" పోలీసు అన్నాడు.

"ఏరాయి అయితేనేం ఎళ్లూడగొట్టుకోవటానికి, సరే కానివ్వండి మీఉత్తర్వులను అమలుచేయండి" అని అచ్చన్న అనగానే అటునుండి అచ్చన్నగారిని డిటెన్యూ కేరళ రాష్ట్రంలో నున్న కన్ననూర జైలుకు పట్టుకుని పోయారు. అచ్చన్నగారితో పాటు మరి ఐదుగురిని అదే జైలుకు తరలించారు.

కేరళ రాష్ట్రంలో నున్న కన్ననూర్ జైల్లో కొంతకాలంగడిపారు. క్విట్ ఇండియా ఉద్యమం తీవ్రత తగ్గనందున అన్ని రాష్ట్రాల కాంగ్రెస్ రాజకీయ ఖైదీల నందరిని అమరావతి జైలుకు తరలించారు. ఇది గుజరాత్‌లో ఉంది. రెండవ ప్రపంచ యుద్ధములో కాంగ్రెస్ పార్టీ బ్రిటిష్ వారికి సహాయ నిరాకరణ చేసింది. బ్రిటిష్ వారు జయించిన శాశ్వత జీవితకాలం శిక్షలు పడ్తాయేమోనని పెరోలుపై వెళ్లడము కొంతమంది చేసేవారు.ఉత్తరాంధ్రలో

పేరు మోసిన విప్లవవాది లచ్చన్నను విడుదల చేయక మరల కన్ననూరు జైలునుండి తంజావూర్ జైలునకు మరి కొందరితోబాటు తరలించారు.

## తంజావూర్ జైలు :–

తంజావూర్ జైల్లో ఆసరికే ఆంధ్రనాయకులను అనేకమందిని నిర్బంధించారు ఆ జైల్లో లాకప్ లేదు. రాజకీయ ఖైదీలు జైల్లో విచ్చలవిడిగా బారక్‌లో ఉండవచ్చు తిరుగాడవచ్చు. బ్రిటిష్‌వారు ఆ జైలును రాజకీయనాయకులతో నింపేరు. ఆచార్య రంగా – వెంకటనరాజు గొట్టిపాటి బ్రహ్మయ్య, బ్రహ్మానందరెడ్డి, చంద్రమౌళి, రామస్వామిచౌదరి, స్వామి గొల్లపూడి శీతారాం జైల్లో అతిరధ మహారధ రాజకీయ నాయకులున్నారు.

లచ్చన్నగారు తంజావూర్ జైల్లో ఎదురుగా సుబ్బారావు వచ్చి లచ్చన్నగారికి ఆ జైలు విషయాలన్ని చెప్పాడు.

అది పెద్ద జైలు తొమ్మిది మెస్సులుండేవి. అన్ని రాజకీయవేత్తల నుద్దేశించినవె. ఆంధ్రులకు రెండు మెస్సులు శాఖాహారం మాంసాహారం తమిళులకు కర్ణాటకులకు మళయాళీయులకు రెండేసి మెస్సులు శాఖాహారం మాంసాహారం.

గొల్లపూడి శీతారామస్వామిశాస్త్రి గారిది ఒక ప్రత్యేకమైన మెస్ "ప్రకృతిశాల" పద్ధతి మేరకు దానిని నడిపేవారు.కొందరు ఆమెస్‌లో జేరారు.

లచ్చన్నగారు తంజావూర్ జైలును జైలుగా భావించలేదు. ఏదో రాజకీయ పాఠశాల రంగాగారు నడుపుతున్నారని భావించేవారు. ఇక లచ్చన్న కుడి భుజం కొర్లి అప్పలనాయుడుగారు అదే జైలుకి శిక్ష అనుభవించటానికి వచ్చారు. దుర్లభషాషు, కర్ర అప్పారావు, షిల్లా రాజులు రెడ్డి, కూడా అదే జైలులో ఉండేవారు.

ఆ జైలు మెస్‌లను నడుపుటలో కొన్ని అవకతవకలున్నాయన్నది చూచి సుబ్బారావు వెల్లి అప్పలనాయుడుగార్ల అభిప్రాయం, ఇంతవరకు లోలోన బాధపడుతూ కాలం గడుపుతూ వచ్చారు.

"లచ్చన్నగారూ ఈ మెస్ వ్యవహారం ఏమీబాగలేదు. ఎందులోన్ను మమ్మల్ని రానీయక తికమకపెడుతున్నారు" సుబ్బారావుగారన్నారు.

"మీరు అలాచూస్తూ కుక్కిన పేనుల్లా ఉన్నారు". లచ్చన్న లోలోన దుఃఖపడుతూ అన్నారు

"మేమేం చేస్తాం లచ్చన్నగారు వీళ్ల బాధపడలేక నేను ఆసీతారాంగారి ప్రకృతిశాల ఆహారశాలలో అన్నం ముద్ద తింటున్నాను", నాయుడు దీనంగా అన్నారు.

ఏమిటా పులిపిల్లా, ప్రకృతి ఆహారశాలలో ఆహారమా, ఆశ్చర్యంగా ఉందే" లచ్చన్న అన్నారు.

"మీరు ఆలానే అంటారు మేము బాధలు పడలేక "మెస్‌లు జరుగుతున్న నాటకాల్ని మన గురుదేవులు రంగాగారికి కూడా మేం వెళ్లి చెప్పాం" నాయుడు చెప్పారు.

"ఆయన ఏమన్నారు" లచ్చన్న ప్రశ్న.
కసరి పొమ్మన్నారు. మనం ఇచ్చటకు వచ్చింది, విందులు ఆరగించటానికా, సుఖనివాసాల్ని పొందటానికా" అంటూ కళ్లెర్రచేసారు. సుబ్బారావు చెప్పారు.

"అయితే మాత్రం ప్రభుత్వం వారిచ్చిన సౌకర్యాల్ని అందరితో మనం కూడ పొందడం తప్పా
ఎందుకు తొందర, మీరు వచ్చారుగా వీళ్ళ పని పడదాం, నెమ్మదిగా ప్లాన్ వేయండి నాయుడు చెప్పాడుఅలానే అని అన్నారు లచ్చన్న.
ఇంతలో భోజనాలకు గంట మ్రోగింది. అందరూ కలిసి మెస్‌కి వెళ్లారు. ఆంధ్రా మెస్ మాంసాహారం శాఖలో రెండు మెస్‌లు ఒకటి పెద్ద పెద్ద రాజకీయవేత్తలకు, రాజకీయ నాయకులకు, రెండవది సామాన్య రాజకీయ నాయకులకు.

లచ్చన్నగారికి మెస్ వ్యవహారాలు నడుపుతున్నతీరు. అందరినీ ఒకే రీతిగా చూడకపోవడం నచ్చలేదు అవకాశం కోసం చూస్తున్నారు.

1936 లో కాంగ్రెస్ వారు రాష్ట్ర ప్రభుత్వాలను నడిపియున్నారు కదా. అధికార పదవులలోనున్నవారు మరల వారు అధికార పదవుల్లోకి రారని

ఎలా చెప్పగలం అని మెస్ వార్డెన్‌లు అన్ని విధాలా వీరికి సదుపాయాలు చేసేవారు రాజకీయ ఖైదీల జీవితంలో కొన్ని మార్పులు వచ్చాయి.

ఆ జైల్లో ఉన్నది డిటెన్యూలు స్వేచ్ఛగా ఎవరిగదుల్లో వారు ఉండవచ్చు. పత్రికాపఠనం చేయవచ్చు, చర్చావేదికలు నిర్వహించవచ్చు రాతకోతలు జరుపుకోవచ్చు. వారిలోవారు తర్కించుకోవచ్చు. సిద్ధాంతం చర్చల్ని జరపవచ్చు. ఆంధ్రులకు మాంసాహారభోజనశాల ఉండేది. దీనికి అనుబంధంగా వేరొక వంటశాల ఉండేది. ఈ రెండు మెస్సులను నడిపేది మంతెన వెంకటరాజు.

ఒక్కొక్క డిటెన్యుకి ఒకరోజుకి ఒక రూపాయి, 12 అణాలు చొప్పున యిస్తారు. ఇదిగాక ప్రతి ఒకరికి చేతిఖర్చు రెండు అణాలు. అందులో కేటాయించేవారు.

ఆంధ్రా మాంసాహారం మెస్‌ల రెండింటిని నిర్వహిస్తున్న మంతెన వెంకటరాజుగారు రాజకీయ ఖైదీలందరి తరపున కావలసిన వస్తువులను ఇండెంట్ ఇచ్చేవారు.

గొల్లపూడి శీతారాంగారు వారు నడిపే మెస్‌కి అటుకులు, బెల్లం, కొబ్బరికాయలు, అరటిపండ్లు, పొట్లకాయలు పాలు తెప్పించుకునేవారు. అయిన ఆమెస్‌లో ఉండేది స్వల్పసంఖ్యే.

సాధారణంగా బెల్ కొట్టిన వెంటనే. సకాలంలో భోజనమునకు వెళ్లక పోయిన వారికి భోజనము ఉండేది కాదు. వచ్చినవారికి భోజనములు అయిపోయినవి, వెళ్లమని చెప్పేవారు. ఈ పరిస్థితిని లచ్చన్నగారు అంగీకరించేవారుకాదు. ముందు వెనుకలు చూడాలని చెప్పేవారు.

వంటశాలలో సర్వీసు ఒక్కొక్క వారం ఒక్కొక్క జిల్లావారిది. వంటలు వడ్డనలు అన్ని వారే జరపాలి. విశాఖజిల్లా వంతు వచ్చింది. ఈ జిల్లా వాళ్లంత వంటశాలలో జొరబడి వంటకాల్ని తయారు చేస్తున్నారు, ఇంతలో లచ్చన్నగారు వచ్చారు. "మీరు కొత్తవారు మీరు రానవసరం లేదు. మేము వండిపెడతాం మీరు విశ్రాంతి తీసుకోండి అని జిల్లా అనుచరులనగా నో, నో, నేను వంటదగ్గర ఉంటాను. వంటశాలలోఉంటేనే ఏం జరుగుతున్నదీ

తెలుస్తుందన్నారు లచ్చన్న. ఇలా లచ్చన్నగారు అంటూండగానే తమిళనాడు కిచెన్ ఆర్డర్లీ ఒక చీటి పట్టుకొని వచ్చారు. "ఇదిగోనండి చీటి ఇచ్చారు. మంతెన వెంకటరాజుగారు" అంటూ ఆ చీటిని అందించగా లచ్చన్నగారే ముందుకు వెళ్లి అందుకున్నారు. చీటిలో వున్న విషయం "20 పాయింట్లు పాలు ఈతని ద్వారా పంపించండి"

చీటి చదివిన తరువాత లచ్చన్నగారు పాలు మేమెందు కివ్వాలి అని అన్నారు లచ్చన్న

మా కిచెన్ నుండి అప్పు తీసుకున్న పాలు మాకివ్వాలి.

మేము తీసుకోలేదు తీసుకున్నవారు ఇస్తారు వెళ్లు అని లచ్చన్నగారనగానే ఆర్డర్లీ వెళ్లిపోయాడు. మరికొంతసేపటికి గొట్టిపాటి బ్రహ్మయ్యగారు, ఆ ఆండర్లీను తీసుకుని వచ్చారు.

ఎవరండీ పాలివ్వనన్నారట నిజమేనా "బ్రహ్మయ్య గద్దించారు.

నిజమే మేమేనండి ఇవ్వనన్నాం లచ్చన్న అదే స్వరంతో జవాబిచ్చారు.

ఓహో మీరేనా

అహ నేనే అన్నారు లచ్చన్న.

ఇచ్చట సంగతులు మీకు ఇంకా తెలియనట్లున్నాయి.

కొత్తగదూ "బ్రహ్మయ్య".

"ఏమిటో ఆ సంగతులు, మీరు చెబితే కాస్త వింటాం, కొత్త అంటున్నారు మనమంతా పాతేకదండి. లచ్చన్న వ్యగ్యంగా అన్నారు.

తమిళనాడు మెస్ నుండి వెనుకటి వారం మనం అరువు తెచ్చుకున్నారు, అది ఇచ్చేయ్యాలి"

"ఆ వారంలో సర్వీసు చేసిన వాళ్ళు అప్పు తీర్చవలసి ఉంటుంది

ఈ వారంలో యివ్వడమేంటి ఈ వారం సర్వీసు చేసిన వాళ్ళు

మాకిదేం లేదు, వంట వడ్డనలు మావి. ఇక్కడకు వచ్చిన రేషన్సు ఎక్కడకూ పోవటానికి వీలులేదు," అన్నారు లచ్చన్న.

"ఏమిటి మీ దబాయింపు"

ఇచ్చిన రేషన్ సద్వినియోగం కావాలి" లచ్చన్న

అంటే మేము సద్వినియోగం చేయనట్లా ?

"అని మేమన్నామా, మీవారం వచ్చినపుడు మీరు తెచ్చుకున్న రేషన్ అప్పు తీర్చండి".

"మీరు కయ్యానికి కాలు దువ్వుతున్నట్లుగా ఉన్నారు, అంటూ గట్టిగా అంటూ వెళ్లారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారు".

ఆమాటలు విన్న కిల్లి అప్పలనాయుడుగారు లేచి మీరు అన్నమాటను మల్లి అనండి అని సింహంలా గర్జించాడు. పరిస్థితి వేడెక్కింది.

ఆరాత్రి మెస్‌లో భోజనాలు అవుతున్నాయి. నిజానికి చాలామంది రాజకీయ ఖైదీలు పెద్దలు మెస్సుకు రాకుండానే వాళ్ల గదులకు భోజనాలు తెప్పించుకునేవారు. అయితే ఆదినాన అందరు మెస్సుకు హాజరైనారు. ఎంత గొప్ప విచిత్రం. భోజనాలు ప్రారంభం కాకముందు, అనగా, మంతెన వెంకట రాజు వ్రాసి తీసుకువచ్చినచీటిచదవడం ప్రారంభించారు, అని మెస్ తాలూకా జమా ఖర్చుల వివరాలు" మొదటి నుండిలేని దరిమిలా కొన్ని ఆపోహలు వచ్చాయి వస్తున్నాయి. ఈ నిర్వాహక భారం నాకు వద్దు ఎవరయిన స్వీకరించండి అన్నారు మంతెన వెంకటరాజు, నేను మెస్ మేనేజ్‌మెంటుకు రాజీనామా ఇస్తున్నాను అన్నారు.

"మీరే ఉండాలి" బ్రహ్మనందరెడ్డి.

ఎవరో ఏమో అన్నారని మీరు మానటానికి వీల్లేదు. ఒకరు మనల్నేదేమిటి "

"ఇంతలో లచ్చన్నగారు జోక్యం చేసుకుని ఏండ్ల తరబడి ఒక్కరిని సేవ చేయమని అడగటం న్యాయం కాదు, మరొకరికి ఆ భాధ్యత అప్పగించడం మంచిదన్నారు.లచ్చన్న మాటలిని కోపంతో కాసు బ్రహ్మనందరెడ్డి మీరు అడిన మాటలలోగల ద్వంద్వార్థాలు. మాకు అర్థంకాకపోలేదు, ఇక్కడ మెస్

ఛార్జీల డబ్బులను ఎవరైనా తింటున్నారన్న సహించేది లేదు, వారికి తగిన బుద్ధిచెప్పగలమన్నారు.

వెంటనే బ్రహ్మానందరెడ్డి మంతెన వెంకట్రావు వగైరాలు లేచి మెస్‌నుండి వాళ్ల వాళ్ల గదులలోకి వెళ్లిపోయారు. ఈ మెస్సుతో మాకు సంబంధంలేదని కోపంతో వెళ్లారు.

ఆపరికే ప్రైవేటుగా నడుపుకుంటున్న మెస్‌తో వారుండగా వీరు లచ్చన్నతో సహా 20, 30 మంది పాత వంటశాలలో మెస్ ప్రారంభించారు.

లచ్చన్న ప్రభృతులు వంటశాలో నున్నవారెల్ల మెచ్చుకునేలా వీరు మెస్‌ను నడిపేవారు. మధ్యాహ్నం 2 కూరలు ప ప్పుచారు పెరుగుతో భోజనం, రాత్రిపూట కూర పచ్చడి మజ్జిగ చారుతో భోజనం రెండు పూటలు టిఫిన్లు ఉండేవి. మధ్యమధ్య స్పెషల్ భోజనాలుండేవి. ఇన్ని వసుపాయాలు చేస్తూ ప్రతి డిపెన్యూకి 6 అణాలు పర్సనల్ ఖర్చు సాదరకి, అవకాశం కలిగించారు. ఇది చూసిన ఆ పెద్దలు తేలుకుట్టిన దొంగల్లా నోరు మెదిపే వారు కాదు. వచ్చిన రేషన్ అంతా సభ్యులు సరిసమానంగా పంపకం అయ్యే తీరు అందరినీ ఆకట్టుకుంది. సమతావాదులు వారు అన్ని విషయాలలో అన్న పేరు వచ్చిందా మెస్. సభ్యుల్లో సాటి మనిషి కిచ్చిన రేషన్ హరించే వ్యక్తి దేశాన్ని హరించకుండా ఉంటాడా అన్నదా మెస్‌లో ప్రతీ ఒకరి నోటినుండి వెలువడేది. ఒకరి తీరు ఒకరికి నచ్చేది కాదు. ఒకరు నీతి వేరొకరికి వచ్చేదికాదు. గంగా యమునా సంగమం, గంగానదిలో కలసి ప్రవహిస్తున్నా గంగనీరు యమున నీరు ఒకటినొకటి అద్దుకుని ప్రవహిస్తున్నా తెలుపు తెలుపే, నలుపు నలుపే సాగరగర్భంలోనే మరల కలసి యమున గంగాజలమొకటి అయ్యేది.

కొందరు రాజకీయవేత్తలు పెరోల్ మీద జట్టు జట్టులుగా విడుదలయ్యారు. కొత్త హోల్డర్సు సూటుకేసులు, పరుపులు, మంచిదిండ్లు, సాతసామాన్లు, మోసుకుంటూపోతూంటే ప్రత్యర్థుల ప్రచారం సాగేది. దిప్యూటీ జైలర్‌తో లాలూచీ పడితేనే వీటిని సంపాదించడం సాధ్యమయ్యేదని, కాదు లేదు అని స్వీయసంపాద నార్జితాలే అన్నది ఎదురు ప్రచారం.

గాంధీజీ పిలుపుపై సత్యాగ్రహిగా మారి చెఱశాలలో బంధించబడిన

వ్యక్తి ఏమాత్రం త్రికరణశుద్ధిగా లేకపోయిన వాని జీవితాల్ని తికమకతో అల్లేస్తారు ప్రజ. ఇసుమంతలోపాల్ని దుర్భిణీ అద్దాలతో చూస్తారు. ప్రజలకు ఆదర్శప్రాయాలు రాజకీయనాయకులు వారి జీవితం ఆదర్శప్రాయంగానే ఉండాలి తప్పించి కాసింతయిన కంటిలో కాటుక మాత్రమైన కాలుజారి కళా విహీనం కాకతప్పదు.

తంజాపూర్ జైలునుండి అందరి పెద్దలను పెరోల్‌మీద జట్టు జట్టులుగా విడుదల చేస్తున్న లచ్చన్నగారిని మాత్రం విడుదల చేయలేదు అయితే తంజాపూర్ జైలునుండి రాయవెల్లూరు జైల్‌కి బదలీచేసారు. లచ్చన్నగారు ప్రభుత్వానికి ఇంకా కొరకరాని కొయ్యలానే మిగిలిపోయారు. జైలునుండి లచ్చన్న గారితోపాటు కొంతమంది అమరావతి జైలుకు మిగిలిఉన్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ నాయకులు ప్రకాశం, కళా వెంకట్రావులను కూడా రాయవెల్లూరు జైలుకు బదిలీ చేసారు. మన్నెం అంజయ్యను మద్దూరు అన్నపూర్ణయ్యలు కూడ ఉన్నారు.

ప్రకాశం పంతులుగారు ఆంధ్రకేసరికదా, బోనులో సింహంలా అటూఇటూ తిరుగుతూ ఉరిమేవారు కూర్చుంటే మరల లేస్తూ తిరుగుతూ ఉండేవారు. ఏఒకరితో హెచ్చుగా మాట్లాడేవారుకాదు.

లచ్చన్న కళావెంకట్రావు ఒకే జైల్లో ఉంటున్న ఆనాటి కాంగ్రెసు నాయకులు లచ్చన్నగారిని ఒకరోజున కళావెంకట్రావు గదిలో ఏవో లోకాభిరామాయణం గురించి మాట్లాడుతూ ఉండగా లచ్చన్నగారూ, లచ్చన్నగారూ ! మీకు జాతకాలన్న నమ్మకమేనా. నిజానికి జాతకంపై ఎంతో నమ్మకమున్న లచ్చన్నగారు తనగదికి వెళ్లి తన జాతకము తెచ్చి పరిశీలించమని కళావెంకట్రావుగారి చేతిలో పెడతారు.

జాతకాన్ని పరిశీలించి కళావెంకట్రావు ఒకమారు తలపంకించి ఏదో ఆలోచిస్తున్నట్లు కొంతసేపు మరల లచ్చన్నగారి వైపు చూస్తు "లచ్చన్నగారూ నీవు అదృష్టజాతకుడవేనయ్యా నీయోగం యిలా ఉందిగా బట్టే మీ శ్యామసుందరంగారు పరలోకానికి వెళ్లారు".

కళావెంకట్రావు గారిచ్చిన వివరణ విన్న లచ్చన్నగారి మనస్సు

చివుక్కుమన్నది.

"ఏమండి అంతమాటన్నారు".

"శ్యామసుందరంగారు ఉంటే నీవు ఆజిల్లాలో రెండవవాడివి తప్పించి మొదటివాడవు కాజాలవు. ఈనాడు నీవే విశాఖ జిల్లాకు మొదటివాడవు".

అయితే మీరు చెప్పవలసినతీరా ఇది. ఒకరి ఇంటికి వెళ్ళి మీనాన్నగారున్నారా మీయమ్మ మొగుడు ఉన్నరా అని ఈ విధంగా అనడము భావ్యమా అని లచ్చన్న ఆవేదనతో అన్నారు: "నీయోగం బాగుందనటానికి అలా అన్నాను తప్పించి మీగురువును చిన్నబరచటానికి గాదు".

"మా గురువును ఎవరైన ఏంచిన్న పరచగలరు. నిజానికి ఈనాడే వారుండి ఉంటే ఈ క్విట్ ఇండియా ఉద్యమాన్ని మా జిల్లాలో ఉర్రూత్రలూగించే వాళ్లం. ఊపిరి సలపకుండా చేసేవాళ్లం.

లచ్చన్న మనసు బాధపడిందని కళావారు గ్రహించారు. నిజానికి లచ్చన్న మనసు కనిపెట్టాలన్నది కళావెంకట్రావు ఎత్తుగడ. ఆద్య తవబావిలో లచ్చన్నగారిని తనవైపు తిప్పుకోవాలన్నది ఆతని అభిమతం.

"అదికాదు లచ్చన్న - నీవు వద్దని మొత్తుకొన్నా నీయోగాన్ని బట్టి అడ్డు తొలగిపోయింది"

నాగురువు నాపచివుడు నాసారధి నా ఆత్మీయుడు నామార్గదర్శి శ్యామసుందరంగారు తొలగిపోయినందున వచ్చే ఆ వెధవయోగం నాకుపరంలేదు. ఒకరి స్మశానంమీద ఇల్లు కట్టే నీచమైన ఆలోచన నాకెప్పుడులేదు. అది ఒక యోగం ఎప్పటికి కాదు" లచ్చన్న తీవ్రంగా అవడంతో కళావెంకట్రావు మౌనం వహించారు. తుదకు వాళ్లిద్దరి మధ్య జాతకం చర్చ యిలా దారితీసింది. తనను తనవైపు లాక్కోవాలని వలపన్నిన కథయింది.

లచ్చన్న నీకేమయ్యా తెగింపు కలవాడవు, తెలివైనవాడవు, నీవె తలుచుకున్న గంజాం జిల్లాలో విశాఖ జిల్లాలో రైతోద్యమం ఏమిటి, మీవంటి వారుంటేనే మన కాంగ్రెస్ సంస్థ మూడు పూవులు ఆరు కాయలు కాస్తుంది.

అంటూ ఎంతో లాలనతో చెప్పి లచ్చన్న గారిని మంచి మాటలతో లాలించి ఆదినం బుజ్జగించారు. మాటలనెటుపడితె అటు తిప్పగల చాకచక్యంగల రాజకీతి చతురుడు కళావెంకట్రావు.

లచ్చన్నగారన్న తంజావూరు జైల్లో ఉన్న మంత్రి వర్గ ముఠా నాయకులు ద్వేషించేవారు. ఈజైల్లోనే కళావెంక్రటావుగారు ఉత్తరాంధ్రలో ఉజ్వల తారగా భవిష్యత్‌లో వెలగలశక్తి యుక్తిలచ్చన్నగారితోఉన్నావనిఆసరికే కాంగ్రెస్ పెద్దలు గ్రహించారు. తమచేతిలోని అందరు అన్నవారంతా ద్వేషించడం మొదలుపెట్టారు. నవయువకుడు, నిస్వార్థసేవకుడు, ధార్మికస్వభావి, పట్టుదల దృఢదీక్షకు పేరువడిన వ్యక్తి. దేనినయిన త్యజించగల త్యాగి. ఉదారబుద్ధి గలవారు. ఉరుములు ఉరిమినట్లు, మెరుపులు మెరసినట్లు ఉపన్యసించి ప్రజలనుర్రూత లూగించగలిగిన ప్రజ్ఞప్రాభవాలున్న వారు గాంధేయవాది, స్వాతంత్ర్య సమరయోధుడు, సిద్ధాంత రాజకీయాలను నడుపగలదట్టి. కూడు,గుడ్డ,వసతి,విద్య మనోభావోన్నతిని కలిగించి బలహీన ప్రజావర్గాల సంరక్షుణ్కై దీక్షా కంకణం ధరించాలన్న అత్మ సంకల్పపరుడు స్థితప్రజ్ఞుడు దోపిడీ ఎచటఉన్న ఎదుర్కొనగలదిట్ట, మొనగాడు అగ్ర వర్ణాలవారికి ఎదురునిలచి అణగద్రొక్కిన కులాలనుండి ఉద్భవించి సిద్ధపడిన రాజకీయ నాయకుడు ప్రజాస్వామివాది - సామ్యవాది - జాతీయవాది - లచ్చన్న.

గాంధీ - వేవెల్ సంభాషణలు పూర్తయినాయి. దేశంలో వామపక్ష, సమైక్య వాదులను జైలునుండి విడుదల చేయడం ప్రారంభించారు.

లచ్చన్నగారిని రాయవెల్లూరు జైలునుండి 1945 అక్టోబర్‌నెలలో ప్రకాశం, కళా వెంట్రావులతో కలసి విడుదల చేసినారు. దేశమాత సంకెళ్లు తెగి నేల పడనున్నాయి. అతిత్వరలో

అన్నెం అంజయ్య మద్దూరి అన్నపూర్ణయ్యలను మాత్రం ఆపద్ధర్మం ప్రభుత్మం 1946 లో ఏర్పడిన తదుపరి విడుదల చేసారు.

లచ్చన్నగారు జైలునుండి విడుదలై విశాఖ జిల్లా చేరుకున్నారు. దేశ రాజకీయాల్లో గణనీయమైన పాత్రను నిర్వహించటానికి జిల్లా వెళ్లిన లచ్చన్న మరల సిద్ధమైనారు.

# 23 వ ప్రకరణము

# రాజకీయనాయకునిగా లచ్చన్న

సమకాలీన వ్యవహారాల్లో తలదూర్చి వాటి పరిష్కారానికి నిత్యం ఆలోచిస్తూ ఆచరణలో వాటిని పరిష్కరించటానికి ప్రయత్నించే వ్యక్తి రాజకీయవాది.

అయితే ఆ రాజకీయ సమస్యలను ఏపద్ధతిలో ఏమార్గాన అనుసరించి పరిష్కారించాలన్న రీతి నీతులలో రాజకీయవాదులు విబేదిస్తారు.

ప్రభుత్వం - పాలనా విషయాలలో రాజకీయ విషయాలు సామాజికాభ్యదయం ప్రభుత్వం ధ్యేయం, ఆప్రభుత్వం నడిపే సార్వభౌమాధికారం ఎవరి చేతుల్లో ఉండాలి. ఒకే ఆశయం ఒకే లక్ష్యం సిద్ధాంతం గల వారంతా ఒక రాజకీయ పార్టీగా ఏర్పడతారు. రాజనీతి సిద్ధాంతం లేని రాజకీయ నాయకులు నిజానికి నాయకులనిపించుకోరు సాంఘిక సేవకులనిపించుకొంటారు.

సిద్ధాంతంలేని పార్టీ, వాసనలేని పువ్వువంటిది. కొన్ని సూత్రాల పధకాలు కార్యక్రమాలు సిద్ధాంతంగా నిలవవు. ఏనాటికి సిద్దాంతం స్థిరము గాబట్టి అట్టి సిద్ధాంతం గల పార్టీయే స్థిరముగా ఉంటుంది. శాస్త్రీయ సిద్ధాంతంపైగాక ఏవోకొన్ని సూత్రాలు పధకాలు కార్యక్రమాల మేరకు ఏర్పడిన పార్టీ సాంఘిక సం క్షేమ రాజ్యంగా గుర్తించబడగలదేమో తప్పించి రాజకీయ సాంఘిక ఆర్థిక అసమానతలను తొలగించే రాజ్యంగా మనగలగలేదు. సూత్రాలు పార్టీని నడిపిస్తాయి, నిబంధనలు పార్టీని నడుపలేవు.

1885లో ఏర్పడిన జాతీయ కాంగ్రెస్ సిద్ధాంత ప్రాతిపదికపై 1934 వరకు వచ్చింది. కాంగ్రెస్ విధానంలో బేధాలు వచ్చాయి. సోషలిజం ఇదొక రాజకీయ సిద్ధాంతం, ఈ ధ్యేయం గలవారు కాంగ్రెసు పార్టీలో "కాంగ్రెసు

సోషలిష్టు పార్టీనొకదానిని కాంగ్రెసులోనే అంతర్భాగంగా నడపడం ప్రారంభించారు.

స్వరాజ్య సాధన సమరము సాగిస్తున్న వారిలో మూడు విభిన్న సిద్ధాంతాలను బట్టి ముందుకు వెళ్లారు.

అయితే ఆరాజకీయ సమస్యలను ఏ పద్ధతిలో ఏమార్గాన అనుసరించి పరిష్కరించాలన్న రీతినీతులలో రాజకీయవాదులు విబేదిస్తారు.

సోషలిజం కావాలన్నదొక వర్గం భూపేశు గుప్తా, అరవిందఘోష్ విప్లవ వర్గానికి చెందిన వారు. సామ్యమాద తరహా సమాజం కావాలన్న దింకొక వర్గం. సామ్యవాదానికి సామ్యవాద తరహా సమాజానికి ఎంతో భేదముంది. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ దీనికి ఆధారం, సామ్యవాదానికి సామ్యవాద ఆర్థిక వ్యవస్థ ఆదార భూతం.

అయితే మిశ్రమ ఆర్థిక వ్యవస్థను చేపట్టాలన్న సామ్యవాద తరహా సమాజాన్ని స్థాపించాలన్న వర్గానికే నెహ్రూ నాయకత్వం వహించారు.

సామ్యవాద సమాజం కావాలన్నా రామమనోహర్ లోహియా ఆచార్యనరేంద్ర దేవ్ రామ మనోహర లోహియా వర్గానికి జయప్రకాశ్ నారాయణ నాయకత్వం వహించారు.

1932లోనే కాంగ్రెసులో స్వరాజ్య పార్టీ ఏర్పడింది. సి.ఆర్.దాస్, మోతీలాల్ నెహ్రూ, లజపతిరాయి, భూలాభాయి ప్రభృతులు ఈపార్టీకి రధసారధులు.

గాంధీజీ చేతిలోనికి కాంగ్రెస్ రధసారధ్యం వచ్చాక కాంగ్రెసు నాయకులలో తిలక్ అతివాదిగ, గోఖలే మితవాదిగా ఉండేవారు. సమతూల్యాన్ని పాటించారు. గాంధీ విప్లవరీతిలో ఉద్యమించేవారు ఆచరణలో సత్యఅహింసల్ని ప్రతిబింబించేలా నిరూపించేవారు.

ఆరంభదశలో కాంగ్రెసు పార్టీలో సైవర్గాలు లేవు. ముఠాలుగా పెంచిన వర్గాలుగా భావించిన అది సిద్ధాంతప్రాతిపదికగలదే తప్పించి అన్యధా

బావించబడదు.

అయితే కాలక్రమేణ పార్టీలో వ్యక్తిగత ప్రాధాన్యతలు పెరిగి పోయాయి. ముఠాపరమైన రాజకీయాలలు ఉద్భవించాయు. నాయకులు రాజకీయ పదవులకు 1932 కే ఎనలేని ఆదరణ - గౌరవ స్థానాలు లభించాయు. ప్రతీ ఒకరు వీటిని ఆసించడంలో పట్టుదలలు పంతాలు పెరిగాయి. ద్వేషాలు వక్రభాష్యాలు వెలిసాయి.

సంపద అధికారం పరిమితమైనవి. పంచుకోవటానికి తలపడితే తలల్ని తెంచుకోపడం తప్పించి గమ్యస్థానం చేరలేము. పోరాటపడిన ఇవి విజృంభిస్తాయి.

విప్లవభావాలుగా సోషలిస్టు నినాదాల పేరుతో వ్యక్తిగత స్వార్ధపరత్వ రాజకీయ కార్యకలాపాల్ని సాధించుకొనటాననికి వర్గాలు, గ్రూపులు, బయలు దేరాయి.

రామమనోహర్ లోహియా - నెహ్రూ ఇరువురు ఛేదించారు. 1936 నుండి ఈ విభేదాలు బాగా బలం పుంజుకుంన్నాయి. ఏ పదవుల సాధన కోసం స్వార్ధం బయలుదేరిందో రాష్ట్రాల్లోను అవి విజృంభించాయి. ఆంధ్రలో రాజకీయ నాయకులు సిద్ధాంత రీత్యా విడివడిపోయారు. రానురాను ఈ విడిపోవడం పదవులను చేపట్టడానికా నాయకత్వం సంపాదించడానికా అన్నట్లు రూపోందాయి.

ఆంధ్రలో ప్రకాశం వర్గం అనేదొకటి రూపొందింది ప్రతీకగా పట్టాభి, శీతారామయ్య వర్గం తయారైంది.

పైరెండు వర్గాల్లో ఏ వర్గం ప్రజల సంక్షేమానికి భావిభానోదయానికి ఉటకరిస్తుందోఆ వర్గంలో చేరని వేరే వర్గం ప్రొఫెసర్ రంగాగారి అధ్వర్యమున రూపొంది - వీటితో సరిసమానమైన వర్గంగా తలెత్తింది.

గౌతు లచ్చన్నగారు ఆంధ్రలో ప్రొఫెసర్ రంగాగారి అనుచరుడు జైలు నుండి లచ్చన్న విడుదల సమయానికి పట్టాభి అధ్యక్షులు, అయితే ఎన్నికలొచ్చాయి. శ్రీ టంగుటూరి ప్రకాశం అధ్యక్షులు పేరెన్నికగన్న రాజకీయం నాయకుడు అఖిలభారత స్థాయిలో నెహ్రూ వర్గంలో సర్దార్

వల్లభాయిపటేల్ వర్గం, వీరి మధ్య వర్గాలుండేవని గాధలుండేవి. అయితే గాంధీజీ తన అసమానప్రజ్ఞా చతురతతో నైతిక బలంతో వారిరువురిని ఒకటిగా చేసి కధనడిపేవారు.

1945 లో త్వరలో రాష్ట్ర అసంబ్లీలకు ఎన్నికలు జరుగుతున్నట్లు ప్రకటించారు. అప్పటికి అక్షరాస్యులు రేటు పేయర్సు మాత్రమే ఓటర్లు.

మద్రాసు ప్రెసిడెన్సీ ఆంధ్రకాంగ్రెస్ పార్టీకి అధ్యక్షులు టంగుటూరిప్రకాశం పంతులుగారు, కార్యదర్శి, కళావెంకట్రావ్. తమిళ కాంగ్రెస్ పార్టీలో రాజాజీ. కామరాజులు.అధినేతలుగా నున్నారు.

ఆంధ్రాలో ప్రకాశం వర్గం అని పట్టాభి శీతారామయ్య వర్గం అని ప్రఛ్ఛన్నంగా పోరాటం జరుపుతున్న దినాలవి. అయితే కళా వెంకట్రావు ఆంధ్ర కాంగ్రెసు కార్యదర్శిగా ఒక వ్యూహం ఎత్తుగడవేసి పొంచియున్నారు.

"ఒరే కళా రేపు పార్లమెంటరీ బోర్డులో నియమించే వ్యక్తులు ఎవరో మనం ముందుగా నిర్ణయించుకోవాలి. ప్రకాశం పంతులుగారు కళా వెంకట్రావుని పిలిచి అడిగారు. "మీకెందుకు గురువుగారు ఆశ్రమ నాకు విడిచి పెట్టండి, పార్లమెంటరీ బోర్డులో మీరు ఎవరిని నియమించాలన్న వారితోనే పార్లమెంటరీ బోర్డు రూపొందుతుంది. వారే కాంగ్రెసు పార్టీ తరపున నిలబడే వ్యక్తులను ఎంపిక చేసేది. "కళా వెంకట్రావు పంతులు గారికి నమస్కరిస్తూ అన్నారు. "మీరు నిశ్చింతగానుండండి. నేను పానెల్ తయారుచేస్తాను. మీరు చూస్తారుకదా, నావ్యూహం ఎత్తుగడ ఎలాంటిదో ప్రత్యర్థులనెలా చిత్తుచేస్తానో చూద్దురుగానీ." అని అన్నారు. కళావెంకట్రావు.

మీరే కాబోయే మద్రాసు ప్రధాని కావటానాకి మేమంతా కృషి చేస్తున్నాం. అన్ని మీ ఇష్టప్రకారమే జరుగుతాయి."ఆజ్ఞాపించండి. మేము మీ శిష్య పరమాణువులం" అంటూ వెంకట్రావు గారన్న మాటలకు పంతులు గారు మెచ్చుకున్నారు. పంతులుగారు భోళాశంకరుడని పేరుంది. ఎవరేమి చెప్పిన సునాయాసంగా నమ్మేవ్యక్తి. కళా వెంకట్రావు తయారు చేసిన పేనల్ కమిటీని, ప్రకాశం గారే ప్రపోజ్ చేయగా అందరు అంగీకరిస్తారు. పట్టాభివర్గం ప్రకాశం వర్గం ఒకటయి ఉంది. అయితే ఆసరికే తంజావూరు జిల్లోనే

ఉండగానే "రంగా వర్గం" ముఠా ఆగ్గాలపల్లో జోక్యం చేసుకోకూడదని [illegible]
ఉద్యమానికి అంకితమై ఉండాలని నిర్ణయించినందున వ్యవహారం [illegible]
నడిచింది.

"పార్లమెంటరీ బోర్డు" లో నియమించటానికి సభ్యులను ఎ[illegible]
చేయటానికి ఆంధ్ర కాంగ్రెసు బెజవాడలో సమావేశమైనది. పి.సి.సి మెంబ[illegible]
లిచ్చన్న ప్రభృతులు హాజరయ్యారు.

కళా వెంకట్రావు లేచి సభలో పార్లమెంటరీ బోర్డు[illegible]
నియమించవలసిన పేర్లను ప్రకటించి సభామోదమును పొందట[illegible]
అనుమతినడిగారు. "పార్లమెంటరీ బోర్డు"లో నియమించట[illegible]
తయారుచేసిన "పానెల్" లో ప్రకాశం పంతులు వర్గానికి చెందినవా[illegible]
అత్యధిక సంఖ్యాకులు లేరు పంతులుగారు నిశ్చేష్టులయ్యారు.

తంజావూరు జైల్లో రంగాగారి నాయకత్వాన లిచ్చన్నాదులు ఏ వ[illegible]
వారిని ప్రోత్సాహించకూడదు. ముఠా రాజకీయాల్లో తలదూర్చరాద[illegible]
నిర్ణయించుకొన్నారు. ఏ ఒకరు లేచి మాట్లాడలేదు. పంతులుగారు [illegible]
వెంకట్రావుగారు ప్రకటించిన పేనల్ వ్యతిరేకించటానికి తగిన సంఖ్యాధిక్య[illegible]
లేదు. పంతులుగారు కిమ్మనక బోనులోపడిన కేసరిలా ఆనాటి ఆం[illegible]
కాంగ్రెస్ అధ్యక్షులయిన ఊరుకున్నారు. పార్లమెంటరీ బోర్డు ఏర్పడిం[illegible]
సమావేశం ముగిసింది. ప్రకాశంగారి ఆంతరంగిక అనుచరుడు తెన్నేటి
విశ్వనాధం, కొల్విడి లింగరాజజు వగైరాలు ప్రకాశం వద్దకు వెళ్లి ఏర్పడిన
కమిటీగాని కార్యవర్గం గాని మిమ్మల్ని బలపరచదని మీకు ముప్పు అని ప్రకాశం
గార్ని హెచ్చరిస్తారు. కమిటీమార్చాలనిచెప్పారు. అందువలన పంతులుగారిచ్చిన
టెలిగ్రాం ద్వారా రంగా అనుచరులు, పంతులు గారి అనుచరులు మద్రాసు
చేరుకున్నారు.

మద్రాస్‌లో తన నివాసంలో ఒకనాడు ప్రకాశం పంతులుగారు చాలా
హడావుడిలో ఉన్నారు వచ్చేవారు పోయేవారితో తన నివాసం నిండియుంది.
"నమస్కారం పంతులుగారు మీ టెలిగ్రాం అందుకుని వచ్చాను" లిచ్చన్న
[illegible]

ఏదో నామాట మీద నేనిచ్చిన పిలుపు మీద నీకే మాత్రం గౌరవం ఉందని తెలిసింది" పంతులుగారు.

"ఎంతమాట పంతులుగారు" మీరు అన్న మా అందరికీ ప్రేమపాత్రులు. గురువులు

"ఇలా అనే గురువుకి పంగనామాలు పెట్టాడు" ఆ కళావెంకట్రావు.

"ఎవరి విషయాలు మాకు తెలియవు, మావరకు మీరు పెద్దలు పూజ్యులు శలవీయండి" లచ్చన్న భక్తితో అన్నారు.

"సరే విషయాలలోనికి వద్దాం, మీ ఉద్దేశాలు ఏమిటో చెప్పండి"

"ఏ విషయంలో నండీ పంతులుగారు"

"మీరేమి పొలిటీషియన్లు జరుగుతున్నవిషయంజెప్పినవరకు తెలిసికోలేనివారు పొలిటీషన్సుగా పనికిరారురా విషయం తెలుసుకోలేని వాళ్లు మీరెందుకు పనికి వస్తారురా "పంతులుగారు గంభీరంగా లచ్చన్నతో అన్నారు.

ఇంతకూ ఏ విషయం మీరు చెప్పలేదు.

"ఊరకచూస్తూ కూర్చుంటారా, రిక్విజషన్ మీటింగ్ పెట్టి పార్లమెంటరీ బోర్డు నిర్మాణాన్ని తిరగదోడండి.

"ఆ బోర్డు వద్దని నోటీసు పెట్టి మీటింగులో తీర్మానిద్దాం" పంతులుగ చెప్పారు.

ఎన్నికల కమిటి ఒకే ముఠాకు చెందినదని రూఢి అయినది. సవరిస్తే తప్ప ప్రజలకు న్యాయం జరగదన్నారు పంతులుగారు.

"రంగాగారితో మాట్లాడి ఏమైనా చేస్తాం" అన్నారు లచ్చన్న

"మీ గురువు రంగాగారు మాత్రం వద్దంటారా ? జరిగిన అన్యాయానికి వారు మాత్రం తల ఒగ్గుతారా "సహిస్తారా" పంతులుగారన్నారు.

ఏమైన మేము మా గురువర్యుని సంప్రదించనిదే ఈ విషయంలో నిర్ణయం తీసికోం" అని లచ్చన్నగారు నిష్కర్షగా చెప్పడం జూచిన పంతులు

లోలోన ఆశ్చర్యపడ్డారు. ఆతని గురుభక్తికి రంగాగారు అనుమతించక పోతారా అని మరల ధైర్యపడ్డారు.

లచ్చన్న కందుల ఓబుల్‌రెడ్డి, ఎన్.వి.నాయుడు, మన్నెం అంజయ్య మద్రాసు నుండి బయలదేరి రంగాగారి స్వస్థలం నిడుబ్రోలు చేరుకున్నారు. రంగాగారికి విషయం విన్నవించారు. ఈ విషయంలో మనం తటస్థం వహించితే మంచిదేమోననిపిస్తుంది, రంగాగారన్నారు.

లేదు రంగాజీ మనం తటస్తం వహిస్తే పంతులుగారు వెనుకబడతారు అంతేగాదు ఆ కళా వెంకట్రావు అన్ని విధాలా మనల్ని త్రొక్కిపెట్టడానికి శతథా ప్రయత్నిస్తారు. పట్టాభిని కూడ ప్రక్కకు నెట్టి తానే అన్నిటికి సిద్ధపడతారు. మొక్కయి వంగనిది మ్రానై వంగుతుందా. ఈ దశలోనే కళా వెంకట్రావుగారు కుట్రను భగ్నం చేయమని వాదించడం జూచి రంగాగారు మెత్తబడ్డారు. మహామేధావి రంగాజీ ఎందుకు వద్దన్నారన్నది తరువాతగానీ లచ్చన్న గారికి తెలిసిరాలేదు.

గురువుగారి అనుమతిని తీసికొని లచ్చన్నగారు ప్రతి జిల్లాలో గల రంగా అనుచరులతో రిక్విజిషన్ నోటీసు నివ్వటానికే సమాయత్తమైనారు. ఫార్వర్డు బ్లాకు నాయికలు ఇందులో కలసారు. జిల్లాల పర్యటించి సంతకాల్ని సేకరించి మీటింగు పెట్టమని కోరారు, పార్టీ నియమ నిబంధనావళి ననుసరించి రిక్విజిషన్ నోటీసుపై మీటింగు పెట్టక తప్పలేదు. రాజమండ్రిలో మీటింగు ఏర్పాటు చేసారు. సభ్యులకు నోటీసు యిచ్చారు. అందరూ రాజమండ్రి చేరారు.

రాజమండ్రిలో రిక్విజిషన్ ఇక సమావేశం జరుగుతుందనగా కళా వెంకట్రావు గారు కప్పగంతుల సుబ్బారావుగారిని లచ్చన్నగారి వద్దకు వెళ్ళి రాయభారం జరపమన్నారు.

లచ్చన్నగారు, కిల్లి అప్పలనాయుడు గారు రాజమండ్రిలో ఒక హోటల్‌లో బసచేసి యున్నారు కళా వెంకట్రావు, సుబ్బారావుగారు వెంటతీసుకుని బసకు చేరి లచ్చన్నగారిని కలిసారు. రాత్రి 10 గంటలకు "లచ్చన్నగారూ, వినండి మాతో సత్సంబంధం ఏర్పరచుకోవడం మంచిది".



[illegible] గారి మహాజన ముద్రణాలయాన్ని ప్రారంభోత్సవం చేస్తున్న నాటి హైకోర్టు జస్టిస్ కె. రామస్వామి, బి.ఎస్.ఎ [illegible] కె. రంగదాస్ ప్రింటింగ్ ప్రెస్ ప్రారంభోత్సవ సందర్భంగా పూజ చేస్తున్న అచ్చన్న



మహాజన వారపత్రిక విడుదల సందర్భంగా విచ్చేసిన నాటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానంద రెడ్డిగారితో అచ్చన్న



అచ్చన్నగారికి హైదరాబాదులో తనకొక నివాసగృహ మేర్పడటానికి విరా[illegible]
సేకరణ ద్వారా చెప్పుకోదగిన కృషి సల్పిన పిన్నమనేని లింగయ్య చౌదరి



స్వతంత్ర పార్టీ రాష్ట్ర ప్రతినిధుల సమావేశంలో ప్రసంగిస్తున్న అచ్చన్న అఖిల
భారత స్వతంత్ర పార్టీ సెక్రటరీయం ఆర్ మసాని - ఆచార్య రంగా, యన్.
దండేకర్, [illegible] లాల్ పటేల్, జి. చంద్రమౌళి [illegible] జగన్నాధం గార్లను
చూడవచ్చు.



నాటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
జలగం వెంగళరావుతో అచ్చన్న, విజయభాస్కరరెడ్డి



వి.వి. రమణగారిని సన్మానిస్తూ - అచ్చన్న



అచ్చన్నగారి 58వ జన్మదినోత్సవమును బందరులో అచ్చన్నగారికి ఘనంగా జరిపిన స్వర్గీయ శ్రీ కొ [illegible]

"మీరు రాజకీయ సంబంధాల్ని చర్చించవద్దు. నాజీవితంలో ఏ మార్గం మంచిదో ఎవరు నాకు గురువర్యులో, పూజనీయులు మార్గదర్శకులు నేను ముందే ఎన్నుకుని యున్నాను." లచ్చన్న అన్నారు.

అది సరే లచ్చన్నగారు మీతో ఒక విషయం చెప్పాలి బోర్డుకి పాత పానెల్ ఉండాలని మీరు మరల కోరిన ఉత్తర విశాఖ జిల్లాలో మీరు చెప్పిన వాళ్లకు రాబోయే ఎసెంబ్లీ ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థులుగా నిర్ణయిస్తాము. మీఇష్టం వచ్చిన వాళ్లను రికమెండ్ చేయండి. అంగీకరిస్తామని చెప్పారు.

బాగుంది. మీరు చెప్పినట్లు విన్న మమ్మలిని అసెంబ్లీ ఎన్నికలలో పార్టీ తరపున పోటీ చేయటానికి అధిష్టానవర్గం అంగీకరిస్తుందన్నమాట. క్షమించండి. వర్గాల్ని గ్రూపుల్ని మేము పోషించం.

'మేము గెలిస్తే మంత్రివర్గంలో స్థానం కూడ యిస్తామన్నట్లు మీకు తెలియజేస్తున్నాము. ఆ జిల్లాలో పుల్లెల శ్యామసుందరంగారి తరువాత మీరే కదండి మొదటి వ్యక్తులు మంత్రిపదవి మీకు తప్పదు" ఒప్పించటానికి తీవ్రప్రయత్నం చేస్తారు.

చూడండి కళా వెంకట్రావుగారు స్వరాజ్యం మనం బ్రతికుండగానే చూస్తారని, మేముగాని, మీరుగాని కాంగ్రెసులో చేరలేదు. పదవులు, అధికారం ప్రస్తావన తప్పు. రాయవేలూరు జైలులో నా జాతకం చూసి మీరన్న మాటలను నేను మరచిపోలేదు. రిక్విజిషన్ నోటీసిచ్చిన 'మేము, మరల ఎలా ఉపసంహరించుకొంటాము.

పోనీ మీరు తటస్థంగా నుండండి. మా అభిమానం సంపాదించవచ్చు అలా అయితే మేము ఇచ్చిన హామీను అమలుపరుస్తాం. వాళ్ల అభిమానం పొందవచ్చు నన్ను, నమ్మండి లచ్చన్నగారూ" లచ్చన్న తెలిపిన మాటలు విని మరి లాభం లేదనుకుని మరలి వెళ్లాడు.

"సమావేశం ప్రారంభం బోర్డును ఏర్పరచటానికి సర్వాధికారాలను ఈ సమావేశం అధ్యక్షునికే దత్తత చేస్తున్నది" అన్న తీర్మానం సమావేశంలో ప్రవేశపెట్టారు. కళా వెంకట్రావు ఓడిన్నాడె. ఓడిన్నక కూర్చొని తీర్మానం నెగ్గడంతో విషపునవ్వులె వెదజల్లి అందరితో చప్పట్లు చరిచారు. తీర్మానం నెగ్గింది. ప్రకాశం పంతులుగారు బోర్డును ఏర్పరచాలి. అయితే ప్రకా

పట్టాభి ఇరువురు లోలోన కుమ్మక్కై రంగా వర్గాన్ని విస్మరించి మరల ఈ ఇరువురి వర్గాలలో నున్నవారితోనే పానెల్ సభ్యులను నిర్ణయించారు.

ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షులు ప్రకాశం పంతులుగారు "పానెల్" ప్రకటించారు. బోర్డులో ఎవరెవరు సభ్యులన్నదీ వివరిస్తూ నోటిఫికేషన్ యిచ్చారు. అది జూచిన లచ్చన్న ప్రభృతులకు ఆశ్చర్యం తప్ప ఏమీ మిగలలేదు.

పార్లమెంటరీ బోర్డువారు అసెంబ్లీ ఎన్నికలకు అభ్యర్థుల ఎంపిక కోసం జిల్లాల పర్యటన ప్రారంభించింది. విశాఖ జిల్లా పర్యటిస్తూ విజయనగరం రాజావారి 7వ నెంబరు బంగ్లా వసతి గృహంలో విడిది చేసింది. బిలాబిలాలు ప్రదర్శన ప్రారంభమైంది. కార్యకర్తలతో వసతి గృహం నిండిపోయింది. ఏఏ నియోజకవర్గంలో కాంగ్రెసు తరపున ఎవరు పోటీ చేయాలో నిర్ణయిస్తారు. అన్ని నియోజక వర్గాలలో అభ్యర్థుల ఎంపిక ఏమంత కష్టతరం కాలేదు. టెక్కలి నియోజకవర్గంలో ఎవరిని కాంగ్రెస్ అభ్యర్థిగా నుంచాలన్న విషయంలో తర్జన భర్జనలు జరిగాయి. ఇచ్ఛాపురం సోంపేట టెక్కలి తాలూకాలో ఆనాడు ఒక నియోజకవర్గంగా నుండేవి. రేటుప్లేయర్లు చదువరులేకదా ఓటర్లు నియోజక వర్గాలనాడు పెద్దవిగా ఉండేవి.

టెక్కలి నియోజకవర్గంనుండి సుమారు 1000 మంది కాంగ్రెసు వర్కర్లు వచ్చి ఎలక్షన్ (ఎంపిక) కమిటీ పెద్దలు వద్ద లచ్చన్నగారికి టిక్కెట్టు యివ్వాలన్న డిమాండ్ చేసారు. లచ్చన్న గారిపై లోలోన మండిపడి పోతున్న పార్లమెంటరీ బోర్డు సభ్యులు ఆ కార్యకర్తలను ఎదిరిస్తూ వారినిట్లా మాట్లాడారు.

"మీరంతా లచ్చన్నగారికి సీటు యిమ్మంటున్నారు ఎందువలన" బోర్డు సభ్యుడు అడిగాడు.

"మీరు కాంగ్రెసు పెద్దలై ఆ మాట మమ్మల్ని అడగడం మాకు విచారంగా ఉంది. మీలో ఏ ఒక్కరికి తీసిపోని దేశభక్తుడు మా లచ్చన్న" గద్దించారు వర్కర్లు.

[illegible] సభ్యులకు నిరూపించండి" కార్యకర్తలు

"మందసా రైతులపై పోలీసులు కాల్పులకు అచ్చన్నగారే బాధ్యుడు" బోర్డు మెంబరు.

"మీరు కక్షతో వాదిస్తున్నారు" కార్యకర్తలు.

"మీరాతనిపై అభిమానంతో మాట్లాడుతున్నారు తప్పించి క్విట్ ఇండియా ఉద్యమంలో అచ్చన్నగారు శాంతి అహింసల్ని పాటించారా ? పార్టీ క్రమశిక్షణలను ఉల్లంఘించారు" దేశానికి స్వాతంత్ర్యం రావాలని పోరాడటం నేరమా ఇదెక్కడి అన్యాయం కార్యకర్తలు

"నిజమే పార్టీ వ్యష్టి సత్యాగ్రహం జరపాలని పిలుపు ఇచ్చింది. అచ్చన్న అనుసరించాడా !పార్టీగొప్పదమీఅచ్చన్నగొప్పవాడా".

"ఏదో సత్యాగ్రహం చేసి జైలుకెళ్లి మీ అందరిలా అతను దేశం కోసం పోరాడలేదా ? మా అచ్చన్న కన్న ఎందులో గొప్ప మీరంతా వళ్లుమండిన కార్యకర్తలు అరిచారు.

"మీరు కాంగ్రెస్ కార్యకర్తలుగా మెలగలేదు. అల్లరి చేస్తే భయపడం".

"మీకు మా అచ్చన్నగారు భయపడరనే గదా వారికి టిక్కెట్టుయివ్వక ఈ ప్రశ్నలన్ని, ఏ ఒకరి గర్వాన్ని మా అచ్చన్నగారు అదిమి పెట్టగలరు. ఏ ఒకరి రాజనీతిని మా అచ్చన్నగారు తిప్పిగొట్టగలరు".

"వాదన ఎందుకు వారి అభిప్రాయాలు వారు చెప్పారు మన అభిప్రాయం మనం చెబుతాం " అచ్చన్నగారన్న అభిమానం ఉన్న బోర్డు మెంబరు

"మేము చెప్పిన అచ్చన్న గారిని కాదని మీరు ఇతరులకు టిక్కెట్టు ఇచ్చి ఎలా గెలిపించుకుంటారో మేము చూస్తాం" అంటూ కార్యకర్తలు వెనుకకు మరలారు.

సభ్యులకు కార్యకర్తలకు జరుగుతున్న వాదన ప్రతివాదనలను మౌనంగా వింటున్న ప్రకాశంగారు ఒక మాట కూడ ఆడలేదు. ఆంధ్రకేసరి రాజకీయ తాంత్రిక బోనులో చిక్కిందేమో. అచ్చన్నగారు కూడ వాదన ప్రతివాదనలను వింటూ ముందే కూర్చొన్న ఏ ఒకరి ప్రశ్నకు అడ్డుతగల లేదు సరిగదా మౌనంగా చిరునవ్వు నవ్వుతూ కూర్చొన్నారు. స్థితప్రజ్ఞతగల అచ్చన్నగారికిదొక జీవన్మరణ సమస్య కానేకాదు. జీవితంలో ఎదుర్కొగల అనేక సంఘటనలలో ఇదొక సంఘటన. తాత్విక మనస్తత్వం కలవారికదొక

మానసిక ఆందోళనను తెచ్చిపెట్టలేదు సరికదా "క్షుద్రం హృదయ దౌర్బల్యం" అనే లచ్చన్నగారిని ఆతని మానసిక ధైర్యాన్ని ఇసుమంతయినా చెదరగొట్టలేకపోయింది.

ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షులు తటస్థం వహించడంతో కళా వెంకట్రావు రాజకీయ పాచికలు వేయడంతో లచ్చన్నగారికి కాంగ్రెస్ టిక్కెట్టు లభించలేదు. రొక్కం రామ్మూర్తి నాయుడు గారికి లభించింది.

లచ్చన్నగారు సరిపెట్టుకున్నా అనుయాయులు ఊరుకోలేదు. దేశభక్తి కొండా వెంకటప్పయ్యగారి అధ్యక్షతన గుంటూరులో సమావేశమై, రాష్ట్రస్థాయిలో స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న అనేక త్యాగధనులకు పట్టాభివర్గం, పంతులుగారి వర్గం అని తేడా చూపి ఎన్నికల్లో పోటీచేయుటకు టిక్కట్టు నిరాకరించినందున వృద్ధ కాంగ్రెస్ నాయకులకు అసంతృప్తి కలిగింది. తత్ఫలితమే ఆంధ్రా కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు చాలామంది వ్యక్తులను విస్మరించిందని, అన్యాయం జరిగిందని, కేంద్ర పార్లమెంటరీ బోర్డుకి తీర్మానిస్తు ఒక మహాజరును తయారుచేసారు.

ఢిల్లీ కాంగ్రెస్ అధిష్టానవర్గానికి ఆనాడు తలమానికం సర్దార్ వల్లభాయి పటేలు. వారే సర్వాధికారాల్ని కలిగియుండేవారు, వారి అభిప్రాయాల్ని నెహ్రూ గాంధి ఇరువురు గౌరవించేవారు.

బలహీనవర్గాలనాయకులకు బలహీనవర్గాలవారికి ఆనాటికి ఈనాటికి పట్టిన గతి ఇదే అన్నది చారిత్రిక సత్యం. యుద్ధం చేసేటప్పుడు సైనికుడు కావాలి, రాజ్యందక్కి సింహాసనం అధిష్టించేసరికి ఆసింహాసనం రాజుగారికి దక్కాలి. ఆర్థికంగా, సాంఘికంగా బలహీనపడినవారే ఏనాడూ దేవికయిన బలియై పోతుంటారు. అవకాశాలనందటానికి అనువైన పరిస్థితులకు దూరంగా నెట్టివేయబడుతూమంటారు.

ఓటర్లలో అత్యధిక సంఖ్యాకులు బలహీనవర్గాలవారు అధికార స్థానాల్లో పదవుల్లో అధికారాల్లో మునిగితేలినవారు బలమైన వర్గాలవారే. దేశంలో ఎటు చూచిన బలహీనులు అసంఖ్యాకులు, దేశంలో ఏరా ష్ట్రముస ముఖ్యమంత్రిగా బలహీనవర్గాలకు చెందిన వ్యక్తి కావడం గగన కుసుమంగా

మారుతున్నది. అధికార సంపదలకు దూరంగానున్న ఏఒకరు ఏమి సాధించగలరు వాటిని కలిగిఉన్న వారిని ఎలా ఎదిరించగలరు. ఈ ప్రశ్నలకు జవాబులివగలవారు లచ్చన్నగారే.

నాయకుడు ప్రజలను అదుపులో నుంచగలిగిన సమర్ధత శక్తి ఉన్నంతవరకు సమాజంలో ప్రశాంతత క్రమశిక్షణ నెలకొని ఉంటుంది. అదే నాయకుడు ప్రజల అభిప్రాయానికి కాదని నిర్ణయాలు చేస్తే, అది విషమ సమస్యలకు దారితీయవచ్చు.

లచ్చన్నగారిని అందరూ స్వతంత్ర అభ్యర్థిగా పోటీచేయమన్నారు. కాంగ్రెసును ఎదిరించి దెబ్బతీయాలన్నారు. లచ్చన్న స్వతంత్ర అభ్యర్ధిగా నిలుచున్న ఏ ఒకరు గెలువలేరన్నది ఆనాడు అందరూ నమ్మే సార్వత్రిక సత్యం. లచ్చన్న పై ఉత్తర విశాఖ ప్రజలకున్న ఆదరణాభిమానాలటు వంటివి.

లచ్చన్నగారు స్టేటుమెంటు ఇచ్చారు. నేను కాంగ్రెసు అభ్యర్థినే బలపరుస్తున్నా. నేను పోటీ చేయడమన్న ప్రశ్నలేదు అని, అహర్నిశలు కష్టించి కాంగ్రెస్ అభ్యర్థి నామినేషన్ ప్రతిపాదించి కాంగ్రెసు అభ్యర్థి రామ్మూర్తిగారిని అత్యధిక ఓట్లసంఖ్యలో గెలిపించారు. కాంగ్రెసుకు ఘనవిజయాన్ని తెచ్చిపెట్టారు.

కొండతో ఢీకొట్టగల గుండెధైర్యం, ఎదుటివారినెదిరంచే శక్తియుక్తులు దేశంకోసం త్యాగం చేసే మహత్తర గుణం ఉన్న లచ్చన్న గారికే ఇంత జేసిన రాజకీయ రంగాన కాలూని నిలబడటానికి అన్ని అడ్డంకులు ఎదురైన ఇక సామాన్య బలహీనవర్గాలకు చెందిన వ్యక్తి రాజకీయరంగాన అడుగిడి నిలద్రొక్కుకోవడం అసామాన్య విషయమే అవుతుంది.

గాంధీజీ అంబేద్కర్ కృషి ఫలితంగా షెడ్యూల్డు కులములు, షెడ్యూల్డు తెగలకు రిజర్వేషన్లు ఫలితంగా, శాసన సభలో కేంద్రంలో సభ్యత్వాలు లభించాయి. వెనుకబడిన వర్గాలకు సౌకర్యం, రిజర్వేషన్లు లేవు కదా! దరిమిలా పంచాయత్‌రాజ్ ఎన్నికలలో ప్రవేశ పెట్టబడినాయి.

అసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో అత్యధిక సంఖ్యాకులు పట్టాభివర్గానికి చెందినవారు గెలుపొందారు. ప్రకాశంగారి అభిమానులు అత్యధికంగా

గెలుపొందారు.

మద్రాసు ప్రధాని కావాలన్న మద్రాసు ప్రెసిడెన్సీ శాసనసభలో అత్యధిక సంఖ్యాబలం ఉండాలి కదా.

తమిళనాడు కాంగ్రెస్‌లో రాజాజీ అనుయాయులు అత్యధిక సంఖ్యలో గెలుపొందారు. కామరాజుగారి అనుచరులు తక్కువ సంఖ్యలో గెలుపొందారు. రాజాజీ మద్రాసు ప్రధాని కాగలరేమో అని భావించిన కామరాజు ప్రకాశంగారికి తన బలాన్నివ్వ అంగీకరించారు.

తమిళనాడు కాంగ్రెస్ కామరాజు నాడార్ ఏంటీ వర్గం సహాయ సానుభూతులతో ప్రకాశంగారు మద్రాసు ప్రధాని అయ్యారు. ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్ష పీఠానికి వేరొకరిని ఎన్నుకోవలసిందిగా ఢిల్లీ కాంగ్రెసు అధిష్టాన వర్గం ఆంధ్రకాంగ్రెస్ కమిటీని ఆదేశించింది.

# 24. ఉద్యమ నిర్మాణకర్తగా లచ్చన్న

జీవితంలో ఉద్యమించి ఉత్తేజితుడయి ఉవ్వెత్తున ఎగసి స్వరాజ్య సాధనలో తనసర్వస్వం అర్పించటానికి సిద్దపడిన లచ్చన్నకు 1946లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అనుకూల వాతావరణ స్థితిగతులను కల్పించింది.

ప్రకాశంగారు మద్రాసు ప్రధానిగా మంత్రివర్గం ఏర్పరచిన తదుపరి ఆంధ్రకాంగ్రెస్ సాంవత్సరిక ఎన్నికలు జరిగాయి. నాటికి ఆంధ్రకాంగ్రెస్‌లో బలీయమైన వర్గాలు గూడు కట్టుకొని ఉన్నాయి. ప్రకాశంగారి వర్గం వారి అనుయాయులు తెన్నేటి విశ్వనాధం, కొవ్విడి లింగరాజు వెన్నెలగంటి రాఘవయ్య, రంగాగారిని సమర్థించారు. సంజీవరెడ్డి వర్గం వారి అనుయాయులు కళావెంకటరావు, గొట్టిపాటి బ్రహ్మయ్య, సంజీవరెడ్డిని వ్యతిరేకించే రంగాగారి వర్గం లచ్చన్న! ఆనాటికి కాంగ్రెసులోనున్న సుందరయ్య, అల్లూరి సత్యన్నారాయణరాజు, మద్దూరి అన్నపూర్ణయ్య, కాంగ్రెసులో అతి వాదులు ఆనాటికి రంగ వర్గీయులుగా భావించబడ్డారు. మితవాద వర్గంనుండి శ్రీసంజీవరెడ్డి అదిష్టాన వర్గం అభ్యర్థిగా ప్రకటించబడగా, అతివాద అభ్యర్థిగా శ్రీరంగాజీ పోటీకి తలపడి అధ్యక్షునిగా ఎన్నుకోబడతారు. రంగా అధ్యక్షునిగా కందుల ఓబులరెడ్డి, కార్యదర్శిగా లచ్చన్న దుగ్గిరాల బలరామ కృష్ణయ్యలు సహాయ కార్యదర్శులుగా ఎన్నుకోబడతారు. తిమ్మారెడ్డి వైస్ ప్రెసిడెంట్.

1946 నుండి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులుగా రంగాజీ ఎన్నుకోబడుతూ 1951 వరకు అధ్యక్షునిగా తన పదవీ బాధ్యతలను నిర్వహిస్తూనే వచ్చారు.

## కాంగ్రెస్ ఆర్గనైజేషన్‌లో పెనుమార్పులు

తన రాజకీయ గురువు కాంగ్రెస్ అధ్యక్షపీఠం అలంకరించిన మరుక్షణం శిష్యుడు లచ్చన్న తన ఉద్యమ పరిధిని రంగా ప్రోత్సాహంతో పెంచారు. లచ్చన్నగారికి రంగాజీ కాంగ్రెస్ సేవాదళ్‌ను, కార్మిక సంఘాలను

నిర్మించి ప్రోత్సాహించాలని ఆదేశించారు. లచ్చన్నగారికి కార్మిక యువజన వెనుకబడిన తరగతుల సంక్షేమ కార్యక్రమాలు నిర్వహించటంలో తగిన పాత్రను చేపట్టవలసినదిగా ఆంధ్రాకాంగ్రెస్ సంస్థ అభిమానించి ఆశీర్వదించింది. ఇతర తనతోడి కాంగ్రెస్ వర్కర్లకు నాయకులకు ఇతర వ్యాసంగాలు, వ్యాపకాలు ఉంటాయేమో, లచ్చన్నగారి కానాడు దేశం కాంగ్రెస్ ఆలోచన తప్ప అన్యదా ఏనాడు పట్టించుకొనని వ్యక్తి అని ఆనాడే పేరొందిన నాయకుడు.

ఆనాటికి లచ్చన్న గారి వయస్సు 37 సంవత్సరాలు అయిన స్వంత విషయసుసి.సాంసారిక బంధమన్న ఆలోచించి ఎరుగని దేశభక్తితో సమ్మిళితమైన వ్యక్తి. స్వరాజ్యం లభిస్తేనే తప్ప వివాహం అనేది తావాలోచించని విషయం. అక్కరకురాని సంగతి-శక్తిని-ఉక్తిని-కాలాన్ని-ఉద్యమాన్ని రూపొందించడం, కొనసాగించడంలోనే వినియోగించే రాజకీయనాయకుడు.

లచ్చన్నగారు రాజకీయంగా రాష్ట్రస్థాయికి ఎదిగారు. ఆర్థికంగా ఏమాత్రం అవకాశంలేని స్థితిగతులను చేరుకున్నారు. లచ్చన్నగారికానాటికి అవసరమైనవి కాస్త తిండి, ఉండటానికి ఒకచోటని లేదుగా, దేశం నలుమూలల తిరగడమేకదా - కట్టు కోవడానికి గుడ్డ - ఇక తనకున్నది ఎవరు ఆనాటికి తల్లి అన్నయ్య వద్ద తలదాచుకొనగా ఉన్న అక్క అత్తవారింటనుండగా తను దేశం కొరకు పాటుపడటమే తన ధ్యేయం.

## ప్రజాపంథాలు

రంగాజీ కాంగ్రెస్ అధ్యక్షపీఠం అలంకరించిన వెంటనే అనూహ్యమైన కొన్ని కార్యక్రమాలు తీసికొన్నారు.

రైతోద్యమాన్ని నడిపిన రంగాజీ దేశ స్థితిగతులను బాగా తెలిసికొన్న [illegible]. కేవలం స్వరాజ్య సాధనే భారతీయులకు ముక్తి మోక్షాలను [illegible]దించలేదు. ఇతర రంగాల్లో భారతీయులు నిపుణులై ఉండాలి. [illegible] దేశంలో అన్నిస్థాయిల్లో ప్రజాసంస్థలు [illegible] అయిన రంగా తన శక్తియుక్తులను

వినియోగించి సంస్థను పట్టిష్టపరచి ఇతర పార్టీలను అధిగమించే శక్తి యుక్తులను పెంపొందించటానికి అనేక ఆర్గనైజేషన్సులకు రూపమేర్పిరిచారు.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యావర్గ సమావేశం జరిపి ఈ దిగువ వర్గా సంఖ్యను నేర్పాటు చేసారు.

1. కాంగ్రెస్ యువజన ఆర్గనైజేషన్ 1) కాంగ్రెస్ సేవాదళం
2. కిసాన్ ఆర్గనైజేషన్
3. కార్మిక ఆర్గనైజేషన్
4. విధ్యార్ధి కాంగ్రెస్

5. మహిళా కాంగ్రెస్

6. కాంగ్రెస్ సాంస్కృతిక ఆర్గనైజేషన్ : ఈ ఆర్గనైజేషన్‌లో మూడింటిని నిర్వహించమని ఆనాటికి కాంగ్రెస్ సహాయకార్యదర్శి అయిన లచ్చన్నగార్ని అప్పగిస్తారు.

7. కాంగ్రెస్ ట్రేడ్ యూనియన్, ఆర్గనేజేషన్

సమాజంలో అన్నివర్గాలవారికి ఆర్గనైజేషన్ లుండాలన్న తన విధానానికి రూపురేఖలనిచ్చినవారు రంగా, వాటిని ఆంధ్రలో పరివ్యాప్తం చేయ సిద్ధపడినవారు లచ్చన్న.

దేశస్వాతంత్ర్యం కొరకు పోరాటం తప్పించి, వీటివల్ల ఉపయోగం ఏమిటి అని భావించినవారు అప్పుడు లేకపోలేదు. అయితే ఆనాటి కమ్యూనిష్టులు, రంగా పథకాన్ని పసిగట్టారు. వారి ఉద్యమం బలహీన పడు తుందేమో నన్న భీతి కూడ వారికి కలిగింది. అందుకే కాబోలు కాంగ్రెస్‌లో ఉన్న మితవాదులు ఆనాటి పత్రికల్లో "పది తలల రంగా" అని కార్టూన్ వేశారు వ్యంగ్యంగా.

విభిన్నవర్గాలతో కూడిన సమాజంలో సమైక్యత "వర్గ సంవిధానం" వలననే జరగాలని రంగాజీ భావించారు. సంఘం ఏ ఒక వర్గంవలననోగాక,

అసంఖ్యాక వర్గాల ప్రేరణ ప్రోద్బలాల వలననే సమున్నతస్థితిని చేరుకోగలరని భావించిన రంగాజీ శిష్యుడు సర్దార్ గౌతులచ్చన్న. ఆంధ్రలో రంగాజీ 1934లోనే మొట్టమొదటిగా రాజకీయ పాఠశాలను ప్రారంభించిన రాజకీయ మేధావి. తదుపరే కమ్యూనిస్టులు రాజకీయ పాఠశాలలను నడపడం ప్రారంభించారు.

ఏస్థాయిలోనైన సంఘాన్ని స్థాపించడం నడపడం, ఉద్యమాన్ని రూపొందించడం - కొనసాగేలాచేయడం - కేవలం ఏ ఒక శక్తిమీదో జరిగేపనికాదు. అహర్నిశలు శ్రమించాలి, తదేకదీక్షా బద్ధులై ఉండాలి. ఆదొక తపస్సుగా జీవితాశయంగా భావించాలి అన్ని ఒడుదుడుకులకు తలొగ్గాలి.

లచ్చన్నగారు సిద్ధపడి - గురువు ఆదేశానుసారం, రంగంలోనికి దిగారు. ఆసరికే రైతోద్యమాలను నడిపిన అనుభవం ప్రావీణ్యతతో, కార్మిక సంఘాలను స్థాపించడం నడపడం ప్రారంభించారు.

రైతోద్యమాలను రంగా లచ్చన్నలు నడుపుతున్న వామపక్ష భావాలున్న ఏ ఒకరు వీరికి ఆడ్డురాలేదు. అయితే ఈనాడు కార్మిక సంఘాలను రూపుదిద్దాలని ప్రయత్నించడంలో, అందరి దృష్టిని రంగా, లచ్చన్నలు ఆకర్షించారు. రైతాంగంనుండి విప్లవం జనించదు. పోరాటం కొనసాగదు అని భావిస్తున్న వామపక్షీయులు కార్మిక సంఘాల్లోనే తమ యావశ్చక్తిని వినియోగించేవారు.

అయితే ఈనాడు రంగా లచ్చన్నలు అటు రైతోద్యమం, ఇటు కార్మికోద్యమం రెంటిని నడపటానికి ఉద్యమించడంతో రాజకీయ రంగం చైతన్యపధంలోనికి వచ్చింది.

కమ్యూనిస్టులు కార్మిక సంఘాల్ని నడుపుటలో కృతకృత్యులయి నట్లు లచ్చన్న ప్రభృతులు లక్ష్యాన్ని సాధించారు. తరచూ వారు వీరు విభేదాలకు లోనైన ఉద్యమనిర్మాతలగా పేర్కొనబడక తప్పలేదు.

## పలాసాలో కాంగ్రెస్ సేవాదళం :

ఉత్తర [illegible] పలాసాలో కాంగ్రెసు సేవాదళం కేంద్రం తెరుస్తారు. [illegible] రెండు మాసాలు నిర్వహించారు. ఇండియన్

నేషనల్ ఆర్మీలో పనిచేసిన యల్.అప్పారావు ఫీల్డు కమాండర్‌గా పోలీసు ఉద్యోగానికి రాజీనామా యిచ్చిన హనుమంతరావు ఆఫీసు కమాండర్‌గా నియమించబడతారు. లేడీస్ వింగ్ కమాండర్ ఇన్‌చార్జిగా శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మ వ్యవహరించారు. శిక్షణకు సేవాదళంలో చేరినవారు 200 మంది. ఇందులో 25 మంది మహిళలు 30 మంది కళాశాల విద్యార్థులు తెలంగాణా నుండి ఆరెల్ల బుచ్చయ్య బాగా పుల్లారెడ్డి (వరంగల్లు) వచ్చి దళంలో పాల్గొన్నారు.

ఇదొక చైతన్య కేంద్రం. ప్రజావాహినిలో దేశం గురించే ఆలోచనను కలిగించిన ప్రయత్నం. లాఠీలసాము, సిగ్నలింగ్ కవాతు సైన్యంలో వీరు మార్చింగ్ చేస్తుంటే చుట్టుపట్లగల అసంఖ్యాక జనానీకం వింతగా చూస్తూ నిలబడేదినాలు. శిబిర నిర్వహణకు చందాలిచ్చిన దేశభక్తులు కూడ శిబిరంలో భోజనాలు చేస్తు ఉండేవారు. ప్రతీపూట శిబిరంలో భోజనాలు చేస్తూండేవారు. ప్రతీపూట శిబిరంలో వందలాదిమంది భోజనాలు చేయడం మనకింకేవిటి "స్వరాజ్యం వచ్చేసింది అన్న భావన ప్రజల్లో కలిగించిన కార్యక్రమం అది.

శిక్షణ కార్యక్రమం ముగింపురోజున అప్పటి మద్రాసు ప్రధాని టంగుటూరి ప్రకాశంపంతులు గారు వచ్చారు. అందరికీ అర్హత పట్టాలను ప్రకాశంగారే స్వయంగా పంచిపెట్టారు. స్నాతకోత్సవంలో సేవాదళ ఆర్గనైజర్‌గా బహువిధాలా కొనియాడబడినారు. ఉత్తరాంధ్రలో ఉత్తేజం తెచ్చిపెట్టిన ఉద్దండ పిండం లచ్చన్న అన్నది ఆనాటి ప్రజల హృదయాల్లో నాటుకొని పోయింది. లచ్చన్నగారు పలాసాలో శిక్షణ పొందిన 200 మంది సుశిక్షితులను, రాష్ట్రవ్యాప్త పర్యటనలో అనేక శిక్షణ శిబిరాలను నిర్వహించుటలో ఉపయోగించారు.

## ఇండియన్ నేషనల్ ఆర్మీ :

సైన్యంకాని సైన్యం భారత జాతీయ సైన్యం. జాతీయవాది వీరస్వాతంత్ర్యయోధుడు దేశభక్తుడు సుభాష్ చంద్రబోసు నిర్మించిన జాతీయసేన ఇండియన్ నేషనల్ ఆర్మీ.

బోసు తీవ్రవాది. గాంధీజీ మితవాది. నెహ్రూజీ మధ్యవాదీ. 1939లో బోసు గాంధీజీ ఎదురు తిరిగిన కాంగ్రెస్ అధ్యక్షపీఠాన్ని అలంకరించిన అకళంక దేశభక్తుడు. దేశానికి స్వాతంత్ర్యం అరక్షణాల్లో రావాలన్న తీవ్రవాది. బ్రిటిషు పాలకులను చీల్చి చెండాలన్న పట్టుదల, దీక్షగల సాహసి.

భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షపీఠాన్ని త్యజించి గాంధీజీ విధానం తనకు నచ్చనందున మారువేషంలో ఆఫ్ఘనిస్తాన్ చేరి అటునుండి జర్మన్ చేరి హిట్లర్‌తో చేయి కలిపారు. తన దేశమాత దాస్య శృంఖలాలను త్రెంచ సహాయాన్ని అర్థించారు.

ఆసరికే రెండవ ప్రపంచ యుద్ధం తీవ్రస్థాయిలో నుంది. బ్రిటిషు వారితో జర్మన్ తలపడి పోరాడుతున్నది. బ్రిటిష్‌వారిని ఇండియానుండి వెడలగొట్టాలన్న జర్మన్ జయిస్తే హిట్లర్‌వలన అది సిద్ధిస్తుందని తలచిన బోసుకి యుద్ధంలో పట్టువడిన భారతీయ ఖైదీలనందరిని "బోసు" బాబు అధీనంలో ఉంచారు. హిట్లర్ బోసు వాళ్ళనందరిని కూడగట్టుకొని "ఆజాద్ హింద్‌ఫౌజ్" అని పేరిడి వారికి నాయకత్వం వహించి సైనిక దుస్తులను ధరించి వారిని వెంటనిడుకొని, ఇండియాలోనున్న బ్రిటిషువారిని వెళ్ళగొట్టి చలో ఢిల్లీ అని నినాదమిచ్చి ఢిల్లీ పట్టుకొనటానికి బోసు పథకంవేశారు. జపాన్ జర్మనీలు ఒకటై బ్రిటిషువారితో పోరాడగా, అమెరికా రష్యాలు తెల్లవాళ్ళ వైపు చేరి యుద్ధం కొనసాగించాయి. రంగూన్ నుండి బర్మా అస్సాం అడవుల మీదుగా తన సైన్యాన్ని నడిపిస్తాడు బోసు. జపాన్ బర్మా ఆక్రమించిన తరువాత బోసు బర్మా చేరుకొని జపాన్ స్వాధీనంలో ఉన్న భారతీయ సైనికులను ఢిల్లీ కోటను పట్టుకోవాలని ఆజాద్ హిందుఫౌజ్ నిర్మిస్తాడు.

బోసు జపాన్ చేరుకొని ప్రవాస ప్రభుత్వాన్ని ఏర్పాటుచేసుకొని ఢిల్లీవైపు ఆజాద్ హింద్‌ఫౌజును నడిపించటానికి ఇంఫాల్ చేరుకున్నారు. భారతదేశ తూర్పు సరిహద్దు ఇంఫాల్ బోసు చేరుకొనేసరికి రవి అస్తమించని తెల్లరాజ్యానికి [illegible] గుబులు రేగింది. బ్రిటిషు సైన్యం ఆజాద్ హింద్ [illegible] జపాన్ సైన్యంతో ఒకవైపు పోరాటం సాగించింది.

ఐ.యన్.ఏ దిగ్బంధనకులోనై ఆహార సరఫరాను అందలేకపోయింది. విమానప్రమాదంలో బోసు మరణించడం జరిగిందని ప్రకటన వెలువడింది. హిరోషిమా, నాగసాకిలపై ఉదజని బాంబులు వర్షించాయి. యుద్ధం పరిసమాప్తమైంది.

బోసు మరణించి యుండకపోతే ఉదజని బాంబుల ప్రయోగం లేకపోతే బోసు ఢిల్లీని స్వాధీనపరచుకొని ఉండేవాడని చరిత్రకారులు అంచనావేస్తారు. స్వరాజ్యం 1945లోనే వచ్చి ఉండేది. యుద్ధానంతరం ఆజాద్‌హింద్‌ఫౌజ్ తరపున సుప్రీంకోర్టులో భూలాబాయి దేశాయి వాదించి దేశంకోసం పోరాడిన వీరికి దేశనాయకుల్లాగే భావించాలని వాదించి విడుదల చేయించారు. ఆనాటినుండి "ఆజాద్ హింద్‌ఫౌజ్ లో పనిచేసినవారెల్ల దేశంలో ఇతర రాజకీయ నాయకులవలె స్వాతంత్ర్యంకోసం పోరాటం కొనసాగిస్తూ వచ్చారు.

పలాసా కాంగ్రెస్ సేవాదళంను నడిపిన లెఫ్టినెంట్ ఆజాద్ హిందుఫౌజ్‌లో కమాండర్‌గా పనిచేసినవారు. పైగా ఉత్తర విశాఖ జులుమూరుకి చెందినవారు. ఎర్రకోట విచారణ ఫలితంగా ఐ.ఎన్.ఏ. దేశభక్తి గలదని భూలా చర్చివాదనతో ప్రేరేపించబడి బొంబాయిలో నావికాదళం తిరుగుబాటు చేసింది. విడుదలైన సైనికుడు రైలులో తాత్కాలికంగా కలసిన లెఫ్టినెంట్ అప్పారావుతో ఆజాద్ హింద్‌ఫౌజ్‌లో చేరమని సన్మానం చేస్తున్నాం మీరు తప్పక పాల్గొనాలని అభ్యర్థించారు.

లచ్చన్నగారు పలాసాలో శిక్షణ శిబిరం నడిపించిన తదుపరి వేరే కార్యక్రమం నడిపించారు. ఆంధ్రనుండి వెళ్ళి ఆజాద్ హిందుఫౌజ్‌లో చేరిన వారినెల్ల అభినందించాలన్న భావనతో లచ్చన్నగారు "ఏలూరు"లో స్వాగత సన్మాన సభ నొకదానిని ఏర్పాటు చేసి దానిని బోసుబాబుకి వ్యక్తిగత డాక్టరుగా పనిచేసిన కర్నల్ రాజు గారిని, అధ్యక్షత వహించమని కోరారు. ఏలూరు జరిపిన సన్మాన సభకు ఆజాద్ హింద్‌ఫౌజులో పనిచేసిన వారెల్లరు హాజరైనారు. లచ్చన్న వారిలోనుండి కొందరిని ఎన్నుకొని ఆఫీసర్స్ కాంపును నిర్వహించాలన్న భావనకు రూపమే పలాసాలో జరిగిన శిక్షణ శిబిరం.

లెఫ్టినెంట్ కమాండర్ యల్.అప్పారావు ఆఫీసు కమాండర్ జి.హనుమంతరావు ఆధ్వర్యమున అచ్చన్న రూపొందించిన వాలంటీర్లకు రాష్ట్రవ్యాప్తంగా పర్యటనకు ఏర్పాటు చేసారు. సుమారు రెండు వందలమంది సైనికులను (ఐ.యన్.ఏ.) తన వెంట నిడుకొని ఒక రైల్వే బోగిని కంట్రాక్టుకు తీసికొని రాష్ట్రమునందలి ప్రధాన నగరాలలో బసలుచేసి ప్రదర్శనలిచ్చి శిక్షణ నివ్వడం కార్యక్రమం విన్యాసాలు జరపడం ఉపన్యాసాలివ్వడం అచ్చన్న చేపట్టిన కార్యక్రమం రాజకీయ నాయకుల్లో ఒక కొత్త చైతన్యాన్ని తెచ్చిపెట్టింది. ఆంధ్ర అంతా ఎవడీ మొనగాడు ఏమిటీ సైనిక విన్యాసం అన్నది వ్యాపించింది.

హింసాత్మకమైన ఈ విధానాన్ని ఎదుర్కోవాలని హింసద్వారా విప్లవంరాదని రంగాజీ అచ్చన్నలు వివరించడమేగాక విప్లవమని చెప్పి హింసాయుత పోరాటానికి ఎదురుతిరిగి నిలబడ్డారు. చల్లపల్లివద్ద లెఫ్టినెంట్ కమాండర్ యల్.అప్పారావు ఒక గ్రామంలో ఎదురు కాల్పులు జరిపారు. రాత్రివేళల గ్రామాల్లో తిరిగి హింసను ప్రతిఘటిస్తారు. నిజానికి భారతదేశానికి స్వాతంత్ర్యము లభించటానికి ఆజాద్ హిందుఫౌజ్ భావన బొంబాయి నావికాదళం తిరుగుబాటు, బ్రిటన్‌లో లేబర్ పార్టీ అధికారంలోకి రావడం ముఖ్య కారణాలుగా నిలుస్తాయి.

జనచైతన్యానికి, జనం మేలుకు జన సౌభాగ్యానికి ఉపకరించిన ఏ సిద్ధాంతాన్ని గౌరవించే అచ్చన్న ఏ ఒక సిద్ధాంతానికి తనేనాడు ఎదురు తిరగలేదు.అయితే శాంతి అహింసలు ప్రాతిపదికలు కావాలి. అదే ధ్యేయాలుగా నుండాలి. ప్రజాస్వామ్యం కావాలి. సామ్యవాదం రావాలి సమసమాజం. వెలకొల్పబడాలి. అందుకే అచ్చన్న గారితో కమ్యూనిస్టులు అనేక సందర్భాలలో కలిసిమెలిసి ఉద్యమాన్ని నిర్వహించారు. అచ్చన్న బీదవర్గాల ప్రతినిధి బహుజన నాయకుడు కలిమిగల వారికెన్నడు కంటకుడే. కష్టాల్లోనున్న వారికి కలిమిని పంచటానికి, కష్టాల్ని ఎదుర్కొంటున్న కార్మిక కర్షక నాయకుడు, కమ్యూనిస్టులకు కంచుకోటల్లా ఉన్న నందిగామ తాలూకాల్లో గూడా అచ్చన్నగారు క్యాంపులు నిర్వహించారు. చల్లపల్లిలో శిబిరం [illegible] శిక్షణతో గ్రామాలకు శిక్షణ యిచ్చిన "కాంగ్రెస్ [illegible] శిబిరాన శిక్షణ పొందినవారు మత కలహాల

సివారణ గస్తీలు తిరగడం ప్రజల్లో సామరస్యాన్ని బోధించడం - శాంతి సౌహార్ద్రాలను పెంపుజేసే వారే కాంగ్రెస్ సేవాదళం లక్ష్యం ఆశయం.

## ఐ.యన్.టి.యు.సి. రాష్ట్రశాఖ – అధ్యక్షత :

1947 సంవత్సరం భారతదేశంలో ఆంగ్లేయుల పాలన అంతం కాబోతున్న వత్సరం. బ్రిటిషురాచరికం మంత్రిత్రయి ప్రతిపాదనలతో భారతదేశాన్ని ఒప్పింపచేసి రాజ్యాన్ని ఇండియన్స్‌కు యిచ్చే పధకాన్ని మనచేత ఆమోదింపజేసే స్థితిగతులకు లోనై ఉన్నారు.

ఇండియాలో వామపక్ష భావాలుగల వర్గం మితవాద భావాలు గల వర్గం మధ్యేమార్గం చేపట్టగలవర్గం, రూపం దాల్చాయి. కాంగ్రెస్ పార్టీ మధ్యేమార్గాన్ని అనుసరించే రీతి నీతిని గాంధీజీ రూపొందించారు. అతివాద భావాలుగల సర్దార్‌వల్లభాయి పటేలు నెహ్రూజీ ఇండియాలో ఏర్పడిన కమ్యూనిష్టు పార్టీని ప్రతిఘటించటానికి కాంగ్రెసు పార్టీని ఆయుత్త పరచారు. కమ్యూనిష్టు పార్టీ కార్మిక, వర్గంలో బలమైన పునాదుల్ని కలిగియున్నందున, కార్మికవర్గాన్ని కూడగట్టుకొని రావటానికి కేంద్ర స్థాయిలో ఢిల్లీలో సర్దార్‌వల్లభాయిపటేల్ ఆధ్వర్యమున ఖండూభాయిదేశాయ్ అధ్యక్షతన ఇండియన్ నేషనల్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ నిర్మాణం జరిగింది. దేశవ్యాప్తంగా దీని శాఖలు నిర్మాణానికి ప్రయత్నాలు జరిగాయి.

ఐ.యన్.టి.యు.సి అధ్యక్షుడు ఖండూభాయి దేశాయ్ రాష్ట్రశాఖ నిర్మాణాన్ని చేపట్టడానికి లచ్చన్న గార్ని నియమించారు. రాష్ట్ర ఐయన్.టి.యు.సి. కి ప్రెసిడెంటుగా బాధ్యతలు చేపట్టారు.

ఆంధ్రకాంగ్రెస్ లచ్చన్నగారికి, అసరికే కార్మిక యువజన మొకబడిన వర్గకులాల ఆర్గనైజేషన్సు ఏర్పరచి ఉద్యమాలను రూపొందించమని కోరి ఉన్నది. రంగాజీ ప్రేరణలో ఎన్నో సంఘాల నిర్మాణం జరిగింది.

ఈనాడు కాంగ్రెస్ సంస్థ రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును స్థాపించమని కోరుతూ తనకే Founder President గా నియమించడం

లచ్చన్నకు ఎనలేని ప్రోత్సాహమిచ్చి కార్మిక నాయకత్వానికి బాటలు వేసింది. రాష్ట్రంలోగల కార్మిక వర్గాలకు లచ్చన్న పౌండర్ ప్రెసిడెంటుగా రూపొందడం హర్షదాయకం అయింది. సింధియాస్టీల నేవిగేషన్ కంపెనీ వర్కర్సు లచ్చన్నగారిని కలసి తమ యూనియన్‌కి అధ్యక్షత వహించవలని కోరారు. అంతవరకు ఆ యూనియన్ కమ్యూనిష్టు ఆర్గనైజేషన్ ఆర్మీ ఆర్గనైజేషన్‌తో అనేక చోట్ల కవాతులు విన్యాసాన్ని జరిపించియున్నారు.

విశాఖనగరంలో ఉన్న కార్మిక యూనియన్‌కి అధ్యక్షుడిగా ఎన్నుకోబడటం, కార్మికులలో తనకంతటి ఆదరణాభిమనాలుండటం, లచ్చన్నగారికి అమితాశ్చర్యం వేసింది. ఆ సరికి ఆ యూనియన్లు 1928లో ఏర్పడి ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు అనుబంధంగా ఉండేవి. లచ్చన్నగారు కార్మికోద్యమ సహచరులుగా ఏలూరు కొమ్మారెడ్డి సత్యనారాయణ గారుండేవారు. రైతోద్యమాలలో అంతవరకు మునిగి తేలుతున్న లచ్చన్న కార్మిక రంగంలో అడుగిడినారు. కార్మిక కర్షకులతో నిండిన "భారత్‌ను సేవించే మహద్భాగ్యం లచ్చన్నగారికి కలిగింది.

ప్రతీ పట్నంలో కార్మిక యూనియన్‌లు తెరిచే ప్రయత్నంలు ప్రారంభమైనాయి. దేనిలో ప్రవేశించిన దానిని పరిపూర్ణంగా సాధించి సత్ఫలితాలను చూడనిదే కంటికి నిద్రపట్టని మనస్తత్వం లచ్చన్న గారిది

చీరాల-పేరాల-అనపర్తి- చిక్కవోలులలో ఐ.యన్.టి.యు.సి. ఆర్గనైజేషన్లు ప్రారంభమైనాయి. రాజమండ్రి భీమిలి, విశాఖపట్నంలో నెలకొనబడినాయి. ఏలూరు, గుంటూరు చిట్టి వలస లలో ట్రేడ్ యూనియన్లు రూపొందాయి. ధవళేశ్వరం (పి.డబ్ల్యు.డి) చిట్టివలస చీరాల-రాజమండ్రిలలో సమ్మెలు హర్తాళ్‌లు జరపడం, కార్మికుల కనీసావసరాల్ని సాధించుకోవడం జరిగింది.

సింధియాస్టీంనేవిగేషన్ కంపెనీ వర్కర్లు ప్రప్రదంగా లచ్చన్నగారి ఆధ్యక్షతన ప్రశాంతంగా సమ్మెను 3 మాసాలు కొనసాగించి pay scale a d

grades లలో విజయం సాధించారు. ఏనాటి నుండో జరి..న pay scale grade జరిగాయి. మొన్నటివరకు మరల జరగలేదు.

Indian National Trade Union రాష్ట్ర కార్యదర్శిగా సింధియాస్టీం నేవిగేషన్ కంపెనీ వర్కర్సు యూనియన్ అధ్యక్షునిగా 3 నెలలు సమ్మె నిర్వహించి, ఫలితాన్ని సాధించారు. మానేజ్‌మెంటును ఒప్పించారు. లచ్చన్నగారు వర్కర్లనందరిని సమావేశపరచి సమ్మె సఫలీకృతం అయ్యేవరకు మీరు ఎవరూ కంపెనీకి రాకూడదు. విశాఖను విడచి మీమీ గ్రామాలకు వెళ్లండి. సమస్య పరిష్కారమైతేనే, మీరు రావాలి. అన్న లచ్చన్న పథకం పారింది. కంపెనీ యూనియన్ కోరికల నంగీకరించక తప్పలేదు. వాల్‌చందు, హిరాచందు ఛైర్మన్, పొంది జనరల్ మేనేజర్, షిప్‌యార్డ్ మేనేజర్ బంక్‌వాలా బొంబాయిలోనున్న Head Office కి యూనియన్ నాయకులను లచ్చన్నగారిని పిలిచింది. స్కేల్సు గ్రేడ్స్ - ప్రమోషన్సు - ఇంక్రిమెంట్సు పేస్కేల్సులో ఉన్నతస్థితి, అన్ని లాభించాయి. మానేజ్‌మెంటు లచ్చన్నగారి మధ్య ఒప్పందం కుదిరింది. కార్మిక విజయం జరిగింది. ఒప్పందం కుదిరిన తేది 1948 జనవరి 30, మహాత్మాగాంధీ మరణవార్తను లచ్చన్నగారు అక్కడే విన్నారు. ఆ మరునాడు కంపెనీ వారిచ్చిన విమానంలో బొంబాయి నుండి ఢిల్లీ వెళ్లి గాంధీజీ అంత్యక్రియలకు హాజరైనారు. చిట్టివలస జూట్‌మిల్లు వర్కర్సు యూనియన్ ప్రెసిడెంటుగా వర్కర్సు కోరికలను అమలు పరచేలా యాజమాన్యం చేత ఒప్పించారు. రైల్ ట్రావిలింగ్ టిక్కెట్ ఎగ్జామినర్స్ యూనియన్ అధ్యక్షతను కూడ చేపట్టి విజయాల్ని సాధించాలి. రాజమండ్రి, భీమిలి, విశాఖపట్నంలో ప్రైవేటు బస్ ఆపరేటర్స్ యూనియన్‌లకు అధ్యక్షత వహించి కార్మికోద్యమాన్ని ముందుకు నడిపినారు. జీతభత్యాలు పెంచడమై చిక్కదోలు అనపర్తిలలో సమ్మెలు జరిపించారు.గుంటూరు జూట్‌మిల్సు ఏలూరు జూటుమిల్సు వర్కర్లతో సమ్మెల్ని జరిపించి కోరికల్ని సాధించేలా కార్మికులను తీర్చిదిద్దారు.

## బందరు జాతీయ కళాశాల విద్యార్థి కాంగ్రెస్ ఆర్గనైజేషను:

లచ్చన్న - సుంకర సత్యనారాయణ 1947-48 లో రెండు సిద్ధాంతం మేరకు తుపాకి గొట్టంద్వార, రాజ్యాధికారం లభిస్తుందని పోరాటం సాగిస్తుండగా ఆ ఉద్యమాన్ని ప్రతిఘటించారు ఈ సంస్థకు అండగా ఉండేది కాంగ్రెసు! నాయలకులు కాంగ్రెస్ రధసారధకులై విద్యార్థి కాంగ్రెస్ ఉద్యమాన్ని లేవనెత్తారు. హిందూ కాలేజి విద్యార్థి యూనియన్ యన్ వీరాచారి - గుంటూరు హిందూకాలేజికి కె. రోశయ్య, బాపట్ల కాలేజి పసుపులేటి కోటేశ్వరరావు ఆధ్వర్యం వహించారు. రాష్ట్రంలో పలుచోట్ల విద్యార్థి కాంగ్రెస్ యూనియన్‌లు ఏర్పడినాయి. రాష్ట్రవ్యాప్తంగా లచ్చన్న తిరిగి విద్యార్థి యూనియన్లను ఏర్పరచడంలో విశేషకృషి సలిపినారు. కె. రోశయ్య ఆనాటి విద్యార్థి కాంగ్రెస్ నాయకుడు లచ్చన్న ఆనాటి పేరెన్నికగన్న కాంగ్రెస్ నాయకుడు.

## స్వరాజ్య సాధన :

1942 క్విట్ ఇండియా తీర్మానంలో భారత జాతీయ కాంగ్రెస్ బ్రిటిష్ రాచరిక పునాదులను పెకలింపజేసింది. అసంఖ్యాక దేశభక్తులు ఉరికంబాలకెక్కారు.

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసింది. భారతీయులు స్వాతంత్ర్య సమరం కొనసాగుతూనే ఉంది. భారతీయులు స్వాతంత్ర్యానికి అనర్హులని మూర్ఖపద్ధతులను ప్రదర్శిస్తున్న బ్రిటిషు ప్రధాని చర్చిల్ బ్రిటన్‌లో జరిగిన ఎన్నికలలో ఓటమి చవిచూసారు. ఇంగ్లాండు లో కన్సర్వేటివ్ పార్టీ పరాజయంపాలై లేబర్ పార్టీ అధికారంలోనికి వచ్చింది. పార్టీ నాయకుడైన ఆట్లె బ్రిటిష్ ప్రధాని అయ్యారు. భారతీయులకు స్వరాజ్యం యివ్వ తీరాలన్న అభిప్రాయంతో ఆనాటి, భారత గవర్నర్ జనరల్ లార్డ్ మౌంట్ బాటన్ నివేదిక మేరకు మంత్రిత్రయ ప్రతిపాదనలను భారతదేశానికి అందచేసారు. బ్రిటిష్ పార్లమెంటు స్వరాజ్యం యిచ్చే తేదీని సమయాన్ని ప్రకటించింది. ఆగష్టు 14వ తేదీ అర్ధరాత్రి తదుపరి ఆంగ్లేయులను

భారతీయులకు అధికారం సంప్రాప్తమయ్యే మధురక్షణం అమృత ఘడియలు ప్రజాస్వామ్యానికి స్వేచ్ఛాసమానత్వాలకు బాసటగా నిలచిన, కాలమిది. దేశం దేశం యావత్తు ఆబాలగోపాలం హర్షాతిశయంతో ఆనందంతో పొంగిపొర్లాడినది. 'దేశపౌరులు, స్వాతంత్రోద్యమ సభలు సమావేశాలు జరుపుకునే మహానందాతిరేకంతో తబ్బిబ్బవుతున్న మహత్తర బృహత్తర దినమది. తెల్లవారితే 15వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవం అసంఖ్యాక కాంగ్రెస్ వర్కర్సు దేశాభిమానులు అభిమానులు, దేశభక్తులు, స్వాతంత్ర్య సమరయోధులు ఉత్తరాంధ్ర ప్రజానీకం యావత్తూ సర్దార్ గౌతు లచ్చన్న తదితర స్వాతంత్ర్య యోధలను సన్మానించటానికి పట్టరాని ఆనందంతో ముందడుగు వేశారు. ప్రతీ ఒక ఆర్గనైజేషన్ యూనియన్ సంస్థ పురంధరముఖులు సర్దార్‌జీని రమ్మని తాము జరిపే స్వాతంత్ర్య దినోత్సవంలో పాల్గొనమని ఆహ్వానించాయి. స్వాతంత్ర్య సమరంలో పాల్గొనికష్టనష్టాలకు గురియైన రాజకీయనాయకునికి ముఖతః స్వరాజ్య సాధనా ఫలితాన్ని వినవారెంతగానో కుతూహలపడినారు.

అయితే సర్దార్ గౌతు లచ్చన్న ఆదే దినమున ఎన్ని ఉత్సవాలకు హాజరు కాగలరు. ఆదినమల్లా లచ్చన్నగారికి స్వాతంత్ర్య దినోత్సవ సమావేశాల్లో పాల్గొనే కార్యక్రమాలతో నిండిపోయింది.

## ఆంధ్ర విశ్వ విద్యాలయంలో బహిరంగ సభ :

1947 ఆగస్టు 15 వ తేదీన ఆంధ్ర విశ్వ విద్యాలయములో గొప్ప బహిరంగసభ. ఆసభలో పాల్గొనటానికి ఎవరిని పిలవాలి. ఉత్తరాంధ్ర నాయకుల్లో పేరెన్నికగన్న స్వాతంత్ర్య సమరయోధుడు లచ్చన్నగారికి, విద్యార్థిలోకంనుండి పిలుపు ఆహ్వానం అందింది. కె.సి.బాలయ్య హనుమంతరావు. ఎ. ప్రభావతి. రామారావు ఆనాడు ప్రముఖంగా పనిచేసిన విద్యార్థి కాంగ్రెస్ నాయకులు లచ్చన్నగారిని ఆహ్వానించక తప్పదని గ్రహించినారు. ఒరిస్సా రాష్ట్ర ప్రముఖ కాంగ్రెస్ నాయకులు హరేకృష్ణ మొహతాబ్ - సభకు అధ్యక్షత వహించమని కోరారు.

లచ్చన్న ఆగస్టు 15వ తేదీన అనేక కార్యక్రమాల్లో పాల్గొని

సాయంత్రానికి ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆవరణలో జరిగిన బహిరంగ సభకు చేరుకున్నారు.

అధ్యక్షత వహించినవారు ఒరిస్సా రాష్ట్రమున పేరు ప్రఖ్యాతులందిన దేశభక్తుడు, స్వాతంత్ర్య సమరయోధుడు బహిరంగ సభ జరుగుతున్నది. సమస్త విద్యలకు నిలయమైన స్థలంలో ప్రేక్షకులు, సభికులు, జ్ఞానధనులు, విజ్ఞానతేజోతపస్సంపన్నులు, విద్యార్జనాసక్తిపరులు, విద్యాధికులు భావిభారత భాగ్య విధాతలు, విద్యార్థులు.

సభలోని నిశ్శబ్దం ఆవరించింది. సర్దార్ గౌతు లచ్చన్న సభను ద్దేశిస్తు ప్రసంగం ప్రారంభించారు. స్వాతంత్ర్య భారత్‌కు జై అన్న నినాదంతో ముందుకు సాగారు. అంతా విద్యాధిక వాతావరణం, సభాసదులెల్లరు జ్ఞాన విజ్ఞానకాంతులతో విరజిల్లు దివ్యమూర్తుల్లా తనకు కనిపిస్తున్నారు. తనవైపు చూస్తున్న అసంఖ్యాక నేత్రాలు, కాంతి కిరణాలు విరజిమ్మి వెలుగుబాటల్లా కన్పిస్తున్నాయి. దేశ స్వాతంత్ర్య సమరంలో పాల్గొనిన దేశ భక్తుని నోటివెంట స్వాతంత్ర్య పిపాస, ఆకాంక్షను దేశభవిష్యత్‌ను వినాలన్న కుతూహలం, ఉత్సుకత వారిలో పెల్లుబికుతున్నాయి. లచ్చన్నగారి కంచుకంఠం సింహగర్జనలా విస్ఫారించింది. జ్ఞానధనులారా, సోదరులారా ! మనమెల్లరం అదృష్టవంతులం చరిత్రను సృష్టించాం. శాంతి అహింసలను ఆయుధాలుగా చేసి రవి అస్తమించని తెల్లవారి రాజ్యాన్ని గడగడలాడించి దేశంనుండి వెళ్లగొట్టాం. బాపూజీ ప్రపంచానికే అందజేసిన ఒక దివ్యజ్యోతిని సుభాష్ చంద్రబోస్ అందుకుని అజాద్ హింద్‌ఫౌజ్ మత స్థాపనతో అంతిమ విజయం అందించారు.

అయితే ఈ స్వరాజ్య సాధనలో అసువులర్పించిన త్యాగమూర్తులకు ధనమాన ప్రాణములు కోల్పోయిన దేశభక్తులకు ఉరికంబాల కెక్కిన స్వాతంత్ర యోధులను మనకు నిత్యం స్ఫురణకు తెస్తుంది. స్వరాజ్యా వతరణ దినోత్సవం.

రక్తపాత రహిత విప్లవం ద్వారావే మనం స్వరాజ్యం సాధించు కున్నాం. మన జాతీయ నాయకుల దేశభక్తుల రక్తం చిందనిదే ప్రాణాలను [illegible] అర్పించనిదే మనకు స్వరాజ్యం రాలేదని, మీరెల్లరూ

గ్రహించాలి బ్రిటిషు సైన్యంతో మనం పోరాడకపోయిన బ్రిటిషు పోలీసులు, కిరాయి సైన్యం భారతీయులను నానా విధాలైన చిత్రహింసలకు గురి చేయుటలో వెనుకాడలేదు. జైల్లో బంధించుటలో వెనుకడుగు వేయలేను. లాఠీచార్జి చేయుటలో వెనుకకు తగ్గలేదు. ఎంతోమంది క్షతగాత్రులయ్యారు. ఎందరో తమ ఆస్తిపాస్తులను పోగొట్టుకున్నారు. ఎన్నో కుటుంబాలు నిరాశ్రయులయ్యారు. ఎందరో ఉరికంబాల కెక్కారు. ఎందరో జైల్లో మగ్గుతూ బాధపడ్డారు. బార్యాబిడ్డలను వదలుకుని దేశస్వాతంత్ర్యం కోసం తలపడినవారెందరో దేశభక్తులు అసంఖ్యాక స్వాతంత్ర్య సమరయోధులు ఈనాడు స్వరాజ్యం వచ్చేసరికి మిగిలిన వారిలో మేము ఆ బాధల్ని అనుభవించాం కళ్లారా వాళ్లను చూచాం. మాకళ్లముందే తమ ప్రాణాలను తృణప్రాయంగా దేశం కోసం విడచి పెట్టేవారిని చూచాం. జైల్లో మేం అనుభవించిన కష్టాలను దేశమాత కష్టాలు ఏనాటి కైన తీరవా అన్న నమ్మకం విశ్వాసంతో, భరించాం. అయిన మాలో ఎందరో ..ఎందరో.. నోటివెంట మాటలు పెగలిరాలేదు. ఉద్రేకంతో మనస్సుప్పొంగి ప్రవహించింది. కన్నీళ్ల బొటా బొటా జారాయి. ఎంత తమాయించుకున్నా దుఃఖం కాదు ఆనందోద్రేకం, అదుపులోనికి రాకున్నది గొంతు కుంచుకు పోయింది. సభికులు అంతా నిశ్శబ్దంగా చూస్తున్నారు: గంభీర వాతావరణం - గొంతు సవరించుకొని అసంఖ్యాక దేశభక్తుల త్యాగం వలన ధైర్యోత్సాహాల వలన ఈ స్వరాజ్యం మనకు నేడు లభించింది. మనరాజ్యాన్ని మనం నడుపుకొనే సత్తా మనకున్నదని మనం ప్రపంచానికి నిరూపించాలి. భారతీయులు త్యాగ మూర్తులు, దేశభక్తులేగాక పరిపాలనాదక్షులు విజ్ఞాపన తేజస్సులు దేశ నాయకులు అని మనం ఋజువు చేయాలి.

దేశ స్వాతంత్ర్య సమరంలో విద్యార్థి లోకం పాల్గొని ఎనలేని త్యాగాన్ని జూపి ఏఒకరికి విద్యార్థి లోకం తీసిపోదని నిరూపించిన మీరే, భావిభారత భాగ్యవిధాతలు. ఈ భారతదేశానికి భవిష్యత్ నేతలు, మీరు ఆర్జించిన ఆర్జిస్తున్న ఆర్జించబోయిన విద్యవిజ్ఞానాల పైనే మన భావిభారత దేశసౌభాగ్యం సంపద ఆధారపడి ఉంది. మనలోని స్వార్థాన్ని చంపుకుని, సమైక్యత దృష్టిని అలవరచుకుని జాతీయ భావాల్ని పెంపొందించుకుని స్వేచ్ఛా సమానత్వాల్ని ప్రజలందరూ అందేలా చూడాలి. ప్రజాస్వామ్యం, సామ్యవాదం, దేశసమగ్రత జాతీయత, మన దేశానికి ఆయువుపట్టువులుగా

ఉండాలి. ఆనాడే మనం సాధించుకున్న యీ స్వరాజ్యం సాధనఫలం మనకు సిద్ధిస్తుంది.

ఉపన్యాసానంతరం సభాస్థలి అంతా ఆనందోద్రేకాలతో పొంగి పోయింది. లచ్చన్నగారిని అభిమానులంతా చుట్టుముట్టారు. అభినందల్ని తెలపడంలో పోటీపడ్డారు. లచ్చన్నగారు సభలో కన్నీరు పెట్టడం పలువురిని ఆశ్చర్యపరచింది. విద్యార్థి కాంగ్రెస్ నాయకులు లచ్చన్న గారికి ఆప్యాయతతో ప్రశ్నించారు. "మీరు సర్దార్ బిరుదులు పొందిన వారు పైగా స్వాతంత్ర్యయోధులు జైల్లో అనేక బాధల్ని అనుభవించినవారు. ఎన్నెన్నో ఉద్యమాల్ని నడిపారు. విప్లవ మార్గాన్ని కూడా చవిజూచినవారు, మీరు కన్నీరు పెట్టడమేమిటి ?

"మీరు ఇంకా విద్యార్థులే కదా" "వయసు విజ్ఞానం అనుభవం ఈ మూడున్నగానీ కొన్ని విషయాల్లో లోతుపాతులు తెలియవు. ద్రవించే హృదయము ఉండబట్టే దరిద్రుల నాకట్టుకోవాలన్న తపన ఆకాంక్ష నాలోన పెల్లుబుకుతూ నుంటాయి. చలించని మనసు - హృదయం చేయగల మంచిపనేమిటి. ఒకనాడు ధైర్యంతో నిండిన గుండె ఒకనాడు అన్యాయాల్ని ఎదిరించిన గుండె - కష్టాలను, నష్టాలను ఓర్చిన గుండె బ్రిటిషువారి దమన నీతికి ఎదురు తిరిగి పోరాడిన ఈ గుండె ఏనాడు ధైర్య స్థైర్యాలను మీసానుభూతికి అభినందనలతో నిండి నాగుండె నీరయింది. స్వరాజ్య సాధనలో పాల్గొన్న మావారెల్లరు ఈ దినం లేకపోయిరే, వారెల్లరు గతించిపోయారే స్వతంత్రాసక్తితోనే అసువులు బాసారే. అని ఆలోచిస్తేనే నాగుండె కరిగినీరయి పోవక తప్పలేదు". అంటూనే మరల లచ్చన్న ఆనందబాష్పాలు రాల్చారు.

ఆంధ్ర దేశ నాయకుల్లో చెప్పుకోదగిన రాజకీయ నాయకుడు, స్వాతంత్ర్య సమరయోధునిగా సభాస్థలి, జై జై నినాదాల్ని పలికింది. దేశ స్వాతంత్ర్యాన్ని స్ఫురింపజేసుకున్నది. విశాఖలో సింధియాస్టీం నేవిగేషన్ వర్కర్సు యూనియన్ అధ్యక్షునిగా ఆసరికే కార్మికోద్యమంలో పేరుగడించిన లచ్చన్నను విశాఖ ప్రజానీకం సుస్వాగతం యిచ్చింది. పలువురు కార్మిక నాయకులు వచ్చి అభినందనలు తెలిపారు. విద్యార్థిలోకం ఉపాధ్యాయ [illegible] ప్రదర్శించిన ప్రేమాభిమానాలకు కృతజ్ఞతల్ని చెబుతూ,

లచ్చన్న ప్రజానీకం నుండి హరే కృష్ణ మెహతాతో కలసి సభాస్థలిని విడచి వెళుతుండగా జై జై నినాదాలు మిన్నుముట్టాయి. దేశమాతకూ జై భారతమాతకు గాంధీజీకి జై, సర్దార్ గౌతులచ్చన్న గారికీ, జై జై అంటూ ఆనాటి స్వాతంత్ర్య దినోత్సవ మహాసభ ముగిసింది.

## ప్రవాసాంధ్రులు :

1947 లో ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు ప్రొఫెసర్ రంగా ప్రవాసాంధ్రుల స్థితిగతులను పరివీలించి ఒక నివేదికను కాంగ్రెసు పార్టీకి సమర్పించమని, ఒక కమిటీని వేస్తారు, సర్దార్ గౌతులచ్చన్నగారిని ఆ కమిటీ శక్రటరీగా నియమించారు.

లచ్చన్నగారు ఒరిస్సా రాష్ట్రమునందలి అనేక ప్రాంతాలతో సన్నిహిత సంబంధాలు గలవారు. ఒరిస్సా రాష్ట్రం ఏర్పడక ముందు అనగా 1936 ముందు నేటి ఒరిస్సా రాష్ట్రమునందలి అనేక భాగాలనాటి ఆంధ్రలో ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి చెందేవిగా ఉండేవి. బరహంపూర్. ఖరగ్‌పూర్, ఖురదా, జంషెడ్‌పూర్, జీహ్వార్, కొరాపుట్ చక్రధర్‌పూర్, కలకత్తా లను లచ్చన్న పర్యటించి, కమిటీ ఒక రిపోర్టును మద్రాసు ప్రభుత్వానికి సమర్పించింది. ఆంధ్రా కాంగ్రెస్ కమిటీ ఈ ప్రశ్నావళికి భోగట్టాలను సేకరించమన్నది.

(1) ఆంధ్రుల పిల్లలు ఆంధ్రులు మద్రాసు ప్రభుత్వం వారి విద్యాబుద్ధుల్ని ఎలా పెంపొందింప జేయాలి.

(2) వారికి ఉద్యోగాలు ఉన్నాయా! లేనిచో ఎటువంటి చర్యలు తీసికోవాలి.

(3) వారికి ఏయే సౌకర్యాల్ని ప్రభుత్వం అందించాలి

లచ్చన్న కమిటీ పర్యటించి ప్రవాసాంధ్రులు విషయం పరిశీలించారు. ఆంధ్రకాంగ్రెసు కమిటి యిచ్చిన రిపోర్టు.

(1) ప్రవాసాంధ్రులకు పాఠశాలల నడపటానికి ఆర్థిక సహాయం అందించాలి, ప్రభుత్వ పాఠశాలలు తగినంతగా లేనందున

(2) ప్రవాసాంధ్రుల బిడ్డలకు ఆంధ్రులకు ఉద్యోగావకాశాల్ని కల్పించాలి,

(3) వైజ్ఞానిక సాంస్కృతిక అభివృద్ధిని పెంపొందించాలని సంఘాలను ప్రోత్సహించాలి.

(4) ఏ ఏ ప్రాంతాలలో ఆంధ్రులు ఏ శాతం నివసిస్తున్నారు. వారికి తగిన పాఠశాలలున్నాయా ?

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఈ రిపోర్టును పరిశీలించి మద్రాసు ప్రభుత్వానికి పంపిన రిపోర్టు

(1) ద్రవ్య సహాయం అందించాలి. పాఠశాలలు అచట స్థాపించాలి.
(2) ఉద్యోగావకాశాల్ని కల్పించాలి. ఇతర రాష్ట్రాల్లో కల్పించాలి.
(3) ఆంధ్రలో కొన్ని కళాశాలలో, విద్యా సంస్థలలో స్థానాలను వారికి కేటాయించాలి.

ఉత్తరాంధ్రలో చివరిగానున్న నాటి జిల్లా గంజాం జిల్లా దరిమిలా ఆ జిల్లా ఒరిస్సా ఏర్పాటున విభజనంది అందులో ఒకభాగం శ్రీకాకుళం జిల్లాగా, శ్రీకాకుళం జిల్లాలో చివరి ప్రాంతాలు ఇచ్ఛాపురం సోంపేట మందసా టెక్కలి ఒరిస్సా రాష్ట్రానికి అతిచేరువలో నున్న ఈ ప్రాంతంలో జన్మించిన సర్దార్ గౌతులచ్చన్న ఒరిస్సా రాష్ట్రమందలి ప్రవాసాంధ్రులకు ఎనలేని సౌకర్యాలనందించడంలో అహర్నిశలు శ్రమించిన రాజకీయ నాయకులలో లచ్చన్నగారు ముఖ్యులు ముందు అడుగు వేసినవారు.

# 25 వ ప్రకరణము

## లచ్చన్నగారి వైవాహిక జీవితము

18వ శతాబ్దమున అమెరికాలో అహర్నిశలు శ్రమించి తదేకదీక్షతో ప్రపంచాన్ని విస్మరించి నిరుపయోగంగా పడియుండగల దుంపలను మానవ ఆహారంగా ప్రయోగశాలలో మలచి, చూపినందుకు అడిషన్ అనే శాస్త్రజ్ఞనికి జాతీయ బహుమతిని ప్రకటించింది.

బహుమతిని అందుకున్న శాస్త్రజ్ఞుని వద్దకు విలేఖర్లు వచ్చి అడిగారు. మీకు వివాహం ఎప్పుడయింది, మీకు సంతానం ఉందా ? ఎంతమంది ? మీభార్య పేరేమి ? ప్రశ్నలకు తలెత్తి జూచి ఆశ్చర్యంలో పడ్డాడు శాస్త్రజ్ఞుడు తన ఆశయ సాధనలో కృషిలో తన పెళ్లిమాటనే మరచిపోయినట్లు చెప్పాడు విలేఖరులతో తనవయసానాటికి ఇంచుమించు 40 సంవత్సరాలు".

సాధారణ మానవునికి, ఆజ్ఞానికి ఇది వింతగా దోచిన ఆశయ సాధనలో జీవితాల్ని వెచ్చించిన వారికిది అనుభవైక వేద్యమే" ఆశ్చర్యకర మైనదేమీ కాదు.

లచ్చన్నగారికి 38 సంవత్సరాలు నిండాయి. వైవాహిక జీవితానికి నాందీ ప్రస్తావన జరగాలి. దేశానికి స్వాతంత్ర్యం వస్తేనే తప్ప తాను వివాహం చేసుకోనని, భీష్మించుకొని కూర్చున్నారు. పైగా తనరాజకీయ గురువు ప్రొఫెసర్ రంగా, సంతానం తనదేశసేవకు అవరోధాలుగా నిలుస్తాయోమో నన్న భీతిలో వైవాహిక బంధం ఏర్పడిన మరుక్షణం కుటుంబ నియంత్రణకు లోనయ్యారు.

గురువుగారి ఆదర్శం, శిష్యుని పట్టుదల దీక్ష ప్రజల చేత వేనోళ్లు కొనియాడదగినదే తప్ప ఆషామాషిగా భావించవలసిన విషయాలు కావు.

ప్రాచీన గ్రీకు రాజకీయ తాత్విక వేత్త ప్లేటో మహాశయుడు "తాత్విక చక్రవర్తి దేశాన్ని పరిపాలిస్తేనే" ప్రజానీకం సుఖశాంతులనందగలవని భావించారు పాలకులకు సంతానం ఉండరాదని వైవాహిక జీవితానికి మించిన

రీతులలో వారు జీవితం గడపాలని ప్రతిపాదించారు. స్త్రీ పురుష శారీరక సంబంధాల నుండి వైదొలగాలని ప్రవచించలేదు. భారతీయ తాత్విక ప్రపంచ మున 'రాజర్షి' ఐహిక భోగ భాగ్యాలన్నింటిని పొందగలుగుతూనే "పద్మ పత్రమివాంభస" గా ప్రవర్తించాలని భోధించింది గీత.

సామాజిక చైతన్యం మేరకు వ్యక్తి జీవితం రూపొందుతుందా! వ్యక్తి చైతన్యం సమాజ స్థితిగతులను రూపుదాల్చేలా చేస్తుందా అన్నది చర్చనీయాంశము గత చరిత్రలో సమాజాన్ని తీర్చిదిద్దిన వ్యక్తులున్నారు. సమాజం చేత రూపొందించబడిన మహానుభావులున్నారు! విడివడని ప్రశ్న - జవాబు -

60 ఏండ్ల క్రిందట ఆంగ్లేయ విద్య అంతగా వ్యాపించలేదు. మారుమూల పల్లెల్లో మూర్ఖదురాచార, దుష్ట సాంప్రదాయాలు అమల్లోనుండేవి. బాల్యవివాహాల్ని జరుపుకోవడం ఆనాటి సమాజం గొప్పగా భావించేది. "అష్టవర్షాత్ భవేత్ కన్యా" అని నిర్ధారించిన మన వారి మానసిక అవగాహన ఏమిటో బోధపడుతూనే ఉంది."నస్త్రీ స్వాతంత్ర్య మహార్హతి" అను మనువు తగిలించిన దాస్యంతో పురాషార్థ సాదనలుగా" ధర్మము,అర్ధము కామము మోక్షమని నిర్వచించబడినాయి.కామము పురుషార్ధ సాధనం వైవాహిక వ్యవస్థకు జీవితానికి వ్యవస్థకు మూలకారణం.

1923 లో అచ్చన్నగారికి తన 14వ ఏట మొదట, బాల్య వివాహం జరిగింది. వివాహమన్న అదొక వేడుక తప్ప అన్యదా చింతన మనసునకు కలగని శారీరక వయస్సు ఆనాడు శారీరక వయస్సునకు మించిన మానసిక జ్ఞానం ఉండేదికాదు. ఆనాటి సాంఘిక పరిస్థితులటువంటివి. ఈనాడు 14 వ ఏట బాలునికి మితిమీరిన జ్ఞాన విజ్ఞానాలు వైవాహిక జీవితంపై ఉండటానికి నేటి దృశ్యశ్రవణ విధానాలు. సాంఘిక వ్యవస్థలో మార్పులు చేర్పులు సామాజిక విలువలపై అభిప్రాయాల విభేదము కారణం కాగలవు. ఆనాడు 14 ఏండ్ల బాలుడు పైగా గ్రామీణ బాలుడు వివాహమన్న వేడుక తప్ప అన్యదా తన మనసులో భావించుటకు వలనుపడని పరిస్థితి.

అచ్చన్నగారి తండ్రికి పెద్ద జబ్బుచేసింది ఇక బ్రతకలేవేమో అన్న భయభీతులు మనసులో ఆవరించాయి. ఇద్దరి కొడుకులకు పెళ్లిళ్ల తనుండగానే తన కళ్లెదుటే జరిగిపోవాలి. ఈనాటికి వయసు ముదిరిన వాళ్లు

తమ పిల్లలకు వాళ్లుండగానే పెళ్లిళ్లు జరగాలని అసందర్భంగా నున్న పట్టుపడుతూ ఉంటారు.

తన ఇద్దరి కొడుకులకు ఒకే దినమున పెళ్లి ముహూర్తము 16 మైళ్ల దూరమున గల ఇచ్ఛాపురం నుండి 2 పెట్రోమాక్సు లైట్లు తెచ్చారు. జట్కా గుర్రాలు తెప్పించారు. పెళ్లికొడుకును పెళ్లికూతురిని చెరి ఒక గుర్రంపై ఎక్కించి ఊరంతా తిరుగుతారు. దీనినే తిరువీధి అంటారు. సందడి అంతా ఇంట్లో ఉన్నవాళ్లది బందువులదే పెళ్లికొడుకుకి, పెళ్లికూతురుకి ఉండదు. ఒకవేళ ఉన్నా అది తినుబండారాల్ని స్వీకరించేవరకే. వేడుక వినడం తప్ప వేరే గుర్తు వారికి ఉండదు. లచ్చన్నగారికి తండ్రికి మరల స్వస్థత చేకూరింది. రెండేండ్లు గడిచాయి. లచ్చన్నగారి భార్య 1924లో మశూచి వ్యాధితో పసుపు కుంకమలతో వెళ్లిపోయింది. లచ్చన్నగారానాటికి తన విద్యాభ్యాసం కొనసాగిస్తున్నారు. తన తోనె జరిగిన తన అన్నయ్య పెళ్లి కూడ మూన్నాళ్ల ముచ్చట అయింది. తన అన్నయ్యకు వదినకు అభిప్రాయ భేదాలు రావడంతో ఇరువురి మధ్యా విడాకులు జరిగాయి. మారు మనువులు రెండో పెళ్లిళ్లు జరగడం జరిపించుకోవడం ఆనాడు ఆక్షేపణ కాదు గదా. అందరి ఆదరణాభిమానాల్ని పొందేవి. ముందు వెనుకలు చూడక ఆదరాబాదరా వివాహాల్ని జరిపించిన తుదకు సంభవించేవి ఇటువంటి పరిణామాలే.

లచ్చన్నగారి బాల్యమున జరిగిన ఈ సంఘటన తన జీవితంలో ఎటువంటి ప్రభావాన్ని జూపెట్టలేదు. వివాహం తనాశించినది కాదు. వివాహం జరిగే సమయానికి ఆ జ్ఞానం ఆసక్తి కూడ తనకు లేదు. విద్యార్జన - ఆటలపాటల్లో ఆసక్తి తప్ప అన్యధా ఎరుగని పరిస్థితి అది -

తదుపరి లచ్చన్నగారి జీవితం ప్రజాజీవితంలో ఒక భాగంగా మారింది. "లోకానుగ్రహ ఏవైసే హేతుసే జన్మకర్మణః" అతని జన్మయొక్క ప్రయోజనము స్వార్థము కాక లోకకళ్యాణార్థము అతని జీవితం "లోకకల్యాణార్థం" వికసించడానికి తగిన సాంఘిక పరిస్థితులు - గౌరవాలు ఆనాడు తనకున్నవా ! ఆర్థిక పటిష్టత - భోగభాగ్యాలు తనకానాడు లేవే - మరిఎలా ఇంతటి ఔన్నత్యానికి తను చేరుకో గలిగారు. "ఉద్ధరేదాత్మనాత్మానామ్" నిజానికి తనను తను ఉద్ధరించేది తన ఆత్మ -

ఆత్మ స్థయిర్యం మనో నిగ్రహం పట్టుదల – దీక్ష – తనను తను నీరసపరచి తనకు శత్రువుగా మారేది తన ఆత్మ.

సిద్ధ సంకల్ప పురుషవరేణ్యులు లచ్చన్న స్వయం పరిపూర్ణుడు స్వశక్తితో విజృంభించి స్వార్ధ ప్రయోజనాలకు గాన దేశహితం కోసం జీవితాల్ని అర్పించ ముందడుగు వేస్తున్న రాజకీయనాయకుడు.

లచ్చన్నగారికి రాజకీయ రంగంలో విజయాలు వరించాయి. మారుమూలనున్న ఒక వ్యక్తి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సేవాదళ్ శక్రటరీగా రూపొందారు. సింధియాస్టీం నేవిగేషన్ వర్కర్సు యూనియన్ అధ్యక్షత స్వీకరించారు.ఆంధ్రలో పేరెన్నికగన్న స్వాతంత్ర్యయోదుడుగా, రాజకీయ నాయుకునిగా, రాష్ట్రస్థాయిలో ఒక పార్టీ నాయకునిగా పేర్వడసి నారు. ప్రజలే తన ఆస్తిగా, దేశమే తన సంపదగా బహుజన బందుగా వెనకబడిన వర్గాలకు ఆశాజ్యోతిగా పేదలపాలిట పెన్నిధిగా రూపొందారు.

దేశ స్వాతంత్ర్య సాధనే తన ధనువుగా సామాజిక శ్రేయస్సే తన లక్ష్యంగా వెనకబడిన కులాల ఉద్ధరణే తన ఆశయంగా పంధించిన లచ్చన్నను జయం వరించింది. సామాజిక సంపద్పై తనకాధిక్యతను తెచ్చిపెట్టింది.

అట్టి లచ్చన్నగారికి వైవాహిక జీవితం తన జీవితంలో రాజకీయ సోపానాల్ని కొన్నింటిని అధిగమించిన తదుపరే, సంక్రమించిబోతున్నది. వివాహం వ్యక్తికి సాంసారిక సుఖశాంతులకు పొందటానికే కాదు జీవన్ముక్తికి సాధనమని కదా మన ఆర్యోక్తి – "అపుత్రస్య గతిర్నాస్తి" అనికదా మన సాంఘిక ఆర్యోక్తి తన రాజకీయ లక్ష్యంపై శ్రద్ధాభక్తుల్ని కన్పరుస్తున్న లచ్చన్నగారికి వైవాహిక జీవితాన్ని ఆశించే తీరిక, ఇచ్ఛ ఏమాత్రం లేని పరిస్థితి "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" తన శ్రద్ధకు తనకు లభించిన జ్ఞానం – తనను ఉద్ధరించుకొనుటకు ఉపయోగపడేదికాదు. సాంఘిక సముద్ధరణకోసం మానవాళి సుఖశాంతుల కోసం ఉపయోగపడేది. అది ఎంతటి పవిత్రమైనదోకదా "నహిజ్ఞానేన సదృశం" అని కదా జ్ఞానమునకు మించినది ప్రపంచమున వేరొకటి లేదని కదా !

అయితే లచ్చన్నగారు తన తల్లిదండ్రులను సంతోషపెట్టాలి తనున్న సమాజానికి అనుగుణంగా తనునడచుకోవాలి సాంఘిక పరిస్థితులను తను గౌరవించాలి. గుర్తించాలి. పురుషార్థ సాధనలో వాటిని తను కాదనగలరా ?

పైగా సమాజం లచ్చన్న గారిని తాత్విక మనస్సు, యోగభావన కల వ్యక్తి – వైవాహిక జీవితానికి అతీతంగా మెలగగలరన్న విశ్వసించేది ఎవరు, గుడ్డి సమాజం తనుకు లేని సుగుణం ఇతరులలో ఉందన్న సత్యాన్ని గుర్తించలేనిది. ఒక బలహీనతకు తనుతోనైన యితరులెల్లరు లోనయి తీరు తారన్న అంధ విశ్వాసం గలది.

తలగొరిగించుకుని కాషాయబట్టలు వేసికుని విభూది తీసికుని, బాహ్యాడంబర వేషంతో కన్పిస్తేనే ఆ వ్యక్తిని యోగిగా, సన్యాసిగా భావిస్తుందీ లోకం, బాహ్యాడంబరాల్ని భోగభాగ్యాల్ని కలిగినప్పటికి యోగ మనస్తత్వాన్ని, సర్వసంకల్ప సన్యాసత్వాన్నికలిగియున్నను పసిగట్టి లేనిదీ సమాజం. గుడ్డిగా బావించే పరిస్థితి ఇది.

ఇక సాంఘిక పరిస్థితి వైవాహిక జీవితం లేనివారిని సమాజం అనుమానిస్తుంది. అవమానిస్తుంది. లేనిపోని అభాండాల్ని సృష్టించి పైన వేస్తుంది వెలిగ జూస్తుంది.

ఇంతకు సమాజానికి ప్రాతిపదిక కుటుంబం కదా, అట్టి కుటుంబానికి అధిపతికానిదే కుటుంబాలతో నిండిన సమాజానికి చెప్పేదేముంది, చేసేదేముంది. తాను అనుసరించని మార్గాన్ని, యితరులకు బోధించేదెలా తన మార్గం, సమాజమార్గం ఒక్కటైతేనే రాణింపు, రాచరికబాట – నలుగురిలో ఆట –

లచ్చన్నగారి తల్లి "ఒరే బాబూ, స్వరాజ్యం వస్తే పెళ్లి అన్నావు. మరి స్వరాజ్యం వచ్చేసిందిగా. మరి దేనికిరా ఆలస్యం, నీవు ఒక ఇంటి వాడివైతే నేను హాయిగా కళ్లుమూస్తాను.

ఇంటికి అడుగిడిన మరుక్షణం తల్లి ప్రతీదినం ప్రశ్నిస్తున్న తీరు, చుట్టుప్రక్కల వాళ్ళూ అంతే. అంతా తన పెళ్లి గురించే తప్ప తన దేశం

గురించి చెప్పరే - బహుశా వారి అల్పత్వం స్వల్పభావన దేశం గూర్చి మనకెందుకు అది చూసేందుకు పెద్దలున్నారు. అన్న మూర్ఖత్వం, మూఢత్వం, అమాయకత్వం, ఆ సమాజములోనుండి ఉద్భవించిన అచ్చన్న జూచేది తన స్వసుఖం గూర్చి కాదు. సమాజం కోసం.

జిల్లా స్థాయిలో తనకు పేరుంది. రాష్ట్ర స్థాయిలో గుర్తింపు ఉంది. రాజకీయ నాయకుల్లో పలుకుబడి ఉంది. ప్రతీచోట ప్రజలు తనకు బ్రహ్మరథం పడుతున్నారు. ఇన్ని ఉన్న తన సంసారాన్ని గడపటానికి ఆర్థిక పునాదులు ఏవి ? ఉండ మిద్దె ఇల్లు కూడా లేదు. ఉన్నది నివాసయోగ్యం కాని ఇళ్ల అన్నగారి అయ్యవారి జీవితంలో కాలం వెళ్లబుచ్చుచున్న తను తన భార్యను పెంచి పోషించుకోవడం ఎలా ? ఉన్నా పొలం కాస్తా రాజకీయ త్యాగాలకు ఊడింది. ఆస్తిపాస్తులు ఉద్యోగ సద్యోగాలు తనకున్నవేమిటి దేశసేవ రాజకీయాల్లో నిరంతరం కొనసాగటం. బలహీన ప్రజావర్గాల్ని ఉద్ధరించాలని అహర్నిశలు శ్రమించడం. అయితే ఆనాడు తనకున్నది సామాజిక ఔన్నత్యం, గౌరవం, సాంఘిక హెూదా, అంతస్థులు. తనకు ఆర్థికంగా ఏమిలేకపోయినా - దేశభక్తి వలన సంభవించాయి.

తన కుటుంబంలోనున్న ఆడపిల్ల తల్లిదండ్రులు వచ్చి అచ్చన్న గారిని, భోజనాలకని విందులకని పిలచేవారు. అచ్చన్నగారు వెళ్లివస్తూండే వారు. తన కుటుంబానికి దగ్గరయిన ఒక పిల్లతండ్రి అచ్చన్నగారిని తన మిత్రుని ద్వారా కబురుపంపారు. తనపిల్లనిస్తాను పెళ్ళిచేసుకోమని అచ్చన్న గారు పిలచిపిల్లనిస్తాననడం నిజానికి వ్యక్తి గొప్పదనాన్ని తెలుపుతుంది. తనలోతను చూడనిది ఇతరులు తనలో చూస్తూన్నారు. పెళ్ళిజేసుకొంటే తనతల్లి బెడద మొదలు తీరుతుంది అన్న భావన అచ్చన్నకు వచ్చింది. అయితే తన అన్న అందుకు అంగీకరించలేదు. తను ఉపాధ్యాయుడు తన తమ్ముడు ఆంధ్రలో వృద్ధిలోనికి వచ్చిన రాజకీయ నాయకుడు, రైతోద్యమకర్త.

ఒకనాడు తన ప్రచారకార్యక్రమం ముగించుకొని అచ్చన్న ఇంటికి చేరుకున్నారు. ఆసరికే తనకు వరుసకి మామగారైన డాక్టర్ పి.జి.మూర్తిగారు తన ఇంటికి వచ్చి అన్నగారితో ఏదో చర్చించాడు. అతను జెంషెడ్‌పూర్‌లో దంతవైద్యునిగా పనిచేస్తున్నారు.

ఇంటికి వచ్చిన డాక్టరుగారు లచ్చన్నగారితో ఇలా అన్నారు" అయితే నీవు ఒక మారు జంషడ్పూర్ రావాలి నీవు ఎలానూ ఆలిండియా కాంగ్రెస్ సభలకు వెళ్ళాలి కదా, డిల్లీ వెళ్లి సమావేశాల్లో పాల్గొనాలి కదా మాపట్నం రావయ్యా, మీవదిన పిల్లలు సంతోషిస్తారు" అన్నారు. తప్పక వస్తాను మామయ్య మీరంతా అభిమానంతో రమ్మన్న రాకుండా ఉండగలనా, లచ్చన్న సమాధానంలో ఆనాటి సమావేశం ముగిసింది. లచ్చన్నగారు డిల్లీలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీలో పాల్గొని తిరిగివస్తూ తనిచ్చిన మాటమేరకు జంషడ్పూర్లో దిగారు. గౌరవ మర్యాదలు బాగానే జరిగాయి. డాక్టరు వదిన పిల్లలు అందరూ సంతోషించారు. జంషడ్పూర్ ఆంధ్రమహాసభ వారు జరిపిన సన్మానం ముగిసిన తదుపరి లచ్చన్న వదినగారింటికి ముందుగా మాటిచ్చిన ప్రకారం వచ్చారు.

లచ్చన్నగారు తిరుగుప్రయాణం పట్టే దినమున రాత్రి భోజనాలు అవుతున్నాయి. అందరూకలసి భోంచేస్తున్నారు. మెల్లగా డాక్టరు మూర్తి పెళ్ళి ప్రస్తావన తెచ్చారు. చూడు మరిది బాబు, ఇంట్లో ముసలావిడ ఎంతకాలం మీకు చేసి పెడుతుంది. మీరూ ఆమె ముద్దూముచ్చట తీర్చాలి కదా, త్వరలో వివాహం చేసుకోవయ్యా "లచ్చన్న గారీప్రస్తావన వస్తుంది అని అనుకోలేదు. ఎంతో ఆదరణతో పిలచి, ఆతిద్యమిచ్చి గౌరవిస్తున్న బంధువుల మనసుల్ని కష్టపెట్టాలన్న కష్టము" లచ్చన్న సమాధానంగా పెళ్ళి చేసుకోవడం నాకూ యిష్టమేనండి. ఆనిర్ణయానికి ఈదరిమిలా వచ్చాను.

అయితే బాబు మీకు అభ్యంతరం లేకపోతే మాయమ్మాయమ్మ అక్కయ్య కూతురు ఉంది. పేరు యశోద పిల్ల అందంగా ఉంటుంది పైగా చదువరి కూడా పిల్లనిస్తాము చేసుకో! డాక్టరు గారు అంతసూటిగా విషయాన్ని అందిస్తారని భావించిన లచ్చన్న సమాధానంగా చిరునవ్వుమ ప్రదర్శించారు. డాక్టరు గారూ! పెళ్ళన్న మాటలా! అందులో నా వివాహం? అన్ని సమస్మలే అన్నారు. పోనీ పిల్లను చూడకూడదూ, నీకిష్టంలేకపోతే పోనీ! మేమెంతయినా సంతోషిస్తామన్నారు డాక్టరు గారు! పెళ్లి ప్రస్తామన తెచ్చినందువ లచ్చన్న గారు! తనకు పెళ్లీడు దాటిందని, తన నెవరు పెళ్లాడుతారు! క్లుప్తంగా సమాధానం ఇచ్చారు. ఆమాటకు డాక్టరు! ఎర్తైనా పెళ్లి ఆడటానికి ఇష్టపడితే చేసుకుంటావా! అని అడిగారు.

నిజమే ఉండటానికి నాకు ఇల్లు లేదు. తిరగటానికి దేశం ఉంది. నాకు స్వంత ఆస్తిపాస్తులు లేవు. ఆస్తిపాస్తులున్న వారికెల్లనేనాప్పుడను, నావరకు జీవితం కొనసాగటానికి సమాజం నాకుంది. ఇక ఒక ఇంటివాడినైతే నేను నా సంసారాన్ని ఇల్లాలిని ఎలా నడపాలి ఎల్లా పోషించాలి నా అపేక్షవల్ల, అభిమానం వల్ల మా అన్నగారు ఏమనకపోయినా నా బరువును ఇప్పటికే తను చాలావరకు మోస్తున్నారు. ఇంకా తనను బాధపెట్టడం భావ్యంకాదేమో". లచ్చన్న వ్యాఖ్యల్ని డాక్టరుగారు పట్టించుకోలేదు - కార్యక్రమం కొపసాగించారు.

ఒక వ్యక్తిని ముందు పెట్టిచూడమని కోరడంలో అర్ధంలేదు. ఎవరో పైవారు దూరపు బంధువులైతే తప్పదేమో లచ్చన్నగారికి దగ్గరబంధువులు, లచ్చన్నగారానాటికి దేనినైన అతి సూక్ష్మంగా అవగాహన చేసుకొనే సునిశిత మేధాశక్తిని సంపాదించుకొన్నారు.

యశోదమ్మను జూచిన లచ్చన్నగారిలో తన ఆత్మ తనను జూచినట్లయింది. తన మనస్సు తనతో మాట్లాడినట్లయింది. తన రూపంతనలోనే తన్మయతను పొందింది. అయితే లచ్చన్న గారికి ఏ ఆడపిల్లను వివాహమాడాలన్న కోరికలేనిదే ఇది ఎలా సంభవం.

ప్రయోజకుడు ప్రసిద్ధ రాజకీయనాయకుడు సామాజిక స్థితిగతులను తెలిసికొన్న వారు సంస్కార సభ్యతలనీ అలవరచుకొన్న వారు లచ్చన్న ఆడపిల్లను తరచి తరచి జూచే పరిస్థితి లేదు. వయసు విజ్ఞానం అనుభవం ఉన్న నాయకుడానాడు. లచ్చన్నగారిని తృప్తి పరచేదొక్కటే కళ్లతోనే గ్రహింపదగిన రూపంగాక మనసులో బుద్ధిలో ఆత్మలో కాబోయే భార్యను జూచి తనొక నిర్ణయానికి వచ్చారు. వీటితో పరిశీలించిన వనితకు ఏయే గుణగణాలు సౌశీల్యం ఉండాలన్నది జగద్విదితమే కదా యశోదమ్మలో చూచేది బాహ్య రూప సౌందర్యంగాక మానసిక సౌందర్యాన్ని చూడగలిగారేమో. ఎంతోముద్దుగా ముచ్చటగా అవయవపొందికను కలిగి స్వచ్ఛంగా మల్లెపూవులా మెరసిపడిపోతున్న యశోదమ్మలో లక్ష్మీ సరస్వతి రేఖలున్నందున, లచ్చన్న గారికి నచ్చటమే కాదు తన నూరేండ్ల జీవితంతో నిత్యనూతన వసంతాల్ని వెదజల్లి భోగభాగ్యాలున్నా లేకున్నా సహ ధర్మచారిణిగానుండి సౌశీల్యం గుణం కలిగిన వనితగా తన జీవితాన్ని

వన్నె తెచ్చి పెట్టినదై నుండాలి. కట్టుకున్న భర్తకు పేరు ప్రఖ్యాతులు వచ్చేలా ప్రవర్తించి తన కుటుంబాన్ని ఆదర్శ కుటుంబంగా తీర్చి దిద్దుకోవాలి. అయినా అచ్చన్నగారు తన భార్యగా ఆశయాల్ని ఆశలను హృదయంలో పండించుకొని పిల్ల విషయమై బంధువుల ఇంట్లో తానేమి చెప్పగలరు. తర్కశాస్త్రం చెప్పింది. చక్షుర్మాత్ర గ్రాహ్య జాతిమాన్ గుణోరూపం" కళ్ళతోనే గ్రహింపదగినదే రూపం. అవయవవానాం రేఖాసాష్ట్యంరూపం, అవయవరేఖల స్పష్టత్వమే రూపం అని అదేలావణ్యము ముత్యాలమీరనిగని గలాడే కాంతిలా శరీరమంతటా ప్రకాశించే శోభను లావణ్యం అంటాము. బంధువులు ఆతిద్యమిస్తే పెళ్లి ప్రస్తావన తెచ్చేసరికి ఎలానైనా ఈ చిక్కుముడిని విప్పుకోవాలని డాక్టరు మామయ్యతో ఇలా అన్నారు. మీరేదో పెళ్లి పెళ్లి అంటున్నారు. చేసుకోవడానికి నాకభ్యం తరంలేదు. అయితే నేనుకొన్ని షరతులును నా అభిప్రాయాలను లేఖద్వారా అమ్మాయికి తెలుపుతాను. ఆమె అంగీకరిస్తే వివాహం చేసుకుంటాను - ఆపిల్ల అంగీకరించదన్నది అతనిలో అభిప్రాయం. వెంటనే అచ్చన్నగారు ఆ రాత్రి బంధువులింట్లోనే ఒక గదిలో కూర్చొని కాబోయే శ్రీమతికి ఒక ఉత్తరం వ్రాసి తన డాక్టరు మామ్య ద్వారా పిల్లకందిస్తారు. ఆ ఉత్తర సారాంశంఇది.

పెళ్లి జరిగేది మన యిరువురికి రేపు కలకాలం కాపురం ఉండేది మనం. కష్టసుఖాల్ని పంచుకొనేది మనం. నూరేళ్ళ జీవితాన్ని గడిపేది మనం. అందుకు మనమే ఒక నిర్ణయానికి రావాలి. మీవైపువారు నావైపువారు మనిద్దరి తరపున అన్నింటిని అంగీకరించేలా వ్యవహరిస్తారు. రేపు నిజజీవితంలో మన ఇరువురికిది అంగీకారమా లేదా అన్నది తెలిసేలోగా జీవితం సగం గడిచిపోతుంది. ఒకరిపై ఒకరం నిందలు వేసుకొంటూ బ్రతకాలి అందుకు నాపెళ్ళికి ఉన్న కొన్ని విధి నిషేదాల్ని విప్పి జెప్పుతున్నాను. విని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చిన తదుపరే నీ అభిప్రాయాన్ని తెలుపు.

నాబ్రతుకు మీకు తెలిసిందే. తాడు బొంగరం లేనిది. ఎచ్చట నుంటానో నాకు తెలియదు. నాజీవిత సర్వస్వాన్ని అంకితంకావాలని మనసావాచా కర్మతో నున్నవాడ్ని. స్వరాజ్యం

కదా మనకింకెవరు లాఠీలతో బాదుతారు ఎవరు జైల్లో పెడతారు అని అనుకోరాదు. రాజకీయవేత్తలకు ఏనాడు జీవితం నల్లేరు పై బండిలాసాగదు. జీవితం వడిదుడుకుల నిలయంగానుంటుంది.

ఇక మీకు తెలిసిందే, నాకున్న ఆస్తిపాస్తులేమిటి ఇక నీవు వచ్చి అనుభవించేదేమిటి చంకను సంచివేసికొని ఊరూర తిరిగే నా వెంట నీవు రావలసి ఉంటుంది. మారుమూల పల్లెల్లో తిరగే నాతో నీవు ప్రయాణాలు చేయవలసి ఉంటుంది. నగలూ నాణ్యాలు పెట్టి సంతోషపరచే భర్తగా నుండలేను. నిన్ను సంతోషపెట్టడం నా కుటుంబంయోగక్షేమాని చూచుకోండమే నా ధ్యేయం ఆశయం కాదుగదా, పాపం పండంటి వయసుతో నున్నదానవు ఎన్నో కమ్మనికోరికలతో జీవితం కొనసాగాలని భావిస్తున్న ఆడపిల్లవు ఇవన్నీ నీకు నన్ను కట్టుకున్న తీరుతాయా అసంభవం అనాలోచితం.

ఒకవేళ మన పరిస్థితుల బట్టి ఉపవాసాలతో గూడ గడపవలసి వస్తుంది. నేను బలహీన వర్గాలను బాగుపరచాలని ఒక ప్రక్క ఉవ్విళ్ళూరుతూ వుంటే నీవు చూస్తూ ఊరుకోలేవు ఉన్న నేను అంగీకరించలేనుకదా. అందుకు నీవు చేయగల సేవలన్నింటిని చేయవలసి ఉంది. నిజానికి నన్ను నీవు కట్టుకున్న నీవు పెట్టుకున్న ఆశలన్నీ నిరాశకాగలవేమో బాగా ఆలోచించు. నీకలలు నిజంకావేమో ఒకమారు వెనుకకు తిరిగి చూడు. పెళ్లి అన్న నాకు కొన్ని అభిప్రాయాలున్నవి మన కుటుంబం మన పిల్లలు బాగుపడాలన్నది గాక వసుధైక కుటుంబం ఏర్పడాలని సర్వజనులు సుఖించాలని భావించినవాడ్ని.

భర్త - భార్యల మధ్యగల సంబంధం కేవలం ఆత్మపరమైనది తప్పించి శారీరకమైన సంబంధం మాత్రమే కాదన్నది నా అభిప్రాయం. కాలరీతిని కరిగెడు కమ్మదనాన్ని జూచి మురిసిపోతూ బ్రతికే భర్తగా నేనుండలేను. మానసికౌన్నత్యంలో ఆధ్యాత్మిక సంబంధమైన పవిత్ర భావంతో భార్యభర్తలుండాలన్నది మెలగాలన్నది నా అభిప్రాయం. కేవలం తన రతకేళీ వినోదానికే భర్త అనిగాక, తన జీవన్ముక్తికి ఆధ్యాత్మిక శక్తికి రూపమని గ్రహించిన భార్యే భర్తకు నిజమైన సహధర్మ చారిణిగా నుండగలదు. భౌతిక సుఖాలను తెచ్చి పెడుతున్నంతవరకు భర్త ప్రాణమని

చెప్పడం - తదుపరి వాటిని అందుకో లేకనో, వాటికి అందడవేమంత ప్రాధాన్యత కాదనో, జీవితానికదే ఆదర్శం లక్ష్యం ముక్తికావనో భావనతో ఉన్న భర్త తన జీవితానికి ఉరితాడు అని భావించే మహిళ అనాగరిక వనితని చెప్పాలి తప్పించి నాగరికత గల సంస్కార సభ్యతల నలవరచుకున్న మహిళ కాదన్నది నాఅభిప్రాయం.

వయస్సులో ఉన్న ఉత్సాహం ఉద్రేకం, ఉల్లాసంతో ఈనాడు దేనికి లక్ష్య పెట్టనని ధీమాతో అన్నంత మాత్రాన సరిపోదు. ఆవచ్చే కష్ట నష్టాలను అనుభవించటానికి వచ్చేసరికి ఉత్సాహం ఉల్లాసం, ఉద్రేకం సన్నగిల్లిపోతాయి. ఆనాడు వాటిని తట్టుకోలేక నీవు విసిగి వేసారి నసుగుతూ బ్రతికిన మూలుగుతూ జీవితం గడిపిన మూతి విరుచుకొంటూ మగనిని అపహస్యం చేసిన సహధర్మచారిణిగా నాజీవితంలో నీకు చోటుండదు. నా జీవితాశయం, లక్ష్యం దెబ్బతింటుంది.

మీవాళ్లు నాగురించి ఏవేవో చెప్పియుంటారు. వాటిని నమ్మవద్దు. నాకున్న గొప్పదనం ఏమిలేదు. ప్రజలకు సేవచేస్తున్న నన్ను రాజకీయ నాయకుడవని, సంపద అధికారాలు కావాలన్న చిన్న నాటినుండి ఆదిశవేపే పరుగెత్తుకొని యుండేవాడ్ని. ఉద్యోగాల్ని వెలగబెట్టేవాడ్ని వర్తక వ్యాపారాల్ని జరిపేవాడ్ని చేతిలో గవ్వలేకుండా దేశానికి సేవ జేయాలని పరుగులు తీస్తున్నవాడ్ని నాప్రజలే నాకాస్తి అని భావించినవాడ్ని బలహీనవర్గాల ప్రజలే నాబంధువులు. వెనుకబడిన ప్రజలే నాకాప్తులు రైతాంగమెల్లరూ నా సోదరులు.

ప్రతి ఒక ఆడపిల్ల తన అత్తవారింటపాదం మోపిన మరుక్షణం తన మగడు ప్రయోజకుడై తన అభిరుచుల్ని అన్నింటిని తీర్చాలని తనముద్దు ముచ్చట నెరపాలని తన సంతానంపెరిగి పెద్దదై తన కుటుంబం బాగుపడి తన మగడు పెద్దవాడు కావాలని కోరుతుంది. అవసరమైన చెట్టుకింద కాపురం చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతాయి.

అందువలన నీవు మరొక మారు ఆలోచించు. నాతో నీవివాహం మంచిదోకాదో తెలుసుకో. త్వరపడి నిర్ణయానికి వచ్చి కష్టాల్ని తెచ్చిపెట్టుకోవద్దు. ఒకమారు నిర్ణయానికి వచ్చాక జీవితం ఆ కట్టుబాటు

క్రమశిక్షణలోనే ఉండాలి. భర్త అభిరుచుల్ని ఆశయాల్ని ప్రోత్సాహించాలి తప్పించి నిరుత్సాహపరచరాదు. నిజానికి ఉత్తరంలో నున్న విదినిషేధాల్ని జూచిన నీవేకాదు ఏ ఒక ఆడపిల్ల అంగీకరించదనే నానమ్మకం. అయితే అరిత్య నిష్ఠూరం కన్న ఆది నిష్ఠూరం మంచిది. పెళ్ళి నూరేళ్ళ పంట మనసులు కలియని మనువు మంచిదికాదు.

ఒకవేళ నీవీ షరతులకు త్రికరణ శుద్ధిగా అంగీకరిస్తే నీ అభిప్రాయం నాకు తెలియచేయాలి. తదుపరి నా రాజకీయ గురువు ఆచార్య రంగాగారి ఆశీర్వాదం మనకుండాలి. వారు అంగీకరించనిదే నాపెళ్ళి అన్నదేలేదు. వారి అనుమతిని మీరు ముందుగా పొందాలి. నేనుగా పోయివారిని నేను వివాహం చేసుకుంటాను అనుమతించండి అని అనను.

నేను పై నుదహరించిన విషయాలు తప్పించి నన్ను వివాహం చేసుకోవటానికి నాకెటువంటి అభ్యంతరాలు లేవు. దీని పై నీ సమాధానం అభిప్రాయం కావాలి.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి, ప్రేమాభిలాషి
లచ్చన్న

లేఖనందుకున్న యశోదమ్మ జంషడ్‌పూర్‌లోనే లేఖవిప్పి చూస్తూ ఆశ్చర్యపోయింది. తనజీవితంలో ఎదురుచూడని సంఘటన తనను వివాహమాడబోయే వ్యక్తి తన అభిప్రాయానికిస్తున్న విలువ ఎంతటిదో విలువకట్టలేనిది. వయసు విజ్ఞానంగల యశోదమ్మ తన సోదరుని ఇంట్లో ఒక ఆడపిల్లగా కన్యగా జీవిస్తున్న తనకింతటి వ్యక్తిగత గౌరవమిచ్చి తన అభిప్రాయం అడగడం ఎంతటి సంస్కారసభ్యతలున్న గాని సాధ్యపడదుకదా! ఇంతకు ఆ ఉత్తరం నందలి విషయాలలో కొన్నింటికి తన కర్థమే అందలేదు. అయిన తన అభిప్రాయంకావాలని - నిజానికి ఆడపిల్ల సిరి సంపదలున్న మగడిని కోరుకుంటుంది. అయితే తను కోరవలసిందేమిటి విజ్ఞానం సౌశీల్యం కీర్తి ప్రతిష్టలున్న భర్తయే నాకు కావాలి. ఇది ఉన్న సిరిసంపదలు అవి ఏనాటికయినా రావచ్చు అవి ఉండి ఇవిలేకున్న తదుపరివి అబ్బుతాయన్నది కలలోనిమాట. లేఖనందలి విషయాలు చదువుకొన్న చిరంజీవి యశోదమ్మ ఆశ్చర్యపడినా లచ్చన్నగారు విధించిన అగ్నిపరీక్షకు

నిలవటానికి మానసికంగా సిద్ధమైనారు. ఆ విషయాన్ని డాక్టరుగారు అచ్చన్నగారికి చెప్పారు.

యశోదమ్మ సంస్కార సభ్యత చదువరులున్న కుటుంబంలో పుట్టిన ఆడపిల్ల. ఉత్తరాంధ్ర ప్రక్కనగల గంజాం జిల్లాల్లో తన తాతగారు ఏ ఒకరు అక్షరాలు దిద్దని కాలంలోనే విద్యావంతుడై బ్రిటిష్ రాచరికంలో తహసీల్దారుగా పనిచేసారు. తనతాత తండ్రుల కుటుంబం ఎంతటి సాంఘిక హెూదా కలిగియుండేదో ఇట్టే అర్థమై పోతుంది. వారి తాతకు గుర్రపు బగ్గీకూడా ఉండేది.

అక్షరజ్ఞానం గల యశోదమ్మ ఆ కాలంలోనే ఒకరత్నంగా భావించబడేవారు. ఆనాటికి ఉన్నత కులాలనిపించుకొనే వారిలోనే అక్షర జ్ఞానంగల మహిళలకు ఎచటకన్పించేవారు కాదు. వెనుకబడిన కులాల్లో వర్గాల్లో ఆనాడు చదువుకొన్న ఆడపిల్ల అన్నా అడవిలో గంధంచెట్టు సాగరంలో రత్నం అంటూ భావించేవారు. ఆనాడు భావించాలి.

ఉన్నతమైన కుటుంబంలో పుట్టి అక్షరజ్ఞానంగల యశోదమ్మ తనకు కాబోయే భర్త గొప్పదనమేమిటో ఇట్టే పసిగట్టింది. కీర్తి ప్రతిష్టలు గల వ్యక్తికి భార్యగా ఉండాలని మహిళకోరుకోవాలిగాని సిరిసంపదలున్న వ్యక్తిని కాదు. ఇవి ఏనాడైన ప్రతి ఒకరికి అబ్బటానికి అవకాశముంది. మరి అందరికీ అవి సంక్రమించవుకదా. కొందరికే అటువంటి వ్యక్తి తనకు భర్తకావడం తనపూర్వజన్మమున చేసికొన్న పుణ్యఫలమని భావించి యశోదమ్మ తన అభిప్రాయం ప్రకటిస్తు తెలియపరిచింది. ఎన్ని కష్ట నష్టాలుపడిన పతితోడిదే సతి బ్రతుకని అదే ఆమె అభిప్రాయమని గడుసుగా మొండిగా జవాబు చెప్పింది.

అంతటితో ఆగక ప్రొఫెసర్ రంగా గారిని పెళ్ళికూతురు తరపు వాళ్లు కలిసారు. "నిజానికి రాజకీయ నాయకుని దేశసేవకుని పెండ్లాడటంలో ఇబ్బందులున్నాయని హెచ్చరించారు. ఆశయసాధనలో లక్ష్యం వైపు వెళ్తూ జీవితం గడపాలి సామాన్యమా - తనలక్ష్యానికి ఆశయానికి ఎదురై నిలచిన భార్యలను అవసరమైన వాళ్ళు త్యజిస్తారు తప్పించి కాళ్ళా వేళ్ళాబడి బ్రతిమాలాడటం - తమ ఆశయాల్ని లక్ష్యాన్ని మార్చుకోవడం జరగవే

జరగదు. అన్ని రంగాగారి అభిప్రాయాల్ని తెలిపిన యశోదమ్మ ధీమాగా "నేనన్నింటికి సిద్ధమే అన్ని షరతులకు అంగీకారమే అని చెప్పిన తరువాత ఇక చేసేదేముంది. సరేనేను వచ్చి ఇరువురు భార్యాభర్తల్ని ఆశీర్వదిస్తాను" అని రంగా చెప్పి పెళ్ళికూతురువాళ్ళను అంపించారు. లచ్చన్న యశోదమ్మల వివాహం 1948 మార్చినెల 28వ తేదీన జరగాలని దైవజ్ఞులు నిర్ణయించారు.

తన రాజకీయ గురువు ఆచార్య రంగాగారు ఆశీర్వదించిన తదుపరి తనుపెట్టిన పరీక్షలను అంగీకరించిన వనితను లచ్చన్న వివాహం ఆడక తప్పదుకదా "బలవానింద్రియ గ్రామో విద్యాంసమపికర్షతి' 'అనికదా అందువలననే గీతాకారుడు ఇంద్రియాలను అదుపులో నిడి కొనమని బోధించారు. అంతటితో ఆగక హెచ్చించారు. మానవాళికి "ఇంద్రియాణి ప్రమాదీని" అని వ్యక్తి ఇంద్రియాలకు లోనవడం తప్పిదముకాదు వాటికి దఖలుపడి పతనమై పోవడంగాక, వాటిని వశపర్చుకొని జీవితాన్ని మలచుకోవటంలో తప్పిదంలేదన్నాడు. "ప్రకృతి పురుషం చైనవిధ్యనాదీ ఉభావసి" అని కదా ప్రకృతి పురుషులు అనాది త్రిగుణాలకు వ్యక్తులులోబడి వ్యవహరించకతప్పదు. అందుకే సత్వరజస్తమెగుణాః ప్రకృతి సంభవాః అని నిర్ధారణ పరచాడు గీతాకారుడు.

తనకు యౌవనం అంకురించిన తదుపరి రెండు దశాబ్దాల్ని గడిపిన లచ్చన్నగారి జీవితంలో వివాహమొక మార్పు. వివాహం తన ఆశయసాధనలో అడ్డుకాదుకదా. "క్షుద్రంహృదయదౌర్బల్యం" అన్నారు కదా మానసిక బలహీనత మనకెందుకు మనోబలం ఉన్నవాడికి ఏదీ అడ్డురాదు వచ్చిన ఎదిరించి నిలువలేదు.

యశోదమ్మ తాత తండ్రులు వెనుకబడిన కులస్థులు బలహీన వర్గాలకు చెందిన ప్రభుత్వోద్యోగుల్నుగానున్నందున విద్యను విజ్ఞానాన్ని సంపాదించినందున సమాజంలోవారికి గౌరవంలో ఏ లోపంలేదు. ఆర్థికంగా ముందడుగు వేసిన వ్యక్తిని ప్రపంచాన్ని అవగాహన చేసికొన్న వ్యక్తిని సమాజం చేసేదేమీలేదు. సమాజమే ఆతనికి జడిసి మెలగుతూ చేతుల్ని వలుపుతుంది. చాతుర్వర్ణమయాసృష్టం - గుణ కర్మవిభాగశః అన్న గీతా కారుడే జాయతేవర్ణసంకరః అని ప్రవచించారు. వర్ణసంకరం అంటూ జరిగిన

తదుపరి ఎవరు ఏకులం ఏవర్ణం, ఏవర్గం అని విభజించే పరిస్థితే లేదు. ఏదో మూఢసమాజం ఏమూల మూల్గిన! నాగరిక ప్రపంచం ఆ కులం మత బేధాల్ని అస్పృస్యతాభావం అసమానతలను పట్టించుకొనేదిలేదుగా.

1948 మార్చినెల 28వ తేదీన వివాహం నిశ్చయం శుభలేఖలు అంపించారు. అంపించిన వారు లచ్చన్న తల్లిదండ్రులుకారు తనకులస్థులు కాదు. లచ్చన్న యశోదమ్మల వివాహకమిటీ బారువాలో ఏర్పడింది. పెళ్లి తతంగం జరిపింది. ఆ కమిటీయే అందరినీ ఆహ్వానించింది. ప్రజా నాయకునికి శుభం జరుగబోతున్నది ప్రజలందరు రావాలని పెళ్లిపెద్దల కమిటీ సభ్యులు పెళ్ళి జరుపుతున్న వీరు బారువా ప్రజలు ఇదొక తరహా పెళ్లి కుటుంబం జరిపే పెళ్ళికాదు. సామాజిక పెత్తనంతో జరిగేపెళ్లి. దేవుని పెళ్ళికి అందరూ పెద్దలే అనేదొక సామెత. లచ్చన్నగారి పెళ్లికి, రాజకీయనాయకులేపెద్దలు. గ్రామ ప్రజలంతా పెళ్ళి కొడుకు బంధువులు ఉత్తరాంధ్ర అంతా పెళ్ళికొడుకు స్నేహితులు మిత్రులు యి వివాహ ప్రత్యేకత వధూవరుల పక్షంలో ఏఒకరు కారు. ప్రాంతమంతకు సంబందించిన పెళ్లి. పెళ్లి సాంఘికమైనది అయిన రాజకీయమైనది. పెళ్ళికొరకు ప్రజాభిమానం పొందిన ప్రజానాయకుడు రాజకీయ వేత్త పెండ్లి చేసుకొన్నాక నాయకులయిన వారెంతోమంది. అయితే నాయకులయిన తదుపరి పెళ్ళిచేసికొన్న వారి సంఖ్య చాలా తక్కువేమో. ఆనాటికి! -

1948 మార్చినెల 28వ తేదీన పెళ్ళి అయినందున బారువా గ్రామం అంతటా పెళ్లి సందడి వ్యాపించింది. ప్రతీ ఇంట పెళ్లి వాతావరణం కన్పించింది.

ఆడపెళ్లివారికి విడిది యిస్తారు వేరేచోట బసయిస్తారు. ఇచ్చట చెప్పుకోదగినదే మన మగపెళ్ళివారికి ఒక విడిది యిల్లు కావలసివచ్చింది. లచ్చన్నగారికి ఆసరికి యిల్లు పూరి ఇల్లు కూలిపోయింది. పైగా నివాస యోగ్యం కానిది. అసంఖ్యాక పెద్దవారికి ఎలా ఆదరించడం గౌరవాల్ని చేయడం పెళ్ళికి తరలివచ్చిన ఆడపెళ్ళివారికి ఒక విడిది సత్రం గ్రామంలోనే యున్న మగపెళ్ళివారికి వేరు విడిది సత్రం కావలసివచ్చింది.

సేవాదళ్ వాలంటీర్లు కాంగ్రెస్ కార్యకర్తలు అభిమానులు కాంగ్రెస్ పెద్దలు బారువా చేరుకున్నారు. పెళ్లి కమిటీ వారికి చేతి నిండాపని దొరికింది. పెళ్ళి ఖర్చులు సంగతేమిటీ పెళ్ళి కమిటియే భరించింది. గ్రామ ప్రజలు అంతా చందా వసూలు చేసారు. డబ్బును ప్రోగుచేసారు. కనీసం వచ్చిన అభిమాను చుట్టాలనుండి నగదు, కట్నాలు పుచ్చుకోవచ్చుకదా అది జరగనిపని లచ్చన్నగారి ఆశయానికే విరుద్ధమైనది. కట్నాలు కానుకలు లేని వివాహమిది. ఆదర్శ వివాహంకావాలి. లచ్చన్నగారికి పెళ్లికమిటీ త్రోసి రాజని పెండ్లి ఖర్చులతో గాని తనకు సంబంధంలేదని ప్రకటించింది. అంతా గ్రామ పెద్దలు చూచుకొన్నారు. లచ్చన్నగారు పెళ్ళికొడుకుగా పెళ్ళి పీటలపై కూర్చున్న పెళ్లికూతురు మెడలో మంగళసూత్రం ఆచార సాంప్రదాయాల మేరకు కట్టటమే. పెళ్లి పందిరి జగన్నాధస్వామి దేవాలయ ప్రాంగణమున పెళ్లి వేదిక తయారు చేసారు.

పెళ్లి తతంగం పూర్తి అయింది. బ్రాహ్మణుడు చదివింపుల ప్రస్తావన తెచ్చారు. ఇంతలో పెళ్ళి పందిరిలో ఒకవైపు నుండి కిల్లి అప్పలనాయుడు ముందుకు వచ్చి ఆరుతులాల నెక్లెస్ యిచ్చి పెళ్లికూతురు అన్నయ్య చదివించాడని చెప్పమని ఆ బంగారు ఆభరణాన్ని అందించారు.

లచ్చన్న పెళ్ళి పీటలపై నుండి ఆశ్యర్యంగా నాయుడువైపు చూసారు. ఇది ఏమి. నాయుడు కట్నకానుకలు వద్దన్నాను కదా లచ్చన్న బాధతో అన్నారు. నీవెవరు- వద్దనటానికి చదివించండి పంతులుగారు అంటూ ఆనెక్లెసును పెళ్ళికూతురు మెడలో వేసేవరకు కూర్చోలేదు.

కిల్లి అప్పలనాయుడుగారు చేస్తున్న పనిని లచ్చన్నగారు ఆపలేకపోయారు. ఆయిరువురి బాంధవ్యం అటువంటిది. లచ్చన్న! నాయుడు కవలల్లా ఉండేవారు. కష్టసుఖాల్లో యిరువురిదీ ఒకే బాట. లచ్చన్నగారిపై ఈగవాలితే తనపై దుడ్డుకర్ర పడినట్టు బాధపడిపోయేవారు నాయుడుగారు. తన రాజకీయ జీవితంలో నాయుడు తనకు కుడి భుజంగానున్న సహృదయుడు. లచ్చన్నను నమ్మిన రాజకీయ సహచరుడు. నాయుడు -

పెళ్లి జరిగింది లచ్చన్న యశోదమ్మలు నూతన వధూవరు లయ్యారు. లచ్చన్నగారి తల్లికి ఏనుగు ఎక్కినంత సంబరపడిపోయింది. తల్లి అన్నదమ్ముడు గ్రామ ప్రజలతో బాటు ఉత్తరాంధ్ర ప్రజానీకమంతా హర్షాతిరేకమున పులకించిపోయింది. నిండుమనస్సుతో ఆశీర్వాదులను అందించింది.

కులం, మతం, వర్గం అన్న బేధాల్ని విస్మరించి సుమారు 10 వేల మంది రెండు దినాలు సామూహిక పంక్తి భోజనాలు చేసారు. ఆనాటి సమాజమున ఇదెంతటి చైతన్యాన్ని తెచ్చిపెట్టగలదో -

వివాహ కార్యక్రమం వైభవోపేతంగా జరిగింది. 1948 మార్చి 28వ తేదీన విశాఖలో జలఉషనౌక ప్రారంభోత్సవానికి హాజరయిన కాంగ్రెసు పెద్దలతా మార్చినెల 28వ తేదీన బారువా చేరుకొని నూతన దంపతులను ఆశీర్వదించారు. జలఉషనౌకను ప్రారంభోత్సవం చేసినవారు మాజీ దివంగత ప్రధాని నెహ్రూ, ఆకార్యక్రమాన్నికి ఆధ్వర్యం వహించి నిర్వహించినది పెళ్ళికొడుకు గౌతు లచ్చన్నగారే.

విశాఖలో జలఉష నౌకా ప్రారంభోత్సవం ముగిసిన తదుపరి పెళ్ళి రోజున, పెళ్ళివారు పెళ్ళి పెద్దలతో పాటు లచ్చన్నగారు విశాఖనుండి బారువా వచ్చారు. తనున్నలేకున్న ఆనాటికే బారువాలో పెళ్లి ఏర్పాటన్నీ పెళ్ళి కమిటీయే నిర్వహించింది.

సర్దార్ గౌతులచ్చన్న యశోదమ్మల వివాహం పలువురి కాంగ్రెస్ నాయకులు ప్రజల ఎదుట అభిమానులు బందువుల ఎదుట ఘనంగా జరిగింది. సర్వం శుభం -

## 26. ఉమ్మడి మద్రాసు శాసనసభ సభ్యునిగా లచ్చన్న

లచ్చన్నగారి జీవితంలో తన జీవిత భాగస్వామి శ్రీమతి యశోదమ్మ ప్రవేశించిన మరుక్షణం వచ్చిన శుభపరిణామమేమో అన, ఢిల్లీనుండి లచ్చన్న గారికి పిలుపు వచ్చింది. ఈ పిలుపు లోగడ తనకందిన పిలుపువంటిది కాదు. ఆచార్యరంగా రాజకీయ గురువు గారు ఢిల్లీ నుండి వచ్చిన పిలుపు వేరొక దేశానికి ప్రతినిధిగా వెళ్లటానికి సన్నాహాలు పై ఇచ్చిన పిలుపు.

విశాఖపట్నంలో జలఉషనౌక సాగర ప్రవేశ మహోత్సవంలో పాల్గొనటానికి ఢిల్లీనుండి భారత ప్రభుత్వ ప్రధాని నెహ్రూజీ వచ్చారు. సిందియా స్టీల్ నేవిగేషన్ కార్మిక సంఘ అధ్యక్షునిగా ఆంధ్రాకాంగ్రెస్ కార్యదర్శిగా లచ్చన్నగారే నెహ్రూజీకి ఆనాడు స్వాగతం పలికారు.

నెహ్రూ రాకకోసం అసంఖ్యాక ప్రజానీకం లచ్చన్నగారి ఆధ్వ ర్యమున ఎదురు చూసింది. కార్మికులు కర్షకులు విద్యార్థి కాంగ్రెస్ ప్రతి నిధులు యాజమాన్యం అంతా ఒక్కటై నిలిచింది. ఉత్సవాన్ని నిర్వహిం చడం పర్యవేక్షణ జరిపిన లచ్చన్న గారి నాయకత్వం ఎల్లరిచేత ఆనాడు ప్రశంస లనందుకొన్నది. ఉత్తరాంధ్రనుండి అసంఖ్యాకంగా హాజరైన రైతులను, కార్మికులను జూచిన నెహ్రుజీ కార్యక్రమనిర్వాహకులను ప్రశంసిస్తుండగా నెహ్రూ ప్రక్కనే నున్న ప్రొఫెసర్ రంగా ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షునిగా నెహ్రూజీతో "నెహ్రూజీ యీ కార్యక్రమాన్ని ఇంత మౌనంగా నిర్వహించిదీతనే అంటూ ప్రక్కనే ఉన్న లచ్చన్న గారిని పరిచయం చేసారు.

లచ్చన్నగారు సింధియా స్టీల్ నేవిగేషన్ కంపెనీ వర్కర్సు యూనియన్ ప్రెసిడెంటుగా ఆంధ్ర కాంగ్రెస్ సేవాదళ శక్రటరీగా చేస్తున్న సేవలను నెహ్రూజీ ఎంతో ఆశక్తిగా అడిగి తెలుసుకొని మెచ్చుకున్నారు.

జలఉషనౌక సాగర ప్రవేశం - 1948 మార్చినెల 26వ తేదీన

జరుగగా తమ వివాహం 1948 మార్చి 28వ తేదీన జరిగింది. తనను ఢిల్లీకి రమ్మని టెలిగ్రాం 1948 మార్చి 30వ తేదీన బారువాలో నున్న లచ్చన్నగారికి అందింది. తమ దేశ ప్రతినిధిగా బర్మా దేశమునకు వెళ్ళవలసి ఉంటుందని వెంటనే రమ్మని తెలిపింది. రెండవ ప్రపంచయుద్ధంలో ఆగ్నేయ ఆసియాలోనున్న దేశాలలో పాటు బర్మా కూడ జపాన్‌కు స్వాధీనమైంది. అయితే యుద్ధానంతరం జపాన్ ఓడిపోయినందున బర్మా మరల బ్రిటిషు వారి ఆధీనంలోనికి వచ్చింది.

1930 వరకు బ్రిటిషు ఇండియాలో బర్మా ఒక రాష్ట్రంగా ఉండేది. 1935 చట్టము తదుపరే అది సర్వస్వతంత్ర దేశమైనది. ఇండియాలో జాతీయ ప్రభుత్వం ఏర్పడినట్లు బర్మాలో కూడ ఒక జాతీయ ప్రభుత్వం ఏర్పడింది.

బర్మా బ్రిటిషు ఇండియాలో ఒక భాగంగానున్న కాలంలో ఢిల్లీ సెంట్రల్ అసెంబ్లీకి బర్మానుండి ఒక ప్రతినిధిగా ఎన్నుకోబడి వచ్చేవారు. ఆతని పేరు ధాకిన్ యూన్ ప్రొఫెసర్ రంగా గారు కూడా ఆనాడు ఢిల్లీ సెంట్రల్ అసెంబ్లీ సభ్యునిగా ఉండేవారు.

బర్మా స్వతంత్ర దేశమైన తరువాత బర్మా జాతీయ ప్రభుత్వంలో యూన్ డిప్యూటీ మినిష్టర్‌గా నుంటూ ఉండేవారు. ఆంగసాన్ నాయకత్వ మున బర్మాలో జాతీయ ప్రభుత్వం ఏర్పడింది.

బర్మాలో కమ్యూనిష్టు ఉద్యమం రూపం దాల్చింది. కార్మికుల్లో యాజమాన్యం ఎడల వైముఖ్యం ఏర్పడింది. ఒక దినమున బర్మా మంత్రి వర్గం సమావేశం జరుగుతుండగా కమ్యూనిష్టులు బైబాంబును ప్రయోగిం చారు. తన మంత్రివర్గంలో ప్రధానమంత్రితో కలుపుకుని అనేకమంది చని పోయారు. బర్మాలో జరిగిన బాంబు కేసుపై ఇండియా దేశంలో చర్చించ టానికి తన మినిష్టరు హెూదాలో ఇండియా వచ్చి ఇండియన్ గవర్న మెంటుతో చర్చలు ఢిల్లీలో జరుగుతుండగా ప్రొఫెసర్ కంగా, యూన్ ఇరువురు కలసికోవడం జరిగింది.

రంగాజీ, మీరు ఇండియాలో రైతోద్యమాన్ని నడిపించడం విన్నాం, చూసాం. కమ్యూనిష్టుల ఎత్తుగడ వ్యూహాల్ని చిత్తు చేయగలవారు మీరే మా

దేశ విషయంలోను ఈ విషయంలో మీకు మాకు తగు సలహా యివ్వాలి. "యాన్ రంగాజీని అభ్యర్థించారు. మీ ఆంధ్ర నుండి వచ్చిన కార్మికుల్లో హెచ్చుమంది కమ్యూనిష్టు ఉత్యమానికి మద్దతుదార్లు ఎన్నుకున్నారు. యాన్‌గారు బర్మాలోగల కార్మికులలో అత్యధిక సంఖ్యాకులు తెలుగువారు. మా ఆంధ్రలో గల ఉత్తరాంధ్ర నుండి వలసవెళ్లినవారె - అందుకు కార్మికులలో బాగా పలుకుబడి గల మా కార్యకర్త సర్దార్ గౌతులచ్చన్న గారిని మీ దేశం తీసుకుని వెళ్లండి అతడయితే తెలుగువారికి నచ్చజెప్పగలడు ఉద్యమాన్ని ఎదిరించగలడు" అన్నారు రంగాజీ. అయితే మా వెంటనే పంపించండి, వారిని మా దేశ అతిధిగా తీసుకుని వెళతాను.

ఇండియన్ గవర్నమెంటు వారు ఉత్తర్వులను జారీ చేసారు. బర్మాలో జరిగిన కుట్ర కారణంగా హతులయిన ప్రధానమంత్రి "హన్‌సాంగ్" మరియు ఆతని మంత్రులు అంత్యక్రియలకు భారతదేశము తరపున హాజరు అయినారని బర్మా ప్రభుత్వం ఆనాడు ప్రకటించింది.

తంతిలోనున్న విషయాన్ని బట్టి టెలిగ్రాం అందిన వెంటనే లచ్చన్నగారు ఢిల్లీ వెళ్లితీరాలి. అచటనుండి బర్మాలోనున్న రంగూన్ చేరుకుని అచట ప్రభుత్వానికి అతిధిగా నుండాలి.

లచ్చన్నగారానాటికి కొత్తపెళ్లికొడుకు, పెళ్లి అయిన 3 దినములు కూడా గడవలేదు. విదేశయానం లచ్చన్నను వద్దని అడ్డుపెట్టగల వారు. వారి శ్రీమతి యశోదమ్మ, అయితే శ్రీమతి యశోదమ్మ తన శ్రీవారు పెట్టిన అన్ని పరీక్షలలో నెగ్గుకుంటూ వచ్చింది. ఈ పరీక్షలో తప్పుతుందా లచ్చన్నగారు శ్రీమతిని ఈ విషయాన్ని నివేదించకముందే తన ఆశయసాధనలో తను సాగిపోవలసిందిగా మనసారా అభిలషిస్తూ వెళ్లమని భర్తకు తన అభిమతాన్ని తెలిపింది. లచ్చన్నగారు బయలుదేరి ఢిల్లీ వసలల మీదుగా రంగూన్ చేరుకున్నారు. ఏ ఒకరికిది ఆశ్చర్యకరమైనదే అయితే లచ్చన్నగారికి స్థిత ప్రజ్ఞుని గుణగణాలు రాను రాను అలవడ్డాయి. జీవితంలో ఒకటున్న శాస్త్రీయ జ్ఞానముకన్న ఒక ఔన్సు అనుభంజ్ఞానం ఎంత ఉపకరిస్తుందో తెలును కున్నారు. అన్నింటా సమతత్వం అన్నవారే స్థితప్రజ్ఞులు కదా, ఆత్మని గ్రహించి సంకల్పబలం ఉన్నవాడే స్థితప్రజ్ఞుడు కదా.

ఇంద్రియాలను స్వాధీనపరచుకోవడం సాధ్యమేనా - సాధ్యమే - అభ్యాసమనే కలిమి - వైరాగ్యమనే బలిమి "వ్యక్తి లోనున్నవాడు ఇంద్రియాలను నిగ్రహించడవేమంత కష్ట సాధ్యం కానేరదని కృష్ణుడు అర్జుననితో చెప్పియున్నారు. ఇది సాధ్యమా కాదా అన్న మీమాంసలో ఉన్నవాడిని ఏ ఒకరుభాగు చేయలేడన్నారు. సంశయాత్మా వినశ్యతి" అని ప్రవచించారు. అయితే గీతాకారుడు ఏమి ప్రవచించిన నీ విధి చేసి తీరాలని విధి నేషేదాల్ని విధించలేదు 'యదేచ్ఛాసి తదా కురు" అని వాక్రచ్చాడు.

లచ్చన్న అజేయుడు సర్వసంకల్ప సన్యాసభావమును సంగ్రహించినవాడు., చేతన సుఖశాంతులకు లోనై తన విద్యుక్త ధర్మనిరూనణ రంగూన్‌లో ప్రయత్నం ప్రారంభించారు.

రంగూన్‌లో ఆరువారాలు లచ్చన్నగారు అనల్పమైన రాజకీయ కృషి సలిపారు.కమ్యూనిష్టు ఉద్యమంలో చేరిన వారిని రావించి కార్మికుల నెల్ల కాన్సెంట్రేషన్ కంపెనీకి తరలించారు. లచ్చన్నగారు ఆ కాంపులోనికి వెళ్ళి ఆయా కార్మికుల్లోని కష్టనిష్ఠురాలమిటో తెలుసుకున్నారు. అందులో ఉన్నవారు అత్యధిక సంఖ్యాకులు ఉత్తరాంధ్ర తూర్పు తీరానికి చెందిన తెలుగువారే.

ఉద్యమ దారులచేత సామూహిక క్షమాపణపత్రాలను ఇప్పించడం, అలా ఇచ్చిన వారినెల్ల బర్మా నుండి ఓడల్లో ఎక్కించి ఇండియాకు అంపించడం లచ్చన్న దైనందిన దినచర్య. ఇండియా వారు చేరిన తదుపరి వారిని ఇండియాలో తగిన పునరావాస సౌకర్యాల్ని జరపటానికి ఆసరికి భారత ప్రభుత్వం అంగీకరించియున్నది.

బర్మాలో ఉన్న తెలుగువారు - అసంఖ్యాకులు ఇండియాకు మరల చేరుకున్నారు. బర్మాలో కమ్యూనిస్టు ఉద్యమానికి వెన్నెముకగానున్న తెలుగు కార్మికులు పలచబడటంలో రంగూన్‌లో ఉద్యమం చల్లబడింది.నిజానికి కార్మికులకు స్వగృహాలు, కుటుంబాలున్నది. ఇండియాలో! సంపాదనకు రంగూన్ వెళ్ళియున్నారు. రంగూన్ ప్రభుత్వం లచ్చన్నను ఎంతగానో మెచ్చుకుని అభినందనలను తెలిపింది.

ఇంతలో బర్మా దేశ ప్రతినిధిగా ఉన్న గౌతులచ్చన్నగారిని ఇండియా నుండి ఒక టెలిగ్రాం వచ్చింది.

Start for India to file nomination Harbour seat Reserved Visakhapatnam

- Babu Rajendra prasad
President
All India Congress party
New Delhi.

1946 తో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభకు జరిగిన ఎన్నికలలో ఉత్తరాంధ్ర శ్రీకాకుళం నుండి తనకు పోటీ చేయటానికి అనుమతించమని కాంగ్రెసు టిక్కెట్టు యిమ్మని ఎంత పోరాడిన అధిష్టాన వర్గం లచ్చన్నగారికి టిక్కెట్టు యివ్వలేదు మాట్లాడలేదు. అసంఖ్యాక కాంగ్రెసు కార్యకర్తలు కోరిన తనకు టిక్కెట్టు యివ్వలేదు. ఈనాడు కాంగ్రెస్ పార్టీ తనకు తానె తను కోరకుండానే తను ఆహ్వానిస్తూ విశాఖపట్నం లాబర్ సీటుకు పోటీ చేయమని అభ్యర్దిస్తున్నది. బలే తమాషాగా ఉందిలే అంటూ లచ్చన్నగారు బర్మానుండి బయలుదేరారు.

ఆనాటికి సార్వత్రిక వయోజన ఓటింగు హక్కుల్ని ఇంక అందరికీ కలిగించలేదు. పరిమితమైనవారే ఓటర్లు అక్షరాస్యులు. రేట్ పేయర్సు మాత్రమే ఓటర్లు అందులో అక్షరాస్సులు రేట్ పేయర్సు మాత్రమే ఓటర్లు. అందులో విశాఖపట్నం లేబరు సీటునుండి గెలుపొందాలి. ఇందుకని ఓటర్లు చట్టరీత్యా గుర్తింపు పొందిన కార్మిక సంఘాల్లో సభ్యులై ఉండాలి. రైతోద్యమంలో కీర్తి గడించిన లచ్చన్నగారికి కార్మిక రంగంలోనున్న పలుకుబడిని గుర్తించే భారత కాంగ్రెస్ పార్టీ ఈతని తన అభ్యర్దిగా నామినేషన్ వేయమన్నది.

ఎన్నికలు జరిగిన 2 సంవత్సరాల తరువాత 1948లో విశాఖపట్నం లేబరుసీటు నుండి శాసనసభ్యునిగా ఎన్నికయిన బుద్ధిరాజు మల్లికార్జునరావు సిద్ధాంతం రీత్యా రాజీనామా చేసినందున ఖాళీ ఏర్పడింది.

దీనివెనుక కథ ఇది. 1948లో జయప్రకాష్ నారాయణ్ కాంగ్రెస్‌లో అంతవరకు సోషలిష్టు ఫోరంనకు నాయకత్వం వహిస్తూ అంతర్గతంగా ఉండేవారు. అయితే జయప్రకాష్ కాంగ్రెస్ పార్టీనుండి రాజీనామా చేసి

బయటకు వచ్చారు. కాంగ్రెసు పేరు తొలగించి సోషలిస్టు పార్టీగా రూపొందింది. సోషలిస్టు పార్టీని రూపొందించారు. దేశంలో గల తన, అభిమానులనందరినీ సోషలిస్టు పార్టీలో చేరమని పిలుపు నిచ్చారు. ఆనాటికి కాంగ్రెసు పేరుతో శాసనసభ్యుల్లో గాని ఇతరత్రా గాని పదవుల్లో ఉన్నవారు, ఆయా పదవులకు రాజీనామా ఇవ్వవలసిందిగా ఆదేశించారు. అచ్యుత్‌పట్వార్ధిన్, రామ్మనోహర్‌లోహియ వంటి ఉద్దండులు వచ్చి పార్టీలో చేరారు.

జయప్రకాష్ తన పార్టీలో చేరిన వారిని ఒకషరతు విధించారు. ఆసరికి ఏ ఒకరైన శాసనసభ సభ్యునిగా ఉన్న తన పదవికి రాజీనామా యిచ్చి బయటకు రావాలని మరల తన పార్టీ టిక్కెట్టు మీదుగా ప్రజలవద్దకు వెళ్లి గెలుచుకొని రావాలని చెప్పారు. ఆ పిలుపునందుకున్న విశాఖపట్నం లేబరు సీటుకు శాసనసభ్యునిగా నున్న బుద్ధవరపు మల్లికార్జునరావు తన సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు.

ఉప ఎన్నిక జరిగింది. కాంగ్రెస్ తరపున సర్దార్ గౌతులచ్చన్న నామినేషన్ వేసారు. మరల బుద్ధవరపు మల్లికార్జునరావే సోషలిస్టు పార్టీ తరపున నామినేషన్ వేశారు. కమ్యూనిస్టులు తన ప్రతినిధి చేత నామినేషన్ వేయించారు. త్రిముఖ పోటి జరిగింది. మల్లికార్జున రావుగారికి ఫోర్టు యూనియన్‌లో పలుకుబడి ఉన్నది. కమ్యూనిష్టు అభ్యర్థికి షిప్‌యార్డు చిట్టయ్య వలన మిల్సులో బలం ఉంది.

అయితే లచ్చన్నగారికి కూడ షిప్‌యార్డ్స్‌లో బలం ఉంది తను షిప్‌యార్డు యూనియన్ నాయకుడు పైగా నెలిమర్ల జూట్‌మిల్లులో చాలా పలుకుబడి ఉన్నది. ఎన్నికల ప్రచారం వచ్చేసరికి లచ్చన్నగారి వర్గానికి కమ్యూనిష్టు అభ్యర్థి వర్గానికి ఘర్షణలు ప్రారంభమయ్యాయి. మీరా మేమా అన్న స్థితి వచ్చింది. తాళ్లవలస చిట్టయ్యవలస కార్మికులు మధ్య ఘర్షణలు చెలరేగాయి. యిరువర్గాల వారు బలప్రదర్శనకు సిద్ధపడ్డారు. ఉత్తర విశాఖ

చివరగల మొదలుఇచ్ఛాపురంనుండి గోదావరినదిఒడ్డునగల రాజమండ్రివరకు గల కార్మిక సంఘాల్లోగల సభ్యుల ఓటర్లు వేసినది విశాఖ దగ్గరనే. కాంగ్రెసు పార్టీ అభ్యర్థి ఎన్నికయినట్లు ప్రకటించారు. లచ్చన్నగారికి మొదటగా అధికార రాజకీయ యోగం కలిగింది. ప్రజల అభిమానిగా ప్రజల విశ్వాస నమ్మకాలను చూడగల ప్రజాప్రతినిధిగా రూపొంది మద్రాసు రాష్ట్ర శాసనసభలో 1948 జూన్ నెలలో అధికార పార్టీ సభ్యునిగా విజయగర్వంతో ప్రజాసేవా తత్పరులై దేశసేవ జేయాలన్న సత్సంకల్పంతో ప్రవేశించారు.

# 27 వ ప్రకరణము

# 1920 – 40 వరకు తన జీవితంలో ప్రధాన ఘట్టాలు

1909 : ఉత్తరాంధ్ర శ్రీకాకుళం జిల్లా, సోంపేట తాలూకా, బారువా గ్రామంలో బాలలచ్చన్న ఒక సామాన్య నిరుపేద సెగిడి కుటుంబమున జననం; దేశమున మింటోమార్లే సంస్కరణలు రూపొందుతున్న తరుణం ; స్వదేశీ ఉద్యమానికి బీజాలు ఏర్పడుతున్న కాలం ; తిలక్ గోఖలేనాటి కాంగ్రెస్ నాయకులు.

1910 : బాలలచ్చన్న తండ్రి చిట్టియ్య ; తల్లి రాజమ్మల వేరింటి కాపురం ; బారువాలో కళ్లంగడి వ్యాపారంతో పాటు చిన్న కొబ్బరి తోట – పొలం సంపాదన ; ఆనాటికి కేంద్ర రాష్ట్రాల్లో ; శాసనసభలు ఏర్పడ్డాయి; వీరేశలింగం ఆంధ్రచరిత్రను రచించారు ; ఆంధ్రలో దేశభక్తి కొండా వెంకటసుబ్బయ్య ; బి.యన్. శర్మ మితవాదులు ప్రాబల్యం.

1911 : ఒకనాటి పాలేరు బాలలచ్చన్న తండ్రి చిట్టియ్య బారువాలోగల 80 కుటుంబాల సెగిడి కులస్థులలో పైసా పరక సంపాదించి, పేరు తెచ్చుకోవడం ; దేశపరిస్థితి, బెంగాల్ విభజన; వందేమాతరం ఉద్యమం ప్రక్క రాష్ట్రంలో లేచింది; ఆంధ్రమహాసభకు సన్నాహాలు జరుగుతున్న దినాలు; తల్లిదండ్రుల గారాబు బిడ్డగా బాలలచ్చన్న పెరుగుదల

1912 : బాలలచ్చన్నపై తల్లిదండ్రులు ఆశపెట్టుకోవడం తమ కులవృత్తిని గాక పెరిగి పెద్దయి గొప్పోళ్ళతో సమానంగా పెద్ద ఉద్యోగాలు చేయాలని భావించడం; బాలలచ్చన్న ముద్దుముచ్చటలను తీర్చడం; అడిగింది ఇవ్వడం; అల్లారుముద్దుగా పెంచడం; ఇకసమకాలీన పరిస్థితి ; బీహారు రాష్ట్రం కాంతిపూర్‌లో జరిగిన

కాంగ్రెస్ మహా సభలకు నెహ్రూ మొదలుగా హాజరుకావడం; అగ్రవర్ణాలవారికి; ఉన్నవారికే చదువులు; హోదాలు అంతా; తప్పించి అణగారిన వర్ణాలకు కులాలకు ఆ ఆర్హత లేదని సమాజం భావించడం.

1913 : బాలలచ్చన్న అల్లరిపిల్లవానిగా తయారై తనమాట కాదన్నవారిని, తనను ఎదిరించిన వారిని ఎదుర్కోవడం తిరగబడడం; గాంధీజీ దక్షిణాఫ్రికాలో ప్రధమంగా సత్యాగ్రహోద్యమానికి రూపకల్పన చేస్తున్న తరుణం; బాపట్లలో ప్రధమ ఆంధ్ర మహాసభలు జరుగుతున్న దినాలు.

1914 : తనను వెక్కిరించిన, ధిక్కరించిన సవర్ణుల పిల్లలపై తిరుగుబాటు; వయసుకు మించిన చేష్టలు, ఆలోచనలు; వగరుబోతు, పొగరుబోతు అని పేరందడం; తల్లిదండ్రులకు ఫిర్యాదులందడం; దండనకు గురిఅవడం; మొదటి ప్రపంచ యుద్ధం ప్రారంభం; తిలక్ జైలునుండి విడుదల; బరహంపూర్ నుండి ఆంధ్ర కాంగ్రెసు సర్కిల్లో వి.వి.జోగయ్య పంతులు గాడె – రాఘవరావు పేరందడం.

1915 : కొంటె పనులు చేయడం; ఆకతాయి కుర్రాడని పేరందడం; గోళిబిల్లి – చిరతాటల్లో ఇతర పిల్లల్ని ఓడించడం; మొలకెత్తిన మొండిఘటం అని అందరిచేత అనిపించుకోవడం; 1893 లో ఆఫ్రికా వెళ్లిన గాంధీజీ ఇండియా రాక; గోఖలే మరణం.

1916 : బారువా హయ్యర్ ఎలిమెంటరీ స్కూల్లో అక్షరాభ్యాసం; విద్యాభ్యాసం; అన్నయ్య సత్యనారాయణ స్కూలుకు వెళ్లడం; పమకాలీన పరిస్థితి; అనిబిసెంటు స్వదేశీఉద్యమం ప్రారంభం; లక్నో పాక్ట్; అంబేద్కర్ కులాల పుట్టుకపై సిద్ధాంతవ్యాసం; ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ స్థాపన; మద్రాసులో జస్టిస్ పార్టీ అవతరణ.

1917 : బడికి ఎగగొట్టడం; చెట్టులెక్కడం, పుట్టలెక్కడం; ఎదిరించిన వారితో కుస్తీపట్టు పట్టడం; తల్లిదండ్రులు వారిస్తే నిరాహారదీక్ష

పాటించడం; సమకాలీన పరిస్థితి; నార్త్ బీహార్‌లో గాంధీజీ ప్రథమంగా సత్యాగ్రహం చేయడం.

1918 : బాలచేష్టలు, వెక్కిరింపులు, ఏడిపింపులు, దబాయింపులు, దౌర్జన్యం, జబ్బచరచడం, నిబ్బరంగా మెలగడం; ఇంటికిరాకుండా ఎచ్చటనో రెండుమూడు దినాలు గడపడం ; నూతన ఆంధ్ర కాంగ్రెసు విభాగము ఏర్పాటు; న్యాయపతి సుబ్బారావు ప్రెసిడెంటు, వెంకటప్పయ్య శక్రటరీ ఆంధ్ర మహాసభకు కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు అధ్యక్షులు, ఆంధ్రపత్రిక స్థాపకులు, మొదటి ప్రపంచ యుద్ధం సమాప్తం; స్వీయజాతి రాజ్యాల ఏర్పాటు వాదన లేచింది. బ్రిటిషువారు ఇండియాను విడచిపోవాలి అన్న నినాదం ప్రబలింది. సహాయ నిరాకరణోద్యమానికి బీజాలు ఏర్పడ్డాయి.

1919 : "తప్పు చేసిన వారిని తంతే తప్పా ?" అని తండ్రితో గద్దించడం; అందుకు తండ్రిచే తన్నులు తిని, స్పృహతప్పి పడిపోవడం; మాంటింగు, జేమ్సుఫర్డు సంస్కరణల ప్రారంభం; గాంధీజీ పూర్తిగా రాజకీయాల్లోకి దిగడం; బ్రిటిషువారిని ఎదిరించడం; రౌలత్ చట్టం.

1920 : జాతీయవాది, ఖద్దరుదారి కోడిగంటి నరసింహం మూర్తిగారికి విద్యాబుద్ధుల్ని చెప్పమని బాలలచ్చన్నను తీసుకుని వెళ్లి తండ్రి చిట్టయ్యను అర్థించడం; తన ఇంటివద్దనే ఉంచుకోవాలని చెప్పడం; ఒక్కతిండికే ఇంటికి రావాలని షరతు పెట్టడం; మాష్టారి గారు అనాటి దేశపరిస్థితులను పత్రికల్లో చదివి చెప్పగా ఎంతో కుతూహలంతో వినడం; తిలక్ మరణం; గాంధీజీ యంగ్ ఇండియా హరిజన పత్రిక స్థాపన; విదేశీ వస్తుబహిష్కరణకు పిలుపు; కాంగ్రెస్ ఎన్నికల బహిష్కరణ; మద్రాసులో జస్టిస్ పార్టీ గెలుపు; గాంధీ, నెహ్రూల సమ్మేళనం; గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం ప్రారంభం.

1921 : దేశభక్తి గీతాలను, దేశభక్తిగాధలను ఎగిరిగంతేసివినడం, చదువుపట్లగాక, సమాజంపట్ల శ్రద్ధ చూపుతూ, ఆకతాయితనం ప్రదర్శిస్తున్న బాలలచ్చన్నకు విద్యాబుద్ధుల్ని ఎందుకు చెప్పించాలి ? మనకందుకు అర్హత ఉందా ? అని సాటి కులస్థులు లచ్చన్న తండ్రి చిట్టయ్యను మందలించడం; మనకెందుకు చదువులని చెవిలో నూరిపోయడం; అల్లూరి సీతారామరాజు పితూరీ లేవడం; తెల్లదొరల గుండెల్లో బల్లెమై నిలవడం; బెంగాలీ తీవ్రవాదులతో రామరాజు చేతులు కలపడం, ఆంధ్రరత్న దుగ్గిరాల బరహంపూర్‌లో అరెస్టుకావడం;

1922 : ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యను బరహంపూర్‌లో అరెస్టు చేసినందుకు నిరసనగా తోటి బడిపిల్లలతోపాటు బారువా వెళ్లి రైళ్లను ఆపడం, అందరి పిల్లల్లో వీడు అజేయుడు సుమా అనిపించుకోవడం; విద్యార్థిదశలో జాతీయ భావాలు వంటబట్టటం; స్వరాజ్యం పేపరులోని విషయాలను తనమాష్టారిగారి ద్వారా వినడం; ఉత్తరాంధ్రలో ఊపిరిపోస్తున్న స్వరాజ్యోద్యమం.

1923 : విదేశీ వస్తు బహిష్కరణ సందర్భంగా తన గ్రామం బారువాలో జరిగిన హర్తాల్; బాలలచ్చన్న పాఠశాల నుండి ఇతర బాలురతో వస్తు నడివీధిలో విదేశవస్తువులతో మండుతున్న అగ్నిగుండంలో తనచొక్కాను విప్పివేసాడు; తనకానాటి ఉద్యమం ఏమిటో తెలియక పోయిన, దేశంలో ఏదో జరుగుతున్నది. తను తన దేశభక్తిని చాటాలి అన్నదే తన తపన – స్కూల్లో తనను, తన గుణాన్ని, తనయింటిని ఎకసెక్కం చేసి మాట్లాడిన బారువా స్కూలు హెడ్మాష్టరును, పై బెంచీని త్రోసి బయటకు పరుగెత్తడం, అణాపారేస్తే కావలసినంత దొరికే ఉప్పుకోసం ఉప్పు తయారీ సత్యాగ్రహం ఎందుకు ? అని తనకానాడు అర్థం కాకపోవడం.

1924 : బారువాదరి మందసా హైస్కూల్లో విద్యాభ్యాసం ఫోర్తుఫారంలో ప్రవేశం; ఉపాధ్యాయకులాన్ని; వంశాన్ని ఎద్దేవా చేసిన అగ్రవర్ణాల,

సవర్ణుల పిల్లలపై జబ్బచరచడం, విరుచుకు పడడం; ఒరే మీకు మేము ఎందులోను తీసిపోంరా అని గద్దించడం; ఉత్తరాంధ్రలో అల్లూరి సీతారామరాజు తిరుగుబాటు ఉద్భృత రూపం దాల్చడం; సీతారామరాజు తెల్లదొరలన బలికోరడం.

1925 : మందసాలో దురలవాట్లు, చెడు సహవాసం, దౌర్జన్యం, హరికృష్ణులు, బుద్ధిబలంగాక భుజబలాన్ని పంచుకుని ఫోర్తుఫారంలో ఫెయిల్ అవడం; తన కులాన్ని తక్కువచేసి మాట్లాడిన వారిపై తిరుగుబాటు, అంబేద్కర్ బొంబాయికి దగ్గరలోనున్న మహద్ అనే గ్రామంలో అగ్రవర్ణాల వారు వాడుతున్న చెరువునుండి హరిజనుల చేత నీరుతోడించుకుని తిరుగుబాటు జెండా ఎగరవేయడం

1926 : శ్రీకాకుళం మున్సిపల్ హైస్కూల్లో మరల ఫోర్తుఫారంలో ప్రవేశం అన్నయ్య సత్యనారాయణ హయ్యర్‌గ్రేడ్ ఉపాధ్యాయని శిక్షణ మొదట సంవత్సరంలో ప్రవేశం; ప్రతీదినం హైస్కూలుకు వెళ్లడం, పాఠాలు వినడం జరిగేది. మానసికమైన మార్పులు వస్తున్న సమయం.

1927 : శ్రీకాకుళం విద్యాభ్యాసం చేస్తు జాతీయభావంతో పాటు దౌర్జన్యం, రౌడీతనం కొంచెం పాళ్లలోనున్న రావికంటి జగన్నాథం దంపతులు గారింట్లో వుంటూ తనతో సహచర్యం చేయడం, స్కూలుకు వెళ్లడంతో అశ్రద్ధలేదు, పాసయినారు. గాంధీజీ ఒరిస్సా రైతులతో ఉద్యమాన్ని లేవదీయడం; అంబేద్కర్ హిందువుల పవిత్రగ్రంధం మనుస్మృతిని బహిరంగంగా తగులపెట్టి గొప్పసంచలనం సృష్టించడం; ఆంధ్ర యూనివర్శిటీ స్థాపన; సైమన్ కమిషన్ గోబెక్ అన్న వివాదం; న్యాయపతి నారాయణరావు శ్రీ వి.వి. జగ్గయ్య పంతులువంటి నాయకులు.

1928 : శ్రీకాకుళం హైస్కూల్లో ఫిఫ్తు ఫారం పోవడం; ఆకతాయితనానికి తాత్కాలికంగా స్వస్తి చెప్పి బుద్ధిగా జగన్నాధం పంతులు గారి సలహాపై చదువుకోవడం; తన అన్నయ్య హయ్యర్ గ్రేడు

ఉపాధ్యాయ శిక్షణను పూర్తి చేయడం; తమ పిల్లలిద్దరూ పెద్దచదువులు పూర్తిచేసారని తల్లిదండ్రులు సంతోషించడం; దేశంలో మితవాదులు – అతివాదులు – అన్నది, ఏర్పడటం; నెహ్రూ ట్రేడ్‌యూనియన్ లీడరుగా ఎన్నుకోబడటం; రష్యాలో మొదటగా పంచవర్ష ప్రణాళిక అమలు, మనదేశ మిశ్రమ ఆర్థిక వ్యవస్థకు బీజాలు ఏర్పడ్డాయి.

1929 : ఇచ్ఛాపురం హైస్కూల్లో సిక్స్‌ఫారంలో ప్రవేశం, నేటి పదకొండవ తరగతి S.S.L.C మరల రౌడీమిత్రలతో తిరగడం; కులాసాగా దినాల్ని గడపడం; పైలాపచ్చీసుగా తిరగడం; అట్టడుగున పడిన వాడికి హైస్కూలు చదువులా వెనుకబడిన కులాలవారికి విజ్ఞాన రేఖలా ? అని సమాజం గద్దిస్తున్న దినాలు; ఆనాటి సెలక్షన్ విధానం మేరకు తనను పబ్లిక్ పరీక్షలకు అనుమతించలేదన్న కసి, కక్షతో తన కులాన్ని, వంశాన్ని చులకన చేసి మాట్లాడినావన్న అక్కసుతో ఆ స్కూలు హెడ్మాష్టరు ఉపద్రష్ట సత్యనారాయణ గారిని నిర్బంధించి, ఒక ద్వీపస్థంబానికి రౌడిమిత్రులతో తాళ్ళతో కట్టివేయడం; ఈ సంఘటనే తన బాల్య జీవితంలో జాగృతిని కలిగించడం; ఆత్మజ్యోతి వెలిగేలా చేసింది; తప్పొప్పులను తెలియచేసింది; అంతర్నిరీక్షణ ఆరంభం; విపరీత మనస్తత్వాన్ని విదలించుకోవాలి అన్న జిజ్ఞాస; నాటి సామాజిక అసమానతలకు, అన్యాయాలకు ఈతను లోనుగాక మాటకే తిలోదకాలిచ్చే మార్గాల అన్వేషణ ప్రారంభం; నేపడా ఉప్పుకొఠార్ల సామూహిక సత్యాగ్రహిగా దాడిచేసినందుకు లారీ ఎక్కించి, అరెస్టు చేసి మరల విడుదల చేశారు. బాలలచ్చన్న రాజకీయాల్లో పడిపోతాడేమోనని తల్లిదండ్రులు మరల హైస్కూలు చేర్పించారు.

1930 : విద్యార్థి దశలోనే స్వాతంత్ర్యోద్యమంలోనికి లంఘించడం ; మరల శ్రీకాకుళం హైస్కూల్లో సిక్స్తు ఫారంలో (11వ తరగతి, S.S.L.C) ప్రవేశం; జగన్నాథం గారింట్లో నాటి ఆకతాయి లచ్చన్న ఆదర్శ విద్యార్థిగా మారాడు, శ్రద్ధాభక్తులతో చదివాడు,

'శ్రద్ధవాన్ లభతే, జ్ఞానం' అని కదాగీత చెప్పింది. అయితే దేశభక్తి, జాతీయభావం, క్రమశిక్షణ కల డ్రిల్ టీచరు నేమాని నరసింహం మూర్తిగారన్న మితిమీరిన అభిమానం; క్రీడలపై అమితాసక్తి, దేశభక్తి ప్రధమ ఫారాన్ని తనే లచ్చన్నగారికి నేర్పారు. సెలెక్షన్ పరీక్షలో నెగ్గి, ఎ.ఎస్. పరీక్షల్ని వ్రాసి తన స్వగ్రామంలో దరి నౌపడా ఉప్పు కొఠార్ల సామూహిక సత్యాగ్రహంలో పాల్గొన్నం దున ఒక నెల 20 దినాలు ప్రధమంగా జైలుశిక్ష అనుభవించారు. టెక్కలి సబ్‌జైల్లో; ఉప్పు సత్యాగ్రహం; పికెటింగ్ ఉప్పు కొఠార్లపై దండయాత్ర; టెక్కలి, నరసన్నపేట జైల్లాంమూండ్ బరహంపూర్ లో నెలశిక్ష సోంపేట నౌపడ ఉప్పు కొటారులపై సామూహికంగా దాడిచేసినందుకు లారి ఎక్కించి అరెస్టు చేసి మరల విడుదల చేసారు. ఎక్కడ రాజకీయాలలో పడిపోతా డేమోనని ఆ తల్లితండ్రులు మరల హైస్కూలులో చేర్చారు. రైల్వేస్టేషనుకి అన్నయ్య ప్రోద్బలంతో తన మనసున పుట్టకపోయిన సైకిలుపై వెళ్ళి సిగ్నలింగ్ తర్ఫీదనందడం; అదే సంవత్సరం బారువా సత్యాగ్రహ శిబిరంలో చేరడం; ఏప్రియల్ నేపడా ఉద్యమ ప్రమాణపత్రం పై సంతకం; వామపక్షరాజకీయాల ప్రారంభం; జనజాగృతి కలిగింది; ప్రధమ రౌండ్ టేబిల్ సమా వేశం; కాంగ్రెసు - బహిష్కరణ - అంబేద్కర్ పాల్గొన్నాడు.

1931 : బారువాలో సత్యాగ్రహి శిబిరం పికెటింగ్ - కార్యక్రమం; సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాల్లో కల్లుకొట్లు, విదేశీ వస్త్రదుకాణాల వద్ద పికెటింగ్; గాంధీ - ఇర్విన్ ఒడంబడిక; బరహంపూర్‌లో కాంగ్రెస్ సేవాదళ్ శిక్షణా శిబిరంలో శిక్షణ పొందడం; 2 వ రౌండు టేబిలు సమావేశం ; ఉద్యోగం కాక ఉద్యమమే తన జీవితానికి ఊపిరై కావాలన్న నిర్ణయం; కాకినాడ వెళ్ళి కాంగ్రెసు సేవాదళ్ శిక్షణా శిబిరంలో శిక్షణ పొందడం; రెండవ రౌండ్ టేబుల్ సమావేశం.

1932 : శాసనోల్లంకోద్యమంలో పాల్గొనడం; బారువాలో అరెస్టుకాబడి రాజమండ్రి సెంట్రల్ జైల్లో 6 మాసాల శిక్ష అనుభవించడం;

జైల్లో బెంగాల్ విప్లవకారులతో పరిచయం; రాజకీయ పదవులనందటానికి, వర్గాల ప్రాబల్యం; కాంగ్రెసులో స్వరాజ్యపార్టీ అవతరణ; బరహంపూర్‌లో సత్యాగ్రహాల కాల్పులు; కమ్యూనల్ అవార్డు ప్రకటన; మూడవ రౌండుటేబిల్ సమావేశం ; పూనా ఒడంబడిక (అంబేద్కర్ గాంధీజీ) బెర్రరిష్టులలో చేతలు కలపటానికి బెంగాల్ ప్రయాణం, కాకినాడ, మద్రాస్‌లో బాంబుకేసులు; అన్నాప్రగడ కామేశ్వర రావు; ప్రతివాద భయంకరాచార్యులు మద్దూరు అన్నపూర్ణయ్య కాకరాల కామేశ్వరరావులపై కేసులు, భగత్‌సింగ్ కేసు ముద్దాయిలతో పరిచయం, స్థానిక హరిజనోద్యమం, ఉద్యోగం కాక, ఉద్యమం తన జీవితానికి ఊపిరి కావాలని నిర్ణయాలు, కాకినాడ వెళ్లి కాంగ్రెస్ సేవాదళ్ శిక్షణ శిబిరంలో శిక్షణ పొందారు.

1933 : ఆల్ ఇండియా కిసాన్ సభ అధ్యక్షులు రైతురంగా పిలుపులు కిసాన్ ఉద్యమం ప్రారంభం; రైతు రక్షణ యాత్ర నవంబరు ఏడవతేదీన ఛత్రపూర్ కలెక్టరుని విజ్ఞాపన పత్రం ; రైతు రంగా రైతు మహాసభలను ప్రారంభించడం; న్యాయపతి నారాయణరావు, పుల్లెల శ్యామసుందర్రావు, అచ్చన్న ఉన్నారు.

1934 : గంజాం జిల్లా ఆంధ్ర కాంగ్రెస్ కార్యదర్శిగా మాజీ రాష్ట్రపతి బాబూ రాజేంద్రప్రసాద్ కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో బరహంపూర్ రాగా, ఆంధ్రప్రాంతానికి ఆహ్వానించడం; విశాఖపట్నంలో లోక్‌నాయక్ జయప్రకాష్ పరిచయం; కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో కార్యవర్గ సభ్యత్వం ; జమీందారీ ఎస్టేట్ రైతాంగం పోరాటానికి సన్నద్ధం కావడం; కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆంధ్రశాఖ అధ్యక్షులు యన్.జి.రంగా, శక్రటరీ మద్దూరు అన్నపూర్ణయ్య, మహాకవి శ్రీ శ్రీ మహాప్రస్థానం వెలుగులోనికి వచ్చింది. యన్.జి.రంగా, అచ్చన్న లానాడా అతివాద రాజకీయవాదులు.

1935 : కిసాన్ ఉద్యమం తీవ్రరూపం దాల్చడం; గుంటూరు జిల్లా నిడుబ్రోలు యన్.జి.రంగా స్థాపించిన రామినీడు రైతాంగం

విద్యాలయంలో రాజకీయ శిక్షణా శిబిరంలో శిక్షణ పొందడం; ఆంధ్రలో 3 అతివాదపార్టీల ఆవిర్భావం.

1936 : గంజాం జిల్లానుండి విడివడిన ప్రాంతాలతో ఉత్తర విశాఖ జిల్లా గాపొలిటికల్ ఆర్గనైజేషన్ ప్రారంభం; ఆల్ ఇండియా కాంగ్రెస్ కమిటీ సభ్యత్వం, ఎన్నికలు కేంద్ర రాష్ట్రాల్లో కాంగ్రెసు పార్టీ గెలవడం; నాటి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి జస్టీసు పార్టీ నాయకులు బొబ్బిలి మహారాజా ఓడిపోవడం; పరిమిత ఓటింగు విధానం, ఉత్తర విశాఖ రాజకీయ జిల్లా కాంగ్రెస్ కమిటి ఆర్గనైజేషన్, ఎ.ఫి. పాత్రోను పనిగట్టుకుని ఓడించారు; లచ్చన్న జిల్లా కాంగ్రెస్‌కమిటి జనరల్ సెక్రటరీగా ఎన్నుకోబడిన; రాష్ట్ర కాంగ్రెస్ దానిని రద్దు చేయడం; పార్టీలో వర్గాల ముఠాలు ఏర్పాటు; జస్టీసు పార్టీ ఓటమి; రైతు రక్షణ మహాయాత్రను మద్రాసు రాష్ట్ర శాసనసభ ఎన్నికల్లో ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు 700 మైళ్ళ కాలినడకతో నడపడం; ప్రధాన నిర్వాహకులు రెడ్డి సూర్యనారాయణ, పుల్లెల శ్యామసుందరం, చల్లా లక్ష్మీనరసింహం శాసనసభ్యులు వి.పి పాత్రను ఓడించడం; గాంధీజీతో లక్నో కాంగ్రెసులో ఎ.సి.సి మెంబరుగా దూరం నుండి పరిచయం, జయప్రకాష్ నారాయణతో పరిచయం, జిల్లా నాయకులు న్యాయపతి నారాయణమూర్తి పుల్లెల శ్యామసుందరం జమీందార్లకు వ్యతిరేకంగా రైతాంగ పోరాటం; రెవెన్యూ మంత్రిగా ఉన్న ప్రకాశం గారికి విజ్ఞాపన పత్రం అందించడం; రాజాజికి విజ్ఞాపవ పత్రం, ఆచార్యరంగా, భారతీ రంగాలు బర్మా యాత్ర ముగించుకొని బారువా రేవులో దిగగా, స్వాగతం చెప్పడం, సన్మానించడం.

1937 : రంగాగారి వేసవి పాఠశాలలో రాజకీయ శిక్షణ; ఆంధ్రాలో జయప్రకాష్ పర్యటవ, స్వాగత పన్నాహాలు, జమీందారీ అబో విషన్ ఎంక్వయిరీ కమిటీ ఏర్పాటు. విజ్ఞాపన పత్రం కమిటీ పభ్యులు రెబ్బాప్రగడ మందేశ్వరరావు, కొమ్మారెడ్డి సూర్య నారాయణ, పుల్లెల శ్యామసుందరం, గౌతులచ్చన్న ప్రొఫెసర్

రంగా, పట్టాభి సీతారామయ్య, ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు; మద్రాసులో రాజాజీ ప్రధానమంత్రి ఖరారు

1938 : ఫయిజ్‌పూర్ కాంగ్రెసు సభలు; కిసాన్ రాలి నిర్వహణ; పటేలు వ్యతిరేకం; పుల్లెల శ్యామసుందరం, గౌతులచ్చన్న, రంగాలు హాజరు స్వామి సహజానంద సరస్వతి స్వర్గస్తులవడం; బారువా, చీకటి, జలంత్ర, మందసా, చెముడు, కురుపా, విజయనగరం, బొబ్బిలి సంస్థానాల్లో రైతాంగం పోరాటాలు నిర్వహణ.

1939 : హరిపుర సమావేశం; ఫార్వర్డు బ్లాక్‌స్థాపన; నేతాజీ ఆంధ్ర పర్యటించగా వారితో పర్యటించడం; ఫార్వర్డు బ్లాక్ సభ్యత్వం; కాంగ్రెస్ క్రమశిక్షణా చర్యను ఎదుర్కొనడం ; స్వరాజ్యం విప్లవమార్గన్నే లభించగలదన్న విశ్వాసం, నమ్మికలు ఏర్పడటం; రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభం

1940 : ఆల్ ఇండియా కిసాన్ సభలో పలాసాలో నిర్వహణ; ఆహ్వాన సంఘం అధ్యక్షాలు పుల్లెల శ్యామసుందరం, శక్రటరి గౌతు లచ్చన్న,జొన్నలగడ్డ రామలింగం 1 1/2 లక్షల మంది రైతులను ఏప్రిల్ నెలలో మందసా కాల్పులు రైతుల విప్లవ పోరాటం పుల్లెల శ్యామసుందరం గతించగా ఉత్తర విశాఖ కాంగ్రెస్ నాయకత్వం స్వీకారం; అండర్‌గ్రౌండ్ పోరాటానికి సిద్ధపడటం; కాంగ్రెస్‌లో వర్గాలు, గ్రూపులు ఏర్పడ్డాయి. వ్యష్టి సత్యాగ్రహం పోరాటానికి కాంగ్రెస్ పిలుపు.

1941: అండర్‌గ్రౌండ్ పోరాటం; మందసా రైతుల డిఫెన్సు కమిటీకి తోడ్పడటం; రహస్య జీవితం గడపడం; చిత్తూరు, రాయలసీమ రహస్యంగా పర్యటించడం; ఎస్టేటు రైతు రక్షణ సంఘాలను జిల్లా అంతట తిరుగుతూ చైతన్యపరచడం; మందసా రైతుల డిఫెన్సు కమిటీకి నిత్యం సహాయ సద్భావాలను అందించడం, చివరకు రైతాంగందే విజయం అనిపించడం.

1942 : క్విట్ ఇండియా ఉద్యమంలో అండర్‌గ్రౌండ్‌లో నుంటూ పాల్గొనడం; ఒకచోట పోస్టల్ ఆఫీసు, వేరొకచోట తహశీల్దారు

ఆఫీసు దగ్ధమవటం, రైలుపట్టాలు తెగిపడడం, లచ్చన్న గారే ఇందుకు బాధ్యులని తన అన్న సత్యనారాయణ దుర్భల షాహు కర్రి అపారావు, సూర్యనారాయణను డిటెన్యు చేయడం, ఎస్టేటు రైతుసంఘాల నాయుకులలో రహస్యంగా కలవడం; రైతోద్యమాన్ని కొనసాగించడం.

1943 : అండర్‌గ్రౌండ్ పోరాటంలో నుండగా డా॥ ధర్మతేజ నుండి మద్రాసులో జరిగే అండర్‌గ్రౌండ్ వర్కర్ల సమావేశానికి రమ్మని పిలుపు; కిల్లి అప్పలనాయుడుతో ప్రయాణిస్తుండగా రాజమండ్రిలో పట్టుబడడం; జైల్లో నిర్బంధించడం; కిల్లి అప్పల నాయుడు డిటెన్యుగా తంజావూరు జైలు, ఆలీపూర్‌జైలునుండి విడుదల, మరల డిటెన్యు, "ఆల్లీపూరో కాంప్ జైల్లో ఒక సంవత్సరం శిక్ష అనుభవించడం -

1944 : కన్ననూర్ జైల్లో 2 మాసాల శిక్ష అనుభవించడం తదుపరి తంజావూర్ జైలుకు మార్చడం; రంగా, గొట్టిపాటి బ్రహ్మయ్య, మంతెన వెంకటరాజు, బ్రహ్మనందరెడ్డి, కళ్లూరి చంద్రమౌళి, గొల్లపూడి శీతారామశాస్త్రి, శరణు రామస్వామి వారితో జైలు శిక్ష అనుభవించడం; ఈ జైల్లోనే వ్యక్తుల మధ్య సిద్ధాంతుల అనుసరణలో విభేదాల ఫలితంగా,వ్యక్తిగత స్పర్ధలు, తగాదాలుకు రూపకల్పన; రష్యా, అమెరికా, బ్రిటన్‌లతో చేయిగలపడంతో కమ్యూనిష్టుల ప్రజా యుద్ధం అని చెప్పగా పుచ్చలపల్లి సుందరయ్యను, జొన్నలగెడ్డ రాయలింగయ్యను, కంబంపాటి సత్యనారాయణను, చండి జగన్నాధం గార్లను విడుదల చేయడం.

1945 : తంజాపూర్ జైలునుండి బదిలీ చేసిన మరుక్షణం డిటెన్యుగా మరల "రాయవెల్లూరి జైలును తరలించడం; అచట అమరావతి జైలుకు వచ్చి ఆంధ్ర కేసరి కళా వెంకట్రావు, అన్నె అంజయ్య, మద్దూరు అన్నపూర్ణయ్యలతో శిక్ష అనుభవించడం; జైలులో నుండగానే వర్గాలు ఏర్పడ్డాయి. వెల్లూరు వెంకట్రావు నాయుడు, లచ్చన్న, ఓబుల్‌రెడ్డి, తిమ్మారెడ్డి, బాలిరెడ్డి, ఆచార్యరంగా

అనుయాయులయ్యారు. 21-10-1945 లో రెండవ ప్రపంచ యుద్ధం ముగిసిన తదుపరి మంత్రిత్రయ ప్రతిపాదనల మేరకు జైలునుండి విడుదల, అఖిల భారత జాతీయ ట్రైడ్ యూనియన్ ఏర్పడంది. ఆజాద్ హింద్ ఫౌజులు (I N A) పనిచేసి జైలునుండి విడుదలయిన తదుపరి ఏలూరులో వారికి లచ్చన్న కాంగ్రెస్ కార్యకర్తగా ఘనసన్మానం ఏర్పాటు చేయడం, S.N. [illegible] సుబాస్ బోసు స్వీయ డాక్టరు అధ్యక్షులు సభ ఏర్పాటు చేశారు.

1946 : "కేబినట్ మిషన్ ప్లాన్" రాజ్యాంగ సభ ఎన్నికలు; ఆపద్ధర్మ ప్రభుత్వం డిల్లీలో ఏర్పాటు, నెహ్రూ ప్రధానమంత్రి రాష్ట్రాల ఎన్నికల్లో కాంగ్రెస్ పాల్గొనడం; జిల్లా కాంగ్రెస్ పార్టీ లచ్చన్నను అభ్యర్థిగా నిర్ణయించిన రాష్ట్రకాంగ్రెస్ వర్గ వివాదంతో త్రోసిపుచ్చడం; దేశభక్తి కొండా వెంకటప్పయ్య అధ్యక్షతన ఢిల్లీ వెళ్లి పటేలుతో నివేదించినా ఫలితం లేకపోవడం; ప్రకాశంగారు ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ముఖ్యమంత్రి, కళా వెంకట్రావు రెవెన్యూమంత్రి; జమీందారీ రద్దుచట్టం; ఆంధ్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి రంగాగారు ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షులు, ఆంధ్రకాంగ్రెస్ కమిటీ జాయింట్ శక్రటరీ, ఇండియన్ నేషనల్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ఆంధ్రవిభాగానికి వ్యవస్థాపక అధ్యక్షులు, ఉత్తరాంధ్ర పర్యటన రైతోద్యమంవ్యాప్తి పలాసాలో 3 మాసాలు కాంగ్రెసు సేవాదళ్ ఆఫీసర్ల శిక్షణ శిబిరాన్ని నిర్వహించడం, విశాఖపట్నం సింధియా స్టీల్ నేవిగేషన్ వర్కర్ల అసోసియేషన్ అధ్యక్షపీఠాన్ని అలంకరించడం, వారి పే స్కేల్సును సాధించడం, కార్మికోద్యమం నడపడం, ఉత్తర విశాఖజిల్లా ఆంధ్రా కాంగ్రెస్ అధ్యక్షుని హోదాలో బరహంపూర్ చేరిన మహాత్మాగాంధీజీకి ఆంధ్ర సరిహద్దులో స్వాగతం చెప్పి, ఆయనతో ఆంధ్రాలో పర్యటించడం, వేదికలపై స్వాగతం లచ్చన్నగారే.

1947 : "స్వతంత్రభారత్" ఏర్పడడం, ఆనాడు ఒరిస్సా మాజీ ముఖ్యమంత్రి హరేకృష్ణ మెహతాబ్ అధ్యక్షత వహించగా, ఆంధ్రా

యూనివర్శిటీలో స్వాతంత్ర్య దినోత్స సభలో పాల్గొని ప్రసంగిం చడం, ప్రవాసాంధ్రుల పరిస్థితిని అంచనావేసి ప్రభుత్వానికి నివేదిం చటానికి ఒరిస్సా, బీహార్, బెంగాల్లో పర్యటించడం, బరహంపూర్, భువనేశ్వర్, కటక్, జంషెడ్పూర్, ఆగ్రా, కలకత్తాలను సందర్శిం చడం, రైతునాయకులంతా కలసి, ఢిల్లీ వెళ్లి బిర్లామందిరంలో గాంధీజీని కలిసి రంగాను నెహ్రూ మంత్రివర్గంలో కిసాన్ ప్రతినిధిగా ఉంటూ ఆహారమంత్రిగా చేయమని, మహాజరునందించడం, కంట్రోల్సు ఎత్తి వేయమని కోరడం, ఉత్తరాంధ్రలో ప్రతీ పల్లె పల్లెను తిరిగి, రైతోద్యమాన్ని పటిష్టం చేయడం, రైతుకూలీ ప్రజారాజ్యాన్ని స్థాపన జేయాలని కోరడం, నినాదాన్నివ్వడం, ఎస్టేట్ రైతు రక్షణ సంఘాలను చైతన్య పరచడం, దున్నే వానిదే భూమి, కష్టించిన వానిదే ఫలితం అని ప్రచారం చేయడం.

1948 : "జలహంష" నౌక ప్రారంభత్వానికి నెహ్రూ విశాఖపట్నం రాగా, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శిగా, కాంగ్రెస్ సేవాదళం సెక్రటరీగా తరపున సింధియా నేవిగేషన్ స్టీంవర్కర్ల అసోసి యేషన్ అధ్యక్షునిగా స్వాగతం పలకడం; ఇదే సమయమున నాటి ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు రంగా, నెహ్రూకు లచ్చన్న ప్రతిభా సామర్థ్యాలను వివరించగా, నెహ్రూ లచ్చన్నగారిని అభినందించడం, దేశానికి స్వాతంత్ర్యం వస్తేనే తప్ప వివాహం చేసుకోనని భీష్మిం చుకొని కూర్చున్న లచ్చన్నగారికి యశోదమ్మతో వివాహాన్ని బారువాలో కాంగ్రెస్ వర్కర్లు జరిపించడం; బర్మా శాంతి స్థాపనకు మనదేశం ప్రతినిధిగా వెళ్లడం; బర్మాలోనున్న తనకు ఖాళీ అయిన విశాఖపట్నం లేబర్ సీటుకు పోటీచేయటానికి కాంగ్రెస్ అభ్యర్థిగా తనకు నామినేషన్ విశాఖవచ్చి వేయమని తంతి ఆదేశం నాటి కాంగ్రెస్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ నుండి! బర్మా మంత్రుల అంతిమ యాత్రలో ఇండియా ప్రతినిధిగా పాల్గొమని లంపడం, విశాఖతూర్పు గోదావరి జిల్లాల కార్మిక నియోజక వర్గంనుండి కమ్యూనిస్టు సోషలిస్టు అభ్యర్థులను ఓడించి, కాంగ్రెసు అభ్యర్థిగా గెలుపొంది ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభలో శాసన సభ్యునిగా ప్రవేశించడం.



స్వాతంత్ర సమరయోధుల్ని రాజభవన్ లో ఆంధ్రప్రదేశ్ గవర్నర్ కుముద్ బెన్ జోషి జరపగా స్వాతంత్ర సమరయోధుడు సమావేశానికి హాజరైన భారత రాష్ట్రపతి ఆర్. వెంకట్రామన్ చిత్రంలో ఉన్నవారు అంతా శ్రీకాకుళం జిల్లాకు చెందినవారు.

# సర్దార్ గౌతు లచ్చన్న

## (జీవితచరిత్ర)

## ద్వితీయ భాగము

## విషయసూచిక

25వ ప్రకరణము-యస్.సి, బి.సి, యస్.సి, మైనారిటీల మహాసభ-లచ్చన్న

26వ ప్రకరణము-దళిత మజ్దూర్ కిసాన్ మహాసభ-లచ్చన్న

27వ ప్రకరణము-వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన-లచ్చన్న

28వ ప్రకరణము-జనతాదళ్ పార్టీ రాష్ట్ర నాయకునిగా-లచ్చన్న

29వ ప్రకరణము-వివిధ పార్టీలు-లచ్చన్న

30వ ప్రకరణము-సమకాలీన రాజకీయ రణరంగ భీష్ముడు-లచ్చన్న

సమాప్తం.

# ప్రత్యేకానుబంధం

1. బలహీన వర్గాల జాబితా ప్రకటన కథ-లచ్చన్న
2. ఉత్తరాంధ్ర జీవనధార-వంశధార-లచ్చన్న
3. నటరత్న ఎన్.టి.ఆర్-సర్దార్ గౌతు లచ్చన్న
4. చెన్నారెడ్డి-లచ్చన్నల చెలిమి-కలిమి.

సమాప్తం

# సర్దార్ గౌతు లచ్చన్న

## (జీవిత చరిత్ర)

## ద్వితీయభాగం

## 1వ ప్రకరణము

### ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభా సభ్యత్వం-లచ్చన్న

1948 జూన్ నెలలో విశాఖ తూర్పు గోదావరి జిల్లాల కార్మిక నియోజకవర్గం నుండి, కమ్యూనిస్టు, సోషలిస్టు అభ్యర్థులను ఓడించి, కాంగ్రెస్ అభ్యర్థిగా గెలుపొంది ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో శాసన సభ్యత్వమును పొందారు.

శాసన సభ్యునిగా గెలుపొందిన తదుపరి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో పాల్గొని, మద్రాస్ నగరం చేరి, శాసన సభ్యునిగా సభలో పదవీ ప్రమాణ స్వీకారము చేసారు.

ఉత్తరాంధ్ర గడ్డపై రైతుకూలీ ప్రజాభిమానంతో, ఊపిరి పోసికొని, జమిందారీ ఎస్టేట్స్‌పై రైతాంగ పోరాటాన్ని రైతురంగా నాయకత్వమున నడిపి రైతోద్యమ నాయకునిగా, అసరికే పేరందిన లచ్చన్నకు, కార్మిక వర్గంకూడా తన అండదండల నందించి తమ ప్రతినిధిగా శాసనసభకు అంపించారు. కష్టజీవులకు కలిమివి బలిమివి తెచ్చి పెట్టే వ్యక్తి అని శక్తిగలాడని పేరందిన వారు లచ్చన్న. ఉత్తర విశాఖ కాంగ్రెస్ అధ్యక్షునిగా, సింధియా స్టీమ్ నేవిగేషన్ వర్కర్ల అసోసియేషన్ అధ్యక్షునిగా రైతోద్యమ ముఖ్య నిర్వాహక ప్రతినిధిగా పేరందిన లచ్చన్న శాసనసభ సభ్యునిగా కీర్తి ప్రతిష్టలంది, ప్రజాహితుడనిపించుకొనుటకు తనకొక సువర్ణావకాశం లభించింది. ఎన్నో వేదికలపై, ఎన్ని సభలలో సమ్మేళనలో ప్రజాభ్యుదయంకోసం, ఎలుగెత్తి చాటిన లచ్చన్నగారికి "ప్రజావాణి"ని శాసన సభలో వినిపించుటకు ప్రభుత్వాన్ని గద్దించుటకు తగిన అవకాశం వచ్చింది.

ఉమ్మడి మద్రాసు రాష్ట్రమున ఆనాటికి ఉన్నది కాంగ్రెస్ ప్రభుత్వమే. అధికార పక్ష శాసనసభ్యుడే. ప్రతిపక్షమున కూర్చొని వాదించనవసరం లేదు. తన పార్టీ రాష్ట్రాన్ని పాలిస్తున్న తరుణం, ప్రభుత్వాన్ని ఒప్పించి ప్రజాహితమైన కార్యాల్ని ప్రభుత్వం చేసేటట్లు చేయాలి. తన వివేకాన్ని చొరవను చూపించాలి. ప్రజ్ఞను

కనపరచాలి. సభలో వాదించి తన ప్రతిపాదనలు సరియైనవేయని ప్రభుత్వ ప్రతిపక్షపార్టీలు అంగీకరించేలా చేయాలి. శాసనసభా సభ్యత్వమన్న శాసనసభలో హాజరై, హాజరు పట్టికలో సంతకం చేసి మరలుట కాదు. శాసనసభలో జరిగే చర్చల్లో పాల్గొనాలి తప్పొప్పులను వెదకాలి. ఒంటెత్తు పోకడలున్న "కాదు", "కూడదు"ని గర్జించి నిలబడాలి. అచ్చన్నగారికీ విద్యలన్ని వెన్నతో పెట్టినవే. ఉద్యమాల్ని నడుపుటలో ఆరితేరిన అచ్చన్నగారికి, శాసనసభలో ప్రసంగించడం, వాదించడం, నల్లేరు బండిపై నడక. వచో నైపుణ్యం, వాగ్ధాటికి, వాక్పటిమకు పేరెన్నికగన్న ఉపన్యాసకుడు అచ్చన్న.

అచ్చన్నగారు కాంగ్రెస్ శాసనసభ్యునిగా ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో ప్రవేశించే సరికి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్‌లో ముఠా రాజకీయాలు వర్గ ప్రాబల్యాలు బాగా గూడు కట్టుకున్నాయి. పర్యవసానంగా 1947లో ప్రకాశం మంత్రి వర్గం పతనమైంది. రాయలసీమ ప్రతినిధులెల్లరు ప్రకాశం మంత్రివర్గాన్ని ఎదిరించి నిలచారు. పట్టాభివర్గం తమిళులతో కలిశారు. 1946లో కాంగ్రెస్ హైకమాండ్ ఆదేశాల్ని కాదని ప్రకాశం ముఖ్యమంత్రి కాగలిగారు. రాయలసీమ శాసనసభ్యుల్ని సంతోషపరచలేక పోయినందుకు పై పరిణామం తప్పలేదు.

1948లో పట్టాభి సీతారామయ్య అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నిక యిన తదుపరి తన అనుచరుడు కళా వెంకట్రావు ద్వారా, ఆంధ్ర కాంగ్రెస్ వ్యవహారాల్ని "జోక్యం" చేసుకోవడం ప్రారంభమైంది.

అచ్చన్నగారు అసెంబ్లీలో ప్రవేశించిన సమయానికే కాంగ్రెస్ పార్టీ అంతర్గత కుమ్ములాటలో బిగిసి ఉంది. పార్టీ రాజకీయాల్లో రాటుపోటుల్ని అనుభవించిన అచ్చన్న గారికిది కొత్తగాక పోయిన-రానున్న కాలంలో పార్టీ నాయకత్వం తన గురువు రైతురంగా గారికి లభించి తీరాలన్న పట్టుదల కృషిలో ముందడుగు వేయ సిద్ధపడ్డారు.

ప్రకాశం మంత్రివర్గం పతనమైన తదుపరి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ శాసన సభా నాయకునిగా ఎన్నుకోబడి ఓ.పి. రామస్వామి రెడ్డియార్ మంత్రివర్గాన్ని ఏర్పరచారు. ఇదే మంత్రివర్గం 1949 వరకు కొనసాగింది.

1949 జూన్ నెలలోనే తన గురువు రైతురంగా, ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్ష పీఠానికి నామినేషన్ వేయడం, సంజీవరెడ్డి గారు ప్రత్యర్థిగా నిలబడటం జరిగింది. ప్రకాశం వర్గం రైతురంగాను సమర్థించింది. పట్టాభి సీతారామయ్య నాయకత్వాన గల మంత్రివర్గం సంజీవరెడ్డిని బలపరచింది. అత్యల్ప మెజారిటీతో రైతురంగా ఆంధ్ర

కాం(గెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించడం జరిగింది. తన గురువు రైతురంగా ఆంధ్ర కాం(గెస్ అధ్యక్షులు తన ఆంధ్ర కాం(గెస్ సంయుక్త కార్యదర్శి సంజీవరెడ్డి గారి ప్రాబల్యాన్ని తగ్గించటానికి రంగాజీ, రాయలసీమకు చెందిన పి. తిమ్మారెడ్డిని వైస్ ప్రెసిడెంటుగా, ఓబుల్ రెడ్డి గారిని జనరల్ సెక్రటరీగా, ఆంధ్రప్రదేశ్ కాం(గెస్ కమిటీకి నియమించారు. నిజానికి 1948లోనే ప్రాంతీయ కులదురభిమానాలు వెలుగులోనికి రావటానికి ప్రారంభించాయి. స్వరాజ్య సాధన వరకు వీటి అవసరం లేకపోయింది. తదుపరి వర్గ ప్రాబల్యాన్ని పోషించుకోవడానికి కీర్తి ప్రతిష్టలనందటానికి ప్రతి ఒకరు విచ్చలవిడిగా ప్రాంతీయ కులదురభిమానాలను ప్రతిపాదించ సిద్ధపడినారు.

## ఆంధ్రులకు ప్రత్యేక ప్రతిపత్తి-లచ్చన్న

లచ్చన్నగారు ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో అడుగిడేసరికి ముఖ్యమైన ప్రజా సమస్య తన భాషా సంస్కృతులకు ప్రతిరూపంగా నిలువగల ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆంధ్రులు అభిలషిస్తున్న దినాలవి. లచ్చన్నతోపాటు ఆంధ్రనుండి వెళ్ళిన శాసనసభ్యులెల్లరు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం కావాలని శాసనసభలో ఎలుగెత్తి చాటారు.

స్వరాజ్యం సాధన జరిగింది. ఇక ఆంధ్ర రాష్ట్రం కావాలి. మా భాష సంస్కృతి వెలుగులోనికి రావాలి. భారతదేశంలో ప్రతి భాషకు, సంస్కృతికి ప్రత్యేకతను సంతరించి పెట్టే రాష్ట్రమో, ప్రాంతమో ఉంది. ఆంధ్రులకానాటికి ఆ అవకాశం లేదు. రవీంద్రుడు కూడా పంజాబు-సింధు గుజరాత్, మరాఠా, ద్రావిడ, ఉత్కళ-వంగా'' అని ఆంధ్రులని ద్రవిడ కుటుంబమున చేర్చి 'మద్రాసీ'గానే పేర్కొనడం జరిగింది. ఒకవేళ ఈ వాదననే అమలు పరచిన, దక్షిణాది రాష్ట్రాలన న్నింటిని కలిపి ఒకే రాష్ట్రంగా ఏర్పరచాలి. ద్రవిడ భాషలో సంబంధమున్న భాషా రాష్ట్రాలనన్నింటినీ ఒకే రాష్ట్రంగా ఏర్పడేలా చూడాలి. ఇది అసంభవం. అసంగతం. కనుక ఆంధ్రులకు కూడా ప్రత్యేక రాష్ట్రం యిచ్చి తీరాలి.

ఆంధ్రుల చిరకాల వాంచ తము ఆంధ్ర రాష్ట్రం ''సైమన్ కమీషన్ గోబేక్'' అని మనం నినాదం యిచ్చాం. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడే అవకాశాన్ని జారవిడుచు కొన్నాం సైమన్ కమీషన్ స్వాగతం అని, పర్లా కిమిడి మహారాజు వి.పి. పాత్రొ ఒరిస్సా రాష్ట్రాన్ని ఏర్పడేలా రెండో రౌండు టేబుల్ కాన్ఫరెన్సుల్లో ప్రతిపాదించు కొన్నారు. ఆంధ్ర రాష్ట్రం కావాలని ఆనాడే వి.వి. గిరి, మహాపాత్రో, బొబ్బిలి రాజా, లండన్ కూడా వెళ్లి వినతి పత్రాలనందించిన తదుపరి ఉమ్మడి మద్రాస్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా, జస్టీస్ పార్టీ తరపున వచ్చిన బొబ్బిలి మహారాజు ఆ విషయంలో తాటస్థ్యం వహించినట్లు దాఖలాలున్నాయి.

అయితే ఆంధ్ర మహాసభ తన పట్టు విడువలేదు. 1941 నుండి ఆంధ్ర మహాసభ తీర్మానాల్ని చేస్తూ ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తూనే ఉంది. విజయనగరం మహారాజుగా పేరంది కాశీరాజుగా బెనారస్‌లో ఉంటూ క్రికెట్ ఆట వీరునిగా పేరందిన సరవిజ్జీ-ఆంధ్ర మహాసభను ఎంతగానో తీర్చిదిద్ది ఆందోళన పథంలో నడిపారు. రావి నారాయణరెడ్డి, కె.వి. రంగారావు ప్రభృతులు వారి అధీనంలో గల ఆంధ్ర మహాసభలను జరిపించడం గొప్ప సంచలనం తెప్పించారు.

కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో 1946లోనే భాషా సంస్కృతీ పరిధి మేరకు రాష్ట్రాల ఏర్పాటు అవసరమే అని ప్రకటించింది. అంతేగాక ఆంధ్ర నాయకులలో పేరెన్నిక గన్న ప్రకాశం పంతులు, రైతురంగా, ప్రభుతులు భారత ఉపప్రధాని, హోంమినిష్టరు అయిన సర్దార్ వల్లభాయి పటేలును కలసి, భారత రాజ్యాంగం రూపొందక మునుపే ఆంధ్ర రాష్ట్రం ఏర్పడాలని అర్థించినారు. భారత ప్రభుత్వాన్ని కోరియున్నారు. పటేలు అంగీకారం తెలిపారు.

1947లో నెహ్రూ భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల ఏర్పడుటకు సిద్ధాంత రీత్యా అంగీకరించారు. భారత రాజ్యాంగం అమలు గాక పూర్వమే ఆంధ్ర రాష్ట్రం ఏర్పరచిన అది 1935 చట్టం మేరకు పరిపాలించబడాలన్న సాకుతో ఆ ప్రతిపాదన వెనక్కు వెళ్లింది.

1948లో నెహ్రూజీ విశాఖపట్నం వచ్చారు. ఆంధ్రుల అభిలాషను గుర్తించారు. వెంటనే థార్ కమీషన్ వేసి నివేదికనిమ్మని కోరారు. ప్రథమ భాషా రాష్ట్రాల నిర్మాణ కమిటీ, మద్రాసు వచ్చింది. ఆంధ్ర మహాసభ విశాలాంధ్రను ఏర్పరచమని మహాజరొచ్చింది. అయితే సంజీవరెడ్డి రాయలసీమ తరపున భాషా ప్రాతిపదిక రాష్ట్రం ఏర్పాటు వాయిదావేయమని అర్థించారు. ఆంధ్రరాష్ట్రం ఇస్తే మద్రాసు రాజధానిగా రాయలసీమకు, రాష్ట్ర ప్రతిపత్తిని కల్పించమని, ఆనాటి రాయలసీమ సభ్యులుకోరారు. అందుకు ప్రస్తుతానికి రాష్ట్రాల పునర్నిర్మాణం అవసరం లేదనే కమిటీ రిపోర్టు యిచ్చింది.

ఆంధ్రులకు కోపతాపాలు హెచ్చాయి ఉద్యమ పథంలో లేచారు. ఆందోళనకు సిద్ధమైనారు. ఇది గ్రహించిన నెహ్రూ జె.వి.పి. కమిటీని వేసారు. (జవహర్-వల్లభాయి-పట్టాభి) 1949లో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీకి యీ కమిటీ తన నివేదిక నిచ్చింది. తాత్కాలికంగా ఈ సమస్యను వాయిదా వేయుమని-మహారాజా అని మనవి చేస్తే మరి రెండు దెబ్బలు కొట్టేవట్లయింది. అయితే మద్రాస్‌ను ఆంధ్రులు వదులుకుంటే ఈ రాష్ట్ర నిర్మాణం పై ప్రతిపాదనలు చేయవచ్చు అని కమిటీ అభిప్రాయం. ఇంతటితో సర్కార్ రాయలసీమ అభిప్రాయ భేదాలు వచ్చాయి.

## 1949 జమీందారీ విధానం రద్దుచట్టం

శాసనసభలో జమీందారీ విధానాన్ని రద్దుపరచే బిల్లును ప్రవేశ పెడతారు. కళా వెంకటరావు రెవెన్యూమంత్రి ప్రతిపాదిస్తారు. చీఫ్ మినిష్టర్ O. మండో రామస్వామి రెడ్డియార్ అనాటికి ప్రకాశం గారు ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర శాసన సభ్యునిగనే ఉండేవారు. ఆనాటికి చక్రవర్తి రాజగోపాలాచారి గారు బెంగాల్ రాష్ట్ర గవర్నర్‌గా ఉండేవారు. జమీందారీ విధానాన్ని రద్దుపరచ సలహా యిచ్చిన కమిటీ చైర్మన్ ప్రకాశం పంతులు గారు-ఆనాటి రెవెన్యూ మంత్రి.

జమీందారీ విధానం, యినాందారీ విధానం, నిజానికి రెండు రద్దపరచాలని, రైతోద్యమాలను పోరాటాల్ని నిర్వహించిన శాసనసభలో జమీంద రీ రద్దు బిల్లును ప్రవేశ పెట్టేసరికి ఇనాందారీ విధానాన్ని రద్దు పరచక జమీందారీ విధానాన్ని మాత్రమే రద్దు పరచారు. మైనర్ ఇనావ్ంలో మేజర్ ఇనాములని విడదీసి- మైనార్ ఇనాము దారులకు హక్తు భుక్తం దారాదత్తం ఛేస్తూ అదే సమయమున షరతులతో కూడిన సాగు హక్కును రైతులకు దాఖలుపరుస్తూ చట్టం చేసారు. రైతులను తొలగించే హక్కు ఇనాందారులకు యిచ్చారు. న్యాయ స్థానాలద్వారా సాగురైతు భాగాలు యివ్వలేదని విలపించిన రైతులకు భూములనుండి తొలగిస్తూ ఇనాందారు నికే భూమిపై హక్కు కల్పించారు. లచ్చన్న శాసనసభలో ఈ చట్టం చేస్తున్న సమయమున మైనార్ ఇనాందారులు అని, మేజర్ ఇనాందారులని వ్యత్యాసం చూపడం అసందర్భం అని వాదించారు. ఏ ఇనాందారుడయిన, సాగు రైతుకు భూమిపై పట్టాహక్కు ఉండాలని వాదించారు. నిజానికి బ్రాహ్మణ అగ్రహారాలన్ని మేజర్ ఇనాందారులుగా ఉండేవి. ఇతర అగ్రకులాలవారు, చిన్న చిన్న కమతాలను సాగుచేసిన రైతులకు యిచ్చిన అటువంటి వాటిని, ఇనాందారీలను, చట్టంనుండి మినహాయించారు. ఆనాడు ఒకవైపు ఎస్టేట్ సెటిల్‌మెంట్ వేరొక వైపు గవర్న మెంటు సెటిల్‌మెంటు అంటూ రెండు ఉండేవి. కాంగ్రెస్ ప్రభుత్వం పెట్టిన బిల్లుపై నిజానికి ప్రతిఘటన చేయకూడదు. అయినప్పటికి లచ్చన్న శాసనసభలో తన నిరసనను వ్యక్తం చేసారు. యజమానులలో బేధాలను బట్టి సాగుచేసే రైతులను దెబ్బతీయడం అన్యాయం అని ఉద్ఘాటించారు. ఆనాటికి రంగాజీయే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు. కాంగ్రెస్ కమిటీ చేసిన తీర్మానాన్ని ఆనాటి కాంగ్రెస్ ప్రభుత్వం కాదనటం విశేషం. రెండురకాలైన ఇనాములను రద్దు పరచమని కోరిన రాష్ట్ర కాంగ్రెస్ కళావెంకట్రావు శాసనసభ కాంగ్రెస్ పార్టీ వ్యతిరేకించినందున బిల్లులో చోటుచేసుకోలేదు.

ఆనాటి ఉమ్మడి మద్రాస్ రాష్ట్రమున ఈనాటికి ఉత్తరాంధ్రకు చెందిన వారు

కేవలం (విశాఖ-గంజాం జిల్లాలు) 10 మంది మాత్రమే ఉండేవారు.

## గుంటూరు జిల్లాలో వెనుకబడిన తరగతుల మహాసభ

తుళా బందుల నాగేశ్వరరావు నాయకత్వంలో గుంటూరు-కృష్ణా జిల్లా వెనుకబడిన వర్గాలకు చెందిన కొంతమంది నాయకులు మద్రాసు శాసనసభా సమావేశాలు జరుగుతున్న సమయములో సర్దార్ లచ్చన్నగారి వద్దకు వెళ్ళి రాష్ట్ర వెనుకబడిన మహాసభలకు గుంటూరులో జరపదలచినామని ఆ సభకు అధ్యక్షత వహించమని కోరారు.

ఆ సరికే లచ్చన్న గారు వెనుకబడిన కులాల నుద్ధరించాలని ప్రసంగాలు చేస్తూ ఉన్నారు. డొక్కచిక్కిన రైతన్నలనుద్ధరించ ఉద్యమాలను నడిపినారు. కార్మికుల హీన దీన స్థితిగతులనుబాప సమ్మెలను జరిపియున్నారు. సమాజమున వెనుకబడిన కులాలు బాగుపడనిదే దేశం బాగుపడదని వాదించిన సర్దార్ లచ్చన్న గారే సభకు అధ్యక్షత వహించాలన్నది వారి కోరిక. ఆ సమయమున ఏ కులం ఆ కులం వారిని ఉద్ధరించ ఉద్యమిస్తున్నదినాలు తప్పించి మొత్తంగా సమాజమునగల వెనుక బడిన కులాల్ని ఉద్ధరించాలని ప్రథమంగా రాష్ట్రస్థాయిలో రూపకల్పన జరిగినది గుంటూరు వెనుకబడిన తరగతుల మహాసభలోనే.

ఆ నాటికే మద్రాసు రాష్ట్రమున అనగా నేటి ఆంధ్ర, కేరళ-మద్రాస్ రాష్ట్రాల్లో ఇ.వి. రామస్వామి నాయుకర్ - 1918 నుండి వెనుకబడిన తరగతుల నుద్ధరించ "ద్రవిడకజగం" అను దానిని ఏర్పరచి "ద్రవిడస్థాన్" ఏర్పడాలని అగ్రవర్ణాల నెదుర్కొని బ్రాహ్మణేతరుల నుద్ధరించిన సాంఘిక సంస్కరణ వాది. సమాజమున వెనుకబడిన తరగతులను ఆదుకోవాలన్న భావము సర్దార్ లచ్చన్నగారికి వచ్చింది. రామస్వామి నాయికర్ కొనసాగించిన ఆర్థిక సాంఘిక పోరాటాల ఫలితంగానే జస్టిస్ పార్టీ అవతరించింది.

బ్రహ్మణ, బ్రహ్మణేతర వర్ణాలన్నవి సమాజమున బలపడినాయి. అగ్రవర్ణాలు అణగారిన వర్గాలను దోచుకోవడంలో పరాకాష్టను చేరుకున్నాయి. జస్టీసు పార్టీవారు ఇ.వి. రామస్వామి నాయకర్ సలహా మేరకు మొట్టమొదటిగా 1920లో "కమ్యూనల్ గవర్నమెంటు ఆర్డర్ అనేదొకటి పుట్టింది. వెనుకబడిన వర్ణాలు కులాలు అనేదొక జాబితా రూపొందినది. స్వాతంత్ర్యం రాక మునుపే బి.సి.లకు రిజర్వేషన్ అనేది మద్రాసు రాష్ట్రమున రూపొందినది. నిజానికి కాంగ్రెస్ పార్టీ "రిజర్వేషన్" అనే దానిని ప్రవేశపెట్టలేదు. ఇందుకు మూల పురుషుడు ఇ.వి. రామస్వామి నాయికర్ అని చెప్పాలి. కళాశాలలో సీట్లుకోసం ప్రభుత్వం ఉత్తర్వులుకోసం అవాటినుండి "రిజర్వేషన్" పద్ధతికి రూపమేర్పడినది. గుంటూరులో జరిగిన

రాష్ట్ర ప్రప్రథమ వెనుకబడిన తరగతుల మహాసభలో సర్దార్ గౌతులచ్చన్న గారి అధ్యక్షతన అసంఖ్యాక జనావళిని అరికట్ట గలిగింది. అదే సభలో కార్యవర్గం ఏర్పడింది. జనరల్ సెక్రటరీ తులాబందుల నాగేశ్వరరావు.

1949లో జరిగిన ఈ మహాసభ రాష్ట్ర వెనుకబడిన తరగతుల్లో నూతనోత్సాహాన్ని ఉత్తేజాన్ని కలిగించింది. సర్దార్ గౌతులచ్చన్నగారు బలహీన వర్గాలు బాగుపడాలన్న రిజర్వేషన్ విధానం కలిగించాలన్న నినాదంతో రాష్ట్రం నలుమూలల పర్యటించారు. రాష్ట్ర వ్యాప్తంగా జిల్లా కమిటీలు ఏర్పాటయినవి. బి.సి.లకు ''రిజర్వేషన్'' అమలులో జరుగుతున్న మోసాలు, జీవన ప్రమాణం ఆధారంగా ఉచిత విద్యార్థి ఉపవేతనాల్ని కల్పించాలి. స్కూలు ఫైనల్ వరకు ఉచిత విద్యను ప్రవేశపెట్టాలి. ఉద్యోగ రిజర్వేషన్‌లో కూడ మోసాలుపోవాలి.

మద్రాసు ప్రభుత్వం-అమలు పరుస్తున్న బి.సి. రిజర్వేషన్ విధానం ఆనాటి నెహ్రూ గవర్నమెంటుపై ప్రభావం జూపెట్టింది. కేంద్రం కూడా బి.సి. లిస్టులో నున్న విద్యార్థులకు కేంద్ర ఉపకార విద్యార్థి వేతనాలు ఇచ్చేవారు. గవర్నమెంట్ గ్రాంట్సు పొందుతున్న ప్రైవేటు విద్యా సంస్థలు కూడ రిజర్వేషన్‌ను పాటించాలి. అయితే ప్రైవేటు పరిశ్రమల్లో ఈ రిజర్వేషన్ విధానం నేటికి కూడాలేదు.

తరతరాలుగా అన్నింటా మోసబడిపోయి-అజ్ఞాన, అంధకారం ఒకవైపు కమ్ము కొని దారిద్ర్యం వేరొకవైపు కర్మ-కట్టుబాట్ల బానిసగా-మనగులుగుతన్నది. వెనుకబడిన కులాలవారికి, కాసింత తిండి, కావలసిన గుడ్డ, ఉండటానికి ఇంత ఇల్లు సమకూర్చి పెట్టవలసిన బాధ్యత సాంఘిక సంక్షేమరాజ్యమని చెప్పుకుంటున్న ప్రభుత్వానికి లేదా? సంఘమున అగ్రవర్ణాలుగా చదువు సంధ్యల్ని తరతరాలుగా అందగలుగుతూ సామాజిక ఉత్పత్తులన్నింటికి యాజమాన్యం వహించుటయేగాక వాటికి భోక్తలం మేమే అని అందుకే మేము జన్మించామని, మాది పుణ్యమని పుట్టుక అని, మీద పాప పుట్టుక అని దెప్పిపొడుస్తూ దోపిడీ వ్యవస్థను సృష్టించినవారికే ఇంకను సంపదపై యాజమాన్యమా? హిమాలయాలంతటి ఎత్తుకు ఒకరు పెరిగిపోగా వేరొకరు కూడని కులములో పుట్టారని అఘాథములోనికి నెట్టివేయబడినవానికి బయటకు తేవటానికి ''రిజర్వేషన్లను కల్పించి వారికి తోడ్పడటం అన్యాయమా? చదువు, సంస్కారం, విజ్ఞానం ఉన్నవారు ఆర్థికసంపద వున్నవారే అవుతారు. అవి లేనివారు నిజానికి వారికి ఆర్థిక సంపత్తి ఉన్నా వాటిని అందలేనివారే అవుతారు. అజ్ఞానంలో జీవిస్తారు. ఆధునిక ప్రపంచంలోనికి వారిని తీసుకుని రావాలన్నా, రిజర్వేషన్స్ విజ్ఞానదీపికల్ని వారిపై ప్రసరిస్తేనే తప్ప దోపిడీవ్యవస్థ నుండి తప్పించుకొని రాలేరని లచ్చన్న బాహాటంగానే ప్రచారంచేస్తూ వస్తున్నారు. ఇక

నీచమైన పుట్టుక అని, కూడని కులం అని కర్మసిద్ధాంతాన్ని వారినెత్తిపై రుద్ది తరతరాలుగా మూలబడిపోయిన వారిని అజ్ఞాన నిద్రావస్థనుండి లేవరా బాబూ అని, రిజర్వేషన్ సదుపాయం ఇస్తేనేతప్ప తరతరాలుగా చదువు, సంస్కారం, విజ్ఞానం అందుతూ వస్తున్నవారితే వారు సమానంగా లేచి రాలేరని లచ్చన్న నిర్ధారణ పరిచారు. సమాజమునగల అవకాశాల్ని అగ్రవర్ణాలవారు, బలమైన వర్గాలవారు అవలీలగా అందుకోగలరు. పుట్టుక పెరకవలోనే వాటిని అందగలిగిన వారు ప్రతిభా సామర్థ్యాలను వారు సంతరించుకుంటారు. అయితే పుట్టుక, పెరక అతి హీన దీన స్థితిలో వున్నవారు ఆ అవకాశాలు, అవసరాలు వాటంతట అవి వారిముందుకు వచ్చిపడినగాని అందుకోలేని పరిస్థితిల్లో వారుంటారు. అందుకే రిజర్వేషన్లు అన్నింటా బలహీనవర్గాలవారికి కల్గిస్తేనే తప్ప వారి జీవితాలకు కాంతిరేకలు వెలసిల్లవని లచ్చన శాసన సభ్యునిగా ఉద్యమించారు.

# 2వ ప్రకరణము

## ఉమ్మడి మద్రాసు రాష్ట్ర కాంగ్రెస్ మంత్రివర్గంలో విభేదాలు-లచ్చన్న

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసన సభ్యులు-ఆంధ్రకేసరి ప్రకాశంగారి పలుకుబడిని రాజకీయంగా ఆయన ప్రాబల్యాన్ని పడగొట్టాలని-ఆనాటి మంత్రివర్గం ముఠా కేంద్ర కాంగ్రెస్ అధిష్టాన వర్గం అండదండలలోనే పరోక్షంగా గాంధీగారి ఆశీస్సులున్నట్లు కూడ వినికిడి. ప్రకాశంగారిని అన్నివిధాలా ముందుపడకుండా అడ్డకట్టలు వేయటానికి ప్రయత్నించేవారు. ప్రకాశం ప్రజల మనిషి, ప్రకాశం అన్న యావదాంధ్ర ప్రజానీకం, జై అని నినాదాలిచ్చే పరిస్థితి ఆనాడు ఉండేది. ఏలనో మంత్రివర్గముగా కాంగ్రెస్ అధిష్టాన వర్గం అతనిపై కినుక వహించేది, తప్పించి ఏ విషయమున ముందుకు సాఫీగా పోవటానికి దీవించిన పాపాన పోలేదు.

ప్రకాశం ప్రజలకే అవసరమైన తన అధిష్టాన వర్గంగా భావించేవారు తప్పించి, ఢిల్లీ కాంగ్రెస్ నేతను ఏనాడు అధిష్టానవర్గంగా భావించలేదు. ఏ ఒకరికి లక్ష్యపెట్టని మహత్తర ''ఆత్మశక్తి'' ప్రేరితులయినపుడు లక్ష్యపెట్టని వ్యక్తిని ఏ అధిష్టానవర్గం ఏనాటికీ అనుమతించదు. ఆశీర్వదించదు. అయితే ప్రజలల మనిషిని, ధీరోదాత్త చరితుని, స్వాతంత్ర్య సమరయోధుని, ప్రజానాయకుని, మేధావిని తనవాడు కాదని, బహిరంగంగా ఏ అధిష్టానవర్గం ఎలా తెలియజెప్ప గలదు. అలా జెప్పిన తన చెరుపునుతనే తెచ్చిపెట్టుకొన్నట్లవుతుంది.

ఉమ్మడి మదరాసు రాష్ట్ర కాంగ్రెస్ మంత్రివర్గం ముఠా-అధిష్టాన వర్గం అండదండలను జూచుకొని నిత్యం ప్రకాశం గారిని తన అనుచర వర్గాల్ని కించపరచే రీతిని చర్యలను చేపట్టడం రోజు రోజుకి శ్రుతిమించి పోయేది.

కారణం ఏమన కాంగ్రెస్ మంత్రివర్గం అరాచకాలను అవినీతిని తను కాంగ్రెస్ వాది అయినను నిర్మొహమాటంగా ప్రజల్లో వ్యాప్తి చేసేవారు. ప్రజా సభల్లో కాంగ్రెస్ మంత్రులను ఏమాత్రం తప్పుదారి త్రొక్కిన తప్పని ఎదిరించేవారు.

పర్యవసానం తుదకది కాంగ్రెస్ మంత్రివర్గం మీదనే అవిశ్వాస తీర్మానాల్ని కాంగ్రెస్ శాసన సభ్యునిగనే శాసన సభలో ప్రవేశపెట్టటానికి స్పీకరుకు నోటీసు ఇస్తారు. ఈ పరిణామాన్ని జూచి హడలెత్తిన కేంద్ర కాంగ్రెస్ అధిష్టానవర్గం అధినేతలు అసెంబ్లీ స్పీకరుపై వత్తిడితెచ్చి ''నోటీసును అడ్మిట్'' చేయవద్దని చెప్పిన శాసనసభ స్పీకర్‌గా తన విధిని తను చేయాలని స్పీకర్ ప్రకాశంగారిని

అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టడానికి అనుమతిస్తారు.

1951 ప్రారంభదశలో జరిగిన ఈ విశ్వాస తీర్మానంపై ఆంధ్రకేసరి 3 దినాలు ప్రసంగిస్తారు. ప్రతిఒక మంత్రి చేసిన దుశ్చర్యలను బట్టబయలు చేస్తారు. మంత్రుల అవినీతిని అరాచకాలను కుండబద్దలు కొట్టినట్లుగా సభలో ఉపన్యసిస్తారు. తదుపరి స్పీకరు Voice Vote తీసికొనగా తీర్మానం వీగినట్లు కాలేకపోయిన ప్రకాశం Devision ను Press చేయలేదు. తీర్మానం వీగిపోయింది.

## పంతులుగారితో పర్యటన-లచ్చన్న

తనతో పర్యటనకు సిద్ధమైనవారిలో సర్దార్ లచ్చన్నగారే ప్రముఖులు. ఆనాటికి లచ్చన్న రాష్ట్ర కాంగ్రెస్ సంయుక్త కార్యదర్శి. కడప కోటిరెడ్డి, కడప రామబ్రహ్మ పంతులుగారితో పర్యటించారు. పలుచోట్ల సభలు జరిపి కాంగ్రెస్‌లో ఉన్నవారే కాంగ్రెస్ అధికార పీఠాన్ని బ్రద్దలుకొట్టాలని ప్రసంగాలు చేసారు. ఈ సంఘటన విశ్వాస తీర్మానం ప్రవేశపెట్టడానికి సమావేశం జరిగింది.

## ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ ఎన్నికలు

1951లో వార్షిక కాంగ్రెస్ కమిటీ ఎన్నికలు వచ్చాయి. ఆనాటికి రంగాజీయే కాంగ్రెస్ అధ్యక్షులు. రంగాగారు మరల పోటీ చేస్తారని తెలిసి మరల అధ్యక్ష స్థానానికి నీలం సంజీవరెడ్డిని నిలబెడుతూ ఇక పార్టీలో ఎన్నికల రణరంగం సిద్ధమైనది. కాంగ్రెస్ మంత్రివర్గం ముఠా, ప్రకాశం ముఠా, రంగా ముఠాలని పోయి బాహాటంగా ప్రజల్లోకి జొరబడ్డారు. సభ్యత్వాలు చేర్పించాలి. లక్ష జనాభాకు ఒక పి.సి.సి. మెంబరు. ఈ పి.సి.సి. మెంబర్లు అందరూ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుని ఎన్నుకోవాలి. ఆనాటి కాంగ్రెస్ సభ్యత్వం రుసుం పావలా. లక్షల కొలదీ సభ్యులు చేరినట్లు రసీదు పుస్తకాలు అవతరించాయి. మేమా మీరా అన్నట్లు లక్షలాది సభ్యులు కాంగ్రెస్ పార్టీలో అవతరించారు. ఉత్తర విశాఖ జిల్లా సోంపేటలో సర్దార్ లచ్చన్న గారిపై చింతగింజల భగవానులు, న్యాయవాదిని మంత్రివర్గం ముఠా నిలబెడతారు. అయిన జిల్లాలో రంగాజీ అనుయాయులే లచ్చన్నగారితో మెజారిటీ సభ్యులు వచ్చారు.

ఆనాటికి మంత్రివర్గంలో నున్న సంజీవరెడ్డి గారు మంత్రిమండలిని విడిచిపెట్టి పార్టీసేవకు సిద్ధపడిన త్యాగమూర్తి అన్న పేరుతో కాంగ్రెస్ అధ్యక్ష పీఠానికి, నామినేషన్ వేస్తారు. కాంగ్రెస్ మంత్రివర్గం ముఠాని ప్రతీకగా నిలుస్తారు. ఇక రంగాజీని, రంగా అనుయాయులు నిలబెడతారు. ప్రకాశం ముఠా రంగాజీని బలపరచింది. రాష్ట్రం మొత్తం రంగాజీకి అత్యధిక ఓట్లు వచ్చినట్లు లెక్కలు చెప్పాయి. అయితే రాగల ఆ పి.సి.సి. ఓటర్లు న్యాయస్థానాల వలన ఎన్నికల్లో పాల్గొన

లేకపోయారు. గుంటూరు జిల్లా నెల్లూరులో ఒక భాగం. రాయలసీమలో కొంత మంది పి.సి.సి. మెంబరు రంగాజీ అనుయాయులు ఎన్నికల్లో పాల్గొనలేక పోయారు. ఇంత జరిగిన మంత్రివర్గం న్యాయస్థానాల ద్వారా ఆపుచేయించారు. కేవలం 5 ఓట్లు తేడాతోనే రంగాజీ ఓడిపోయారు. ఈ ఎన్నికల్లో డబ్బు సంచులు విచ్చలవిడిగా సంచరించాయని ప్రతీతి. తీవ్ర స్థాయిలో అధికార పీఠాలను గ్రహించడానికి మంత్రివర్గం మొతా చేయగలవన్నీ చేసిపెట్టినదన్నది సర్దార్‌జీ అభిప్రాయం. సంజీవరెడ్డికి 87 ఓట్లు రాగా రంగాజీకి 82 ఓట్లు వచ్చాయి. అభ్యర్థులిరువురు ఆంధ్ర కాంగ్రెస్ రాజకీయాల్లో ఎటువంటి బలదర్పాలు కలవారో ప్రతి ఒక్కరికీ తెలిసిపోతుంది.

## కాంగ్రెస్ పార్టీ నుండి రాజీనామా

ప్రకాశం రంగాగార్లు ప్రత్యేక సమావేశంలో కాంగ్రెస్‌కి వ్యతిరేకంగా ఒక పార్టీ పెట్టాలని ఒక నిర్ణయానికి వస్తారు. అయ్యదేవర కాళేశ్వరావు ఈ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తారు. ప్రకాశం అనుయాయులు తెన్నేటి క్రొవ్విడి, అయ్యదేవర కాళేశ్వర రావు ఏనాడు నాయకునికి వ్యతిరేకంగా ఏమీ అనేవారు కాదు. అయితే రంగాజీ అనుయాయులు రంగాజీని అన్ని విధాన నిర్ణయాలతో లేచి నిలబడి వాదించ సిద్ధపడేవారు. లచ్చన్న, తిమ్మారెడ్డి, ఓబులరెడ్డి, కడప కోటిరెడ్డి, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య, దుగ్గిరాల బలరామకృష్ణయ్య రంగాగారి అనుయాయులు.

ఆసరికే ఆచార్య కృపాలినీ కాంగ్రెస్ పార్టీకి రాజీనామా పెట్టియున్నారు.

# 3వ ప్రకరణము

## కృషికరలోక పార్టీ-లచ్చన్న పాత్ర

పాట్నాలో అఖిల భారత ప్రజాపార్టీ అవతరణ జరుగుతుంది. ఆ మహాసభకు రంగాజీ, ప్రకాశం ఇరువురు కలసి వెళ్తారు. రాజీనామాలు యిచ్చిన ఈ ఇరువురు నాయకులు అఖిల భారతస్థాయిలో ప్రజాపార్టీని స్థాపించిన ఆచార్య కృపాలానీతో చేతులు కలుపుతారు. ప్రజాపార్టీలో చేరతారు.

## కృషి కరలోక పార్టీ అవతరణ

అఖిల భారతస్థాయిలో ప్రజాపార్టీ అధ్యక్షులుగా కృపలానీ ఆంధ్రరాష్ట్ర ప్రజాపార్టీకి అధ్యక్షునిగా టంగుటూరి గారిని నియమిస్తారు. రంగాజీని అధ్యక్షునిగా పెట్టి ప్రజాపార్టీకి సలహాయిచ్చే గౌరవ స్థానాన్ని ప్రకాశంగారి కివ్వటానికి జరిగిన సంభాషణలు వెనక్కి వెళ్లాయి.

రంగాజీ వెంటనే ప్రత్యేక సదస్సు ఆంధ్ర రాష్ట్రంలో బెజవాడలో పెడతారు. పాట్నా సభ నుండి వచ్చిన రంగాజీ ప్రజాపార్టీని వదలి అనుచరులు మద్దతుతో వేరే పార్టీని స్థాపించారు. అదే కృషికరలోకపార్టీ. రాష్ట్రస్థాయిలోనే గాక భారత దేశ స్థాయిలోనే పార్టీ అవతరణ జరిగింది.

రాష్ట్రస్థాయిలో రంగాజీ అనుచరులు లచ్చన్న, తిమ్మారెడ్డి, ఓబులరెడ్డి వగైరాలు ప్రతి జిల్లాలో కృషికరలోకపార్టీ శాఖలు ఏర్పరచారు. రాష్ట్ర కృషికరలోక పార్టీ అధ్యక్షులు-కందుల ఓబులరెడ్డి, రాష్ట్ర కృషి కరలోక పార్టీ జనరల్ సెక్రటరీ-సర్దార్ గౌతు లచ్చన్న, ఉత్తర విశాఖ జిల్లా కృషి కరలోకపార్టీ అధ్యక్షులు-కిళ్ళి అప్పలనాయుడు, విశాఖ జిల్లా కృషి వరలోక పార్టీ అధ్యక్షులుగా-గొట్టిపాటి బుచ్చిఅప్పారావు. తూర్పుగోదావరి జిల్లా కృషికరలోకపార్టీ అధ్యక్షుడు-నీరు కొండ వెంకటరావు, కృష్ణాజిల్లాకు గొట్టిపాటి వెంకట సుబ్బయ్య-అధ్యక్షులు. చిత్తూరు జిల్లాకు యన్. యన్. నాయుడు-అధ్యక్షులు.

పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి రాష్ట్ర కె.యల్.పి. ఉపాధ్యక్షులు, కొత్తపల్లి పున్నయ్య రాష్ట్ర వర్కింగ్ కమిటీ మెంబరుగా ఉండేవారు.

రాష్ట్ర పర్యటనలో విశేషంగా పార్టీని బలపరచిన ప్రాంతాలు విశాఖ, ఉత్తర విశాఖ, చిత్తూరు, తూర్పుగోదావరి, గుంటూరు, అనంతపురం, కర్నూలు, కడప ప్రజలందరూ కె.యల్.పి. తో చేరారు. రైతుల్లో మంచి ఉత్సాహం ప్రబలింది.

కె.యల్.పి.తో ఎన్నికల ఒప్పందం చేసుకోవటానికి ఉమ్మడి కమ్యూనిష్టు పార్టీ

ముందుకు వచ్చిన కె.యల్.పి. అందుకు తిరస్కరించింది. రంగాజీకి మొదటి నుండి కమ్యూనిస్టుల్ని ఎదిరిస్తునే వస్తున్నారు. రైతులు-కూలీలు అని వర్గ విభజన చేసారు. అందుకు కమ్యునిస్టుల వ్యతిరేకం ఉన్నది. శ్రామికులు-పెట్టుబడిదారులు. శ్రామికవర్గ నియంతృత్వమును కమ్యూనిస్టు పార్టీ కొరకు ప్రజలందించిన బలాన్ని ఊపును అందుకొన్న కె.యల్.పి. నాయకులు కమ్యూనిస్టులతో ఒప్పందానికి రాలేకపోయారు. కంట్రోల్సు రద్దు కావాలని, ఉద్యమాలనులేపిన కె.యల్.పి.ని ప్రజలు మెచ్చుకున్నారు. కమ్యూనిస్టులతో అంగీకారానికి రాలేకపోయిన కె.యల్. పి.కి ఎదురు దెబ్బ తగిలింది. కమ్యూనిస్టులు కె.యల్.పి.కి ఎదురు ప్రచారం చేసారు. తిరిగి కాంగ్రెస్‌లో చేరిన పార్టీలు. అని ప్రచారం చేసారు.

## 1952 సాధారణ ఎన్నికలు

వయోజన ఓటింగ్ పద్ధతి మేరకు స్వతంత్ర భారత రాజ్యాంగ పరిధిలో జరుగుతున్న ఎన్నికలు కేరళ, తమిళనాడు, కర్నాటక, ఆంధ్ర కలిసి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం ఈ రాష్ట్ర శాసనసభలో ఆంధ్ర ప్రాంతమునకు చెందిన 120 సీట్లలో కె.యల్.పి. పోటీ చేసింది. తమిళనాడులో కె.యల్.పి. లేదు.

సర్దార్ లచ్చన్న గారిని ఉత్తర విశాఖలో సోంపేట నియోజక వర్గంలో కె.యల్.పి. శాసనసభా స్థానానికి పోటీ చేసారు. కాంగ్రెస్ అభ్యర్థిగా నరసన్నపేట పాట్నూరు స్వామిబాబు ఆగర్భ శ్రీమంతుడు ధనవంతుడు. లచ్చన్నగారిపై నిబెట్టారు. డబ్బులు మంచినీళ్ళ ప్రాయంగా అందించారు. ఓట్లను నోట్లకట్టలతో కొనుగోలు చేయటానికి కాంగ్రెస్‌వాదులు భరితెగించి సిద్ధపడేవారన్నది లచ్చన్న గారి అభిప్రాయం. తనను ఓడించటానికి కాంగ్రెస్ శతవిధాలా ప్రయత్నించింది. కారణం కె.యల్.పి. కి అయువుపట్టు సర్దార్‌జీ లచ్చన్నగారే. లచ్చన్న ఓడిపోయిన కె.యల్.పి. రాష్ట్ర స్థాయిలో ఓడిపోయినట్లే అని కాంగ్రెస్‌వారు భావించేవారు. ఇచ్ఛాపురం నుండి నీలాద్రి రెడ్డి, టెక్కలి-నిచ్చెర్ల రాములు, నరసన్నపేట నుండి సిమ్మ జగన్నాథం, ఆముదాలవలస నుండి కిల్లి అప్పలనాయుడు, కావలికి కావలి నారాయణ, పాలకొండ నుండి కెంబూరి సూర్యనారాయణ, పార్వతీపురం నుండి శ్రీ చీకటి పరశురాం నాయుడు, సాలూరు నుండి కూనిసెట్టి వెంకట నారాయణ. K.L.P. శాసన సభ్యులుగా గెలుపొందారు.

అనకాపల్లి నుంచి శెట్టి అప్పారావు, చోడవరం నుండి గంగు నాయుడు, జామి నుండి జి.బి. అప్పారావు, తూర్పుగోదావరి నుండి నీరుకొండ రామారావు, బత్తి సుబ్బారావు, చిత్తూరు నుండి రాజగోపాల నాయుడు, తిమ్మారెడ్డి, గుంటూరు జిల్లా నుండి ఇరువురు గెలుపొందారు. మొత్తం K.L.P. లో పార్టీ చిహ్నంపై

గెలుపొందిన ప్రముఖులు 16 మంది.

కాంగ్రెస్ పార్టీలో అతిరథులు నీలం సంజీవరెడ్డి, బి. గోపాలరెడ్డి, కళా వెంకట్రావు ప్రజాపార్టీనేత ప్రకాశం పంతులుగారు ఓడిపోయారు.

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో కాంగ్రెస్ మెజారిటీ సంపాదించలేక పోయింది. అయితే తమిళనాడు పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసే సంఖ్యను పెంచుకోలేక పోయింది.

కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థులు అత్యధికంగా వచ్చారు. సుమారు కాంగ్రెస్ తరువాత సమానమైన సంఖ్యలో వచ్చారు. కమ్యూనిస్టు పార్టీవారు ఎన్నికల్లో ఓడిపోయిన ప్రకాశం పంతులుతో మంతనాలు చేసి కాంగ్రెస్‌ను ప్రతిఘటించడానికి "యునైటెడ్ డెమోక్రటిక్ ఫ్రంట్"గా ఏర్పడ్డాయి. నాయకునిగా ప్రకాశం పంతులుగారిని ప్రకటిస్తాయి. కమ్యూనిస్టుపార్టీ ప్రజాపార్టీలతో మొదటిగా ఏర్పడినది. ఫ్రంట్ తదుపరి K.L.P. ని ఫ్రంట్‌లో చేరమని ఆహ్వానిస్తాయి. రంగాజీ కమ్యూనిస్టులతో కూడిన ఫ్రంట్‌కు అంగీకరించరు కదా.

## రంగాజీ ప్రకటన

రంగాజీ నిడుబ్రోలు నుండి ఒక ప్రకటన చేస్తారు. కాంగ్రెస్‌పార్టీ గనుక కంట్రోల్సు రద్దు అంగీకరించి రాజాజీని రాష్ట్ర శాసనసభా నాయకునిగా నిర్ణయిస్తే మంత్రి వర్గం ఏర్పాటుచేస్తే K.L.P. రెస్పాన్సివ్ కోపరేషన్ పద్ధతిపై కాంగ్రెస్ పార్టీ గవర్నమెంటును బలపరుస్తుంది అని ప్రకటించారు.

K.L.P. పార్టీ సమావేశం మద్రాసులో జరుగుతుంది. K.L.P. మొత్తం 15 మంది శాసనసభ్యులతో 11 మంది విశాఖ, ఉత్తర విశాఖజిల్లాలనుండి గెలుపొందినందుకు సర్దార్ గౌతులచ్చన్న గారినే K.L.P. శాసనసభా పార్టీ నాయకునిగ రంగాజీ ప్రతిపాదించగా అందరూ ఏకగ్రీవంగా బలపరచారు. కనీసం తను ఎన్నుకోబడతానని సర్దార్‌జీ ఆనాడు భావించలేదు. అయిన పార్టీ తనకు ఇచ్చిన గౌరవాన్ని కాపాడటానికి సిద్ధమైనాడు సర్దార్‌జీ.

కమ్యూనిస్టులు నిరాశకు లోనయ్యారు. ప్రకాశం పథకం పారలేదు. అధికార రాజకీయాలకు అలవాటుపడిన పంతులుగారికి పదవీయోగం పట్టలేదు అని ప్రత్యర్థుల వాదన. కమ్యూనిస్టులతో కలసి రాష్ట్రపాలనకు సిద్ధమైన ప్రకాశం పంతులుగారు ఏనాడు కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని బలపరచలేదు, ఆమోదించలేదు. నిజానికివి పంతులు గారి వ్యక్తిత్వం పార్టీకిమించి పెరిగిపోయిందని తెలిసిపోతునే ఉంది.

రాజాజీని మిశ్రమ మంత్రివర్గాన్ని ఏర్పరచమని రంగాజీ అభ్యర్థించారు. అంతవ



లచ్చన్న షష్టిపూర్తితో జరిగిన వేదపఠనం



కౌలాలంపూర్ - తెలుగు మహాసభలు



1960లో ఢిల్లీలో జరిగిన అఖిల భారత వెనుకబడిన తరగతుల
కార్యవర్గ సమావేశంలో ప్రసంగిస్తున్న సర్దార్ గౌతులచ్చన్న



బహుజన వారపత్రిక ముద్రణాలయం ప్రారంభోత్సవ సందర్భంగా.
విచ్చేసిన నాటి రాష్ట్ర ముఖ్యమంత్రి డి. సంజీవయ్య, కేంద్ర వ్యవసాయ
శాఖామాత్యులు, అఖిలభారత వెనుకబడిన తరగతుల సమాఖ్య అధ్యక్షులు.
పంజాబ్ రాష్ట్ర దేశముఖ్‌లతో లచ్చన్న

రకు కోపరేషన్ ఇస్తానన్న రంగాజీ రాజాజీతో మంతనాలు జరిపారు. మా కృషివరలోక పార్టీలో ఉన్న సర్దార్ గౌతులచ్చన్న, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిగార్లు యిరువురికి మంత్రివర్గంలో స్థానం కల్పించమని కోరారు.

అందుకు రాజాజీ ఎత్తుకుపైఎత్తు వేసి రంగాజీ అభ్యర్థనను మంచి మాటలతో త్రిప్పికొట్టారు. వాళ్ళు చిన్నవాళ్లు. వాళ్ళకు భవిష్యత్ ఇంకాయుంది. మీరు మీ గురించి ఆలోచించండి. మీరు K.L.P. ని రద్దు పరచి కాంగ్రెస్‌లో చేరిన మిమ్మల్ని డిప్యూటి సి. యం.గా కాంగ్రెస్‌పార్టీ ప్రకటిస్తుంది అని అన్నారు. అందుకు రంగాజీ మంత్రి పదవి కోసం పార్టీని రద్దు పరచాడన్న అపఖ్యాతి నాకు వద్దు. రాజరాజ నరేంద్రుని పాత్రను నేను నిర్వహించలేను. సిద్ధాంతపరంగా కాంగ్రెస్ పార్టీని వ్యతిరేకిస్తాను. కాంగ్రెస్ పార్టీలో చేరేదిలేదు. మీ మంత్రివర్గానికి తనే సరిపెట్టు కుంటూ అన్నారు రంగాజీ.

రాజాజీ మంత్రివర్గంలో ఆంధ్ర నుండి శంకర రెడ్డి, దామోదరం సంజీవయ్య, రామసుబ్బారెడ్డి, ఆంధ్ర నుండి ఒకరు ఉండేవారు.

కామరాజు నాడార్‌కు, రాజాజీకి రాజకీయ వైరుధ్యం అయినప్పటికీ నాడార్ నెహ్రూతో సంప్రదించి ఆనాటి కాంగ్రెస్ అధ్యక్షులు రాజాజీని ఒప్పించి కాంగ్రెస్ పార్టీ నాయకునిగా ఎన్నుకోబడినారు.

## వృత్తి విద్యలపై శాసనసభలో లచ్చన్న

రాజాజీ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన తదుపరి ''కౌన్సిల్'' నుండి ఎన్నుకోబడతారు. కంట్రోల్సును రద్దుచేసారు. K.L.P. సాధించిన ఘనవి జయం రాజాజి రెండు బిల్లుల్ని ప్రవేశ పెడతారు. 1) వృత్తి విద్యాకోర్సులు ప్రవేశపెట్టటానికి 2) ఇనాందారీ చట్టం సవరణ.

1) వృత్తి విద్యలో ప్రాథమిక స్థాయి నుండి ప్రవేశపెట్టాలని విద్యా విధానం సవరణ బిల్లు.

2) చిన్న ఇనాందారులందరికి భూముల మీద హక్కు భుక్తాలు కలిగించటానికి సవరణ బిల్లులు.

పై రెండు బిల్లుల్ని K.L.P. ప్రతిఘటించింది. ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో K.L.P. నాయకుడు సర్దార్ లచ్చన్నపై రెండు బిల్లుల్ని ప్రవేశపెట్టే, శాసభ సభలో ప్రసగించారు.

1) వృత్తి విద్య సవరణబిల్లులో దురుద్దేశం ఉంది. కులతత్వమును సుస్థిరపరచ టానికి పన్నిన కుట్ర అని చాకలిని చాకలిగా, మంగలిని మంగలిగా ఉంచటానికి

చేస్తున్న ప్రయత్నమని, కుల వృత్తుల్లోనే చిన్నతనంలో వారున్నవారు ఎలా పల్లెప్రాంతాల్లో జీవిస్తున్న అసంఖ్యాక గ్రామీణ బాలబాలికల్ని చాపలల్లడం ఇళ్లు కట్టడం, ఇనుపరేకుల్ని కొట్టడం, కట్టుపని, తట్టపని, బట్టపని అంటూ చెప్పులు మొగ్గతోనే వారి విజ్ఞానాన్ని పెంపొందించే రీతి నీతులను తుంచివేయడం అంటూ గర్జించారు. ఉన్నత వర్గాల పిల్లలకు ఉన్నత విద్యా పద్ధతులా? బలహీన వర్గాల పిల్లలకు బడి చదువులు తప్పించి పరుల సేవల, క్వారీ కూలీలుగా చేయడమా?

# 4వ ప్రకరణము

## ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో-లచ్చన్న

ఆంధ్ర మహాసభ రాజాజీ మంత్రివర్గం-ఏర్పడిన తదుపరి ప్రత్యేకాంధ్రోద్యమం ఉధృతం అయింది. మొదటగా గొల్లపూడి శీతారామస్వామిగారు ఉపవాస దీక్ష ప్రారంభించారు. వినోబాభావే వచ్చి దీక్షను విరమింప చేసారు. సర్వోదయ సంఘానికి సభ్యులు-వినోబా భావే అభిమాని తరువాత నేటి వేంకట చలపతిరావు గారి అధ్వర్యమున ఆంధ్ర మహాసభ పక్షాన-ఒక నిరసనోద్యమం ప్రారంభమౌతూ ఉమ్మడి నిరాహార దీక్షలు కొనసాగినా విఫలమౌతాయి.

పై రెండు వైఫల్యాల్ని ఆంధ్ర జాతికి అవమానకరంగా భావించి మహర్షి బులుసు సాంబమూర్తి గారి ఆశీస్సులతో వారి స్వగృహముననే మద్రాసున శ్రీ పొట్టి శ్రీరాములు ఆంధ్ర రాష్ట్ర సాధనకై అమరణ నిరాహార దీక్షను ప్రారంభించారు. సర్వోదయ సంఘ సభ్యుడు, స్వాతంత్ర్య సమరయోధుడు మాత్రమే పొట్టి శ్రీరాములు. గాంధీ సబర్మతీ ఆశ్రమంలో కొన్నాళ్లు గడిపిన వ్యక్తి శ్రీ పొట్టి శ్రీరాములు. ఆంధ్రునిగా, సర్వోదయ సంఘ నాయకునిగా శ్రీ బులుసు సాంబమూర్తి గారి ప్రోత్సాహంతో, ప్రాయోపవేశానికి సిద్ధపడిన మహానుభావుడు శ్రీ పొట్టి శ్రీరాములు. అధికార కాంక్షకుగాని, పదవీ వ్యామోహానికి గాని తలఒగ్గని, అకుంఠిత దేశభక్తుడు శ్రీ పొట్టి శ్రీరాములు. శ్రీ పొట్టి శ్రీరాములు అమరణ నిరాహార దీక్షను వెంటనే విరమించుకోవలసినదిగా అనాటి ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు విజ్ఞప్తి చేస్తు నిరాహార దీక్షవలన, ఆందోళనలవలన అరాచక శక్తులు ప్రబలుతాయని ఇది మంచి పద్ధతి కాదని, విరమించుకోమని విజ్ఞప్తి చేస్తూ సలహాయిచ్చారు. ఆ మేరకు కమిటీ తీర్మానం కూడా చేసింది. రాజాజీ నాడారు ప్రతి ఒకరు శ్రీ రాములు ప్రయత్నాన్ని ఖండిస్తారు. పొట్టి శ్రీరాములు అమరణ దీక్ష 51 దినాలకు చేరుకొనే సమయంలో రంగా, తిమ్మారెడ్డి, లచ్చన్నలు వెళ్ళి కలుస్తారు. దీక్ష విరమిండి. అందరం కలసి సాధిద్దాం. అని ప్రాధేయపడి అడిగిన, ససేమిరా అతను అంగీకరించ లేదు. 58 దినాలు ఉపవాస దీక్షలో అతడు అమరజీవి అయ్యాడు.

ఆంధ్రలో ఉద్యమం లేచింది. తిరుగుబాటు జరిగి ప్రభుత్వం స్తంభించి పోయింది. రైళ్ళు, బస్సులు భగ్గున్నాయి. కేంద్ర ప్రభుత్వం ఆస్తిపాస్తులపై దాడి జరిగింది. ఆంధ్రుల ప్రతాపాగ్నిని చవిచూసిన కేంద్ర ప్రభుత్వం-విధిలేని పరిస్థితిలో ప్రధాన మంత్రి నెహ్రూ భాషా ప్రయుక్త రాష్ట్ర పునర్విభజన, సూత్రాన్ని సూత్ర

ప్రాయంగా అంగీకరిస్తూ-ఆంధ్ర రాష్ట్ర అవతరణను ప్రకటిస్తారు.

## పార్టిషన్ కమిటీ

మద్రాసు నుండి ఆంధ్రకు రావలసిన ఆస్తుల విభజనపై పార్టిషన్ కమిటీ వేసారు. ఆ పార్టిషన్ కమీషన్ ఆఫీసర్‌గా, ఛైర్మన్‌గా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి స్పెషల్ ఆఫీసర్, పార్టిషన్ కమిటీని ఛైర్మన్‌గా సి.యం. త్రివేదిని వేస్తారు. ఈ పార్టిషన్ కమిటీకి సెక్రటరీ జి. పుల్లారెడ్డి ఆనాటి మద్రాసు గవర్నమెంటుకి చీఫ్ సెక్రటరీ. ఈ కమిటీ మెంబర్లుగా అసెంబ్లీలో ఉన్న మూడు పార్టీలనుండి యీ క్రింది వారిని నియమించారు.

1. (శ్రీ) నీలం సంజీవరెడ్డి-కాంగ్రెస్ పార్టీ.
2. (శ్రీ) సర్దార్ గౌతు లచ్చన్న-K.L.P. లెజిస్లేటివ్ పార్టీ.
3. (శ్రీ) తేనేటి విశ్వనాధం-ప్రజాపార్టీ నేత.

ముఖ్య విధులు:

1. సిబ్బంది విభజన.
2. ఆస్తుల విభజన.

సి.యం. త్రివేది Non Political Leader అయిన ప్రభుత్వోద్యోగి అయినా కేంద్ర ప్రభుత్వం నిర్వహిస్తున్న జవహర్‌లాల్ నెహ్రూ అభిప్రాయాన్ని సూచన ప్రాయంగా, కమిటీ మెంబర్లకు కలిగించే వారని లచ్చన్నగారు తెలిపారు. శ్రీ సంజీవ రెడ్డిని ముఖ్యమంత్రిగా ఆంధ్ర రాష్ట్రానికి నియమించిన మంచిదని సి.యం. త్రివేది పరోక్షంగా ప్రబోధించేవారన్నది లచ్చన్న గారి అభిప్రాయం.

## లచ్చన్న-సంజీవరెడ్డిగార్ల విందు రాజకీయం

ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ఆస్తుల విభజన-ఆస్తుల పంపకం జరుగుతున్న నేపథ్యంలో సంజీవరెడ్డిగారు త్వరలో ఏర్పడనున్న ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి పదవినధిష్టించ అభిలషించి గాబోలు ఒకనాడు ఆనరికి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభలో K.L.P. శాసన సభాపార్టీ నాయకునిగానున్న సర్దార్ గౌతు లచ్చన్న గారిని ఒక దినమున పార్టీ కమీషన్ జరుగుతుండగా తన ఇంటికి విందు గుడువ సాదరంగా స్వయంగా పిలిచారు.

లచ్చన్నగారు, సంజీవరెడ్డిగారు ఆనరికి ప్రతిద్వంధిత ప్రతిపక్ష పార్టీలో చెప్పుకో దగిన వ్యక్తులు. పార్టీ నాయకులు లచ్చన్న గారు సంజీవరెడ్డిగారి ఆహ్వానాన్ని మన్నించి విందుకు తన ఇంటికి వెళ్ళారు.

సాదరంగా ఆదరించి సంజీవరెడ్డి లచ్చన్నకు విందునిస్తూ లచ్చన్న గారితో

సంజీవరెడ్డి గారు భోజన సమయంలో రంగాజీ ప్రస్తావన తెస్తూ రంగాజీని అభినందించే మాటల్ని అసంఖ్యాకంగా గుప్పించడం ప్రారంభించారు. ''నిజానికి లచ్చన్నగారూ ఆ ఒక్క కులతత్వమే లేకపోతే, రంగాజీ నిజానికి దేశానికే నాయకుడు సుమా. రంగాజీ బహుముఖ ప్రజ్ఞాశాలి కదా! నిజానికి అతనితో సరిరాగలిగే.వారే లేరు. లచ్చన్న గారూ మీతో ఈ సందర్భాన్ని పురస్కరించుకొని ఒక విషయాన్ని ప్రస్తావిస్తాను. ఇంత వరకు మనం ఉమ్మడి మద్రాసు రాష్ట్రమున ఉన్నాం. మన ప్రత్యేకతలు కొంత వరకు మరుగున పడినాయనే చెప్పాలి. ఈనాడు ఆంధ్ర రాష్ట్రం అవతరించనున్నది మన రాష్ట్రంలో రేపు మనమే కాబోయే అధినేతలం కదా! మీరు అన్ని విధాలా నాకు అండదండలివ్వాలి. నా ప్రక్కను మీరున్న ఆంధ్రలో నేనేమైనను చేయగలను. మీ పార్టీని రద్దు పరచుకొని మాలో కలవండి ఇక ఆంధ్ర కాంగ్రెస్‌లో మీకు ప్రత్యేకమైన స్థానం ఉండేలా చూస్తాను. నిజానికి మీరు గోదావరి గట్టునుండి ఇచ్ఛాపురం సరిహద్దుల వరకు, ఏ రాజకీయ వ్యవహారాల్లో జోక్యం చేసుకొన్న నేనేమి అడ్డు తగలను సరికదా, ఆ ప్రాంతమున అన్ని విధాలా మీమాట నెగ్గేలా చేస్తాను. మీకంతటి ప్రాముఖ్యాన్ని ఆ ప్రాంతంలో కలుగచేస్తాం నన్ను నమ్మండి. ఇవి ప్రామాణిక ధోరణిలో చెబుతున్న మాటలు. అన్నం తింటూ మీతో ఉచ్చరిస్తున్న ఈ మాటల్ని మీరు ప్రామాణిక వచనాలుగా పరిగణించండి.

రెడ్డిగారు చెప్పిన దంతా సావధానంగా విన్న సర్దార్‌జీ ఎంతో నిర్ణయం, సంస్కారం, సభ్యత ఉట్టిపడేలా సమాధానం యిచ్చారు. అంతేకాదు తన రాజకీయ ఉక్తి చాతుర్యం-తన గురువు పట్ల తనకున్న భక్తి ప్రపత్తులు హెచ్చురెట్లు పెరిగేలా చెప్పారు. చూడండి సంజీవరెడ్డి గారూ! మీరు ఆంధ్ర రాష్ట్రం మంచి గురించి చెబుతున్న మాటల్ని నేను విశ్వసించక తప్పదు. తప్పక మీతో సహకరిస్తాను. అయితే నేను పార్టీ విధేయుడను. పైగా రంగాజీ శిష్యునిగా పేర్వడసిన వ్యక్తిని. మీరు ఒక్క మారు నాతో చెప్పిన విషయాలను మా నాయకుని రంగాతో ముచ్చటించిన తదుపరి విషయమంతా సవ్యంగా కొనసాగేలా నేను చూస్తాను. నా మాటను మీరు విశ్వసించండి. మీ పట్ల రంగాజీకి ఎటువంటి వ్యక్తిగత ఆవేశకావేశాలు కక్షలు లేవు నమ్మండి. మీరు ప్రస్తావించిన రంగాజీ తప్పక మిమ్మల్ని బలపరుస్తారు. బలపరచినట్లు నేను చేస్తాను నమ్మండి. మా గురువు మా నాయకుడు రంగాజీతో ఒక్కమారు ఈ ప్రస్తావన చేయండి. అంటూ లచ్చన్న తన సమాధానాన్ని ముగించారు.

లచ్చన్న సమాధానాన్ని మౌనంగా వింటున్న రెడ్డి బదులు చెప్పటానికి ఏ మాటా దొరకలేదు. పైగా లచ్చన్న చెప్పవలసిన రీతిగా, సహజరీతిలో చెప్పారు.

నాయకుడు కలిసి రాకుండా అనుచరుడు వచ్చి ఏమి చేయగలరు. ఒక వేళ వచ్చి చేసిన అది నాయకునికి వెన్నుపోటు అవుతుంది. వచ్చిన వ్యక్తికి మాత్రం దక్కేదిక ఏముంటుంది.

రెడ్డి అంతరంగికంగా ఏమి భావిస్తున్నారో అన్నది ఎవరికి తెలియని విషయం. K.L.P. రద్దు కావాలని భావిస్తున్నారు. KLP ని విడిచిన సర్దార్‌జీని తన పార్టీలోనికి రమ్మంటున్నారా, రంగాజీ నుండి లచ్చన్నను వేరుచేసి రంగాను ఇంకా రాజకీయంగా బలహీన పరచాలని భావిస్తున్నారా లేక లచ్చన్నగారు ఉత్తరాంధ్రలోనేగాక యావదాంధ్ర రాష్ట్రమున ఆనాటికి తనకున్న పేరు ప్రతిష్ఠల్ని బట్టి తనతో కలసి వచ్చిన ఇక తనకు ఏర్పడ పోయే ఆంధ్ర రాష్ట్రమున రాజకీయాల్ని నడుపుటలో ఇక అడ్డు తగిలే వారెవరూ. ఇక తను రాష్ట్రముఖ్యమంత్రి కావటానికి అవరోధమే లేదు. అందుకు లచ్చన్న గారిని తనను ముఖ్యమంత్రిగా బలపరచమని కోరారు. ఆనాడు రంగాజీని కేంద్రమంత్రి వర్గంలో మంత్రిగా చేర్చుకోవటానికి మనకు ఎలాంటి అడ్డంకు లుండవు నన్ను నమ్మండి'' అన్నారు రెడ్డిగారు. ఆనాటి కాంగ్రెస్ సంఖ్యాబలంలో KLP కలసిన అధికార యోగం సునాయాసంగా లభిస్తుంది.

## కాళహస్తి బై ఎలక్షన్

విందు రాజకీయ సమావేశం ముగిసిన తదుపరి, సర్దార్ జీ అభిలషించినట్లు సంజీవరెడ్డిగారు రంగాజీతో కలియాలి. లచ్చన్నగారితో అన్ని విషయాలను ప్రస్తావించడంగానీ చేయలేదు. నిజానికి ఏ అవరోధం, లోపం రంగాజీలో ఉందని రెడ్డిగారు అన్నారో అదే అవరోదం ఇతనికి ఉందేమో! లేకపోతే కలిసి చర్చించటానికి అభ్యంతరం ఏటుంటుందన్నది సర్దార్‌జీ అభిప్రాయం. ఆంధ్ర రాష్ట్ర ప్రథమ ముఖ్యమంత్రిగా అధికార పీఠాన్ని అధిష్టించాలని భావిస్తూ రెడ్డిగారు ఏలనో మరి రంగాజీతో కలిసి ఈ విషయాన్ని ప్రస్తావించలేదు.

మరల రాజకీయ పోరాటాలు ప్రారంభం. ఉమ్మడి మద్రాసు రాష్ట్రమున కాళహస్తి నియోజకవర్గం కాంగ్రెస్ సభ్యులు శ్రీ బలరామిరెడ్డిగారి చేత రాజీనామా చేయించి ఆ స్థానానికి సంజీవరెడ్డి పోటీ చేయదలచారు. విందు రాజకీయ సమావేశమున ఈ విషయం ప్రస్తావనకు వచ్చింది కూడా. K.L.P. ఏ ఒక్కరినీ పోటీ పెట్ట వద్దని రెడ్డిగారు కోరారు.

అయినప్పటికీ సంజీవరెడ్డి గారిమీద K.L.P. ఒక అభ్యర్థిని పెట్టింది. ఆ ప్రచార రంగంలో రంగాజీ లచ్చన్నతో సహా అందరూ దిగారు. పోటీ చేస్తున్న వ్యక్తి ప్రప్రథమ రాష్ట్ర ముఖ్యమంత్రి అని K.L.P. భావించి పోరాటాన్ని ఉధృత పరచిన సంజీవరెడ్డి గారే గెలుపొందారు. K.L.P. కాళహస్తిలో తన అభ్యర్థిని పెట్టినందుకు

నిరసనగా తిమ్మారెడ్డి కృషివరలోక పార్టీనుండి రాజీనామా యిస్తూ బయటకు వెళ్లారు. ఆసరికే లచ్చన్నగారితో జరిపినట్లు తిమ్మారెడ్డి గారితో విందు రాజకీయ సమావేశం జరిగిందనే భావించాలి.

## ఆంధ్రరాష్ట్ర అవతరణ

ఆంధ్ర రాష్ట్రావతరణం 1953 అక్టోబరు 1వ తేదీన జరుగుతుంది. ఆ సరికి ఆస్తుల పంపకం విభజన జరిగిపోయింది. ప్రప్రథమ ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రిగా నుండనభిలషించిన శ్రీ సంజీవరెడ్డిగారు ఆశయం, అభిలాష నెరవేరలేదు. నిజానికి కాంగ్రెస్ ఆనాటికి తన పార్టీతో సరిసమాన సంఖ్యను గల ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీని జూచి లోలోన భయపడేది. మరల యునైటెడ్ ఫ్రంట్‌లు ఏర్పడి, కాంగ్రెస్ ప్రభుత్వానికి పరిస్థితులు దారితీస్తాయేమోనన్నది కాంగ్రెస్ అధిష్టాన వర్గం భావించింది.

అందుకు ప్రత్యామ్నాయం ఆనాటి భారత ప్రధాని నెహ్రూయే కాంగ్రెస్ అధ్యక్షులు. ఆంధ్ర రాష్ట్రములో కాంగ్రెస్‌పార్టీ మంత్రివర్గం ఏర్పడటానికి ఆంధ్ర కాంగ్రెస్‌కు వెనులుబాటు కల్పించింది.

ఆ సరికే సర్దార్‌జీతో రెడ్డిగారు జరిపిన రాజకీయ సమాలోచనలో కాంగ్రెస్ పార్టీ విఫలమైంది. లచ్చన్నగారు తన గుప్పిట్లోకి వస్తారన్న భ్రమలు ఇక కాంగ్రెస్‌కు లేవు. అందుకు వెంటనే ప్రజాపార్టీనేత ప్రకాశం పంతులుగారితో రాజకీయ సమాలోచన జరిపింది. రాయభారం పంపినదే తడవుగా ప్రజాపార్టీనేత పంతులుగారు పదవిలో కూర్చోవటానికి ఆంధ్రరాష్ట్ర ప్రప్రథమ ముఖ్యమంత్రిగా ఉండటానికి అంగీకారం తెలిపారు. సంజీవరెడ్డిగారితో లచ్చన్న ఆనాడు చేయికలిపిన ఆంధ్ర రాష్ట్రపు ముఖ్యమంత్రిగారే సంజీవరెడ్డిగారు. ప్రకాశంగారు ముఖ్యమంత్రి అన్న ప్రశ్నే లేదు రాదు.

పంతులుగారు తన మేధాశక్తినెంతగానో ప్రదర్శించి తను కాంగ్రెస్ మంత్రి వర్గానికి నాయకుడై కూర్చొని తన పార్టీ సహచరులెల్లరిని, ప్రజాపార్టీలోనే ఉండేలాగా చేశారు.

పంతులుగారు అంగీకరించినదే తడవుగా ప్రప్రథమ ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి అని, అభిజ్ఞాన వర్గాల ద్వారా భోగట్టా అని దినపత్రికల్లో వెలువడింది. ఇక మంత్రి వర్గ నిర్మాణానికి సన్నాహాలు పంతులు గారితో మంత్రివర్గం ఏర్పడింది. మంత్రివర్గం ఏర్పడిన తదుపరి శాసనసభలో బలనిరూపణ కావాలి కదా! అందుకు కాంగ్రెస్ సంఖ్యా బలాన్ని వృద్ధిచేయు పథకం వేసింది. ఉన్న స్వతంత్ర అభ్యర్థులు బి.యస్.

రెడ్డి, మల్లు సుబ్బారెడ్డి (నంధ్యాల), వెంకటశెట్టి, అదునుమిల్లి సుబ్రహ్మణ్యం-గుడి వాడ కాంగ్రెస్ అభిమానులుగా రూపొందారు.

అంతటితో సరిపెట్టుకొనక, K.L.P. నుండి అసరికే కాంగ్రెస్‌లో కలిసిన తిమ్మారెడ్డితోపాటు, అను నీలాద్రి రామిరెడ్డి ఇచ్ఛాపురం, కునిశెట్టి వెంకటనారాయణ (సాలూరు), బత్తిన సుబ్బారావు (బురుగుపాడు)లను కాంగ్రెస్‌లో కలుపుకున్నారు.

అయినప్పటికీ కాంగ్రెస్ శాసనసభా పార్టీలో సంఖ్యాదిక్యత లభించలేదు. ప్రభుత్వాధికారాన్ని వినియోగించి కాంగ్రెసేతర సభ్యుల్ని తనలో కలుపుకోవటానికి ప్రయత్నించింది.

తన నాయకుడు కాంగ్రెస్ మంత్రివర్గానికి ముఖ్యమంత్రి అయిన, ప్రజాపార్టీ శాసనసభ్యులు కాంగ్రెస్‌పార్టీలో కలువకుండా ఉండేవారు. నిజానికి తెన్నేటి విశ్వనాథంగారు మంత్రివర్గంలో ప్రజాపార్టీ తరపున మంత్రి అనే రీతిని, నీతిని కలిగి వ్యవహరించేవారు.

ఆనాటి మంత్రివర్గంలో పంతులుగారితో డిప్యూటీ చీఫ్ మినిష్టరుగా సంజీవరెడ్డి ఇతర మంత్రులు సంజీవయ్య, తెన్నేటి విశ్వనాధం, తిమ్మారెడ్డి వగైరాలుండేవారు.

1953లో ఆంధ్రరాష్ట్రంలో ప్రప్రథమ రాష్ట్ర మంత్రివర్గంతో ప్రకాశం పంతులుగారి నాయకత్వాన ఏర్పడిన మంత్రివర్గంలో ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవ రెడ్డి. ఆర్థిక శాఖ-టి. విశ్వనాధం, యన్.బి.పి. పట్టాభి రామారావు-విద్య, శ్రీధర్ రెడ్డి-రెవెన్యూ, డి. తిమ్మారెడ్డి-వ్యవసాయం, సంజీవయ్య-ఆరోగ్యశాఖ, జి. లచ్చన్న-కార్మికశాఖ.

అయితే ప్రకాశం మంత్రి వర్గం 13 నెలల మాత్రమే చేయగలిగింది. లచ్చన్న చేసిన ప్రతిపక్ష పార్టీల మద్దతుతో విశ్వాసరాహిత్య తీర్మానం ద్వారా మంత్రి వర్గం తొలగించబడింది.

1955 మధ్యంతర ఎన్నికలు జరిగే వరకు రాష్ట్రపతి పాలన విధించడం జరిగింది.

1955లో ఎన్నికల తదుపరి ఐక్య కాంగ్రెస్ పేరిట గెలుపొందిన కాంగ్రెస్ పార్టీ మంత్రివర్గం ఏర్పరచింది. శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు మంత్రి వర్గాన్ని రూపొందించారు.

ఆ మంత్రివర్గంలో మా సర్దార్ గౌతు లచ్చన్న గార్కి ప్రాతినిధ్యం లభించింది. ఉప ముఖ్యమంత్రి నీలం వారే. నీలకంఠ రామారావు అటవీశాఖ, ఓబుల్ రెడ్డి

వ్యవసాయం, కళావెంకట్రావు గార్కి ప్రణాళికా శాఖ, కళ్లూరి చంద్రమౌళిగార్కి భూమిశిస్తు శాఖ, డి. సంజీవయ్యకు రవాణాశాఖ, ఎ.బి. నాగేశ్వరావుగారికి స్థానిక పాలన, గౌతు లచ్చన్న గార్కి కార్మికశాఖ-సాంఘిక సంక్షేమ శాఖలు లభించాయి.

అయితే ఈ మంత్రి వర్గం 1956 సంవత్సరం చివరి వరకే అనగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడినంత వరకే కొనసాగింది. ఆనరికే రాష్ట్ర కాంగ్రెస్‌పార్టీలో బలమైన వర్గాలు ఏర్పడి ఉన్నాయి. ప్రాంతాలవారీగా ప్రాతినిధ్యం ఇవ్వవలసి వచ్చింది. ఈ మంత్రి వర్గం పెద్దరెడ్డి తిమ్మారెడ్డిగార్కి లభించింది. మన సర్దార్ గౌతు లచ్చన్న గార్కి లభించలేదు. శ్రీ నీలం సంజీవరెడ్డి కాంగ్రెస్ పార్టీ శాసనసభా పార్టీ నాయకునిగా ఎన్నుకోబడ్డారు.

## 5వ ప్రకరణము

### ఆంధ్ర రాష్ట్రమంత్రి వర్యులుగా లచ్చన్న

కాంగ్రెస్ కార్యవర్గానికి నాయకునిగా వ్యవహరిస్తున్న పంతులుగారు మంత్రి వర్గం అనబడటానికి తగిన సంఖ్యాధిక్యత లేదని భావించినందున సర్దార్‌జీకి కబురుపెట్టడంలో ప్రారంభమైనది. U.D.F. సభ్యులు 71 మంది. కె.యల్.పి. తో నున్నది ఆనాటికి 12 మంది. నిజానికి వీరిరువురు కలిసిన కాంగ్రెస్‌ల మంత్రివర్గం కూలబడుతుంది.

ఆసరికి మద్రాసు నగరంలోనున్న సర్దార్‌జీకి పంతులుగారు, ఎర్నేని సుబ్రహ్మణ్యం, సూర్యనారాయణలకు ఒక ఉత్తరం ఇచ్చి పంపించారు. ముఖ్యమంత్రిగారు పంపిన ఉత్తరం తెచ్చినవారు ప్రకాశంగారి శిష్యులు. గ్రామ స్వరాజ్య సంఘ సభ్యులు లచ్చన్నగారు ఆ ఉత్తరం అందుకొని అందు విషయం చదువుకున్నారు. ఆ వచ్చిన వారితో లచ్చన్నగారు అన్నమాటలు ''ఏమండీ ఇదేమి వింతండి. నన్ను తన పార్టీలోనికి రమ్మని చెప్పటానికి, నన్ను ఆహ్వానించటానికి పంతులుగారెవరండి. నా పార్టీ నన్ను పిలవాలి. మా నాయకుడు రంగాజీ మాకు ఆదేశించాలి. అంతే తప్పించి ఇలా ఉత్తరాల్ని ముఖ్యమంత్రి కాదు, వాళ్ళ తాత అంపిన వచ్చేవారం మేము కాదండి. క్షమించండి ఈమాటల్ని పంతులుగారికి చెప్పండి. అంటూ ముఖ్యమంత్రి ఆహ్వానాన్ని లచ్చన్న తిరస్కరించారు.

అయితే ప్రకాశం పంతులు అభిమానులు వారి ప్రయత్నాన్ని విరమించలేదు. ఆసరికే ప్రసిద్ధిపడిన దినపత్రిక ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావుని లచ్చన్న వద్దకు తీసుకొని వచ్చారు.

ఎడిటర్ నార్లవారన్న లచ్చన్నకు ఎంతో గౌరవం భక్తి శ్రద్ధలుండేవి. విజ్ఞాని అని, పత్రికారచయిత అని గౌరవం. అయితే నార్ల వెంకటేశ్వరావు దౌత్యాన్ని మన్నించే మాటలతో తిరగ్గొట్టారు లచ్చన్నగారు. ''ఏమండీ వెంకటేశ్వరరావు గారు, ప్రజాస్వామ్యం మీద పత్రికల్లో వ్యాసాలు వ్రాసిన మీరు ఇలా చెబితే ఎలాగండి. పార్టీ క్రమశిక్షణ లోపించినపుడు ఇక పార్టీలెందుకండి క్షమించండి. లోలోన రాయబారాలు సరికాదండి'' అని అన్నారు.

రంగాజీని పార్టీని రద్దు పరచుకొని పంతులుగారు రమ్మన్నారు. మంత్రి వర్గంలో స్థానం కల్పిస్తామన్నారు. అందుకు రంగాజీ ''మద్రాస్ మంత్రివర్గంలోనే రాజాజీ పిలుపును నేను అంగీకరించలేదు. మీరు ముఖ్యమంత్రిగా గుర్తిస్తాం. నేను మంత్రిగా నున్న ఆ మంత్రివర్గంలో నున్న వారు కారు. సరిసమానులు కావాలికదా! వీలులేక

హెమ్మన్నాను. మా లచ్చన్నగారిని మంత్రివర్గంలోకి తీసికోండి. మిమ్మల్ని బలపర చాలని మీ నాయకత్వం ఉండాలన్నది మా అభిప్రాయం. ఏ ఏ పరిస్థితులలోను కె.యల్.పి. కాంగ్రెస్‌లో కలియదు. మీ వరకు సహాయం అందిస్తాం. మంత్రివర్గంలో స్థానమిచ్చిన మీ సభ్యునికి మంత్రివర్గ నిర్ణయాల్లో ఓటింగ్ స్వేచ్ఛను మాత్రం కలిగించాలి. ఈ షరతులమీద మా సభ్యుడ్ని మంత్రివర్గంలోకి తీసుకొన్న మాకభ్యంతరం లేదు.''

వెంటనే ప్రకాశం పంతులుగారు అంగీకరించారు. మద్రాసులో నున్న లచ్చన్న గారికి నవంబరు 6వ తేదీన నిడుబ్రోలు నుండి రంగాజీ అంపిన లేఖ అందుతుంది. ఆ లేఖ అందుకొని పార్టీ నాయకుని ఆదేశానుసారం లచ్చన్నగారు 6వ తేదీ బయలుదేరి 7వ తేదీన తాత్కాలిక రాజధాని కర్నూలు చేరుకొంటారు. మంత్రివ ర్గంలో సభ్యునిగా ప్రమాణస్వీకారం చేయటానికి ప్రకాశం సహచరులు మద్రాసు నుండి నిడుబ్రోలు వెళ్లి రంగాజీని కలుస్తారు. అంతేగాక ప్రకాశంగారితో ఫోనులో మాట్లాడి రంగాజీతో మాట్లాడమని కోరగా టంగుటూరి రంగాజీతో మాట్లాడు తారు. రంగాజీ పంతులుగారి మంత్రివర్గం కొనసాగాలని అభిలషించే వారు. నిజానికి ప్రకాశం మంత్రివర్గం కూలబడిన ఉమ్మడి కమ్యూనిస్టుపార్టీ అధికారంలోకి రాగలదే మోనన్నది రంగాజీ అభిప్రాయం.

అయితే రంగాజీ ఫోనులో ఖచ్చితంగా పంతులుగారితో చెప్పారు.

మంత్రివర్గ ప్రమాణస్వీకారం ఉదయం 10గం. లకు రాజభవనంలో గవర్నర్ త్రివేది ప్రమాణ స్వీకారం చేయిస్తారు. ఆ ప్రమాణస్వీకారానికి పంతులుగారు, సంజీవరెడ్డిగారితోసహా మంత్రులందరు హాజరైనారు. మంత్రివర్గ పదవీ స్వీకారానం తరం విందుభోజనాల్ని డిప్యూటీ ముఖ్యమంత్రిగారు ఏర్పాటు చేస్తారు.

## మంత్రిగా లచ్చన్నగారి కృషి

లచ్చన్నగారికి వ్యావసాయశాఖ, కార్మికశాఖలను కేటాయించారు. కాంగ్రెస్ పార్టీ అయిష్టంమీదనే లచ్చన్నగారిని మంత్రివర్గంలోకి తీసుకున్నది. ఓటింగ్ స్వేచ్ఛను లచ్చన్న గారికివ్వడం కాంగ్రెస్ పార్టీకి సుతారాము ఇష్టం లేదు. పంతులుగారు ఆకాంక్ష మేరకే లచ్చన్న గారికి మంత్రి పదవి లభించింది. కె.యల్.పి.కి అధికారంలో స్థానం దొరికింది.

గుడివాడ వద్దనున్న గుడ్లవల్లేరులో అడుసుమిల్లి సుబ్బారావు, ప్రముఖ రంగా గారి అనుచరుడు, ఆత్మీయుడు మంత్రివర్గంలో చేరిన సందర్భంగా ఒక విందు సమావేశాన్ని అనేక రాజకీయపార్టీల ప్రతినిధులకు ఏర్పాటు చేసారు. అంతటి

విస్తృత ప్రాతిపదిక మీద పెద్దస్థాయిలో జరిగిన సమావేశం ఆనాడు జరిగిన సన్మానం అదివరకు ఎవరికి అంతగా జరగలేదేమో అన్నట్లుగా అభిమానులు ఎంతగానో జరిపారు. లచ్చన్నగార్ని లోలోన కృంగి కుమిలిపోయిన వారని "కన్నెర్ర" అయింది.

ఆంధ్ర రాష్ట్రమున 35 ఏండ్ల క్రిందట మంత్రి పదవిని అందడం అరుదైన విషయమేమీకాదు. అత్యంత విలువైన సంఘటన. స్వతంత్ర్యం వచ్చి బానిస బ్రతుకులకు స్వస్తిచెప్పి జనసామాన్యం స్వేచ్ఛా సమానత్వ వాయువుల్ని పీల్చు కుంటున్న శుభతరుణం.

మంత్రి పదవినధిష్టించిన సర్దార్ లచ్చన్నగారిని దేశం నలుమూలల నుండి అభినందించుటకు వచ్చిన జనావళి అభినందించడమేగాక లచ్చన్నగారు మంత్రిగా జరిపిన రాష్ట్ర పర్యటనలో అభినందిస్తూ స్వాగత సన్మానాల్ని ఏర్పాటు చేసేవారు.

కొంతమంది పదవినందిన తరువాత ప్రాముఖ్యతను సంతరించుకొంటారు. మరి కొందరు ఆ పదవికే వన్నె తెస్తారు. ప్రజల్ని ఆకర్షిస్తూ జనవాణిని ఆకట్టుకుంటారు.

బలహీన వర్గాలు ప్రజానాయకుడు, వెనుకబడిన వర్గాల నాయకుడు అందలాల మెక్కి అందరి మన్ననలను, అభిమానాల్ని ఆనాడు పొందడం ఈనాడు పొందినంత సులభం కాదు. ఏ ఒకరు ఆనాడు మంత్రి పదవినందిన దేశ జనమంతా ముక్త కంఠంతో అతనిని కొనియాడే దినాలు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న సమరయోధులు దేశభక్తిగల వారు ప్రజానాయకులు మాత్రమే మంత్రి పదవిని నందగల మహానుభావులన్నది ఆనాడు ప్రతి ఒకరి ఆత్మలో మెలగాడే విషయం. నలుగురిని కూడగట్టుకొని మెజారిటీని సంపాదించి మంత్రి పదవుల నందే కాలం కాదది.

వెనుకబడిన వర్గాలకెల్లా వెలుగు. బలహీన వర్గాలకెల్లా బలమివ్వగల వ్యక్తి అని, పీడిత తాడిత ప్రజానీకం సర్దార్‌జీపై ఎన్నో ఆశలు పెట్టుకొని ఉన్న తరుణం. సర్దార్‌జీ ఏ ప్రాంతానికి వెళ్లిన, ఏ సభలో ప్రసంగించిన జనవాహిని ఆనంద పారవశ్యాలతో ఉప్పొంగి పోయేవారు. వారిపట్ల అతడొక ఆశాజీవిగా భావించేది.

స్వాతంత్ర్యోద్యమంలో దూకి భారతములో దాస్యశృంఖలాల్ని ఛేదించ సిద్ధపడి జైల్లో అనేక వత్సరాలు మ్రగ్గిన దేశభక్తులు సర్దార్‌జీ. ప్రజాసమస్యల్ని పరిష్కరించుటలో ఏ ఒకరు అడ్డువచ్చిన, తెగించి నిలిచి పోరాడి, సామాన్య జనాల్ని ఆదుకొనే మనస్తత్వం, వ్యక్తిత్వంగల సర్దార్ జీ మంత్రిపదవి నందిన కొద్ది వారాల్లోనే దేశవ్యాప్త కీర్తిప్రతిష్ఠల్ని అందుకొన్నారు.

రాష్ట్ర మంత్రివర్గ సమావేశాల్లో కె.యల్.పి. సభ్యునిగా పాల్గొన్న లచ్చన్న గారు ప్రజా సమస్యల్ని చర్చించిన, కాదనటానికి, లేదనటానికి అతనికి ఎదురు నిలచి చెప్పగలిగిన వారు ఆనాడు ముఖ్యమంత్రి టంగుటూరు ప్రకాశం పంతులు. మంచి అయిన, చెడు అయిన ప్రతిఘటించటానికి డెప్యూటీ చీఫ్‌మినిష్టరు నీలం సంజీవరెడ్డి గారే.

## కృషికరలోక పార్టీ ఆదేశంపై మంత్రివర్గం నుండి లచ్చన్న రాజీనామా!

కాంగ్రెస్ వారికి కంటగింపు ప్రారంభమైనది. ప్రజాపార్టీని విడువకనే తెన్నేటి విశ్వనాథం మంత్రిగా కొనసాగుతూ తన విధులను నిర్వర్తిస్తూ ప్రజ్ఞాదురణుడని పించు కొంటున్నారు. కృషికరలోక పార్టీ శాసనసభా నాయకుడయి, సర్దార్ గౌతులచ్చన్న మంత్రి పదవినంది ప్రజలందరిచేత వేనోళ్ళ కొనియాడబడుతు న్నారు. ఇక కాంగ్రెస్ పార్టీకి చెందిన మంత్రులు ఈ ఇరువురిని అదిగమించటం ఎలా? ''ఇంతకూ మంత్రివర్గం కాంగ్రెస్ నాయకత్వాన్ని అప్పగించారు.

కాంగ్రెవ్ వారికిది ఏమాత్రం మింగుడుపడని విషయం అయింది. ఏదో వ్యూహం, ఎత్తుగడ వేసి సర్దార్‌జీని మంత్రి వర్గం నుండి ఊడదీయాలి. ప్రకాశం పంతులు గారికి కె.యల్.పి. ప్రజాపార్టీల బలం కావాలి. కాంగ్రెస్ వారికి ప్రజల్ని పాలిస్తున్నది కాంగ్రెస్ వారే సుమా అన్నది ఋజువుకావాలి.

మంత్రివర్గంలో సమాలోచన చేయటానికి ఎజెండాలో ఒక విషయం చేర్చారు. అదే కర్నూలు తాత్కాలిక రాజధాని సమస్య. ఆంధ్ర రాష్ట్రమునకు రాజధాని ఏది తాత్కాలిక రాజధాని కర్నూలే శాశ్వత రాజధానిగా పరిగణించాలని డెప్యూటీ చీఫ్ మినిష్టర్ నీలం సంజీవరెడ్డి ఖండితంగా బయటచెప్పారు. కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుని అభిప్రాయాన్ని పార్టీ త్రోసిపుచ్చలేదు. ఉమ్మడి కమ్యూనిష్టు పార్టీ రాజధానిగా ఉండవలసిన అర్హత కేవలం విజయవాడకే ఉందని ప్రకటించింది. తీర్మానం చేసింది.

ఆది నుండి కమ్యూనిష్టు భావాలను ఉద్యమాలను ఎదుర్కొంటూ వస్తున్న రంగాజీ కమ్యునిష్టు పార్టీ ప్రతిపాదనల్ని కాదని, రాజధానిగ ఉండవలసిన అర్హత తిరుపతికి ఉందని వాదించింది K.L.P..

ఆంధ్ర రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడి నెలలు గడవలేదు. ప్రజా సమస్యకానీ రాజధాని సమస్యపై మంత్రి వర్గంలో ఎజెండాలో ఈ అంశాన్ని చేర్చిన ఓటు స్వేచ్ఛ ఉన్నందున తన పార్టీ తిరుపతి రాజధానిగా ఉండాలని లోగడనే తీర్మానం చేసినందున, సర్దార్‌జీ తప్పక ఈ అంశాన్ని ప్రతిఘటిస్తారు. ఓటు స్వేచ్ఛను

అడుగుతారు కాంగ్రెస్ పార్టీకాదన్న మరుక్షణం మంత్రి పదవి, తన పదవి పరమార్థమనుకొంటారు లేదా తన పార్టీకి తిలోదకాలిచ్చి విడిచిపెట్టి పోతారు. ఇది కాంగ్రెస్‌వారి యుక్తి, ఎత్తుగడ వ్యూహం.

ఇక కృషికరలోక పార్టీలో కూడ అంతర్గతంగా కొంతమంది ఉన్నత స్థాయి వ్యక్తులలో లచ్చన్నగారిపై ఈర్ష్యద్వేషాలు చాపక్రింద నీరులా ప్రవహించసాగాయి. అధికారంలో భాగస్వామ్యాన్ని పొందిన తమ పార్టీ ప్రజల్లో పలుకుబడి సంపాదించింది దని భావించిన కృషికరలోక పార్టీకాదు. సర్దార్ గౌతు లచ్చన్నగారే అన్న తక్కువ భావం, దురభిప్రాయం చాలా మందికి స్వకీయ పార్టీలోనే కలిగింది.

సర్దార్ గౌతులచ్చన్న వెనుకబడిన కులస్థుడు. అంతేగాక ఆంధ్రదేశం కొసన లనో ఇచ్ఛాపురం ప్రక్కన ఉన్నవారు. పార్టీవెంట తను నడువ వలసిన పరిస్థితి పోయి కృషికరలోక పార్టీయే తనవెంట నడవాలా అన్న పరిస్థితి వస్తుందేమో. అగ్రవర్ణాలకు చెందిన నాయకులు కొంత కాలానికి మరుగునపడి ఈ బలహీన వర్గాల ప్రజానాయకుడికి ప్రజలు జే జేలు పలికిన పరిస్థితి వచ్చిన ఇక పార్టీలో నున్న ఇతర పెద్దల మాటేమిటి. వారికి పట్టగల దుస్థితి ఏమిటి. బుర్రలో చెడు భావన రాకుండానే ఉండాలి. ప్రవేశించిందా పిచ్చి ఎక్కుతుంది. కొన్నాళ్లకు రంగాజీ వెంటనే పార్టీ వర్కింగ్ కమిటీ సమావేశమౌతుందని ప్రకటిస్తూ కర్నూలులో ఉన్న సర్దార్‌జీ ఇంట్లో మకాం పెట్టారు. ఏ పరిస్థితులలోను మంత్రి వర్గం సమావేశంలో రాజధాని సమస్యపై రాజీపడకూడదని పార్టీ నిర్ణయం మేరకు తిరుపతిని శాశ్వత రాజధానిగా ఉండాలని, ఈ సమస్యపై అవసరమైన లచ్చన్నగారు మంత్రి పదవికి రాజీనామా యివ్వాలని తీర్మానం.

కె.యల్.పి. వర్కింగ్ కమిటీ లచ్చన్నగారి గృహంలోనే సమావేశమై రాజధాని సమస్యపై అవసరమైన మంత్రిపదవిని పరిత్యజించాలని తీర్మానించింది. స్వర్గీయ వి. రామకృష్ణ ప్రముఖ పారిశ్రామికవేత్త కూడా పాల్గొన్నారు.

అయితే కృషికరలోక పార్టీ నందలి చెప్పుకోదగిన కార్యకర్తలు లచ్చన్న సహచరులువచ్చి లచ్చన్నగారూ మీరు రాజీనామా చేయవద్దు. ఈ రాజధాని సమస్య ఏమంత గొప్పది. తాత్కాలిక రాజధానిగ ప్రస్తుతం కర్నూలు కొనసాగుతున్నది కదా. వర్కింగ్ కమిటీ తీర్మానం చేస్తే సరిపోదు. పార్టీ జనరల్‌బాడీ సమావేశపరచ మనండి. మా అందరి అభిప్రాయం మీరు రాజీనామా చేయొద్దని చెబుతాం. మన పార్టీకి రాకరాక మంత్రిపదవి వచ్చింది. ప్రజ్ఞగల మీరు ఆ పదవిలో నుంటూ అచిరకాలములోనే ప్రజలమండి మన్ననల నందుకొంటున్నారు. అగ్రవర్ణాలవారు వాడు ఈవాడు ఏవాడు బలహీన వర్గాల వారి బాగును చూడలేరు. అందులో

ఎక్కైక వ్యక్తిని క్రిందకు లాగటానికి చూస్తారు. అంటూ లచ్చన్నను రాజీనామా చేయొద్దని చెప్పారు.

అయిన ఆది నుండి పార్టీ విధేయుడు, పార్టీనేత రంగాజీ అనుంగు సహచరుడు అయిన లచ్చన్నగారు పార్టీ క్రమశిక్షణను అధిగమించటానికి కలలోకూడ సిద్ధపడని సుశిక్షిత రాజకీయ వ్యక్తిత్వం గలవాడు లచ్చన్న. తనకు సలహాయిచ్చిన పార్టీ అనుచరులను వారించి కూడదని చెప్పారు.

మంత్రివర్గ సమావేశాల్ని మూడుమారులు వాయిదావేశారు పంతులుగారు. కె.యల్.పి. వారు రాజధానిపై మంత్రివర్గ తీర్మానాన్ని బలపరుస్తారేమోనని, అయిన ఫలించలేదు. సుశిక్షితుడయిన రాజకీయ సైనికునివలె, పార్టీ ఆదేశాన్ని కాదనక పార్టీ తీర్మానం మేరకు కె.యల్.పి. ఆంధ్రరాష్ట్ర రాజధాని తిరుపతి క్కావాలన్న వాదనను విరమించుకోదని మంత్రివర్గం అంగీకరించ నందున సర్దార్ గౌతులచ్చన్న తన పదవికి రాజీనామా యిచ్చారు. ఆనాటి దిన పత్రికలలో లచ్చన్న మంత్రివర్గం నుండి రాజీనామా అంటూ ప్రకటించారు.

# 6వ ప్రకరణము

## కల్లుగీత పారిశ్రామికుల సత్యాగ్రహోద్యమం-లచ్చన్న

లచ్చన్నగారు ఆంధ్రరాష్ట్ర శాసనసభలో కృషికరలోక పార్టీ శాసనసభా నాయకునిగా ఉంటూనే, కల్లుగీత పారిశ్రామికుల రక్షణను గూర్చి ప్రయోజనాల్ని గూర్చి విశేషకృషి సలిపినారు. సిద్ధాంతరీత్యా ఏ ఒకరితోనైన ఏ పార్టీతోనైనా పోరాటానికి రంగం సిద్ధం చేసినారు. ప్రజాందోళన కార్యక్రమాల్ని కొనసాగించారు.

ప్రకాశం పంతులుగారు గాంధేయ మార్గాన్వేషి అని చెప్పటానికి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా వృత్తివిద్యలను (బేసిక్ ఎడ్యుకేషన్) ప్రవేశ పెట్టారు. తుదకది ఆచరణలో అందరావిదని తరువాత ధృడపడింది. ఒక వైపు సర్వ ప్రపంచం ఆధునిక పోకడలతో శాస్త్రీయ సామాజిక దృక్పదంతో పరుగిడు తుంటే వేరొక వైపు ప్రాచీన వృత్తుల్ని పట్టుకుని వ్రేలాడతామనడంలో అర్థంలేదని కాల క్రమేణ తెలిసివచ్చింది.

ఇక ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా మధ్యపాన నిషేదాన్ని ప్రవేశపెట్టే చట్టం చేసిన ఘనత ఆయనకే దక్కుతుంది. శాసన సభలో ప్రతిపక్షాలువారు ముఖ్యంగా కృషీవరలోక పార్టీ ప్రత్యేకంగా బలహీన వర్గాల నాయకుడు. బహుజన బంధు లచ్చన్న మధ్యపాన నిషేదాన్ని కాదనలేదు. ఆ చట్టం వలన నిరాశ్రయులైన లక్షలాది కల్లుగీత పారిశ్రామికులకు పనికల్పించండి. వారి భార్యాబిడ్డల్ని నడివీధిలోనికి నెట్టకండి. ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయండి, చేయలేని ప్రభుత్వం-లక్షలాది ప్రజలు కడుపుకొట్టే పథకాలను అమలుచేయ సిద్ధపడకండి అంటూ శాసనసభలో బయట గర్జించారు.

లచ్చన్నగారిపై ఇంటా బయట విమర్శలు వచ్చాయి. అతను కల్లుగీత పారిశ్రామికుని ఇంట్లో వెలసిన వ్యక్తి కద. నిజమే అందుకే అతడు కల్లుగీత పారిశ్రామికులకు కాంతి కిరణం అయినాడు. లచ్చన్నగారు శాసనసభలో బయట వాదించారు. తను గాంధేయవాదినని తన స్వగ్రామం ఒకనాడు తన స్వంత కుటుంబం చేపట్టిన కల్లు అంగడిని తనే సత్యాగ్రహం చేసి మూసివేయించిన సంఘటన తెలిపారు. ఆనాటి నుండి తను నిజమైన గాంధేయవాదిగా ఉంటూ వస్తున్నాడు. ఈనాడు మనం చూడవలసినది 'మానవతా దృక్పథం' బహుజన సంక్షేమం. లక్షలాది ప్రజల్ని నిరాశ్రయుల్ని చేయడం ఒక మంచి పని కాగలదా! అని ప్రశ్నించారు.

పంతులుగారి మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానాన్ని ప్రవేశపెట్టారు. సర్దార్

గౌతులచ్చన్న సభలో చర్యకు అనుమతించబడింది. అత్యధిక సంఖ్యాబలం ఉన్న కాంగ్రెస్ దీనిని అతి చులకన చేస్తూ ఇదొక ఆటపిల్లవాని చర్యగా భావించింది.

లచ్చన్నగారు శాసనసభలో కల్లుగీత పనవాళ్ళ సంకేమంపై కృషి చేయడంతో సరిపెట్టుకొనక, ప్రజాబాహుళ్యంలోనికి వెళ్లి వారి వారి మద్దతను పొంద నభిలషించారు. బహుజన సంకేమం గనుక కమ్యునిష్టు పార్టీకలసి వచ్చింది. వేలాది వర్కర్లు ఉద్యమంలో చేరారు. ఉమ్మడి కమ్యునిష్టుపార్టీ నాయకులు తరిమెల నాగిరెడ్డి, పుచ్చలపల్లి సుందరయ్యలతో లచ్చన్న మంతనాలు జరిపారు. ఆనాటికి శాసనసభలో యునైటెడ్ డెమెక్రటిక్ ఫ్రంట్‌కి చాలినంత సంఖ్యాధిక్యత ఉండేది. ఇక పార్టీలో ఉన్న వారు 12 మంది. ఇక స్వతంత్రులు 5 గురు ఇక కాంగ్రెస్‌లో ఉంటూ లోపాయిగా తనను సమర్ధిస్తున్నవారు నడింపల్లి నరసింహారావు, యన్. శంకర రెడ్డి, అడుసుమిల్లి సుబ్రమణ్యేశ్వర శర్మ, వెంకటశెట్టి, యం. సుబ్బారెడ్డి చివరిలో చిదంబరం కలసి వచ్చారు. ఇంత పోరాట ఉద్యమాన్ని లచ్చన్న గుట్టుగా జరిపారు. నిజానికి అవిశ్వాస తీర్మానం పంతులుగారి మీద కాదు ఉప ముఖ్యమంత్రిగా ఉన్న నీలం జంజీవరెడ్డి గారిమీదే.

గుంటూరులో బహిరంగసభ జరుగుతుంది. లక్షలాది ప్రజానీకం సమావేశానికి హాజరయినారు. యావదాంధ్ర కల్లుగీత పనివారలు వారి వృత్తి పనిముట్లతో సహా వచ్చి హాజరైనారు. లచ్చన్నగారు పంతులుగారికి కూడా మద్యపానం అన్న ఇష్టమే అని వ్యంగ్యోక్తి అనగా ఏఒకరోలేచి అద్భుతగలగా లచ్చన్న వెంటనే నిజమో కాదో ఆయన అబ్బాయినివెళ్లి అడగండి. మీకే తెలుస్తుంది నిజం అని అనగానే సభ గొల్లుమంది.

ప్రభుత్వం ఉద్యమాన్ని అణచటానికి సిద్ధమైంది. వాలంటీర్లను జైల్లో నిర్బందించడం ప్రారంభమైంది. లచ్చన్నగారు జైల్లోకి వెళ్లడం ఏ ఒకరికి ఇష్టంలేదు. అతను వెళ్లిన, ఉద్యమాన్ని నిడిపేదెవరు.

తన సహధర్మచారిణి తన ఆత్మలో ఆత్మ. తన ప్రాణంలో ప్రాణం. తన ఊపిరిలో ఊపిరి అయిన శ్రీమతి యశోదాదేవి ధైర్యంగా ముందుకువచ్చి సత్యాగ్రహం సమరంలో జైల్లోకి వెళ్లటానికి సిద్ధమైంది అయితే ఆమె ఒక్కరే జైల్లోకి వెళ్లడం, చూచిన తణుకు వాస్తవ్యులు యన్. రామరాయవర్మ తన భార్యను సుభద్రాదేవిని కూడా ఆమెతో జైలుకు పంపించారు. రాయవెల్లూరి జైల్లో నిర్బందించారు. ఒక సంవత్సరం జైల్లో గడపవలసి వచ్చింది. ఏ క్లాసు జైల్లో శ్రీమతి యశోదాదేవి గారిని నిర్బందించారు.

బయట ప్రజాఉద్యమం తీవ్రరూపం దాల్చింది. శాసనసభలో అవిశ్వాస తీర్మానం చర్చకు వచ్చింది. నీలకంఠ రామారావు, ఐన శంకరరెడ్డిగార్ల అవిశ్వాస తీర్మానాన్ని బలపరచడం అందిరికి ఆశ్చర్యంలో ముంచెత్తింది. ఆనాడు రావణాసురుడు సీతను తీసుకొని వెళ్ళి అశోకవనంలో ఉంచిన కారణంగానే అంతమయ్యాడు. ఈనాడు లచ్చన్నగారి శ్రీమతిని యశోదమ్మను జైల్లో ఉంచిన మీరు అప్రతిష్ట పాలవుతారని శాసనసభలో ప్రస్తావించారు.

అవిశ్వాస తీర్మానాన్ని సభ్యులు చేతులెత్తి బలపరచాలి. ఓటింగు సమతూకం అయింది. స్పీకర్ సుబ్బారెడ్డి మొగ్గుచూపడంతో ఒక్క ఓటుతో ప్రకాశం మంత్రి వర్గం ఓడిపోయింది. ప్రభుత్వం పడిపోయిన మరుక్షణం జైలునుండి శ్రీమతి యశోదాదేవిని విడిచి పెట్టారు.

ఇన్ని ప్రధాన సంఘటనలతో పాటు మరొక సంఘటన లచ్చన్నగారు ఎదుర్కొన్నారు. తన సొంత పార్టీలోనే తనకెదురయిన వ్యక్తులు తటస్థించారు. గీత పారిశ్రామికులు కుల ఆందోళన జరుగుతున్న దశలోనే ఆంధ్రరాష్ట్ర కృషీవరలోక పార్టీ వర్కింగు కమిటీ సమావేశం బెజవాడలో జరిగింది. లచ్చన్నగారి అధ్యక్షతన ఉద్యమం కొనసాగించడం, కృషీవరలోక పార్టీకి అపఖ్యాతితెస్తుంది అని ఓబుల రెడ్డి వాదించారు. అంతేగాక ఉద్యమం బలపడిన వరకు రంగాజీ రంగంలోనికే రాలేదు. కేవలం సానుభూతిని ప్రకటించినారు.

ఆ సభలో లచ్చన్నను నిలదీసి అడిగారు ఉద్యమాన్ని నడుపుతున్నది కె.యల్.పి. సెక్రటరీ లచ్చన్నగారా! లేదు ''గీత పారిశ్రామికుల సంఘం అధ్యక్షునిగా ఉద్యమాన్ని నడుపుతున్నాను'' అని లచ్చన్న సమాధానం. అంతే కాదు మీకు ఇష్టం లేకపోతే ఇదిగో నా రాజీనామా పత్రం పార్టీ నుండి రాజీనామా చేస్తున్నా తీసికోండి అని పత్రం అందించారు. అంతటితో చర్చలు ముగిసాయి. ఆనాడు లచ్చన్నగారు నిష్క్రమించిన కె.యల్.పి. కృషీవరులులేని కృషికరలోక పార్టీగా మిగిలిపోతుందన్నది అందరికీ తెలిసినదే.

ఆ ఉద్యమంద్వారా మద్యపాన నిషేదం ఎత్తివేయడం లక్షలాది కల్లుగీత పారిశ్రామికుల ఇళ్లల్లో కాంతి రేఖలు వికసించడం జరిగింది. ప్రకాశం మంత్రి వర్గాన్ని లచ్చన్న పడగొట్టాడన్నది ముఖ్యంకాదు. అసంఖ్యాక కల్లుగీత పారిశ్రామికుల భార్యాపిల్లలు వడివీధిని పడకుండా ఆపగలిగిన బహుజన బంధు, బలహీన వర్గాల నాయకుడు సర్దార్ గౌతులచ్చన్న.

# 7వ ప్రకరణము

## ఐక్య కాంగ్రెస్ నిర్మాణము-లచ్చన్న

మంత్రివర్గం పతనమైన తరుపరి రాయవెల్లూరిలో విడుదలయిన ఇతర నాయకులు, మొత్తం అరెస్టు అయిన వారు ఆరువేల మంది. రాయవేలూరులో 40 మంది.

ఇంతలో బారువా నుండి తల్లిగారి మరణవార్త విని కృష్ణానదిని పడవ మీద దాటి మరల బారువా వచ్చి తల్లిగారి అంత్య క్రియలు చేసారు.

లచ్చన్న గారు బారువాలో ఉండగా ప్రకాశం గవర్నమెంటు మారినందున ఎలాగైన రంగాజీని కాంగ్రెస్‌లో కలుపుకోవాలని, లాల్‌బహదూర్ శాస్త్రి, కొత్త రఘురామయ్య, మల్లయ్య కాంగ్రెస్ సెక్రటరీలు ఢిల్లీలో రంగాజీని కలిసి K.L.P. ని రద్దు పరచుకొని కాంగ్రెస్ పార్టీలోనికి వస్తారా? లేక రాష్ట్రాన్ని కమ్యూనిష్టులకు అప్పగిస్తారా, వి. రామకృష్ణగారు కూడా రంగాజీకి సలహాయిచ్చారు.

రంగాజీ వెంటనే ఢిల్లీనుండి K.L.P. రద్దు అని అధ్యక్షునిగా ప్రకటిస్తారు పార్టీనేత. ఆమోదించడానికి KLP కార్యవర్గాన్ని సమావేశ పరుస్తారు విజయవాడలో లచ్చన్న గారికి టెలిగ్రాం యిచ్చారు. బారువాలో ఉన్న లచ్చన్న గారు వెంటనే తిరిగి టెలిగ్రాం యిస్తారు. తల్లి మరణించి యున్నందున మీటింగ్‌కు రాలేనని బెజవాడ ఆఫీసుకు.

లచ్చన్న రానందునకు లచ్చన్న అసంతృప్తిగా యున్నారని గ్రహిస్తారు. విలేఖరులు వచ్చి అడిగారు. K.L.P. ని రద్దు చేసారుగా ఇక కాంగ్రెస్‌లో కలుస్తారా? అన్న ప్రశ్నకు లచ్చన్న రాజకీయాలనుండి విరమించు కోవటం తప్పించి అన్యదా గత్యంతరం లేదని చెబుతారు. పత్రికలో. ప్రకటిస్తారు. ఈ విషయం ఓబులరెడ్డి గారిని పత్రికా విలేఖరులు అడుగగా ప్రజాస్వామ్యాన్ని రక్షించుకోవటానికి ఒక లచ్చన్న గారిని కాదు వందమంది లచ్చన్నలనైన వదలుకోవటానికి సిద్ధమే'' అని అన్నారు.

లచ్చన్న ఉత్తర విశాఖ జిల్లా K.L.P. కార్యకర్తల మీటింగు పెడతారు. ఇంతలో రంగాజీ ఇరువురు రాయబారుల్ని లచ్చన్న వద్దకు అంపిస్తారు. కార్యకర్తలు విజయవాడ వెళ్లమని ప్రోత్సాహించారు. విజయవాడ వారు వెళ్తారు. కాంగ్రెస్ నాయకులు ఎల్లరూ విజయవాడలో సమావేశమైనారు. గుడివాడ సెంట్రల్ బ్యాంకు అతిథి గృహంలో లచ్చన్న దిగుతూ ఐక్య కాంగ్రెస్‌లో K.L.P. ని కలపినట్లుగా

తీర్మానం చేయాలి. నీరుకొండ రామారావు గారిని రంగాజీ లచ్చన్న వద్దకు అంపిస్తారు. తరువాత ఓబులరెడ్డి గారు వస్తారు. రమ్మని పిలుస్తారు. రంగాజీ వద్దకు రాలేదు. మీరు నిర్ణయం తీసుకోండి నేను ఏమీ కాదనను. నాకు రాజకీయాలు వద్దు.

తరువాత చల్లపల్లి రాజావారి బంగ్లాకు తీసుకొని వెళ్లారు. బల్వంత రాయ్ మెహతా, కొత్త రఘురామయ్య, ఏలూరు బంగ్లాలో బసచేసారు. గోపాలరెడ్డి కళావెంకటరావు.

కాంగ్రెసు గ్రూపు అంతా వచ్చి లచ్చన్నను బోధ పరచారు. అయ్యా మీరు ఎందుకు నన్ను బోధ పరచడం, రంగాజీకి ఎన్నడు అడ్డు తగలను. నేను ఇంటికి వెళ్లి పోతాను. కాంగ్రెస్ పార్టీపై విశ్వాస తీర్మానం చేసి నెగ్గిన నేను మరల లోనికి ఎలా వెళ్లగలను. నేను సామాన్యుడను. మీరు పెద్దలు ఎలాగైనా తట్టుకోగలరు.

రంగాజీ ఆ సమయానికి విజయవాడలో నారాయణరావు వారి ఇంట్లో ఉంటారు. లచ్చన్న గారి కళ్లవెంట నీళ్లు వస్తాయి. రంగాజీ ఓదార్చుతారు. కాంగ్రెస్ పార్టీకి వత్తాసు పలకలేను. నన్ను క్షమించండి అన్నారు రంగాజీ నుండి సెలవు పుచ్చుకొని తిరిగి తన బంగ్లాకు వస్తారు లచ్చన్న.

కార్యకర్తలు అంతా వచ్చి మీరు మీటింగునకు రండి రంగాజీని ఎదిరించండి మేము మిమ్మల్ని బలపరుస్తాం అన్న లచ్చన్న వెళ్లలేదు.

ఆ దినం సాయంత్రం గం. 4 30 ని.లకు రామారావు వచ్చి లచ్చన్నను రంగాజీ వద్దకు తీస్కొని వెళ్లారు రంగాజీ లచ్చన్నతో "నీవు కమ్యూనిస్టులకు రాష్ట్రాన్ని అప్పజెప్పుతావా!" అని గద్దించారు.

లచ్చన్న వినయంతో రంగాజీ కమ్యూనిస్టులన్న భయపడాల్సింది కాంగ్రెస్ వారే. K.L.P. లో ఎవరికండీ భూములున్నాయి. పెట్టుబడి దారులున్నది కాంగ్రెస్‌లోనే.

అయితే తీర్మానాన్ని పాతాన్ని మీరే వ్రాయండి అని రంగాజీ అనగానే లచ్చన్న గారే "ఆంధ్రప్రదేశ్ కృషికరలోక పార్టీ తన ఆశయాలకు సిద్ధాంతాలకు విరుద్ధం కాని, ప్రజాస్వామ్య సంరక్షణకై కమ్యూనిస్టేతర పార్టీలతో కలిసి ఎన్నికలలో పాల్గొనుటకు సిద్ధముగా ఉన్నది. ఆసరికే మధ్యంతర ఎన్నికలు ప్రకటించియున్నారు. ఐక్య కాంగ్రెస్‌కి పునాదులు పడ్డాయి—"

## పి.వి.జి.-లచ్చన్న గార్ల ఎన్నికల పొత్తు

మరల బారువా లచ్చన్న చేరుకుంటూ ఆనాటి సోషలిస్టు పార్టీ అధ్యక్షుడు

పి.వి.జి రాజుగారు అనకాపల్లి వెళ్ళి వి.వి.రమణను తీసికొని బారువా చేరుకుంటూరు. వి.వి. రమణ రాజ్యసభ సభ్యుడు (కె.ఎల్.పి.) బారువా బంగ్లాలో పి.వి.జి రాజు లచ్చన్నల ఎన్నికల పొత్తు అంగీకారం కుదిరింది. కె.ఎల్.పి. సోషలిస్టు పార్టీలు రెండు కాంగ్రెస్‌ని ఎదురుగా కమ్యూనిస్టుల నెదురుగా ఎన్నికల ప్రచారం చేయటానికి ఉత్తరాంధ్రలో గల 42 సీట్లకు అంగీకారం కుదిరింది.

బల్వంతరాయ మెహతా ఏలూరులోనుండి కాంగ్రెస్ కమ్యూనిస్టేతర ఇతర పార్టీలతో పొత్తుకు సిద్ధమేనని ప్రకటించారు.

రంగాజీని బెజవాడ వచ్చికలుసుకొని పి.వి.జి. రాజుగారింట్లో కొత్తరఘురామయ్య, తెన్నేటి విశ్వనాధం, రంగాజీ, ఓబులరెడ్డి, గోపాలరెడ్డి, కళా వెంకట్రావు, గొట్టిపాటి వెంకట సుబ్బయ్య వగైరాలు సమకూడారు. ''ఐక్య కాంగ్రెస్'' గా కాంగ్రెస్ కె.యల్.పి. ప్రజాపార్టీ కలిసి ఎన్నికలలో పోటీ చేయటానికి తీర్మానించింది. వెంటనే సీట్ల కోసం బేరసారాలు ప్రారంభించారు. ఎవరి చిహ్నంపై వారే పోటీ చేస్తారు. యునైటెడ్ కాంగ్రెస్ అని నామకరణ మిడివారు. పత్రికల్లో వార్తలొచ్చాయి. బారువాలోనున్న లచ్చన్న గారికి ఒక టెలిగ్రాం యిస్తారు.

లచ్చన్నగారికి అందిన టెలిగ్రాంలో విశాఖ జిల్లాకు సంబందించిన సీట్ల పంపిణి వ్యవహారం మీరు వస్తేనే తప్ప జరగదు అని రంగాజీ యిచ్చారు.

పి.వి.జి. రాజు లచ్చన్న ఎన్నికల పొత్తు కుదిరిన తదుపరే కాంగ్రెస్‌లో కె.యల్.పి. పొత్తుకు అగ్రిమెంటు అయింది.

లచ్చన్నగారు విజయవాడలో కె.యల్.పి. వర్కింగు కమిటీ తీర్మానం వ్రాసిన తేదీకి కాంగ్రెస్ ఏ ఇతర పార్టీతో పొత్తుకు అంగీకరించదని, ఆనాటికి ప్రకటించినందున పొత్తు పెట్టుకోవడానికి, సిద్ధపడదని కమ్యూనిస్టేతర పార్టీలతో కె.యల్.పి. పొత్తుకు సిద్ధమని వ్రాయడం, కమ్యూనిస్టేతర పార్టీలో కాంగ్రెస్ ఎంత మాత్రం ఉండబోదన్నది. ఏ పార్టీ అయిన కె.యల్.పి. లో వచ్చి కలసిన ఫర్వాలేదు. కె.యల్.పి. వెళ్లి ఇతర పార్టీలతో కలియరాదు.

దాని తదుపరే అయిన ఐక్య కాంగ్రెస్ పొత్తునకు వచ్చి అంగీకరించవలసినదిగా లచ్చన్న గారిని పిలిచారు.

టెలిగ్రాంపై లచ్చన్నగారు వెళ్లారు విజయవాడ. సిరీవ్ కంపెనీ రాజా ఇంటికి వెళ్లారు. సమావేశాలచ్చటనే జరిగాయి. కాంగ్రెస్ తరపున గోపాలరెడ్డి, సంజీవరెడ్డి కళా వెంకట్రావు. ప్రజాపార్టీ తరపున విశ్వనాధం. కె.యల్.పి. తరపున రంగాజీ, ఓబుల రెడ్డి. 3వ దినమున లచ్చన్నగారు కలిసారు. సమావేశమునకు కె.యల్.పి

అభ్యర్థుల జాబితాను తయారు చేసావా అని రంగాజీ ప్రశ్నించారు లచ్చన్న గారిని.

అప్పటికి అన్ని జిల్లాల అభ్యర్థుల ఎంపిక పూర్తి అయింది. కాంగ్రెస్ అభ్యర్థుల నింకను ఎంపిక చేయలేదు. ఆనాటికి ఆంధ్ర కాంగ్రెస్ జిల్లాలు 12. 11 జిల్లాలలో కె.యల్.పి. ప్రజాపార్టీ అభ్యర్థులు నిర్ణయం జరిగింది.

ఏ పార్టీవారిని ఏయే సీట్లకు పోటీ చేయటానికి కేటాయిస్తారో తెలియకుండా అభ్యర్థుల జాబితాను ఎలా తయారు చేస్తాం అని లచ్చన్న రంగాజీని ప్రశ్నిస్తారు.

ఏయే సీట్లకు ప్రజాపార్టీ, కె.యల్.పి. పోటీ చేస్తుందో తెలుపుతూ అంపిన జాబితాను కాంగ్రెస్ ఆమోదిస్తే ఆమేరకు పార్టీ అభ్యర్థులు పోటీ చేయడం సరిగాదు. ఐక్య కాంగ్రెస్ అన్ని పార్టీల మధ్య సీట్ల పంపకం జరగాలి. తప్పించి అభ్యర్థుల్ని నిర్ణయించడం సరికాదు. ఏ పార్టీకి ఆ పార్టీ తన అభ్యర్థుల్ని నిర్ణయించాలి అన్నారు లచ్చన్న. అంటూ విశాఖ జిల్లాలో పి.వి.జి. తో చేసుకున్న సంధి పత్రాన్ని సమావేశం ముందుంచుతారు. ఐక్య కాంగ్రెస్‌కు నేను కట్టుబడి ఉండను. విశాఖ జిల్లాలో పి.వి.జి.తో ఎన్నికలపొత్తును నేను పాటిస్తాను అని ఖండితంగా చెప్పారు లచ్చన్న.

రంగాజీ, లచ్చన్నగారి నుండి ఎదురు దెబ్బతినడం ఇది రెండవసారి. కళా వెంకట్రావు, లచ్చన్నతో ''మీ పార్టీనికాదని మీరెలా పి.వి.జి.తో ఎలా పొత్తు కుదిర్చారు'' అనగా ''మీ పార్టీ ఎవరితో పొత్తుపెట్టుకోమని చెప్పి మరల యిపుడు ఇతర పార్టీలతో పొత్తు ఏమిటని'' లచ్చన్న అడిగారు.

ఐక్య కాంగ్రెస్ ఒప్పందాలు భగ్నమైనవి అని పత్రికలు ప్రకటించాయి. ఆంధ్రప్రభ ఎడిటర్ నార్ల వెంకటేశ్వరావు ఒక కార్టూను వేసారు. రంగాజీని ఒక గాడిద మీద కూర్చోబెట్టుకొని ఆ గాడిదను తీసికొని కమ్యూనిష్టుల గుడిసెల్లోని లచ్చన్నగారు ఈడ్చుకొని వెళ్తున్నారు అని వ్యంగ్యంగా వ్రాసారు.

ఐక్య కాంగ్రెస్ చర్చలు విఫలమైనాయి. రంగాజీ అవమానంగా భావించారు.

# 8వ ప్రకరణము

## నెహ్రూ-లచ్చన్నల సమావేశం

బెజవాడ గోపాలరెడ్డి ఆనాటి ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుడు. ఢిల్లీ అధిష్టాన వర్గానికి చర్చలు విఫలమైనట్లు తెలిపారు. ఐక్య కాంగ్రెస్ చర్యలు ఆనాటి రాత్రి విఫలమవడంతో కాంగ్రెస్ నాయకులు, ఢిల్లీలో దీనిని పరిష్కరించాలన్న పథకం వేసి రంగాజీ లచ్చన్నలను ఒప్పించారు. కాంగ్రెస్ అధ్యక్షుడు దొభర్ వైర్‌లెస్ ఆదేశాలు వచ్చాయి. వెంటనే కాంగ్రెస్ నాయకులను ప్రజాపార్టీ కృషీవరలోక పార్టీ నేతల్ని తీసికొని రమ్మని చెప్పారు. నెహ్రూజీ విదేశీ పర్యటనకు వెళ్తున్నందున చర్చలు విఫలమైన దినముననే కార్లపై హైదరాబాదు చేరుకొని బెంగుళూరు నుండి ఢిల్లీ వయా హైదరాబాద్ వెళ్తున్న విమానంపై సీట్లను రిజర్వు చేసినందున నాయకులు ఢిల్లీ చేరుకున్నారు. ఢిల్లీ వెళ్లిన కాంగ్రెస్ పార్టీ నాయకులు బెజవాడ గోపాలరెడ్డి, సంజీవరెడ్డి, కళా వెంకట్రావు ప్రజాపార్టీ తరపున తెన్నేటి విశ్వనాథం, కృషీవరలోక పార్టీ తరపున రంగాజీ, ఓబులరెడ్డి, లచ్చన్నగారు.

నిజానికి విజయవాడ చర్చల్లో లచ్చన్న లేవదీసిన ప్రతిష్టంభన వలననే చర్చల స్థానము ఢిల్లీ చేరింది. నెహ్రూజీ వద్ద సమస్య పరిష్కరించబడాలి. నెహ్రూజీ, సర్దార్‌జీని ఒప్పించాలి లేదా నెహ్రూజీ, లచ్చన్నగారి అభ్యర్ధనను తిరస్కరించాలి.

ఆ ఉదయం నెహ్రూజీతో సమావేశమైనారు. పార్లమెంటు భవనంలో ప్రధాన మంత్రి చాంబర్ సమావేశ స్థలము నెహ్రూజీ చర్చల్ని ప్రారంభించారు. గోపాలరెడ్డి గారు లేచి చర్చలు ఏ దశలో విఫలమైనాయో తెలిపారు.

అన్ని విషయాల్ని విన్న నెహ్రూజీ, మీ అభిప్రాయం ఏమిటని ప్రశ్నించగా జరిగినది అంతా వివరిస్తారు రంగాజీ. చివరకు నెహ్రూజీ లచ్చన్న గారివైపు తిరిగి సర్దార్‌జీ మీ అభిప్రాయమేమిటో చెప్పండి. సర్దార్‌జీ లేచి నెహ్రూజీ ఐక్య కాంగ్రెస్ నిర్మాణ ప్రయత్నాలు జరగక ముందే, అశోక్ మెహతా కాంగ్రెస్‌పార్టీ ఏ ఇతర పార్టీలతో ఎన్నికల పొత్తునకు దిగదని స్పష్టముగా ప్రకటించినందున ఈ నేపద్యమున మేము కాంగ్రెస్, కమ్యూనిష్టు పార్టీలకు వ్యతిరేకంగా ఉన్న ఆంధ్ర సోషలిష్టు పార్టీ అధ్యక్షతన శ్రీ పి.వి.జి. రాజుతో ఉత్తరాంధ్ర మేరకు పరస్పరం ఎన్నికల సహకార సద్భావాల్ని అందించుకొని ఇరుపార్టీల అభ్యర్థుల ఎన్నికకు కృషిచేయాలన్న ఒప్పందాన్ని చేసుకోవడం తప్పనిసరి అయింది. అందువలన జరిగిన ఒప్పందానికి నేను కట్టుబడి ఉండక తప్పదు, అది సరే. మీ అభిప్రాయం చెప్పండి అని అన్నారు నెహ్రూజీ.

ఏ సమస్యపై కాంగ్రెస్ ప్రభుత్వంపై పెట్టినవిశ్వాస తీర్మానం నెగ్గి మధ్యంతర ఎన్నికలకు దారి తీసిందో ఆ గీత పని వారలకు గీత వృత్తుల్ని కలిగించే స్పష్టమైన హామీ ఐక్య కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో మొదటి అంశంగా ఉండాలి.

గుంటూరుజిల్లా రేపల్లె నియోజక వర్గం, కృష్ణాజిల్లా బంటుమిల్లి నియోజక వర్గం ఈ రెండు స్థానాల్లో కె.యల్.పి. అభ్యర్థులే నిర్ణయించాలి నిజానికి ఆ రెండు ప్రాంతాల్లోకి గీత పారిశ్రామిక సత్యాగ్రహ ఉద్యమంలో హెచ్చు మంది గీత పనివాళ్ళు పాల్గొన్నందున కె.యల్.పి. కే ఆస్థానాల్ని కేటాయించాలి.

కాంగ్రెసేతర పార్టీల అభ్యర్థుల జాబితాల్ని కాంగ్రెస్ పార్టీ ఆమోదించాలన్నది కూడదు.

లచ్చన్న గారు చెప్పినదంతా సావధానంగా విన్న నెహ్రూజీ వెంటనే ఏమీ ఆలోచించకనే "లచ్చన్నగారు చెప్పిన విషయాలన్ని సమర్థనీయమే, మనం అంగీకరిద్దాం" అన్నారు. ఐక్య కాంగ్రెస్ "పార్టీ ఎన్నికల ప్రణాళికను లాల్ బహదూర్ శాస్త్రి ఆధ్వర్యమున ఢిల్లీలోనే వీరంతా రూపకల్పన చేయండి" అంటూ కాంగ్రెస్ నాయకుల్ని ఉద్దేశిస్తూ అన్నారు నెహ్రూ.

## ఎన్నికల ప్రచారం

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులు దేభర్ ఆంధ్ర రాష్ట్రం రాగా ఐక్య కాంగ్రెస్ నాయకులు అంతా అతనిని అనుసరిస్తారు. అన్ని జిల్లాల పర్యటన జరిగింది. అయితే పి.వి.జి. రాజుతో చేసుకొన్న ఒప్పందం మేరకు సోషలిష్టు అభ్యర్థులు పోటీ చేసిన స్థానాల్లో ప్రచారానికి కాంగ్రెస్ అధ్యక్షుడు వెళ్ళిన ఒప్పందం మేరకు లచ్చన్నగారు ఆ నియోజక వర్గాల్లో పి.వి.జి. రాజుతో కలసి లచ్చన్నగారు వెళ్లారు. ఈ సందర్భమున ఐక్య కాంగ్రెస్ పక్షాన ప్రజా పార్టీ అభ్యర్థిగా మాడుగుల నియోజక వర్గమున పోటీచేసిన తెన్నేటి విశ్వనాథం ఉత్తరాంధ్రలో కె.యల్.పి. గెలుపొందిన అభ్యర్థులు సోంపేట నుండి లచ్చన్న, ఇచ్ఛాపురం నుండి రంగబాబు, టెక్కలి నుండి నెచ్చర్ల రాములు, కోట బొమ్మాళి కింజరాపు కాష్టమూర్తి, పాలకొండ కొత్తపల్లి పున్నయ్య, పాతపట్నం తులసి నాయుడు, శ్రీకాకుళం చల్లా లక్ష్మినారాయణ, నరసన్నపేట సిమ్మ జగన్నాధం, చీపురుపల్లి నాయుడు, కొత్తూరు విశ్వాసు నరసింహారావు, పాచిపెంట (S.T.) బొబ్బిలి కొల్లి కూర్మినాయుడు, భీమవరం రామేశ్వరం పంతులు, నర్సీపట్నం లచ్చాపాత్రుడు, కొత్తకోట సుంకర అప్పలనాయుడు, చింతపల్లి అనాకాపల్లి భీంశెట్టి అప్పారావు, ఎలమెంచలి పప్పల పాపినాయుడు, బోడవరం రామేశ్వరం పంతులు.

శ్రీకాకుళం జిల్లా పార్వతీపురం నియోజకవర్గంలో ఓడిపోయిన శ్రీ చీకటి పరశురాం నాయుడు, విశాఖ జిల్లా జామిని నియోజకవర్గంలో ఓడిపోయిన గొట్టిపాటి బుచ్చి అప్పారావును శాసనమండలి నుండి K.L.P. వలన M.L.C. లుగ గెలుపొందుతారు.

## ఐక్య కాంగ్రెస్ పార్టీ ఎన్నిక

ఆంధ్ర రాష్ట్రంలో మంత్రి వర్గం ఏర్పాటుకు రంగం సిద్ధమైనది. నాయకత్వము నకు పోటీ జరిగింది. గోపాలరెడ్డి, సంజీవరెడ్డి రహస్య ఓటింగ్ ప్రాతిపదికన ఓటింగ్ జరిగింది. ఎవరికి ఎన్ని ఓట్లు వచ్చాయో చెప్పకుండ గోపాలరెడ్డికి మెజారిటీ వచ్చినట్లు డిక్లేర్ చేసారు ఆనాటి గవర్నర్ చందూలాల్. మాధవలాల్, త్రివేది, గోపాలరెడ్డి గారు ముఖ్యమంత్రిగా వస్తారు. కాంగ్రెస్ పార్టీ నుండి సంజీవరెడ్డి, సంజీవయ్య, గోపాలరెడ్డి, కళారి చంద్రమౌళి, ప్రజాపార్టీ తరపున వి.బి. నాగేశ్వర రావు, రాజమండ్రి కృషీవరలోక పార్టీ తరపున నీరుకొండ రామారావు, శ్రీ సర్దార్ గౌతులచ్చన్న గార్లు పదవీ ప్రమాణ స్వీకారం చేస్తారు.

## రాష్ట్ర మంత్రి వర్గంలో మరల లచ్చన్న

ఈ మంత్రివర్గంలో విద్యుత్‌శాఖ సోషల్ మైనర్‌పోర్టు లేబర్ శాఖల్ని నిర్వహించారు. ఆనాడు మంత్రి వర్గంలో నున్నది ఏడుగురే. ఈనాడు వలె 30 మంది కాదు.

స్పీకర్ ఎన్నికలు కృషికరలోక పార్టీ రొక్కం నరసింహారావుని ప్రతిపాదించింది. కాంగ్రెస్ పార్టీ నుండి శ్రీ బ్రహ్మానందరెడ్డి స్పీకర్‌గా ఎన్నికవటానికి సిద్ధమౌతారు.

బ్రహ్మానందరెడ్డి, సంజీవరెడ్డి అభిమానిగా రంగంలోనికి వస్తారు. అయితే ముఖ్యమంత్రిగా ఎన్నికయిన గోపాలరెడ్డి గారు బ్రహ్మానందరెడ్డిని బలపరచటానికి అంగీకరించలేదు. దీనికి వెనుక ఒక కథ ఉంది. అధిష్టాన వర్గంవారు గోపాలరెడ్డిని ముఖ్యమంత్రిగా డిక్లేర్ చేసిన నిజానికి సంజీవరెడ్డిగారికే పార్టీలో బలముందని, అందువలననే ఎవరికి ఎన్ని ఓట్లు వచ్చాయో ప్రకటించలేదని ప్రచారం బాగానే వచ్చింది. సంజీవరెడ్డి గారికి కూడ ఈ ఆలోచన తన మనసులో బాగానే ఉండేది.

అందువలన బ్రహ్మానందరెడ్డిగారే స్పీకర్‌గా ఎన్నికైన, సంజీవరెడ్డిగారికే పార్టీలో బలముందని తేలిపోతుంది. అందుకు గోపాలరెడ్డిగారు బ్రహ్మానందరెడ్డి స్పీకరుగా ఎన్నుకోబడటానికి అంగీకరించలేదు. అందుకు ప్రత్యామ్నాయంగా బ్రహ్మానంద రెడ్డి ఇతర పార్టీల నాయకులంతా మంతనాలు ప్రారంభించారు. ఒక దినమున స్వయముగా సర్దార్‌జీ ఇంటికి వచ్చి స్పీకర్ ఎన్నికలు తనను బలపరచమని

అభ్యర్థిస్తారు. సాదరంగా ఆతిథ్యమిచ్చిన సర్దార్ జీ పార్టీ నాయకుని ఆదేశం ఉండాలి కదా. రంగాజీతో సంప్రదించి సహాయ పడతామని చెప్పగానే ఇది జరగవి వని లోలోన భావిస్తూనే ఇంటిముఖం పట్టారు.

గోపాలరెడ్డిగారు లచ్చన్నగారిని పిలిచి స్పీకర్ అభ్యర్థిని నిర్ణయించమని కోరగా శ్రీకాకుళంలో గెలుపొందిన రుక్కం లక్ష్మినారాయణ చదువరి, మంచివారు పెడదాం: అనగానే నిర్ణయం జరిగిపోయింది. స్పీకర్‌గా రొక్కం ఎన్నుకోబడినారు. ప్రథమంగా ఉత్తరాంధ్రకు శాసనసభా స్పీకర్ స్థానాన్ని గొనితెచ్చిన ఖ్యాతి సర్దార్ జీకి దక్కుతుంది.

అజ్ఞానాంధకారంలో మునిగి తేలుతున్న తన జాతి వారికి బలహీన వర్గాల వారికి తనే ఒక విజ్ఞాన జ్యోతిగా వెలుగొందిన లచ్చన్న చీకటిలో జీవితాల్ని వెళ్ళిస్తున్న పల్లె ప్రజానీకానికి వెలుగునిచ్చే బృహత్తర మహత్తర అవకాశం లభించింది. విద్యుత్ పథకాలు, విద్యుత్ లైనులు ఏర్పాట్లు చురుకుగా సాగడం ప్రారంభమైనది. ఆనాటి వరకు దీపం చువ్వలను వెలిగిస్తూ దీపం ప్రమిదలతో బ్రతుకుల్ని తెల్లవారిస్తూ రైతాంగం విద్యుత్‌ను పొందే శుభ ఘడియలొచ్చాయి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రమున చీఫ్ ఇంజనీరుగా నుంటూ వస్తున్న శ్రీ సోమయాజులు ఆంధ్ర రాష్ట్రమేర్పడిన తదుపరి ఎలక్ట్రికల్ చీఫ్ ఇంజనీరుగా వచ్చారు. మద్రాసు రాష్ట్రము నుండి ఆస్తుల పంపకం జరుగుతుండగా, మద్రాసు గిండిస్టోర్‌ను గుంతకల్లు స్టోరుకు అసంఖ్యాక మైన వస్తువుల్ని రవాణా చేయించారు.

ప్రతిభావంతుడు సమర్థవంతుడయిన ఆఫీసర్ అయితే కేంద్ర ప్రభుత్వ నేర పరిశోధనా శాఖ అతనిపై కొన్ని అభియోగాల్ని మోపి ఆతనిని సస్పెన్షన్‌లో పెట్టమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరింది.

గవర్నర్ యం. త్రివేది అతనిని గూర్చి చర్చించి నిర్ణయం తీసికోవటానికి ముఖ్యమంత్రి పి.డబ్యు.డి. మంత్రి సంజీవరెడ్డిని ఫైనాన్స్ మినిష్టర్ కళావెంకట్రావు అతను రాగా లచ్చన్న గారిని రమ్మని కబురు పెట్టారు. లచ్చన్న హాజరై అసలు విషయాల్ని తెలుసుకొన్నారు.

ఆ చీఫ్ ఇంజనీర్ తప్పుచేసాడని కేంద్రప్రభుత్వం నేరారోపణ చేసింది. సస్పెన్షన్ చేయక తప్పదు చేయాలి. అయితే ఆతని నుండి ఇకపై అవినీతిగా ప్రవర్తించను అని తీసికొని కొంతకాలం ఆతనిపై చర్య తీసికోవడం లయోపరి చేద్దాం. ఆతని వలన రాష్ట్రమున మనం ఎలెక్ట్రిసిటీకి వ్యాపింపచేసే పథకాల్ని అమలుచేద్దాం ఆతడు ఉమ్మడి మద్రాసు రాష్ట్రమున ఉండిన అనుభవనీయుడు

ఆతని సేవలు మనకవసరం అన్న లచ్చన్న వాదనను అంగీకరించారు.

14 వందల గ్రామాలకు అతి తక్కువ కాలంలో విద్యుత్ సదుపాయాన్ని కలిగించారు.

## గరివిడి గర్భాం గనులు

లచ్చన్నగారు విద్యుత్ శాఖామాత్యులుగా నున్న సమయంలోనే పుట్టపర్తి సత్యసాయిబాబా వారు తెరచిన హాస్పిటల్‌కు విద్యుత్ జనరేటర్‌ను కల్పించారు.

ఉత్తరాంధ్రలో విశాఖ జిల్లా గరివిడి గర్భాం గనులకు దరిగా చీపురుపల్లి వద్ద మార్వాడీ ప్రముఖులు సేట్ దుర్గాప్రసాద్ శ్రీరాంనగర్ పేరున ఒక పెద్ద పరిశ్రమను స్థాపించారు.

భారత దేశమున ప్రథమ 5వ పంచవర్ష ప్రణాళిక రూపొందిన తరుణం ఆ గరివిడి గర్భాం గనులకు విద్యుత్ సరఫరాకానిదే పరిశ్రమ ప్రారంభించబడదు. రాష్ట్ర ప్రభుత్వం రికమెండ్ చేస్తూ కేంద్రానికి అంపిన అది ప్లానింగ్ కమీషన్ ఆమోదించాలి.

రాష్ట్ర స్థాయిలో జరగవలసిన ఈ పనిని స్వయంగా చేయించుకొని వద్దామని షరాబ్ దుర్గా ప్రసాద్ ఆతని మేనేజరు కలిసి హైదరాబాదులో ఆనాటి విద్యుత్ శాఖామాత్యులు లచ్చన్న గారిని కలిసారు.

లచ్చన్నగారు కూడ వెనుకబడిన ప్రాంతంలో నెలకొల్పబడుతున్న ఫ్యాక్టరీ స్థాపనకు ఎంతయిన అభినందించారు. ఇంతలో దుర్గాప్రసాద్ అతని మేనేజర్ ఒక కవరును లచ్చన్నగారికి అందించారు. లచ్చన్నగారు కవరువిప్పి చూడగా అందులో రు. 10,000/- లు ఉన్నాయి.

ముందుగానే ఉన్న దుర్గాప్రసాద్‌ను చూచి లచ్చన్న గద్దించారు. ఇదేమిపనండి, మీరు మమ్మల్ని అంచనా వేసే తీరు ఇదా, వెనుకబడిన తరగతుల నుండి మేము వచ్చిన గుణశీలాల్లో మేము వెనుకబడిన వారము కాము. మీవంటి ధనికులకె ఇటువంటి అల్పమైన భావాలు-సంకుచిత మనస్తత్వాలు ఉంటాయి. ప్రతి ఒకరు డబ్బుకు లొంగితీరుతారన్నది మీ జీవిత సిద్ధాంతము. చూడండి దుర్గాప్రసాద్ మీరు లాభాపేక్షతో ఫ్యాక్టరీ పెడుతున్నారు.-మాకు కావలసింది మా వెనుకబడిన ప్రాంతం భాగుపడగలదన్నది మా అపేక్ష ప్రజాసంక్షేమం జరుగగలదన్న నమ్మకంతో మీ పనిని నేను చేసి సాధిస్తాను. ఇదిగో తీసికోండి అంటూ పదివేల రూపాయిల నోట్ల కట్టను వాళ్ళపై విసిరి కొడతారు.

జరిగిన్న దానికి క్షమాపణ చెప్పుకున్నారు. దుర్గాప్రసాద్ అతని మేనేజర్ ఇంత

జరిగిన లచ్చన్న గారు వారికి పనిచేసి పెడతామనడం వెనుకబడిన ఉత్తరాంధ్ర బాగుపడగలదన్న ఆకాంక్ష లచ్చన్నగారిలో బలీయంగా ఉండటమే.

లచ్చన్నగారు స్వయంగా ఢిల్లీ వెళ్లి ప్లానింగ్ కమీషన్ ఛైర్మన్‌గా వి.టి. కృష్ణమాచారిని కలుస్తారు. అయితే ఛైర్మన్ వలను పడదన్న ఆర్డరుకాపీని లచ్చన్న చేతిలో పెట్టగా ఆవేశానికి లోనైన లచ్చన్న ఆ ఆర్డర్ కాగితాన్ని ఆ ఛైర్మన్ ముఖంపై కొట్టి స్వయంగా కలియటానికి నెహ్రూజీ వద్దకు వెళ్తారు. కారణం ఒకనాడు నెహ్రూజీ అన్నారు కదా! లచ్చన్నగారు ఏనాడు అవసరమైన మీరు వచ్చినన్ను కలియవచ్చని, ఆనాడు ఇచ్చిన హామీ మేరకు లచ్చన్నకు ఇంటర్వ్యూ ఇచ్చారు.

నెహ్రూజీ మేము అధికారంలోనికి రాకమునుపే ప్రథమ పంచవర్ష ప్రణాళికకు రూప కల్పన జరిగింది. అయితే ఈనాడు మేము చట్టబద్ధమైన హక్కుల్ని కలిగియున్నాము. మా అభిప్రాయాల్ని గౌరవించి మేము రికమెండ్ చేసిన పథకాలను ప్లానింగ్ కమీషన్ ఆమోదించి తీరాలి. అంటూ ఆవేశపడుతు మాట్లాడుతూ లచ్చన్నను నెహ్రూజీ వారించి వెంటనే తన సెక్రటరీని పిలిచి గరివిడి గర్భాం గనులకు విద్యుత్ కేంద్రాన్ని కల్పించటానికి అవకాశాలివ్వవలసినదిగా ప్లానింగ్ కమీషన్‌కు ఆదేశిస్తు ఆర్డర్సును జారీ చేస్తారు.

గరివిడి గర్భాం గనులకు విద్యుత్ కేంద్రానికి సమకూర్చిన ఘనత సర్దార్ గౌతు లచ్చన్నగారికే దక్కుతుంది.

## సోషల్ వెల్ఫేర్ మంత్రిగా-లచ్చన్న చేసిన కృషి

ఆనాడు ప్రభుత్వం విద్యార్థినీ విద్యార్థులకు హాస్టళ్లను నడిపేదికాదు. అది ఆనాటి ప్రభుత్వ విధానం కాదు ఏఒకరయిన హాస్టల్ నడుపుతూ ప్రభుత్వం గ్రాంటు పొందవచ్చును. బి.సి. హాస్టల్స్ తక్కువ, హరిజన హాస్టల్స్ చాలా హెచ్చుగా నుండేవి. మద్రాసులో మాజీ సాంఘిక సంక్షేమ మంత్రి వేముల కూర్మయ్య మంత్రిగా మంటూ ఉన్న తరుణంలో ఈ హాస్టల్ని రూపకల్పన చేసారు. హరిజన హాస్టల్స్ మేనేజర్ల మహాసభ రాజమండ్రిలో జరిగింది. ఆ సభకు సోషల్ వెల్ఫేర్ మంత్రిగా లచ్చన్నవెళ్లి ఆ సభలో పాల్గొన్నారు. హరిజన హాస్టల్సు సక్రమంగా నడపబడలేదని, వాటిని స్వాధీనం పరచుకొని ప్రభుత్వమే నడపాలన్న వాదనను లచ్చన్న సమర్థించారు. హరిజన నాయకులు ఒక్కమారుగా అతని మీద విరుచుకు పడ్డారు. లచ్చన్నగారు హరిజన హాస్టల్ని నడుపుతున్న హరిజన నాయకుల్ని దెబ్బకొట్టాలని లచ్చన్న ఈపని చేసాడని ముఖ్యమంత్రి వద్దకు వెళ్లి రాయబారం చేసారు. గోపాలరెడ్డిగారు మొదట్లో లచ్చన్న ప్రతిపాదనను అంగీకరించిన తరువాత

ఆ ప్రతిపాదనను విరమించుకోమని గోపాలరెడ్డిగారు లచ్చన్నగారి నోట్ ఆర్డర్‌పై తెలుపగా ఆ నోట్‌ను త్రిప్పికొట్టి లచ్చన్న ఈవిధంగా వ్రాసారు. గవర్నమెంటు డబ్బు నిరుపయోగం అవుతున్న నాన్ గవర్నమెంటు హాస్టల్సు సక్రమంగా పనిచేయలేదు. దొంగ లెక్కలతో నడపుబడుతున్నవి. అందుకు వాటిని గవర్నమెంటు తీసుకోవాలి. నాయీ ప్రతిపాదనలకు మీరు అంగీకరించకపోయిన, నాఈ పోర్టుపోలియోను కూడా మీరే దయతో స్వీకరించండి అంటూ నోట్ వ్రాసి అంపించారు. ఇంతటితో ఆ కథ ముగిసింది. లచ్చన్న గారి ప్రతిపాదనలను ముఖ్యమంత్రి ఆమోదించారు. ఎయిడెడ్ హాస్టల్స్‌విధానం పోయి ప్రభుత్వమే హాస్టల్సు నడిపే విధానం రావటానికి ముఖ్యకారణం శ్రీ సర్దార్ లచ్చన్నగారే. మొదటగా తాలూకా స్థాయిలోనే జి.ఓ. విడుదలయింది.

## వెనుకబడిన తరగతుల సభ

గుంటూరు వెనుకబడిన తరగతుల మహాసభ అఖిలాంధ్ర స్థాయిలో జరుగుతుంది. ఆనాటివరకు ఆ సభకు అధ్యక్షునిగా లచ్చన్న మంత్రిగా ఉన్నందున వేరొక వ్యక్తిని ఆ సభకు అధ్యక్షునిగా ఎన్నుకోబడాలి. ఆ సరికే గ్రూపు రాజకీయాలు గూడుకట్టుకున్నాయి. వెనుకబడిన తరగతుల మహాసభకు రంగాగారి గ్రూపు నుండి తప్పించాలి. మంత్రి వర్గం గ్రూపు ప్రగడ కోటయ్యను నిలబెట్టించి రంగా లచ్చన్నల అనగాని భగవంతరావును నిలబెట్టారు. రాష్ట్ర ప్రతి నిధుల మధ్య తప్పనిసరి మధ్య ఎన్నికలు జరిగాయి. శ్రీ అనగాని భగవంతరావుని జయం వరించింది.

ఆ సభలోనే రిజర్వేషన్ కోటాపెంచాలని, ప్రమోషన్‌లో కూడ రిజర్వేషన్ అమలు పరచాలని మహాసభ తీర్మానించింది. రిజర్వుడు అభ్యర్థుల్ని ఎంపిక చేసి పెట్టారు. జనరల్ సీట్లు కూడ రిజర్వుడు అభ్యర్థులను కూడ వారి మెరిట్ ప్రాతిపదికగా తీసికోవాలి.

మంత్రిగా మహాసభకు తీర్మానాల్ని ఆసరా చేసుకొని ముఖ్యమంత్రికి ఒక ప్రతిపాదన పంపించారు. ఆ ప్రతిపాదన 14 శాతం నుండి 28% వరకు పెంచాలి. 1951 బి.సి. జనాభా పెరిగింది కావున రిజర్వేషన్ శాతం కూడ పెంచమని కోరారు. ముఖ్యమంత్రి అంగీకరించారు. అయితే ప్రమోషన్‌ల్లో రిజర్వేషన్‌లను అమలు పరచాలన్న దానికి జనరల్ సీట్లకు మెరిట్‌పై బి.సి. లు వచ్చి పోటీపడటానికి అంగీకరించ లేదు.

అయితే లచ్చన్న గారికి అన్ని డిపార్టుమెంటులకు చెందిన డిప్యూటీ సెక్రటరీలతో చర్చించి, ఒక నిర్ణయానికి రావలసినది ముఖ్యమంత్రి. లచ్చన్న గారిని

కోరతారు. లచ్చన్నగారి అధ్యక్షతన సమావేశంలో ఎంతో ప్రాముఖ్యత గల పాత్ర నెరవేరుస్తారు. ప్రమోషన్‌లో రిజర్వేషన్లు అమలుపరచిన పరిపాలనా సిబ్బంది సామర్థ్యం కొరవడుతుందన్నది నిజంకాదని ఏకగ్రీవంగా తీర్మానం చేసారు. ఈ మేరకు జి.ఓ. జారీ చేయబడింది.

## కార్మికశాఖను చేపట్టిన లచ్చన్న

కార్మికమంత్రిగా లచ్చన్న ప్రతి ఒక కార్మిక సంఘాన్ని చైతన్యపరచాలి. త్రిపాక్షిక సంఘం ఏర్పాటుచేసారు. 1) గవర్నమెంటు 2) మేనేజ్‌మెంట్ 3) కార్మిక సంఘాల లచ్చన్న ప్రతిపాదించిన ఈ ప్రతిపాదనల వలన రాష్ట్రాలలో సమ్మెలు తన కాలమున జరగలేదు.

డుడుమా వాటర్‌ఫాల్ వలన వచ్చిన ఒరిస్సా-ఆంధ్ర తగవుల్లో లచ్చన్న మధ్యవర్తిగా వెళ్తారు. మాచ్‌ఖండ్ ప్రాబోర్డుకి తగువు వచ్చిన నివేదించాలి తప్పించి ఏకపక్ష నిర్ణయం చేయరాదని మాచ్‌ఖండ్ ప్రాజెక్టు నిర్మాణంలో తగిన ప్రాతినిధ్యం తీసికొన్నారు. ప్రప్రథమంగా కాలనీలు అనేవి నిర్మించడం అన్న విధానాన్ని మొదటిగా ప్రవేశపెట్టింది మంత్రిగానున్న సర్దార్ లచ్చన్నగారే. శ్రీకాకుళం జిల్లా సోంపేటలో కాలనీ గిరిజనులకు నిర్మించారు. కిల్లాయి గ్రామం గిరిజనులకు కృష్ణాజిల్లా బెజవాడవద్ద పారిశ్రామికల కాలనీ నిర్మించారు. ఇళ్లు ఏ పద్ధతిలో ఉండాలన్నది, మోడల్స్ కట్టిస్తారు. కాలనీలు కథాప్రారంభమౌతుంది. నెల్లూరు తన పర్యటనలో హరిజనులు తాము సరుగుడు తోటలను ఒక మాజీమంత్రిగారు ఆ భూములను ఆక్రమించినారని తెలపగా వెంటనే ఆ భూములపై పట్టాలు దాఖలుపడేలా చూసారు. భూమిలేని నిరుపేదలకే భూములపై పట్టాలు యివ్వాలి తప్పించి, భూవసతి గల భూస్వామలకు పట్టాలు యివ్వడం సరికాదని, ముఖ్యమంత్రిగారికి ప్రతిపాదనల్ని పంపించారు. ఆ మాజీమంత్రి బెజవాడ గోపాలరెడ్డి శిష్యుడు ప్రకాశంగారి గవర్నమెంటులో అటవీశాఖామంత్రి. 11/2 సంవత్సరకాలములో ఆ మాజీమంత్రి ఎన్నిమార్లు వచ్చి లచ్చన్నగారిని దర్శించుకున్న ఫలితం దక్కలేదు.

అయితే ఆంధ్రరాష్ట్ర ఆంధ్రప్రదేశ్‌గా అవతరించిన తదుపరి సదరు మాజీమంత్రి గారి పేరువే ఆ భూములకు పట్టాలిస్తారు. రెవెన్యూమంత్రి కళావెంకట్రావు ముఖ్యమంత్రి సంజీవరెడ్డి ఈ ఇరువురు వచ్చిన తదుపరే భూములపై పట్టాల్ని ఆ మాజీమంత్రి పొందారు అని లచ్చన్న అన్నారు.

## మైనర్ పోర్టుమ నిర్వహించే మంత్రిగా లచ్చన్న

చాలవరకు అభివృద్ధివి రవాణా సదుపాయాల్ని కల్పించటానికి బంగాళాఖాతంలో అన్నిమైనర్ పోర్టుల్ని మరల బాగుపరచాలి. గోపాలపురం బారువా

కళింగపట్నం, పూడిగి, భీమునిపట్నం, కాండ్ల రేవుల్ని బాగుపరచాలన్న ప్రతిపాద నలను రూపొందించారు.

## ఎలక్ట్రిసిటీ స్కీముల ప్రతిపాదన కళావెంకట్రావు-లచ్చన్నల వాగ్వివాదం

పల్లెల్లో, మూల మూలల్లో విద్యుత్ నెలకొల్పాలని లచ్చన్నగారి ఆశయం. ఆనాటికి శ్రీకాకుళంలో తప్ప మరి ఎచట విద్యుత్ లేదు. లచ్చన్నగారే ఈనాటి ఉత్తరాంధ్ర ముఖ్యపట్టణాలకు విద్యుత్ నిచ్చారు.

పల్లెల్ని విద్యుత్‌తో నింపాలన్న ఆకాంక్షతో లచ్చన్న కాంగ్రెస్ చేసిన పథకాలు అసంఖ్యాకంగా రూపొందాయి. బడ్జెట్ ఫండ్స్ ఏనాడో అయిపోయేవి. మరి స్కీములో అమలుపరిచేదెలా?

మంత్రివర్గంలో ఈ సమస్య వచ్చింది. కళావెంకట్రావు ఆర్థికమంత్రి లచ్చన్న గారు ముందుపడి కరెంటు స్కీముల్ని అమలుపరచడం కంటగింపుగా నుండేదట. అయితే మంత్రివర్గంలో లచ్చన్న స్కీములకు మనం డబ్బు యివ్వకపోయిన ప్రస్తుతం మనవద్ద డబ్బులేకపోయిన, మనం స్కీముల్ని Approval చేద్దాం అనగానే డబ్బు మంజూరులేనిదే స్కీములు Approve ఎందుకు అని కళావెంకట్రావు స్కీములో Approval అయిన తదుపరి డబ్బు ఉన్నపుడు అమలుచేయొచ్చని లచ్చన్న వాదన నెగ్గింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత ఒక సంవత్సరం వరకు ఆనాడు లచ్చన్న మంత్రివర్గం Approve చేసిన స్కీముల్ని అమలుపరచిన పరిస్థితి వచ్చింది.

## హరిజన సమస్యలపై లచ్చన్న

వ్యక్తిగత సమస్యల్ని కూడా లచ్చన్నగారు తీర్చేవారు. ఒక హరిజనుడయిన కలెక్టర్‌కు రివర్షన్ వచ్చింది. సంజీవయ్య వద్దకువెళ్లగా లచ్చన్న వద్దకు వెళ్లిన నీకు సహాయం అందగలదని సలహాయిచ్చారు.

లచ్చన్నగారు కలుగచేసికొని ముఖ్యమంత్రితో అతనిని సెక్రటేరియట్‌లో డిప్యూటీ సెక్రటరీగా వేయించారు.

## పబ్లిక్ పిటిషన్స్‌పై లచ్చన్న

తన మంత్రివర్గంకి సంబందించిన పబ్లిక్ పిటిషన్స్ తను స్వయంగా వెంటనే పరిష్కరించటమేగాక, ఏ ఇతర మంత్రికి ఏ ఒకరు వచ్చి పిటిషన్ యిచ్చిన ఆ యిచ్చిన వారిని తీసికొని ఆ మంత్రులవద్దకు వెళ్లి వారి సమస్యల్ని తీర్చమని అడిగే ఉత్సాహం అతనిలో ఉండేది.

ఐక్య కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడిన వెనువెంటనే ఢిల్లీలో రంగాజీ ఆల్ ఇండియా కృషికరలోక పార్టీ సమావేశాన్ని ఏర్పాటుచేసి ప్రతిఒక వర్కింగ్ కమిటీ మెంబర్‌కి టెలిగ్రాం యిస్తారు. ఐక్య కాంగ్రెస్‌లో కృషికరలోక పార్టీని కలిపి వేయటానికి చర్చలు వెంటనే రమ్మని పిలుపుఇచ్చారు.

పిలుపునిచ్చిన లచ్చన్నగారు ఢిల్లీ వెళ్ళలేదు. ఎలాను ఐక్య కాంగ్రెస్‌లో కృషీవరలోక పార్టీ కలసిపోతుంది. ఇక తను వెళ్లిన వెళ్లకపోయిన జరుగవలసిన అదే. అంతటితో కృషికరలోక పార్టీ రద్దు అవుతుంది.

ఇక మంత్రివర్గంలో ఉన్న సర్దార్ గౌతులచ్చన్న, నీరుకొండ రామారావు ఇరువురు కె.యల్.పి. వారసుని చెప్పుకోవటానికి చట్టబద్ధంగా ఆధారం లేక ఐక్యకాంగ్రెస్ వారిగనే ఉండాలి. అయితే లచ్చన్నగారి నోటి బలంవల్ల ప్రత్యేకమైన వ్యక్తిత్వంవల్ల కె.యల్.పి. రద్దుఅయిన ఆనాటి నుండి కె.యల్.పి. లో ఉంటూ వస్తున్నమేము ఒక పార్టీవారంగనే ఆనాడు ఈనాడు ఏనాడు ఉంటామని, వారిది త్రోవఅని నిరూపించేవారు. నీరుకొండ రామారావు మరణించగా, ఆసీటు ఓబులరెడ్డిగార్కి ఇమ్మని గట్టి ప్రయత్నం చేసారు. ఆనాటి ఢిల్లీ కాంగ్రెస్ అధిష్టానవర్గం వల్లభపంత్ వద్దకు లచ్చన్నగారు వెళ్లి, ఓబులరెడ్డిగారిని ఖాళీ అయిన స్థానంలోకి వేస్తారా, నా రాజీనామా లేఖను స్వీకరిస్తారా అని ప్రశ్నించారు. వెంటనే ఓబులరెడ్డిగారిని మంత్రివర్గంలోకి తీసుకొన్నారు. లచ్చన్నగారు ఏపని చేపట్టినా తలపెట్టిన తన పట్టును పంతాన్ని చేతల్లో చూపిస్తారు తప్పించి వ్రాతల్లో రాజకీయ రణంలో దూకరు.



మంత్రి జె.వి. నరసింహారావుతో - అచ్చన్న (1968)





# 9వ ప్రకరణము

## 1955 భాషాప్రయుక్త రాష్ట్రాల పునర్విభజన

1953 అక్టోబరు ఆంధ్రరాష్ట్రం అవతరించిన అమృతఘడియల్లోనే భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడితేనే ప్రత్యేకజాతి వ్యక్తిత్వం వారసత్వం సంస్కృతి భాషాచారిత్రక విషయాలు బాగా స్పష్టపడుతాయన్నది ఆంధ్రలో బలీయమైన ప్రజాభిప్రాయంగా ఏర్పడింది.

భారతదేశంలో భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడేభావనకు రూపమిచ్చి అఖిలభారత దేశ స్థాయిలో వాటిని ఏర్పడే జనాభిప్రాయమిచ్చింది ఆంధ్ర ప్రజానీకమే. 1953 డిసెంబర్ 22వ తేదీన నెహ్రూగారు లోక్‌సభలో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణను బాషాసంస్కృతుల పరంగా ఏర్పరచ ఒక సంఘాన్ని నియమిస్తున్నట్లు ప్రకటించారు. ఆ సంఘానికి అధ్యక్షులు ఫజులాలీ-కుంజా-ఫణిక్కర్ సభ్యులు.

తెలంగాణాతో ఆంధ్రతో కలిపి హైదరాబాదు రాజధానిగా చేయాలన్న వాదన ప్రత్యేక తెలంగాణా ఏర్పడాలన్న వాదన పోటీపడి వర్గాల్ని ఏర్పరచగా కమ్యూనిష్టు పార్టీ విశాలాంధ్ర కావాలని ఉద్బోధించింది. రజాకారుల ప్రమాదం తొలగిన తదుపరి 1951లో పార్టీపైనున్న నిషేదం తొలగింది. 1952 ఎన్నికల్లో కమ్యూనిష్టులు తెలంగాణాలో కాంగ్రెస్‌పై గట్టిపోటీగా నిలచిన కాంగ్రెస్ హెచ్చు స్థానాలుపొంది నందున తెలుగువాడే ముఖ్యమంత్రి కావాలని భూర్గుల రామకృష్ణారావుని అధిష్టాన వర్గం నిర్ణయించింది. విశాలాంధ్ర స్థాపన కోరిక ఒకనాటిదికాదు. అయ్యదేవర కాళేశ్వరరావు 1949లో నినాదమివ్వగా అదే సంవత్సరమున చక్రవర్తి రాజగోపాలాచారి కూడ "రాష్ట్రం" పలుబాషా ప్రాంతంగా ఉండటంలో తప్పులేదన్నారు. 1951లో నెహ్రూగారితో యీ విషయం చర్చించిన ఒక కాంగ్రెస్ నేతను తప్పని మందలించారట. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తదుపరి కమ్యూనిష్టులు అదికారంలోనికి రాకుండ, గట్టి వ్యూహాన్ని ఎత్తుగడను కృషికరలోకపార్టీ ప్రజాసోషలిష్టుపార్టీలు వేశాయనడంలో విప్రపత్తి లేదు. విశాలాంధ్ర ఏర్పడిన తమకధికారం వస్తుందన్నది ఆనాటి ఉమ్మడి కమ్యూనిష్టు పార్టీ అభిప్రాయం కావచ్చు. వీరు ఒకే జాతి ప్రజ. అనేక విభాగాలుగా పరిపాలించడంలో అనైక్యతలు, అసమానతలు తలెత్తగలవన్నది వారి అభిప్రాయమే. విశాలాంధ్ర స్థాపనకై కృషి సలిపిన మహనీయుడు పుచ్చలపల్లి సుందరయ్య.

విశాలాంధ్ర స్థాపన మంచిదే అని ప్రకటనలిచ్చిన కొద్ది కాలంలోనే హైదరాబాదు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు కొండా వెంకట రంగారెడ్డిగారు వారి మేనల్లుడు చెన్నారెడ్డి వారి వాదనల్నిమార్చి ప్రత్యేక తెలంగాణా కావాలని గట్టిపట్టు పట్టారు. ప్రజాందోళనకు దిగారు.

1955 సెప్టెంబరు 30వ తేదీన ఫజులాలీ సంఘం, కేంద్రానికి తమ నివేదిక అందచేసింది. హైదరాబాదు రాష్ట్ర విభజన సర్వోత్తమమని ప్రకటించింది. ముక్కోటి ఆంధ్రులు ఒక్కటిగా నిలుస్తారు. నీటి విద్యుచ్ఛక్తి ఖనిజసంపద ముడిపదార్థాలు వెనుకబడిన ప్రాంతానికి లభిస్తాయి. రాజధాని సమస్య తీరుతుంది. కృష్ణ గోదావరి నదుల అభివృద్ధికి ఆటంకాలుండవు. ఆహార ధాన్యాల కొరత తెలంగాణా ఏర్పాటువాదన లలో కూడ బలముందని రాజకీయ మాటలను వర్ణించింది. తెలంగాణా తలసరి ఆదాయం హెచ్చు. తెలంగాణా ఆర్థిక స్థితి దెబ్బతినగలదు. విద్యారంగంలో వెనుకబడిన తెలంగాణా ప్రాంతంలో కోస్తా ఆంధ్ర ప్రాంతానికి చెందిన విద్యార్థులు ప్రవేశిస్తారన్నది వారి ఆందోళన. తెలంగాణా ఆంధ్రకు వలస భూభాగము అయిపోతుందేమోనన్న దివారి భయం.

ఏది ఏమైన విశాలాంధ్ర అనివార్యం, అవసరమనీ సంఘం అభిప్రాయ పడింది. తుదకు వారి నిర్ణయం హైదరాబాద్ ప్రత్యేక రాష్ట్రంగా ఉంటూ 1955లో జరిగే ఎన్నికల తరువాత హైదరాబాదు రాష్ట్రంలోని శాసనసభలలో 3/2 వంతు సభ్యులు అంగీకరిస్తేనే ఆంధ్రలో తెలంగాణాను విలీనం చేయాలి. ఇదీవారిచ్చిన నివేదిక.

ఆ రాష్ట్ర రాజకీయ నాయకులను హైదరాబాదు (తెలంగాణా) రాష్ట్ర రాజకీయ నాయకులకు ఒక పెద్ద పనితగిలింది. తర్జన భర్జనలు జరిగాయి. వాదోపవాదాలు చెలరేగాయి. లాభనష్టాలు అంచనావేయబడ్డాయి. ఎన్నిచేసిన తెలుగువారు అంతా ఒకటే అన్న చారిత్రక సత్యాన్ని బాషాసాంస్కృతిక వారసత్వాన్ని ఏ ఒకరు ప్రతిఘటించలేక పోయారు. ఎన్ని ప్రజాందోళనల్ని నడిపిన అది నావుగా నిలచాయి తప్ప బలుపుగా పుంజుకోలేకపోయాయి.

కమ్యూనిష్టులు 'విశాలాంధ్ర'ను ఏర్పరుస్తారా. లేదా మా పదవులకు రాజీనామా లిస్తాం. మరల ప్రజల్లోకి వెళ్తాం అంటూ ప్రకటించారు. రంగారెడ్డి, చెన్నారెడ్డి ఇరువురు తెలంగాణా ప్రజానీకానికి జీవనాడులుగా నుండగలరన్నది ఆనాడు ఏ ఒకరు కాదనలేని విషయం. తెలంగాణా 10 జిల్లా కాంగ్రెస్ సంఘాల్లో 7 జిల్లా కాంగ్రెస్ సంఘాల విశాలాంధ్రను సమర్థించాయి.

ఇక ఆయాప్రాంతంలో గల రాజకీయ నాయకులెల్లరు కృషికరలోక పార్టీనాయకులు గౌతు లచ్చన్నగారితో సహా అందరూ విశాలాంధ్ర స్థాపనకై అర్రులు చాచారు అహర్నిశలు శ్రమించారు. ప్రథమ దశలో మాత్రం రంగాజీ రాజకీయ ఎత్తుగడలో నొక భాగంగ విశాలాంధ్రను కాదని ప్రసంగించారు. తదుపరి తన ధోరణిని మార్చుకొన్నారు.

దేశంలో [illegible] కమీషన్ ఇచ్చిన రిపోర్టు కొన్ని చిక్కులను తెచ్చిపెట్టింది. అనేక

ప్రాంతాల్లో నూతన ప్రమాద ధోరణులు దేశవిచ్ఛిత్తికి దారితీసే ప్రకటనలు ప్రజాందోళనలు ప్రారంభించబడినాయి.

అయితే కేంద్ర ప్రభుత్వం ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలు ఒకే రాష్ట్రంగా ఉండాలన్న వాదనను అంగీకరించాయి. ఆ సరికే హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రిగ నున్న బూర్గుల రామకృష్ణారావు, విశాలాంధ్ర స్థాపనకే మొగ్గు జూపినారు. రంగారెడ్డి, చెన్నారెడ్డి ఇరువురు ఆంధ్ర తెలంగాణాలు ఒకటవటానికి అడ్డు చెబుతూ వచ్చారు మొదట్లో.

కారణాలేమిటి రంగారెడ్డి అకళంక దేశభక్తుడు. చెన్నారెడ్డి ప్రాంతీయాభిమానంతో ప్రజల అభ్యుదయాన్ని కాంక్షించే రాజకీయ నాయకుడు. ఆ ఇరువురు సందేహిస్తున్నారని తెలంగాణాలో అత్యధిక ప్రజానీకం ఆంధ్రలో కలియటానికి సందేహిస్తున్నారనేగా అయితే అభిప్రాయ భేదాలు తొలగిపోవాలి.

అందులో ఒక ప్రయత్నమే పెద్ద మనుషుల ఒప్పందం ఆంధ్ర, తెలంగాణా రాజకీయ నాయకులమధ్య జరిగాయి.

## పెద్దమనుషుల ఒప్పదంలో ఒక పెద్దగా గౌతులచ్చన్న

తెలంగాణా రాజకీయ నాయకులు ఆంధ్ర రాష్ట్రరాజకీయ నాయకుల నుండి కొన్ని హామీలను కోరింది. ఒప్పందం జరగాలని ఆశించింది. ఆంధ్రరాష్ట్రం తరపున ఎవరు తెలంగాణాకు హామీ లిస్తూ ఒప్పందం జరపగలరు తెలంగాణా తరపున ఎవరు ఆంధ్ర నుండి హామీలను పొందగలరు. నాటి ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రులే ఒప్పందం చేసుకోవాలి.

అయితే ముఖ్యమంత్రులే శాశ్వతంకాదు. వారికి రాజకీయ హోదా పదవి ఉన్నా లేకున్న వారు ఆయాప్రాంతాల్లో పెద్ద మనుషులే రాజకీయ నాయుకలే. ప్రజాప్రతినిధులు ప్రజాభిమానులు ప్రజాశ్రేయోభిలాషులు.

ఆంధ్ర ప్రజలతరపున ఒప్పందానికి ఒడంబడికను సిద్ధపడినారు. సర్దార్ గౌతులచ్చన్న, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి, సత్యనారాయణరాజు గారు తెలంగాణా ప్రజలకు ఆంధ్రులనుండి భరోసాలనందుకొన బోతున్నవారు, బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరెడ్డి, మర్రి చెన్నారెడ్డి, జె.వి. నరసింగరావు ప్రభుతులు ఈ ఒప్పందం ఎవరి మధ్య జరిగింది బలహీనులు బలవంతుల మధ్య కాదు ఒప్పందం అలా జరిగిన అది ఎన్నటికి సఫలంకాదు. సరి సమానులమధ్యనే సంధి ఒప్పందం అనేది కుదురుతుందని ప్రాచీన భారతీయత రాజకీయ తాత్విక ఆచార్య చాణక్యుడు ప్రవచించాడు.

అయితే విచిత్రమేమన ఆనాడు జరిగినన ఒప్పందం ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌తో

హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్‌తో జరిగిందని చెప్పడంలో విప్రపత్తి లేదు. అందరూ కాంగ్రెస్ పార్టీ నాయకులె ఒక్క సర్దార్ గౌతులచ్చన్న గారు తప్పించి నిజానికి లచ్చన్నగారు కూడ ఆనాటికి ఐక్య కాంగ్రెస్‌వాది. దేశాన్ని పాలిస్తున్నది కాంగ్రెస్ పార్టీ అట్టి కాంగ్రెస్ పార్టీ నాయకుల మధ్యజరిగిన ఒప్పందం కలకాలం నిలువగలదని భావించారేమో. ఒప్పందంలో తెలంగాణా ప్రయోజనాలకు రక్షణలు కల్పించారు.

## ఒప్పందంలోని షరతులు

తెలంగాణా ఆర్థిక మిగుల నిల్వలను తెలంగాణాలోనే ఖర్చు చేయాలి.

మద్య నిషేదం ఆ ప్రాంతముల శాసనసభల అభిప్రాయం మేరకే అమలు.

తెలంగాణా విద్యార్థుల విద్యావసతులకు రక్షణ.

ఆ ప్రాంతములోగల విద్యామేధావుల్లో ఆ ప్రాంతం వరకే ప్రాతినిధ్యం. ఉద్యోగ నియామకాల్లో జనాభానిష్పత్తిని తీసికోవాలి. 12 ఏండ్లు స్థిర నివాసమున్నగాని తెలంగాణాలో ప్రభుతోద్యోగమివ్వరాదు (స్థిరనివాస నిబంధనలు) తెలంగాణాకు ఒక ప్రాంతీయ సంఘం ఏర్పడాలి. రాజ్యాంగబద్ధమైన అధికారాలుండాలి. ప్రణాళిక అదివృద్ధి విషయాల నిర్ణయం ప్రాంతీయ సంఘాని కుండాలి. కేబినేట్ మంత్రుల సంఖ్యలు ఆంధ్రులకు తెలంగాణాకు 3-2 నిష్పత్తి ఉండాలి. ఆంధ్ర ప్రాంతానికి చెందిన వ్యక్తి ముఖ్యమంత్రి అయిన తెలంగాణా వ్యక్తి ఉప ముఖ్యమంత్రిగా ఉండాలి. తెలంగాణా వ్యక్తి ముఖ్యమంత్రి అయిన ఆంధ్ర ప్రాంతం వ్యక్తి ఉప ముఖ్యమంత్రి.

పై ఒప్పందంపై సంతకాలు చేసినపై పెద్దమనుషులు రాజకీయపార్టీల నాయకులుగా గాక అధికార హోదాల్లో ఉన్నారనిగాక, ఒక్కొక్క ప్రాంతానికే ఆ ప్రాంతాం ప్రజల అభిప్రాయానికి అభీష్టాలకు ప్రతిరూపులని చెప్పడంలో అతిశయోక్తి లేదు. రాయలసీమ, ఉత్తరాంధ్ర కోస్తాప్రాంతాల తెలంగాణాలో ముఖ్యమైన ప్రాంతాలకు వారానాడు ప్రతినిధులు ప్రజలకు జవాబుదారులు.

ఆంధ్ర తెలంగాణా రాష్ట్రంగ పేర్కొన్న, ప్రాంతీయ శక్తులను ప్రవేశిస్తుందని ఆంధ్రప్రదేశ్ గా పేరిడినారు. ఈ ఒప్పందానికి భారత ప్రభుత్వం శాసనపరమైన రక్షణ కల్పించింది.

## 1957 లచ్చన్నగారిపై నేరారోపణల పర్వం

సర్దార్ గౌతులచ్చన్న గారు 1956లో రాష్ట్ర రాజకీయాల్లో పేరెన్నికగన్న రాజకీయ నాయకునిగా ఒక పార్టీనేతగా చెప్పుకోదిగిన స్థానానికి చేరుకొన్నారు. ఆంధ్ర తెలంగాణా రాజకీయ నాయకుల మధ్య జరిగిన ఒప్పందంలో భాగస్వామి ఒక పెద్ద మనిషి, ఒక గ్రామానికి ప్రాంతానికి కాదు ఆంధ్ర రాష్ట్రానికే. భావించి నందువలననే

కదా ఆ అర్హతలు స్థాయి, దేశభక్తి ఉన్నందువలననే కదా పెద్ద మనుషులు ఒక పెద్ద మనిషిగా ఒప్పందంలో సంతకం చేసారు. అనాటి రాష్ట్రాల మధ్య ఏర్పడిన ఒప్పదంపై రాష్ట్రంలో ఆనాడొక పెద్దమనిషిగా రూపొందిన మరుక్షణమే లచ్చన్నగారిపై కొద్ది బుద్ధులు గల వారు అభియోగాల్ని మోపటానికి ఆయుత్తమయినారు. ఏఒకరికైన నిజానికి ఉన్నతస్థానానికి చేరబోతున్న సమయంలోనే సంకుచిత దురభిమాన అసూయ శక్తులు అడ్డువచ్చి వారికి అవరోదాల్ని సృష్టిస్తుంటాయి.

కులం తక్కువ వారింట్లో జన్మించినవ్యక్తి కులాలను, మతాలను అధిగమించి, బలహీనవర్గాల నాయకుడయి, బహుజనబందుగా ప్రజలచే వేనోళ్ల కొనియాడబడటం సాటి రాజకీయ నయకులకు నచ్చలేదు. తన పార్టీలో తనతోనున్న రాజకీయ నాయకులకే ఈర్ష్య ద్వేషాలు జనించాయేమో, ఉత్తరాంధ్రలో ఏమూలాన జన్మించిన వ్యక్తి ఒక రాజకీయశక్తిగా విజృంభించి రాష్ట్రస్థాయిలోనే ఒక పెద్దమనిషిగా రూపొంది కేంద్రంలో నున్న కాంగ్రెస్ అదిష్టానవర్గం దృష్టినే ఆకర్షించే స్థితిగతులకు నెలకొల్పుకుం టున్న నాటి సర్దార్ గౌతు లచ్చన్నగారిని అభియోగాల ద్వారా నేరారోపణల ద్వారా కించపరిస్తేనే తప్ప అధిష్టాన వర్గానికి లచ్చన్న నైతిక పరుదుకాదన్న భ్రమను కలిగిస్తేనే తప్ప తమ ఆటలుసాగవని తమకు అధ్యక్షత రాజకీయపదవులు రావని, బలహీన వర్గాల నాయకుడు రాజకీయంగా బలవంతుడై ఆంధ్రప్రదేశ్‌లోనే రాజకీయాధికారాన్ని చేజి క్కించుకొని తమవంటి పెద్ద కులాల వారికి ప్రాముఖ్యత లేకుండా చేసేస్తాడేమోనన్న భయభీతులు కుమ్ముకున్నాయి కొందరికి! వారెవరో సాధారణ వ్యక్తులుకారు. ఆరితేరిన రాజకీయ నాయకులే.

రంగాజీ ఆల్ ఇండియా స్థాయిలో ఏర్పడిన కృషివరలోక పార్టీని ఢిల్లీలో సభను ఏర్పాటుచేసి రద్దుచెస్తారు. పిలుపువచ్చిన లచ్చన్న ఢిల్లీ వెళ్లలేదు. మంత్రి వర్గంలో నున్నలచ్చన్న, .నీరుకొండరామారావు ఐక్యకాంగ్రెస్ అని పేరిదుకోవాలి. తప్పించి కె.యల్.పి. వారమని చెప్పుకోవటానికి మరి వీలులేదు. ధృడమైన ప్రాతిపదిక పోయింది. ఇక ఐక్యకాంగ్రెస్ నామమాత్రమే. మంత్రి వర్గం కాంగ్రెస్ పార్టీవారిది ఐక్య కాంగ్రెస్ అన్నదే అందులో లేదు. నీరుకొండ రామారావు మరిణిస్తూ వారి స్థానంలో ఓబులరెడ్డిని అధిష్టాన వర్గంతో ఒప్పించి వేయించినది లచ్చన్నగారే అన్నది అందరిలో ధృడపడింది.

అంతేగాదు రాంగాజీ సతీమణి భారతీదేవి రంగాకు రాష్ట్రమంత్రి వర్గంలో స్థానం యివ్వాలని ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ భావిస్తున్న, అందుకు లచ్చన్నగారే లోలోన అడ్డు తగులుతున్నారన్న అపోహను రంగాజీలో సృష్టించడానికి ఆనాటి లచ్చన్నను ప్రతిఘటి స్తున్న శక్తులు ప్రయత్నించాయి. లచ్చన్నగారు కె.యల్.పి. నుండగా బలీయమైన

స్థానాన్ని రాజకీయంగా సంపాదించుకొన్నారు. ఐక్య కాంగ్రెస్‌కు లచ్చన్నను వద్దుబాబో అంటున్నా అందులోదించి, తన రాజకీయ పరువును తూర్పార పట్టబోయారు.

లచ్చన్నపై ఇరువైపుల నుండి అనుకూల ప్రతికూల పవనాలు వీచాయి. పార్టీగాని పార్టీఐక్య కాంగ్రెస్‌లో ఉంటూ తనేమీ సాధించలేని పరిస్థితి తాను 1951 వరకు నిజమైన కాంగ్రెస్ వారిని అన్ని కోణాలనుండి కాంగ్రెస్ నాయకులు ఈతనిపై ధ్వజమెత్తి క్రిందకు పడద్రోయాలన్న ఎత్తుగడలు క్షుద్రమైన ఆలోచనలు.

అయితే ఇవి రాజకీయాలలో చోటు చేసుకొంటావని ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఒకేస్థాయిని స్థానాన్ని ఆశించిన వ్యక్తులమధ్య సంఘాల మధ్య పార్టీల మధ్య తప్పనిసరి విరోధం తలఎత్తుతుంది అనివార్యం. ఆరోపణలు ప్రత్యారోపణలు పర్వం ప్రారంభమౌతుంది. రాజకీయాలలో నీతి అవినీతి పదాలకు అర్థం ఉండదని ప్రఖ్యాత పాశ్చాత్య రాజనీతివేత్త, మెకియవెల్లి అభిప్రాయపడినారు.

## ఒక ఆరోపణ

40 ఏండ్ల క్రిందటి గుంటూరు జిల్లాలో నూజివీడువీడు తాలూకాలో రంగాపురంలో చెల్లని బంజరు భూముల్నికానీ విలువ చెయ్యని పోరంబోకు భూముల్ని కానులిచ్చి కొన్నాడని అది నూరు ఎకరాలు ఏ ఒకరు ఆశించినది అదుసుమిల్లి సుబ్రమణ్యేశ్వరరావు, విశ్వేశ్వరావు స్థానిక ధనిక కమ్మకులస్తులు వారికి తాత తండ్రుల ద్వారా లభించిన మన్యపు ప్రాంతాన్ని కొన్ని వందల విస్తీర్ణంలో ఉండగా, రాబోయే చట్టాన్ని దృష్టిలో నిడుకొని ఒకరి పేరున వారికి బాగా తెలిసిన వారికి క్రయరూపేణ దాఖలుపరచినట్లు వారు రంగాజీని సంప్రదించి లచ్చన్న భార్యపేర 100 ఎకరములు వారి అధీనంలో మున్న పోరంబోకు భూముల్ని క్రయచీటి వ్రాయగా, లచ్చన్న ఆశ్చర్యపోయారు. అందులో మాకెందుకు భాగస్వామ్యం అందులో వచ్చిందేమిటి, అపఖ్యాతి తప్ప అయితే భూమిని యిచ్చిన వారు ఏమి ఆశించక ప్రేమతో వ్రాసి యిచ్చినది మీరు కాదనడం దేనికి ఇందులో మీకు పోయిందేమిటి అని అనడం జరిగింది.

అయితే రాజకీయ ప్రత్యర్థులు దీనిని మరోలా మలచారు. ఆనాటికి లచ్చన్న విద్యుశ్ఛక్తి శాఖామాత్యులు రంగాపురం గ్రామానికి విద్యుత్ శాంక్షన్ చేయించుకోవటానికి, అదుసుమిల్లి వారు లచ్చన్నగారి భార్య పేర వారి భూముల్ని వ్రాసారని లచ్చన్నగారు నిజానికి ఆనాటికి రంగాపురానికి విద్యుత్ సరఫరా చేయలేదు. ఏనాడు చేసిపెడతారని అన్నది వారి వాదన. ఇంతకు తన భార్య పేర వ్రాసిన ఆ బంజరు భూమి నుండి లచ్చన్నగారికి సంక్రమించింది లేదు. ప్రస్తుతం అది తన వద్దనలేదు. ఇంతకు ఆ భూమి విలువ రు. 2,500/- లు మాత్రమే. వెనుకబడిన వాడకి ఆస్తిపాస్తులు ఉండకూడదు. ఏమాత్రం ఉన్న వారి సామర్థ్యం మేరకు వారు అందుకున్న

ఆర్థికశక్తికి ప్రతిరూపంగా ఉండవు. అక్రమార్జన క్రిందకు వస్తాయని అగ్రకులముల వారి దురభిప్రాయం.

## మరొక ఆరోపణ

లచ్చన్నగారి భార్య యశోదమ్మ తన మెడలో డైమండ్ నెక్లస్ వేసికొని తిరుగుతున్నదని ఏ మంత్రిగారి భార్య తీసుకొన్న నిజాని కిదొక ఆరోపణగా ఏ ఒకరు చేయరు. బెల్లపల్లివారి సలహాదారుడు అందచేసిన డబ్బుతో కొన్నాడన్నది అభియోగము. వెనుకబడిన కులాలకు చెందిన వ్యక్తి భార్య తరతరాలుగా గొప్పోళ్ళు కుటుంబానికి చెందిన వ్యక్తి భార్యవలె తన భర్త మంత్రి అయినంత మాత్రాన ఆభరణాలు ధరించడమా? ఈ ఆరోపణ విన్నవారికి ఆశ్చర్యం వేస్తుంది. ''డైమండ్ '' అనగానే ప్రజల్లో లక్షల కోట్ల ఖరీదు అన్నది వస్తుంది. అసలు సంగతి తెలియదు. 1948 నుండి 1957 వరకు శాసన సభ్యునిగా కొన్నాళ్లు మంత్రిగా ఉంటూ వస్తున్న లచ్చన్న భార్య మెడలో ఆభరణం ఉండటం ఒక విడ్డూరమా! ఆ మాత్రం ఆర్థిక శక్తి పుంజుకోదా! అదికాదు విషయం, డైమండ్స్ అన్నది ఆరోపణ.

లచ్చన్నగారికి తన పెళ్లి పందిరిలో వర్ధంటున్న అప్పలనాయుడు తన భార్య యశోదమ్మకు ఆరు తులాల బంగారు నెక్లస్‌ను కట్నంగా చదివించారు. అన్నయ్య సోదరికి ఇచ్చిన బహుమతి. తరువాత మరికొన్నాళ్లకు బారువాలోనున్న ఆచారి గారు పొదులతో మరొక రూపం తెచ్చారు. ఆనెక్లస్ ప్రత్యర్థుల దృష్టిలో లక్షల ఖరీదై కూర్చున్నది. వేసిన అభియోగం లచ్చన్న నైతిక బలాన్ని దెబ్బతీయాలనే లేకున్న లచ్చన్నగారు ప్రతీ ఒకరి వద్దకు వెళ్లి ఇదిగో చూడండి ఈ నెక్లస్ డైమండ్స్ కావని చూపెట్టగలరా, దీనులకోసం రైతులకోసం, వెనుకబడిన వారికోసం అహర్నిశలు శ్రమిస్తున్న లచ్చన్నకు అందిన బహుమానమా ఇది లచ్చన్న యశోదమ్మల ఆదర్శ దాంపత్యానికి ఇది వారు ప్రజలకు చేసిన చేస్తున్న సేవలకు అందిస్తున్న బహుమానమా ఇది. కూలివారు మనసుకుట్టుకొని కూడబెట్టిన ధనంతోనైన మేలిమిగా బ్రతక కూడదు. ధనవంతుడు వ్యసనపరుడైన, దరిద్రుడైనా నేలపడ కూడదు. ఈ దౌర్భాగ్యపు వారసత్వం సామాజిక దురాలోచన నశిస్తేనే తప్ప నీవ్య జగతికి నాంధీ ప్రస్తావన కాదు.

వేరొక ఆరోపణ: లచ్చన్న తన భార్య పేర తన స్వగ్రామమున 3 ఎకరాల భూమిని కొన్నాడని దానిఖరీదు రు. 500/- లుఅని పాపం తనపై అభియోగం చేస్తున్న వ్యక్తికి తెలియదు. నిజానికి ఆ భూమి ఖరీదు రు. 500/- లు అని లచ్చన్నగారు ప్రకటించారు. తన దాయాదుల వద్దనుండి అప్పుడప్పుడు కొంచెం కొంచెం డబ్బును యిస్తు తన భార్య యశోదమ్మ తన పుట్టింటి వారిచ్చిన వేరొకచోట ఉన్న భూముల్ని

అమ్మి స్త్రీధనంగా కొనుక్కొని చేయించుకోవడం జరిగింది.

**అసందర్భమైన అదొక ఆరోపణ:** తన ప్రాంతంలోగల ఉద్దానీ ప్రాంతంలో 28 ఎకరాల భూమిని కొనటానికి అగ్రిమెంట్ జరిగిందని, అది ఉద్దానం ప్రాంతంలో ఇదొక కట్టుకథ. అభూతకల్పన. నిజానికి నిలబడనిది. ఒక వెనుకబడిన తరగతికి చెందినవారు ఎదిగిపోతున్నాడని ఎగాదిగా చూడకుండా మోపిన అభియోగం అక్కసుకి ప్రతిరూపం.

## పరిపాలనలో జోక్యంచేసుకుంటాడన్నదొక ఆరోపణ

నిజానికిదొక ఆరోపణకాదు లచ్చన్నగారు ప్రతి ఒకరికి సహాయం చేయాలన్న అభిలాషతో సర్వులకు సౌభాగ్యం అందాలన్న ఆకాంక్షతో తను మంత్రిగా అధికారంలో నున్న శాసన సభ్యునిగానున్న ప్రతి ఒక డిపార్టుమెంటుకువెళ్లి కష్టసుఖాల్ని అధికారులకు చెప్పి ప్రజాసమస్యల్ని అతి చాకచక్యంతో పరిష్కరించుకొనగలరన్న దిట్ట లచ్చన్నగారు అని చెప్పలేక ఆతనిశక్తియుక్తుల్ని మెచ్చుకోలేక అవి కూడ అక్రమమని అందువలన తనేదో లాభం పొందుతున్నాడేమోనని శంకిస్తున్న వారెల్ల నిత్యం అన్నింటిలో శంకితులే అని చెప్పాలి. సంశయాత్మ వినశ్యతి అనికదా!

## హైదరాబాదులో ఒక ఇంటిని కొన్నాడన్నదొక అభియోగం

1930 ఉప్పు సత్యాగ్రహంలో లాఠీ దెబ్బలుతిని జైళ్ళపాలయ్యారు. 1940లో క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్ట్‌చేయబడి కారాగార శిక్షలకు బలియై ఇంటిని ఇల్లాలినీ విడిచి, దేశంకోసం నానాపాట్లు పడినపుడు నేనెచట ఉంటున్నాను. నా నివాస స్థలం ఏది అన్నది ఈ అభియోగం చేసిన వ్యక్తికి అనవసరం అనుకుంటాను.

కాని మద్రాసు శాసనసభలో నేను శాసనసభ్యునిగా ఉంటూ నా భార్యను కుటుంబాన్ని బారువాలో ఉంచి ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌లో పనిచేస్తూ దేశం నలుమూలలా పర్యటిస్తూ ఉండేవాడ్ని. మంత్రినైన తదుపరి కర్నూలులో బస. 1954లో కల్లుగీత పారిశ్రామికుల సత్యాగ్రహపోరాట సమరంలో పాల్గొని తన భార్య యశోదమ్మ కొన్నాళ్లు ఏలూరు సెంట్రల్ జైల్లో ఉండటం జరిగింది అని అన్నారు లచ్చన్న ఆవేదనతో.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. శాసనసభ్యునిగా కొన్నాళ్లు ప్రజాబలం మీద ప్రజలు తనకు ఇస్తున్న మద్దతు మేరకు హైదరాబాదులో ఉండవలసి వచ్చింది. అద్దెఇళ్లల్లో తరుచు మస్తుతూ వస్తున్న లచ్చన్నగారిని తన మిత్రులు యిచ్చిన సలహాతో ఒక స్వంత ఇంటిని సమకూర్చుకోవాలన్న తలంపు కలిగింది. పార్టీ అభిమానులు లచ్చన్న శ్రేయోభిలాషులు లచ్చన్నకు సహాయపడే అవకాశం వదులుకో లేదు. బలహీనవర్గాల్లో ముండి ప్రజానాయకులుగా అవతరించిన వారి ఋణం తీర్చుకోవాలని, లచ్చన్నకు ఆర్థిక

సహాయ పడగలమని హామీ ఇచ్చారు. ఆ హామీ మేరకు రు. 2000/-లు ఇచ్చి లచ్చన్న ఒక స్థలాన్ని ఖరీదు పత్రాన్ని వ్రాసి సంపాదించారు. తదుపరి స్నేహితులిచ్చిన విరాళాలతో 1957లో ఖాళీ స్థలం రిజిష్టర్ అయింది. అభిమానులకు అందచేసిన ఆర్థిక సహాయాన్ని వక్రీకరించటానికి ఏ ఒకరివద్ద ఏ సాక్ష్యాధారాలు లభించలలేదు. ఇది కూడ రహస్యంగా జరుగలేదు శాసన సభ్యుడు యన్.పి. చెంగల్రాయునాయుడు ఎంతగానో సహకరించారు. 20/3/57 దక్కన్ క్రానికల్లో కూడా ఎంతో ఘనంగా ఇది ప్రచురించబ డింది. నేను మంత్రిగా ఉండగా ఇది జరుగలేదు. ఇది ఏ ఒకరిచేత ఆనాడు కాదనిపించుకోలేదు.

## తన స్వంత ఇంటిని బారువాలో మరమ్మత్ రు. 40,000/-లు వెచ్చించి బాగుచేసుకొన్నాడని ఆరోపణ

1943లో బారువాలోనున్న తన స్వంత ఇల్లు శిదిలావస్థలో నుండగా తన సోదరుడు టీచరుగా ఉంటూ ఇంటిని కాపాడుకుంటూ వచ్చాడు. పాడయిపోయిన ఇంటిని అపుడప్పుడు బాగుచేయించు కోవటానికి రు. 3000/-లు మాత్రమే కాగా, కనీసం రు. 40,000/- వెచ్చించి ఇంటిని బాగుచేయించు కొన్నారన్నది అభియోగం. అభియోగం మోపిన వ్యక్తి లచ్చన్నపై ఎంతటి అక్కసు ఈర్ష్యను కలిగియున్నాడన్నది కనిపిస్తూనే ఉంది.

## హైదరాబాదు హిమయత్‌నగర్‌లో రంగాభవన నిర్మాణం లచ్చన్నదా! భార్యదా! ఇదొక ఆరోపణ

ఈ ఆరోపణమోపిన వ్యక్తికి లచ్చన్నను తుదముట్టించాలన్నదే ధ్యేయంగా కన్పిస్తున్నది. లేనిచో ఆ భవనం పేరే ''రంగా భవనం'' లచ్చన్న రంగా అనుచరులలో ఒకరు మాత్రమే. లచ్చన్న భవనం అవుతుందా. 1952లో రూపొందిన రంగా సజీవవిగ్రహ ప్రతిష్టాపన సంఘం అందుకున్న విరాళాలతో రూపొందినదే ఆభవనం. జనసామాన్యానికి అందచేసిన సేవలకు ప్రతిరూపంగా అతని విగ్రహ స్థాపన చేయటానికి అతని పేర భవనం నిర్మించటానికి సంఘం తలపెట్టింది. లచ్చన్నగారు మంత్రిగా నుండగా నిధులు సేకరించలేదు. కృషిపరలోకపార్టీది ఆ భవనం అని ఒకమారు, వేరొకమారు లచ్చన్నగారిదే ఆ భవనం అన్న ఆరోపణలనే అసందిగ్దత అసందర్భం ఉంది. నిజానికి కె.యల్.పి. ఏనాడు 1955లో అంతరించిది కదా!

## పారిశ్రామిక వాదులతో లచ్చన్న ''మిలాఖత్'' ఇది ఆరోపణ

ఊరూ పేరు చెప్పుకోలేని దౌర్భాగ్య స్థితిలో నున్న టి. సత్యనారాయణ వేసిన కరపత్రంలో ఉన్న వాటిని ఆధారంగా ఆరోపణకర్త చేసిన అభియోగాల్లో ఇదొకటి. పారిశ్రామికవేత్త వెలగలపూడి రామకృష్ణతో జరిపిన వ్యవహారాల్ని చెప్పలేక ఏమోమో

జరిపారనటం అసందర్భం, అక్రమం. కాంగ్రెస్ అభిమానిగా, విరామ కృష్ణ ఏమేరకు తగినవ్యక్తిఅని ఆంధ్రప్రదేశ్ ఎన్నికల పర్యవేక్షకునిగా వచ్చిన ఆల్ ఇండియా కాంగ్రెస్క మిటీ ప్రత్యేక ప్రతినిధి యస్.కె. పాటిల్‌ను అడిగితే తెలుస్తుంది తెలియజెప్పుకోలేని అభియోగాలు, నిరూపించుకోలేని అపప్రదలు వేయడం చేతకాని తనానికి పరాకాష్టలు.

అధికార కాంగ్రెస్ అదిష్టానవర్గాలు లచ్చన్నగారిపై రోతపుట్టించడానికి పన్నిన పన్నాగాల్లో ఈ అభియోగాల పర్వం ఒకటి అన్నది ప్రజలకు బోధపడుతూనే ఉందని లచ్చన్నగారి ధృడ అభిప్రాయం. తప్పుడు అభియోగాలు దుష్ప్రచారానికి ఉపయోగపడ గలవు. నిజానికి దూరంగా నిలవగలవి లేకున్నఏమిటి. వ్యక్తి జీవితమున కనీస అవసరాల్ని కష్టపడి కూడబెట్టుకొని, గణన చేసుకొని లేదా అభిమానుల అండదండ లతో ఒక ఇల్లు కట్టుకుంటే, ఒక ఆభరణం కొనుక్కొంటే, తనున్న పాత ఇల్లుని బాగుచేయించుకొంటే, తనొక కొత్త ఇంటిని సమకూర్చుకొంటే వాటిని ఎలా సంపాదిం. చాడన్న రీతిని, నీతిని వక్రీకరించి అపకీర్తిని తెచ్చిపెట్టే విశేషంగా వాటికి రంగుపులిమి లేనిపోని పిట్ట కథలతో ప్రజలను మభ్యపరచి వ్యక్తి ఔన్నత్యాన్ని దెబ్బతీసే దిగజారుడు చర్యల్ని ప్రజానీకం సమర్థిస్తుందా? ఎన్నటికీ సమర్థించదు.

అందుకే కాంగ్రెస్ అదిష్టాన వర్గం వారు ఎన్ని మార్లు లచ్చన్నగారు విజ్ఞాపనలు అంపుకున్నా అతీగతీ లేదు. సమాధానాలు లేవు. ఆ బహిరంగ విచారణ జరపాలని లచ్చన్న సవాల్ చేసారు. వారి కాదమ్ములు లేవు. అంతేకాదు నిజానికి ఆ ఆరోపణలను చేసింది ఊరు పేరు తెలియజెప్పుకోలేని ఒక సత్యన్నారాయణ అనేవ్యక్తి ఆ కరపత్రాల ఆధారంగా నాటి రెవెన్యూ మినిష్టరు కళావెంకట్రావు రూపొందించిన అభియోగాల పత్రంపై సంతకం చేసినది మంతెన వెంకటరాజుగారని, ఈ ఇరువురు తన రాజకీయ ప్రత్యర్థి నీలం సంజీవరెడ్డిగారి అనుంగు మిత్రులు, అనుచరులని సర్దార్ గౌతు లచ్చన్న తేటతెల్లంచేస్తూ అధిష్టానవర్గం వారికి విన్నవించుకోవడం జరిగింది. అంతేగాక ఆంధ్రప్ర దేశ్ ప్రజానీకానికి అసలు విషయాలు అవగతం కావటానికి ఏది నిజం ఏది నిజంకాదు అని చెప్పటానికి నాటి ఆంధ్రప్రదేశ్‌లో డెమోక్రటిక్ పార్టీవారు "గ్రూప్ పాలిటిక్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్" అన్న పేరుతో ఒక గ్రంధాన్ని ఆంగ్లమున ప్రచురించారు. ఇందులో ఆ కాంగ్రెస్ అధిష్టాన వర్గానికి సర్దార్ గౌతులచ్చన్న గారికి మద్య జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలున్నవి. దానిని పరిశీలించిన నిజమేమిటో తెలుస్తుంది. లచ్చన్నగారిపై మోపిన ప్రతి ఒక అభియోగం స్వల్పమైనదే గాక, నిజానికి నిలువలేనిదని రూఢి అవుతుంది. వెనుకబడిన వారు వెలుగు చూడకూడదని అగ్రకులస్తులే ఏనాడు అందలా లపై ఉండాలని ఆశించినవారి ఆక్రోశమే లచ్చన్నగారిపై వేసిన అభియోగాలకు మూల మని ఇట్టే తెలిసిపోతుంది.

# 10వ ప్రకరణము

## 1957 డెమోక్రటిక్ పార్టీ అవతరణ-లచ్చన్న

1956లో సంజీవరెడ్డి మంత్రివర్గం నిర్మాణంలోనే కాంగ్రెస్‌లో అసంతృప్తి వర్గం ఏర్పడింది. కల్లూరిని చంద్రమౌళి ఎగ్బోడాను ఎలిమినేట్ చేస్తారు. చెన్నారెడ్డిని ఎలిమినేట్ చేస్తూ గోపాలరెడ్డిని, అతని అనుచరుని తీసికొంటారు. సంజీవరెడ్డిగారి అక్రమాలను కేంద్రానికి నివేదించుటకు గోపాలరెడ్డి ఎగ్బోడాగారి ఇంట్లో సమావేశాలు జరిగేవి. బొమ్మకంటి సత్యన్నారాయణ, గోపాలరావు ఏగ్బోట్-సంజీవరెడ్డి యొక్క రాజకీయాలమీద రిపోర్టు తయారుచేసి అంపిస్తారు.

కాంగ్రెస్ తిరిగి అధికారంలోకి రావటానికి కె.యల్.పి. కాంగ్రెస్‌లో కలిసినందున జరిగింది. అందువలన రద్దుఅయిన కాంగ్రెస్‌లో కలిసి కె.యల్.పి. వర్గం నుండి ఒకరిని మంత్రివర్గంలోనికి తీసికోవాలని డిమాండ్ చేసిన సంజీవరెడ్డి లక్ష్యపెట్టలేదు. గోపాలరెడ్డి అనుయాయులు, బూర్గుల రామకృష్ణ అనుయాయులు చెన్నారెడ్డి వర్గం కె.యల్.పి. వర్గం మరి ఒక వర్గంలో ప్రాతినిధ్యం కోసం ఆందోళన కొనసాగిస్తారు. (పార్టీలో అంతర్గతంగా) అసెంబ్లీ సెక్రటరీ జె.బి. చౌదరి రంగాజీకి బందువు. నిడుబ్రోలు నివాసి. ఈతని పావుగా ఉపయోగించుకొని, రంగాజీతో లచ్చన్నగారిపై లేనిపోని అనుమానాలు వచ్చినట్లు చేయిస్తారు. లచ్చన్నగారే అడ్డువస్తున్నారు లేనిచో శ్రీమతి భారతీదేవి రంగాని, మంత్రివర్గంలోకి తీసికొని ఉండేవాళ్లం అనాడు భారతీదేవి యం.యల్.సి. భారతీదేవిని మంత్రివర్గంలోనికి తీసుకున్న మాజీ కె.యల్.పి. లీడర్లకేమి అభ్యంతరంలేదని లచ్చన్న ప్రకటన యిస్తారు. రంగాజీకి లచ్చన్న మద్యరాజకీయ విభేదం కల్గించటానికి ఆడిన పన్నాగం అని తేలిపోయింది.

1957 ఫిబ్రవరిలో తెలంగాణా ప్రాంతమున అసెంబ్లీ ఎన్నికలు జరిగాయి. కొత్త శాసనసభ్యులు వచ్చినందున మరల కాంగ్రెస్ పార్టీ లీడర్ షిప్ నాయకత్వానికి పోటీ వచ్చింది. అయితే సంజీవరెడ్డిపై అసంతృప్తి వర్గం పోటీ పెట్టలేదు. ఆనాటికి Old MLA Quarter లో రెస్ట్ తీసికొంటూ ప్రకాశం పంతులుగారికి 85 సం. దాటింది. కనీసం వెళ్లివచ్చుటకు వెళ్లలేని పరిస్థితి. లచ్చన్నగారికి కబురుపెట్టి తనను పార్టీ నాయకత్వానికి ప్రతిపాదనలన్ని అంపమని కోరగా అనుయాయులు ఆశ్చర్యంతో పాటు ఆవేదనకు గురైనారు. ఆతనిని సేవ చేయాలన్న తలంపు అవసాన దశలో కూడ ఉండటం విశేషమే కధ.

1957లో ఫిబ్రవరి బడ్జెట్ ప్రసంగాలలో సంజీవరెడ్డిగారు వెనుకబడిన తరగతుల

జాబితాలు కులప్రాతిపదికపై ఏర్పడినవి. వీటిని అమలుపరచక కులతత్వం పోవా లన్న ఆర్థికంగా వెనుకబడిన తనాన్ని తీసికోవాలి అన్న భావనతో బయటపడ్డారు. ఆదే శాసన సభలో కాంగ్రెస్ సభ్యునిగానున్న లచ్చన్నగారు లేచి సంజీవరెడ్డిని ఆ విషయంపై రెడ్డిగారిది తప్పుడు భావన అని నొక్కి చెప్పారు. అగ్రవర్ణాల వారిలో ఆర్థికంగా వెనుకబడిన తరగతులకు ప్రభుత్వ అన్ని విధాల సదుపాయాల్ని అందించడంలో వెనుకబడిన వర్గాలకు అభ్యంతరంలేదు. అయితే తరతరాలుగా సాంఘికంగా వైజ్ఞానిక విద్యారంగాల్లో ప్రభుత్వం ముందుపడి వెనుకబడిన జాతులని పేర్కొంటూ రిజర్వేషన్‌లను కల్పించకపోతే వారెల ముందుపడతారు అని లచ్చన్న అసెంబ్లీలో గర్జించారు.

సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగ బలహీన వర్గాలకు ఇచ్చిన అర్థం ఎంతో విమర్శనీయ మైనది. ఏనాడు చదువు సంధ్యలు ముఖం తెలియక తరతరాల నుండి బానిసలుగా బ్రతుకుతూ నిత్యం దరిద్రంలో జీవితాల్ని గడుపుతున్న బాలురు బాలికలను, అగ్రవర్ణాలవారి పిల్లలకు, అనాదిగా సంస్కారం సభ్యత అలవడుతూ వస్తున్నది. అందుకు ఆ ఇరువర్గాల మధ్య పోటీ కుదరదు కావాలన్న సంజీవరెడ్డి మగవాడే, గామా మగవాడే ఇరువురి మధ్య మల్లయుద్ధం జరిగితే సంజీవరెడ్డి గారికి ఎముకలు మిగులుతాయని లచ్చన్న గద్దించగా సభ ఒక్కమారుగా గొల్లుమంది.

రంగాజీ కె.యల్.పి. ని రద్దుపరచిన తదుపరి లచ్చన్న ప్రభావితుడై మొదట ఐక్య కాంగ్రెస్‌వాదులై తదుపరి కాంగ్రెస్ వాదులుగనే యున్నారు.

అయితే ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రికి మెజారిటీ బలం ఉన్నందున ఆంధ్రరాష్ట్ర మాజీ ముఖ్యమంత్రి ప్రకాశం గారి బాగోగుల్ని పట్టించుకోలేదు సరికదా కాంగ్రెస్‌పా ర్టీలో అసంతృప్తివర్గంలో పేరొందిన నాయకులలో ఒకరైన సర్దార్ గౌతులచ్చన్న ఏడ వదిలించుకోవాలన్న దుష్ట తలంపుతోనే లచ్చన్నగారిని, బ్లాక్ మెయిల్ చేయుడం, మంతిన వెంకటరాజు పిటిషన్‌తోనే ప్రారంభమైనది. నిజానికి లచ్చన్నగా రికి కాంగ్రెస్ నుండి విడిపోవాలన్నది ఆనాటికి లేదు. అయితే తన పార్టీ అగ్రనాయకత్వం తనమీద అభియోగాలు మోపి వారన్‌హేస్టింగ్స్ ఇంపీచ్‌మెంట్‌ను ప్రారంభించింది. రాష్ట్ర స్థాయిలో ముఠాల ప్రాబల్యం కేంద్రంలో సంజీవరెడ్డిగారి మాటకే విలువిచ్చి రాష్ట్రాన జరిగిన సంజీవరెడ్డి దుష్కార్యాల్ని పట్టించుకొన పోవడం వలన బొమ్మకంటి సత్యనారాయణ అద్వర్యమున తరంగల్లో సమావేశం చెన్నారెడ్డి నాయకత్వాన డెమొక్రటిక్ పార్టీని ప్రారంభించారు. ఇంతలో సోషలిష్టు భావాలు గల వ్యక్తి అని పేరొందిన విజయనగరం మహారాజా పి.వి.జి.రాజు కేంద్ర స్థాయి సోషలిస్టు పార్టీ నుండి విడివడి ఆంధ్రలో కాంగ్రెస్ పార్టీలన్న అసంతృప్తి వాదులతో

కూడ ఒక నూతన పార్టీని ఏర్పాటు చేయాలన్న తలంపుతో ఉండటం.

ఈ దశలో లచ్చన్న పి.వి.జి.తో కలసి నడవటానికి అంగీకరించారు. ఆనాటికి ఏర్పడిన డెమొక్రటిక్ పార్టీ పి.వి.జి.ని కలియడంతో తెనాలి సదస్సులు అది సోషలిష్టు డెమొక్రటిక్ పార్టీ అయింది. ఇందులోని ప్రముఖులు లచ్చన్నగారే ఈ పార్టీకి అధ్యక్షులు, సెక్రటరీ బి. సత్యన్నారాయణ. వర్కింగ్ కమిటీ మెంబరు పి.వి.జి. 1957లో కేంద్ర హోం మంత్రి పంపిన గోవిందవల్లభ పంత్ స్వాతంత్ర్యం రాకముందు నుండి ఇండియాలో 1957 వరకు ఉన్న వెనుకబడిన కులస్థులకు ఉన్న సదుపాయాల్ని రద్దుపరచారు. అదే మన ప్రత్యేకత వెనుకబడిన తరగతుల జాబితాల్ని ప్రకటించడం మెరిటెడ్ పూర్ బాక్ వార్డు తరగతికి చెందిన విద్యార్థినీ విద్యార్థులకు స్కాలర్‌షిప్ లిచ్చి విదేశాలకు అంపించడంపై ఈవిధానం కులప్రాతిప దిక గలదని గోవింద వల్లభపంత్ రద్దుచేయగా లచ్చన్న బలహీనవర్గాల నాయకుడు లచ్చన్న దీనిని ప్రతిఘటించారు. 1957లో ఢిల్లీలో పంజాబ్‌రావు దేశముఖ్ అధ్యక్షతన కన్వెన్షన్‌లో జరిపి, జగజ్జీవన్ రావ్ స్వాగతోపన్యాసం యిస్తారు. ఈ కన్వెన్షన్ జరిపించిన కీర్తి ప్రతిష్టలు లచ్చన్నగారిదే. విజానికి ఉత్తరాంధ్రలో 1952లో జరిగిన శ్రీకాకుళం పార్లమెంటరీ స్థానానికి ఇండిపెండెంట్‌గా గెలుపొందిన శ్రీబొడ్డేపల్లి రాజగోపాలరావుని లచ్చన్నగారు సమర్థించారన్నది కాంగ్రెస్ వారికి లచ్చన్నపై దుగ్ధం.

1957 జనరల్ ఎన్నికలు అయేసరికి లచ్చన్నగారు కాంగ్రెస్‌లోనే ఉన్నారు. అయితే ఉత్తరాంధ్రలో లచ్చన్నగారు కాంగ్రెస్‌ను ఎన్నికలలో గెలిపించలేరన్నది కాంగ్రెస్‌వారి ఆరోపణ.

1958 మధ్యంతర ఎన్నికలకు ఎన్నుకోబడి లచ్చన్నగారు ఏడు సంవత్సరాలు కంటిన్యు MLA గా నున్నారు. 1957లో దేశం మొత్తంమీద జనరల్ ఎన్నికలు వచ్చాయి. అందుకు భారత పార్లమెంట్ సవరణ తెచ్చి ఆంధ్రలో గల శాసనసభ్యుల పదవీ కాలాన్ని పెంచింది 1962 వరకు.

లచ్చన్న బొమ్మకంటి హయగ్రీవాచారి పి.వి.జి. చెన్నారెడ్డి వగైరాలుండేవారు. శాసనసభలో డెమొక్రటిక్ పార్టీ ప్రతిపక్షంగా నిలిచింది. శాసన సభానాయకులు అసెంబ్లీలో చెన్నారెడ్డి శాసనమండలిలో చీకటి పరశురాం నాయుడు.

# 11వ ప్రకరణము

## స్వతంత్ర పార్టీ నిర్మాణము-లచ్చన్న పాత్ర

డెమోక్రటిక్ పార్టీలోనున్న భాగస్వామ్య పార్టీలు వేరొక మార్గం అన్వేషించే స్థితిగతులు తటస్థించాయి. ఆంధ్రలో ఉత్తరాంధ్రలో పేరెన్నికగన్న బలహీన వర్గాల నాయకుడు లచ్చన్న. తెలంగాణాలో ఎదురులేని నాయకత్వాన్ని కొనసాగిస్తున్న డా. మర్రి చెన్నారెడ్డి ఉత్తరాంధ్రలో సోషలిస్టులలో నాయకుడు విజయ నగరం మహారాజా పి.వి.జి. రాజుగారు డెమోక్రటిక్ పార్టీకి నేతలు.

దేశంలో రాజకీయ పరిస్థితులు తారుమారవుతూ వచ్చాయి. దేశ స్థాయిలో కాంగ్రెస్ పార్టీ ప్రణాళికను ఆర్థిక సిద్ధాంతాన్ని అవహేళన చేస్తూ దేశానికి అవి ఉపకరించలేవని సిద్ధాంతీకరిస్తూ వచ్చారు.

కాంగ్రెస్‌లో ఒకనాటి నేతలయిన మేధావులు రైతురంగా రాజాజీలు దేశ స్థాయిలో కాంగ్రెస్‌ను ఎదిరించే రాజకీయ శక్తిని దానితో పోటీ చేయు రాజకీయ పార్టీని స్థాపించ తల పెట్టారు.

రాజాజీ మహా మేధావి, వక్త, రచయిత, రాజకీయవేత్త, సిద్ధాంత ప్రవక్త వ్యక్తికి ఆర్థిక స్వాతంత్రం స్వేచ్ఛ-సమానత్వం కావాలని, స్వేచ్ఛా వాణిజ్యం వ్యక్తిలో గల అంతర్గత శక్తుల్ని వెల్లుబికిస్తుందని అన్న సిద్ధాంతంపై ఆర్థిక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ భారతదేశ స్థాయిలో స్వతంత్ర పార్టీ అన్న పేరుతో స్థాపించదలచి మొదటగా బొంబాయిలో కన్వెన్షన్ జరుపుతారు. మద్రాసులో జరిగిన కన్వెన్షన్ హాజరైన ప్రముఖ రాజగోపాలాచారి మినూమసానీ, జైప్రకాశ్ నారాయణ, హెచ్.పి. మోడీ, కె.యం. మున్షీ, బెజవాడ రామచంద్రరావు విద్యావేత్తలు, సిద్ధాంత వేత్తలు సమావేశమైనారు.

జయప్రకాశ్ నారాయణ సర్వోదయ నాయకుడు ఆ సిద్ధాంతాన్ని అమలు చేయదలచిన వాటి జయప్రకాశ్ నారాయణ స్వతంత్ర పార్టీని వ్యతిరేకించిన కాంగ్రెస్‌పై పోరాటానికి తన నైతిక బలం లభించగలదని ప్రకటించారు.

స్వతంత్ర పార్టీ అవతరణ బొంబాయిలో జరిగింది. అధ్యక్షులు ఆచార్య రైతు రంగా కాంగ్రెస్‌నుండి రాజీనామాచేసి స్వతంత్రపార్టీ అధ్యక్షులయ్యారు. పార్టీ సిద్ధాంత వివేదిక-పార్టీ ప్రణాళిక, పార్టీ నిర్మాణకర్త అన్ని చక్రవర్తుల రాజగోపాలచారి గారే.

ఆంధ్రప్రదేశ్‌లో రాజాజీ అడుగిడి ఆనాటి కాంగ్రెస్ పార్టీకి

వ్యతిరేకులయిన పార్టీ నాయకులను ఆహ్వానిస్తూ తన పార్టీలో కలియాలని కోరతారు.

అంతవరకు రాష్ట్ర స్థాయిలోనే ఉన్న డెమోక్రటిక్ పార్టీలోనున్న రాజకీయ నాయకుల్లో ఆలోచన రేకెత్తింది. దేశస్థాయిలో నున్న కాంగ్రెస్ పార్టీని ఎదిరించి నిలవాలన్న దీనిని ఓడించాలన్న అదే స్థాయిలోనున్న పార్టీలో చేరడం అవసరమన్న భావానికి వచ్చారు. ఆనాటి డెమోక్రటిక్ పార్టీ నాయకులు డా. మర్రి చెన్నారెడ్డి, సర్దార్ గౌతు లచ్చన్న.

అయితే పి.వి.జి. రాజు స్వతంత్ర పార్టీ సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు. ధనిక స్వాముల పార్టీ, భూస్వాముల పార్టీ స్వతంత్ర పార్టీ తాను అందులో చేరేది లేదని, సోషలిస్టు ఇండియా అన్నదే తన ధ్యేయం, ఆశయం అన్నారు. తత్ఫలితంగా డెమోక్రటిక్ పార్టీ డిసాల్వ్ అయింది. పి.వి.జి. రాజు ఆంధ్రప్రదేశ్ లో డెమోక్రటిక్ సోషలిస్టు పార్టీ అన్న పేరుతో ఎంతో కీర్తి ప్రతిష్ఠల్ని పెంపొందించుటకై యత్నిం చారు. ఆనాటికి దేశ స్థాయిలో సోషలిస్టు పార్టీతో విభేధాలు వచ్చినందున తనే రాష్ట్రస్థాయిలో డెమోక్రటిక్ సోషలిస్టుల్ని పి.వి.జి నడిపారు.

రాజాజీ పిలుపుపై స్వతంత్ర పార్టీలో చేరిన ఆనాటి రాజకీయ నేతలు సర్దార్ గౌతు లచ్చన్న, డా. మర్రి చెన్నారెడ్డి, ఓబుల్ రెడ్డి, చెంగాల్రావు నాయుడు, రాజగోపాల నాయుడు, రావుగోపాలరావు.

నాటికి ఆంధ్ర ప్రదేశ్ ప్రజానీకంచే ఎంతో అభిమానించబడుతున్న నాయకులు స్వతంత్ర పార్టీలో చేరడంతో యువత ఆంధ్ర ప్రజానీకం స్వతంత్ర పార్టీలో చేరారా అని అనిపించినంత ఉత్సాహం, ఉద్రేకం, ఉల్లాసాలు ఆంధ్రలో ఆనాడు వెల్లి విరిసాయి.

ఆంధ్రప్రదేశ్ స్వతంత్ర పార్టీ అధ్యక్షులు గొట్టిపాటి వెంకటసుబ్బయ్య, కందుల ఓబుల్ రెడ్డి, సెక్రటరి-సర్దార్ గౌతులచ్చన్న, జాయింట్ సెక్రటరీ, ఉపాధ్యక్షు లు-డా. మర్రి చెన్నారెడ్డి, రాష్ట్ర స్వతంత్ర పార్టీ కార్యవర్గాన్ని ఏర్పరచడంలో రంగాజీ కొత్త పద్ధతిని ప్రవేశ పెట్టారని అనేకులు ప్రశ్నించారు. కాంగ్రెస్ పార్టీలో గురు శిష్యులుగా మెలగి కృషీవరలోక పార్టీలో కృష్ణార్జునులై ఐక్య కాంగ్రెస్‌లో రంగా లచ్చన్నలుగా మెలగి ఒకరు డెమోక్రటిక్ పార్టీ, వేరొకరు కాంగ్రెస్ పార్టీకి చేరిపోయి, మరల స్వతంత్ర పార్టీలో కలిసి ఒకరు దేశ స్థాయిలో స్వతంత్ర పార్టీ అధ్యక్షులుకాగా, వేరొకరు ఈనాడు ఆంధ్ర రాష్ట్ర స్వతంత్ర పార్టీ జాయింట్ సెక్రటరీగా మాత్రమే రూపొందారు.

ఏది ఏమైన మరల పూర్వపు స్థితికి వచ్చి మరల ఆంధ్ర రాష్ట్రమున ప్రజలను

స్వతంత్ర పార్టీలోనికి రప్పించాలని తెప్పించాలని, చేయని ప్రయత్నం లేదు. రాష్ట్ర స్థాయిలో అనేక సమావేశాల్ని జరిపి పార్టీ సిద్ధాంతాలను నచ్చజెప్పారు.

ఆల్ ఇండియా స్వతంత్ర పార్టీ అధ్యక్షునిగా రంగాజీ హైదరాబాదులో రాజాజీతో పబ్లిక్ మీటింగ్ జరిపిన తదుపరి రాష్ట్ర కమిటీని వేస్తారు. పై తెలిపిన వారే అందులో సభ్యులు.

రాజాజీ ఆంధ్రప్రదేశ్‌లో పర్యటన జరుపుతారు. అన్ని ముఖ్య కేంద్రాలలో రాజాజీ బహిరంగ సభల్ని జరిపారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర నాయకులు తనతో పర్యటించారు. రాజాజీ ఆంగ్లమున ఉపన్యసిస్తే, సర్దార్‌జీ తెలుగులో అనువాదం చేసేవారు. సర్దార్ అనువాదాన్ని రాజాజీ ఎంతగానో మెచ్చుకొని అభినందించే వారు.

రాజమండ్రిలో బసచేసి కాకినాడ సభకు వెళ్తుండగా రాజాజీ ఆనాటి దినపత్రికను జూచారు అందులో స్వతంత్ర పార్టీ అవతరణ ప్రచారంపై ఆనాటి భారతదేశ ప్రధాని దుమ్మెత్తి పోస్తూ తన దుష్ప్రచారంలో భాగంగా స్వతంత్రపార్టీని నడుపుతున్నది వయోవృద్ధులు. వారి వలన పార్టీ బాగు పడేదేముందని అపహాస్యం చేస్తూ వచ్చిన వార్త పడింది.

మహాసభలో రాజాజీ ప్రసంగిస్తుండగా అచ్చన్న అనువదిస్తున్నారు. రాజాజీ నెహ్రూ తన పార్టీపై వేసిన అపహాస్యాన్ని తిప్పి కొట్టాలని ప్రజలారా పార్టీకి వయో వృద్ధులు చాలా అవసరం ఎందువలన అన వయసు అనుభవం, విజ్ఞానం, వివేకాలు గూడుకట్టుకొని వికసించేది, నడివయసు దాటిన తరువాతే. నిజానికి ముసలి వాళ్లు పెళ్లిళ్లు చేసుకోగూడదు గాని పార్టీలను నడిపితే వచ్చిన ప్రమాద మేమీలేదని దెప్పి పొడవటం తడవు అసంఖ్యాక ప్రజానీకం ఒక్కమారు ఎలుగెత్తి చప్పట్లు చరచారు.

స్వతంత్ర పార్టీని నిత్యం దెప్పి పొడిచే కార్యక్రమాన్ని నెహ్రూజీ చేపట్టేవారు అది ధనవంతుల పార్టీ, భూస్వాముల పార్టీ-రాజాజీ ధనిక స్వాముల ఏజెంట్ వ్యవసాయ క్షేత్రాలు నెలకొల్పాలి. సామాజిక వ్యవసాయ క్షేత్రాలే కర్షకుల పాలిట వరాలు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు స్థాపించాలి తప్పించి, భూముల్ని స్వంతం చేసుకొని భూస్వాములను మనం ప్రోత్సాహించరాదు, స్వేచ్ఛా వాణిజ్యం పేరిట బలహీన వర్గాలను దోపిడీ చేయడం, అక్రమం, అన్యాయం అంటూ నెహ్రూజీ దినపత్రికలతో స్వతంత్ర పార్టీ విధానాన్ని ఖండిస్తూ ఉండేవారు.

నిజానికి భారతదేశంలో నెహ్రూకి ఎదురుగా నిలిచి తన సిద్ధాంతాన్ని కాదనీ వ్యక్తిత్వం వికాసం, స్వేచ్ఛా వాణిజ్యం, ప్రజాస్వామ్యం అన్న వ్యక్తివాద సిద్ధాంత

మును ప్రచారం చేస్తున్న మేధావులలో రాజాజీ రంగాజీ ప్రముఖులు.

నెహ్రూ వాదనలని రాజాజీ పత్రికలలో వ్యాసాలద్వారా ఖండిస్తు వచ్చేవారు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల పేరుతో చిన్న చిన్న కమతాలనన్నింటిని విశాలమైన రీతిలో ఏకమొత్తంగా జేస్తే ఉత్పత్తి అధికమవుతుందని నెహ్రూజీ అంటే-టీ కప్పుకు అంచు ఎంత అవసరమో మడికి గట్టు అంత అవసరం పాపం నెహ్రూజీ రత్నాల ఆనంద భవనంలో జన్మించిన వారు. భూముల సంగతి తనకేమీ తెలుసు అని ఎగతాళి చేసేవారు.

ఇక పరిశ్రమలను జాతీయం చేయాలని నెహ్రూజీ వాదించగా అందువలన కార్మికులలో ఉత్సాహం చొరవ, శ్రద్ధ కొరవడి జాతీయాదాయం దెబ్బతింటుందని రాజాజీ వాదన వ్యక్తి స్వతహాగా స్వార్థానికి ప్రతీకగా నుంటారు. తనది అన్న భావం తనలో ఎనలేని ఇన్సెంటివ్‌ను తెచ్చి పెడుతుంది. ఉత్సాహం పరవళ్ళు త్రొక్కుతుంది. స్వకీయ ప్రోత్సాహం చిందులేస్తుంది. స్వీయ తపన చిగురిస్తుంది. అది అధికోత్పత్తికి స్వతం కృషికి దోహద పడుతుంది అందుకు వ్యక్తిగత ఆస్తిపాస్తులుండటం అవసరం.

## వ్యక్తిగత ఆస్తి రద్దు విధానం తప్పు

సోషలిస్టు పాట్టెర్న్ ఆఫ్ సొసైటీని నిర్మించటానికి తలపడిన కాంగ్రెస్ భారత రాజ్యాంగంలో నున్న ప్రాపర్టీ రైట్‌నే మార్చాలన్న ధోరణి లోనికి ఒక నాడు వచ్చింది కారణం ఆనాడున్న సోషలిస్టు శక్తులు కమ్యూనిస్టుల ప్రాబల్యం వలన భారత పార్లమెంటులో రాజ్యాంగంలో పొందు పరచిన ఇండివిడ్యూలిటీ ప్రాపర్టీ రైట్‌నే మార్చాలని సెక్షన్ 'బి' ని ప్రవేశ పెట్టి రాజ్యాంగ సవరణ తేవాలని అభిప్రాయం వచ్చింది.

రాజాజీ స్వతంత్ర పార్టీ నిర్మాతగా దీనికి గట్టిగా ప్రతిఘటించారు. వ్యక్తిగత ఆస్తి హక్కును రద్దు చేయడం వ్యక్తిని రద్దు చేయడమే అని ఆస్తిపాస్తులు లేని వ్యక్తికి వ్యక్తిని ఆదేశించే శక్తి నశించి-బానిసత్వపు బందాల్లో చిక్కుకొనక తప్పని పరిస్థితిలోనికి వెళ్లగలడని పార్టీ అడ్డు తగిలింది. అసమానతలు తొలగించటానికి స్వతంత్ర పార్టీ సిద్ధమే తప్పించి-సమానత్వం పేరిట ఉన్న వ్యక్తిగత ఆస్తిహక్కును రద్దు చేయడం, అక్రమమని వాదించింది. అయితే వ్యక్తి ఆస్తిపాస్తుల్ని పరిమితికి లోబడి ఉండాలని ప్రకటించే హక్కు ప్రభుత్వానికి ఉండటంలో తమకు అభ్యంతరం లేదని తన ప్రణాళికలో ప్రకటించింది.

స్వతంత్రపార్టీ సిద్ధాంతాన్ని తప్పుగా చిత్రించి ప్రజలపయి ఉసిగొల్పి సాంఘిక

సంక్షేమ రాజ్యాన్ని స్వతంత్రపార్టీ కోరలేదని తెగ ప్రచారం జరిగింది. అయితే మానవుని సైకాలజి ప్రకారం ప్రతి ఒక వ్యక్తి-వ్యక్తిత్వం కావాలని కోరతాడని వ్యక్తిగత ఆస్తిపాస్తులుండటం తన అభివృద్ధికి అభ్యుదయానికి అవసరమని, వాంచిస్తాడని తెలియని దెవరికని.

రాజాజి ఒక మారు సోషలిజంపై వ్యాఖ్యానిస్తూ-సోషలిజం వినటానికి ఇంపయిన మాట ఆచరణలో జరగని మాట ఎవరి ప్రతిభా సామర్థ్యాల మేరకు వారు బ్రతకడంలో నున్న అక్రమ మేమిటని ప్రశ్నించాడు. ఒకరి కొకరు ఇచ్చిపుచ్చుకోవడమే సోషలిజం అయిన ప్రతి ఒకరు ప్రతి ఒకరికి యిస్తే ఏ ఒకరు ఏ ఒకరికి ఏమీ ఇవ్వకపోవడమే కదా అందులో ఏ ఒకరు యిస్తే నీవు అభివృద్ధి పొందడం కాదు నీ అభివృద్ధి నీ స్వంత కృషిపై పోరాటాల ఫలితాలపై ఉంటుందని రాజాజీ నిర్వచించారు.

## స్వతంత్ర పార్టీ సాధించిన ఘన విజయం

రాజ్యాంగంలో వ్యక్తిగత ఆస్తిపాస్తులు సంరక్షించడానికి కాంగ్రెస్ సిద్ధపడగా స్వతంత్ర పార్టీ ఢిల్లీలో అఖిల భారత రైతు సదస్సును ఏర్పాటు చేసింది. భారతదేశం నలుమూలల నుండి లక్షలాది జనం వచ్చి వారి అసంతృప్తిని ప్రకటిస్తారు. ప్రజావెల్లువను గ్రహించి ప్రధానమైన ప్రాథమిక హక్కులలో ముఖ్యమైన వ్యక్తిగత ఆస్తిహక్కును మార్చటానికి నెహ్రూజీ తలపడలేదు. స్వతంత్ర పార్టీ ఆనాడు ఆందోళన చేయకున్న ఈనాడు మనకున్న వ్యక్తిగత ఆస్తి హక్కు ఏనాడో నీరు కారిపోయి ఉండేది. దేశంలో అరాచకం ఎంతగానో ప్రబలి ఉండేదని లచ్చన్నగారు అభిప్రాయ పడతారు. అయితే వ్యక్తుల ఆస్తిపాస్తులు రాజ్యాంగం అనుమతించిన మేరకే ఉండాలన్నది ఆతని ధృఢ అభిప్రాయం.

## సహకార సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

రైతులకు భూములపై గల వ్యక్తిగత హక్కుల్ని రద్దుచేస్తేనే తప్ప సహకార సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు అమలు కావు. చట్టపరమైన ఇబ్బందులు వస్తాయి. అయితే స్వతంత్రపార్టీ ఈ క్షేత్రాల అమలుకు అడ్డుతగిలింది. ఆచరణలో సాధ్యంకాని కార్యక్రమం అని తీర్మానించింది. నేటికి సహకార సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు ఒక్కటి గూడా అమలు కాలేదన్న నాటి స్వతంత్ర పార్టీ ప్రణాళిక విధానం, సిద్ధాంతం తప్పని అనగలమా!.

## ప్రతి ఒక పరిశ్రమను జాతీయం చేసే విధానం సరికాదు

దేశ రక్షణకు సంబంధించిన పరిశ్రమలు, దేశస్థాయిలో గల పరిశ్రమలు మూల(Basic) పరిశ్రమలను జాతీయం చేయాలి తప్పించి, ప్రతి ఒక పరిశ్రమను

బలీయం చేస్తూపోవాలన్న విధానం సరికాదు. కుటీర పరిశ్రమల్ని ప్రోత్సాహించాలి. జాతీయ ఉత్పత్తి విధానం అభివృద్ధి పొందాలి. చిన్నచిన్న పరిశ్రమల వ్యక్తుల చేతుల్లో ఉంటేనే వికసిస్తాయి. అందుకు ఉదాహరణ ''ప్రైవేట్ ఇండస్ట్రీస్'' అభివృద్ధి పొందతుండగా కార్పోరేషన్స్, ప్రభుత్వ పరిశ్రమలు మూలలు పడటం, నష్ట పోవడం నిత్యం మనం నేడు చూస్తున్నాం. ఈనాటికి మనకు ప్రభుత్వ విధానం సరికానందున 7 పంచవర్ష ప్రణాళికలు అమలు అయిన తదుపరి కూడ, విద్యుత్ కొరత, మంచి నీళ్ళ కొరత నిర్బంధ ప్రాథమిక విద్యా విధానాన్ని అమలు పరచ లేక పోవడం-నానాటికీ జాతీయాదాయం సన్నగిల్లుతూ ఉండటం, వ్యక్తిగత ఆదాయాలు తగ్గడం, నిరాశ్రయులైన నిర్భాగ్యులే దాదాపు 30 కోట్లమంది నేడుండగా రాజ్యాంగం పీఠికలో ఉదహరించిన భారతదేశం ఆశయాల్ని అమల్లోనికి తేలేక పోయాము. ఆర్థిక స్వాతంత్ర్యం లేని రాజకీయ స్వాతంత్ర్యం రాజకీయ హక్కుల్ని వ్యక్తుల్ని బాగు చేస్తాయా? సోషలిజం పేరుతో వెళ్లిన పరవాలేదు. నెహ్రూజీ కాంగ్రెస్ సోషలిస్టు తరహా సమాజం అన్నారు. సోషలిస్టు వ్యవస్థ కాదు అటువంటిది నిజానికిది నకిలీ అయి యుండాలి లేదా అందుకు విరుగుడు అయి ఉండాలి. లేక తగనిదై ఉండాలి. అందుకే సోషలిజంపై వ్యాఖ్యానిస్తూ మానవుని అంతరంగానికి పట్టని సిద్ధాంతాలు అమలుకావు. అందుకే ఈనాడు మరల ''గ్లాస్ట్‌నోస్'', ''పెరిస్ట్రోయికా'' అన్న రష్యన్ పదాల అర్థాలను మనం నేడు మరల జ్ఞప్తిలోనికి తెచ్చుకొని అమల్లోనికి తేవాలన్న దారిలోనికి మరల వస్తున్నాం. వారూ వస్తున్నారు.

# 12వ ప్రకరణము

## 1962 ఎన్నికల్లో స్వతంత్ర పార్టీ-లచ్చన్న

భారతదేశంలో జనరల్ ఎన్నికలు వచ్చాయి. స్వతంత్ర పార్టీ దేశ స్థాయిలో పోటీ చేసింది. షుమారు ఆంధ్రప్రదేశ్‌లో అన్ని సీట్లకు స్వతంత్ర పార్టీ పోటీ చేసింది. అభ్యర్థుల ఎంపికలో సర్దార్‌జీ కోస్తా ఆంధ్రా అంతటికి ప్రాధాన్యత వహించి ఆనాటి రాష్ట్ర స్వతంత్ర పార్టీ అధ్యక్షునిగా బెజవాడ రామచంద్రారెడ్డి గారు సెక్రటరీ టి. కృష్ణయ్య చౌదరి రాష్ట్ర ఎంపిక కమిటీ మెంబరు సర్దార్ గౌతులచ్చన్న స్వతంత్ర పార్టీ తరపున పోటీ చేయటానికి నిర్ణయించిన అభ్యర్థులలో సర్దార్ గౌతులచ్చన్న (సోంపేట), బమ్మిడి నారాయణ స్వామి (టెక్కలి), కింజరాపు కృష్ణమూర్తి (హరిశ్చంద్రపురం) సిమ్మ జగన్నాథం (నరసన్నపేట), తంగి సత్యన్నారాయణ (శ్రీకాకుళం), మరిశర్ల వెంకట రామినాయుడు (పార్వతీపురం), జెమ్మాన జోజి (పాలకొండ), కొల్లి కూర్మినాయుడు (బొబ్బిలి) మండవ నరసింహారావు (కొత్తూరు), గొట్టిపాటి బుచ్చప్పారావు (జామి) వి. పాలవెల్లి, చోడవరం రామేశం పంతులు, భీంశెట్టి అప్పారావు (అనకాపల్లి), పాపినాయుడు (ఎలిమించిలి), లచ్చాపాత్రుడు (నర్సీపట్నం), సాంకర అప్పలనాయుడు (కొత్తపేట), సైలాడ పైడితల్లి నాయుడు (విశాఖపట్నం).

స్వతంత్రపార్టీ తరపున రాష్ట్రంలో నాయకులు పర్యటించారు. రాజాజి కూడా వచ్చి పర్యటించారు. చిత్తూరు జిల్లాలో 4గురు, కడపలో 4గురు, అనంతపురంలో ఇద్దరు, నెల్లూరులో ఇద్దరు, గుంటూరులో 5గురు, కృష్ణాలో ఇద్దరు, విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలో 22 గురు స్వతంత్ర పార్టీ శాసనసభ్యులుగా గెలుపొందారు. ప్రతాపలింగం గౌడ్ , యం. జగన్నాధం (వరంగల్).

ఆనాటి రాష్ట్ర శాసనసభలో నున్న పార్టీలు కాంగ్రెస్ స్వతంత్ర పార్టీ ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ జనసంఘం, స్వతంత్రలుగా ఉండేవారు. కాంగ్రెస్ పార్టీ మంత్రి వర్గాన్ని ఏర్పరిచింది. ముఖ్యమంత్రిగా నీలం సంజీవరెడ్డిని అధిష్టాన వర్గం నియమించింది. అనధికార ప్రధాన ప్రతిపక్షం-స్వతంత్ర పార్టీ స్వతంత్ర పార్టీ శాసనసభా నాయకుడు సర్దార్ గౌతు లచ్చన్న గారే.

### ప్రతిపక్ష నాయకునిగా లచ్చన్న

శాసనసభా బయట లోపల ప్రజా కార్యక్రమాల్ని అమలు పరచడంలో ఆరితేరిన దిట్ట-ప్రజలకు ఆయువు పట్టు. సర్దార్‌జీ ఒకనాడు KLP లోనున్న ఆనాడు ఐక్య కాంగ్రెస్‌లో నున్న ఈనాడు స్వతంత్ర పార్టీలో నున్న తనున్న

ఉత్తరాంధ్రలో తనతో పాటు అనేక మంది శాసనసభ్యుల్ని గెలిపించుకొన్న పేరు ప్రఖ్యాతులు సర్దార్ గౌతు లచ్చన్న గారిదే. గౌతు లచ్చన్న గారు ప్రజలు ఉత్తరాంధ్ర మేరకు, రెండుకాదు ఒకటి అన్న నినాదాన్ని నిలిపారు. వీరు ఏ పార్టీ అన్న ప్రజలావాడు ఆ పార్టీ, ప్రజలే పార్టీని కావాలన్న లచ్చన్న గారా పార్టీ.

లచ్చన్న ఆనాడు ఈనాడు ఏనాడు పోరాడుతున్నది కాంగ్రెస్ పార్టీని కాలమట్టి కాలగర్భంలోనికి తోయగలదన్నదే ఆతని అభిమతం. దేశంలో నిరుద్యోగం ప్రబలటానికి, అధిక ధరలు అవటానికి ఉత్పత్తి చేస్తున్న కర్షక కార్మికుల జీవన స్థితి అధోగతి పట్టటానికి కారణం కాంగ్రెస్ విధానాలే దోపిడీ పద్ధతులే. వారసత్వంగా వస్తున్న కుటుంబ పాలనా విధానమే.

అందుకు లచ్చన్న తన ప్రధాన శత్రువుపై లఘించి పోరాటం సలపటానికి తన అమ్ములపొద నుండి అనేక శస్త్రాలను తీసి సంధిస్తున్నారు తన ప్రధాన ప్రత్యర్థిని ఎదిరించ అమ్ముల పొదునుండి, విభిన్న అమ్ములను తీసిన మాట వాస్తవం తప్పించి తను కాంగ్రెస్ పార్టీని ప్రతిఘటించే కార్యక్రమంలో ఏ మాత్రం తప్పుద్రోవ పట్టలేదు తన విధానం పద్ధతి మార్చలేదు.

## భూమి పన్ను హెచ్చింపు చట్టము-లచ్చన్న ప్రతిఘటన

సంజీవరెడ్డి కాంగ్రెస్ ప్రభుత్వం రైతాంగానికి చేసిందేమి లేకపోగా వారికున్న పంట భూములపై రెట్టింపు రెవెన్యూ శిస్తు వేయడం-చట్టం సభలో ప్రవేశ పెట్టడం ప్రతిపక్ష నాయకునిగా లచ్చన్న ప్రతిఘటించారు.

అయిన రోడ్ రోలర్ మెజారిటీయున్న కాంగ్రెస్ ప్రతిపక్షాల వారి మాట పెడ చెవిని పెట్టి చట్టం చేసింది. రైతుల్లో ఆందోళన పెరిగింది.

స్వతంత్ర పార్టీ ఒక కార్యక్రమాన్ని తీసికొన్నది. రాష్ట్ర స్థాయిలో చట్ట వ్యతిరేక పోరాటాన్ని నడిపింది. నాయకులు రాష్ట్ర ప్రధాన పట్టణాల్లో బహిరంగ సభలు జరిపారు. ప్రభుత్వం నిషేదాజ్ఞల్ని జారీ చేసిన ప్రతిఘటించిన సుమారు 5 వేల పైగా స్వతంత్ర పార్టీ అభ్యర్థుల్ని జైళ్లలో నిర్బంధించింది.

అయిన ప్రభుత్వం దారికి రాలేదు. స్వతంత్ర న్యాయస్థానాలే శరణ్యం. అయితే స్వతంత్ర పార్టీ నాయకులు లచ్చన్న రాజగోపాలనాయుడు, సి. నాయుడు, ధనేకుల నరసింహం, నాదెండ్ల వెంకటేశ్వరరావు, రెడ్డిపాటి వెంకట్రావు, గోగినేని లక్ష్మీనారాయణ, పసుపులేటి కోటేశ్వరరావు, యన్. వీరాచారి
సత్యన్నారాయణ, వడ్డే శోభనాద్రి, కొఠారి వెం
బాపయ్య చౌదరి, వాడపల్లి సూర్యనారాయణ రా

(అనకాపల్లి), జి.బి. అప్పారావు (జామి), పాలవెల్లి (చోడవరం), రామేశం పంతులు, శిరిమ్మ జగన్నాధం, బొమ్మిడి నారాయణస్వామి, నిచ్చెర్ల రాములు, తంగి సత్యనారాయణ, చీకటి పరశురాం నాయుడు MLC (పార్వతీపురం), గరిమెల్ల కామేశ్వరరావు, పయిల సుబ్బారావు, కొర్ల హరికృష్ణ చౌదరి, మొదలగు వారు. వారివారి ప్రాంతాల్లో లచ్చన్న నాయకత్వంలో గట్టిగా కృషి సలిపి రైతాంగాన్ని హైకోర్టులో వ్యాజ్యం చేయ సిద్ధం చేసారు.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు శాసనసభ ఆమోదించిన "సర్వే అండ్ రిసెటిల్‌మెంట్ ఆక్టు"ను రద్దుపరచింది. పిటిషన్ పెట్టిన దరఖాస్తుల నందలి వాదనలతో హైకోర్టు ఏకీభవించింది.

(1) భూములు నిజానికి 8 తరగతులు

(2) భూ వర్గీకరణ జరిగి, భూముల వివరాలను స్థిరీకరించి సర్వే జరిపించాలి.

(3) భూములపై హెచ్చు ఫలసాయం ఆదాయం వచ్చినట్లుగా ప్రభుత్వం నిరూపిస్తేనే తప్ప భూములపై హెచ్చింపు పన్నులు ప్రభుత్వం శాసన రీత్యా పెంచటానికి వీలుపడదు.

అందువలన ఫలసాయం ఆదాయం తరగతి నిర్ధారణ చేయబడాలి: ఆమేరకు భూములపై పన్నులు చెల్లించాలి. అందువలన శాసనసభ చేసిన చట్టాన్ని హైకోర్టు కొట్టివేసింది స్వతంత్రపార్టీ - స్వతంత్రపార్టీ నాయకులు చేసిన ఘనకార్యాల్లో రైతులకు చేసిన మహోపకారాల్లో ఇది ఒకటి.

## బలహీన వర్గాల భాగ్యోదయానికి ఇల్లు కుదవపెట్టి పత్రికను స్థాపించిన లచ్చన్న

బలహీన వర్గాలకు జరుగుతున్న అన్యాయాలను అక్రమాలను బట్టబయలు చేసితీరాలన్న పట్టుదలతో ఎన్ని బహిరంగసభలో ఉపన్యసించిన ఎన్నికల పత్రాలు వ్రాసిన వన్ని పత్రికల్లో ప్రచురించిన తన అక్కసు తీరలేదు. ఒక పత్రికను స్థాపించి వారపత్రికగా స్థిరంచేసి, బహుజనులుగా ఉన్న బలహీనవర్గాల్లో చైతన్యం తేవటానికి వారివి ముందుకు నడపటానికి పత్రికను ఒక సాధనంగా చేసుకోవాలన్న తపనతో తనవద్ద పెట్టుబడికి అంతసొమ్ము లేకున్నా-తనున్న స్వతంత్రపార్టీ ఇందుకు తనకు సహకరించకపోయిన, తను నివసిస్తున్న హైదరాబాదులో నున్న "బహుజనకుటీర్" ఇంటిని ఆంధ్రప్రదేశ్ స్టేట్ ఫైనాన్షియల్ కార్పొరేషన్ వారికి తనఖాపెట్టి సుమారు 1లక్ష రూపాయిల్ని అప్పుచేస్తారు.

లోగడనే బందరు రైసుమిల్లు ప్రొ. ప్రసాదరావు కొనకళ్ల గణపతి సిఫారుసుపై

నోటిమాటపై 20వేలు లచ్చన్న గారు సెకండ్ హాండ్ ప్రెస్‌ను కొంటారు. అంతేగాక ఆంధ్రాబ్యాంక్ నుండి వర్కింగ్ కాపిటేషన్‌ను సంపాదించి బహుజన వారపత్రికను నడపటానికి సిద్ధపడ్డారు. కోపులవెలమ కులాభి వృద్ధి సంఘాన్ని 1944 లోనే స్థాపించి ఎంతో వెనుక బడి, మూలబడి మూల్గుతున్న తన కులాల్లో రాజకీయ చైతన్యాన్ని తెచ్చి పెట్ట సిద్ధపడి రానురాను విశాలభావంపై ప్రాంతం-రాష్ట్రం-దేశ, బాగుపడాలన్న తపన దీక్షతో వెనుకబడిన కులాల్ని వర్గాల్ని ఉద్ధరించి తీరాలన్న పట్టుదలతో రైతాంగాన్ని బాగుచేయగా రాజకీయాల్లో ప్రవేశించి ఒక నాటికి లచ్చన్న గారి సహచరుడై కొన్నాళ్ళకు అనుచరుడై పార్వతీపురం ప్రాంతంలో మేధావి, బలహీన వర్గాల రాజకీయ నాయకుడు అనిపించుకున్న చీకటి పరుశు రాంనాయుడు గారిని, శాసనసభ నియోజక వర్గం నుండి స్వతంత్ర పార్టీ శాసనమండలి సభ్యునిగా ఎంపిక చేసింది. త్రిపురాన రాఘవ దాసుని స్థానిక సంస్థల నియోజక వర్గం నుండి స్వతంత్ర పార్టీ గెలిపించింది.

1952 లో రంగాజీ గుంటూరు నియోజక వర్గంలో కమ్యూనిష్టు అభ్యర్థి కొల్లా వెంకయ్య చేతుల్లో ఓడిపోతారు. అయితే మహామేధావి పార్టీ నిర్మాణకర్త సిద్ధాంతవేత్త అయిన రంగాజీని KLP రాజ్యసభ సభ్యునిగా గెలిపిస్తుంది.

తదుపరి మరల 1957లో రంగాజీ గెలుపొందారు. అయితే 1962లో గుంటూరులో మరల నడింపల్లి నరసింహారావు కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి చేతుల్లో రంగాజీ ఓడిపోతారు.

అయితే కొద్ది మాసాల్లో చిత్తూరు పార్లమెంటు స్థానంలో గెలుపొందిన అనంత శయనం అయ్యంగారు మరణించగా అదే స్థానంలో ఉప ఎన్నికల్లో రంగాజీ చిత్తూరు నుండి స్వతంత్ర పార్టీ తరపున పార్లమెంటుకు పోటీ చేసి 800 ఓట్లు తేడాతో గెలుపొందారు. ఎన్నికల యుద్ధం అనే చెప్పాలి. రాజాజీ ఒక ప్రక్క, ఇండియన్ కాంగ్రెస్ నెహ్రూ ఒక ప్రక్క నిలిచి పోరాటం సలిపారు. అఖిలాంధ్ర రైతాంగం చిత్తూరు వెళ్లి రంగాజీని గెలిపించటానికి అహర్నిశలు కృషి సలిపారు.

మరల 1962 ఎన్నికల తదుపరి శ్రీ నీలం సంజీవరెడ్డి గారే కాంగ్రెస్ రథాన్ని నడిపించే నాయకులయినారు. మంత్రివర్గం ఏర్పడింది-''నీలం'' ముఖ్యమంత్రి-అసాధారణ రాజకీయ చతురుడు-పరిపాలనా దక్షుడు. పదవిని అవసరమైన తృణప్రాయంగా భావించి విడిచిపెట్టగల రాజనీతిజ్ఞుడు-సంజీవరెడ్డి. తప్పుడు విధానాల్ని అనుసరిస్తున్న ఏ అధికారపార్టీనైన ఎదిరించగల గుండెధైర్యం కలవారు లచ్చన్న.

అందువలననే వారిరువురు ఒక తరం రాజకీయాలకు ప్రతినిధులు. నీలం మంత్రివర్గంలో గల ప్రముఖులు. రెవిన్యూ - రామచంద్రారెడ్డి, ఆర్థికశాక -

బ్రహ్మానందరెడ్డి, పంచాయితీరాజ్ - చెన్నారెడ్డి, విద్య - పి.వి. రాజులు, నీటిపారుదల - ఎ.సి. సుబ్బారెడ్డి. తెలంగాణా ప్రాంతంనుండి మంత్రివర్గంలోనికి సహాయమంత్రిగా ప్రవేశించారు సి.వి. నరసింహారావుగారు.

# 13వ ప్రకరణము

## 1967 జనరల్ ఎన్నికల్లో-స్వతంత్రపార్టీ

జాతీయస్థాయిలో ఎన్నికలలో పోటీ చేస్తున్న పార్టీలు కాంగ్రెస్ స్వతంత్రపార్టీ కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీ, జనసంఘం. కాంగ్రెస్ అధినేత నెహ్రూ స్వతంత్ర పార్టీ నిర్మాత. రాజాజీతో సిద్ధాంతపరమైన సమరం సాగించారు. దేశం నలుమూలలు తిరిగి స్వతంత్ర పార్టీ పై ప్రచారం చేసారు. స్వతంత్రపార్టీ దేశస్థాయిలో కాంగ్రెస్‌పై జబ్బుచరిచింది. మిశ్రమ ఆర్థిక వ్యవస్థపేరున వ్యక్తిగత ఆస్తిహక్కును స్వేచ్ఛాస్వాతం త్రాల్ని హరింపచేస్తున్నది కాంగ్రెస్ ఓడించండని రాజాజీ ఎలుగెత్తి చాటారు. నాటికి నేటికి ఒకనాటికి ఏనాటికి ప్రపంచ కార్మికుల్లారా ఏకంకండు అంటూ శ్రామికశక్తిని గెలిపించమని ఓటర్లను కమ్యూనిస్టు పార్టీ కోరింది. లోహియా సోషలిస్టుపార్టీ ఒక్కటే దేశానికి గమ్యమని, శరణ్యమని, సమసమాజ స్థాపన జరిగితీరాలని, నెహ్రూజీ చెబు తున్న భూటక సోషలిజం అని దేశం నలుమూలలా తిరిగి సోషలిస్టుపార్టీ తన సిద్ధాంతాన్ని ప్రతిధ్వనింప చేసింది.

ఆంధ్రప్రదేశ్ లో స్వతంత్రపార్టీ ఎన్నికల రంగంలోనికి దిగింది. రాష్ట్ర స్వతంత్రపార్టీ అధ్యక్షులు బెజవాడ రామచంద్రారెడ్డి, సెక్రటరీ కృష్ణమ్మ చౌదరి ఇతర ప్రధాన స్వతంత్రపార్టీ నాయకులు పి.వి. రమణ, కొమ్మారెడ్డి, బాపయ్య చౌదరి, జాగర్లమూడి చంద్రమౌళి (గురుపాదం) ధనేకుల నరసింహం, నెల్లూరు పి. రాజగోపాల నాయుడు (చిత్తూరు).

1967లో ఒరిస్సాలో స్వతంత్రపార్టీ తరపున లచ్చన్నగారు వెళ్లి ప్రచారం చేసారు. బరహంపూర్, కొరాపూట్, పర్లాకిమిడి, జయపూర్ మొదలగు ప్రధాన పట్టణాల్లో ఎన్నికలసభల్లో ప్రసంగించారు. కాంగ్రెస్‌ను ఓడించమని ప్రజలను కోరారు.

1962లో కామరాజు పథకం నాడార్ ప్రవేశపెడతారు. నెహ్రూ నాడార్ పథకం మేరకు నీలం సంజీవరెడ్డి రాజీనామా యిస్తారు. మద్రాసు ముఖ్యమంత్రి నాడార్‌ను కాంగ్రెస్‌కు అధ్యక్ష పీఠానికి అంపిచారు. నెహ్రూజీ ఈవ్యూహం ఎత్తుగడలో నీలం వారిని కేంద్ర ప్రభుత్వమునకు తీసుకొని ఇనుము-ఉక్కు గనులశాఖా మాత్యులుగా నియమిస్తారు. నీలం సంజీవరెడ్డి స్థానంలో రాష్ట్ర ముఖ్యమంత్రి ఎవరిని నియమించాలన్న సమస్యపై కాంగ్రెస్‌లో అంతర్గత మార్గాలు బయలుదేరాయి. సంజీవరెడ్డిని ప్రతిఘటించే వ్యక్తిగా సత్యన్నారాయణ రాజు పేరందినారు. బ్రహ్మానంద రెడ్డిని సంజీవరెడ్డి ప్రతిపాదిం చగా వలదని సత్యన్నారాయణ రాజు తిరుగుబాటు చేస్తారు.

స్వతంత్రపార్టీ శాసనసభ ప్రతిపక్ష నాయకునిగా నాడున్న సర్దార్ లచ్చన్న బలహీన

వర్గాల నుండి ముఖ్యమంత్రిగా ఏ ఒకరు వచ్చిన రాష్ట్రానికి శుభదాయకం అంటూ ప్రకటన లిచ్చారు.

కాంగ్రెస్ పార్టీలో చివరికి ఒక అంగీకారానికి వచ్చింది. రాజీ అభ్యర్థిని తెచ్చాం. సత్యన్నారాయణరాజు గాక ఏ ఒకరైన నేను సిద్ధమే అని సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి మినహా ఏ ఒకరైన నాకభ్యంతరంలేదని సత్యన్నారాయణ రాజు అనగానే సంధి కుదిరింది. అయితే రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు వారికి ఎవరు ముఖ్యమంత్రి కావాలో చెప్ప మన్నారు. రాయలసీమకు చెందిన సంజీవయ్య పేరును సూచించారు. ఇందుకు అభ్యంతరం నీలంవారు చెబుతారని ఆశించిన రాజుగారికి ఆశాభంగమే ఎదురైందని ఆనాటి సంఘటనల్ని పేర్కొంటూ సర్దార్‌జీ ప్రవచించారు.

సురాసురులు క్షీరసాగర మధనంలో పాల్గొనగా మోహినీవలె సంజీవయ్య ఉద్భవించా రవి లచ్చన్న వ్యాఖ్యానించారు. ఏది ఏమైన చరిత్రలో మొదటిగా భారతదేశంలో ఒక రాష్ట్రానికి హరిజనుడు ముఖ్యమంత్రిగా రూపొందిన దినం.

1951లో హైకోర్టులో రద్దుచేయబడిన వెనుకబడిన తరగతుల జాబితాలను పునరుద్ధ రించిన కీర్తిప్రతిష్టలు శ్రీ సంజీవయ్యగారికే దక్కుతాయి. సాంఘికంగా విద్యావిషయి కంగా వెనుకబడిన తరగతిని ప్రాతిపదికలేని ''కాపు'' కులాన్ని వెనుకబడిన తరగతుల జాబితాలో చేర్చినందున మరల హైకోర్టులో ఈజాబితాపై రిట్ పిటిషన్ దాఖలుకాగా, హైకోర్టు మొత్తం జాబితాలను రద్దు చేసింది.

1962లో చైనా మన ధేశంపై దండయాత్ర చేసిన సందర్భంగా లచ్చన్న కాంగ్రెస్‌పై ఉన్న ద్వేషం ఎదురుప్రచారాన్ని విస్మరించి దేశ సమగ్రతను సుస్థిరతను జాతీయతను దృష్టిలో విడుకొని నెహ్రూజీని సమర్థించినారు. అన్నివిధాలా చైనా దండయాత్రను త్రిప్పికొట్టడానికి కాంగ్రెస్ పార్టీకి కొండంత బలంగా నిలిసి, జాతీయవాది అనిపించుకొ న్నారు. మరల 1965లో మవదేశంపై పాకిస్తాన్ దండెత్తగా ఒక రాష్ట్రశాసన సభాప్రతిపక్ష నాయకునిగా తవ విధిని తానుప్రజలందరు దేశం మెచ్చుకోదగిన రీతిని కృషి చేసారు.

1964 మే 27వ తేదీన భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ పరమపదించాగా, ఆనాటికి ఢిల్లీలో మున్న సర్దార్‌జీ నెహ్రూ అంతిమ యాత్రలో పాల్గొని ''తీన్ మోర్తిభవనం'' కివెళ్లి ఆతని భౌతికకాయంపై ఒక పూలమాలను వేసి ఆతని అంతిమ యాత్రలో పాల్గొంటారు.

1964 మార్చి 30వ నెహ్రూ జీవించి ఉండగా వ్యక్తిగత పట్టా హక్కుల రద్దు చేస్తూ పహకార క్షేత్రాల్ని అమలు పెట్టటానికి నెహ్రూ రాజ్యాంగానికి 17వ సవరణ తెచ్చిపెడతారు. స్వతంత్రపార్టీ దేశ స్థాయిలో దీనిపై ఆందోళనలు సాగుతాయి.

బ్రహ్మాండంగ సత్యాగ్రహాలు జరుగుతాయి. జైళ్లకి వెళతారు. 1964 మార్చి 30వతేదీ ఢిల్లీలో భారత కిసాన్ సమ్మేళన రాజాజీ అధ్యక్షతన ''ర్యాలీ'' జరుగుతుంది. పెల్లుబికిన ప్రజాభిప్రాయమని, జడిసి నెహ్రూజీ తన రాజ్యాంగ సవరణను విరమించు కొంటారు. నిజానికి స్వతంత్రపార్టీకి రైతాంగానికి సమకూర్చిన జారిపోతున్న రైతుల హక్కుల్ని కాపాడిన ఘనత దక్కుతుంది.

ఆనాటి భారత దేశస్థాయి రాజకీయ పార్టీలు కాంగ్రెస్ జన సంఘ్, స్వతంత్ర పార్టీ సోషలిస్టు, కమ్యూనిష్టు పార్టీలు రాష్ట్రస్థాయిలో శాసనసభకు, దేశ స్థాయిలో లోక్ సభకు ఒకే మారు ఎన్నికలు జరిగాయి.

సర్దార్ గౌతులచ్చన్న సోంపేట నియోజనక వర్గం నుండి మరల స్వతంత్ర పార్టీ అభ్యర్థిగా పోటీచేసి గెలుపొందారు. అంతేగాక శ్రీకాకుళం పార్లమెంటరీ స్థానానికి కూడ పోటీచేసి గెలుపొందారు. స్వతంత్రపార్టీ మొత్తం శాసనసభకు 23గురు ఎన్నికయినారు. నెల్లూరు జిల్లాలో ఇరువురు గెలుపొందారు. ధనికల నరసింహం (నెల్లూరు), చిత్తూరు జిల్లాలో 3గురు గెలుపొందారు, కడపలో ఇరువురు గెలుపొందారు.

స్వతంత్ర పార్టీ అభ్యర్థులుగా పోటీచేసి గెలుపొందిన శాసన సభ్యులు. శ్రీకాకుళం జిల్లాలో లచ్చన్న-సోంపేట, కింజరావు కృష్ణమూర్తి (హరిచ్చంద్రపురం), శిమ్మ జగన్నాధం (నరసన్నపేట), తంగి సత్యన్నారాయణ (శ్రీకాకుళం), జమ్మానజోజి (పాలకొండ), మరిశర్ల వెంకట రామినాయుడు (పార్వతీపురం), మెరంగి రాజా (నాగూరు), చౌదరి సత్యన్నారాయణ (షేరమ మహ్మద్‌పురం). విశాఖపట్నం పాలవెల్లి (చోడవరం), జి.బి. అప్పారావు (జామి), బుచ్చయ్య చౌదరి (గుంటూరు), ఎడ్లపాటి వెంకట్రావు (గుంటూరు).

1964లో శాసనమండలి సభ్యునిగా ఎన్నుకోబడిన స్వతంత్రపార్టీ నాయకుడు చీకటి పరశురాం నాయుడు తన పదవీ కాలం శాసనమండలి సభ్యునిగా ఉన్నందున 1967లో శాసనసభకు పోటీచేయలేదు. మరల కాంగ్రెస్ పార్టీయే రాష్ట్రంలోను కేంద్రంలో అధికారంలోనికి వచ్చింది. మరల లచ్చన్నగారే ప్రధమ ప్రతిపక్ష స్వతంత్రపార్టీ నాయకునిగా ఎన్నుకోబడినారు. అంతేగాక లచ్చన్నగారే పబ్లిక్ అక్కౌంట్ కమిటీ ఛైర్మన్‌గా ఎన్నుకోబడినారు. సుమారు 10 ఏండ్లు పబ్లిక్ అక్కౌంట్ ఛైర్మన్‌గా పనిచేసిన ఘనత అవకాశం ఒక్క లచ్చన్న గారికే దక్కింది.

నీలం సంజీవరెడ్డిగారు కేంద్రం నుండి మరల రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఎన్నుకోబడతారు. ఆనాటికి శ్రీమతి ఇందిరాగాంధి భారతదేశ ప్రధానమంత్రిగా ఉండేవారు. రాష్ట్ర ఎన్నికల ప్రచారానికి విచ్చేసిన జాతీయ దేశస్థాయి స్వతంత్ర పార్టీ నాయకులు

మినుమసాని, దండేకర్, షీలూమోడి, కర్పూరీ ఠాకూర్, రాజాజీ, రంగాజీ.

1967లో శాసన సభ్యునిగ పార్లమెంటు సభ్యునిగా గెలిచిన లచ్చన్న ఏదో ఒక స్థానానికి రాజీనామా యివ్వ తప్పనిపరిస్థితి. అయితే కనీసం లచ్చన్నగారు ఢిల్లీవెళ్లి ప్రమాణస్వీకారం చేయలేదు. చేయగల పరిస్థితి రాలేదు. స్వతంత్రపార్టీ పార్లమెంటరీ బోర్డు సభ్యునిగా లచ్చన్న మద్రాస్ సమావేశంలో పాల్గొనటానికి వెళ్లగా రాజాజీ రంగాజీలు ఇతర నాయకులు శ్రీకాకుళం స్థానానికి రాజీనామా యిచ్చి రంగాజీని నిలిపి గెలిపించ మంటారు. లచ్చన్న గారు ఢిల్లీ వెళ్లి ప్రమాణ స్వీకారం చేసిన తదుపరి ఆ సీటుకు రాజీనామా చేయవచ్చు. అయితే ఈలోగా లచ్చన్నగారు పార్లమెంటు సభ్యునిగా కొనసాగటానికి ఇష్టపడతారేమోనన్న పెద్దల భయాందోళనలను దృష్టిలో నిడికొని పార్టీలో పెద్దలు రాజాజీ, రంగాజీని బై ఎలక్షన్‌లో శ్రీకాకుళం పార్లమెంటరీ స్థానానికి నిలబెట్టి లచ్చన్నగారు రంగాజీని గెలిపించమని లచ్చన్నను కోరతారు. ఎంతో మెజారిటీతో రంగాజీ గెల్పించిన అకీర్తి లచ్చన్నగారిదే. ఈ గెలుపు పై ఓడిపోయిన బొడ్డేపల్లి రాజగోపాలరావు అభ్యర్థి దావావేస్తారు. 3 సంవత్సరాలు నడుస్తుంది.

అదనపు శిస్తుల హెచ్చింపు చట్టాన్ని 1963లో నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఉండగా ప్రవేశపెట్టగా స్వతంత్రపార్టీ ప్రతిఘటిస్తుంది. లచ్చన్నగారు తదితర నాయకులు సత్యాగ్రహాల్లో పాల్గొంటారు. సుమారు 5 వేల మందిని జైల్లో నిర్బంధించారు. హైకోర్టులో దావా వేస్తారు.

రైతాంగాన్ని బాధించగల చట్టమును ప్రవేశపెట్టినందున శాసనసభలో కూడ లచ్చన్న పోరాడుతారు. స్పీకర్‌పై తలపడి లౌడ్ స్పీకర్‌ను లాగి, తన ఆవేశాన్ని ఉక్రోషాన్ని ప్రభుత్వంపై చూపెట్టిన సన్నివేశాలున్నాయి. తదుపరి సుప్రీంకోర్టులో కేసువేసి శిస్తు హెచ్చింపు పద్ధతి సరికాదని తీర్పును పొందారు. రాష్ట్ర స్థాయిలో పి.ఏ. చౌదరి కేంద్రస్థాయిలో గజేంద్ర గడ్కర్ కేసును వాదించారు. తుదకు కేసును గెలిచారు చట్టం అమలులోనికి రాలేదు.

1962లో నీలం ముఖ్యమంత్రిగా నుండగనే బస్సుల జాతీయంపై చట్టం వచ్చింది. మరల 1967లో ముఖ్యమంత్రిగా విచ్చేసిన నీలంవారు బస్సుల జాతీయకార్యక్రమం అమల్లోకి తేవాలని నిర్ణయిస్తూ మొదటిగా కర్నూలు జిల్లాలో గల బస్సుల్ని జాతీయం చేస్తూ నోటిఫికేషన్ యిస్తారు. అందుపై కర్నూలు జిల్లాలో పేరెన్నికగన్న ట్రాన్స్‌పోర్టు యం.జి. బ్రదర్స్ హైకోర్టులో రిట్ వేస్తారు. ఆ రిట్‌లో సంజీవరెడ్డి గారు రాజకీయంగా తమ ప్రత్యర్థి వారి రాజకీయ పార్టీకి వారు మొదటి నుండి అడ్డు తగులుతున్నందున, కక్షతో రాష్ట్రంలో ఎచట అమలు పరచని చట్టాన్ని మొదటగా కర్నూలు జిల్లాలోనే అమలు పరచారని అక్రమం, అన్యాయం అని వాదించారు.

హైకోర్టువారు పరిశీలించి, జాతీయం చేయ కార్యక్రమం ప్రభుత్వం అమలు పరచుటలో అక్రమం ఉందని తీర్పు ఇచ్చింది.

నిజానికీతీర్పుపై నీలం సంజీవరెడ్డి గారు తీసికొన్న రాజకీయ నిర్ణయాలే ఆతని శాశ్వతకీర్తి ప్రతిష్టల్ని నేటికి తెచ్చిపెడుతూ ఉంది. హైకోర్టు తీర్పు దినపత్రికలు జూచిన ''నీలం'' వారు వెంటనే తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యిచ్చారు. న్యాయస్థానాల పవిత్రతను కాపాడినారు. నిజానికి ఆ తీర్పులో సంజీవరెడ్డిగారి పేరు ఎచటను ప్రస్తావించలేకపోయిన తన ప్రభుత్వ విధానం తప్పని చెప్పిన మరుక్షణం పదవి నుండి తప్పుకొన్న రాజకీయ నాయకుడు.

హైకోర్టు తీర్పును గౌరవించిన నీలం వారికి ఆనాటి శాసనసభా పార్టీపక్ష నాయకుడు గౌతు లచ్చన్నగారు ఎంతగానో అభినందించారు.

## 1967 శిస్తు హెచ్చింపు చట్ట వ్యతిరేకోద్యమం

స్వతంత్రపార్టీ శాసనసభా నాయకత్వ పదవి చేపట్టిన లచ్చన్నగారిని కాంగ్రెస్ ప్రభుత్వం ప్రతిపక్షాల మాటనుకాదని, శిస్తు హెచ్చింపు చట్టాన్ని రూపొందించింది. రూపాయికి రూపాయిని శిస్తు హెచ్చింపు జరిగింది. అయితే రీసర్వే సెటిల్‌మెంట్ మొదట చేయకుండా శిస్తులు పెంచకూడదు. చట్టరీత్యా కూడని పని. వ్యవసాయిక ఉత్పత్తుల ధరలు పెరిగాయి. కాబట్టి భూమిశిస్తులు పెంచాలని ప్రభుత్వంవారు జీవన వ్యయం పెరిగినందున వ్యవసాయక ఉత్పత్తుల ధరలు పెరిగిన లాభంలేదు. కారణం వ్యవసాయిక మదుపులు కూలి రేట్లు పెరిగాయి.

ప్రజాందోళనలు జరిపిన సత్యాగ్రహోల్ని జరిపిన సుమారు 5 వేల మందిపైగా జైల్లోకి వెళ్లారు. అయిన ప్రభుత్వం తనకున్న రోడ్డురోలరు మెజారిటీ 'ఆధారంగా చట్టాన్ని అమలు పరచారు.

ఇక న్యాయస్థానాలకు వెళ్లవలసిన పరిస్థితి వచ్చింది. హైకోర్టులో ప్రజలకు అనుకూలంగా తీర్పు వచ్చింది. ప్రభుత్వం తన మొండి పట్టుదలను విడువక సుప్రీంకోర్టుకు అప్పీల్ చేసిన సుప్రీంకోర్టు కొట్టివేసింది. చట్టం అమలులోనికి రాలేకపోవటానికి ఆనాటి ప్రతిపక్ష నాయకుని సర్దార్ లచ్చన్న పాత్ర గణనీయమని వేరే ముదువవసరమే లేదు.

## 1968 తుఫాను బాధితుల సమస్య

ఉత్తరకోస్తా శ్రీకాకుళం నుండి గంజాం జిల్లా గోపాలపురం వరకు తుఫాను తాకిడికి గురి అయింది. ప్రకృతి కల్పించిన భీభత్సాన్ని మానవుడు తట్టుకొని నిలబడాలి. అయిన ఆనాటి శ్రీకాకుళం జిల్లా కలెక్టరు B.R.K. శాస్త్రి ఉపేక్షవహి

విధానాన్ని అమలుపరుస్తున్నారని తుఫాను బాదితులు ఆదుకోలేదని లచ్చన్న ప్రకటన ఇచ్చారు. కలెక్టర్ రెట్టింపు సంఖ్యలో వరదబాదితుల సహాయాన్ని ప్రభుత్వం నుండి అందించారు. ఆనాటికి రంగాగారు స్వతంత్ర పార్టీ లోక్‌సభ సభ్యులు శ్రీకాకుళానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో శాసనసభ సభానాయకుడు లచ్చన్న.

ప్రభుత్వం తుఫాను బాదితుల సహాయార్థం ప్రకటించిన కార్యక్రమాల్లో సముద్రం తాకిన భూముల్ని సందర్శించే పథకాల్ని చేపట్టరాదు. ఇచ్చాపురం సముద్రతీరాన గల పల్లపుభూముల్ని వానకాలపు వర్షాలవల్ల వరద ముంపిడికి, ఉప్పునీరు ముంపుడికి గురికాకుండా 30 ఏండ్లుగ పెండింగులో నున్న ''గుడారి గెడ్డ స్కీము'' ను జీవమిచ్చిన వారు లచ్చన్న. కేంద్ర ఇరిగేషన్ శాఖామాత్యులు కె.యల్. రావు వచ్చి లచ్చన్న తదితర నాయకుల కోరికపై ఆ ప్రాజెక్టును మంజూరు చేసారు. కొబ్బరి తోటల్ని పోగొట్టుకున్న వారికి తగిన ఆర్థిక సహాయం అందచేసారు.

# 14వ ప్రకరణము

## ప్రత్యేక తెలంగాణోద్యమం-లచ్చన్న

### శ్రీబాగ్ ఒడంబడిక

ఒకనాడు మద్రాస్ నుండి ఆంధ్ర విడివడటానికి రాయలసీమ ప్రజలు వారిని సర్కారు జిల్లాలవారు అణగద్రొక్కుతారేమో నన్న భయసందేహాలను పారద్రోలటానికి శ్రీబాగ్ ఒడంబడిక జరిగింది. 1936 నవంబరు 16వ తేదీన ఆంధ్రపత్రిక సంపాదకులు కాశీనాధుని నాగేశ్వరరావు గృహము "శ్రీబాగ్" నందు సమావేశమైనది. సమావేశ పెద్దలు కొండా వెంకటప్పయ్య పంతులు దేశిరాజు హనుమంతరావు, కడప కోటిరెడ్డి, సీతారామిరెడ్డి, వల్లూరి సుబ్బారావు, గాడిచెర్లహరి సర్వోత్తమ రావు.

1. విశ్వ విద్యాలయాలు వాల్తేరులోవ - అనంతపూర్‌లోను ఏర్పడాలి.
2. కోస్తా ప్రాంతాల స్థాయిలో - తుంగభద్ర పెన్నానది జలాల వినియోగం జరగాలి.
3. విశ్వ విద్యాలయం రాజధాని - హైకోర్టు స్థాపన ఒకేచోటు గాక వలుచోట్ల పెట్టాలి.

ఆంధ్రప్రాంతం రాయలసీమ ప్రాంతం ఒక రాష్ట్రంగా మనగలగ టానికి ఈ ఒప్పందం అవసరమైనది.

### పెద్దమనుష్యుల ఒప్పందం

అట్లాగే 1957లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడటానికి వేరొక ఒడంబడిక జరిగింది. పెద్దమనుషుల ఒప్పందం సభ్యులు శ్రీ సంజీవరెడ్డి, చెన్నారెడ్డి, గౌతులచ్చన్న, బెజవాడ గోపాలరెడ్డి ఫలితంగా ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగింది. ఒకే భాష సంస్కృతి ఆచార సాంప్రదాయాలుగల ఈ ప్రాంతాల ప్రజల మధ్య ఒడంబడికలు ఏల అవసరమైనయి. ఒకరిపై ఒకరికి గల అపోహలు అనుమానాలు కారణం. వీటిని నివారించడం ఎలా. కట్టలు తెగి ప్రవహించే ప్రజాభిప్రాయానికి ఈ ఒడంబడికలు నిలుస్తాయా.

రాజకీయాల్లో ప్రాంతీయ భావాలు, బాషాబేదాలు తీవ్రతరమైయావి. భూమి పుత్రులకు ప్రాధాన్యం అన్నది బలపడసాగింది. ప్రాంతాల ప్రజల మధ్య అనుమానాలు అంతరాలు అసూయాద్వేషాలు తీవ్రమైనాయి.

సర్కార్ ప్రాంతం నదీపరీవాహక ప్రాంతం. రాయలసీమ వీటివవరులు

లేనిప్రాంతం. ఇక తెలంగాణా దక్కను పీఠభూమిపై ఉంది. భౌగోళిక స్థితిగతులలో ఈమూడు ప్రాంతాలు త్రివిధాలైన పరిస్థితులకులోనై ఉంటాయి.

తెలంగాణా నైజాం పాలనలో క్రుంగి కృశించిపోయింది. ఉత్తరాంధ్ర జమీందారులు రైతుల రక్తనాళాల్ని పిండుకు తిన్నారు. ఇక రాయలసీమలో అభివృద్ధికి అవకాశాలే సన్నగిల్లాయి.

## తెలంగాణోద్యమానికి కారణాలు

సర్కార్ రాయలసీమ ప్రజలు విద్య ఉద్యోగాల్లో ముందంజ వేశారు. చాలా ఉద్యోగాల్లో పూర్వపు ఆంధ్ర రాష్ట్రం వారు అధికంగా ఉండేవారు. తెలంగాణా అభివృద్ధికి కేటాయించిన నిధులు దానికై ఖర్చు పెట్టలేదు.సర్కారు ప్రాంతానికి చెందిన ఆంధ్రులు. తెలంగాణాలో స్థిరపడి వ్యావసాయిక భూములను ఆక్రమించుకొన్నారు. పొలాల్లో పని చేసేవారు తెలంగాణావారు భూస్వాముల తెలంగాణేతరులు. హైదరాబాదు నివాసస్థలాలకి ముల్కీ సర్టిఫికెట్లను తెలంగాణేతరులు సంపాదించారు. ఉద్యోగ-వ్యవసాయ రంగాలలో తెలంగాణేతరులు ప్రాధాన్యం పొందడం స్థానికులకు కన్నెర్ర అయింది. 1956లో సంజీవరెడ్డిగారు ముఖ్యమంత్రి కనీసం ఉప ముఖ్య మంత్రి తెలంగాణా ప్రాంతానికిచ్చిన బాగుండేది. ఉప ముఖ్యమంత్రి ఆరవ వ్రేలి వంటిదని నిరుపయోగమని శ్రీ రెడ్డిగారి అభిప్రాయం. పెద్దమనుషుల ఒప్పందాన్ని గౌరవించలేదనే అపోహ తెలంగాణా ప్రజల్లో కలిగింది. ఆంధ్రుల్ని తరిమివేస్తే వారు చేస్తున్న ఉద్యోగాల్ని పొందవచ్చని వారి ఆస్తుల్ని స్వాదీనం చేసుకోవచ్చని కొందరు విద్యావంతులు చదువులేని వారిని రెచ్చగొట్టారు. ప్రత్యేక తెలంగాణాలోనే వారి చరిత్ర, సంస్కృతి, భాష వికసిస్తుందన్న వాదన చెలరేగింది.

ఆనాటికి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి కాంగ్రెస్ అదిష్టాన వర్గం ఏర్పాటు వాదాన్ని ఖండించింది. రాష్ట్ర ప్రభుత్వం ఉద్యమానికి ఎదురుదెబ్బ తీసింది.

ఆనాటి రాష్ట్ర స్వతంత్ర పార్టీ నాయకుడు సర్దార్ గౌతులచ్చన్న తన పార్టీ అభిప్రాయాల్ని ప్రకటించారు. తెలంగాణోద్యమం సక్రమైనదే అని చాటిచెప్పారు. ఒక భాష మాట్లాడేవారయి వంతమాత్రాన ఒక రాష్ట్రంలోనే ఉండాల్సిన పనిలేదు. ఎన్ని రాష్ట్రాల పరిధిలో మున్నవారెల్లరిది ఒకే జాతి, సంస్కృతి, చరిత్ర అవుతుంది. అపోహాలురానే కూడదు. వచ్చిన వెంటనే విడిపోవడం ఉత్తమం అన్నదమ్ములు విడివడివ మరల ఏక కుటుంబికులుగా మనగలగలేదు. విడివడి కలసి కట్టుగా అన్నిటిలో ఉండటానికి అభ్యంతరం ఏమిటి? హిందీ భాష మాట్లాడే ప్రజలు [illegible] ఏడు రాష్ట్రాల్లో ఉన్నారు. వారంతా ఒకే రాష్ట్రంలో ఉండాలని

కోరుకుంటమా? తెలంగాణా ఆంధ్ర నుండి విడివడిపోవడం తప్పుకాదన్నది తమ వాదం అని సర్దార్‌జీ ప్రకటించారు.

కోస్తా ఆంధ్ర జిల్లాల నుండి వేలాది ప్రజలు హైదరాబాదు నగరంలో చేరడంతో సాంఘిక పరమైన ఇబ్బందులు కొన్ని ఏర్పడినాయి. ఆంధ్రప్రాంతంవారు వచ్చి తెలంగాణాలో సాధించిన అభివృద్ధిని పరిగణించక వారి ప్రయోజనాల్ని ఆంధ్రులు దోజుకొంటున్నారన్న దురభిప్రాయం చెలరేగింది. ఉద్యోగాల్లో, వ్యవసాయిక రంగాంలో, పారిశ్రామిక వాడల్లో తమను మించిపోతున్నారన్న అక్కసు తెలంగాణా ప్రజానీకంలో చోటుచేసు కొన్నది.

1968 జులై 10వ తేదీన తెలంగాణా ప్రయోజన పరిరక్షణ దినాన్ని జరపడంలో ప్రారంభమై కార్మిక నాయకుడు మహదేవ్ సింగ్ ఆంధ్రప్రదేశ్ నుండి తెలంగాణా విడివడిపోవడం ఖాయమన్న వాదన వరకు వెళ్లింది.

దీనికి తోడు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలంగాణా ప్రాంతంలోని పెక్కు ఉద్యోగాలలో అర్హులైన స్థానిక అభ్యర్థులు లేనందున ఆ స్థానాలను ఆంధ్రప్రాంతం వారితో భర్తీ చేయడంతో వారి అసంతృప్తి అగ్నికి ఆజ్యంపోసి నట్లయింది.

1969లో ఉద్యమం అన్ని జిల్లాలకు వ్యాపించి, విద్యార్థులు ఉద్యమానికి వెన్నెముకగా నిలచినారు. వీరికితోడు తెలంగాణా నాన్ గజిటెడ్ ఉద్యోగస్తులు ఉద్యమంలో చేరి తెలంగాణాకు చెందిన 6 వేల ఉద్యోగాల నుండి ఆంధ్రుల్ని తరలించుకుపోతే ప్రత్యక్ష చర్యకు తలపడతామని హెచ్చరించింది.

1969 జనవరి 18, 19 తేదీలలో అన్ని రాజకీయ పక్షాలలో ముఖ్యమంత్రి సమావేశమైనారు. తెలంగాణాలోని ఆంధ్ర ఉద్యోగుల్ని వారి ప్రాంతానికి తరలించడం తెలంగాణా నిధులు లెక్కవేయడం జరుగుతుందని ప్రకటించారు. అయితే విద్యార్థులపై పోలీసు కాల్పులు జరిగాయి. రైల్వే ప్రభుత్వ ఆస్తులకు విపరీతమైన నష్టం వాటిల్లింది.

తెలంగాణాలో ఆంధ్రులు హింసింపబడుతున్నారన్న వదంతులు వ్యాపించి, ఆంధ్రలో తెలంగాణా వారిని బాధించటానికి ప్రతీకారోద్యమం లేచింది.

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఎనిమిది సూత్రాల పథకాన్ని లోక్ సభలో ప్రవేశపెట్టారు. ప్రభుత్వోద్యోగాలలో తెలంగాణా ప్రాంతం వారికి ప్రత్యేక రక్షణలు కల్పించటానికి అవకాశాలు కల్పిస్తామన్నారు.

అయిన ప్రధాని పథకాన్ని అంగీకరించని ఆందోళన రాజకీయ నాయకులు తెలంగాణా ప్రజాసమితిని స్థాపించి ఉద్యమాన్ని నడిపారు. ప్రజాసమితి నాయకులు

డా. చెన్నారెడ్డిగారు, విద్యార్థినాయకుడు మల్లికార్జున్, బ్రహ్మానందరెడ్డి రాజీనామా చేయాలన్నంత వరకు వెళ్లింది. అయితే రెడ్డి మంత్రి వర్గాన్ని విస్తరించి పి.వి. నరసింహారావుని ఉపముఖ్యమంత్రిగా నియమించారు.

అయినప్పటికి ఉద్యమం వేడి చల్లారలేదు. 1971లో సెప్టెంబరులో తెలంగాణా వారిని ముఖ్యమంత్రిగా చేయడం కోసం బ్రహ్మానందరెడ్డి రాజీనామా యివ్వక తప్పలేదు. తెలంగాణా ప్రజాసమితి సభ్యులు కాంగ్రెస్‌లో పునః ప్రవేశం చేసినారు. తెలంగాణా ప్రాంతానికి చెందిన పి.వి. నరసింహారావు కాంగ్రెస్ సభా నాయకునిగా ఎన్నికయి మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయడంతో ప్రత్యేక తెలంగాణోద్యమం సన్నగిల్లింది. రాష్ట్ర పరిపాలనాధికారం తమకు దక్కిందన్న భావంతో తెలంగాణా ప్రజాసమితి పోరాటాన్ని విరమించుకున్నది. ఆంధ్ర తెలంగాణా సమస్య తీరిందన్న వాదనను సర్దార్‌జీ ఖండిస్తారు. పదవుల పంపకాలలో ప్రాంతీయ విభేదాలు సన్నగిల్లవు. సహజమైన రీతుల్లో సమస్యలు విభేదాలు పరిష్కారం కావాలి. కాంగ్రెస్ అధిష్టాన వర్గం ఢిల్లీ నుండి కీలు బొమ్మలాట ఆడించి కథలో నాయకులను మార్చిన కథ కంచికి మనమింటికి అన్న పాదె చెప్పిన దీని పర్యవసానం త్వరలోనే ఆంధ్రులు అనుభవిస్తారని నాటి రాష్ట్ర స్వతంత్ర పార్టీ నాయకులు సర్దార్ గౌతులచ్చన్న తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్యముగా ప్రకటించారు. రాజకీయాల్లో ఆటుపోటుల్ని భరించిన లచ్చన్న ఆద్యతన బావిలో రాగల రాజకీయ పరిణామాల్ని అంచనా వేయడంలో అప్రతిహత సిద్ధహస్తులు సర్దార్ గౌతు లచ్చన్న.

అన్నదమ్ములమని ఒక ఇంటిలో ఉంటూ కొట్టుకొని చస్తూ బయటకు మేమంతా ఒకే రక్తానికి పుట్టిన వారమని డప్పాలు కొట్టుకొని ఆత్మ వంచన చేసికొని, జీవించడంకన్న, వేరువేరు ఇళ్ళలో ఉంటూ పరస్పరాభిమానాల్ని సహకారాల్ని అందింముకొంటూ అన్నదమ్ముల అనుబంధాలతో, అనురాగాలతో బ్రతకడం మానవతకే మహర్దశ. సంకుచిత స్వార్థాల సంకెళ్లకు అందని మహోన్నత దిశగా పయనించాలన్నదే సర్దార్‌జీ ఏరాపటు ఉద్యమాన్ని బలపరచడంలో ఇమిడియున్న సదుద్దేశం.

# 15వ ప్రకరణం

## స్వతంత్రపార్టీ జయనికేతనం-లచ్చన్న

భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ దేశస్థాయిలో స్వతంత్ర పార్టీని విధానాల్ని ఎంతగా ఖండిస్తున్నప్పటికి, ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం-స్వతంత్రపార్టీకి విజయ పతాకం ఎగురవేసింది. ప్రజలు దీనిని అధికార పక్షంలోగాక, ప్రతిపక్షంగా ప్రతిపక్షాలలో ఉండేలా చేసారు.

రాష్ట్రమంతటా గాక ఉత్తరాంధ్రలో స్వతంత్రపార్టీ గెలుపు సాధించింది. ఉత్తరాంధ్ర ప్రజానీకం తమకు తిరుగులేని నాయకుడు సర్దార్ జీ అని భావిస్తున్నందున అనేకచోట్ల చుక్కపార్టీ (స్టార్‌పార్టీ ఎన్నికల గుర్తు) గెలిచింది.

నాటి ఉత్తరాంధ్రలో అనగా శ్రీకాకుళం, విశాఖ జిల్లాలు (నాటికి విజయనగరం జిల్లా ఏర్పడలేదు) మొత్తం 39 స్థానాల్లో 24 స్థానాలకు పోటీచేసి 11 స్థానాల్లో స్వతంత్ర పార్టీ గెలిచింది. ఆనాడు స్వతంత్ర పార్టీ అనగానే గుర్తుకొచ్చేది సర్దార్ గౌతు లచ్చన్నగారే. అందరూ లచ్చన్న పార్టీ గెలిచింది అనేవారు తప్పించి చుక్క పార్టీ అనేవారు కాదు. స్వతంత్ర పార్టీ తన సిద్ధాంతాన్ని ప్రాతిపదికగా ఎన్నికలలో విజయమందలేదని తెలుస్తూనే ఉన్నది. నాటికి విద్యాగందము 25% కూడాలేని ఓటర్లు సిద్ధాంత ప్రాతిపదికగ ఎన్నికల్లో అభ్యర్థుల్ని ఎలా ఎన్నుకో గలరు? ఓడించ గలరు. నేటికి కూడ ఆ పరిస్థితియున్నదన అతిశయోక్తిగా ఉండదు.

1967లో తిరిగి ఎన్నికల్లో రాష్ట్రమున పోటీచేసిన పార్టీలు కాంగ్రెస్, స్వతంత్ర, ఉభయ కమ్యూనిస్టు పార్టీలు, భారతీయ జనసంఘం, ప్రజాసోషలిస్టు, యునైటెడ్ సోషలిస్టు, రిపబ్లికన్ పార్టీలు ఎన్నికల్లో పార్టీ సిద్ధాంతా రాహిత్యంగా వ్యక్తి ఆరాధనమేరకు ప్రజాస్వామ్య రక్షకులుగా తన స్వీయ ప్రతిభాశక్తియుక్తులచే కాపాడగలరన్న ధీమాతో అభ్యర్థుల్ని ఎంపికచేసే ఓటర్లు ఉంటారనటానికి నిదర్శనం. స్వతంత్రులు ఎన్ని పార్టీలున్నా ఉండటం ఉంటూ వస్తూ ఉండటం సర్వోదయ నాయకులు జయప్రకాష్ నారాయణ, లోకనాయక్ అనిపించుకున్న రాజకీయ నాయకుడు పార్టీరహిత ప్రజా స్వామ్యం కావాలని నినాదం యిచ్చిన దానికి సరిపోతుందేమో. అయినా పార్టీ రహిత ప్రజాస్వామ్యం వర్థిల్లదంటూ ఆనాటి తన సమకాలీన రాజనీతి విజ్ఞాని ఆచార్య మామిడిపూడి వెంకటరంగయ్య సోదాహరణంగా ఖండించి యున్నారు.

భావప్రకటనా స్వాతంత్ర్యం ఉన్న మన దేశంలో అన్ని పార్టీలతోపాటు స్వతంత్రు లుండటం అసహజమేమీ కాదు. ఉండటం కూడా అవసరమేమో. పార్టీ సిద్ధాంత నిరంకుశ విధానాల్ని ఖండించటానికి వీరు అంకుశాలుగా మెలగిన నిజానికి ప్రజాస్వా

మ్యానికి శ్రీరామరక్ష అవుతుంది.

స్వతంత్రపార్టీ అభ్యర్థులు స్వతంత్ర అభ్యర్థులు ఒకటి కారు. వారు స్వతంత్రపార్టీ అభ్యర్థులు. వీరు స్వతంత్ర అభ్యర్థులు ఆర్థిక విధానం-పార్టీ ప్రణాళిక ఉన్నది ''స్వతంత్ర పార్టీ.''

సర్దార్ గౌతు లచ్చన్న శ్రీకాకుళం పార్లమెంటరీ స్థానానికి పోటీ చేస్తారు. కాంగ్రెస్ అభ్యర్థి బొడ్డేపల్లి రాజగోపాలరావు మరియొక ఇండిపెండెంట్ అభ్యర్థి ఇరువురు తమ తమ డిపాజిట్లను కోల్పోతారు. పార్వతీపురం స్థానం నుండి విశ్వాస నరసింహారవు, కాంగ్రెస్ అభ్యర్థి బి. సత్యన్నారయణను ఓడిస్తారు. బొబ్బిలి స్థానాన్ని కాంగ్రెస్ అభ్యర్థి కర్రి నారాయణరావు దక్కించుకొంటారు. విశాఖపట్నం పార్లమెంటరీ స్థానంలో తెన్నేటి విశ్వనాథం గారు ఇండిపెండెంటు అభ్యర్థిగా గెలుస్తారు. ఈ ఎన్నికల్లో విశాఖ జిల్లాలో పేరెన్నికగన్న స్వాతంత్ర సమరయోధుడు గొట్టిపాటి బుచ్చప్పారావు ఓటమిని పొందుతారు. అనకాపల్లిలో యం. సూర్యనారాయణపై స్వతంత్రపార్టీ అభ్యర్థి వి.వి. రమణ ఓడిపోతారు.

నరసాపురం యం.పి. స్థానంలో స్వతంత్ర పార్టీ అభ్యర్థి తెల్ల కృష్ణమ్మ చౌదరి గెలుస్తారు. దివికొండయ్య చౌదరి స్వతంత్రపార్టీ అభ్యర్థి కావలి యం.పి. స్థానాన్ని దక్కించుకొంటారు. నెల్లూరు, చిత్తూరు, రాజంపేట, హిందుపురం, కర్నూలు, సిద్దిపేట, మెదక్, వరంగల్, మిర్యాలగూడ స్థానాల్ని స్వతంత్రపార్టీ పోగొట్టుకున్నది.

రాష్ట్రంలో గల 287 స్థానాల్లో నాటి స్వతంత్రపార్టీ గెలుపొందిన స్థానాలు.

## స్వతంత్రపార్టీ అభ్యర్థులు

శ్రీకాకుళం జిల్లాలో 9 స్థానాల్ని స్వతంత్రపార్టీ దక్కించుకొన్నది. గౌతులచ్చన్న (సోంపేట), కామయ్యరెడ్డి (ఇచ్ఛాపురం), కింజరాపు కృష్ణమూర్తి (హరిశ్చంద్ర పురం), నెచ్చెర్ల రాము (టెక్కలి), శత్రుచర్ల ప్రతాపరుద్రరాజు (నాగూరు), మరిశర్ల వెంకటరామి నాయుడు (పార్వతీపురం), స్వతంత్ర పార్టీ బలపరచిన ఇండిపెండెంటు అభ్యర్థి ముదిలి బాబూపరాంకుశం నాయుడు (ఉనుకూరు) జమ్మాన జోజి (పాల కొండ), తంగి సత్యన్నారాయణ (శ్రీకాకుళం), చౌదరి సత్యన్నారాయణ (పాందూరు) మొత్తం 9 స్థానాల్లో గెలిచారు.

విశాఖ జిల్లాలోగల 8 స్థానాల్లో స్వతంత్రపార్టీ గెలుపొందిన స్థానాలు. గొట్టిపాటి బుచ్చప్పారావు (జామి) పాలవెల్లి (చోడవరం) తెన్నేటి విశ్వనాథం ఇండిపెండెంట్‌గా పోటీచేసి గెలుపొందారు. 7 స్థానాలకు పోటీచేసి రెండు స్థానాల్లో గెలిచారు.

కపోతే రాష్ట్రస్థాయిలో స్వతంత్ర పార్టీ పోటీచేసిన స్థానాలు. తూర్పుగోదావరి,

ఎల్లవరం, బూరుగుపూడి, పెద్దాపురం, అమలాపురం, పశ్చిమగోదావరి, పాలకొల్లు, అత్తిలి, గోపాలపురం, కృష్ణాజిల్లా, నందిగామ, గుంటూరు, వేమూరు, అద్దంకి, నరసారావు, పత్తిపాడు, మాచెర్ల. అయితే స్వతంత్రపార్టీ వేమూరులో ఎడ్లపాటి వెంకట్రావుని, ప్రత్తిపాడులో మున్నె చిననాగయ్యను గెలిపించుకొన్నది.

నెల్లూరు జిల్లాలో దర్శి, ఉదయగిరి స్థానాల్లో రావిపాటి మహానందాన్ని , ధనికు నరసింహంగారిని గెలిపించుకొన్నది. కందుకూరు స్థానంలో ఓడిపోయింది. కావలిలో గొట్టిపాటి సుబ్బానాయుడిని గెలిపించుకొన్నది. పి. రామచంద్రారెడ్డి ఆత్మకూరులో గెలుపొందారు. సూళ్లూరుపేట స్థానంలో ఓటమి. చిత్తూరుజిల్లాలో స్వతంత్రపార్టీ సత్యవేడు స్థానం నుండి కె. మునుస్వామి, పలమునూరు స్థానం నుండి టి.సి. రాజన్నను, తిరుపతి నుండి అగరాల ఈశ్వరరెడ్డిని గెలిపించుకొన్నది. నగరి, వేపంజరి, చిత్తూరు, బంగారిపాలెం, కుప్పం, పాగ నుండి కుంబులపల్లె-పీలేరు స్థానాల్ని పోగొట్టుకుంది.

కడప జిల్లాలో-కోడూరులో యన్. పెంచలయ్య గెలిచారు. లక్కిరెడ్డిపాలెం-కడపలో ఓటమి పొందారు. అనంతపురం జిల్లాలో యతి రాజారావు మడకసిరి నుండి తిప్పెయస్వామి, రాయదుర్గ నుండి పాలెం వెంకటేశ్వరావు, ధర్మవరం నుండి గెలుపొందారు. కర్నూలు జిల్లాలో ఆలూరు స్థానంలో డి. గోవిందదాస్‌ను కొడిమూడు స్థానం నుండి పి. రాజరత్నంలను స్వతంత్రపార్టీ గెలిపించుకున్నది. ఎమ్మిగనూరు, ఆదోదిలో ఓటమి నందింది. ''డోన స్థానంలో కె. వెంకట కృష్ణమూర్తి గెలుపొందారు. కోయిలగుంట్ల, ఆల్లగడ్డ, నంద్యాల స్థానాల్లో ఓటమి ఎదురైంది.

రాయలసీమలో గల నాలుగు జిల్లాల్లో పోటీచేసిన స్వతంత్రపార్టీ హెచ్చు స్థానాల్ని సంపాదించలేక పోయింది. అన్ని స్థానాల్లో కాంగ్రెస్ పార్టీకి సరిసమాన స్థాయిలో నిలచింది. ప్రధాన పోటీపక్షంగా రూపం దాల్చింది.

తెలంగాణా ప్రాంతంలో స్వతంత్ర పార్టీ ఒక్కసీటును గూడా సంపాదించలేక పోయింది. తెలంగాణాలోగల అన్ని జిల్లాల్లో పోటీచేసిన ఒక్కసీటు కూడా లభించలేదు. మహబూబ్‌నగర్ జిల్లాలో-షాద్‌నగర్‌లో ఓటమి. హైదరాబాద్ జిల్లాలో ఆసిఫ్‌నగర్‌లో ఓటమి. మిరియాలగూడలో ఓటమి. నడిమికెల్ల భువనగిరలో ఓటమి. తెలంగాణా ప్రజానీకంలో స్వతంత్రపార్టీ తన ప్రభావాన్ని చూపలేకపోయింది. అచటగల నాయకత్వం లోపమై ఉండాలి. ఉత్తరాంధ్రలో స్వతంత్రపార్టీ సంపాదించిన స్థానాల్ని కూడా రాష్ట్రం మొత్తంలో మరి ఎచ్చటా సంపాదించలేక పోయింది. స్వతంత్రపార్టీ బలమైన నాయకత్వాన్ని గలిగిఉన్నా రాష్ట్రస్థాయిలో హెచ్చు స్థానాల్ని పొందలేక పోయింది.

సర్దార్ జీ వ్యక్తిత్వం-ప్రజాభిమానం-దేశభక్తి-ఉత్తరాంధ్రలో హెచ్చు స్థానాల్ని పొంద గలిగేలా చేసాయన్నది ఋజువు అవుతూనే ఉంది. స్వతంత్ర పార్టీ అన్న ఆంధ్రప్రదేశ్‌లో సర్దార్‌జీ అన్న అభిప్రాయానికి రూపం ఏర్పడింది.

అయినప్పటికి నాటి కాంగ్రెస్‌పార్టీకి బలమైన ప్రతిపక్షంగా రూపొందినది. సంఖ్యాబలంలోనే గాక స్వతంత్రపార్టీ నాయకత్వం వహిస్తున్న సర్దార్‌జీ శాసనసభలో ప్రతిపక్ష నాయకునిగా గట్టిపోటీ నిచ్చారు. ప్రభుత్వాన్ని అన్నివిధాలా నిలదీసి, నిగ్గుతీసే రూపం దాల్చారు.

స్వతంత్రపార్టీ శాసన సభ్యులెల్లరు, సర్దార్ గౌతు లచ్చన్నగారికే తమ నాయకునిగా ఎన్నుకొన్నారు. వారి అడుగుజాడల్లో నడిచేలా మొదట్లో రూపొందారు.

## బ్రహ్మానందరెడ్డి మంత్రి వర్గం

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారు 1967 ఎన్నికల అనంతరం అత్యధిక సంఖ్యాబలాన్ని శాసనసభలో సంపాదించిన కాంగ్రెస్‌పార్టీ తరుపున ముఖ్యమంత్రిగా మంత్రివర్గాన్ని ఏర్పరిచారు. కృషివరలోక పార్టీ స్థాపనలో రంగాజీకి, లచ్చన్నగారితో పాటు అన్నివిధాలా సహకరించిన లచ్చన్న సమఉజ్జీ నాయకుల పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి! ఆసరికే కాంగ్రెస్‌లో కలసినందున కాంగ్రెస్‌పార్టీ టిక్కెట్‌పై గెలిచినందున బ్రహ్మానంద రెడ్డి మంత్రివర్గంలో స్థానం ఏర్పడింది. వ్యవసాయ మంత్రి అయ్యారు. 1964 మంత్రివర్గంలో రాష్ట్ర ఆర్థికమంత్రిగా పనిచేసిన మర్రి చెన్నారెడ్డిగారికి ఈ మంత్రివర్గంలో స్థానం ఇవ్వలేదు. 1969లో గల ప్రత్యేక తెలంగాణా పోరాటానికి, బీజము ఏర్పడటానికి కాంగ్రెస్ అధిష్టాన వర్గం ఇచటనే అవకాశం యిచ్చిందేమో, అయితే తెలంగాణా నుండి ఆంధ్రప్రదేశ్‌కి ముఖ్యమంత్రికాగల పి.వి. నరసింహారావుగారిని మాత్రం సహాయ మంత్రిగా కొనసాగించారు. నూకల రామచంద్రారెడ్డికి కూడా మంత్రివర్గంలో స్థానం దొరకలేదు. పెద్దమనుషుల ఒప్పందంలో పేర్కొనినట్లు మంత్రివర్గంలో స్థానాలు, ఆంధ్ర-రాయలసీమ-తెలంగాణా ప్రాంతాలకు లభించలేదు. సహాయ మంత్రులు, ''కేబినెట్'' స్థాయిలేని వారు అందులో స్థానం లభించడం పూర్తిస్థాయి మంత్రి పదవి లభించలేదన్న నిరాశ నిస్పృహలున్నది నాలవి.

1964లో విద్యాశాఖా మంత్రిగానున్న పి.వి.జి. 1967 మంత్రివర్గంలో స్థానం పొందలేకపోవటానికి తను తీవ్రమైన రహదారి ప్రమాదంలో మునిగి తేలడమే పి.వి.జి. రాజకీయ జీవితంలో పెనుమార్పు తెచ్చిన పాపిష్టి సంఘటనగా నేటికి అది నిలిచిపోతుంది. అనారోగ్య కారణంగా రాజకీయ జీవిత, చదరంగం నుండి పి.వి.జి. వైదొలగుతారు. ఆతని స్థానంలో టి.వి. రాఘవులు విద్యాశాఖామాత్యులుగా వస్తారు. -జకీయాల్ని రసవత్తరంగా నడిపించగల సమర్థుడు. వల్లూరి బసవరాజుకి రెవెన్యూశాఖ

లభిస్తుంది. జె.వి. నరసింగరావు పి.డబ్లు.డి-బలహీన వర్గాల నాయకుడు కొండాలక్ష్మణ బాపూజీకి-కార్మికశాఖ. పి.పి. నరసింహారావుకి ఆరోగ్యశాఖ, రాయలసీమ నాయకులు కె.వి. నారాయణరెడ్డికి న్యాయశాఖ. టి. రామస్వామి-జి.వి గురుమూర్తి-చెంచు రామానాయుడు, రుద్రరాజు రామలింగరాజు, శీలం సిద్ధారెడ్డి, వి. సత్యన్నారాయణ, ఎ. రామస్వామి, ఇబ్రహీం ఆలీ అన్సారీ, ఇతర మంత్రులు.

మంత్రివర్గంలో ఆంధ్ర, తెలంగాణాలకు సమతూకంపై స్థానాలు లభించలేక పోవటానికి కారణం ఇదమిద్ధంగా ఇది అని చెప్పలేము. కాంగ్రెస్ అధిష్టాన వర్గం తన వ్యూహం ఎత్తుగడల మేరకు తన విధానాన్ని ఆనాటికి నిర్ణయించి ఉంటుంది.

అందువలననే కాబోలు మరల 1969లో మంత్రివర్గ పునర్నిర్మాణం జరిగింది. ముఖ్యమైన మార్పులు చేయబడ్డాయి. ప్రత్యేక తెలంగాణా ఉద్యమ ఫలితం ఇది. జె.వి. నరసింహారావు ఉపముఖ్యమంత్రి. అయ్యారు. జలగం వెంగళరావు మంత్రి వర్గంలో ఆంతరంగిక శాఖామాత్యులుగా ప్రవేశించారు. పి.వి. నరసింహారావు కేబినేట్ మంత్రి అయి విద్యాశాఖను పొందగలిగారు. కె. విజయభాస్కరరెడ్డికి ఆర్థికశాఖ లభించింది. కాకాని వెంకటరత్నం, వి. కృష్ణమూర్తినాయుడు, సాగి సూర్యనారాయణ రాజులకు మంత్రి వర్గంలో స్థానాలు లభించాయి. SRAS అప్పల నాయుడుగారు సహాయమంత్రిగా చేరారు. 11మంది సహాయ మంత్రులు, కేబినేట్‌లో తీరప్రాంతాలకు 2, రాయలసీమకు 3, తెలంగాణాకు 13. ఇది కేవలం తెలంగాణోద్యమ ప్రభావమన్నది ఏ ఒకరూ కాదనలేనిది. పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి గారు రెవెన్యూ శాఖామాత్యులు కాగలిగారు. ఆద్యతన రాబోయే జై ఆంధ్రోద్యమానికిది త్వరలోనే స్వాగతం పలుకుతుంది. సర్దార్ జీ ప్రతిపక్ష నాయకునిగా శాసనసభలో నాడున్నారు.

# 16వ ప్రకరణము

## 1971 మధ్యంతర ఎన్నికలు-గ్రాండ్ ఎలియన్సు-లచ్చన్న

స్వతంత్రపార్టీ దేశస్థాయిలో కాంగ్రెస్ పార్టీని అధిగమించలేక పోతున్నదని తెలిసికొన్న నాయకులు కేంద్రమున కాంగ్రెస్ నిరంకుశాధికారాన్ని ఎదుర్కోవాలన్న రాజకీయ వ్యూహం పన్నింది. ఏ ఒక పార్టీ కాంగ్రెస్‌ను ఎదిరించలేదని, ఉమ్మడిగా కాంగ్రెసేతర ప్రతిపక్షపార్టీలు ఐక్యమవనిదే కాంగ్రెస్‌ను జయించలేమన్న ఈ భావం ఈనాడువలె కుడిఎడమ పక్షాల మధ్యగాక కేవలం వామపకేతర పార్టీల మధ్యనే ఏర్పడింది.

### ఎలియన్సులో చేరిన పార్టీలు

అయితే ఈకలయిక వాటి వాటి స్వరూప స్వభావాల్ని విడిచిపెట్టకనే ఉమ్మడి ప్రాతిపదికపై ఒకటిగా చారిత్రాత్మక ఒప్పందంపై గ్రాండ్ ఎలియన్సు పేర, కాంగ్రెస్ పార్టీపై పోటీచేయు అభ్యర్థుల్ని నిలబెట్టటానికి అంగీకారాన్ని కుదుర్చుకు న్నాయి. గ్రాండు ఎలియన్సులో నున్న పార్టీలు (1) స్వతంత్ర పార్టీ 2 ఆర్గనైజేషనల్, కాంగ్రెస్ (3) భారతీయ జన సంఘం, రాజగోపాలాచారి, నిజలింగప్ప, యల్.కె. అద్వానీ, ఉమ్మడి నాయకత్వంలో గ్రాండ్ ఎలియన్స్ రూపొందు తుంది. కాంగ్రెస్ (ఐ)ని ప్రతిఘటించాలి, ఓడించాలి; వీరి ధ్యేయం, ఆశయం.

1969లో కాంగ్రెస్‌పార్టీ చీలిపోయి, ఆర్గనైజేషనల్ కాంగ్రెస్-ఇందిరా కాంగ్రెస్‌గా పిలవబడుతుంది. నిజలింగప్ప అధ్యక్షతన భారతదేశ రాజకీయాలలో సిండికేట్ వర్గం రూపొందుతుంది. సంజీవరెడ్డి, కామరాజనాడారు, సిద్ధారం శంకర్ శ్రీ ఒకవర్గంగా ఏర్పడి ఇందిరాగాంధీని ప్రతిఘటిస్తారు. భారత మాజీ ప్రధాని ఇందిరాజీ కూడ ఎత్తుకు పైఎత్తువేసి సిండికేట్ వర్గాన్ని దెబ్బతీయాలని పథకం పన్నింది. పార్టీలో అంతరంగిక విభేదాలు, కుమ్ములాట తదుపరి స్పష్టమైన అభిప్రాయ భేదాలలో బయటకు వస్తారు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ బెంగుళూరులో సమావేశమౌతుంది. ఇందిరాగాంధీపై క్రమశిక్షణ తీసుకొంటారు. పర్యవసానం ఇందిరాగాంధీ తన పార్టీ కాంగ్రెస్ (ఐ)గా ప్రకటిస్తారు. సిండికేట్ నీలం వారిని భారత రాష్ట్రపతిగా ప్రతిపాదించగా ఇందిర ఎత్తుగడమేరకు సంజీవరెడ్డి నామినేషన్ బలపరుస్తూ ప్రతిపాదనల్ని సమర్థిస్తు "అంత రాత్మ ప్రబోధం మేరకు ఓటు వినియోగం" అన్న నూతన రాజకీయ ఎత్తుగడను ప్రవేశపెడతారు. కాంగ్రెస్ పార్టీలో ఉంటూనే తనకు పోటీగా నిలుస్తున్న సిండికేట్ వర్గాన్ని ఓడించాలన్నది శ్రీమతి ఇందిరాజీ వ్యూహం. ఇండిపెండెంట్‌గా

నామినేషన్ దాఖలుచేసిన ఆనాటి ఉపరాష్ట్రపతి వి.వి. గిరిని ఇందిరాజీ దేశవ్యాప్తంగా పర్యటించి గెలిపిస్తారు. సంజీవరెడ్డి ఓటమితో సిండికేట్‌కు మొండి చెయ్యి మిగిలింది.

1969 కాంగ్రెస్ పార్టీ చీలికలో ఇందిరాజీకి బాబూ జగజ్జీవన రాం కుడిభుజముగా నిలచి, యావత్ భారతదేశ దళిత సమాజమంతా ఇందిరవైపే ఉన్నారనిపిస్తారు. తను బలపరచిన రాష్ట్రపతిని గెలిపించుకున్న ప్రధాని ఇందిర తన బలాన్ని తన పార్టీ బలాన్ని నిరూపించుకోవటానికి పార్లమెంటరీ ఎన్నికలను గడువు ముందే జరిపించ సిద్ధపడతారు.

ఈ నేపద్యమున మన రాష్ట్ర ముఖ్యమంత్రి నాటి బ్రహ్మానందరెడ్డి ఇందిరా కాంగ్రెస్‌ను బలపరుస్తారు. నీలం సంజీవరెడ్డి గారిని ప్రతిఘటిస్తారు.

ఇందిరాగాంధి జీ ఎత్తుగడల్ని పరిశీలించిన సిండికేట్ వర్గం నిజలింగప్ప అధ్యక్షతన కాంగ్రెస్ (ఎన్)గా రూపొందుతుంది. కాంగ్రెస్ (ఐ)లో ఎన్నికల్లో పోటీకి సిద్ధపడుతుంది. పార్టీని నిరంకుశాధికారంతో నడపాలన్న నాయకత్వం, తన పార్టీలో తనంతటి వారున్నవారిని బయటకు అంపే వరకు నిద్రపోరని, రాజనీతిజ్ఞుల ఉవాచ. సిండికేటును జయించి ప్రజల అభిమానాన్ని పొందగలనన్న ధీమాతో తన పార్టీలోనే ఉంటూ భారతదేశ విముక్త జాతులకు తిరుగులేని ప్రతినిధినని భావిస్తూ వస్తున్న బాబూ జగజ్జీవన రాంను కూడ ఎదుర్కోవటానికి ఇందిరాజీ రంగం తయారుచేసారు. సైద్ధాంతిక విభేదాలన్న తీరును ప్రయోగించారు. బాబూ జగజ్జీవ నరాం కూడా బయటపడి కాంగ్రెస్ (జె) పార్టీగా రూపొందారు.

సిండికేట్ కాంగ్రెస్ బడాపెట్టుబడిదార్ల భూస్వామ్య వర్గానికి చెందినదని స్వతంత్ర పార్టీ బూర్జువా వర్గానికి చెందిన ధనవంతులపార్టీ అని అయితే ప్రజాసం క్షేమం తన ధ్యేయంఅని, సోషలిజం తన లక్ష్యమని, బ్యాంకుల్ని జాతీయం చేయడంద్వారా, రాజభరణాల్ని రద్దుపరచడం ద్వారా ఇందిరాజీ సోషలిజానికి మార్గం సుగమం చేసారన్న కీర్తిప్రతిష్టలు వచ్చాయి. ఆ నేపద్యమున భారత ప్రధాని ఇందిరిజీ 1971లో పార్లమెంటుకి మధ్యంతర ఎన్నికల్ని ప్రకటిస్తారు.

ఆనాడు దేశ స్థాయిలో పోటీచేసిన రాజకీయ పార్టీలు కాంగ్రెస్ (ఐ) కాంగ్రెస్ (యన్), కాంగ్రెస్ (జె) స్వతంత్ర పార్టీ, ఉభయ కమ్యూనిష్టు పార్టీలు, భారతీయ జనసంఘం సంయుక్త సోషలిష్టుపార్టీ డా. మర్రి చెన్నారెడ్డిగారి అధ్యక్షతన తెలంగాణా ప్రజాసమితి రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా తెలంగాణా కాంగ్రెస్-రామరాజ్య పరిషత్-బేక్వర్డుక్లాసు మహాసభ ముఖ్యంగా కాంగ్రెస్ (ఐ)ను ప్రతిఘటించాలన్నది

అన్ని పార్టీల ఆశయం. వీటన్నింటిని గెలిచి, అధికారంలోనికి రావాలన్నది కాంగ్రెస్ (ఐ) లక్ష్యం. దేశ స్థాయిలో అన్ని సీట్లకు పోటీ చేయగలిగిన ప్రజాభిమానం కాంగ్రెస్ (ఐ) సంతరించుకొన్నది. ఈ ఎన్నికల్లో ప్రత్యేకత తనింటినుండి విడివడినవారినే గాక ఇరుగుపొరుగువారిని ఓడించాలి. ఇందిరాజీ తన యావశ్చక్తి యుక్తుల్ని వినియోగించారు. ఆనాటి ఇందిరా కాంగ్రెస్‌కు అనుకూల విషయం, తన ప్రత్యర్థుల పార్టీలలో ఏ ఒక్కటికూడ తన పార్టీవలె దేశంలోగల అన్ని స్థానాలకు పోటీ చేయలేదు. అన్ని పార్టీలు రాష్ట్రస్థాయిలో తనను ప్రతిఘటించగా మరికొన్ని దేశస్థాయిలో ప్రతిఘటించ నిలచాయి. ఇందిరా కాంగ్రెస్‌ను దేశ స్థాయిలో ఎదుర్కొన్న పార్టీలు కాంగ్రెస్ యస్ మరియు జె. ఉభయ కమ్యూనిస్టు పార్టీలు, భారతీయ జనసంఘం, స్వతంత్రపార్టీలు మాత్రమే.

స్వతంత్రపార్టీ అభ్యర్థిగా లచ్చన్న గురువర్యులు ఆచార్య యన్.జి. రంగా శ్రీకాకుళం పార్లమెంటరీ స్థానానికి పోటీ చేస్తారు. కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి బొడ్డేపల్లి రాజగోపాలరావు 1967లో ఇదే స్థానం నుండి రంగాజీ ఒకమారు గెలిచి యున్నారు.

## రంగాజీ K.L.P. రద్దు

ఓటింగు మార్చి 5వ తేదీన జరిగింది. ఓట్ల లెక్కింపు జరుగుతుండగా రంగాజీ సోంపేట సర్దార్‌జీ నివాసంలో ఉన్నారు. సోంపేట, ఇచ్ఛాపురం, టెక్కలి నియోజక వర్గాల్లో కాంగ్రెస్ గెలిచినట్లు ప్రకటనరాగా ఇక ఓటమి తథ్యం అన్నది తెలిసి రంగాజీ అత్యంత సన్నిహితుడు కావూరి వెంకయ్యను పిలిచి తదుపరి లచ్చన్నను పిలుస్తారు. రహస్య చర్చల్లో మీరు అంతా కాంగ్రెస్‌పార్టీలో చేరడానికి సిద్ధంగా ఉండండి అని రంగాజీ అనడంతో సర్దార్‌జీ వంతు ఆశ్చర్యపోవడం అయింది. ఇరువురు కొద్ది సేపు మౌనం వహించి తొందరపడి నిర్ణయానికి రావద్దు. గెలుపు ఓటమిబట్టి మనం నిర్ణయాలు తీసికోవద్దు అని వారిరువురు చెప్పారు.

రంగాజీ వెంటనే కారుసిద్ధం చేయమని చెప్పి నిడుబ్రోలు స్వగ్రామానికి ఆ దినమే వెళ్లిపోయారు.

తదుపరి రాష్ట్ర పార్టీ కార్యవర్గం అయింది. ఆ సమావేశంలో రంగాజీ అందరికి కాంగ్రెస్‌లో కలవడం మంచిదని చెప్పగా సుంకర-శోభనాద్రి వి.వి. రమణ, కావూరు వెంకయ్య, జాగర్లమూడి చంద్రమౌళి రాజగోపాలరావు. వారు ఏమనక మౌనంగా ఉండిపోతారు. అయితే ఎదిరించిన వారిలో సర్దార్‌జీ ఒక్కరే బలమైన వారు. కాంగ్రెస్‌లో దూరడం మన రాజకీయ జీవితాశయం. దెబ్బతింటుందని అన్నారు.

1972లో రాజ్యసభ ఎన్నికలు వచ్చాయి. 1972లో ఆంధ్రప్రదేశ్ శాసనసభలో

స్వతంత్ర పార్టీ సభ్యులు 16 మంది మాత్రమే గెలిచి యున్నారు. రంగాజీ రాజ్యసభకు పోటీచేయాలని సహచరులతో చెప్పారు. అందరూ ముక్తకంఠంతో పోటీ చేయవద్దు. మనకు బలం లేదు అన్నారు. ఆనాటి పార్టీ మార్పిడి నిరోధక చట్టం లేదుకదా. ఎవరు డబ్బును మంచినీళ్ళలా ప్రవహింప చేస్తారో విజయం వారిని వరించే స్థితిగతులానాటివి. రంగాజీకి ఓటమి తటస్థించింది.

## రంగాజీ కాంగ్రెస్‌లో ప్రవేశం

1972 జూన్‌లో రంగాజీ ఢిల్లీవెళ్లి కాంగ్రెస్‌లో చేరిపోగా పత్రికల్లో వార్తవస్తే లచ్చన్నగారు చూచిన పరిస్థితి ఆనాటికి రంగాజీ ఆల్ ఇండియా స్వతంత్రపార్టీ జాతీయ కార్యవర్గ సభ్యులు పార్టీకి రాజీనామా యిచ్చి కాంగ్రెస్‌లో చేరుతారు. రాజగోపాలాచారికి, అధ్యక్షులు యం.ఆర్. మసాని గారికి రాజీనామా యిస్తారు. గత రాజకీయ నాయకుల చరిత్రను వివరిస్తూ.

దరిమిలా రాజగోపాలాచారిని చూడటానికి సర్దార్‌జీ మద్రాసు వెళ్లగా రాజగోపాలాచారి రంగాజీపై నిష్ఠూరంగా మాట్లాడతారు. ఫిరాయింపుదారుడు అని రాజగోపాలాచారి అనగా సర్దార్‌జీ, ఎవరు ఫిరాయింపుదారులు కారండీ, రాజాజీ గారు! అందరూ అటువంటి వారేఅని గురువును సమర్థించారు.

ఆ మాటను విని రాజాజీ లచ్చన్న భుజం తట్టి, మీ వంటి అనుచరులున్న రాజకీయవేత్త ఏనాటికీ చిరస్మరణీయుడే అని అన్నారు.

ఉత్తరాంధ్రలో నిజానికి స్వతంత్ర పార్టీకి గట్టి దెబ్బ తగిలింది. ప్రజాభిమానాన్ని పూర్తిగా కోల్పోయింది. స్వతంత్రపార్టీ అభ్యర్థి వి. నరసింహారావు ఓడిపోయారు. కాంగ్రెస్ (జె) అభ్యర్థి బిడ్డిక సత్యన్నారాయణ పార్వతీపురం నుండి గెలుస్తారు. స్వతంత్రపార్టీ అభ్యర్థి రౌతు చంద్రశేఖరం ఓడిపోగా కాంగ్రెస్ (ఐ) అభ్యర్థి కర్రి నారాయణరావు గెలుస్తారు. విశాఖపట్నంలో పి.వి.జి. ఇండిపెండెంటుగా తెన్నేటి విశ్వనాథంపై గెలుపొందుతారు. అనకాపల్లి నుండి SRAS అప్పలనాయుడు గెలుపొందుతారు. స్వతంత్రపార్టీ అభ్యర్థి వి.వి. రమణ ఓడిపోతారు. గుడివాడ-మచిలీపట్నం-ఒంగోలు స్థానాల్ని కూడ స్వతంత్రపార్టీ పోగొట్టుకుంటుంది. రంగాజీ సతీమణి భారతీదేవి, రంగాకూడ ఓడిపోతారు. శ్రీకాకుళం స్థానాన్ని బొడ్డేపల్లి రాజగోపాలరావు గెలుపొందారు.

ఇందిరాగాంధీజీకి పార్లమెంటులో స్పష్టమైన మెజారిటీ లభిస్తుంది. వాస్తవికమైన మోసాల్ని జాతీయ దినపత్రికలు వెల్లడి చేస్తాయి. ఎండమావుల నినాదాల్ని బట్టబయలు చేస్తాయి. కష్టజీవులు సామాన్య ప్రజలు స్త్రీలు ఇందిరాజీని తమ రాజకీయ

ఇష్టదైవంగా భావించే రాజకీయ దినాలవి. అధిక సంఖ్యాకులు ఆవుదూడ గుర్తుకేవేసి కాం(గెస్‌ని గెలిపిస్తారు. ఆం(ధలో ఒక్క సీటు కూడా స్వతం(తపార్టీ సంపాదించలేక పోయింది. ఇందిరా (ప్రభంజనానికి ఏ ఒకపార్టీ స్వతం(తపార్టీతోసహా నిలవలేకపోయింది.

స్థానిక స్వతం(త పార్టీ నాయకులు-రా(ష్ట్రస్థాయి స్వతం(తపార్టీ నాయకులు సర్దార్ గౌతు లచ్చన్న రత్న సభాపతి. పి. రాజగోపాలనాయుడు, రంగారావు, జాగర్ల మూడ చం(దమౌళి, వెంకట్రావు, కె. రోశయ్య వంటి అనుభవంగల రాజకీయ ధీరులెల్లరు ఆనాటి కాం(గెస్ (ఐ)ను (పతిఘటించలేక పోయారు.

# 17వ ప్రకరణము

## 1972 జైఆంధ్రోద్యమం-లచ్చన్న

సర్దార్ గౌతు లచ్చన్న రాష్ట్ర స్వతంత్రపార్టీ నాయకులుగా ఆంధ్రలో వ్యాపించిన రెండు ఏర్పాటు ఉద్యమాలను ఎదుర్కొన్నారు. లచ్చన్నగారు తిరుగు లేని ఏర్పాటువాది. రాష్ట్రాలు చిన్నవిగా ఉంటేనే ఆర్థికాభివృద్ధిని సంతరించుకొంటా యన్నది లచ్చన్నగారి వాదన. అయితే ఇతర సమస్యలుండవని కాదు. నిజానికి ఈ ప్రపంచంలో ఏ వాదము సంపూర్ణం కాదు. వాదము ప్రతివాదము-చివరికి సమన్వయం. ఏ విషయానికి తప్పదు కదా! అందుకు రాజనీతి విజ్ఞానులు-విద్యార్థి కులు గుడ్డిగా ఈవాదం గొప్ప, ఆ వాదం తప్పని వాదించరు. లోకజ్ఞానం తెలియని వారు తప్ప దేశకాలమాన పరిస్థితులను బట్టి ఏ వాదం, సమన్వయం కాగలదో తీర్పు చెప్పగలరు.

తన 40 ఏండ్ల రాజకీయ చరిత్రలో రాజకీయ నాయకులకు ఆదర్శప్రాయంగా నిలచిన వారు, నిస్వార్థ ప్రజాసేవలకు మారుపేరు. ఇచ్చకం మొగమాటం ఆశ్రితప క్షము, బంధుప్రీతి లాంటి గుణాలకు అతీతుడు. విమర్శలకు తావులేని రాజకీయ చరిత్రగల ప్రజ్ఞాశాలి. త్యాగశీలి. ఆంధ్రప్రదేశ్‌ను రెండుగా ఏర్పడాలని కోరిన ఆలోచించాలి తప్పించి ఆవేశంలో తప్పుడు నిర్ణయాలకు రాకూడదు.

తొలుత రాష్ట్ర స్వతంత్రపార్టీ ఉపాధ్యక్షులుగా తరువాత రెండు పర్యాయములు, అధ్యక్షులుగా ఎన్నికై అఖిలభారత స్వతంత్ర పార్టీ జనరల్ కౌన్సిల్‌లో సభ్యత్వం అందినవారు, జాతీయ కార్యవర్గం సభ్యులు. కేంద్ర పార్లమెంటరీ బోర్డు సభ్యులు.

ఒకనాడు తెలంగాణా ఉద్యమం సన్నగిల్లి నాడు సర్దార్‌జీ చెప్పినది అక్షర సత్యం. 1972లో ఎన్నికలయిన తదుపరి శ్రీ పి.వి. నరసింహారావు మంత్రి కావడం. మళ్లీ ఏర్పాటువాదం తలెత్తింది. ఆంధ్రప్రాతం వారంతా ముల్కీ సర్టిఫికేట్లను సంపాదిం చుకొని తెలంగాణాలో స్థిరపడిపోయారన్న వాదం లేచింది. ఆంధ్రులు మీరు తరలివెళ్లండి అన్న తెలంగాణా ఉద్యమం, ఆంధ్రులు హైదరాబాదులో తెలంగాణాలు స్థిరపడిపోయారన్న అపోహ లేచింది. వారిని తరలించడం ఎలా ముల్కీ-స్థిర నివాసంగల వారికి ఇచ్చేది ముల్కీ సర్టిఫికేట్ స్థిర నివాసం ఉన్న ఆంధ్రులు ముల్కీ నిబంధనల మేరకు తెలంగాణాలో ఉండటం నేరమా. ముల్కీ నిబంధనలు మరి దేనికి విషయం కోర్టుకెక్కింది. హైకోర్టు కొట్టివేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సుప్రీంకోర్టుకి వెళ్లింది. మళ్లీ వాదం చట్టసమ్మతం అని తీర్పు వచ్చింది. ఈసారి ఆంధ్రప్రాంతంలో ఈ ఉద్యమం జై ఆంధ్ర అన్నపేరుతో తలెత్తింది.

## ముల్కీ అంటే ఏమిటి

1919లో హైదరాబాద్ నైజాం ఒక ఫర్మానా జారీ చేసారు. తన రాష్ట్రంలో (తెలంగాణా) ముల్కీలు మాత్రమే ఉద్యోగాలకు అర్హులని ఈ ఫర్మాను ప్రకటించింది. ముల్కీ సర్టిఫికేట్‌కి ఎవరు అర్హులు హైదరాబాద్ రాష్ట్రం (తెలంగాణా)లో జన్మించిన వారు లేదా అక్కడ 15 ఏండ్లు స్థిరనివాసం చేసిన తమ జన్మస్థానానికి వెళ్లే ఉద్దేశం లేనివారు ఇందువలన తెలిసిందేమిటి. 1919 నాటికే ఇతరులు వచ్చి తెలంగాణాలో స్థిరపడుతున్నారన్నది స్పష్టం. అటు స్థిరపడినవారు 15 ఏండ్ల నుండి ఉన్నవారు తెలంగాణాలో స్థిరనివాసముగా ఉండగలదన్నది ఫర్మానా యిచ్చిన హామి.

ఆనాడు యిచ్చిన హామిని ఈనాడు త్రోసిపుచ్చడం న్యాయమా? హైదరాబాదు రాష్ట్రం 1956లో మూడు భాగాలైనాయి. నాటినుండి తెలంగాణా ప్రాంతంలో ఉద్యోగం చేయాలన్న కుదరదు. 15 ఏండ్ల స్థిరనివాసం కావాలి. ఇది అన్యాయం. ఆంధ్రప్రదేశ్ లో అసమానత లేమిటి అని ఉద్యోగస్తులు హైకోర్టును ఆశ్రయించారు. ముల్కీనిబంధనల రాజ్యాంగ విరుద్ధమని హైకోర్టుతీర్పు ఇచ్చింది. తెలంగాణా ప్రజల్లో వేడిపుట్టింది. ప్రభుత్వం సుప్రీంకోర్టులో దావావేయగా ముల్కీనిబంధనలు చెల్లుతాయని సుప్రింకోర్టు తీర్పు చెప్పింది.

ఆంధ్రప్రాంతం ఉద్యోగులు తెలంగాణాలో ఉద్యోగాలకు అనర్హులనడంతో ఆంధ్రలో మహోద్యమంలేచింది. తమ రాజధాని నగరంలో తాము ద్వితీయశ్రేణి పౌరులుగా ఉండటం దురదృష్టం అని భావించారు. తెలంగాణాతో తెగతెంపులు చేసుకుంటేనే గౌరవం దక్కుతుందన్న భావనకు లోనయ్యారు.

## ఉద్యమం దేనికి

ఆంధ్రలో ఉద్యమం వ్యాపించింది పట్నాల్లోనేగాక పల్లెల్లో ఈభావం బలపడింది రాష్ట్రంలోని రాజకీయ పార్టీలు వారి వారి పార్టీల విభేదాల్ని విస్మరించి, ఏర్పాటు వాదులు సమైక్య వాదులుగా మారిపోయారు. రాష్ట్రం నలుమూలల పర్యటిస్తు సభల్ని సమావేశాల్ని జరిపించడంలో సర్దార్ జీ నిమగ్నమైనారు.

ఒక ప్రాంతం వారు తరతరాలుగా వారి ప్రక్క నివశిస్తున్నవారిని వేరొక ప్రాంతంవారని దెప్పిపొడుస్తూ అసౌకర్యాన్ని కలుగచేస్తుంటే ఎన్నాళ్ళు చూస్తుఊరుకుంటాము. తెలుగు జాతి ఒకటి తెలుగుభాష ఒకటే అయితే వేర్వేరు ప్రాంతాల్లో జీవిస్తూ వేర్వేరు రాష్ట్రాల్లో జీవిస్తే వారి మధ్యగల సమైక్యత సన్నగిల్లదు. 1972లో పార్లమెంటు 1985 వరకు మాత్రమే ముల్కీ నిబంధనలు కొనసాగ గలవని శాసించడం తగనిది. స్వీయ గౌరవ మర్యాదలు సన్నగిల్లిననాడు కలిసి జీవించడం కష్టసాధ్యం. చిన్న రాష్ట్రాలు పరిపాలనకు అనుకూలంగా ఉంటాయి. సర్కార్

రాయలసీమ తెలంగాణా ఆధ్యతన విభజించబడి ప్రత్యేక రాష్ట్రాలుగా అవతరిస్తేనే నిజానికి ఆంధ్రుల ప్రాబల్యం ఏమిటో దేశ స్థాయిలో తెలుస్తుంది. ఏనాటికయిన ఈ రాష్ట్రాల పునర్విభజన జరగక తప్పదు. ఉత్తరప్రదేశ్, బీహార్, మధ్యప్రదేశ్ ఏనాటికైన విడివడతాయి. భౌగోళిక పరిస్థితులనుబట్టి కూడ సర్కార్ రాయలసీమ తెలంగాణాలో ప్రత్యేకతల్ని కలిగి ఉన్నాయి. ప్రస్తుతానికి రాయలసీమ వారిని కలుపుకొని సర్కారు ప్రాంతం ''జై ఆంధ్ర''గా రూపొందాలి. అదే ఉద్యమం.

లచ్చన్నగారు ఆంధ్రప్రాంతం అంతటా పర్యటించి ఉద్యమాన్ని బలపరుస్తారు. ప్రజల్ని సమీకరిస్తారు.

ప్రతిపక్షాలతోబాటు రాష్ట్రాన్ని పాలిస్తున్న కాంగ్రెస్ పార్టీకూడా ఆందోళనలో భాగం పంచుకొంటుంది. ముల్కీ నిబంధనలపై 8 మంత్రుల రాజీనామా చేస్తారు. బి.వి. సుబ్బారెడ్డి ఉపముఖ్యమంత్రి పదవిని వదులుకుంటారు.

## తిరుపతి సమావేశము

1972లో తిరుపతిలో ఆంధ్రప్రాంతానికి చెందిన కాంగ్రెస్ వాదుల సమావేశం జరిగింది. బి.వి. సుబ్బారెడ్డి అధ్యక్షత వహించారు. ప్రభుత్వానికి పన్నులు చెల్లించవద్దని నిషేదాజ్ఞల్ని ధిక్కరించమని పిలుపు నిచ్చింది. జై ఆంధ్రోద్యమం రాష్ట్రంలో ఒక దావాగ్నిలా ప్రజ్వరిల్లింది. పాలనా వ్యవస్థను స్పందింపజేసింది.

జై ఆంధ్ర ఉద్యమం రెండు నెలలుసాగినా ప్రభుత్వం లొంగిరాలేదు. 1973 మార్చిలో కాంగ్రెస్‌వారు జరిపిన సమావేశం భగ్నమైంది. రాష్ట్రంలో రాష్ట్రపతిపాలన విధించారు. ఉద్యోగులు సమ్మెలు కొనసాగాయి. 108 దినాల సమ్మె జరిగింది.

తెలంగాణాలో జన్మించినవారు ముల్కీలుకారని, అక్కడ స్థిరపడినవారే ముల్కీలు అని కోర్టుతీర్పు చెప్పింది. ఉద్యమంలో ఆసక్తి తగ్గింది. పరిస్థితిని గ్రహించిన కేంద్రం ఉభయ ప్రాంతాల నాయకులను చర్చకు పిలిచి ఆరు సూత్రాల పథకాన్ని ఆమోదింప జేసింది.

ఈ సందర్భంగా ఒక బహిరంగ సభలో సర్దార్ గౌతు లచ్చన్న వ్యాఖ్యానించారు. కేంద్రానికి వెళ్లిన కాంగ్రెసు మంత్రులకు కాంగ్రెస్ ప్రభుత్వం ఒక మూటనుకట్టి ఇచ్చింది. ఆ మూటను తెచ్చి హైదరాబాదులో విప్పితే వారికి దొరికాయి మంత్రి పదవులు. సూత్రాలు ఇకపోతే ఆరు సూత్రాల పథకం ద్వారా రాష్ట్రం రెండుగాక ఆరు ముక్కలై ఏడు ప్రాంతాలుగా పిలవబడుతూంది. తెలంగాణాలో ఈ పథకం నిరుద్యోగాన్ని చూపలేదు సరికదా చిరుద్యోగాల్ని మాత్రం వారికి ఇప్పించగలిగింది. జిల్లా సరిహద్దుల్నిదాటితే క్లాసు IV ఎప్లాయిమెంట్ దొరకని స్థితివచ్చింది.

## ఆరు సూత్రాల పథకం

1. ముల్కీ నిబంధనలు రద్దు. తెలంగాణా ప్రాంతీయ సంఘం రద్దు. 2. నాన్.గెజిటెడ్ ఉద్యోగాలకు స్థానికులనే తీసుకోవాలి. 3. ఉద్యోగస్తుల కొరకు అభినివేశ సంఘం. 4. రాష్ట్రస్థాయి ప్రణాళికా సంఘం-ప్రాంతీయ సంఘాలు. 5. హైద్రాబాదులో కేంద్రీయ విశ్వవిద్యాలయం. 6. రాజ్యాంగ సవరణల ప్రతిపాదన.

1973లో రాష్ట్రపతి పాలన ఎత్తివేయబడింది. జలగం ముఖ్యమంత్రిగా మంత్రివర్గం ఏర్పడింది. జై ఆంధ్ర ఉద్యమం-ఏర్పాటువాది కాకాని వెంకటరత్నం మరణించడం, బి.వి. సుబ్బారెడ్డిగారి అనారోగ్యం, రాష్ట్ర విభజనకు కమ్యూనిస్టుల ప్రతిఘటన కారణాలుగ సన్నగిల్లింది.

ప్రజానీకంలో తాత్కాలిక సౌకర్యాల్ని తప్పించి దూరదృష్టితో అధ్యతన భవిష్యత్‌లో రాగల ఇబ్బందుల్ని ఊహించుకోలేక పోవడం జై ఆంధ్ర ఉద్యమం సన్నగిల్లింది. ఆంధ్రలో ఒకటిగా ఉంటేనే ఒక జాతిగా ఒక సంస్కృతిగా వెలుగొందగలదని అనేక మంది కవులు, రాజకీయ నాయకులు భావించడం వలన కూడా జై ఆంధ్ర ఉద్యమం ముందుకు కొనసాగలేక పోయింది.

జై ఆంధ్ర ఉద్యమానికి ఉత్తరాంధ్రలో ఊపిరిపోసి ముందుకు నడిపిన ప్రజానేతగా సర్దార్ గౌతు లచ్చన్న తను ఏర్పాటువాదినన్న అభిప్రాయాన్ని ఈనాటికి విడిచిపెట్టలేదు. అందుకు గల కారణాల్ని ఎంతగానో విశదీకరిస్తుంటారు.

## పి.వి. నరసింహారావు ముఖ్యమంత్రి

ఢిల్లీ కాంగ్రెస్ అధిష్టానవర్గం ఎన్నివిధాలుగా ఎంతగా ప్రయత్నించిన జై ఆంధ్రోద్యమం చల్లారలేదు. ఆంధ్ర ప్రాంతానికి చెందిన కాసు బ్రహ్మానందరెడ్డి రాజీనామా. తెలంగాణాప్రాంతానికి చెందిన పి.వి. నరసింహారావు ముఖ్యమంత్రిగా రానిదే తెలంగాణోద్యమం చల్లబడలేదు. అదే ప్రాతిపదికను ఈనాడు మరల తెలంగాణా ప్రాంతం పి.వి. నరసింహారావు తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా యివ్వనిదే ఆంధ్రోద్యమం ఆగలేదు. మంత్రివర్గం రాజీనామా చేసింది.

అయితే తెలంగాణోద్యమకారుల్ని సంతోష పరచటానికి బ్రహ్మానందరెడ్డి నుండి పదవిని పి.వి. నరసింహారావుగారికి బదిలీ చేసిన కాంగ్రెస్ అధిష్టానవర్గం - పి.వి. నరసింహారావును తప్పించిన వెంటనే ఆంధ్ర ప్రాంతం వారికి కట్టబెట్టలేదు. దూరంగా ఆలోచించి 1973 డిసెంబరు వరకు రాష్ట్రపతిపాలన కొనసాగింది.

పరిపాలనాదక్షుడు ఆంధ్ర తెలంగాణా ప్రజానీకాన్ని ఇరువురికీ సమతుల్యుడు జలగం వెంగళరావు 1973 డిశంబరు 10న ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం

చేసారు. మరల బి.వి. సుబ్బారెడ్డిగారే ఉప ముఖ్యమంత్రి. పిడదల రంగారెడ్డి ఆర్థికశాఖ, వాసిరెడ్డి నీటిపారుదల, టి. అంజయ్య కార్మికశాఖా మంత్రిగా రంగప్రవేశం చేసారు. చనుమోలు వెంకట్రావు, కె.వి. కేశవులు మంత్రులుగా వచ్చారు. కేబినేట్ మంత్రులుగా 17, సహాయ మంత్రులుగా 10 మంది నియమించబడినారు.

# 18వ ప్రకరణము

## తన యం.ఎల్.సి. పదవికి రాజీనామా ఇచ్చిన-లచ్చన్న

1967లో దేశవ్యాప్తంగా ఘనవిజయాల్ని సాధించిన స్వతంత్రపార్టీ 1972లో దేశ ప్రజలపూర్తి అభిమాన ఆదరణల్ని అందలేకపోయింది. 1972లో ఆంధ్రప్రదేశ్ శాసన సభ ఎన్నికలు జరిగాయి. ఎన్నికల రణరంగంలో ఆనాడు నిలచిన పార్టీలు కాంగ్రెస్ (ఐ), ఆర్గనైజేషనల్ కాంగ్రెస్ స్వతంత్రపార్టీ, జనసంఘం, ఉభయ కమ్యూనిష్టుపార్టీలు, సోషలిష్టుపార్టీ, డి.యం.కె, ఆర్.పి.కె, బేక్‌వార్డు క్లాసు మహాసభ ముఖ్యమైనవి పోటీ దేశస్థాయి పార్టీల మధ్యనే జరిగింది. పార్లమెంటు ఎన్నికల్లో ఓటమి నందిన స్వతంత్ర పార్టీ రాష్ట్రశాసన సభ ఎన్నికల్లో పాల్గొన్నది. అయితే సర్దార్ జీ సోంపేట నుండి ఓడిపోయారు. బెందాళ వెంకటేశ్వర శర్మ, సిమ్మా జగన్నాథం ఓటమినందారు. పార్వతీపురంలో చీలిటి పరశురాం నాయుడు గెలుపొందారు. స్వతంత్రపార్టీ బలపరచిన హరి యప్పుడు ఎచ్చెర్ల నుండి గెలుపొందుతారు. పి. అప్పల సూర్యనారాయణ విశాఖజిల్లా జామి నుండి గెలుస్తారు. ఆనాటికి గొట్టిపాటి బుచ్చప్పారావు కాంగ్రెస్‌లో చేరిపోయారు. పాలవెల్లి కాంగ్రెస్‌లో ప్రవేశించి చోడవరం నుండి గెలుస్తారు. పి.వి. రమణ కాంగ్రెస్ అభ్యర్థిగా గెలుస్తారు. వేమూరులో ఎడ్లపాటి వెంకట్రావు ఈనాటి కర్నూలు జిల్లా పరిషత్ చైర్మన్, మీసాల ఈరన్న ఆనాటి స్వతంత్రపార్టీ అభ్యర్థి. రాష్ట్రం మొత్తంలో స్వతంత్రపార్టీ కేవలం 16 స్థానాల్ని మాత్రమే సంపాదించ గలుగుతుంది. శాసనసభలో స్థానాలసంఖ్య 287. ఓటర్ల సంఖ్య సుమారు కోటిన్నర మాత్రమే. ఈనాడు ఈ సంఖ్య రెట్టింపు అయింది. రాష్ట్ర స్వతంత్ర పార్టీ రథసారథి లచ్చన్న ఓటమి కారణంగా స్వతంత్రపార్టీ నాయకత్వానికి లోపం వచ్చింది. అయితే లచ్చన్నగారికి శాసనమండలి తమ పార్టీ తరపున శాసనమండలి ఎన్నికలలో పోటీ చేయించి గెలుపొందేట్లుగాచేస్తూ, ఆ లోపాన్ని పూర్తిచేసారు. శాసనమండలిలో స్వతంత్ర పార్టీ ప్రతిపక్ష నాయకునిగా లచ్చన్న వ్యవహరించేవారు. పార్వతీపురం నుండి ఎన్నికయిన చీకటి పరశురాం నాయుడుగారు శాసనసభ స్వతంత్రపార్టీ నాయకులుగా ఉండేవారు.

### లచ్చన్న ఒంటరిగా పోరాటం

1972లో రంగాజీ కాంగ్రెస్ పార్టీలో కలిసిన తదుపరి లచ్చన్న రాజకీయంగా **బలీయమైన రాజకీయ ప్రతికక్షుల్ని ఒంటరిగా నిలచి పోరాడవలసి వచ్చింది.** అంతేగాక తన వెన్నుతట్టి తనకు రాజకీయ కర్మయోగాన్ని బోధించి అంత వరకు తన పార్టీకి తనకు నాయకునిగా మెలగిన ఆచార్య రంగాజీ కాంగ్రెస్‌లోకి దూరడం వలన ...గ్రెస్‌ను ఎదిరించ తను నిలబడటం, తన గురువును ఎదిరించిన శిష్యుని పరిస్థితి

దాపురించినది. తనకు రాజకీయ అస్త్రశస్త్ర విద్యల్ని బోధించిన ద్రోణాచార్యుడు కురుసైన్యంలో ఉండగా అతనిపై తలపడిన అర్జునుని పరిస్థితి లచ్చన్నగారికి వచ్చింది.

ఎన్నో ఏండ్లు తనను అనుసరిస్తున్న శిష్యవర్గాన్ని లచ్చన్నగారిని విడచివెళ్లిన రంగాజీ విధానం లచ్చన్నలో అంతకు మించి కాంగ్రెస్ పార్టీని ప్రతిఘటించి తీరాలన్న భావోద్రేకానికి గురియైనారు. లొసగులతో కూడినది కాంగ్రెస్. దోపిడీ విధానాలు కలది కాంగ్రెస్ అని తూలనాడిన తన గురువు రంగాజీ కాంగ్రెస్‌లో చేరడం వలన లచ్చన్న మానసిక నిబ్బరాన్ని అలవరచుకొని అధికార పార్టీలోచేరిన తనకు పదవులు రాగలవని తెలిసిన తన స్వీయ ఆశయాలకు లక్ష్యాలకు కట్టుబడి ఉండిపోయారు లచ్చన్న. 1972లో బ్రహ్మానందరెడ్డి, సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఉండగా తన మంత్రివర్గంలో ఆర్థికమంత్రిగా పనిచేసిన బ్రహ్మానందరెడ్డి నీలంవారు బస్సుల జాతీయకరణకై రాజీ నామా చేయగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అవుతారు.

## వి.వి. గిరి రాష్ట్రపతి అభ్యర్థిత్వాన్ని బలపరచడం

సంజీవరెడ్డి మంత్రివర్గంలో పనిచేసి, ఆతని కెంతగానో సన్నిహితుడు, ఆత్మీ యుడు అని పేరొందిన బ్రహ్మానందరెడ్డి నీలంవారిని కాంగ్రెస్ అధిష్టాన వర్గం (సిండికేట్‌వర్గం) భారత రాష్ట్రపతిగా పోటీకి నిలబెట్టగా ఇందిరావర్గం (బాబూ జగజ్జీవన్‌రాం వర్గం) లోలోన అంతరాత్మ ప్రబోదం మేరకు స్వతంత్రంగా పోటీచేసిన వి.వి. గిరి గారిని బలపరచింది. బ్రహ్మానందరెడ్డి నీలం వారిని బలపరచక లోలోన అంతరాత్మ ప్రబోదం మేరకు ఆంధ్ర శాసనసభ సభ్యుల్లో అధికశాతం ఓట్లు వి.వి. గిరి గారికి లభించేలా చూసారు. వి.వి. గిరి గారు గెలవటానికి బ్రహ్మానందరెడ్డి కారకులయ్యారని చెప్పిన ఆశ్చర్యం లేదు. నీలంవారిని బ్రహ్మానందరెడ్డి ఓడించ ప్రయత్నించడం రాజకీయాల్లో అరుదైనది కాకపోయిన కంటికి నిద్ర వచ్చునే సుఖంబ గునే రతికేళి.....తనంతటి శాత్రవుడు ప్రక్కనున్నచో అని కవిగారు చమత్కరించ డంలో మానవనైజం యిట్టే ద్యోతకమౌతూనే ఉంది. నిజానికి ఒకేస్థాయి ఆశించిన వారిమధ్య వైరం అనివార్యం అని చాటిచెప్పాడు కౌటిల్యుడు. అంతియేగాదు ఆశయసా ధనలో తనకు అడ్డువచ్చిన దేనినైన తను పరిత్యజించగలరు. ఆనాడు తన మంత్రి పదవిని రాజధాని సమస్యపై త్యజించారు. ఈనాడు మరల ఆంధ్రప్రదేశ్‌లో జై ఆంధ్రోద్యమం లేవగా ఉద్యమ విస్తరణకు పదవికన్న ప్రజాభిమానం గొప్పదని నిరూపించటానికి తన శాసనమండలి సభ్యత్వాన్నే విడిచిపెట్టారు. తన పదవికి రాజీనామా చెప్పారు. జై ఆంధ్ర ఉద్యమం సఫలీకృతం కావాలి. రాష్ట్రమంతటా పర్యటించి సభలు-సమావేశాల్ని జరిపారు. చిన్న రాష్ట్రాలే అభివృద్ధికి మిన్న అని చాటారు. ఇదే విషయమై జనసంఘం నాయకులు రాజీనామా యిచ్చారు. మరలవారి

రాజీనామాల్ని ఉపసంహరించుకొని శాసనమండలి సభ్యత్వాన్ని పొందారు.

అయితే లచ్చన్నగారు మాత్రం అలా చేయలేదు. వేసిన బాణాన్ని మరల వెనుకకు తీసికొనే మనస్తత్వానికి ఆమడ దూరంలోనే ఉంటారు. తను ఒక విషయమై ఒక నిర్ణయానికి వచ్చిన మరల దానిపై పునరాలోచన అన్నది తన జీవితంలో ఏనాడు జరగనిది. రాజకీయంగా నిత్యం ముందడుగు వేయడమే తప్పించి వెనుదిరిగి జూడటమన్నది ఆతని రాజకీయ జాతకములో ఏనాడు లేనిది.

సమాధానపడటం ఆతని లక్ష్యం ఏనాడు కాదు. జాతి జనులు బాగుపడగలరని తన మనసునతోచిన మరుక్షణం సంఘర్షణ పడటమే ఆతని తిరుగులేని రాజకీయ నిర్ణయం. 1872 ఎన్నికలలో మరల రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీయే అత్యధిక అసెంబ్లీ స్థానాల్ని గెలుచుకొన్నది. మరల తెలంగాణా నాయకుడు శ్రీ పి.వి. నరసింహారావు గారికే ముఖ్యమంత్రి పదవి వరించింది. బి.వి. సుబ్బారెడ్డి ఉప ముఖ్యమంత్రి, జలగం వెంగళరావు పరిశ్రమలు, కాకానికి వ్యవసాయం, వి. కృష్ణమూర్తి నాయుడుకు హోం శాఖ, భగవంతరావు, మాణిక్యరావు, సుబ్బారావు, మూర్తి రాజులు, బసిరెడ్డి సాగి - మంత్రులయ్యారు. ఈ మూడు కళింగ సీమనుండి లుకరాపు లక్షణదాసు మంత్రివర్గంలోనికి వచ్చారు. మండలి కృష్ణారావు, భవనం జయప్రద, కోన ప్రభాకరరెడ్డి మంత్రులయ్యారు. సహాయ మంత్రిగా సోషలిస్టు నాయకుడు బాట్టం శ్రీరామమూర్తి సెకండరీ విద్యాశాఖ లభించింది. దామోదరం మునిస్వామి మంత్రివర్గంలోనికి వచ్చారు.

తీర ప్రాంతానికి 11 మంది మంత్రుల్ని, తెలంగాణాకు 13గురు మంత్రుల్ని, రాయలసీమకు 5 గురు మంత్రుల్ని మంత్రివర్గంలోనికి తీసుకొన్నారు. కమ్మలకు, రెడ్లకు సరిసమానంగా మంత్రిపదవులివ్వడం మంత్రివర్గ నిర్మాణంలో విశేషం.

# 19వ ప్రకరణము

## భారతీయ క్రాంతిదళ్-లచ్చన్న

1972లోనే ఆంధ్ర ప్రజానీకం పార్లమెంటు ఎన్నికలలో స్వతంత్రపార్టీని తిరస్కరించింది. ఎన్నికలలో ఏ ఒక అభ్యర్థి గెలవని పరిస్థితి. దేశస్థాయిలో స్వతంత్రపార్టీపై నెహ్రూ నుండి ఇందిరాజీ వరకు ధ్వజమెత్తుతూనే ఉన్నారు. బడా పెట్టుబడి దారులపార్టీ అని, ధనవంతుల పార్టీఅని, భూస్వాముల పార్టీఅనీ దుమ్మెత్తి పోసారు. అయితే అదే పార్టీ వ్యక్తిగత ఆస్తిహక్కును రక్షించగలిగినదని, అర్హతల మేరకు ఏ ఒకరైన ఆదాయాల్ని అందగలగవచ్చని రైత్వారీకి తమ భూములపై హక్కుల్ని కలిగియుండేలా శాసనాల్ని చేయించగలిగిందని తెలిసికోలేక పోయారు. కడుపు మండే వాడికి తిండితప్పించి ప్రాధమిక హక్కులు రాజ్యాంగ హక్కులు కావలసిన పరిస్థితి లేదు. అవి వారి దృష్టిలో అర్థంగాని భాష్యాలు-అవగాహనకు రాని భావాలు-భ్రమలు మాత్రమే.

మాటల్లో సరిసమానతలను సాధిస్తామని అందరు అన్నింట సరిసమానులమని చెపుతూ చేతల్లో అందుకు విరుద్ధంగా ప్రభుత్వ విధానాలున్న తెలిసికోలేని నిరక్షరాస్యల సంఖ్య మనదేశంలో బలీయంగా ఉంది. మేధావి రాజగోపాలచారి తీర్చిదిద్దిన స్వతంత్రపార్టీని రైతు రంగా నడిపించిన పార్టీని రాష్ట్రంలో లచ్చన్నగారు అధ్యక్షునిగానున్న పార్టీని ప్రజలు తిరస్కరించడానికి ప్రజలు ఆ నేతలను శంకించి కాదు. ఆ పార్టీ విధానాలు వారికి అవగతంకాలేదు. ఏనాటికైన ఆ పార్టీవిధానాలే రాజకీయాల్లో బలీయమైన స్థానాన్ని పొందగలవన్నది వారికి తెలియని పరిస్థితి.

ఇందుకు తోడు ప్రజల్లో పలుకుబడిని పెంపొందించుకోవటానికి ఇందిరాగాంధీ కొన్ని నినాదాల్ని చేపట్టింది. గరీబీ హటావో - బలహీన వర్గాల్ని ఉద్ధరిస్తానంది. బ్యాంకులను జాతీయం చేసింధి. రాజభరణాలను రద్దు పరచింది. పేదవాళ్ళ ప్రతినిధినని చాటిచెప్పుకొని ఆమేరకు తన విధానాలను ప్రకటించింది.

ఇటువంటి పరిస్థితులలో స్వతంత్రపార్టీ తన విధానలపై నిలబడే ప్రశ్నలేదు. ఒకవేళ ఉన్నవ్యక్తుల గొప్పదనంపై ఆధారపడి నడవాలి. నిజానికి ఆంధ్రప్రదేశ్‌లో సర్దార్ గౌతు లచ్చన్నగారి వ్యక్తిత్వంపైనే కొన్నాళ్ళు స్వతంత్రపార్టీ మనగలిగిం దన్న అతిశయోక్తికాదు.

### లచ్చన్న గెలిపించిన అభ్యర్థుల నిష్క్రమణ

లచ్చన్నగారిని ప్రజలు అభినందిస్తు పట్టం గడుతున్న తను నిలబెట్టిన అభ్యర్థుల్ని గెలిపిస్తున్న గెలిచిన అభ్యర్థులు మాత్రం తదుపరి లచ్చన్నను లచ్చన్న

పార్టీని వదలి అధికార పక్షములో చేరిపోతున్న పరిస్థితి. ప్రతిపారీ పదిమందిని గెలిపిరచుకోవడం. వారిలో ఎక్కువమంది అధికార పార్టీలోనికి జారుకోవటం నిజానికి సర్దార్ జీయే గనుక అధికారపక్షంలోనికి జారుకొన్న ఏదో ఒక మంత్రి పదవి లభించవచ్చు గాని ఈనాడు తనకున్న పేరు ప్రఖ్యాతులు లభించునా, లచ్చన్నగారు పార్టీల్ని ఆశించి పార్టీలోచేర తలపెట్టిన ప్రతిపక్షపార్టీలో చేరవలసిన ఖర్మ లచ్చన్నగారికి లేదు. ప్రభుత్వపక్ష పార్టీలోనే చేరటానికి వారికి ఆప్యాయపూర్వకమైన స్వాగతం ప్రతీ ఒకసారి లభిస్తుంది. అయిన చేరలేదు. తన లక్ష్యం అదికాదు గనుక అందుకే అతను ఏనాడు శ్రీకాకుళం, సోంపేట ఆంధ్రుల సర్దార్ అనిపించుకోలేదు. అఖిలాంద్రకోటి సర్దార్‌గనే నిలబడ్డారు. అంతేగాదు ఆయన స్వభావంలో వ్యతిరేకత లేదు. బలహీనవర్గాల సంకేమమని గప్పాలుకొట్టి, బడావ్యాపారుల్ని పెట్టుబడిదార్లను పోషిస్తున్న వ్యవస్థపైనే తన వ్యతిరేకత కొండంత ధైర్యంతో ముందుకు పోతున్న నిండయిన వ్యక్తిత్వంగల రాజకీయ వాది లచ్చన్న.

గురుశిష్యులు రైతురంగా సర్దార్ గౌతు లచ్చన్న అన్ని విషయాల్లో గురుశిష్యులని పించుకొన్నారు. తన గురువు కాంగ్రెస్‌పార్టీలోచేరి ఇందిరాజీని బలపరిస్తే అదే స్థాయికి శిష్యుడు పెరిగి దేశస్థాయిలో బలీయమైన కీర్తిప్రతిష్టల్ని కలిగి భారత రైతాంగానికి వెన్నెముకగా నిలచిన ఏకైక రాజకీయ నాయకునిగా పేరందిన చౌదరి చరణసింగ్ సాహెబ్‌ను బలపరచి భారతీయ క్రాంతిదళ్ పార్టీలో చేరారు.

నిజానికి సర్దార్ జీ రైతు బాంధవుడు చరణసింగ్ పార్టీలోచేరడం అంతరంగంలో రైతు రంగా అభినందించి యుండాలి. తను ఆది నుండి రైతాంగానికి చేయని సేవలేదు. అందుకే రైతు రంగా అని పిలవబడినారు.

దేశస్థాయిలో శ్రీమతి ఇందిరాగాంధీని ఎదిరించగల శక్తియుక్తులు ఉత్తరాది రాష్ట్రాల్లో బలమైన పలుకుబడి గల చౌదరి చరణసింగ్, భారతీయ లోక్‌దళ్ దేశానికి ఉపకరించగలదని సర్దార్‌జీ భావించారు. ఒకనాడు ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రిగా చేసినవారు జాట్స్‌ల అందరికీ ప్రేమాస్పదుడు. ఇందిరా కాంగ్రెస్‌ను ఎదిరించగల ధీరుడు చరణసింగ్ అన్న విశ్వాసంతో సర్దార్‌జీ భారతీయ లోక్‌దళ్‌లోచేరి రాష్ట్ర భారతీయ లోక్‌దళ్ పార్టీకి అధ్యక్షునిగా ఎన్నుకోబడినారు.

నిజానికి ఈ దేశంలోఉన్న రాజకీయ వ్యవస్థ కాంగ్రెస్ సంస్కృతిని ఆదారం చేసుకొని పెరిగినట్టిది. బి.జె.పి, కమ్యూనిష్టు పార్టీలుతప్ప ఈ రెండింటికీ ప్రత్యేకమైన బలీయమైన సిద్ధాంత పరమైన పునాదులున్నవి. దేశంలోఉన్న అధికార పార్టీకి ఇతర పార్టీలకు మధ్యఉన్న రేఖ పల్చనిది ''అదృశ్యమైన ఆశ్చర్యపడనవసరం లేదు.

## భారతీయ క్రాంతిదళ్‌లో స్వతంత్రపార్టీ విలీనం

ఆనాడు కె.యల్.పి.ని రద్దుపరచడం లచ్చన్నగారికి ఇష్టంలేకున్నా జరిగింది. ఈనాడు తనగురువు తన ఆశయ సాధనలో తనునడుస్తున్న మార్గమధ్యంలో తనను విడచి ఇందిరా కాంగ్రెస్‌లో చేరడంతో ఇక శిష్యుడు చేయగలిగిందేమిటి నిరాశపడి మూలపడి మూల్గడం కాదు దేశస్థాయిలో కాంగ్రెస్‌నే ఎదిరించడమే ఏనాడూ తన ధ్యేయం కావున ఆనాటికి లచ్చన్న స్వతంత్రపార్టీని చౌదరి చరణ్ సింగ్ బి.కె.డి.లో విలీనం చేసారు. లచ్చన్నగారి స్వతంత్రపార్టీ బి.కె.డి.లో విలీనంకాగా రైతు రంగా కాంగ్రెస్ పార్టీలో చేరారు. శిష్యుని వెంట నడచిన పార్టీ వేరొక జాతీయపార్టీలో (B.K.D.) లో విలీనంకాగా గురువుగారు కాంగ్రెస్‌పార్టీలో 1972లోనే చేరిపోయారన్నది మనకు గోచరిస్తున్న అక్షరసత్యం.

రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాల రూపకల్పన చేసిన గురువు ఆచార్య రంగా. ఆ సిద్ధాంతాన్ని రైతోద్యమం ద్వారా వ్యాపింపజేయాలని సర్వత్రా కృషిచేసిన శిష్యుడు సర్దార్ గౌతు లచ్చన్న వేరు వేరు పార్టీలలో చేరడం ఆలోచనీయమైన విషయం.

వయసు-విజ్ఞానం-అనుభవం పెరుగుతున్నకొద్ది భావాల్లో ఆలోచనలో బలీయమైన మార్పులు గోచరించడం సహజమైన విషయం. రైతులు-కూలీలు అన్నివర్గాల విభజన సరికాదని చివరకు నమ్మిన సామ్యవాదతరహా సమాజాన్ని నిర్మిస్తామన్న కాంగ్రెస్ పార్టీని మరల నమ్మి తనమాతృ సంస్థలోనికి రంగాజీ వెళ్లిఉంటారు. తను ఆదినుండి సలుపుతున్న పోరాటాల వెనుకనున్న ఆంతర్యం బలహీన వర్గాలు బాగుపడాలని, దళిత జనావళికి శుభం కలగాలని, దోపిడీ వర్గాల నిర్మూలనం కావాలని అయితే కలకాలం నుండి అధికార పీఠంలోనున్న కాంగ్రెస్ అసమానతల్ని పెచ్చింపచిందే తప్పించి చెడిపోయిన బ్రతుకుల్ని బాగుపరచలేక పోయింది. అందుకు కాంగ్రెస్‌ను గద్దెనుండి దింపాలన్న ఏకైక లక్ష్యంతో సర్దార్‌జీ కాంగ్రెసేతర ప్రతిపక్షంలోచేరి కాంగ్రెస్ మదగజానికి అంకుశంలా నిలబడుతూ వస్తూనే ఉన్నారు.

జీవితంలో నిత్యం సంఘర్షణగాక సమాధాన పడటం ఉత్తమమని ఒకరు భావిస్తే ఆశించిన లక్ష్యం ఆశయం నెరవేరేదాక సమాధాన పడటమన్న ప్రశ్నేలేదు. సంఘర్షణ పోరాటం ఉద్యమాలే ఊపిరిగా జీవించడం వేరొకరి లక్ష్యం. వయసుమీద పడుతున్న రాజకీయాల సుడిగుండాల్లో దూరి పేదప్రజల బ్రతుకుల్లో కాంతి కిరణాలు రాగాచూడాలని అభిలషిస్తున్న లచ్చన్నకు 81 ఏండ్లు గతిస్తున్న రాజకీయ పోరాటాల్లో దూరడమే తప్పించి విరామం విశ్రామం అన్నదే లేదు. అందుకు సాధనం దేశస్థాయిలోగల కాంగ్రెస్‌ను గద్దెదించాలన్న భారతీయ క్రాంతిదళ్ తనకు

శరణ్యమైనది. తన స్వతంత్రపార్టీని ఆపార్టీలో విలీనం చేసినదందుకే. రైతోద్యమాల్లో పాల్గొని ఎన్నో విజయాలనందిన లచ్చన్న దేశంలోగల అసంఖ్యాక రైతాంగాన్ని బాగుపరచాలన్నదే ఆతని ధ్యేయం. ఆసరికే చౌదరి చరణసింగ్ ఉత్తరప్రదేశ్‌లో కాంగ్రెస్ ముఖ్యమంత్రిగా పనిచేసినవారు ఉత్తర భారతంలోగల ''జాట్స్''కి ప్రియతమ నాయకుడు. హర్యానా నుండి బీహారు వరకుగల మైదాన ప్రాంతాలలోగల ప్రజానీకంలో తిరుగులేని రాజకీయ ప్రాబల్యం కలవారు రైతులన్న అభిమానం రైతురాజ్యమన్న స్థాపించి తీరాలన్న పట్టుదలగలవారు. కేంద్రమున తానున్న కొద్దికాలం కాంగ్రెస్ మంత్రిగా ఆర్థికమంత్రిత్వ శాఖలో రైతాంగానికి ఉపయోగపడిన ఆర్థిక సంస్కరణల్ని తెచ్చిపెట్టినవారు.

చౌదరి చరణసింగ్ భారతీయ క్రాంతిదళ్ అధ్యక్షునిగా ఆంధ్రప్రదేశ్ భారతీయ క్రాంతిదళ్ అధ్యక్ష పదవికి సర్దార్ జీని అప్పగించారు. రైతోద్యమాల్ని నిర్వహించిన సర్దార్‌జీ అన్న చౌదరి చరణసింగ్‌నకు ప్రత్యేకాభిమానం ఉండేది. ఆనాడు భారతీయ క్రాంతిదళంలోనున్న నేటి జనతదళ్ నేత భారత ఉపప్రధాని దేవీలాల్ సర్దార్ గౌతు లచ్చన్న కలసి కార్యక్రమాల్ని నిర్వహించినవారు కాంగ్రెస్‌ను ప్రతిఘటించగల దిట్టలగా ఇరువురు నేటికి కృషినలుపు తున్నారు.

## 20వ ప్రకరణం

## ఎమర్జన్సీ ప్రకటన-లచ్చన్న నిర్బంధం

### జె.పి. ఉద్యమం-సంపూర్ణ విప్లవం

బీహార్‌లోని పాట్నాలో విద్యార్థి యూనియన్‌లు అవినీతి నిర్మూలనకై ప్రదర్శన నిర్వహిస్తారు. జె.పి. నాయకత్వం వహిస్తారు. నిరుద్యోగ నిర్మూలనకు పిలుపును యిస్తారు.

సర్వోదయ నాయకుడు పార్టీరహిత ప్రజాస్వామ్యం కావాలని అంతవరకు వాదిస్తువస్తున్న జయప్రకాష్ నారాయణ్ క్రియాశీలక రాజకీయాల్లో ప్రవేశిస్తారు. దేశంలోనున్న పరిస్థితులు అతనిని అలా నడిచేలా చేసాయి.

అఖిలభారత దేశస్థాయిలో అవినీతి నిర్మూలన జరగాలని నిరుద్యోగ నిర్మూలన జరగాలని పిలుపుఇస్తూ కాంగ్రెసేతర రాజకీయనాయకులతో కాంగ్రెసేతర పక్షాల సమావేశాన్ని ఢిల్లీలో ఏర్పాటు చేస్తారు.

జాతీయస్థాయిలో ఇందుకు ఒక కమిటీని నిర్మిస్తారు. దేశమంతటా జె.పి. పర్యటిస్తారు. ఆంధ్రప్రదేశ్ పర్యటనలో హైదరాబాదు, విశాఖపట్నం, విజయవాడలో బహిరంగ సమావేశాల్ని నిర్వహిస్తు జె.పి.ని లచ్చన్న, తెన్నేటి విశ్వనాథం అనుసరిస్తారు. ప్రజల్లో ఒక ఉద్యమం లేచింది.

పార్లమెంటును స్థంబింపచేయాలని ఒక కార్యక్రమం తీసికోవడం జరిగింది. మిలట్రీని కూడ దేశరక్షణకై ముందుకు రావాలని జె.పి. పిలుపునిస్తారు. మాస్‌రాలీ ఢిల్లీలో జరుగుతుంది. లోకనాయక్ సంపూర్ణ విప్లవం సాధించాలన్నది తన లక్ష్యం ఆర్థికంగా, సాంఘికంగా సమసమాజ స్థాపన జరగాలి. కాంగ్రెస్ (S), సోషలిష్టుపార్టీ కమ్యూనిష్టుపార్టీ జనసంఘపార్టీ కృపాలానీ, మొరార్జీ, చంద్రశేఖర్, ఫెర్నాండెజ్, మధులిమాయా వంటి నాయకులు జె.పి.ని బలపరచారు. దేశంలోగల కాంగ్రెసేతర పార్టీలన్నీ కమ్యూనిష్టులు తప్పించి కాంగ్రెస్‌ని ప్రతిఘటించు ఒకేపార్టీ కావాలని పిలుపునిస్తారు.

దేశ ప్రధాని ఇందిరాజీ లోక్‌నాయక్ జె.పి. యిచ్చిన పిలుపుపై ప్రజానీకం స్పందించడం జూచి, అమితాశ్చర్యానికి గురైనారు. ప్రజోద్యమం కొత్త పుంతలు త్రొక్కింది. దేశం నలుమూలలా జె.పి. అనుకూల పవనాలు వీస్తున్నందున కాంగ్రెస్ కంచుకోటలు బీటలుపడిపోతున్నదని గ్రహించిన దేశప్రధాని ఇందిర దేశంలో అత్యవసర పరిస్థితిని 1975 జూన్‌లో ప్రకటించారు. ఆనాటి దేశాధ్యక్షుడు జాకీర్

హూస్సేన్ అత్యవసర పరిస్థితిని ప్రకటిస్తారు.

తత్ఫలితంగా జయప్రకాష్, మొరార్జీ, కృపలానీ, చంద్రశేఖర్, ఫెర్నాండెజ్, మదులిమియావంటి జాతీయనాయకులను జైల్లో బందించారు. మన రాష్ట్రంలో సర్దార్ గౌతు లచ్చన్న, తెన్నేటి విశ్వనాధం, సుందరయ్య వంటి రాజకీయ నాయకుల్ని జైల్లో నిర్బంధించారు.

## 1975 జూన్‌లో అత్యవసర పరిస్థితి ప్రకటన

1975 జూన్‌లో అత్యవసర పరిస్థితి ప్రకటించడమే తరువాయి ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రి జలగం వెంగళరావు, శాంతిభద్రతల చర్యపై వివిధ కాంగ్రేసేతరపక్షాల నాయకులనెల్లరిని పట్టి జైల్లో బంధించుటకు అన్ని ఏర్పాట్లు జరిగిపోయాయి.

ఆ తేదీన కాళహస్తిలో సర్దార్‌జీ బంధువుల ఇంట్లో పెళ్లికిహాజరై ఉన్నారు. 1975 జూన్ 25న అర్ధరాత్రిన ఎమర్జన్సీ ప్రకటన. వివిధ కాంగ్రేసేతరపక్షాల రాజకీయ నాయకుల్ని నిర్బంధించటానికి తీసికొని జైల్లో వేయడం, ఒకేమారు జరిగింది.

సోంపేటలోఉన్న లచ్చన్న గారింటికి పోలీసులు వెళ్లారు. కాళహస్తిలో ఉన్నారన గానే తెల్లవారు జామున 4 గంటలకు కాళహస్తిలోనున్న డి.యస్.పి. వచ్చి తలుపుతట్టి లచ్చన్నగారు ఉన్నారా అని అడుగుతారు. ఉన్నారనటమే తరువాయి నిర్బంధించి తీసికొనివెళ్లి వైజాగ్ సెంట్రల్ జైల్లో బంధించారు. ఎవరిని అరెస్టుచేసార న్నది ఎవరికి తెలియని పరిస్థితి. దిన పత్రికలలో బ్లాంక్ పేజీలలో ప్రత్యక్షం. ఆనంద మార్గీయుల్నికూడా అరెస్టుచేసారు. సంపూర్ణ విప్లవాన్ని బలపరచిన ప్రతీఒకరిని అరెస్టుచేసి నిర్బంధించారు.

కమ్యూనిష్టు నాయకుల్ని రాడికల్ రైటర్ రవిశాస్త్రిని ఇంజనీరింగ్ లఖాశాల ప్రిన్సిపాల్ రాజుగారిని, రాష్ట్రీయ స్వయంసంఘ నాయకుల్ని అందరినీ నిర్బంధిం చారు.

సర్దార్‌జీని విశాఖపట్నం జైల్లో నిర్బంధించిన రహస్యమైనందున ఎచటనున్నది తెలియరాలేదు. యశోదాలచ్చన్న హైకోర్టులో అడుసుమిల్లి పాండురంగారావు అడ్వకేట్ ద్వారా రిట్‌ఆఫ్ మాండమస్ దాఖలుచేయగా శ్రీమతి యశోదాదేవికి వైజాగ్ సెంట్రల్ జైల్లోఉన్న లచ్చన్నగారి వద్దకు తీసుకొనివెళ్లి ''ఇంటర్వ్యూ''కి అవకాశం యిస్తారు. అడ్వకేట్‌ను కూడా అనుమతిస్తూ.

లచ్చన్నగారు జైలుకు ఇంటర్వ్యూకోసం వచ్చిన ప్లీడరు ద్వారా హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేస్తారు. తనపై ఎట్టి నేరారోపణలు చేయటానికి అవకాశాలులేవని తానే స్వయంగా వాదించుకోగలనని కోరతారు.

ఆరిట్ పిటిషన్ వలన వైజాగ్ సెంట్రల్ జైల్లోనున్న సర్దార్ గౌతు లచ్చన్న హైదరాబాదులోనున్న ముషీరాబాద్ సెంట్రల్ జైల్లోకి తరలించబడతారు. తనతో తరిమిల నాగిరెడ్డివంటి వారు సుమారు 200 మంది వరకు ఉన్నారంటారు లచ్చన్నగారు.

జైల్లో నిర్బంధించిన నాయకుల్ని విడుదల చేయుని తప్పని పరిస్థితిలో ఉంటుంది. కాంగ్రెస్ అధిష్టానవర్గం కేంద్ర మంత్రివర్గం 1977 జనవరిలో మొదటి పాగా ఎమర్జన్సీని ఎత్తివేస్తు మొదట ప్రధమతరగతి జాతీయ నాయకులందరినీ విడుదల చేస్తారు.

ఢిల్లీలో సమాలోచనలు ప్రారంభమైనాయి. ఇందిరాజీని ఎలా ఎదుర్కోవాలి. జైల్లో నిర్బందించి ప్రజావ్యతిరేక విధానాలను అవలంభిస్తున్న ఇందిరా కాంగ్రెస్‌ను జయించడమెలా అన్నది చర్చించారు. ఢిల్లీ అఖిలపక్ష నాయకుల సమావేశం ఢిల్లీలో జరుగుతుంది. కాంగ్రెస్ (S), జనసంఘం, భారతీయ క్రాంతిదళ్, సోషలిష్టు పార్టీ వీటినాయకులు ఒకేపార్టీగా రూపొందటానికి అంగీకరించారు.

## లచ్చన్నగారు 1977 జనవరి 20న విడుదల

1977 జనవరి 20 తేదీన సర్దార్ గౌతు లచ్చన్నగారిని విడిచిపెట్టారు. అదే దినమున ఢిల్లీకి కన్వెన్షన్‌కు విమానంపై వెళ్ళి హాజరగుతారు. అదే దినమున లోక్‌నాయక జనతాపార్టీ ఆవిర్భావం, నామకరణం జరుగుతుంది. అధ్యక్షునిగా చంద్రశేఖర్‌ని, జె.పి. తరువాత ప్రకటిస్తారు.

దేశస్థాయిలో కాంగ్రెస్ (ఐ)కి ఎదిరించడానికి జనతాపార్టీ దీక్షాకంకణం కట్టుకొన్నది. ఆంధ్రప్రదేశ్ జనతాపార్టీ అధ్యక్షులుగా శ్రీ తెన్నేటి విశ్వనాధుని నియమిస్తారు. సర్దార్ గౌతు లచ్చన్నగారిని ఉపాధ్యక్షులుగా నియమిస్తారు.

ఇందిరాజీ ఎమర్జన్సీ ఎత్తివేసి పార్లమెంటును రద్దుచేసి మరల మధ్యంతర ఎన్నికలు జరిపించాలన్నది ఆమె ఉద్దేశం. ఆమె పార్లమెంటుని 1977 ఫిబ్రవరిలో మధ్యంతర ఎన్నికలు ప్రకటించబడినాయి.

# 21వ ప్రకరణము

## ఎన్నికల్లో జనతాపార్టీ-లచ్చన్న

1977లో జరిగిన పార్లమెంటు ఎన్నికల్లో మన రాష్ట్రం నుండి జనతాపార్టీ తన అభ్యర్థుల్ని నిలబెట్టింది. ఆనాటి జనరల్ ఎన్నికల్లో మూడు రకాలకు చెందిన పార్టీలు పాల్గొన్నవి. (1) దేశస్థాయి పార్టీలు (2) రాష్ట్రస్థాయి పార్టీలు (3) గుర్తింపు నందని నమోదు అయిన పార్టీలు.

### పార్టీల చిహ్నాలు

ఆంధ్రప్రదేశ్‌లో ఆనాటికి రాష్ట్రస్థాయి పార్టీలు ఏమీ లేవు. నమోదుఅయి గుర్తింపునందని పార్టీలు ఐదు. (1) అఖిలభారత హైదరాబాదు మహాసభ (2) రామరాజ్య పరిషత్ (3) వెనుకబడిన తరగతుల మహాసభ (4) రిపబ్లికన్ పార్టీ ఆఫ్ ఇండియా (5) సంపూర్ణ తెలంగాణా ప్రజాసమితి.

జాతీయ స్థాయిలో ఎన్నికల రణరంగంలో దూకిన పార్టీలు ఏడు. (1) ఆవుదూడ గుర్తుతో, ఇండియన్ నేషనల్ కాంగ్రెస్, చర్కా స్త్రీ గుర్తుతో ఆర్గనైజేషనల్ కాంగ్రెస్, దీపం గుర్తుతో భారతీయ జనసంఘం, సుత్తికంకి గుర్తుతో కమ్యూనిష్టుపార్టీ ఆల్ ఇండియా సుత్తి-కొడవలి గుర్తుతో మార్కిష్టు కమ్యునిష్టు పార్టీ, వృక్షం గుర్తుతో సోషలిష్టుపార్టీ, కాడి ధరించిన రైతు చిహ్నంతో జనతాపార్టీ ఎన్నికల్లో తమ తమ అభ్యర్థుల్ని నిలిపాయి.

1972లో స్వతంత్రపార్టీని తిరస్కరించిన ఆంధ్ర ప్రజానీకంవద్దకు మరల 1977లో జనతాపార్టీని గెలిపించమని సర్దార్ గౌతు లచ్చన్న రాష్ట్రవ్యాప్తంగా పర్యటిస్తారు. ప్రజల నాడిని పసిగట్టగల నేతగా గణుతికెక్కిన లచ్చన్న ప్రజల అభిరుచిని లక్ష్యాలకు సరిపడిన పార్టీగా జనతాపార్టీని అభివర్ణిస్తారు. దేశస్థాయిలో జె.పి. మరియు చరణ్‌సింగు స్థాపించిన జనతాను గెలిపించమని ప్రజలవద్దకు లచ్చన్న వెళ్లారు.

అయితే ఆనాటికే ఇందిరాజీ రాజభరణాల్ని రద్దుచేసి బ్యాంకుల్ని జాతీయం చేసిన కార్యక్రమం తీసికున్నందున ప్రజలు అందుకు ప్రభావితులయి రాజకీయ వ్యక్తిత్వాన్ని కాదని, కాంగ్రెస్‌నే గెలిపించే పరిస్థితికి లోనైంది. భారతీయ లోక్‌దళ్ అభ్యర్థిగా శ్రీకాకుళం పార్లమెంటు స్థానం నుండి పోటీచేసిన లచ్చన్న గారు కాంగ్రెస్ అభ్యర్థి బొడ్డేపల్లి రాజగోపాలరావు చేతిలో ఓడిపోతారు. పార్వతీపురం నుండి ఇండిపెండెంటు అభ్యర్థి వైరిచర్ల కిషోర్‌చంద్ర సూర్యనారాయణ దేవ్ గెలుస్తారు. కేవలం వేల ఓట్లతో కాంగ్రెస్ (ఐ) అభ్యర్థిగా పి.వి.జి. రాజు బొబ్బిలి

స్థానాన్ని దక్కించుకొంటారు. కేవలం 2వేల ఓట్లతో బి.యల్.డి. అభ్యర్థి పుండరీకాచారి ఓడిపోతారు. విశాఖ పట్నం స్థానం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగా ద్రోణంరాజు సత్యన్నారాయణ గెలుస్తారు. భారతీయ లోకదళ్ అభ్యర్థిగా పోటీచసిన తెన్నేటి విశ్వనాథం ఓడిపోతారు. శ్రీమతి వాణీ రమణారావుచలపతిరావు భద్రాచలం-అనకాపల్లి స్థానాలనుండి పోట చేసి ఓడిపోతారు. యన్.ఆర్.ఎ.యన్. అప్పలనాయుడుగారు కాంగ్రెస్ అభ్యర్థిగా కేవలం 3వేల ఓట్లతో గెలుస్తారు.

## ఆంధ్రప్రదేశ్‌లో జనతా ఓటమి

జనతా పార్టీని ఉత్తరాంధ్ర వరకు పరిశీలించిన పార్టీని ప్రజలు ఆశించారు. అభిమానం చూపారు. ఏ ఒక జనతా అభ్యర్థి తన డిపాడిట్‌ను కోల్పోలేదు. సరికదా వేల ఓట్ల తేడాలోనే అపజయం అందారు. ప్రతిపక్షాలలోగల అనైక్యతల్ని కాంగ్రెస్ పార్టీ విజయం చేసుకొన్నది. ఇందుకు తోడు నాటి ఇండిపెండెంటులు హెచ్చు స్థాయిలో ప్రతిచోట పోటీకి నిలబడినందున దేశస్థాయి పార్టీల ఆశల్ని, లక్ష్యాల్ని చాలవరకు దెబ్బతీశారు.

కాంగ్రెస్‌కు ధీటుగా నిలిచిన కాకినాడలో జనతా ఓడిపోయింది. 6వేల ఓట్లతోనే అమలాపురం సీటును కాంగ్రెస్ దక్కించుకున్న ప్రధానమైన పోటీ జనతాయే. ఏలూరులో కూడా కాంగ్రెస్‌నే గట్టిగానే జనతా ఎదుర్కొన్నది. మచిలీపట్నంలో వడ్డె శోభనాద్రిరావు పోటీచేసిన ఓటమి లభించింది. విజయవాడ-గుంటూరులో కూడా కాంగ్రెస్‌ని బలంగానే ప్రతిఘటించింది. బాపట్లలో జాగర్లమూడి చంద్రమౌళి ఓడిపోయారు. నరసాపురంలో కాంగ్రెస్ అభ్యర్థి బ్రహ్మనందరెడ్డి గెలిచారు. ఒంగోలు తిరుపతిలో జనత తన స్థానాన్ని కోల్పోయింది. బీహారు స్థానాన్ని పి. రాజగోపాలనాయుడు కాంగ్రెస్ అభ్యర్థిగా గెలుచుకున్నారు. రాజంపేటలో జనతా అభ్యర్థిగా పోటీచేసి పి. తిమ్మారెడ్డి ఓడిపోయారు. కడప, హిందూపూర్, అనంతపూర్, అనంతపూర్ స్థానాల్లో ఓడిపోయిన-నంధ్యాల స్థానాన్ని మాత్రం నీలం సంజీవరెడ్డి జనత అభ్యర్థిగ దక్కించుకున్నాడు. కాంగ్రెస్ అభ్యర్థి పి. వెంకటసుబ్బయ్య ఓడిపోయారు. నాగర్‌కర్నూలు మహబూబ్‌నగర్-హైద్రాబాదు స్థానాల్ని జనత పోగొట్టుకున్నది. సికిందరాబాదు స్థానాన్ని టి. లక్ష్మీకాంతమ్మ దక్కించుకోలేక పోయారు. కేవలం వేయి ఓట్లతో పరాజయం.

తెలంగాణాలో ఒక్క సీటును కూడా జనత గెలవలేకపోయిన కాంగ్రెస్‌ని ధీటుగా నిలచి ఓట్లను సంపాదించినది జనత అనియే చెప్పాలి. రాష్ట్రస్థాయిలో కాంగ్రెస్‌ను ప్రతిఘటించి దీని తదుపరి స్థానంలో నిలచిన రీతిగా ఓట్లను సంపాదించిన ఓటమికి జనత గురియైనది.

1973 డిసెంబరు 10వ ప్రమాణ స్వీకారం చేసిన వెంగళరావు మంత్రివర్గం తమ మంత్రి వర్గాన్ని మరల 1976 ఆగష్టు 13న విస్తరించి పునర్వ్యవస్తీకరించింది. కొత్త వారికి స్థానం కల్పించి పరిశ్రమల మంత్రి బసిరెడ్డిని బయటకు అంపించింది. మంత్రివర్గ సంఖ్య 31 వరకూ పెరిగెంది. 16మంది కేబినెట్ మంత్రులు 15మంది సహాయమంత్రులు.

## జలగం వెంగళరావు ముఖ్యమంత్రి

1977 ఎన్నికల ముందుగా పునర్వ్యవస్థీకరించిన మంత్రి వర్గంలో ముఖ్యమంత్రి. శ్రీ జలగం వెంగళరావు గారే. పి. రంగారెడ్డికి ఆర్థికశాఖ లభించింది. ఉప ముఖ్యమంత్రి పదవిని ఊడదీశారు. బి.వి. సుబ్బారెడ్డిని బయటకు అంపించారు. అంజయ్యను కార్మికశాఖను ఇచ్చారు. మరల ఉత్తరాంధ్రనుండి వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడును, లుకలాపు లక్ష్మణదాసుని మంత్రివర్గంలోనికి తీసుకొన్నారు. యం.వి. కృష్ణారావు విద్యాశాఖమంత్రి-బాట్టం శ్రీరామమూర్తి సాంఘిక సంకేమశాఖామాత్యులు, సాగి సూర్యనారాయణరాజు దేవదాయ శాఖామాత్యులు, చొక్కారావు రాజమల్లు ఆరీ అన్సారీ, నరసారెడ్డి, బత్తిన సుబ్బారావు, రాజారాం, వి. మహేంద్ర నాథ్, డి. మునుస్వామి, కె.బి. నరసము, శేషావతారం ఇతరులు మారినంత మంత్రివర్గంలోనికి వచ్చారు.

దేశంలో అత్యవసర పరిస్థితి అమలులోనుండగా మనకు ముఖ్యమంత్రి జలగం వెంగళరావు ఇందిరాగాంధీ కాంగ్రెస్‌కు అన్ని విధాలా సహకార సద్భావాల్ని అందించి ఇందిరాకాంగ్రెస్ విజయాలకు ఎంతగానో దోహదపడిన కాంగ్రెస్‌వాది. పరిపాలనాద క్షుడు, ప్రజ్ఞావంతుడు ముఖ్యమంత్రి.

# 22వ ప్రకరణము

## ఆంధ్రప్రదేశ్ శాసనసభ ప్రతిపక్ష నాయకునిగా–లచ్చన్న

1978లో రాష్ట్ర శాసనసభలకు జనరల్ ఎన్నికలు జరిగాయి. ఆ సరికే దేశస్థాయిలో గల ఇందిరాకాంగ్రెస్ ఆర్గనైజేషన్ కాంగ్రెస్ తమతమ పార్టీటల చిహ్నంగా ఆవుదూడ గుర్తు ఉండాలన్న ఎన్నికల కమీషనుకు విజ్ఞప్తుల్ని అందించాయి. వివాదం తెగనందున ఎన్నికల కమీషన్ ఆవుదూడ గుర్తును స్థంభింపజేయగా ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌గా ఒకటి రూపొంది జాతీయ జెండాపై నూలు వడకుతున్న స్త్రీని తనపార్టీ గుర్తుగా ప్రకటించుకొన్నది. వేరొకటి! ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (ఐ) గారూ పొండి తన గుర్తును హస్తంగా తీర్చిదిద్దుకొన్నది. ప్రజలకు ఇది అభయ హస్తం అని ప్రచారం చేసుకున్నది. నిజానికిది భస్మాసుర హస్తం అని ప్రతిపక్షాలు లచ్చన్న దీనిపై ఎదురు ప్రచారానికి దిగారు.

## జాతీయస్థాయి పార్టీలు–జనతా

1978లో దేశస్థాయిలో మరల జాతీయస్థాయి పార్టీలలో మార్పు చేర్పులు సంభవించాయి. లోగడ ఉన్న పార్టీలమారుగా ఈ క్రిదనుదాహరించినవి జాతీయ స్థాయి పార్టీలుగా ఎన్నికల కమీషన్ ప్రకటించింది.

1) ఇండియన్ నేషనల్ కాంగ్రెస్. 2) ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ (ఐ). 3) జనతాపార్టీ. 4) కమ్యూనిష్టు పార్టీ ఆఫ్ ఇండియా. 5) మార్క్సిష్టు కమ్యూనిష్టు పార్టీ.

నిజానికి దేశ రాజకీయ చిత్రపటములో సిద్ధాంతపరమైన స్థాయిలో పార్టీలు నెలకొల్పబడినవాయని చెప్పాలి. పెట్టుబడిదారీ వ్యవస్థ సామ్యవాద వ్యవస్థ స్థిరమైన శాస్త్రీయ పరమైన ఆర్థిక సిద్ధాంతాలు. మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అన్నది ఈ రెండింటి యొక్క సమ్మేళనము మధ్యలో వచ్చినది మన భారతదేశం రూపొందిన మిశ్రమ ఆర్థిక వ్యవస్థ విభిన్న సిద్ధాంతాలకు కలయిక సాధ్యమన్న నమ్మకం కలదీ. వాగర్థః పితరౌవందే పార్వతీపరమేశ్వరౌ అని కాళిదాసు పార్వతీ పరమేశ్వరుల సంబంధాన్ని వాక్ అర్థము రెండింటికున్న సంబంధములాంటిదని అభివర్ణించాడు. అలానే సామ్యవాద వ్యవస్థ పెట్టుబడీదారీ వ్యవస్థ విధానం రెండింటిని సమతూకంలో కొనసాగించగలమని మన భారత మాజీ ప్రధాని స్వర్గీయ జవహర్‌లాల్ అనుసరించిన మిశ్రమ ఆర్థిక విధానానికి రూపకల్పన ఇది. నేటికి ఇదే ఆర్థిక విధానం మన దేశాన కొనసాగించబడుచున్నది.

నిజానికి రాజనీతి సిద్ధాంతాలలో ఆదర్శవాదం-భౌతికవాదం అన్నవి రెండే

సిద్ధాంతాలు ఇక ఈ రెండింటిని విశ్లేషించుకొని పూర్వాపర అర్థాల్ని మేళవిస్తుపోతే అసంఖ్యాక రాజకీయ సిద్ధాంతాల్ని ఇందులో నుండి జనిస్తాయి. ద్వివిధ కాంగ్రెస్ పార్టీలు సామ్యవాద తరహా సమాజాన్ని ఒకటి, గాంధేయ ఆర్థిక విధానాన్ని వేరొకటి అమలు చేయ సిద్ధపడగా జనతాపార్టీ సోషలిజాన్ని అమలుచేస్తానన్న జయప్రకాశ్ నారాయణ్ నేతృత్వాన భారత్‌లో వెలసిన పార్టీ. ఇక ఉభయ కమ్యూనిస్టులు కమ్యూనిజాన్ని స్థాపించగల మన్నది వారి సిద్ధాంతం. కారల్‌మార్క్స్, లెనిన్ సిద్ధాంతాలకు అనుగుణంగా వ్యవహరించగల పార్టీలుగా ఆ రెండు ఉండగలవు. సోషలిజం స్థాపన జరిగిన తదుపరి, చేరవలసిన ఆర్థిక వ్యవస్థ కమ్యూనిజమే. సోషలిజం, కమ్యూనిజం స్థాపనకు మొదటి మెట్టు. అయితే కమ్యూనిజం, సోషలిజం స్థాపన కానిదే ఆచరణలో ఎచటను అమలుకానిది. ప్రతిభా సామర్థ్యాలు మేరకు ప్రతి ఒకరు ప్రతిఫలం అందాలని ఒకటి సిద్ధాంతీకరించగా వ్యక్తుల అవసరాలమేలకు జాతీయోత్పత్తుల్ని స్వీకరించి ప్రతిభా సామర్థ్యాల మేరకు సమాజశ్రేయస్సుకు పాటు పడాలని వేరొకటి సిద్ధాంతీకరిస్తుంది.

## నాలుగుపార్టీల సమ్మేళనం

జనతాపార్టీ నాలుగు పార్టీల సమ్మేళనం, విభిన్న రాజకీయ సిద్ధాంతాలలో ఆనాటి వరకు కొనసాగుతూ వస్తున్న నాలుగు పార్టీలు లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ ఇచ్చిన పిలుపుమేరకు భావోద్రేకంతో, దేశభక్తితో నిరంకుశ విధానాన్ని పారద్రోలాలన్న నమ్మకం విశ్వాసంతో తమతమ పూర్వపుస్వీయస్థితి గతుల్ని సిద్ధాంతాల్ని విస్మరించి సోషలిజం బాటలో అడుగువేసాయి. జయప్రకాశ్ నారాయణ్‌ను అనుసరించాయి. రాజకీయ రణరంగంలోకి దూకి ఒక్కటిగా రూపొందినభిల షించిన ఫలితమే జనతాపార్టీ.

కాంగ్రెస్ (S) తన పూర్వపు గుర్తు చర్కా స్త్రీని, భారతీయ జనసంఘం తన దీపం గుర్తును, సోషలిష్టుపార్టీ తన వృక్షం గుర్తును, భారతీయ క్రాంతిదళ్ కాడి ధరించిన రైతుగుర్తును రద్దుచేసుకొని జనతాపార్టీగా అవి రూపొందినట్లు జనతాపా ర్టీకి కాడి ధరించిన రైతు చక్రంలో పొందుపరచినట్లుగా తమకు గుర్తుకును కేటాయించమని ఎన్నికల సంఘాన్ని కోరడం, ఆమోదించడం జరిగింది.

అందువలన జాతీయస్థాయిలో పోటీచేసిన ప్రధానపార్టీల గుర్తులు హస్తం, చక్రంలో కాడి ధరించిన రైతు కొడవలి-కంకి-సుత్తి-కొడవలి గుర్తులతో ఎన్నికల రణరంగంలోనికి ప్రవేశించాయి.

లోకనాయక్ పిలుపుపై దేశం నలుమూలలా రాజకీయ చైతన్యం వెల్లివిరిసేలా ఉద్యమాలు, సమావేశాలు, సభలు జరిగాయి. పిలుపుకు అనుకూలంగా యావద్దేశపు

# గృహ ప్రదాన మహోత్సవం

శ్రీ గౌతు లచ్చన్న శ్రీమతి యశోదాదేవిగార్లకు

హైదరాబాదునందు ఖైరతాబాదులోని **10-6-56** నంబరుగల

నివాసగృహప్రదాన మహోత్సవ సందర్భమున మిత్రులు, శ్రేయోభిలాషులు సమర్పించు

# సన్మాన పత్రము

## ఆదర్శ దంపతులారా!

పూజ్య రంగాజీ నాయకత్వాన, స్వార్థరహితమైన దేశసేవకు జీవితాలను అంకితంచేసి ఆంధ్ర ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న మీకు, మా అభివందనాల నందజేయుచూ యీ నివాస గృహాన్ని ప్రేమతో బహూకరిస్తున్నాము.

మీ నిస్వార్థ సేవలయెడల, మాకుగల విశ్వాసానికి ఇది ఒక చిహ్నము మాత్రమే.

## అన్నా! లచ్చన్నా!

నిరుపేద శ్రామిక కుటుంబములో పుట్టి, విద్యార్థి దశలోనే పూజ్యబాపూజీ పిలుపునందుకొని జీవితమంతా దేశసేవకంకితంచేసి, 1930 ఉప్పు సత్యాగ్రహం, 1932 శాసనోల్లంఘనోద్యమాలలో లాఠీ ఛార్జీలకు, కారాగార క్లేశాలకు గురియై, 1938 లో ఆచార్యరంగా "రైతు-కూలీ-ప్రజారాజ్య" నినాదము నందుకొని, తదేక దీక్షతో నేటివరకు యథాశక్తి, స్వార్థరహితంగా సేవచేస్తున్న మీరు ధన్యజీవులు.

## సర్దార్ జీ!

జీవితరణరంగంలో ఏనాడు కాలూనినావో ఆనాటినుండి నిరంతరంగా నీవు నమ్మిన మహదాశయాలసిద్ధికి అప్రతిహతంగా పోరాటం సాగిస్తున్నావు. రంగాజీ రైతాంగ విశ్వవిద్యాలయంలో పట్టభద్రుడవై, దేశంకొరకు, నీ సోదర శ్రామికుల కొరకు నిరంకుశత్వానికి ఎదురునిలిచావు. ఎన్నో, రైతు-కూలీ-ప్రజాపోరాటాలకు నాయకత్వంవహించి, విజయాన్ని సాధించి, "సర్దార్" బిరుదమందావు. మహామంత్రిత్వాన్ని కాలదన్ని - ప్రజలకు కాని అధికారం వ్యక్తికి ముండ్ల కిరీటమని నిరూపించావు. ఆనాటి మీ త్యాగం ప్రశంసా పాత్రము. ఆనాటి మీ చర్య సముచితమైనదని ఆ తర్వాత వచ్చిన ఎన్నికల మహాయజ్ఞంలో ప్రజలు రుజువు చేశారు. ప్రజోద్యమ సేవకునిగా, నాయకునిగానే కాకుండా ప్రభుత్వపాలకునిగా కూడా నీ ప్రతిభను నిరూపించుకున్నావు. కర్షక, కార్మికులకే కాకుండా, హరిజన - గిరిజన - విముక్తజాతులకు - వెనుకబడిన తరగతుల సాంఘిక - ఆర్థిక పురోభివృద్ధికిగాను పాలకునిగా మీరు సల్పిన కృషి ప్రశంసాపాత్రం.

## సోదరా!

దాదాపు మూడు దశాబ్దాలుగా ప్రజాసేవారంగంలో ప్రముఖపాత్రను వహిస్తున్న నీకు కనీసం తలదాచుకొనేందుకు ఇల్లయినా లేదు. నీకున్న సంపద అంతయూ - త్యాగం - సేవ మాత్రమే. ఇట్టి నీకు ప్రజలపక్షాన మా అభిమాన చిహ్నంగా ఒక నివాసగృహాన్ని సమకూర్చటం మా విద్యుక్త ధర్మంగా భావించాం.

అమరజీవి పొట్టి శ్రీరాములు త్యాగఫలితంగా ఆంధ్రరాష్ట్రం, ఆపైన ఆంధ్రప్రదేశ్ నిర్మాణం జరిగింది. హైదరాబాద్ ఆంధ్రుల శాశ్వత రాజధానిగా నిర్ణయించుకొన్నాం. మూడుకోట్ల ఆంధ్రుల భవిష్యత్తును తీర్చిదిద్దే అధికార - అనధికార కార్యక్రమాలన్నింటికీ కేంద్రమైన హైదరాబాదులో మీరు స్థిర నివాసులై మీ సేవలను ఆంధ్రులకు అందజేయాలనే మా ఆకాంక్ష. ఆ సదుద్దేశ్యముతోనే మేమీ కార్యానికి తలపెట్టి ఈ నివాస గృహాన్ని మీకు బహూకరిస్తున్నాము.

ఈ గృహప్రదాన మహోత్సవానికి మా ఆహ్వానాన్ని మన్నించి విచ్చేసిన పెద్దలందరకూ మా కృతజ్ఞతాభివందనములు.

మీరు చిరాయురారోగ్యాలతో పదికాలాలపాటు ప్రజలను సేవించుటకు వలసిన ధైర్య-స్థైర్యాలను మీకు ప్రసాదించవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తున్నాము.

హైదరాబాద్

17—8—1967

ఇట్లు

మీ

మిత్రులు, శ్రేయోభిలాషులు




తన 76వ జన్మదినోత్సవ సన్మానంలో లచ్చన్న




రేలంగి సన్మానం



జనతాపార్టీ శాసనసభ్యులు - అచ్చన్న



నందా నారాయణరావును సన్మానిస్తూ గోపాలరావు



నాటి జనతా పార్టీ కార్యవర్గంలో ఎచ్చన్న



ఏలూరు బహుజన పత్రిక ముద్రణాలయం ప్రారంభోత్సవం



అచ్చన్నగారిని సన్మానిస్తున్న – కె. రంగదాస్



యం. పళ్లం రాజాతో అచ్చన్న



1957 లో కర్ణాటక రాష్ట్ర మైసూరులో జరిగిన వెనుకబడిన తరగతుల మహాసభకు అధ్యక్షత వహించిన అచ్చన్న, కేరళ ముఖ్యమంత్రి ఆర్. శంకర్, కర్ణాటక రాష్ట్ర మంత్రి రాజయ్య.



అచ్చన్నగారి షష్టిపూర్తిని అతిశ్రద్ధగా ఆనాడు జరిపిస్తున్న స్వర్గీయ వి.వి. రమణ



1967లో రాష్ట్రంలో స్వతంత్ర పార్టీ - శాసనసభ్యులుగా గెలుపొందిన వారితో లచ్చన్న

రాజకీయ ప్రజావాణి స్పందించింది. తూర్పు పడమరల సిద్ధాంతాలలో రూపొందిన పార్టీలు స్వీయస్థాయిని గుర్తింపును రద్దుచేసుకొన్నాయి. ఒకే ధ్యేయం, నిరంకుశాధికార్ని వెలగబెడుతున్న కాంగ్రెస్ (ఐ)ని గద్దెదించాలి. ప్రజాస్వామ్యాన్ని కాపాడాలి. దేశాన్ని రక్షించాలి అన్న నినాదాలు ఉవ్వెత్తున లేచాయి. అనుకూల పవనాలు సాగాయి. దేశం నలుమూలల ఎచట పిలచిన పలికేదిగా జనతాపార్టీ ఉండేదన్న అతిశయోక్తి కాదు.

ఆంధ్రప్రదేశ్ జనతాపార్టీ అధ్యక్షులు తెన్నేటి విశ్వనాథం, ఉపాధ్యక్షులు మన సర్దార్ గౌతు లచ్చన్న.

## జనతాపార్టీ శాసనసభ్యునిగా గెలుపు

సర్దార్ గౌతు లచ్చన్న జనతాపార్టీ నాయకులుగా మరల సోంపేటలో పోటీచేసి గెలుపొందారు. ఉత్తరాంధ్రలో 37 స్థానాల్లో పోటీచేసి 16 స్థానాల్లో జనతాపార్టీ విజయ పతాకం ఎగురవేసింది.

## ఉత్తరాంధ్రలో గెలిచిన అభ్యర్థులు

బెందాళం వెంకటశర్మ (ఇచ్ఛాపురం), గౌతు లచ్చన్న (సోంపేట), బొమ్మిడి నారాయణస్వామి (టెక్కలి), విశ్వేశర నరసింహారావు (కొత్తూరు), శత్రుచర్ల విజయరామారాజు (నాగూరు), చీకటి పరశురాం నాయుడు (పార్వతీపురం), కొల్లి వెంకటకూర్మి నాయుడు (బొబ్బిలి), ముదిలి బాబూపరాంకుశం (ఉనుకూరు), కె. రాజరత్నం (పాలకొండ), చల్లా లక్ష్మీనారాయణ (శ్రీకాకుళం), కొత్తపల్లి నరసయ్య (ఎచ్చెర్ల), జనతాపార్టీ అభ్యర్థులుగా గెలుపొందారు.

విశాఖజిల్లాలో వంగపండు నారాయణప్పలనాయుడు (గజపతినగరం), పూసపాటి అశోకగజపతి రాజు (విజయనగరం), నేటి తెలుగుదేశం పార్టీ జనరల్ శక్రటరీ - యన్.యన్.యన్. రెడ్డి (విశాఖపట్నం), గాడి అప్పలనాయుడు (పాడేరు), ఈమని సీతారామశాస్త్రి (చోడవరం), జనతాపార్టీ అభ్యర్థులుగా గెలుపొందినవారు.

తూర్పుగోదావరిలో 6 స్థానాల్ని, కృష్ణాజిల్లాలో 3 స్థానాల్ని, గుంటూరు జిల్లాలో 4 స్థానాల్ని, నెల్లూరు జిల్లాలో 1 స్థానాన్ని, చిత్తూరు జిలాలో 3 స్థానాల్ని కడప జిల్లాలలో 4 స్థానాల్ని, అనంతపూర్ జిలాలో స్థానాల్ని, కర్నూలు జిల్లాలో 3 స్థానాల్ని, మహబూబ్‌నగర్ జిలాలో 3 స్థానాల్ని, హైదరాబాద్ జిల్లాలో 5 స్థానాల్ని, కరీంనగర్ జిలాలో 1 స్థానాన్ని, వరంగల్ జిల్లాలో 2 స్థానాల్ని, ఖమ్మంజిల్లాలో 1 స్థానాన్ని, నల్గొండజిల్లాలో 1 స్థానాన్ని జనతాపార్టీ గెలుచుకున్నది.

లచ్చన్నగారితో కలసి జనతాపార్టీ నాయకులుగా సహచరులుగా, అనుచరులుగా పనిచేసి ఈనాడు ఇతరపార్టీలలో ఉన్నవారు.

అశోక్‌గజపతి రాజు - SSN రెడ్డి. ముద్రగడ పద్మనాభం - MVS. సుబ్బరాజు. వడ్డేశోభనాద్రీశ్వరావు - వడ్డే రంగారావు. దొడ్డపనేని ఇందిర - జి.వి. రత్తయ్య. యం. వెంకయ్య నాయుడు - పాలకొండ రాయుడు. అంకిరెడ్డి - అయ్యపురెడ్డి - జైపాల్ రెడ్డి. రాంభూపాల్ రెడ్డి - నరసింహారెడ్డి - పి. జనార్దనరెడ్డి, చేకూరి కాశయ్య మొదలగువారు జనతాపార్టీని విడచి నేడు ఇతర పార్టీలలో ఉన్నారు.

## లచ్చన్నగారిపై లక్ష్మీకాంతమ్మ పోటీ

1978 మార్చి నెలలో జరిగిన ఎన్నికలలో పార్టీ ప్రతిపక్ష నాయకునిగా ఎవరు ఎన్నిక కావాలి. అఖిలభారత జనతాపార్టీ ప్రధానకార్యదర్శి సురేంద్ర మోహన్‌వచ్చి ఆంధ్రలో పోటీలేకుండ ప్రయత్నిస్తారు. ఆంధ్రప్రదేశ్‌లో మొదటినుండి ప్రతిపక్ష నాయకునిగా అసెంబ్లీ సభ్యునిగా చాలా అనుభవమున్నవారు పార్టీ నాయకునిగా పేరందుతు వచ్చినవారు సర్దార్ గౌతు లచ్చన్నగారు జనతాపార్టీ శాసనసభా నాయకునిగా పోటీచేసిన బలపరచ వలసిందిపోయి మీరు నిలబడిన ఓడిపోతారేమో నని, వచ్చిన పరిశీలకుడు లచ్చన్నగారిని ప్రశ్నించడం భయపెట్టడం వెనకాల స్వార్థపర సంకుచితాభిప్రాయాలు ఉంటావన్నది అబ్బురమైన విషయం కాదు.

అసెంబ్లీ అధికార ప్రతిపక్షంగా ఏర్పడటానికి తగిన బలమున్నందున జనతాపార్టీ శాసనసభ నాయకునిగా గుర్తింపు ప్రభుత్వ రాచమర్యాదలు సౌకర్యాలుంటాయి. శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు లచ్చన్నగారితో పోటీచేయ సిద్ధపడినారు. పోటీ జరిగింది. అత్యధిక సంఖ్యాకులు ఆదరాభిమానాలతో లచ్చన్న జనతాపార్టీ శాసన సభా నాయకునిగా ఎన్నుకోబడినారు.

1978 నుండి 1980 జూన్ వరకు ప్రధాన ప్రతిపక్ష నాయకునిగా పనిచేసారు. పబ్లిక్ అక్కౌంట్ కమిటీ ఛైర్మన్‌గా ఎంపికయిన సర్దార్ గౌతు లచ్చన్న ప్రభుత్వం చేసిన తప్పుల్ని ఎత్తిచూపడంలో ఎంతగానో కృతకృత్యులయ్యారు. తెలంగాణా ప్రజాసమితిని స్థాపించి తెలంగాణాలో మంచి పేరుప్రతిష్టల్ని తెచ్చుకొన్న డా. మర్రి చెన్నారెడ్డి కాంగ్రెస్ పార్టీకి సారధ్యం వహించారు. కాంగ్రెస్‌ను గెలిపించారు.

బ్రహ్మానందరెడ్డి కాంగ్రెస్, ఇందిరా కాంగ్రెస్, జగజ్జీవన్‌రాం కాంగ్రెస్‌లు కలిసి రాజకీయ ప్రాబల్య అధికార సమతుల్యాన్ని దెబ్బతీసాయి. జలగం వెంగళరావు ఇందిరాకాంగ్రెస్ ఎమర్జన్సీ విధించిన రోజుల్లో ముఖ్యమంత్రిగా రాష్ట్రంలో కొనసాగిన 1978 ఎన్నికల తదనంతరం తన మార్గం దృక్పధం వేరైనది. ఇందిరా కాంగ్రెస్

(I) తన వ్యూహాన్ని మార్చి తెలంగాణా ప్రజాసమితిని కాంగ్రెస్ పార్టీలోనికి ఆహ్వానించి చెన్నారెడ్డి గారికి నాయకత్వం యిచ్చారు.

డా. మర్రి చెన్నారెడ్డిగారు 1978 మార్చి నెల 6వ తేదీన మన రాష్ట్ర ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసారు. చెన్నారెడ్డి మంత్రివర్గంలో బ్రహ్మానంద రెడ్డి, పి.వి. నరసింహారావు, జలగం వెంగళరావు, రాష్ట్రమంత్రి వర్గంలోనున్న అందరినీ గాక భారీ మార్పులతో తన మంత్రివర్గాన్ని ''చెన్నా'' ఏర్పరచారు. ఉప ముఖ్యమంత్రి పదవిని రద్దుచేసారు. నాదెండ్ల భాస్కరావు, అమరనాధరెడ్డి, పద్మనాభ రాజు, గొర్లె శ్రీరాములు నాయుడు, భవనం వెంకట్రామరెడ్డి, జి. వెంకట స్వామివంటి ప్రభుతులు మంత్రివర్గంలోనికి వచ్చారు. మంత్రివర్గం కొత్త ముఖాలతో అవతరించింది. హోంశాఖ-షేషిం, ఆర్థికశాఖ-రాజారాం, పి. జనార్దనరెడ్డి రెవెన్యూ, బాగారెడ్డి-పంచాయితీరాజ్, 28 మంది మంత్రులు.

# 23వ ప్రకరణము

## జనతాపార్టీ విచ్ఛిత్తి భారతీయ లోక్‌దళ్ అవతరణ-లచ్చన్న

ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి చరణ్‌సింగ్ లోగడ స్థాపించిన క్రాంతిదళ్, రాజగోపాలాచారి స్థాపించిన స్వతంత్ర పార్టీ, బీహార్‌లోని కాంగర్ పార్టీ మూడు పార్టీలు కలిసి భారతీయ లోక్‌దళ్‌గా-జనతాపార్టీ విచ్ఛిత్తి తదుపరి ఢిల్లీలో జరిగిన కన్వెన్షన్‌లో రూపొందుతాయి. చరణ్‌సింగ్ దేశస్థాయిలో పార్టీకి అధ్యక్షత వహిస్తారు.

ఈ రాజకీయపార్టీ అవతరణకు ముందు జరిగిన రాజకీయ మార్పిడి కథ యిది. జనతాపార్టీ నాయకునిగా కేంద్రమున మొరార్జీదేశాయ్ ఎన్నుకోబడతారు. జనతా పార్లమెంటరీ నాయకునిగా ప్రధానిగా వ్యవహరిస్తారు.

## జనతాపార్టీ రాజకీయ మార్పిడి కథ

జనతాపార్టీ అధికారంలోనికి రాగానే కాంగ్రెస్ అధికారంలోనున్న ఆరు రాష్ట్రాలలోగల శాసన సభల్ని రద్దుపరచి, ఎన్నికల్ని జరిపిస్తుంది. కారణం ఆ రాష్ట్రాల్లో పార్లమెంటుకు జరిగిన ఎన్నికల్లో జనతాపార్టీ అభ్యర్థులే గెలుపొంది, కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థులు ఓడిపోయారు. ఈ సాంప్రదాయానికి రూపం కల్పించినది జనతాపార్టీయే. ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహార్, రాజస్థాన్, హర్యానా, హిమాచల ప్రదేశ్ రాష్ట్రాల్లో ఎన్నికలు జరగడం జనతాపార్టీ 6 రాష్ట్రాల్లో అధికారంలోనికి రావడం జరిగిపోయింది. ఇక ఆయా రాష్ట్రాల్లో ముఖ్యమంత్రులు నియామకాల్లో జనతాపార్టీ నియమించడంలో విఫలమైంది. పార్టీ నిజస్వరూపం బయటపడి తగాదాల్లోకి అడుగిడింది.

జనతాపార్టీ అధికారంలోనికి తమకు అంపించినందున ప్రజల్ని అభినందించక తమకు ప్రతిపక్షంగా నిలచి ఎన్నికల్లో ఓటమినందిన కాంగ్రెస్‌పార్టీ అగ్రనాయకత్వంపై ప్రతీకారం తీర్చుకొన అస్త్రులు చాచింది. వ్యక్తిగత కావేశఆవేశాలకు లోనై మాజీ భారత ప్రధానమంత్రి ఇందిరాజీపై కక్ష తీర్చుకొన, కక్ష సాధింపు చర్యగా ''షా కమిషన్'' నియమించి విచారణ ప్రారంభించింది. ఇక న్యాయపరమైన అంశాలు తలెత్తాయి.

జనతాపార్టీలో అంతర్గత తగాదాలు విజృంభిస్తాయి. జయప్రకాష్ ఏమిచేయలేని పరిస్థితికి లోనవుతారు. విపరీతమైన మానసిక ఒత్తిడికి గురై వ్యాధిగ్రస్తుడవుతారు, కరి లక్ష్యం నెరవేరవందుకు ఎంతగానో దిగులుపడతారు.

## ప్రతి ఒక పార్టీ తన పూర్వపు పార్టీ యధాస్థితిగతుల్ని ఆశించుట భారతీయ లోక్‌దళ్ పునరుద్ధరణ

మరల ప్రతీఒక పార్టీనాయకుడు తన పూర్వపు పార్టీ స్థితిగతులను అందటానికి సిద్ధపడి కార్యరంగంలోనికి దూకుతారు. చరణ్‌సింగ్, జనతాపార్టీ నుండి విడివడిన తన పార్టీని భారతీయ లోక్‌దళ్‌పార్టీగా ప్రకటిస్తారు. అద్వానీ, వాజ్‌పాయ్ తమ పార్టీని భారతీయ జనతాపార్టీగా నామకరణం చేస్తారు. కాంగ్రెస్ నాయకుడు శరద్‌పవార్ తన పార్టీని కాంగ్రెస్ యస్‌గా తీర్చిదిద్దుతారు. పూర్వపు సోషలిష్టు నాయకులు చంద్రశేఖర్ మదులిమాయే. జార్జిఫెర్నాండెజ్‌లు జనతాపార్టీగా వుండి పోతారు. మరల జనతాపార్టీలో ఆనాడు కలిసిన పార్టీలు తమ తమ పూర్వ రూపాల్ని కొద్దిపేర్ల మార్పుతో సంతరించుకొన్నాయి.

మొరార్జీ దేశాయ్ అవిశ్వాస తీర్మానం ప్రవేశపెడుతుంది. కాంగ్రెస్‌పార్టీ జనతా పార్టీ ముక్కలైందున మురార్జీ రాజీనామా చేస్తారు. లోక్‌సభకు 1980లో మధ్యంతర ఎన్నికలు వస్తాయి.

నాటి రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి వేరొకరిని ప్రధానిగా ఆహ్వానించి మంత్రివ ర్గాన్ని ఏర్పాటుచేయమని కోరారు. దేశంలో పెద్ద ఉత్కంఠ రేగింది. కాంగ్రెస్ (S) నాయకుల యస్.బి. చవాన్‌ను పిలుస్తారు. అయితే తన అసక్తతను చూపుతారు. ఇపుడు కాంగ్రెస్ (J) నాయకులు జగజ్జీవన రాం తనకు అవకాశ మివ్వమని కోరారు. మంత్రివర్గం ఏర్పరచటానికి అయితే నీలం సంజీవరెడ్డి సరియైన వ్యక్తిని పిలవలేదని వివాదాలు వస్తాయి. భారతీయ లోక్‌దళ్ నాయకులు చరణ్‌సింగ్‌ను పిలచి కేంద్ర మంత్రివర్గాన్ని ఏర్పరచమని కోరతారు. ఆరు మాసాల్లో పార్లమెంటులో మెజారిటీ చూపించాలి అన్నది షరతు.

రాజకీయాల్లో రాణించగలది విశేషమైనది ఏమన శత్రువును మిత్రుడు బలపర చడం. మిత్రుని శత్రువునమ్మి వ్యవహరించటానికి సిద్ధపడుతూ ఉన్నట్లు నటించడం. నమ్మించటం ఒకనాటి జనతాపార్టీ నాయకుల్లో ఒకరైన చరణ్‌సింగ్, ఇందిరాగాంధీజీపై అభియోగాల్ని పరిశీలించటానికి "షా కమిషన్" వేయటానికి ప్రధాన వారసులు ఈనాడు అటువంటి చరణసింగ్‌ను ఇందిరాగాంధీ కాంగ్రెస్ బలపరుస్తుంది కాంగ్రెస్ (I) చరణ్‌సింగ్‌ను బలపరచడంతో బలం వచ్చింది. కేంద్రమంత్రి వర్గాన్ని ఏర్పాటు చేస్తారు.

అయితే నీలం సంజీవరెడ్డి ఒకషరతుపై కేంద్రమంత్రి వర్గాన్ని ఏర్పరచమని కోరతారు. మంత్రివర్గం ఏర్పడిన 3 మాసాలలోపున లోక్‌సభలో చరణ్‌సింగ్ తన

బలాన్ని నిరూపించాలి. ఆ షరుతుపై చరణ్ సింగ్ భారత ప్రధానిగా ప్రమాణస్వీకారం చేస్తారు. కేంద్ర మంత్రివర్గం ఏర్పడుతుంది.

ఇక బల నిరూపణ సమయంలో ఇందిరా కాంగ్రెస్ తన మద్దతును చరణ్ సింగ్‌కు ఇవ్వక ఉపసంహరించుకొంటుంది. తత్ఫలితం చరణ్ సింగ్ రాజీనామా యివ్వడమే లోక్‌సభ రద్దు అయింది. మధ్యంతర ఎన్నికలు వచ్చాయి.

శ్రీకాకుళం పార్లమెంటు స్థానానికి పోటీచేసి గౌతు లచ్చన్న మరల కాంగ్రెస్ అభ్యర్థి చేతిలో ఓడిపోయారు. పార్వతీపురం లోక్‌సభ స్థానానికి కాంగ్రెస్ (అర్స్) అభ్యర్థిగా వైరిచర్ల కిషోర్‌చంద్ర సూర్యనారాయణ దేవ్ ఓడిపోతారు. ఇందిరా కాంగ్రెస్ అభ్యర్థిగా విశ్వాసరాయి నరసింహారావు గెలుస్తారు. పి.వి.జి. రాజు బొబ్బిలి స్థానంలో గెలుపొందుతారు. యాళ్ళ శశిభూషణరావు J.N.P. (S)గా పోటీచేసి ఓడిపోతారు. గెదెల ప్రసాదరావు (JNP పోటీచేసి ఓడిపోతారు. బాట్టం శ్రీరామమూర్తి కాంగ్రెస్ (అర్స్) అభ్యర్థిగా ఓడిపోతారు. కొమ్మూరి అప్పలస్వామి,. కాంగ్రెస్ (I) అభ్యర్థి గెలుస్తారు. అనకాపల్లి కాంగ్రెస్ (I) అభ్యర్థిగెలుస్తారు. JNP (S) అభ్యర్థిగా పూసపాటి ఆనంద గజపతిరాజా ఓడిపోతారు.

కాకినాడ స్థానాన్ని JNP (S) దక్కించుకోలేక పోయింది. కాంగ్రెస్ (I) యం. సంజీవరావు గెలిచారు. అమలాపురంలో శ్రీమతి ఈశ్వరబాయి JNP అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోతారు. కొమ్మారెడ్డి సూర్యనారాయణ JNP అభ్యర్థిగా ఓడిపోతారు. మచిలీపట్నం స్థానం దక్కలేదు. Dr. K.L. Rao (JNP) అభ్యర్థిగా పోటీచేసి ఓడిపోతారు. గుంటూరు స్థానం-బాపట్ల-ఒంగోలు ఎ.వి.కె. చైతన్య JNP (S) పోటీచేసి ఓడిపోతారు. తిరుపతి స్థానం దక్కలేదు. తిమారెడ్డి పెదిదరెడ్డి JNP (S) ఓడిపోతారు. కడప-హిందుపూర్-కర్నూలు-నాగర్ కర్నూలు-సికింద్రాబాదు-సిద్ధిపేట స్థానాల్లో అపజయం. మెదక్‌లో జైపాల్‌రెడ్డి ఓడిపోతారు. నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్.

భారతదేశ స్థాయిలో కాంగ్రెస్ (అర్స్) ఒకవైపు ఇందిరా కాంగ్రెస్ ఒకవైపు ఎన్నికల్లోదిగి తమ బలాన్ని ప్రదర్శించాయి. కాంగ్రెస్ (అర్స్) ఓడిపోయింది. కాంగ్రెస్ (I) ప్రజల అభిమానాన్ని చూరగొన్నది జనతాపార్టీ. జనతాపార్టీ (S) గా పోటీలో పాల్గొన్నది. భారతీయ సోషలిష్టుపార్టీ, రామరాజ్య ఫ్రంటులో CPI (M) పార్టీలు ఎన్నికల్లో దిగాయి. జనతాపార్టీ మరల తన యధాస్థానపు పూర్వపు పార్టీల రూపాల్ని సంతరించుకుంటుంది.

## జనతాపార్టీ చీలికకు కారణాలు

6 రాష్ట్రాల్లో కాంగ్రెస్ ఓడిపోయి జనతాపార్టీ గెలిచింది. ఆయా రాష్ట్రాల్లో ముఖ్యమంత్రుల ఎంపికపై నాయకుల్లో విభేదాలు వస్తాయి. జనతాపార్టీ ఏనాడు సింగిల్‌పార్టీగా పనిచేయలేదు. జాయింట్ స్టాక్ కంపెనీగానే పనిచేసింది.

నేషనల్ ఎగ్జిక్యూటివ్, జాతీయ కార్యవర్గం సమావేశంలో సభ్యునిగానున్న సర్దార్ గౌతు లచ్చన్న ప్రతిమారు జాతీయ కార్యవర్గం సమావేశంలో పాల్గొనేవారు. సోషలిస్టులు చంద్రశేఖర్ ఇంటిలో కాంగ్రెస్‌వారు మురార్జీ ఇంట్లో, జనసంఘం వాజ్‌పాయ్ ఇంట్లో, బి.కె.డి. వారు చరణసింగ్ ఇంట్లో ముందుగా హాజరై ఎజెండాను చర్చించుకొని, ఏఏ తీరుగా ప్రవర్తించాలో ఆలోచించటం ఏ పార్టీ రూపొందిన నాటినుండి పార్టీ రద్దు అయినంత వరకు జరిగే పనిగా ఉండేదని లచ్చన్నగారి అభిప్రాయం.

రాజస్థాన్, మధ్యప్రదేశ్, హిమాచలప్రదేశ్ పాత జనసంఘ వర్గం, ఉత్తరప్రదేశ్, బీహార్, హర్యానా మాజీ బి.ఎల్.డి. వర్గం పార్లమెంటరీ బోర్డులో ఉన్న పాత కాంగ్రెస్‌కి పాత సోషలిస్టు వర్గానికి తగిన బలం లేనందున పై ఆరు రాష్ట్రాల ముఖ్యమంత్రుల్లో ముగ్గురు ముఖ్యమంత్రులు బి.యల్.డి. ముగ్గురు జనసంఘం వారివిగా రూపం దాల్చాయి.

లోక్‌దళ్ పార్టీ మాన్‌బేస్ గలది. కేడర్ బేస్ కలది జనసంఘం. ఏ బేస్ లేనిది, లీడర్ బేస్ పార్టీలు కాంగ్రెస్ (S) సోషలిస్టుపార్టీలని పలువురి అభిప్రాయం. మురార్జీ ఇంట్లో హర్యానా ముఖ్యమంత్రిపై అవిశ్వాస తీర్మానం నోటీసుపై సంతకాలు జరుగుట. చంద్రశేఖర్ ఇంట్లో బీహార్ ముఖ్యమంత్రి, కర్పూరీ ఠాగూర్‌పై అవిశ్వాస తీర్మానంపై సంతకాల సేకరణ. సమైక్యత ఎట్లా సిద్ధిసిద్ధిస్తున్నది సమస్య. హోంశాఖను విడిచిపెట్టిన చరణ్‌సింగ్‌ను మరల ఆర్థికశాఖను ఇచ్చారు. మొరార్జీ కారణం 7 లక్షల జనం ఢిల్లీలో తనజన్మదినం నాడు 78 లక్షల విరాళంఇచ్చి చరిత్ర సృష్టించుట ఆనాడు జరిగిన ర్యాలీకి సర్దార్‌జీ హాజరైనారు.

మొరార్జీ కుమారుడు క్రాంతిదేశాయ్ కుంభకోణాల్లో ఉన్నారని రాజనారాయణ్ చేత అభియోగం. చరణ్‌సింగ్ అల్లుడు అవినీతిపరుడని, చంద్రశేఖర్ అనుచరుని అభియోగం. జయప్రకష్ నారాయణ్‌ను అంతర్గత తగాదాల్ని వారించమని ఒకవర్గం కోరగా మొరార్జీ నిరాకరించారు. మొండి పట్టుదలకు మారుపేరు మొరార్జీ.

ఆనాడు రాష్ట్రపతిగా ఉన్న నీలం సంజీవరెడ్డి జనతాపార్టీ యం.పి.గా ఎన్నికై రాజీనామాచేసి అధ్యక్షపదవికి ఎన్నుకోబడినవారు జనతా నాయకుల్లో ఒకరిగా

పరిగణింపబడేవారు. ఇటు కాంగ్రెస్‌పార్టీలో ఉన్న నాయకుల్లో తననెరుగని వారు లేరు. వారు ఒకనాటి కాంగ్రెస్ నాయకుల్లో పెద్దవారు పాలకపార్టీ ప్రతిపక్షం నాయకుల్లో ఒక్క లోకనాయక్‌ను తప్పించి ఏ ఒకరు సంజీవరెడ్డిని పెద్దగా భావించే పరిస్థితి తప్పించి వారికి సలహాలు, నీతులుచెప్పే పరిస్థితి ఏ ఒకరివీ కాదు.

అయితే సంజీవరెడ్డిగారే తీవ్రమైన చర్యల్ని వ్యక్తిగతంగా తీసికొన్న జనతాపార్టీ వ్యవహారాలు చక్కబడి ఉండేవన్నది చాలామంది అభిప్రాయం. ఇందిరాజీ కూడ రాజకీయ ఎత్తుగడలను పాలకపక్షం వారిపై ప్రయోగించరని చెప్పనలవి కాదు. రాజకీయాల్లో. అందువలననే కాబోలు సంజీవరెడ్డిగారు తన పదవీ విరమణ వీడ్కోలు ఉత్సవంలో ప్రసంగిస్తూ జనతాపార్టీలో చీలికల్ని తేవటానికి ఇందిరాగాం దీజీ తనకు కోటి రూపాయిల్ని లంచం యిచ్చారన్న అపవాదు నాపై రావడంకన్న ఘోరమేమిటి అంటూ తన విచారాన్ని ప్రకటించారు అని లచ్చన్నగారు వివరణ ఇస్తుంటారు.

## మంత్రి వర్గాలు

ఆంధ్రప్రదేశ్‌లో చెన్నారెడ్డి మంత్రి వర్గంపై తిరుగుబాటు వర్గం ఏర్పడింది. ఢిల్లీ అధిష్టానవర్గం చెన్నారెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుండి తప్పుకోవాలని టి. అంజయ్యను రాష్ట్ర శాసనసభా కాంగ్రెస్ పార్టీ నాయకత్వాన్ని స్వీకరించమని కోరింది.

1980 నవంబరు 11వ తేదీన టంగుటూరి అంజయ్య మన రాష్ట్ర ముఖ్యమంత్రిగా పదవీ బాధ్యతల్ని చేపట్టారు. అయ్యపురెడ్డి న్యాయశాఖ, పి.వి. చౌదరి దేవాదాయశాఖ, జ. శ్రీరాములు నాయుడు నీటిపారుదల తన మంత్రివర్గంలో సుమారు 40 మందిని మంత్రులుగా చేర్చుకున్న ఘనత అంజయ్యగారికి దక్కుతుంది. తన మంత్రివర్గం ఎయిర్‌బస్ అని విమర్శలు వచ్చాయి. ఈతని మంత్రివర్గంలోనే ఉత్తరాంధ్రకు చెందిన చీకటి పరశురాం నాయుడు సహాయమంత్రిగా 40 దినాలు పదవిలో కొనసాగారు. సౌమ్యుడు, సహృదయుడు రాజకీయ యుక్తిని, లౌకికాన్ని తెలియని అంజయ్య తన మంచితనంతో తన మంత్రి వర్గాన్ని ఎంతో కాలం నడపలేక పోయారు. రాష్ట్రంలో అసంతృప్తి చెలరేగింది. తత్ఫలితంగా శ్రీ భవనం వెంకట్రాం రెడ్డి రంగంలోకి వచ్చారు.

1982 ఫిబ్రవరి 24వ తేదీన మంత్రివర్గాన్ని ఏర్పరచమని ఢిల్లీ అధిష్టాన వర్గం ఆదేశించింది. భవనం వెంకట్రామరెడ్డి ముఖ్యమంత్రి అయి తన మంత్రివర్గంలోనికి కొంతమంది కొత్త వారిని తీసుకొన్నారు.

ఈ సందర్భంలోనే వచ్చిన వారు సినీనటులు యన్.టి.ఆర్ అల్లుడు నారా చంద్రబాబు నాయుడు, సహాయమంత్రి విశాఖ నివాసి ఆళ్వార్ దాస్, మజ్జి తులసీదాస్, 10 మంది సహాయమంత్రులు 23 మంది కేబినేట్ మంత్రులు.

ఈ మంత్రివర్గంలో కూడ ఎంతో కాలం మనగలగలేక పోయింది. మరల నాయకత్వం మార్చబడింది. కోట్ల విజయభాస్కరరెడ్డి 1982 సెప్టెంబరు 20న మంత్రివర్గాన్ని ఏర్పరిచారు. శ్రీ కె. రోశయ్య, హోంశాఖ, వై.యన్. రాజశేఖరరెడ్డి విద్య, కోన ప్రభాకరరావు ఆర్థికశాఖ. సహాయ మంత్రులు 9 గురు కేబినేట్ మంత్రులు 16 గురు.

విజయభాస్కరరెడ్డి మంత్రి వర్గం తదుపరి కాంగ్రెస్ తన అధికారాన్ని మన రాష్ట్రంలో కోల్పోయింది. నటరత్న నందమూరి తారక రామారావు తెలుగుదేశం పార్టీనేత. తన మంత్రివర్గాన్ని 1983 జనవరి 9న రూపొందించారు. ఆంధ్రుల ఆత్మగౌరం అంగడిలో అమ్ముడుపోతున్నదని రాష్ట్రమంతటా పర్యటించి ఉద్ఘాటించారు. తెలుగుదేశానికి వెలుగునిస్తాడని ఆశేష ప్రజలు తెలుగుదేశాన్ని గెలిపొస్తారు.

# 24వ ప్రకరణము

## లోక్‌దళ్ పార్టీ-లచ్చన్న

అధికారికంగా ఆంధ్రప్రదేశ్ ఎన్నికల ఫలితాల్ని ప్రకటించిన తదుపరి ఆంధ్రప్రదేశ్ శాసనసభ రద్దు ప్రకటన పత్రికలో 1-7-1983న వచ్చింది. శ్రీ యన్.టి. రామారావుగారు తెలుగుదేశం పార్టీ శాసనసభా నాయకునిగా ఎన్నుకోబడి తే. 9-1-1983న మంత్రివర్గం ఏర్పరిచారు. శాసనసభలో 294 సీట్లలో 202 స్థానాల్ని తెలుగుదేశంపార్టీ సాంపాదించుకొన్నది.

### లచ్చన్నగారి ఓటమి

సర్దార్ గౌతు లచ్చన్న సోంపేట నియోజకవర్గంలో లోక్‌దళ్ పార్టీ అభ్యర్థిగా పోటీచేసి కాంగ్రెస్ అభ్యర్థిచేతిలో ఓడిపోయారు. 35 ఏండ్లు శాసనసభా జీవితంలో ఏనాడూ ఓటమి ఎరుగని సర్దార్జీ తన నియోజక వర్గంలో త్రిముఖపోటీని కల్పించిన తెలుగుదేశం పార్టీవ్యూహం ఎత్తుగడలమేరకు పరాజయాన్ని చవిచూడవలసి వచ్చింది. 1948లో ప్రారంభమైన తన శాసనసభా జీవితం 1983 సరికి ఆటకం కలిగింది.

1983 జనవరి 22వ తేదీన యన్.టి. రామారావు కేంద్ర తెలుగుదేశం పార్టీ కార్యాలయంలో ప్రకటననిస్తూ లోక్‌దళ్ వారిని తన పార్టీలో కలియమని ఆహ్వానిస్తారు. లచ్చన్న, సుంకర, శోభనాద్రి, పాండురంగారావువంటి వారెన్నటికి మాకు ఆహ్వానిత్తులే. అయితే దరిమిలా 1984 అక్టోబరు 31న ఇందిరాజీ హత్య సందర్భంలో లచ్చన్న విమానంలో ఢిల్లీ వెళ్లారు. ప్రధానమంత్రి నివాసంవద్ద భౌతికకాయాన్ని చూడటానికి వచ్చిన చరణ్‌సింగ్, కర్పూరీ ఠాకూర్ అచ్చన్నగారిని కారులో వారి స్వగృహానికి తీసుకొనిపోతారు.

చర్చలు ప్రారంభమైనాయి. సర్దార్‌జీ లోక్‌దళ్ పార్టీని రద్దుచేయవలసిన పరిస్థితులను వివరించారు. రాష్ట్రంలో బలహీనవర్గాల స్థితిగతులు ఏమి బాగుపడలేదు అన్నారు లచ్చన్న. చరణ్‌సింగ్ వెంటనే లచ్చన్నగారూ మీరు రాజకీయాల్లో ఆటు పోటుల్ని ఎరిగినవారు. మీరు త్వరపడి లోక్‌దళ్‌పార్టీని రద్దుపరిచారు. అది మంచి పని కాదు. దేశానికి అవసరమైనది కాదు. మీరు మొదట నుండి బలహీనవర్గాల వారిశ్రేయస్సుకు పాటుపడుతున్నారన్నది మేమెవరం కాదనలేనిది. మీ ST, ST, BC మైనారిటీస్ యూనియన్ లక్ష్యాలు-ఆశయాలు మంచివే.

కర్పూరీ ఠాకూర్ లచ్చన్నగారిని ఒప్పిస్తు ''చూడండి సర్దార్‌జీ, మీ ఆశయాల్ని లోక్‌దళ్ బలపరుస్తుంది. లోక్‌దళ్ ప్రణాళికలో స్పష్టపరిచారు. మీరు మరల ఆంధ్రప్రదేశ్‌లో మేము పునరుద్ధరిస్తున్న లోక్‌దళ్ అధ్యక్షులుగా వ్యవహరించి తీరాలి. తప్పదు

మన నేత చరణ్‌సింగ్ నాయకత్వాన్ని మీరు బలపరచాలి అన్నారు.

## తెలుగుదేశం పార్టీ వర్ధిల్లాలని లచ్చన్న ఆశీర్వాదం

లచ్చన్నగారు జాతీయ నాయకుల బోధల్ని కాదనలేక పోయారు. సర్దార్‌జీ ప్రథమం నుండి కాదన్నది ఎవరు చెప్పిన విననిది రాజీపడనిది కాంగ్రెస్ పార్టీతోనే సర్దార్‌జీ ఏనాడు ఈ నియమాన్ని దాటలేదు. ఆదినుండి కాంగ్రెస్‌పార్టీని దేశహితమాశించి ప్రతిఘటించాలన్న తన ఆశయంలో ఏనాడు మార్పులేదు. కాంగ్రెస్‌కు అనుకూలించిన పార్టీలో చేరలేదు. తెలుగుదేశం పార్టీని బలపరచిన పార్టీ సభ్యుల్ని అందులో చేర్చమని సలహా యిచ్చారు. పార్టీ తీర్మానం కూడా చేసారు.

సర్దార్‌జీ విలీనానికి అంగీకరించిన తదుపరి పరిణామం చరణసింగ్, దేవీలాల్, ఠాగూర్ మరల సమైక్యమవుతున్న దినాలు. దేశస్థాయిలో మరల లోక్‌దళ్ నాయకత్వం కావాలని కోరుకుంటున్న సమయం.

1984 నవంబరు నెలలో అఖిలభారత లోక్‌దళ్ అధ్యక్షులు చరణ్‌సింగ్ సర్దార్‌జీ లచ్చన్నగారికి ఆంధ్రప్రదేశ్ లోక్‌దళ్ అధ్యక్షులుగా నియమిస్తు తీర్మానం పార్టీపరంగా జారీ చేసారు. తదుపరి దీనిని జాతీయ కార్యవర్గం ధృవీకరించింది.

సర్దార్‌జీ మరల ఆంధ్రప్రదేశ్ లోక్‌దళ్ పార్టీనాయకునిగా రాష్ట్రంలో మరల వివిధ జిల్లాలలో పలు శాఖల్ని ఏర్పరచడంలో రాష్ట్రం అంతటా పర్యటించి పార్టీని పటిష్టపరచుటలో నిమగ్నమై నేటికి విశేషమైన కృషి చేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో సినీరంగంలో ప్రఖ్యాతిగాంచిన యన్.టి. రామారావు తెలుగుదేశం పార్టీని స్థాపిస్తారు. ఇది ప్రాంతీయపార్టీ. దేశస్థాయి రాష్ట్రస్థాయి పార్టీలతో పోటీకి తలపడుతుంది. శ్రీ యన్.టి. రామారావు నూతనతరహా ప్రచార విధానాన్ని చేపడతారు. లోగడ ఏ పార్టీనాయకుడు చేపట్టని విధానంలో చైతన్యరథంపై రాష్ట్రం నలుమూలలా పర్యటిస్తారు. ఆంధ్రులకు అవమానం జరుగుతున్నదని ఆంధ్రజాతి పౌరుషాన్ని, ఆంధ్రుల గౌరవాన్ని నిలపాలన్న ఆంధ్రదేశం బాగుపడాలన్న తన పార్టీని గెలిపించమని పిలుపునిచ్చారు.

ఆ పిలుపుపై ఇంత వరకు కాంగ్రెస్ పార్టీలోనున్న శ్రీనివాసులరెడ్డి, నాదెండ్ల భాస్కరరావు వంటివారు తెలుగుదేశం పార్టీలో చేరారు.

కాంగ్రెస్‌పార్టీ రాష్ట్రంలో గల తన పార్టీనాయకులను తరుచుగా దూర్చుతున్నందున ఆంధ్రులు విసిగివేసారి ప్రాంతీయపార్టీని బలపరచే స్థితికి వచ్చారు.

గౌతు లచ్చన్న సోంపేట, బొమ్మిడి నారాయణస్వామి (టెక్కలి), బి. కృష్ణమూర్తి (ఇచ్ఛాపురం), పైల సుబ్బారావు (పాతపట్నం), వాకముల్ల తిరుపతిరావు (ఉమ

కూరు), ఉత్తరవిల్లి రామకృష్ణ (పాలకొండ), పి. రాజారం మోహనరావు (విశాఖ I), రేపాటి రామానాయుడు (చోడవరం), ఆర్. చినవెంకటస్వామి (ఎలమంచిలి), డి. శోభన చలపతిరావు (బూర్గుపూడి), బి.యస్.ఎ. స్వామి (తాళ్ళరేవు), వి.వి. గోపాలకృష్ణ (దండులూరు), వి. శోభనేశ్వరావు (ఉయ్యూరు), కనకదుర్గా ప్రసాద్ (మల్లేశ్వరం), ఇ. సుబ్బారావు (కూచినపూడి), యం. మాదవరావు (కావలి), జి. శ్రీనివాసులు (కాళహస్తి), జయరామయ్య (సత్తివీడు), రాజగోపాలరెడ్డి (కడప), టి. నరసయ్య (కదిరి), యం. మాధవరెడ్డి (నాగర్‌కర్నూలు), యం.సి. రెడ్డి (జాడిచెర్ల), ఆలిమీర్జా (పర్గి), పి. ఇంద్రారెడ్డి (బెవాల్లా), యం. జగన్నాధరెడ్డి (రామయ్యపేట), యల్.టి. రెడ్డి (నిర్మల్), వి.వి. రావు (మందాని), పి. జనార్ధనరెడ్డి (కమలాపూర్), యన్. శంకరయ్య (హన్మకొండ), జి. దామోదర్ (పరకాల).

294 సీట్లలో సగానికి పైగా పోటీచేసిన ఎ.పి. లోక్‌దళ్ ఒక్కసీటును కూడా పొందలేక పోయింది. జనాకర్షణ, సినీగ్లామర్‌కల తెలుగుదేశం పార్టీ ధాటికి ఏ ఒక పార్టీ కూడా తట్టుకోలేక పోయింది. ఆంధ్రులు నిత్యనూతన రాజకీయ గమనాన్వేషణాభిలాషులని మరోమారు నిరూపించుకున్నారు.

# 25వ ప్రకరణము

## SC, ST, BC మైనారిటీల మహాసభ-లచ్చన్న

### తెలుగుదేశం పార్టీతో మంతనాలు

బలహీన వర్గాల సంక్షేమమే తన ధ్యేయం అని ప్రకటించిన రామారావుగారు దళితప్రజాదరణే తన పార్టీ ఆశయమన్న రావురావుగారు ఏనాటి నుండో ఒకపార్టీ నేతగనేకాక, బలహీనవర్గాల నాయకునిగా, దళిత జనోద్ధరణనేతగా పేరందిన సర్దార్‌జీ ఇరువురి నేతల లక్ష్యం పీడిత ప్రజానీకం సమస్యల్ని తీర్చడమే అయిన పుడు సంఘర్షణ ఎలా అనివార్యమైనదో చూడండి. బలహీనవర్గాల మహాసభలు మెహబూబియా కళాశాల గ్రౌండ్ సికిందరాబాదు 1983 జూన్ 5న జరుగుతాయి. అధ్యక్షులుగా సర్దాజీ ప్రారంభోపన్యాసకులు. ఆనాటి ముఖ్యమంత్రి శ్రీ యన్.టి. రామారావు ముఖ్యఅతిధి ఈసభలోనే ముఖ్యమంత్రి తన అపశ్రుతులను బి.సి.లపై వినిపిస్తారు.

మీ సలహాలు మా శిరోధార్యం. మీరు రాజకీయకురువృద్ధులు. మీరు అన్నివిధాలా ప్రభుత్వానికి సూచనలివ్వాలని మాకు మార్గదర్శకులుగా ఉండాలని ఎల్లరి ఎదుట అభిబాషించిన యన్.టి. రామారావుగారి మాటలు నిజమని మాటికి మారు పాళ్లు నమ్మిన సర్దార్‌జీ, 1984లో ఆంధ్రప్రేదేశ్‌లో గీత పారిశ్రామికుల సమస్యను, మత్యపారిశ్రామికుల సమస్య వెనుకబడిన తరుగతుల ఉపకారవేతనాల తగ్గింపు సమస్యలపై ప్రభుత్వం చర్యలకు ఒక రాజకీయ మిత్రునిగా తనను గురువుగా భావిస్తున్న ముఖ్యమంత్రి వద్దకు వెళ్లక తప్పలేదు. వెళ్లిన తిరస్కారం ఎదురైనది.

### బలహీన వర్గాల ప్రజల సమస్యల్ని పరిష్కరించమని లచ్చన్న యన్.టి.ఆర్‌ను అర్థించడం

లచ్చన్నగారు ఆంధ్రప్రదేశ్ బలహీనవర్గాల సంఘాధ్యక్షులు. అంతేగాక ఆంధ్రప్రదేశ్ గీత పారిశ్రామికులు సంఘాధ్యక్షులు. అందువలన ఆ సంఘాల సభ్యులు అన్యాయానికి, అవినీతికిగురి అవుతున్నపుడు ఆ సంఘాల నాయకునిగా రాష్ట్ర ముఖ్యమంత్రివద్దకు రాయభారం వెళ్లవలసిన పరిస్థితి ఉంది.

సర్దార్‌జీ స్వయంగా వెళ్లి యన్.టి. రామారావుగారితో యీ విషయంపై తగు వివరణఇచ్చి సమస్యల్ని పరిష్కరించమని కోరతారు.

గీత పారిశ్రామికుల సహకార సంఘాల లీజుపై యిచ్చే ఆచారసాంప్రదాయంపైనే వాటిని సాధించారు. 1955 ఎన్నికల ప్రణాళికలో గీత పారిశ్రామికుల సంక్షేమం

మొదట అంశం కాంగీ పేర్కొన్నట్లు నాడు లచ్చన్నగారు చేయగలిగారు. అటువంటి ప్రోత్సాహకాల్ని ఈనాడుకాదని మరల తెలుగుదేశం ప్రభుత్వం ఏలం పాటలద్వారా కల్లుగీత దుకాణాల్ని విక్రయించడం కులవృత్తులద్వారా కూడు, గుడ్డ, వసతిని సంపాదించుకోవటానికి సహాయపడుతున్న గీతపారిశ్రామిక సహకార సంఘాలద్వారా చెట్లను లీజుద్వారా పొందటానికి అవకాశం యివ్వనందున ఏలం పాట వలన ఇతరులు ధనవంతులు పెట్టుబడిదారులు ఏలంపాటలో చెట్లను స్వాధీనం చేసుకోవడం జరుగుతుంది. వారితో అన్నివిధాలా వెనకబడిన గీత పారిశ్రామికులు పోటీపడలేదు. ఇది అన్యాయం గీతపారిశ్రామికుల కడుపుకొట్టే పద్ధతి ఇది వెంటనే ఏలంపాటల్ని ఆపండిఅన్న విజ్ఞప్తిచేసారు.

2. మత్స్య పారిశ్రామిక సహకార సంఘాలద్వారా మత్స్యకారులలకే దక్కవలసిన చెరువులు, గెడ్డలుమధ్య దళారీలకు పెట్టుబడిదారులకు లభించడం మంచిది కాదు. అదే వృత్తిపై తరతరాలుగా జీవిస్తున్న వారిగతి ఏంకావాలి. వారు ఏ ఇతర వృత్తుల్ని చేపట్టే స్థితిగతులు వారికి లేదు. వెంటనే చేపల చేరువులు ఏలంపాట విధానాన్ని ఆపండి అని ఎదురుతిరిగారు.

3. వెనుకబడిన తరగతుల విద్యార్థుల మెస్ చార్జీల్ని తగ్గించడం హర్షనీయం కాదు. ఉపకారవేతనాన్ని పెంచడంపోయి ఉన్నది ఊడగొట్టడమా! ఏమంత మంచి విధానం ఇది ప్రభుత్వం వెంటనే దీనిని సరిదిద్దాలి అని గద్దించారు.

తన ముందు కూర్చొని సమస్యల్ని సావదానంగా వినిపిస్తూ ప్రభుత్వాన్ని నిలదీసి అడుగుతున్న ధోరణిని జూచి ముఖ్యమంత్రి యన్.టి.ఆర్. అభినందిస్తు స్పందించక తప్పలేదు.

చూడండి సర్దార్ జీ మీరు బలహీన వర్గాల నయకులు. మాకు హితులు, సలహాదారులు. మేము ప్రభుత్వం బలహీనవర్గాల సంకేమానికై పాటుపడటానికి వెంటనే ఇందుకు సంబంధించిన మంత్రుల్ని పిలిచి ఏలం పాటల్ని రద్దుచేయింపి స్తాను. ఉపకారవేతనాల్ని మెస్ చార్జీల్ని బి.సి. విద్యార్థినీ విద్యార్థులకు తగ్గించినవి మరల ఇచ్చేలా చేస్తాను అంటూ సర్దార్ జీని తన రాయభారం సఫలమైనందుకు లోలోన సర్దార్ జీ అభినందిస్తూ వెళ్లారు.

అయితే పర్యవసానం వేరొకటి. ఇందుక్కు ప్రతిఫలం ఆమరునాడే అన్ని జిల్లాల కలెక్టర్లనే "ఆక్షన్ విధానం" మార్చవద్దని వెంటనే వేలంపాటల్ని నిర్వహించమని టెలిగ్రాం ఉత్తర్వులు వెళ్లాయి.

ఈవార్తను పత్రికల్లో చూచిన సర్దార్ జీ ఆశ్చర్యపోయారు. అన్యాయం జరిగిందనే

మొరపెట్టుకొంటే మరికొన్ని కష్టాల్ని అందించినట్లుంది. లచ్చన్నగారు మరల పోరాటపథంలోనికి దిగక తప్పలేదు. లోక్‌దళ్ పార్టీని రద్దుపరచి నందున బలహీన వర్గాల నాయకునిగా కల్లుగీత పారిశ్రామిక ఉపాధ్యక్షులుగా తన విధిని నిర్వర్తించి తీరాలి.

1984 ఏప్రిల్ 12వ తేదీన చలో అసెంబ్లీ'' అనే కార్యక్రమాన్ని తీసికొంటారు. వేలాది మంది స్త్రీలు, పురుషులు అందులో పాల్గొంటారు. రాజధాని నగర వీధుల్లో ఊరేగింపుగా వెళ్తారు.

నిషేదాజ్ఞల్ని ధిక్కరించినందున సత్యాగ్రహాన్ని నిర్బందిస్తారు. లచ్చన్నగారితో సహా అనేకమందిని నిర్బందిస్తారు.

ఆచరణలో తెలుగుదేశం పార్టీని ఒక యూనియన్‌లో ఉండిగాక ఒక ప్రజాశక్తిగా ఏర్పడి ఒక రాజకీయ లక్ష్యంతో ఎదుర్కోవాలని ఒక పార్టీగా రాష్ట్రస్థాయిలో ఏర్పడాలన్న నిర్ణయానికి వచ్చారు. బి.సి, యస్.సి, యస్.టి, మైనారిటీల హక్కుల్ని సాధించుకోవటానికి రాజ్యాంగబద్ధమైన న్యాయమైన హక్కుల్ని సాధించు కోవాలన్న రాజకీయశక్తిగా రూపొందాలని అధికారం, పదవి, పోరాటశక్తి దయదాక్షి ణ్యాలపై లభించవని హక్కులకై రాజకీయ లక్ష్యంతో పార్టీగా రూపొందవిదే హక్కులు సాధించబడవని ఆచరణలో తెలిసికోవడం జరిగింది. పోరాటశక్తి ప్రజాబ లంలేనిదే ఏ ప్రభుత్వం లొంగిరాదని బలహీనవర్గాల సంకేమం జరగదని తెలిసిపో యిందని లచ్చన్నగారు అభిప్రాయానికి వచ్చారు.

1984 జూన్ నెల 2 నుండి 5 వరకు తాడేపల్లిగూడెంలో ప్రథమ బి.సి, యస్.సి, యస్.టి, మైనారిటీ మహాసభలు జరుగుతాయి. సారధ్య సంఘానికి కన్వీనర్ స్వర్గీయ కె. రంగదాస్. ఆహ్వాన సంఘాధ్యక్షులు నందూరి మునలయ్య. ప్రారంభో త్సవకులు చౌదరి బ్రహ్మ ప్రకాష్ వస్తారు. ముఖ్య అతిథిగా ద్రవిడ కజగం (మద్రాసు) శెక్రటరీ కె. వీరమణి, యం.ఎ., వస్తారు. మహాసభలు విజయవంతం అవుతాయి.

మరల పోరాట కార్యక్రమం మొదటగా తీర్మానం చేసింది. తెలుగుదేశం మొండి వైఖరికి నిరసన తెలుపుతుంది. వెనుకబడిన తరగతుల, హరిజన, గిరిజన మైనారిటీల సమస్యలను కనీసపు కోర్కెలను పరిష్కరించుకోవటానికి వోటీను ఇచ్చిన ప్రభుత్వం స్పందించదు. అందుకు నిరసన వ్యక్తం చేస్తారు.

## 4 డిమాండ్లపై నోటీసు

రాష్ట్ర ముఖ్యమంత్రి తన ఆమరణ నిరాహారదీక్ష నోటీసును అసెంబ్లీ ముఖ్యమంత్రి చాంబర్‌లోనికి జొరబడి సర్దార్ లచ్చన్నగారు స్వయంగా ఇచ్చారు. ముఖ్యమంత్రి తన సహజధోరణిలోనే ''చూస్తాం'' అని సమాధానం యిచ్చి అంపించారు.

నిరాహారదీక్ష ఆగష్టు 16వ తన జన్మదినమున ప్రారంభమైనది. ప్రారంభ దినమున పెద్ద సదస్సు జరుగుతుంది. రామకృష్ణాపురంలో నిరాహారదీక్ష బి.యస్. స్వామిగారినూ తన గృహమున కొనసాగింది.

తెలుగుదేశంలో సంకోభం బయలుదేరుతుంది. నాందెండ్ల భాస్కరరావుగారు యన్.టి. రామారావు మంత్రివర్గంలో ఆర్థిక శాఖామాత్యులుగా ఉంటూనే ఈ మంత్రివర్గాన్ని రద్దుపరచేలా చూస్తారు.

1984 ముఖ్యమంత్రి జూన్ నెలలోనే అమెరికా వైద్యశస్త్ర చికిత్సకు వెళ్లి మరల 1984 ఆగష్టు 16వ తేదీన వస్తారు. అదే దినమున నిరాహార దీక్ష ప్రారంభం. (1) విరాహారదీక్షలో మురళీధరరావు కమిటీ సిఫార్సులను అమలుచేయాలని, (2) రిజర్వేషన్లు అమలుపరచాలి. (3) పేద విద్యార్థులకు ఉపకార వేతనాలు విడుదల చేయాలి. కల్లు దుకాణాలు ఏలం పాటల్ని రద్దుపరచాలి. ఇంకా మరికొన్ని డిమాండ్లు.

గవర్నర్ ఆగష్టునెల 16వ తేదీన యన్.టి. రామారావును తొలగించి శ్రీ నాదెండ్ల భాస్కరరావును ముఖ్యమంత్రిగా మంత్రివర్గాన్ని ఏర్పచమని కోరతారు. నాదెండ్ల మంత్రివర్గం ఏర్పడుతుంది.

ముఖ్యమంత్రిగా ఆనాడు ప్రమాణస్వీకారం చేసిన నాదెండ్ల భాస్కరరావు నిరాహారదీక్ష చేస్తున్న సర్దార్‌జీ వద్దకు ఇద్దరు మంత్రులను రాయభారం అంపి దీక్ష విరమణ చేయమని కోరతారు. వెళ్లిన మంత్రులు సత్యన్నారాయణ, ఇంద్రారెడ్డి సంప్రదింపులకు రమ్మని పిలుస్తారు.

అయితే నాలుగు డిమాండ్లను అంగీకరించి ఆర్డరుపై సంతకంచేసి అమలుపెట్టిన తదుపరే నిరాహారదీక్ష విరమిస్తానని లచ్చన్నగారి సమాధానం.

నాల్గు డిమాండ్లలో మూడు డిమాండ్లను ప్రభుత్వం ఆమోదిస్తు ఉత్తర్వులు జారీచేసింది. నాల్గవ డిమాండు మంత్రివర్గం చర్చించి అమలుపరచటానికి మాట యివ్వండం జరిగింది. లచ్చన్నగారు తన ఆమరణ నిరాహారదీక్షను విరమించుకున్నారు.

యన్.టి. రామారావుగారు ముఖ్యమంత్రిగా ఉండగనే జులై నెలలో అమరణ నిరాహారదీక్ష నోటీసును లచ్చన్నగారు ఇచ్చారు. అయితే కాకతాళీయంగా అనుకోని విధంగా రాష్ట్ర ముఖ్యమంత్రులు మారారు. పార్టీలో సంక్షోభం ఏర్పడి మంత్రి వర్గంలో రెండవ స్థానంలోఉన్న నాదెండ్ల భాస్కరరావు ముఖ్యమంత్రిఅయి లచ్చన్న గారి ఆమరణ నిరాహారదీక్షను తన డిమాండ్సును పరిరిస్తూ విలమించుకొనేలా చేయడం అలా తన డిమాండ్లను సాధించుకొన్న బి.సి, యన్.సి, యన్.టి. మైనారిటీ పార్టీ తన కృతజ్ఞతకు చిహ్నంగా ఆనాటి రాష్ట్ర ముఖ్యమంత్రిని అభినందించడానికి సభ జరపడం-ప్రభుత్వపక్షం, ప్రతిపక్షాలు పరిపాలనలో నిర్వర్తిం చదగిన భాగాలేతప్ప నాటి ముఖ్యమంత్రి నాదెండ్లను అభిమానించి కాదు. ఒకరిపై ఏ ఒకరు ప్రత్యేకమైన అభిమానం ప్రేమ చూపించి ఈ సభలు జరిగినవిగా భావించడం రాజకీయ విజ్ఞత. ప్రాపంచిక విజ్ఞానం లోపించినపుడే జరుగుతుంది.

## 1984లో మహాసభ కార్యవర్గం సమావేశం

1984 మార్చి నెల 5వ తేదీన A.P. State Union of BC, SC, ST Minarities హైదరాబాదులో సమావేశం జరిగింది. 1984 మార్చి నెల 13వ తేదీన హరిపురంలో మందసా BC, SC, ST కార్యకర్తల సమావేశం జరిగి Dr. B.S. నారాయణగారి అధ్యక్షత వహించారు. ఆగష్టు 1వ తేదీన కాకినాడలో BC, SC, ST మైనారిమీట పార్టీ అభిమానులు గీతపారిశ్రామికుల తమ్మారావు అధ్యక్షతలో జరిగింది.

1984 అగష్టు నెల 16వ తేదీన యన్.టి.ఆర్.ను ముఖ్యమంత్రి పదవి నుండి గవర్నర్ రాంలాల్ తొలగించడం జరిగింది. అదే దినాలలోన లచ్చన్నగారి 76వ జన్మదినోత్సవం జరగడం, నాందెండ్ల భాస్కరరావు ముఖ్యమంత్రిగా కొనసాగడం జరిగింది. ఆగష్టు 19వ NTR ఢిల్లీవెళ్లి రాష్ట్రపతివద్ద స్వీయబలాన్ని ప్రదర్శిస్తారు. ఢిల్లీనగరంలో తెలుగుదేశం నేతలు విజృంభిస్తారు.

లచ్చన్నగారు నాదెండ్ల భాస్కరరావుగారిని బలపరుస్తారన్న రీతి నీతుల్ని పుట్టించారు. పత్రికారంగంలో వెన్నుపోటుదారుడని లచ్చన్నగారు నాదెండ్లను బలపరుస్తున్నారని తెలుగుదేశం పార్టీ కార్యకర్తలు ఈనాడు విలేఖరి విజయనగరం బంగ్లాకువచ్చి వారిని దుర్భాషలాడే సంఘటనలు కూడా ఉన్నాయి.

లచ్చన్నగారు హైదరాబాదువెళ్లి బహిరంగలేఖను ప్రకటించారు. ఏ స్థానంలో ఎవరున్నదికాదు కల్లు దుకాణాల వేలంపాటల్ని ఆపాలని మురళీధరరావు కమిషన్ చేసిన సిఫార్సులని అమలుపరచాలని ముఖ్యమంత్రిని కోరినట్లు తెలిపారు. తదుపరి రాష్ట్రంలో జరిగిన జనభీభత్సం, ఆందోళనల పర్యవసానంగా సెప్టెంబరు నెల 17వ

తేదీన మరల NTR గద్దె నెక్కడం. కాంగ్రెస్ (ఐ) పార్టీ ప్రజాస్వామ్య సిద్ధాంతాలకు కట్టుబడి యున్నట్లు సాక్ష్యంగా కాంగ్రెస్ అధిష్టానవర్గం దీనిని చెప్పుకోవడం జరిగింది.

మరల రాష్ట్ర దేశస్థాయిలో రాజకీయశక్తుల పునరీకీకరణ ప్రయత్నాలు కొనసాగాయి. జనతా, లోక్‌దళ్ పార్టీలు విలీనం తప్పవన్నవార్తలొచ్చాయి. శ్రీ బిజూపట్నాయక్ సెప్టెంబరు 29న శ్రీ మురార్జీని బొంబాయివెళ్లి సమాలోచనల్ని ప్రారంభించారు. సమైక్యతకు పత్రికాముఖంగా లోక్‌దళ్ నాయకుడు చరణ్‌సింగ్ ప్రకటించడం జరిగింది.

# 26వ ప్రకరణము

## దళిత మజ్దూర్ కిసాన్ పార్టీ-లచ్చన్న

భారతదేశంలో రైతన్నలకు అండగానిలచిన జాతీయ నాయకుడని పేరందిన చరణ్‌సింగ్ సాహెబ్ ఉత్తర భారతంలో ''జట్స్''కు తిరుగులేని నాయకుడు. అంతేగాక ఉత్తరప్రదేశ్‌కు ఒకనాడు ముఖ్యమంత్రి, దేశస్థాయిలో కాంగ్రెస్‌ను ఎదిరించడానికి క్రాంతిదళ్ పార్టీని మొదటగా ఉత్తరప్రదేశ్‌లో నెహ్రూ జీవించి యుండగనే ప్రారంభించినవాడు. నెహ్రూజీ రైతాంగానికి చేసినదేమీలేదని ఎలుగెత్తిచాటిన ఉత్తరాదిలో మొదటి రైతునాయకుడు.

లోక్‌నాయక్ జైప్రకాష్ నాయకత్వాన అతని అభిలాష మేరకు కాంగ్రెస్ (S) భారతీయ లోక్‌దళ్ జనసంఘం సోషలిస్టుపార్టీ స్థాయి పార్టీలు తరువాత కాంగ్రెస్ (జె) విలీనంలో చేరుతుంది. అన్ని పార్టీలు కలిసి జనతాపార్టీగా రూపొందాయి.

మరల అనేక కారణాల వలన విచ్ఛిన్నమై జనతాపార్టీ అనేక పార్టీలుగా మారిపోయింది. అద్వానీ, వాజ్‌పాయ్ నాయకత్వంలో భరతీయ జనతాపార్టీగా చరణసింగ్, మధులిమాయే నాయకత్వాన లోక్‌దళ్‌పార్టీగా మొరార్జీదేశాయి, ఉన్నికృష్ణన్ నాయకత్వాన కాంగ్రెస్ (యస్) పార్టీగా, మాధులిమాయే, జార్జిఫెర్నాండెజ్, మధుదండావతె నాయకత్వాన జనతా పార్టీగా జగజ్జీవన్‌రాం కాంగ్రెస్ మరల కాంగ్రెస్ (జె)గానే ఉంటుంది.

### లోక్‌దళ్‌పార్టీ దళిత మజ్దూర్ కిసాన్ పార్టీగా పిలవబడటం

లోక్‌దళ్‌పార్టీ మరల దళిత మజ్దూర్ కిసాన్‌పార్టీగా పిలవబడుతూ వచ్చింది. ఆంధ్రలో సర్దార్‌జీ ఈ పార్టీకి ఆధ్వర్యం వహించేవారు. మరల లోక్‌దళ్ డి.యం.కె. దేశస్థాయిలో మరొక చీలిక ఏర్పడింది.

చరణ్‌సింగ్ అవసానదశలో మరణశయ్యపై ఉండగనే ఆతని కుమారుడు అజిత్‌సింగ్ తండ్రికి వారసునిగా ప్రకటించుకొనే స్థితిగతుల్ని సంపాదించుకొనే ప్రయత్నంలో నిమగ్నమవగా రాజనీతి విజ్ఞాని సుబ్రమణ్యస్వామి అజిత్‌సింగ్ పార్టీకి సారధ్యం వహించారు. అదే సమయాన రాజనీతి విజ్ఞాని బహుగుణ, దేవీలాల్ ఒకటిగా రూపొంది లోక్‌దళ్ వేరొకటి ఏర్పడింది. పర్యవసానం లోక్‌దళ్ (ఎ), లోక్‌దళ్ (బి)గా రూపొందాయి.

ఆంధ్రప్రదేశ్ లోక్‌దళ్ పార్టీనాయకులు విభజనకు కలతచెంది ఢిల్లీవెళ్లి తమ నాయకులతో చర్చించసిద్ధపడినారు. వర్కింగు ప్రెసిడెంట్ ఎ. పాండురంగారావు,

వైస్ ప్రెసిడెంట్ నాదెండ్ల వెంకటేశ్వరావు, జాయింట్ సెక్రటరీగారు శ్రీ పావులూరి శ్రీమన్నారాయణ, విశాఖ జిల్లా లోక్‌దళ్ అధ్యక్షులు పంపాన అప్పారావు, రాష్ట్ర లోక్‌దళ్ అధ్యక్షులు లచ్చన్నగారు కమిటీగా ఏర్పడి వెళ్ళారు.

చీలిక వరదని నాయకులకు చెప్పారు. అజిత్‌సింగ్ వర్గంతో చర్చించారు. రాజీపడ లేదు.

ఆంధ్రప్రదేశ్‌లో లోక్‌దళ్ నాయకులు ఒక తీర్మానం చేసారు. అదే మన దేశస్థాయిలో లోక్‌దళ్ పార్టీలో ఎ.పి. లోక్‌దళ్ పార్టీకి సంబంధం లేదు. ఆంధ్రప్రదేశ్ లోక్‌దళ్ రాష్ట్రస్థాయిలో ఒక పార్టీగా మనగలుగుతుందని తేల్చారు.

## చరణ్‌సింగ్‌తో సమాలోచనలు

1985 జనవరి 5న లచ్చన్నగారు ఢిల్లీవెళ్లి ఆంధ్రప్రదేశ్ రాజకీయ స్థితిగతులను డి.యం.కె. నాయకులు శ్రీ చౌదరి చరణ్‌సింగ్‌కు వివరిస్తారు. పార్టీ నిర్మాణానికి చర్చలు జరుగుతాయి. బహుగుణ మాలవీయ లచ్చన్న, చరణ్‌సింగ్‌లు చర్చిస్తారు. తెలుగుదేశం పార్టీనాయకత్వం పోకడల్ని సింగ్‌గారికి వివరించగా యన్.టి.ఆర్. మూర్ఖుడని, అతనికి ప్రజల సమస్యల్ని పరిష్కరించగల పరిపాలనా వివేకంలేదని, ధనికవాద విదానాన్వేషియని, అభివృద్ధి నిరోధకత్వం కలవాడని, తనపై ప్రజలకున్న సినిమామోజులతో ప్రజల్ని ఆకట్టుకొని అధికారానికి వచ్చాడని చౌదరి చరణ్‌సింగ్ లచ్చన్నగారితో నిర్ద్వంధంగా తన అభిప్రాయాన్ని యన్.టి.ఆర్.పై ప్రకటించినట్లు సర్దార్‌జీ వివరించారు.

సర్దార్‌జీకి వెంటనే ఆంధ్రప్రదేశ్ డి.ఎం.కె.పి.ని స్థాపించమని సలహా యిస్తారు. 1985 జనవరి 5వ తేదీన ఢిల్లీలో జాతీయ కార్యవర్గ సమావేశము చౌదరి చరణ్‌సింగ్ గారి ఇంట్లో జరుగుతుంది.

ఆంధ్రప్రదేశ్‌లో బి.సి. యన్.సి. యన్.టి. మైనారిటీల మహాసభ సమర్థవంతంగా రూపందాల్చినందున మరల బ్రహ్మప్రకాశ్ లచ్చన్నగారినే తన B.C. S.C. S.T. మైనారిటీల యూనియన్ ఆంధ్రప్రదేశ్ అధ్యక్షునిగా నియమిస్తూ అధికారపత్రం యిస్తారు. 1985 ఎన్నికలలో సీట్లు సర్దుబాటు విషయాలే ప్రతిపక్షాలతో సమాలోచన చేస్తానని ప్రకటించక మునుపే ఢిల్లీనుండి బి.జె.పి నాయకుల సిద్ధంగా ఉన్నామని ప్రకటించారు.

ప్రసిద్ధ బి.జె.పి నాయకుడు శ్రీ యన్.యన్. రెడ్డిగారు స్వతంత్రంగా శ్రీకాకుళం పార్లమెంటరీ స్థానానికి పోటీ చేయ తలపడటం విశేషం. 1985 జనవరి 5వ తేదీన చరణ్ సింగ్ లచ్చన్నగారివి డి.యం.కె.పి. ఆంధ్రశాఖకు అధ్యక్షునిగా నియమించడం జరిగింది.

తెలుగుదేశం పార్టీనుండి తెలుగుదేశ పార్టీనేతలు కొంతమంది బయటకు రావడం

అంపిచడం అన్నవి జరిగిపోయిన తదుపరి అసెంబ్లీని రద్దుచేసి మరల శాసనసభకు ఎన్నికల్ని జరిపించడమే తనకు కేమకరమని యన్.టి.ఆర్. భావించారు.

కె. కోటేశ్వర్రావు, శ్రీ నాదెండ్ల వెంకటేశ్వరరావు, శ్రీ రావిపాటి చౌదరి లత డి.ఎం.కె.పి నిర్మాణం గూర్చి చర్చించారు.

1985 జనవరి 7వ తేదీన పార్లమెంటు ప్రతిపక్షాల బలం నామమాత్రంగా ఉన్న ప్రభుత్వ విధానాల్ని రూపొందించేటపుడు తప్పక వారిని సంప్రదిస్తామని పత్రికాముఖంగా ప్రకటించారు.

గుంటూరులో పార్టీపెద్దలు కోటేశ్వర్రావు, వెంకటేశ్వర్రావు, శ్రీమన్నారాయణ, అడుసుమిల్లి పాండురంగారావు, శీతారామయ్యలు లచ్చన్నలు పార్టీ నిర్మాణం గూర్చి సమాలోచనలు చేసారు.

శ్రీ యన్.టి.ఆర్. ఎన్నికల పర్వం ముందు చేయగలిగిన పనుల్ని చేసి చూపించగలనన్న దానికి నిదర్శనంగా గ్రామాధికార వ్యవస్థను రద్దుపరచడం. ఆనాటి తెలుగుదేశం పార్టీ అన్ని పార్టీలతో పొత్తుపెట్టుకో దలచిన డి.ఎం.కె.పి.తో పెట్టుకోదు అని తెలుగుదేశం పాలకులు స్పష్టరపరచడం జరిగిపోయింది.

ఢిల్లీ డి.ఎం.కె.పి. సెంట్రల్ ఆఫీసునుండి ప్రధాన కార్యదర్శి యన్.పి. మాలవ్య ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారికి ఒక లేఖ వ్రాస్తూ లచ్చన్న గారితో ఎన్నికల పొత్తుకు అవకాశమిమ్మన్నారు. అయినా యన్.టి.ఆర్. లక్ష్యపెట్టలేదు. తిరస్కరించారు.

డి.ఎం.కె.పి. అధ్యక్షునిగా చరణ్‌సింగ్ కేంద్రంలో రాజీవ్‌గాంధీకి మంచి పనులకు చేయూతనివ్వగలనన్న మాట యిచ్చారు.

1985 జనవరి 18, 19 తేదీలలో గుంటూరులో డి.ఎం.కె.పి. యూనిట్ సమావేశం జరిగింది. ఎవరెవరు ఏఏ నియోజక వర్గాల్లో పోటీ చేయదలచినదీ తెలిసికోవడం జరిగింది.

అయితే తెలుగుదేశం సి.పి.ఐ.(యం), సి.పి.ఐలతో పొత్తుకు సిద్ధంగానున్న బి.జె.పి. జనతాలతో పొత్తుకు అంతగా ఉత్సాహం చూపెట్టని పరిస్థితి అది. అంతేగాక యన్.టి.ఆర్. భారతదేశ స్థాయిలోనే "భారతదేశం" అన్న పేరుతో పార్టీ నొకదానిని స్థాపిస్తానని ప్రకటించడం ఒక విశేషం. ఒక కమిటీ ఏర్పాటు జరిగింది.

1985 జనవరి 26వ తేదీన డి.ఎం.కె.పి. శాఖ పక్షాన పోటీ చేయడానికి తయారుచేసిన సంక్షిప్త జాబితాను తెలుగుదేశం ప్రధాన కార్యాలయంలో బి.యన్.ఎ స్వామి, శ్రీ పి. శివన్నారాయణ అందజేసారు. 28వ తేదీన ఉపేంద్రగారితో సీట్ల సర్దుబాటు చర్చలు

జరిగినవి. మొత్తం 21 సీట్లలో కనీసం 13 స్థానాల్ను కేటాయించాలని యన్.టి.ఆర్.కి డి.ఎం.కె.పి నాయకుడు ఉత్తరం వ్రాసారు.

అసెంబ్లీ ఎన్నికల సహాయానికి మహాజన పత్రిక నిర్వహణకు అర్జునగౌడ్, శ్రీ రాజమల్లయ్యగౌడ్, లక్ష్మయ్యగౌడ్ లు పర్యటించారు.

ఫిబ్రవరి 2వ తేదీన విశాఖజిల్లా డి.ఎం.కె.పి కార్యకర్తల సమావేశం జరిగి పంపాన అప్పారావు గారిని విశాఖజిల్లా అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు.

డి.ఎం.కె.పి.కి ఎన్నికల చిహ్నం లోక్‌దళ్ పార్టీ ఎన్నికల గుర్తునే కేటాయించారు. భారతదేశ స్థాయిలో చరణ్‌సింగ్ లోక్‌దళ్ పార్టీ నిర్మాత డి.ఎం.కె.పి. నిర్మాతకూడా చరణ్‌సింగ్ సాహెబ్.

తెలుగుదేశం నేత యన్.టి.ఆర్. సర్దార్ లచ్చన్నను ఎన్నడూ బాహాటంగా ధిక్కరించలేదు. లోలోన సర్దార్‌జీని ప్రతిఘటించ ఎన్నికల ఎత్తుగడలలో మునిగి తేలుతూనే ఉన్నారు.

## సోంపేట నియోజక వర్గం నుండి పోటీ విరమణ

ఆనాడు 1983లో త్రిముఖ పోటీకి అవకాశం యిచ్చి కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిని గెలిచేలా లచ్చన్నగారు ఓడిపోయేరు. తను తెలుగుదేశం పార్టీ మహిళా అభ్యర్థిని సోంపేటలో పోటీకి నిలబెట్టింది. ఈనాడు సోంపేట నియోజక వర్గంలో సర్దార్‌జీ కుటుంబ సభ్యుల్ని గాక ఏ ఒకరిని తెలుగుదేశం తరపున నిలబెట్టిన మొదట జరిగినట్లుగానే శృంగభంగం కలుగుతుందని-సర్దార్ గౌతు లచ్చన్న గారిని శ్రీకా కుళం జిల్లా సోంపేట నియోజక వర్గంనుండి ప్రతిఘటించాలన్న ఆతని కుమారుడు గౌతు శ్యామసుందర శివాజీనీ. తన తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా నిలబెట్టడమే రాజకీయంగా తనకు మంచిదని గ్రహించారు యన్.టి.ఆర్.

సోంపేట నియోజక వర్గం అభ్యర్థిగా సర్దార్ గౌతులచ్చన్న గారి ఏకైక పుత్రుడు యువకుడు, సౌమ్యుడు, వినయవిధేయతకు రూపమైన చిరంజీవి గౌతు శ్యామసుందర శివాజీని ఎంపిక చేసింది తెలుగుదేశంపార్టీ.

తెలుగుదేశం పార్టీటిక్కెట్టును ప్రకటించి చిరంజీవి గౌతు శ్యామసుందర శివాజీని దగ్గరకు చేరబిలిచి ఎంతో ఆప్యాయంగా ఆదరించి దీవించి తెలుగుదేశం టిక్కెట్టు సోంపేట నియోజకవర్గానికి మీకే యిస్తున్నాను బ్రదర్ అని శివాజీగారితో అనగానే ఎంతో విధేయతతో శివాజీ తనపార్టీ నాయకుని ఆదేశాన్ని శిరసావహించారు. సోంపేట నియోజకవర్గంలో తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా రంగంలో దిగటానికి సిద్ధమైనారు.

1985 ఫిబ్రవరి 4వ తేదీన శివాజీ తన తండ్రి సర్దార్ గౌతు లచ్చన్నగారి పాదాలకు

అభివందనం చేస్తూ అభ్యర్థిగా గెలుపొందాలని ఆశీర్వదించండని కోరగా "నన్ను అవమానపరచి అన్నివిధాలా కక్ష సాధించే దానికి పూనుకున్న తెలుగుదేశంతో చేరి కుట్రలకు బలపరుస్తున్న నిన్ను ఆశీర్వదించే సమస్యలేదని పొమ్మాన్నారు. అయితే రాజకీయాల్లో స్వపర పరభేదాలులేవని, ఎవరి ఆశయం, సిద్ధాంతం వారిదేనని, ఒకరి లక్ష్యం ఆశయం తండ్రి కొడుకులైనంత మాత్రాన ఒక్కటిగా ఉండనవసరంలేదని, నీ ఆశయసాధనలో నీవు కృషిచేయడంలో నాకభ్యంతరం లేదని నిన్ను మనసారా దీవించడం మాత్రం జరిగేపని కాదని నిర్వంధ్వంగా రాజకీయాల్లో రక్తసంబంధాలకు తావేలేదని చెప్పి నిరూపించిన నిర్మొహమాట నిష్పక్షపాత వైఖరిగల వారు సర్దార్ గౌతు లచ్చన్నగారు.

1985 ఫిబ్రవరి 4వ తేదీన పార్టీ అభ్యర్థుల ద్వితీయ జాబితా ప్రకటించబడినది. ఫిబ్రవరి 9వ తేదీన సోంపేటలో నామినేషన్ దాఖలుచేసిన సర్దార్ గౌతు లచ్చన్నగారు శ్రీకాకుళం కార్యకర్తలు లోక్‌దళ్ పార్టీసభ్యులు పాండురంగారావు, శ్రీ టి. మోహన రావు, సారథిరెడ్డి జగ్గారావు, వి. బాలకృష్ణగార్లు కూలంకషంగా చర్చించిన తదుపరి తన నామినేషన్‌ను ఉపసంహరించుకుని, శ్రీకాకుళం అసెంబ్లీ నియోజకవర్గం నుండి పోటీచేయటానికి నిర్ణయించడమైనది. సోంపేట నుండి పోటీ విరమించుకొన్నారు.

పాత శ్రీకాకుళంలో పార్టీ ఆఫీసును తెరచారు. జిల్లా అధ్యక్షులుగా డా. కృష్ణ చంద్రరావు ఎన్నికల కార్యాలయాలకు ఆధిపత్యం వహించారు. వి.యస్. స్వామిగారు హైదరాబాదు నుండి వచ్చి ఎన్నికల ప్రచారంలో నిమగ్నమైనారు. నయిముల్లా ఎన్నికల్లో తిరిగి విచిత్రంగా ప్రచారం చేసారు. శ్రీనివాసులరెడ్డి జిల్లాపార్టీ ఉపాధ్యక్షులు మరియు ఇతరులు.

సోంపేట, టెక్కలి, శ్రీకాకుళం మూడు స్థానాల్లో నామినేషన్లను దాఖలు చేసిన లచ్చన్నగారు సోంపేటలో 1952 నుండి తనతో కష్టసుఖాల్ని పంచుకొంటు వస్తున్న కార్యకర్తలు లచ్చన్నగారిని నామినేషన్ ఉపసంహరించుకోమని ప్రతిఘటించడం టెక్కలిలో బమిడి నారాయణస్వామి తదితర స్థానిక లీడర్లు మొదట మాటయిచ్చి తరువాత సమర్థించకపోవడం. అందువలన శ్రీకాకుళంలోనే తన ప్రచారాన్ని కొనసాగించారు లచ్చన్నగారు.

## శ్రీకాకుళం నియోజకవర్గం నుండి ఓటమి

శ్రీకాకుళం నియోజక వర్గంలో 55% ఓట్లు పోలయినవి. అయిన లచ్చన్నగారు ఓడిపోయి కాంగ్రెస్ అభ్యర్థికన్న ఓట్ల సంపాదనలో వెనకబడిపోయారు. ప్రజలలో ఏదో అనూహ్యమైన భావనచోటు చేసుకొని వారిని మైమరచేలా చేసింది. లేకున్న 40 ఏండ్ల శాసనసభా జీవితంలో తమ ఒకనాడు మంత్రిగా పనిచేసిన దినాల్లో ఏనాడు ప్రజల

సంక్షేమమే తప్ప స్వంత లాభం చూసుకొనని సర్దార్‌జీకి పరాజయమేమిటి. బి.జె.పి. నాయకుడు వెంకయ్య నాయుడుగారు ఓడిపోవడం జరిగింది.

ఎన్నికల ఫలితాల ప్రకటన తదుపరి తన తనయుడు చిరంజీవి గౌతు శ్యామసుందర శివాజి సోంపేట కాంగ్రెస్ అభ్యర్థిని ఓడించి తనవద్దకు వచ్చిన ఆశీర్వదించమని కోరగా అది జరగని పని నీవు ఇకపై హైదరాబాదు వచ్చిన నేనున్న ఇంటికి రావద్దు. నీవు నీకివ్వనున్న యం.యల్.ఏ. క్వాటర్‌లోనే ఉండాలి అని తెగతెంపుల్ని చేసుకొన్నారు.

1985 మార్చి 8వ తేదీన తెలుగుదేశం పార్టీశాసనసభా నాయకునిగా యన్.టి.ఆర్. ఏకగ్రీవంగా ఎన్నికై మంత్రివర్గాన్ని ఏర్పాటుచేయ సిద్ధపడినారు. తెలుగుదేశం పాలన ప్రారంభమైనది.

అదే దినమున లచ్చన్నగారు డి.యం.కె.పి. ఆంధ్రప్రదేశ్ శాఖకు తను ఓటమి పొందిన కారణంగా తన పార్టీని ప్రజలు తిరస్కరించినందున రాజీనామా పత్రాన్ని వ్రాసి రాష్ట్రకమిటీకి సమర్పిస్తారు.

నిజానికి డి.యం.కె.పి.గా పరిగణనలోనికి వచ్చిన లోక్‌దళ్ పార్టీగనే ఎన్నికల కమిషన్ దీనిని గుర్తించింది. చరణ్‌సింగ్ దీనికి అధ్యక్షులు.

సర్దార్ గౌతు లచ్చన్నగారు యిచ్చిన రాజీనామా పత్రాన్ని రాష్ట్రకమిటీ తిరస్కరించింది. కేంద్ర నాయకత్వం చరణ్‌సింగ్ త్రోసిపుచ్చారు. అందువలన సర్దార్ లచ్చన్నగారే నాటినుండి నేటివరకు ఆంధ్రప్రదేశ్ లోక్‌దళ్ పార్టీ అధ్యక్షునిగా వ్యవహరిస్తున్నారు.

రాష్ట్ర లోక్‌దళ్ కార్యవర్గం కూడ సమావేశమై లచ్చన్నగారిచ్చిన రాజీనామా పత్రాన్ని ఉపసంహరించుకోవాలని తీర్మానించింది. అంతేగాక సేవాధర్మాన్ని విస్మరించడమేగాక సమాజపు సమిష్టి ప్రయోజనాలనుఆశిస్తూ ఆడంబరాలకు అట్టహాసలకు కల్లబొల్లి మాటలతో కూడిన భేషజాల భ్రమలకు అదరింపులు బెదరింపులు కుల మతతత్త్వ దురహంకారాలకు లోబడక పార్టీని నడపాలని అందుకు లచ్చన్నగారి నాయకత్వం కావాలని కార్యవర్గం కోరుతూ తీర్మానం చేసింది.

1985 మార్చి నెల 24వ తేదీన శ్రీకాకుళం జిల్లాలో పంపాన అప్పారావు అధ్యక్షతన కార్యకర్తల సమావేశం జరిగింది. జిల్లాపార్టీ పునర్నిర్మాణం వంశధార ప్రాజెక్టు ద్వితీయ స్థాయిపనికి తె.దే. ప్రభుత్వం తలపెట్టిన ద్రోహం వెనుకబడిన తరగతులకు జరుగుచున్న వెన్నుపోటు కేంద్ర, రాష్ట్ర బడ్జెట్‌లలో పేద ప్రజలు బ్రతుకులపై పెరుగుతున్న భారం మున్నగు విషయాలపై చర్చించారు. తగురీతిని ఆ విషయాలపై తీర్మానించారు.

# 27వ ప్రకరణము

## వామపక్ష, ప్రజాస్వామ్య సంఘటన-లచ్చన్న

35 ఏండ్ల సర్దార్ లచ్చన్న శాసనసభా జీవిత కాలంలో ఏదోకొద్దికాలం తప్పించి మిగతాకాలం అంతా శాసనసభలో ప్రతిపక్ష నాయకునిగనే కొనసాగారు. ప్రభుత్వపక్షాన్ని నిలదీసి ప్రశ్నించే లచ్చన్న తను ప్రభుత్వ పక్షంలో ఉండి, ప్రతి పక్షాలకు జవాబిచ్చిన పరిస్థితి కొద్ది కాలమే.

1983లో శాసనసభ్యునిగా ఓటమి చెందిన లచ్చన్నగారు ప్రజలు తన్ను తిరస్కరించినారన్న భావం తనలో ఈషణ్మాత్రమైన కలుగులేదు. దేశకాలమాన పరిస్థితులను బట్టి జరిగిన మార్పులకు తాను జంకలేదు. మనోవేదనతో క్రుంగలేదు. తన. ఆశయ సాధనంలో ముందడుగేయడంలో వెనుకడుగు వేయలేదు.

శాసనసభలో ప్రతిపక్షాల్ని కూడగట్టుకొని ప్రభుత్వం మదగజానికి అంకుశంగా పేరందిన లచ్చన్నగారు శాసనసభ బయట ప్రతిపక్షాలతో కూడిన ఫ్రంట్ ఒకటి అవసరమన్న భావానికి వచ్చారు.

### రాష్ట్రంలో తృతీయశక్తి నిర్మాణం

కాంగ్రెస్ విధానాలకురోసి వారి అప్రజాస్వామిక రీతికి గినిసి నిరంకుశ చర్యలకు నిరసన తెలిపిన లచ్చన్నగారు కాంగ్రెస్ పోయి రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీ అధికారానికి వచ్చిన తరువాత అదే పరిస్థితులను మరల ఎదుర్కొనవలసి వచ్చినది. తెలుగుదేశం కూడా కాంగ్రెస్‌లానే చేసింది.

అందువలన లచ్చన్నగారు తన పార్టీ ఒక్కటే రాష్ట్రంలోనున్న కాంగ్రెస్, తెలుగుదేశాన్ని ఎదుర్కోజాలదని ఆ రెండింటిని ఎదిరించగల తృతీయశక్తి అవసర మని ఒక నిర్ణయానికి వచ్చారు. బావ సారూప్యంగల పార్టీలలో ఐక్యమై పార్టీలు తమ స్వీయ రూపాల్ని, లక్ష్యాల్ని ఆశయాల్ని విడవాడకనే ఒకే త్రాటిపై నడచి కాంగ్రెస్ తెలుగుదేశం పార్టీల్ని ఎదుర్కోవాలి. ప్రయత్నాలు కొనసాగాయి.

1988 జనవరి 21వ తేదీన విజయవాడలో లోక్‌దళ్ కార్యకర్తలు, సర్వసభ్య సమావేశం జరిపి అవినీతికర విధానాల్ని నిరంకుశ చర్యల్ని చేపడుతున్న అటు రాజీవ్‌గాంధీ ఇటు యన్.టి.ఆర్. ఇరువురిని గద్దె దింపాలని అందుకు ప్రత్యామ్నా యంగా తెలుగుదేశం ఇందిరా కాంగ్రెస్ పార్టీలను ప్రతిఘటిస్తున్న పార్టీలతో ఒక రాజకీయ శక్తిని తృతీయశక్తిని రూపొందించుటకు తగు చర్యల్ని తీసికొనవలసిన దిగా అధ్యక్షులు గౌతు లచ్చన్న గారికే అధికార మిస్తూ తీర్మానిస్తారు.

1988 జనవరి 26వ తేదీన C.P.I. లీడర్ శ్రీ గిరిప్రసాద్, శ్రీ దాసరి నాగభూషణం, శ్రీ రెడ్డి గార్లు రాజకీయ చర్యలకు తన స్వగృహానికి రావలసినదిగా లచ్చన్న కోరారు. రాష్ట్రంలో ఒక తృతీయశక్తిని రాజకీయశక్తి సృష్టించాలన్నది సర్దారు అభిమతం.

చర్చలు కొనసాగాయి. నాన్ తెలుగుదేశం పార్టీ నాన్ కాంగ్రెస్ పార్టీలలో కలిసి ఒక రాజకీయ ఫ్రంట్ ఏర్పడాలన్నది ఆనాటి సారాంశం. ముందుగా చొరవ తీసుకున్నది లచ్చన్నగారే. L.D.F. రూపమందటానికి కారకులు లచ్చన్నారే.

అయితే లచ్చన్న గారినే చొరవ తీసికొని అన్ని పార్టీల్ని పిలిచి చర్చల్ని కొనసాగించండి. మేము సహకరిస్తాం అని నాగభూషణం, గిరి ప్రసాద్‌గారు అన్నారు.

అందుకు లచ్చన్నగారు మీరు చెప్పిన రీతిగా వ్యవహరించానికి నాకభ్యంతరం లేదు గాని ప్రస్తుతం నేను హైదరాబాదు చింతలబస్తీలో నున్న నా స్వగృహాన్ని అమ్మివేసే పరిస్థితులలో నున్నాను. విశాఖపట్నంలో స్థిర నివాసం చేస్తాను అనుకొంటున్నాను. లావాదేవీలు జరుగుతున్నాయి. ఆ పనిలో నేను నిమగ్నమవక తప్పదు. అందు మీరే సారధ్యం వహించి అన్ని పార్టీలవారితో సంప్రదించండి అని జవాబిచ్చారు.

దాని పర్యవసానంగా ప్రతిపక్షాలు C.P.I. ముగ్దుంభవన్‌లో సమావేశమౌవాలి. హాజరైన పక్షాలు లోక్‌దళ్ సి.పి.ఐ. రిపబ్లికన్ పార్టీ (యం. సి.పి.ఐ) శ్రీ లచ్చన్న, గిరిప్రసాద్, ఈశ్వరీబాయి, ఓంకార్‌లు జనమోర్చా తుర్లపాటి సత్యన్నారాయణ, పి. జనార్ధన్‌రెడ్డి హాజరైనారు. (వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన) కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీకి వ్యతిరేకంగా ఒక ఫ్రంట్ ఏర్పడటం అవసరం అన్నది నాయకులు గుర్తించారు. అందుకు కృషి చేయాలన్న దానికి అంగీకరించారు. జాతీయస్థాయిలో కాంగ్రెసేతర ప్రతిపక్షాలు ఒక పిలుపునిచ్చారు. భారత్ బచావ్ అని 1988 మార్చి 15వ తేదీన భారత్‌బంద్ జరపడం జరిగింది. పై 5 పార్టీలు తెలుగుదేశం, సి.పి.ఐ.(యం) జనతాలో కలిసి భారత్‌బంద్‌ను జరపటానికి నిర్ణయించారు. అయితే లోక్‌దళ్, సి.పి.ఐ. (యం) సి.పి.ఐ. రిపబ్లికన్‌పార్టీ జనమోర్చాలు కలిసి భారత్‌బంద్‌ను ప్రత్యేకంగా నిర్వహించటానికి నిర్ణయించారు.

## 1988 జూన్ 21వ తేదీన L.D.F. ఏర్పాటు

తరువాత పై 5 పార్టీల వారు సుమారు 5, 6 సమావేశాల్ని నిర్వహించారు. చర్చించారు. తుదకు ఒక తీర్మానం చేసారు. పై పార్టీలన్నీ 1988 జూన్ 21 వ

తేదీన రాష్ట్రీయ తృతీయ రాజకీయశక్తిగా నిలబడి మనగలగటటానికి వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనగా ఎల్.డి.ఎఫ్. ఏర్పడాలన్నదే ఆ తీర్మానం.

ఏ ఐదు పార్టీలు జరిపిన సమావేశాల్లో శీనయ్యసేవ వచ్చి ఒకనాడు చేరింది. జనమోర్చా-జనతా నాయకులు కూడా వచ్చి సమావేశాల్లో పాల్గొన్నారు. కేంద్ర నాయకత్వం అనుమతిపైనే తప్ప మేము చేరలేం వారిని ఒప్పిస్తాం అంటూ చివరికి వారు ఎల్.డి.ఎఫ్.లో చేరలేదు. ఇక శీనయ్య సేన కాంగ్రెస్ పార్టీలో చేరాలన్న అభిలాషను తెలిపింది. C.P.I. (M) కి ఎన్ని మార్లు ఆహ్వానం అంపిన మేము తెలుగుదేశం మిత్రపక్షంగానే ఉంటామని తెలిపింది.

చివరకు L.D.F. లో ఉన్నది నాలుగు పార్టీల కమ్యూనిష్టు పార్టీ లోక్‌దళ్ M. C.P.I. రిపబ్లిక్‌న్ పార్టీలు మాత్రమే.

1989 సాధారణ ఎన్నికల్లో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన తరుపున అభ్యర్థులను రంగంలోనికి దించడానికి రాష్ట్రంలో తృతీయ శక్తిగా ఏర్పడిన ఎల్.డి.ఎఫ్. సిద్ధపడింది. అయితే వ్యూహం ఎత్తుగడల మేరకు ఇందలి గల పార్టీలు వేరు వేరు రాజకీయ ఎత్తుగడలను చేపట్టినందున రాష్ట్రంలో తృతీయ శక్తి -నిర్మాణానికి అవకాశం లేకపోయింది. ఆనాటి వరకు తెలుగుదేశాన్ని, వారి పరిపాలనను విమర్శిస్తున్న సి.పి.ఐ. తెలుగుదేశం పార్టీ మిత్ర పక్షంగా వుండటానికి సిద్ధపడింది. నిజానికి ఇంతటితో వామపక్ష ప్రజాస్వామ్య సంఘన ముగిసినట్లే.

# 28వ ప్రకరణము

## జనతాదళ్ పార్టీ రాష్ట్ర నాయకునిగా లచ్చన్న జనమోర్చా అవతరణ

1969లో దేశస్థాయిలో రాజకీయాల్లో గొప్ప మార్పుచేర్పులు జరిగాయి. అఖండ భారతదేశాన్ని అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తున్న అధికార కాంగ్రెస్‌లో అంతర్గత విభేదాలు తలెత్తాయి. అయితే 1969లో కాంగ్రెస్, కాంగ్రెస్ (ఐ)గా, కాంగ్రెస్ (Old) గా విభజనంది. ఒక విభాగానికి శ్రీమతి ఇందిరాగాంధీ, వేరొక విభాగానికి నిజలింగప్ప అధ్యక్షులయ్యారు. ఎవరికివారే తమ పార్టీని నేషనల్ పార్టీగా చెప్పుకు న్నారు.

ఈనాడు 1989లో ఆ విధంగా కాంగ్రెస్ పార్టీలో చీలిక రాలేదు, కాలేదు. అయితే కేంద్రమంత్రిగా పనిచేస్తున్న రాజకీయ నాయకుడు ఇందిరాగాంధీకి అత్యంత సన్నిహితుడు ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి విశ్వనాథ్ ప్రతాప్ సింగ్, మంత్రి పదవి నుండి బయటకు అంపించబడినారు. వి.పి. సింగ్ కాంగ్రెస్ పార్టీనుండి బయటపడి తన శాయశక్తులా ప్రయత్నించ సిద్ధపడి వేరే పార్టీని స్థాపించి, కేంద్రమునగల కాంగ్రెస్‌పార్టీ అధిష్టాన వర్గానికే అంకుశంలా రూపొందారు. అందుకే కేంద్ర ప్రభుత్వాధికారాన్ని గుప్పెట్లో పెట్టుకున్న ప్రధాన నాయకులే ''బోఫార్సు కాంట్రాక్టులో పెద్ద మొత్తాన్ని కాజేసినారని ఆ మొత్తాల్ని మర్మగర్భితమైన స్విట్జర్లాండ్ దేశం స్విస్ బ్యాంకు ఎక్కౌంట్లో జమచేసి యున్నారని ధ్వజమెత్తి ప్రజల్లోనికి వెళ్ళి ఆ బండారాన్ని బయట పెట్టి శత విధాలా ప్రయత్నించారు. తనే దేశ ఆర్థికమంత్రిగా ఉండగా ఫెయిర్‌ఫాక్స్ ఉదంతాన్ని విప్పి చెప్ప సాహసించారు. దేశ ప్రధాని రాజీవ్‌గాంధీకి బోఫార్సు ఒప్పందాల భాగోతంలో భాగం ఉందని బల్లగుద్ది చెప్పడమేగాక కేంద్రమునగల అధికార పార్టీని చిత్తుచేసి, అధికారం కైవసం చేసుకోవాలన్న రాజకీయ సంకల్పంతో దేశమున తన అధ్వర్యాన జనమోర్చా అవతరణ జరిగింది. తనే ఒక ప్రధానశక్తిగా మారి త రాజకీయ, తన నైతిక జీవితమును పెట్టుబడిగా పెట్టి ప్రజా చైతన్యాన్ని తెచ్చిపెట్టి దేశం నలుమూలలా పర్యటించడమేగాక కాంగ్రెస్ అధిష్టాన వర్గంలోటు పాట్లను బయట పెట్టడమేగాక దేశాన్ని పాలించే నైతిక హక్కు రాజీవ్‌గాంధీకి లేదని చాటి చెప్పారు. ప్రజా స్పందన వచ్చింది.

## భావ సమైక్యతగల పార్టీల సమ్మేళనం

అంతియేగాక భావ సమైక్యతగల భారత్‌దేశ రాజకీయ పార్టీల్ని తన పార్టీలో విలీనం కావాలని పిలుపునిచ్చారు. విశ్వనాథ ప్రతాప్‌సింగ్ దేశంలో రాజకీయ పరిస్థితి వి.పి. సింగ్‌నకు బాగా ఉపకరించింది. ఆ సరికే లోక్‌దళ్ పార్టీ చరణ్‌సింగ్‌నకు తీవ్ర అనారోగ్య కారణంగా నాయకత్వ అన్వేషణతో బాటు విభేదాలకు సైద్ధాంతిక నియమాల వేర్పాటుకు గురి అయింది.

## బెంగుళూరు కన్వెన్షన్

పర్యవసానమేమో, అన్ని పార్టీలు కలసి బెంగుళూరులో 1989 జూన్‌లో ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసుకున్నాయి. దీనిని బెంగుళూరు కన్వెన్షన్ అందురు. అప్పటి కర్ణాటక జనతా నాయకుడు రామకృష్ణ హెగ్డే, లోక్‌దళ్ (బి) నాయకుడు దేవీలాల్, లోక్‌దళ్ (ఎ) నాయకుడు అజిత్‌సింగ్ ప్రసిద్ధ జనతా నాయకుడు చంద్రశేఖర్, జనమోర్చా నాయకుడు విశ్వనాథ ప్రతాప్‌సింగ్ నాయకుల సమావేశం జరిగింది. తీర్మానాలు చర్చలు కొనసాగాయి. కొంతకాలం ప్రతిష్టంబన కొనసాగిన దేశస్థాయిలో అందరం, అన్ని పార్టీలు కలిస్తేనే తప్ప కాంగ్రెస్‌ను అధికారపీఠం నుండి తొలగించడం అసాధ్యమన్నది వాళ్ళందరకు గత రాజకీయ చరిత్రలో ఋజువైన అనుభవైక వేద్యం.

1989లో ఆనాటికి ఆంధ్రప్రదేశ్‌లో A.P. లోక్‌దళ్ అను పేరు సర్దార్ గౌతు లచ్చన్న అధ్యక్షతన కొనసాగుతూ ఉంది. నిజానికి లోక్‌దళ్ పార్టీ జాతీయ స్థాయిలో రెండుగా మరియు బలంగా మార్పుచెందినప్పుడు అందుకు ఎంతగానో బాధపడిన సర్దార్ గౌతు లచ్చన్న రెండుగా చీలిక ఏ ఒక పక్షము వారిని తాము సమర్థించక బలపరచక తాటస్థ్యం వహించారు. ఒక చీలిక లోక్‌దళ్ (బి)లో తన అభిమాని, రాజకీయ సహచరుడు తన వలె రైతాంగాన్ని ఆదుకోవాలన్న దేవీలాల్ ఉన్నారు. వేరొక చీలిక లోక్‌దళ్ (ఎ) నాయకుడు తన సిద్ధాంతానికనుగుణమైన రాజకీయ భావాలు కలిగి దేశస్థాయిలో రైతాంగానికి రక్షకుడు అని పేర్పడిన చరణ్‌సింగ్ తనయుడు అజిత్‌సింగ్ సిద్ధాంతరీత్యా భావ సమైక్యత కలిగిన ఆ రెండు చీలికల్లో ఏ భాగాన్ని తాను వరించాలన్నది గాక ప్రస్తుతానికి తమ ఆంధ్రప్రదేశ్‌లో నున్న లోక్‌దళ్ పార్టీ సర్వ స్వతంత్ర మైనదిగా ఉండటమే మేలని ఆనాడు లచ్చన్న భావించారు.

బెంగుళూరులో జరిగిన కన్వెన్షన్‌కు లోక్‌దళ్, జనతా నాయకులు ఎ.పి. లోక్‌దళ్ నాయకులు సర్దార్ గౌతు లచ్చన్న గారిని, హాజరుకమ్మని ఆహ్వానించారు. భావ సమైక్యతగల పార్టీల్ని సంవిలీనం చేయడమే చక్కని మార్గమని పిలుపునిచ్చారు.

దేశ స్థాయిలో కేంద్ర అధికారాన్ని గుప్పిట్లో పెట్టుకుని నిరంకుశ రాచరిక పోకడల్ని అనుసరిస్తున్న కాంగ్రెస్‌ను ప్రతిఘటించాలని, లచ్చన్న గారి "లోక్‌దళ్"కు విలీనం చేయ కోరారు.

లచ్చన్నగారు ఆనాడు ఈనాడు ఏనాడు కాంగ్రెస్ పార్టీని ప్రతిఘటిస్తూ పోరాటమే తన రాజకీయ జీవిత లక్ష్యం. తన గురువర్యులు కాంగ్రెస్‌లో చేరిన కాంగ్రెస్‌పై తనకున్న దురభిప్రాయంపోలేదు. దేశంలో నిరుద్యోగాన్ని తెచ్చిపెట్టడానికి బలహీన వర్గాలింక అధోగతి పాలుకావటానికి ఆర్థిక అసమానతలు పెచ్చుపెరగటానికి కాంగ్రెస్ పార్టీ అస్తవ్యస్త ఆర్థిక విధానాలేనన్నది అతని పూర్తి నమ్మకం. అందువలన బెంగుళూరులో జరిగిన సమావేశానికి లచ్చన్నగారు వెళ్ళి తన లోక్‌దళ్ పార్టీని అందులో విలీనం నిజానికి చేయాలి.

అయితే ఆనాడు లచ్చన్నగారు బెంగుళూరు సమావేశానికి హాజరుకాలేదు. బెంగుళూరు సమావేశంలో జరిగిన 1989లో ఆంధ్రప్రదేశ్‌లో గల రాజకీయ పరిస్థితులు వేరుగా ఉన్నాయి. తెలుగుదేశం పార్టీనేత యన్.టి. రామారావు తన పార్టీకి తనే అధినేతనన్న భావంతో వ్యవహరించడమేగాక, దేశస్థాయి రాజకీయాలకు కూడా తనే రూపకల్పన చేయగలనన్న అభిప్రాయంలో ఉండేవారు. ఆంధ్రులకు తిరుగులేని నాయకుడని, ఆరుకోట్ల ఆంధ్రులకు తనే రూపమని పలుమార్లు చెప్పుకొనే యన్.టి.ఆర్.ను అభిమానించే ప్రతిపక్ష పార్టీలు సహజంగానే ఆతనిని నాయకునిగా ముందుంచటానికి సంబరపడినాయి. దేశంలోగల ప్రతిపక్ష నాయకులెల్లరికి మార్గ దర్శక సూత్రధారి తెలుగుదేశంవల్లభుండన్న అభిప్రాయం కూడా అక్కడక్కడ చెలరేగింది. మహానాడు జన్మదిన వేడుకల్ని జరిపించి దేశస్థాయి ప్రతిపక్ష నాయకులు యల్.కె. అద్వాని, వాజ్‌పేయి, నంబూద్రిపాద్, వి.పి.సింగ్, సూర్జిత్‌సింగ్ ముఖర్జీ వంటి వారే కాక, మద్రాసు ముఖ్యమంత్రి కరుణానిధి, అస్సాం ముఖ్యమంత్రి ప్రఫుల్లా కుమార్ మహంతా, కర్ణాటక ముఖ్యమంత్రి రామకృష్ణ హెగ్డే, పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసు యన్.టి.ఆర్. నాయకత్వం కావాలన్న భావాన్ని ధోరణులను వారివారి పార్టీటల ఎత్తుగడ వ్యూహం మేరకు వెదజల్లడం ప్రారంభించారు. దీనితో యన్.టి. రామారావు రాష్ట్రస్థాయి నుండి దేశస్థాయి రాజకీయాల్లో ప్రముఖ పాత్ర వహించిన వ్యక్తిగా రూపొందారు.

ఇది ఇంతటితో పోలేదు. మహావృక్షం పొంతన చిరుమొక్కలు జనించిన అవి ఎదిగి ఏపుగా పెరగవన్నట్లు ఆంధ్రప్రదేశ్‌లో గల ప్రతిపక్షాలు జనతా, బి.జె.పి, సి.పి.యం, తెలుగుదేశం పార్టీతోకలసి నడిస్తేనేతప్ప తమకు దారిదొరకదేమోఅన్న భావంలోనికి దిగిజారిపోయారు. ఎన్నికలొస్తే ప్రతిఒక పార్టీ స్వతంత్రంగా తన

ఎన్నికల ప్రణాళిక సిద్ధాంతం మేరకు ప్రజల్లోకి జొరబడి ఎన్నికల్లో విజయం పొందాలి లేదా ప్రజలు నిరసించిన భరించాలి. అనుభవించాలి. అంతియేతప్ప స్వీయ వ్యక్తిత్వాల్ని సిద్ధాంతాల తిలోదకాలిడి ఏవోకొన్ని సీట్లును రాష్ట్ర అసెంబ్లీలో సంపాదించి ఆ విధంగా వారివారి పార్టీ అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలన్న సంకుచిత దృక్పదంలో ప్రవర్తించడం సరికాదన్నది సర్దార్ గౌతు లచ్చన్నగారి అభిప్రాయం.

ఇట్టి పరిస్థితులలో రాష్ట్రంలో తెలుగుదేశం వారిని అంటిపెట్టుకొని రాజకీయంగా ఒకరినొకరు కౌగిలించుకొంటూ కాలక్షేపంచేస్తున్న రాష్ట్రమునందలి జనతాతో బెంగుళూరులో లోక్‌దళ్‌తో కలిసి సాధించవలసిందేమీ లేదు. ఎన్నికల సమయాన సీట్లు సర్దుబాటులో కొన్ని సీట్లుతప్ప తమ బెంగుళూరువెళ్ళి తన లోక్‌దళ్‌పార్టీని ఆ పరిస్థితుల్లో విలీనం చేసిన తన అస్తిత్వం పార్టీ అస్థిత్వం పోవడంతప్పించి తమ తెలుగుదేశం పార్టీ విధానాలతో సరిపెట్టుకోవడం జరగదు. యన్.టి.ఆర్. నియంతృత్వ విధానాల్ని బాహాటంగా ఎదిరిస్తువస్తున్న లచ్చన్న రాష్ట్రంలో తెలుగు దేశాన్ని సమర్థించడం కుదరనిపని. ఆనాడు పరిస్థితులటువంటివి.

## జనతాదళ్ పార్టీ ఎ.పి. లోక్‌దళ్ జనతాపార్టీలో విలీనం

అయితే ఈనాడు సర్దార్ గౌతు లచ్చన్న తన ఎ.పి. లోక్‌దళ్‌పార్టీ యూనిట్‌ను 1990 ఫిబ్రవరి ఒకటవ తేదీన జనతాదళ్ పార్టీలో విలీనంచేసి ఎందుకు చేసినట్లు-కారణం తేటతెల్లమే. ఈనాడు కేంద్రములో అధికారస్థానమున ఉన్న జనతాదళ్ పార్టీ రాష్ట్రమునగల తెలుగుదేశం పార్టీనాయకుల మెప్పుపొందేట్లు మెలగే పరిస్థితిలేదు. ఈనాడు జనతాదళ్ సొంత వ్యక్తిత్వాన్ని స్వీయ అస్తిత్వాన్ని సిద్ధాంతాన్ని కలిగియుంది. పార్టీతో ఏకమై జనతాదళ్‌గా ఏర్పడటం పార్టీనాయక మైన విషయమని భారతదేశ ఓటర్లు తీర్పును స్పష్టంగా ప్రకటించారు.

కలిసివస్తేనే యన్.టి.ఆర్.తో సహకరిస్తాం లేదా విభేదిస్తాం. అడుగులకు మడుగులొత్తే పరిస్థితి ఇకలేదు అని లచ్చన్నగారు స్పష్టంగా జనతాదళ్‌లో కలిసిన తదుపరి ప్రకటించారు. అంతేగాక శ్రీమతి ఇందిరాగాంధీ కోడలు సంజయ్‌గాంధీ భార్యయైన శ్రీమతి మేనకాగాంధీ కూడ తన సంజయ్ విచారమంచ్ పార్టీని కూడ రద్దుపరచుకొని జనతాదళ్‌లో విలీనం కావడం కూడా శుభపరిణామం.

1990 ఫిబ్రవరి నెల 1వ తేదీన విశాఖపట్నంలో తన పార్టీ విలీనం అయిన సందర్భంగా మాట్లాడుతు ప్రాంతీయపార్టీలకు ఇక మనుగడలేదని, కేంద్రంలో పాలన అయిన ఉపకరించగలవి దేశస్థాయి పార్టీలు తప్పించి ప్రాంతీయపార్టీలు కావని కుండబ్రద్దలుకొట్టినట్లు ప్రకటించారు. ఇందులో ఉద్దేశం దేశంలో పద్దెనిమిది మైన భావం నాలుగుపార్టీలు కలసి "జనతాదళ్"గా అవతరించిన తదుపరి

కేంద్రమున జనతాదళ్ అధికారం చేపట్టగలిగిందని కాంగ్రెస్‌ను ఓడించగలిగిందని ఇందుకు ఎంతగానో ఉపకరించినవి మొన్న జరిగిన ఎన్నికలలో విజయమంది దేశస్థాయిలో గలసి సి.పి.యం, బి.జె.పిలు తప్ప ప్రాంతీయపార్టీలు కావుకదా అన్నది తన విధానప్రకటనకు మూలమైయుంటుంది. ప్రాంతీయపార్టీలైన తెలుగుదేశం, ద్రావిడమున్నేట్రకజగం ప్రజలలో మొన్న నిలబడలేకపోయేవి. కేంద్ర శాసనసభ పార్లమెంటును వారి వారి రాష్ట్రాల తరుపున వారి వారి పార్టీల సభల్ని అంపించలేక పోయారు. మరి జాతీయ జీవనస్రవంతిలో భాగస్వామ్యం ఎలా వహించగలం. సిద్ధాంతపరమైన విషయం అయింది. దేశస్థాయి, రాష్ట్రస్థాయి పార్టీల మనుగడ అభివృద్ధి తెలుగుదేశం అధినేత యన్.టి. రామారావు ప్రాంతీయపార్టీల సమ్మేళనగా భారతదేశ స్థాయిలో National Front అని పేర్కొన్నాడు. దానిని రూపకల్పన ఇదే చేశాయని అన్నారు. ఈనాడు కాంగ్రెస్ గద్దెదింపినది నేషనల్ ఫ్రంట్ తప్పించి, జనతాదళ్ పార్టీ కాదన్నది ఆతని అభిప్రాయంకావచ్చు. అధికార కాంగ్రెస్‌ను ఓడించి తీరాలన్న భావంతో నేషనల్ ఫ్రంట్‌కు బీజం పడింది. మన రాష్ట్రంలోనే మన రాష్ట్రం నాటి తెలుగుదేశం అధినేత ఉత్సాహం చొరవలతోనే అన్నది జగద్వితం. ఏ ఒకరు కాదనలేది సత్యం. ఏడు పార్టీలలో నేషనల్ ఫ్రంట్ అవతరించింది. ఫ్రంట్ అధ్యక్ష పదవి రామారావుకే దక్కింది. కన్వీనర్‌గా జనమోర్చ నాయకుడు విశ్వనాధ్ ప్రతాప్‌సింగునకు లభించింది. తెలుగుదేశం ద్రవిడ మున్నేట్ర కజగం, అస్సాంగణతంత్ర పరిషత్, కాంగ్రెస్ (యస్), జనతాపార్టీలు. నేషనల్ ఫ్రంట్‌లు ఉన్న పార్టీలు.

జనతా, లోక్‌దళ్, యువమోర్చా పార్టీల నాయకులు ఏకపార్టీ జనతాదళ్‌గా రూపొంది ఒకే చిహ్నంపై ఐక్యమై పోటీ చేయాలన్న నిర్ణయం బెంగుళూరు కన్వెన్షన్‌లోనే జరిగింది. జనతాదళ్ ఏర్పడింది.

దేశ పరిపాలన కొనసాగిస్తున్నది జనతాదళ్‌పార్టీ-బిజెపి, సి.పి.యం. తోడ్పాడుతో నడుస్తున్నది. ఒకరి అభిప్రాయం భారతదేశంలో కాంగ్రెస్‌ను ఓడించి, అధికారాన్ని చేపట్టినది నేషనల్ ఫ్రంట్ అని వేరొకరి అభిప్రాయం. దేశస్థాయి పార్టీలే జాతీయ పార్టీలని, అవే దేశానికి ధరిత్రికి అవసరమన్నదొక వాదం-ప్రాంతీయ పార్టీలు దేశ జనజీవన స్రవంతిలో కలియగలవని దేశ భవిష్యత్‌ను తీర్చగలవన్నది వేరొకరి వాదం. ఏ వాదం నిజమన్నది తేల్చగలది సార్వజనీనాభిప్రాయమే అన్యదా నిరూపించ వీలు పడదు.

# 29వ ప్రకరణము
# వివిధ పార్టీలు-లచ్చన్న

వినాధాలు ఏ ఒకపార్టీని ఎంతకాలం నిలవలేవు. రాజకీయ సిద్ధాంతం అంటూ ఒకటి ఉంటేనే అది కలకాలం ప్రజల్లో కాపురముంటుంది. ఒకనాటికైన అది కాంతిరేఖల్ని విరజిమ్ముతుంది. భావసారూప్యం గల పార్టీలో చేరడం పార్టీ మార్చినట్లు కాదు. సమకాలిక వ్యూహం రాజకీయ ఎత్తుగడలో అదొక సంఘటన. సిద్ధాంతపరమైన మార్పిడి మాత్రమే వ్యక్తి అనిశ్చిత దృక్పదానికి సంకేతం. పార్టీ మార్పిడి క్రింద వస్తుంది.

## పార్టీ అనగానేమి?

ఏవో కొన్ని సూత్రాలు నిబంధనలు, కార్యక్రమాలు, ఉద్దేశాలు, లక్ష్యాలు సూత్రీకరించి ఒకచోట జేర్చి వీటిమీదనే మా పార్టీ నడుస్తుందన్న అది కొనసాగినట్లుగా అది అన్పించిన అది ఎల్లకాలం కొనసాగలేదు. ప్రజలు సైద్ధాంతిక ప్రియులు, స్వతహాగా స్వీయభావ ప్రేరితులు. ఇవి లేనిదే ఏ పార్టీ మనజాలదు. పార్టీ జనాభిప్రాయానికి ప్రత్యేక పార్టీ తప్పించి, ఏదో కొందరి వ్యక్తుల అభిప్రాయం. పార్టీ సిద్ధాంతం కాబోదు.

అందువలన పార్టీ అనగానే తప్పక దానికొక సిద్ధాంతం, ప్రణాళిక (మానిఫెస్టో) తప్పక ఉండాలి. పార్టీ పక్షంగానూ పిలవబడాలి. అధికార పక్షం రాజ్యాన్ని పాలిస్తుంది. అనధికారపక్షం లేక ప్రతిపక్షం ప్రభుత్వ పక్షం ఏ ఒక తప్పుడు పనిచేసిన దుందుడుకు చర్యకు పాల్పడిన ప్రజాహిత మాశించక శాసనాల్నిజేయ సమకట్టిన నిరంకుశ ధోరణుల్ని ప్రదర్శించిన శాసనసభలోన బయట అడ్డుకుంటుంది.

## ఉన్నవి ప్రతిద్వందిత ఖండనమండన రాజకీయ సిద్ధాంతాలు రెండే

పార్టీ సిద్ధాంతాల్ని లచ్చన్నగారి చరిత్రలో చూచాయిగా తెల్పాలి. వివరంగా వ్రాయ వీలు పడదు. అదొక గ్రంథం అవుతుంది. దేశానికి స్వతంత్రం వచ్చినప్పటి నుండి ఉనికిని కలిగి ఉంటూవస్తున్న పార్టీ కాంగ్రెస్. కారణం మిశ్రమ ఆర్థిక విధానం కలది, సామ్యవాదతరహా సమాజం స్థాపించ దలుస్తున్నది. తదుపరి కమ్యూనిస్టుపార్టీ ఉభయ కమ్యూనిస్టు పార్టీలు మనదేశాన్నే గాక ప్రపంచ వ్యాప్తంగా ఉన్నపార్టీలు. సోషలిష్టు ఆర్థిక విధానం కలవి. వ్యక్తుల ఆదాయ వ్యయాల మధ్య పరిణమానత ఉండాలని వాదిస్తున్నది. అవకాశాలు అందరికీ సమానంగా అందుబాటు ఉండాలంటున్నది. ఒకనాటి జనసంఘం నేటి భారతీయ జనతాపార్టీ తన ఉనికిని తదాదిగా కలిగిఉంటూ వస్తున్నది. దేశీయ పరిశ్రమలు వ్యాపించాలి. స్వీయ సంస్కృతి-సారస్వతాలివన్నీ సంరక్షించుకోవాలి. గాంధేయ ఆర్థిక విధానం కలది. భారతీయ సంస్కృతీ

నిదర్శనంగా నిలువగలది. ఇకపోతే స్వరాజ్యం రాకముందు నుండి ఆల్ ఇండియా కిసాన్ సభ స్థాపనలో రైతోద్యమం దేశవ్యాప్తంగా విజృంభించింది. రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతముపై దేశస్థాయిలో కిసాన్ ఉద్యమాలు వచ్చాయి. మన రాష్ట్రస్థాయిలో కృషీవరలోక పార్టీగా ఏర్పడినది. తదుపరి మరొక నాటికి భారతీయ క్రాంతిదళ్‌గా మారి మరల అదే పార్టీ భారతీయ లోక్‌దళ్ అయి నేడదే ''జనతాదళ్''గా అవతరణలో భాగమైంది. దీని సిద్ధాంతం కూడా మిశ్రమ ఆర్థిక వ్యవస్థ. రైతాంగానికి అన్నింటా వెసులుబాటు కల్పించడం ఆహార అధిక ఉత్పత్తుల్ని సాధించడం, స్వతంత్ర ఆర్థిక విధానం వెసులుబాటులు కల్పించడం.

పై తెల్పిన ''కాంగ్రెస్'' ''కమ్యూనిష్టు'' ''భారతీయ జనతాపార్టీ'' ''జనతాదళ్ పార్టీ''ల్లో కమ్యూనిష్టుపాత్ర, బి.జె.పి.ల కలయిక అనేది సిద్ధాంతరీత్యా అంగీకరించలేనిది అసంభవమైనది అన్నింటా తూర్పుపడమరలుగా అది నిలుస్తాయి. ఇక కాంగ్రెస్, జనతాదళ్ నిజానికి ఈ రెండు పార్టీ సిద్ధాంతాల్లో కొట్టవచ్చినట్లు భేదాలు ఉండవు. ఆర్థిక విధానం ఒకరికన్న వేరొకరు ఉన్నత స్థాయిలో అమలుచేస్తూ వుంటారు తప్పించి విభిన్నమైన ఆర్థిక సిద్ధాంతాల్ని అనుసరించనవకాశం లేదు. విప్లవాత్మకమైన సంభాషణల్ని ఏ ఒక పార్టీ అయిన తెచ్చిపెట్టవచ్చు. సిద్ధాంతాల్లో విభిన్నత లేనందున పై రెండుపార్టీల్లో రాజకీయ వ్యక్తులు అందులో ఉన్నవారు ఇందులో కన్పిస్తారు. అయితే కమ్యునిష్టు పార్టీలోనున్న రాజకీయవేత్తలు బి.జె.పిలో, బి.జె.పి.లో ఉన్న రాజకీయవేత్తలు కమ్యునిష్టుపార్టీలో ఉన్నారేమో పరిశీలించండి. ఒకపార్టీ ఉనికి వేరొక దానికి విరుగుడు. ప్రతి ద్వంధిత పార్టీలు తప్పించి కలసికట్టుగా ఏ సిద్ధాంత పోకడలు రెండింటికి కాంగ్రెస్, జనతాదళ్ పార్టీలు సిద్ధాంతరీత్యా విభిన్నమైనవి కావు. కలసికట్టుగా పోవాలన్న పోగలవు. స్థూల పరిశీలన జేసిన నిజానికి దేశంలో పార్టీలుగా మనగలిగిన రెండే రాజకీయ సిద్ధాంతాలున్నవి. ఎన్ని పార్టీలున్నవి అవిగాక ఎన్ని రాజకీయ సిద్ధాంతాలున్న పార్టీలున్నవి. దేశంలోగాని ప్రపంచంలోగాని ఉన్నపార్టీలన్ని తుదకు తమ సంబంధాల్ని ఏర్పరచుకొనేవి రెండు పార్టీలే. (1) ఆదర్శవాదం (ఐడియలిజం) (2) భౌతికవాదం (మెటీరియలిజం). వాద ప్రతివాదములు ఉద్భవించి తుదకు సమన్వయం రూపం ఏర్పడి మరల ఇది వేరొక రూపం సంతరించుకొంటుంది. ఆర్థిక సిద్ధాంతమైన, రాజకీయ సిద్ధాంతమైన వీనికి లోబడవలసిందే. ఒక దానినుండి కొన్ని మరొక దానినుండి మరికొన్ని పార్టీలు స్ఫురిస్తాయి. ''కేపటలిష్టు'' ''సోషలిష్టు'' అన్నవి రెండే. సోషలిష్టు వ్యవస్థలో కమ్యునిజం చివరి దశ తప్పించి అన్యదా కాదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ ఒక తరహామార్పు తప్పించి ఒక సిద్ధాంతంకాదు.

అయిన లోకోభిన్నరుచిః అని కదా పరస్పర విరుద్ధాంశాల సమతూకపు గమనమే సమాజము కదా. ప్రపంచ వ్యాప్తంగా ఒకే పార్టీ ఉండాలన్నది మానవ స్వభావరీత్యా కుదరనది. అతకనిది. ఆశయాలలో, లక్ష్యాలలో మానవత విభేదిస్తుంది. శాంతి సమైక్యతల స్థాపనలో సమైక్య మవుతుంది.

అందువలన "పార్టీ మార్పిడి, సిద్ధాంత మార్పిడి" ఒకటి కాదు. తను నమ్మిన రాజనీతి సిద్ధాంతాన్ని మార్చుకొని వేరొక రాజనీతి సిద్ధాంతాన్ని అనుసరించటానికి అడుగిడిన మరుక్షణం సిద్ధాంత మార్పిడి అవుతుంది. పార్టీ మార్పిడి అనిపించు కొంటుంది. భావ సమైక్యతగల పార్టీలో చేరడం, మారడం ఒక రాజకీయ సంఘటన తప్పించి పార్టీమార్పిడి కాదు.

## సర్దార్‌జీ తన స్వీయ సిద్ధాంతాన్ని ఏనాడు విడిచిపెట్ట లేదు

సర్దార్ గౌతు లచ్చన్న తన స్వకీయ రాజకీయ సిద్ధాంతాన్ని ఏనాడు వదులుకోలేదు. వేరొక రాజకీయ సిద్ధాంతాన్ని అనుసరించనూ లేదు. తన రాజకీయ సిద్ధాంతం మార్చుకొనని లచ్చన్నది పార్టీ మార్పిడి తప్పించి సిద్ధాంత మార్పిడి కాదు. సిద్ధాంతం మార్చుకోలేనందున పార్టీ మార్పుకాదు. ఒకదశ నుండి వేరొక దశను, ఒక సిద్ధాంతం అమలుపరచుటలో చేరుకోవడమే తప్పించి అన్యదా కాదు.

గౌతు లచ్చన్న ఆనాడు కాంగ్రెస్‌పార్టీలో ఈనాడువలె పావలాఇచ్చి సభ్యత్వం తీసికోలేదు. స్వరాజ్య సమరంలో పోరాడిన వారెల్ల కాంగ్రెస్‌పార్టీ వారైరి. కాంగ్రెస్‌పార్టీ స్వాతంత్ర సమరం కొనసాగించింది. ఒక నాణెం వైపుగల బొమ్మ బొరుసులుపై రెండు విషయాలు కాంగ్రెస్‌పార్టీలో నుండగా స్వాతంత్రోద్యమంలో పాల్గొని అదే సమయాన ఆల్ ఇండియా కిసాన్ సమ్మేళనలో ఆచార్య రంగా శిష్యరికంలో దూరి రైతోద్యమంలో కలిసారు. రాను రాను 1951 వచేసరికి తన గురువుకు తనకు దేశంలోగల రైతు కూలీల్ని కాంగ్రెస్ రక్షించలేదని తెలిసినందున కృషీవరలోక పార్టీకి రూపకల్పన చేసారు. రైతుకూలి ప్రజారాజ్య సిద్ధాంతాన్ని రంగాజీ లేవదీసారు. కమ్యూనిష్టుపార్టీకి కన్నెర్ర అయింది. శ్రామికులు పెట్టుబడిదారులు సమాజమున ఉంటారు. దోపిడకి లోబడిన వర్గం దోచుకొనే వారు తప్పించి మరల శ్రామికుల్ని రైతులని రైతుకూలీలని విడదీయడం సిద్ధాంతరీత్యా వీలుపడదని భూస్వామ్య విధానానికి ఆచార్య రంగాజీ రూపమిస్తున్నారని ఎదిరించారు. కాంగ్రెస్ మిశ్రమ ఆర్థిక వ్యవస్థను తప్పించి సోషలిష్టు వ్యవస్థను గాక సోషలిష్టు తరహా సమాజాన్ని రూపొందిస్తుంది.

1952లో జరిగిన ఎన్నికల్లో కమ్యునిష్టు ప్రాబల్యం శాసనసభలో పెరుగుతుందేమో నని పసిగట్టిన కాంగ్రెస్ మంతనాలతో కృషీవరలోక పార్టీతో కలసి ఐక్య కాంగ్రెస్‌పార్టీగా పిలవబడినది. అందువలన ఇది వ్యూహం ఎత్తుగడల మేరకు ఏర్పడిన రాజకీయ

సంఘటన తప్పించి ఇది పార్టీమార్పు కాదు. పార్టీమారడం ఏమిటి. సిద్ధాంతాన్ని మార్చడం ఏమిటో ముందుగనే వివరించారు.

## లచ్చన్న ఏనాడు కాంగ్రెస్‌పార్టీకి ఎదురు పార్టీలోనే ఉన్నారు

1957లో లచ్చన్న తన గురువు రంగాజీ కాంగ్రెస్ వ్యవస్థలో మరల కలియ నుద్దేశిస్తూ ఉండగా కాంగ్రెస్ విధానాల్ని ఆదినుండి ఎదిరిస్తున్న లచ్చన్న తను కాంగ్రెస్‌లో కలియటానికి సువర్ణావకాశం ఉన్న ప్రత్యక్ష అధికారయోగం రానున్నా తృణీకరించి, సమాజమున డెమోక్రటిక్ సోషలిజాన్ని సాధించాలన్న ఉద్దేశంతో డెమొక్రటిక్ సోషలిజాన్ని సాధించాలన్న ఉద్దేశంతో డెమొక్రటిక్ సోషలిస్టు నాయకుడు PVG రాజుతో ఆనాటి తెలంగాణా నాయకుడు మర్రి చెన్నారెడ్డి గారితో కలసి డెమొక్ర టిక్ సోషలిస్టుపార్టీని నడిపారు. అసమానతల్ని సంఘంలో లేకుండా చేయాలని లేక తగ్గించాలన్నది వారి సిద్ధాంతము. డెమొక్రటిక్ సోషలిజం, సోషలిజంలో ఇదొక రూపం.

లచ్చన్నగారు కాంగ్రెస్ పార్టీనుండి ఐక్య కాంగ్రెస్ అయిన పార్టీమార్చినట్టు కాదు కదా. డెమొక్రటిక్ సోషలిజంగాకాక మార్పుచేర్పులుతో సాధించడం నిజానికి మిశ్రమ ఆర్థిక వ్యవస్థ అవుతుంది. ప్రజాస్వామ్యం సోషలిజం కాదా. ఇంతవరకు పార్టీల సిద్ధాంతం వాటి భావస్వరూపాలు ఒక్కటే విభేదము ఒక్కపార్టీల పేర్లలోనే గావించారు.

అయితే 1962లో మాత్రం లచ్చన్న స్వతంత్రపార్టీలో చేరారు. స్వతంత్రపార్టీ స్థాపకులు రాజగోపాలాచారి రాజకీయ మేధావి. రాంగాజీ దీని అధ్యక్షుడు. నిజానికి సిద్ధాంతం కొన్నిదేశాల్లో ప్రపంచ వ్యాప్తంగా ఉంటూ వస్తున్నది. వ్యక్తిగత స్వేచ్ఛ ఆర్థిక స్వేచ్ఛ, స్వంత హక్కు లుండాలని వాదించిన పార్టీ ఇది. డిమాండ్ల సప్లయిమేరకు వస్తువుల ధరలు నిర్ణయింపబడతాయి. అర్హత సామర్థ్యాలు మేరకే ప్రతిఫలం ప్రతి ఒకనికి అందుతాయి. సిద్ధాంతం వ్యక్తి ఉత్సాహం చొరవ, దూరదృష్టి, పట్టుదల, నైపుణ్యం, స్వంత ఆస్తిహక్కు కల్పించనిదే అవి కొరవడతాయన్నది దీని మూలసిద్ధాంతము.

లచ్చన్న రాష్ట్ర స్వతంత్రపార్టీ అధ్యక్షులై రాజగోపాలాచారి, రంగాజీలతో రాజకీయాలు నడిపి నెహ్రూజీ రాజ్యాంగంమార్చి స్వతంత్ర ఆస్తిహక్కును హరింపజేయటానికే సిద్ధపడగా ప్రజాందోళనను జరిపి దానిని నివారించిన వారు లచ్చన్న. సోషలిజం తరహా ప్రజాస్వామ్య సోషలిజాన్ని స్థాపిస్తామని గాక వ్యక్తి ఉత్సాహం, చొరవ-శక్తి సామర్థ్యాల మేరకు ప్రగతి అందాలన్న వాదనను చేపట్టారు. బలహీన వర్గాలు తగిన అవకాశాలు లేక ప్రభుత్వం వాటిని కల్పించిన వారు దీనస్థితిలో నున్నారని వాదించారు. స్వతంత్రపార్టీ ఏనాటిది 30 ఏండ్ల నాటిది. స్వతంత్రపార్టీ సిద్ధాంతపు చాయలు మరల ఈవాడు ఆధునిక యుగంలో నేడు ''పెరిస్రాయిక'' ''గ్యాన్‌నోస్తలు''న్న పేర్లతో కరడుకట్టిన కమ్యూనిస్టు దేశాల్లో మరల కనిపిస్తున్నాయి. అజ్ఞానులు, అమాయకులు

అసంఖ్యాక ప్రజానీకం స్వతంత్రపార్టీని బలపరచలేదు. బలవంతులపార్టీ అని ప్రక్కకు రాలేదు. ప్రజలు కాదన్న పార్టీని ప్రజానాయకుడు విడిచిపెట్టిన అది పార్టీమార్పు కదా. ప్రజాభిమానం కాపాడుకోవటం కోసం ప్రజల్ని అనుసరించడం ఉత్తమం.

## రైతోద్ధరణ–బలహీన వర్గాల బాగే ఏనాడు తన రాజకీయ లక్ష్యం

1973వ సంవత్సరంలో ఉత్తర భారతంలో ఉత్తరప్రదేశ్ మాజీ ముఖ్యమంత్రి జాట్స్ నాయకుడు, రైతు బాంధవుడు చౌదరి చరణ్‌సింగ్ సాహెబ్ మరల రైతోద్ధరణ కొరకు సిద్ధపడినారు. కాంగ్రెస్ నుండి బయటకు వచ్చారు. గౌతు లచ్చన్నకు ఈ రైతు రంగా నాయకత్వం పోయిన తక్షణం ఆ రైతు బాంధవుడు ఆదరణ నాయకత్వం లభించింది. తను ఒకనాడు నడిపిన రైతులపార్టీ KLP లోనిదే తప్పించి కొత్తపార్టీ కాదు. కొత్త సిద్ధాంతముకాదు. అందువలన లచ్చన్నగారు ఈ పార్టీలలో చేరడం తనేమో ఏదో కొత్తపార్టీలో చేరినట్టు కాదు. తన సొంతపార్టీలోనికి మరల మారిన పరిస్థితుల వలన వెనుదిరిగి వెళ్లినట్లయింది. నిజానికిది పార్టీమార్పిడి గాక తన పూర్వపు రాజకీయ సిద్ధాంత స్థితిగతులలోనికి మరల అడుగిడినట్లయినది. భారతీయ క్రాంతిదళ్‌లో తను చేరడంతో కూడ అంతే.

1978లో ఎమర్జన్సీ ప్రకటించడం తనను నిర్బంధించడం జరిగింది. అత్యవసర పరిస్థితిని ఎదుర్కొన్నారు. రాజకీయ నాయకులెందరిని నిర్బంధించినారు. జైల్లో చేరిన రాజకీయ నాయకులలో వినూత్నమైన సమైక్యభావం వెల్లి విరిసింది. ఆ భావనకు రూపకల్పన చేసినది సర్వోదయ నాయకుడు జయప్రకాష్ నారాయణ. దేశస్థాయిలోగల నాలుగు ప్రధాన రాజకీయ పక్షాలు ఒకేపార్టీగా కలిసి ఒకేగుర్తుపై ప్రజలముందుకు వెళ్లాలని నిర్ణయించారు. జనతాపార్టీగా అవతరించాయి. దేశస్థాయిలో జరిగిన ప్రధాన రాజకీయ సంఘటన భారతీయ క్రాంతిదళ్ ఇందులో చేరినది. తత్ఫలింతగా జనతా పార్టీ సభ్యతం, నాయకత్వం లచ్చన్నగారికి లభించింది. ఇది ఉద్దేశపూర్వకంగా జరిపిన పార్టీమార్పు కాదు. తనపై వచ్చిపడిన ఒకానొక జాతీయ సంఘటనతోడైన మార్పు. సోషలిష్టు నాయకుని ప్రేరణ ప్రోద్బలాలతో ఏర్పడిన జనతాపార్టీ నాయకత్వాన్ని ఆంధ్రప్రదేశ్‌లో వహించిన ఘనత లచ్చన్నగారికి లాభించినది. రాష్ట్ర శాసనసభ ప్రతిపక్ష నాయకునిగా మరల రూపొందారు.

విభిన్న రాజకీయ సిద్ధాంతాలపై అవతరించి ఏదో ఒక జాతీయ సంఘటనకు లోనయి ఎవరో ఒకరిని నిర్జించాలని తాత్కాలికోద్రేకానికిలోనయి ఒకటిగా కలసి రూపొందిన నాలుగు పార్టీలు మరల వాటి వాటి పూర్వపు పార్టీల యదాస్థితిగతుల్ని పొందాయి. మల BKD భారతీయ లోక్‌దళ్‌గా పునరావృతమైంది. రాష్ట్రస్థాయిలో జనతా విచ్ఛిత్తి అయినందున మరల లచ్చన్నగారు తన రాజకీయాల్లో ఉనికిని

విశ్చ్రయించుకొనే పరిస్థితికి లోనయ్యారు. విచ్చిత్తికి ఎంతో ఆవేదనచెంది ఢిల్లీచేరి ఒకటిగా ఉందామన్న జాతీయ నాయకులు అంగీకరించనందున భారతీయ లోక్ దళ్ ఆవరికే రెండుగా లోక్ దళ్ (బహుగుణ), లోక్ దళ్ (అజిత్ సింగ్) అయినందున ఆంధ్రప్రదేశ్ మేరకు తను స్వతంత్రమైన కేంద్ర పార్టీకి దూరంగాఉన్న ఎ.పి. లోక్ దళ్ పార్టీగా మనగడమే మంచిదని రాష్ట్రమున తనదైన ఎ.పి. లోక్ దళ్ పార్టీ అధ్యక్షులుగా కొనసాగుతూ వచ్చారు. భారతీయ లోక్ దళ్ నుండి జాతీయ రాజకీయ ప్రభావం వలన మార్పునకులోనై మరల ఎ.పి. లోక్ దళ్ పార్టీ అధ్యక్షునిగా తనుండటం పార్టీల్ని తను మార్చినట్లు కాగలదా? కృషివరలోక పార్టీ భారతీయ క్రాంతిదళ్ పార్టీ భారతీయ లోక్ దళ్, ఎ.పి. లోక్ దళ్ పార్టీలు సిద్ధాంతం. భావనమైక్యతను కలిగిన పార్టీలు తప్పించి ఒక పూలకుండీలో ఒక చెట్టును విరసిన రెమ్మలు తప్పించి అన్యదా కావు. ఒకే రీతి వీతి రాజకీయ సిద్ధాంతాలు కలవి. విభిన్నమైన రాజకీయ సిద్ధాంతాలుకల రాజకీయు పార్టీలుకావు. లచ్చన్నగారు తన పార్టీ సిద్ధాంతాల్ని మార్చుకోలేదని సాధారణ వ్యక్తికి తెలియకపోయిన మేదావి వర్గమునకు తెలిసి తీరుతుంది. తన రాజకీయ సిద్ధాంతాల్ని మార్చుకోలేదు.

ఇక తన ఆశయానికి బద్ధుడై SC, ST, BC ల్ని బాగుచేయాలని సమ్మేళనల్లో దేశస్థాయిలో పాల్గొని ఆ సమ్మేళనకు అధ్యక్షత వహించారు. దళిత మజ్దూరు కిసాన్ మహాసభ పేర అధ్యక్షత వహించి వారి బాగోగుల్ని గూర్చి ఎంతో ఆవేదన, తపనకు లోనయ్యారు. చివరికి వామపక్షాలతోచేరి వామపక్ష ప్రజాస్వామ్య ఐక్యసంఘమునకు కారకులయ్యారు. ఇవన్నీ పార్టీమార్పిడి కాదు.

రాజకీయ విజ్ఞానంలేక అక్షరజ్ఞానంలేని వారికి తప్పించి రాజనీతి విజ్ఞానంలో కొన్ని పరిజ్ఞానంఉన్న వారెన్నటికి పార్టీమార్పిడి సిద్ధాంతమార్పిడి ఒకటిగా భావించరు. మరల ఈనాడు లచ్చన్నగారు జనతాదళ్ లో చేరారు. జనతాదళ్ అనగానే తనకు పూర్వం మునుగడ కల్పించిన జనతా, భారతీయ లోక్ దళ్ స్పురణకు వస్తాయి. గతంలో తను వదిలేసిన పార్టీల్లోనే మరల తను చేరడం పార్టీమార్పు క్రిందరాదు కదా. సిద్ధాంతాలు మారలేదు. ఆశయాల లక్ష్యాలు చెదరలేదు. పార్టీల పేర్లు మారుతూ వస్తున్నాయి. రైతోద్ధరణ జరగాలి. బలహీన వర్గాలు బాగుపడాలి. దోపిడీ వ్యవస్థకు నూకలు చెల్లాలి. కాంగ్రెస్‌పార్టీ నిరంకుశ పాలనా ధోరణులు మారాలి. ప్రజాస్వామ్యం రక్షించడం ఈ ఆశయాల లక్ష్యాలు లేనిపార్టీలో లచ్చన్న చేరలేదు. ఒకమారు తన గతజీవిత రాజకీయ చరిత్రను పరిశీలించండి.

~~20వ ప్రకరణము~~

# ఆంధ్రప్రదేశ్ సమకాలీన రాజకీయ రణరంగ భీష్ముడు సర్దార్ గౌతులచ్చన్న

''గాంధీ'' అనే పదం ప్రజా బాహుళ్యంలోనికి ఎంత చొచ్చుకొని పోయిన ఏ గాంధీ అన్న ప్రశ్న వస్తుంది. ఐతే లచ్చన్న అనగానే ఆంధ్రదేశంలో ఏ ఒకరు ఏ లచ్చన్న అని ప్రశ్నించరు. ఎల్లరకు తెలసినది ఒకే ఒక లచ్చన్న. అదే సర్దార్ గౌతు లచ్చన్న. ఒకరు ఇంటి పేరున వేరొకరు వ్యక్తి పేరున చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోతారు.

నేటి యువతరానికి యీనాటి సర్దార్ గౌతు లచ్చన్న రాజకీయ జీవిత చరిత్ర అంతగా తెలియక పోవచ్చు. నిజానికి ఏనాటి వారు లచ్చన్న. 1930లో జరిగిన ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్న స్వాతంత్ర్య సమరయోధుడు. జైళ్లలో మ్రగ్గిన దేశ భక్తుడు. దేశమాత శృంఖలాన్ని ఛేదించి నిలిచిన గాంధేయవాది. ఒకనాటి కాంగ్రెస్ వాది. ఇటీవలనే సహస్రమాసాల చంద్ర దర్శనోత్సవం జరుపుకొననున్న సర్దార్ గౌతు లచ్చన్న, నేటికి క్రియాశీల రాజకీయాలలో మనగలగడం అతని అకుంఠిత దేశాభిమానానికి, బలహీన వర్గాలు బాగుపడాలన్న అతని ప్రగాఢ ఆకాంక్షకు, పేద రైతాంగం బ్రతికి బట్టకట్టాలన్న అతని చిరకాల వాంఛకు పీడిత తాడిత ప్రజానీకం అన్నింట ముందడుగేయాలన్న అతని తపనకు ప్రబల నిదర్శనాలు.

## ప్రజా నాయకునిగా లచ్చన్న

లచ్చన్న లోక్‌దళ్ జనతాదళ్‌లో విలీనం కావడం విశేషం కాదు నాటికి నేటికి ఏనాటికి అధికార కాంగ్రెస్ మదగజానికి అంకుశంలా ఉండటమే అతన ధ్యేయం. దేశాన్ని బూర్జువాపంథాలో నడిపిస్తున్న కాంగ్రెస్‌ను ఎదిరించడమే అతని ఆశయం. అతని ఎడతెగని విశ్రమించని పోరాటానికి ఊపిరి ఊత. దశాబ్దాల తరబడి దేశాన్ని పాలించిన కాంగ్రెస్ బలహీన వర్గాల్ని బాగు చేసిందా? దళిత జనుల నేపాటి ఉద్ధరించింది. రైతాంగాన్ని ఏ మాత్రం ఆదుకుంది. సమాజమున గల ఆర్థిక వ్యత్యాసాల్ని పెంచింది తప్పించి తగ్గించలేకపోయింది.

కాంగ్రెస్ పార్టీతో భేదించిన గురుశిష్యులు ఆచార్య రంగా-సర్దార్ గౌతు లచ్చన్న ఇరువురూ 1951లోనే కృషివరలోక పార్టీని స్థాపించారు. రైతు కూలీ ప్రజా రాజ్యాన్ని స్థాపించాలని కలలుగని ఆంధ్రాలో బలమైన రాజకీయ పార్టీని సృష్టించార్ను.

1955లో ఆంధ్ర రాజకీయాలలో అతివాద మిత భావాలు చెలరేగాయి. ఆదిను

సిద్ధాంత రీత్యా కమ్యూనిజాన్ని వ్యతిరేకించిన రైతురంగా తన వ్యూహం ఎత్తుగడ లను మార్చి ఆనాటి భారతదేశ ప్రధాని జవాహర్‌లాల్‌తో చేతులు కలిపి ఐక్య కాంగ్రెస్ పార్టీ రాష్ట్రంలో రూపొందించేలా చేసారు. గురువుని అనుసరించి శిష్యునిగా సర్దార్‌జీ ఉండిపోయారు. గంగా యమునల సంగమంగా ఐక్య కాంగ్రెస్ పార్టీలో ఇరువురు కలసి కొంత కాలం ప్రయాణించారు.

సర్దార్జీ స్వతహాగా ఆదినుండి విప్లవ భావాలు సోషలిష్టు ఆశయాలు కలిగిన వ్యక్తి బలహీన వర్గాల సమాజము నుండి ప్రభవించిన రాజకీయవాది దేశస్థాయిలో రామ్‌మనోహర్ లోహియా స్థాపించిన సోషలిష్టు పార్టీకి రాష్ట్రమున నిష్కళంక దేశభక్తుడు. పి.వి. రాజు నాయకత్వం వహించగా అతనితో చేతులు కలిపి ఆంధ్రలో సోషలిష్టు ఉద్యమం వ్యాప్తికి రైతాంగాభివృద్ధికి అహర్నిశలు కృషి సల్పారు. 1957లో సోషలిష్టు డెమోక్రటిక్ అవతరించింది. నేటిమన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డిగారు అందులో ప్రధాన పాత్ర పోషించారు.

లచ్చన్న గారికి పార్టీలు పెట్టి అందువలన వచ్చే పదవుల్ని చేతపట్టి అధికార పదవుల్ని అందాలనే అభిలాష ఉన్నా నేటికి మన ఆంధ్రప్రదేశ్‌కు ఎన్నోమార్లు ముఖ్యమంత్రి కాగలిగేవారు. అతని గతరాజకీయ జీవిత చరిత్ర పుటల్ని చదువగలి గిన వారికిది తెలుస్తుంది. అధికార పార్టీలో తాను ఏనాడు చేరలేదు.

ఆతని ఆశయం నిరుపేద రైతాంగం బాగుపడాలి. అతని లక్ష్యం బలహీన వర్గాలు బయటకు రావాలి. సమాజమున బలమైన వర్గాల దోపిడి, పెత్తనం పోవాలి. ఇలాంటి మహత్తర బృహత్తర లక్ష్యాల్ని సాధించిన రాజకీయవాది. పదవులతో పార్టీలతో ఏనాడు సరిపెట్టుకోలేదు. ఆవేదన ఆకాంక్షలో మార్గాల్ని అన్వేషిస్తారు. ఆ అన్వేషణలోనే భారతదేశ స్థాయిలో స్వతంత్రపార్టీని 1958లో స్థాపించిన శ్రీ చక్రవర్తి రాజగోపాలాచారి నాయకత్వం వహించిన లచ్చన్న అసెంబ్లీలో బలమైన ప్రతిపక్ష నాయకునిగా మనగలిగారు. నాటి స్వతంత్ర పార్టీ ఉపాధ్యక్షులు నేటి మన కాంగ్రెస్ పార్టీ ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డిగారే.

లచ్చన్నగారు స్వతంత్ర పార్టీలో ఉండగా రెండు వేర్పాటు ఉద్యమాల్ని ఎదుర్కొన్నారు. లచ్చన్న తిరుగులేని ఏర్పాటువాది చిన్న రాష్ట్రాలకు దేశానికి శుభకరం అన్నది అతని అభిప్రాయం.

1972లో ప్రజల నాడిని పసిగట్టిన లచ్చన్న స్వతంత్ర పార్టీ ప్రజల ఆశలు, అభిలాషకు అనగుణంగా లేదని దేశ స్థాయిలో చౌదరి చరణ్‌సింగ్ స్థాపించిన భారతీయ లోక్‌దళ్ పార్టీలో చేరి రాష్ట్ర నాయకత్వాన్ని స్వీకరించారు. ఆనాటి రాష్ట్ర

స్థాయి కాంగ్రెస్ పార్టీకి ప్రతిఘటించగల శక్తిగల పార్టీగా యల్.డి.పార్టీ ఉండేది.

ఉత్తరాది రాష్ట్రాల్లో బలీయమైన శక్తిగా రూపొందిన భారతీయ లోక్‌దళ్ పార్టీ కాంగ్రెస్ పార్టీని ఎదిరించగలదని భావించిన లచ్చన్న ఆ పార్టీలో చేరగా అతని గురువు రైతురంగా కాంగ్రెస్ పార్టీలో చేరడం జరిగింది. అయినా లచ్చన్న పోరాట లక్ష్యాన్ని విరమించుకోలేదు. అధికార పార్టీలో చేరిన తనకు పదవులు ఖాయమైన తన ప్రజలకు అన్యాయం చేయలేనన్న బాధతోనే నేటికి ఉండిపోయారు. ఆనాడు తన స్వతంత్రపార్టీని తన గురువు తనను విడిచి అధికార కాంగ్రెస్‌లో చేరగా భారతీయ జనతాదళ్‌లో విలీనం చేసారు. రాష్ట్ర లోక్‌దళ్ పార్టీ అధ్యక్షునిగా ఎన్నిక కాబడినారు.

దేశంలో అత్యవసర పరిస్థితిని ప్రకటించడంతో ప్రతిఘటిస్తూ అనేక దేశ భక్తులు జైళ్ళలోనకి వెళ్లారు. అందులో ఒకరు లచ్చన్నగారు. లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్ ఇచ్చిన పిలుపుమేరకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పరిరక్షించటానికి దేశ స్థాయిలో ఆనాటనున్న నాలుగు ప్రధాన పార్టీలు కాంగ్రెస్ (యస్), జనతా సంఘం, భారతీయ లోక్‌దళ్, సోషలిస్టు పార్టీ సమైక్యమైనాయి. జనతా పార్టీగా ఆవిర్భవించాయి. ఆ మేరకు మన రాష్ట్రమున గల భారతీయ లోక్‌దళ్ పార్టీ అదృశ్యమై రాష్ట్ర జనతా పార్టీగా రూపొందడం, జనతా పార్టీ రాష్ట్ర నాయకత్వాన్ని లచ్చన్నగారే అధ్వర్యం వహించడం జరిగింది. ఎన్నికల్లో జనతాపార్టీ ఘన విజయాన్ని సాధించింది. ఐతే కేంద్రమున గల జనతాపార్టీ తన అధికారాన్ని గోల్పోయి మరలా భారతీయ జనతా పార్టీగా భారతీయ లోక్‌దళ్ పార్టీగా రూపుదాల్చింది. అదే ఆంధ్రప్రదేశ్‌లో గల భారతీయ లోక్‌దళ్ పార్టీ రెండుగా చీలిపోయి ఎ.పి. లోక్‌దళ్ పార్టీ లచ్చన్నగారి అధ్యక్షతను నిలిచింది.

కేంద్రమున జనతా పార్టీ విచ్ఛిన్నమవటం మరల కాంగ్రెస్ అధికారంలోనికి రావటం లచ్చన్నను నిలువున కృంగదీసాయి. నూతనంగా ఏర్పడిన తెలుగుదేశం ప్రాంతీయపార్టీని పరోక్షంగా బలపరచడానికి లచ్చన్నగారు సిద్ధపడినారు. కారణం నాడు ఈనాడు ఏనాడు అధికార కాంగ్రెస్ పార్టీని విధానాన్ని త్రిప్పికొట్టడమే. తెలుగుదేశం పార్టీకూడా మాటలలో తప్పించి చేతలో ఆశయాలను నిరూపించుకోలేనందున మరల లచ్చన్న తన పార్టీని దేశస్థాయిలో ఏర్పడి, తన పార్టీ మాతృ సంస్థలో భాగస్వాములైన జనతాదళ్‌లో తన ఎ.పి. లోక్‌దళ్ పార్టీని నేడు విలీనం చేస్తున్నారు. జనతా పార్టీలోతాను ఒకనాడు ఆంధ్రలో పేరెన్నికగన్న నాయకుడు. లోక్‌దళ్ పార్టీలో తన రాజకీయ అభిమాన నాయకుడు రైతు బాంధవుడు ఒకనాటి భారత మాజీ ప్రధాని చౌదరి చరణ్‌సింగ్, నేటి భారత ఉప ప్రధాని దళిత జన

బాంధవుడు దేవీలాల్ ఉన్నారు. ఈ రెండు పార్టీల సమ్మేళనానికి వచ్చిన వారు వేరు జనతా, జనతాదళ్ తప్పించి అన్యదాకాదు కదా.

మరలా రాజకీయ చరిత్ర పునరావృతం అవుతుంది తప్పించి, ఇందులో పార్టీల మార్పిడి అన్నది ఏమీలేదు. రైతాంగానికి వెన్నెముకగా నడిచే పార్టీని బలహీన వర్గాన్ని బాగుపరచే పార్టీని మాత్రమే సమర్థిస్తారు. పదవులవైపుగాక ఆశయాలను సాధించే పార్టీలవైపే తను వెళుతుంటారు. దేశాన్ని తప్పుద్రోవలో నడిపిస్తున్న కాంగ్రెస్ అధికారాన్ని మట్టి కరిపించడమే తన ఆశయమని అందుకు తగిన ఆయుధంగా ఉపయోగపడగల ఏ పార్టీలోనైనా తను చేరడానికి సిద్ధమే. ఏ పార్టీ తనకు ఉపకరించాలన్నది తన ప్రశ్నకాదు. పార్టీలను మార్చి అధికార పదవులను చేపట్టాలన్నది తన ఆశయం కాదు. దేశంలో 40 యేండ్లుగా సోషలిష్టు సమాజాన్ని కాక సోషలిష్టు తరహా సమాజాన్ని స్థాపిస్తామంటున్న భూటకపు నినాదంతో ప్రజలను మోసగిస్తున్న కాంగ్రెస్ పార్టీని గద్దె దింపాలి. అధికారం పొందటం తన ధ్యేయం కాదన్నది తన గత రాజకీయ జీవితము ప్రబల సాక్ష్యం.

స్వరాజ్య సాధన దిశలో 1930లో ఉప్పు సత్యాగ్రహంలో అరెస్టయి చెరసాలలో మ్రగ్గిన వారు లచ్చన్న. గాంధీజీ పిలుపుపై స్థానిక హరిజనోద్యమమును 1932లో నిర్వహించారు లచ్చన్న. 1935లో విప్లవ అరుణ కిరణమై బోసుబాబు సిద్ధాంతాలకు లోనై బెంగాల్ తదితర ప్రాంతాలకు వెళ్ళి విప్లవపంథా చేపట్టాలని ఉవ్విళ్ళూరిన వారు లచ్చన్న.

అఖిల భారత దేశ స్థాయిలో రంగాజీ స్వాతంత్ర్యోద్యమముతో పాటు రైతోద్యమము అవసరమని కొనసాగించగా అందులో లచ్చన్న ఉద్యమకర్తగా ప్రవేశించి 1934లో రంగాజీ నడిపిన వేసవి రాజకీయ పాఠశాలలో శిక్షణ పొందారు. రంగాజీ ఆధ్వర్యమున ఉత్తరాంధ్రలో ఆంధ్రలో రైతుయాత్రలు, పోరాటాలు కొనసాగాయి. రైతోద్యమము శిబిరాలు నెలకొన్నాయి. జమీందారి విధానం అంతరించాలని రైత్వారీ విధానం అమలు కావాలని రంగా లచ్చన్నలు సమరశంఖం పూరించారు.

ఉత్తర ఆంధ్రాలో రైతురక్షణ సంఘమును స్థాపించి పుల్లెల శ్యామసుందరం ముందు నడువగా తననాశీర్వదిస్తుండగా భూములపై రైతలకు పట్టా హక్కును కలిగించాలని సాగు చేసుకొంటున్న భూములపై రైతులను తొలగించరాదని, వడ్డీపెరిగిన రైతాంగం అధిక శిస్తులను కట్టలేదని జమీందారీల జులుం అంతరించాలని గంజాం జిల్లా రైతురక్షణ సెక్రటరీగా లచ్చన్న ఎనలేని కృషి చేసారు. చీకటి జమీందారు తర్లాం జమీందార్, పర్లాకిమిడి, సురంగి ఎస్టేట్లలోగల రైతాంగాన్ని ఆదుకొన్న వాడు లచ్చన్న. కురుపాం బొబ్బిలి జమీందార్లపై కొనసాగిన స్థానిక

రైతు పోరాటంలో రైతులకు కొండంత బలంగా నిలచిన వాడు లచ్చన్న. బారువా ఉర్లం ప్రియాగ్రహారం నందిగాం మైనర్ ఎస్టేట్లపై చావుదెబ్బ తీసినవారు లచ్చన్న.

జనతా పార్టీతో పోరాడిన కాంగ్రెస్ పార్టీకి ఘన విజయం ఉత్తరాంధ్రలో కొని తెచ్చినవాడు లచ్చన్నగారు. బొబ్బిలిరాజాను ఓడించడమేగాక తన పుల్లెల శ్యామ సుందరంగారిని గెలిపించుకున్న రాజకీయ నాయకుడు.

రైతురంగా తన గురువుగారు లచ్చన్నను 1938లో ఆదేశించినమేరకు రైతు రక్షణ మహాయాత్రను అసంఖ్యాక రైతులతో ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకూ కాలినడకను జరిపించిన ఘనత సూత్రదారి లచ్చన్నకే దక్కుతుంది. ఆనాటి మద్రాసు రాష్ట్రానికి కాంగ్రెస్‌నేత రెవెన్యూమంత్రిగా నున్న టంగుటూరి ప్రకాశం పంతులుగారు రైతుల తరపున జమీందారీ విధానం పోవాలని మహా విజ్ఞాపన పత్రాన్ని అందించారు.

1940 నాటికి కాంగ్రెస్ పార్టీలో అంతర్గత విభేదాలు రాష్ట్రస్థాయిలోగాక దేశ స్థాయిలో చెలరేగాయి. సిద్ధాంతరీత్యా కమ్యూనిష్టులతో భేదించిన రంగాగారి అధ్యక్షతను ఆల్ ఇండియా కిసాన్ సభలను తన ప్రాంతములో గల పలాసాతో జరిపించి కిసాన్ ఉద్యమానికే తలమానికంగావించిన రైతు బాంధవుడు లచ్చన్న.

రైతురంగా పిలుపునిచ్చే "రారోయిరైతన్న మనకు అండ లచ్చన్న- మనకెం దుకు భయమన్న అంటు 1941లో చరిత్రాత్మక మందస రైతాంగం పోరాటం జరిగింది. జమిందారీ పెత్తనాన్ని ఎదిరించి నమందసా రైతుల్ని ఆదుకోవడానికి న్యాయపరంగా రక్షించడానికి అండర్ గ్రవుండ్ పోరాటానికి దిగిన అకలంక దేశ భక్తుడు లచ్చన్న.

1942లో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభంకాగానే కళింగ సీమలో ఉద్దానం ప్రాంతంలో తన దేశభక్తి కార్యక్రమాలను తీవ్రతరం చేసారు లచ్చన్నను కనిపిస్తే కాల్చివేయమని, పట్టిచ్చిన వారికి 10 వేల రూపాయలు బహుమతిని ప్రభుత్వం ప్రకటించింది. ఐతే మద్రాసులో జరగనున్న దక్షిణ ఆంధ్ర విప్లవకారుల సమావేశా నికి కిల్లి అప్పలనాయుడుతో వెళుతుండగా రాజమండ్రిలో పట్టుబడి జైలులో నిర్బంధించబడినారు. 1945 వరకు రాజకీయ ఖైదీగా రాయవెల్లూరు, బళ్లారి, తంజావూరు జైళ్లలో గడిపారు. సిద్ధాంత రాజకీయాలు నడిపించగల దిట్ట అని అనిపించుకున్నారు.

1946లో తన గురువు రంగాజీ రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షత వహించగా కాంగ్రెస్ ఆర్గనేజేషన్‌లో సేవా సంఘాలను, కార్మిక సంఘాలను నిర్మించే బాధ్యత లచ్చన్న

గారి వంతు వచ్చింది. పలాసా కాంగ్రెస్ సేవాదళం ఏర్పడింది. ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ రాష్ట్రశాఖ ఫౌండర్ ప్రెసిడెంట్, రాష్ట్ర కార్మికోద్యమ నిర్మాత లచ్చన్నగారు నాటి విశాఖ షిప్‌యార్డ్ కార్మికసంఘమునకు అధ్యక్షత వహించినది లచ్చన్నగారే. తన వివాహం తన దేశ సేవకు ప్రతిబంధకమని దేశానికి స్వాతంత్ర్యం వస్తేనే తప్పించి వివాహం చేసుకొనని భీష్మించిన లచ్చన్న రంగాజీ మందలించినందున వైవాహిక జీవితము లేని వ్యక్తికి సామాజిక గౌరవము లేదని తను భావించి నందున శ్రీమతి యశోదాదేవిని 1948 మార్చి 28వ తేదీన వివాహమాడారు. అదే సమయమున విశాఖ "జల ఉష" రాకను ప్రజోత్సవానికి నౌకను ప్రజోత్సవానికి అరుదెంచిన భారతప్రధాని జవహర్‌లాల్ నెహ్రూకి విశాఖలో స్వాగతమిచ్చిన కార్మికనాయకుడు లచ్చన్నగారే.

అఖిలభారత అధ్యక్షుని ఆదేశానుసారం బర్మాలో శాంతిస్థాపనకు మనదేశ ప్రతినిధికా వెళ్లివచ్చి విశాఖ, తూర్పుగోదావరి జిల్లాకార్మిక నియోజకవర్గమునుండి కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీచేసి కమ్యూనిష్టు, సోషలిస్టు అభ్యర్థుల్ని ఓడించి, ఉమ్మడి మద్రాసు రాష్ట్రశాసన సభ్యుడిగా ఎన్నికకావడంతో తన అధికార రాజకీయ జీవితం ప్రారంభమైనది.

మద్రాసునుండి ఆంధ్రరాష్ట్రం ఏర్పడటానికి తన వంతు కృషి సల్పినవారు లచ్చన్న పార్టీషన్ కమిషన్ సభ్యునిగా వ్యవహరించినవారు లచ్చన్న. 1951లో సిద్ధాంతపరమైన విభేదాల కారణంగా కాంగ్రెసునుండి వెలువడి రంగా, లచ్చన్నలు కృషీవరలోక పార్టీని స్థాపించడం జరిగింది. ఎన్నికలలో ఘనవిజయం సాధించిన కె.ఎల్.పి. తరుపున 1950 నవంబరు 7వ తేదీన ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా ఏర్పడిన కాంగ్రెస్ రాష్ట్రమంత్రి వర్గంలో వ్యవసాయ, కార్మిక శాఖామాత్యులుగా చేరారు. ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి, ఆర్థిక శాఖామాత్యులు తెన్నేటి విశ్వనాథంగారు.

## పడకకుర్చీ రాజకీయాల్ని బద్దలుకొట్టిన వాడు-లచ్చన్న

పడకకుర్చీ రాజకీయపీఠాన్ని బద్దలుకొట్టి ప్రజాబాహుళ్యంలోనికి రాజకీయాల్ని తెచ్చినవాడు లచ్చన్న గాలికి ఎగిరివచ్చి ఒకే గంతువేసి గద్దెనెక్కి, గంధర్వాంశమును పొందినవారు కాదు. లచ్చన్న స్వరాజ్యం రాకపూర్వం ఉత్తరాంధ్ర పల్లెల్లో ఏ ప్రాంతం పరికించిన బక్కచిక్కిన రైతాంగం, డొక్కఎండిన పిల్లల్లా కూలీజనం. పొట్టకోసిన అక్షరంముక్కలేని దౌర్భాగ్య సమాజం, అగ్రవర్ణాల అహంకారం, దోపిడీ పీటల్నిటిని ఎదిరిస్తు నేటి రాజకీయాలలో నిలబడిన రాజకీయ రణతంత్ర భీష్ముడు లచ్చన్న.

ఐతే అన్యాయం ఎచట ఏ స్థాయిలోనున్న వ్యతిరేకించి పోరాడే మనస్తత్వంగల లచ్చన్నను అధికార పదవులలో ఎంతోకాలం ఉండలేకపోయారు. సిద్ధాంత రాజకీయాలేతప్ప రాజకీయ అధికార పదవులకు అంకితంకాలేని లచ్చన్న తన మంత్రిపదవికి రాజీనామాఇచ్చి బయటపడ్డారు.

మరల ఆంధ్రప్రదేశ్‌లో బెజవాడ గోపాలరెడ్డిగారి మంత్రివర్గంలో సాంఘిక సంక్షేమమంత్రిగా తనకు స్థానం లభించిన దానిని కూడా సిద్ధాంతం అడ్డువచ్చేసరికి తృణప్రాయంగా విడిచిపెట్టారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సందర్భంలో రూపొందిన పెద్దమనుషుల ఒప్పందములో ఈతడొక పెద్దమనిషి, మిగతావాళ్లలో మాజీ భారత రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి, నేటి మనరాష్ట్ర కాంగ్రెస్ ముఖ్యమంత్రి డా. మర్రి చెన్నారెడ్డి.

పోరాటాలు, విప్లవాలు తిరుగుబాటులలో జీవితం కొనసాగిస్తున్న సర్దార్‌జీ అగ్రవర్ణముల దోపిడీని చూసిన బలహీనవర్గాల హీనస్థితిని గాంచిన రాజీపడలేరు. భరించలేరు. ఉద్యమాలే తనకు ఊపిరి, ఆయువుపట్టు.

ఇన్నినాళ్లు రాజకీయ పోరాటంలో ఓటమిని అంగీకరించక తన లక్ష్యాన్ని విస్మరించక వయోభారం తమపైపడుతున్న మొన్నటి వరకు ఒక వామపక్ష ప్రజాస్వామ్య సంఘటన నాయకునిగా మనగలిగిన మన లచ్చన్న నేడు తన ఎ.పి. లోక్‌దళ్‌పార్టీని రాష్ట్ర జనతాదళ్ పార్టీలో విలీనం చేసుకొన్నారు. విలీనం భారతదేశపు ఉపప్రధాని జనతాదళ్ నాయకుడు, మాజీ ప్రధాని చరణ్‌సింగ్ సన్నిహితుడు లచ్చన్న అభిమాని దేవీలాల్ సమక్షములో ఉక్కునగరం విశాఖపట్నంలో 1-2-90 తేదీన జరగడం రైతుకూలీ ప్రజానీకానికే శుభావహం, ముదావహం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర జనతాదళ్‌పార్టీ నాయకుడుగా సర్దార్ గౌతు లచ్చన్న రాణించగల సమర్థుడని రాష్ట్రంలో ఆ పార్టీకొక అత్యున్నత స్థానాన్ని తెచ్చిపెట్టగలరని, ఆంధ్రుల అభిమానం పొంది, దేశ స్థాయిలోనే ఆ పార్టీకి కీర్తిప్రతిష్ఠలను తెచ్చిపెట్టగలరన్నది నిర్వివాదాంశం. ఆంధ్రుల అభిమానంపొంది దేశస్థాయిలో తగిన రాజకీయ పదవులను సర్దార్‌జీ తన గత రాజకీయ సేవకులకు ప్రతిఫలంగా భారతదేశ జనసౌభాగ్యం దృష్ట్యా రాష్ట్రశ్రేయస్సుమేరకు అందగలరని తన గతరాజకీయ జీవిత పుటల్నితిప్పి చదవగలిగిన ప్రతివారికి తెలుస్తుంది.

## విశాఖ విలేకరుల సమావేశంలో లచ్చన్న

సమకాలీన రాజకీయాల్లో తను రాష్ట్ర జనతాదళ్‌పార్టీ నాయకునిగా సాధించదలచిన దేమిటని విలేకరులు ప్రశ్నించగా నా 60 ఏండ్ల ప్రజా రాజకీయ జీవనంలో

రైతోద్యమాల్ని నడుపుటలోను, బలహీనవర్గాల్లో బలం పుంజుకొనేలా చేయడం లోను నేజేసినకృషిలో నేను సరిపెట్టులోలేదు. శాసనసభలోని ప్రతిపక్ష నాయకునిగా ఆంధ్రప్రదేశ్ లో నిరంకుశ ప్రభుత్వచర్యల్ని ఖండించాను. ప్రభుత్వాన్ని సరయైన దారిలో పెట్టాలని విమర్శల్ని చేసాను. తగుసూచనల్నిచ్చాను. నా రాజకీయ జీవితంలో ఎవరినీ నేను విమర్శకై విమర్శించలేదు. విధానాల ప్రాతిపదికపై విమర్శిస్తాను. తెలుగుదేశంపార్టీ అవకతవక విధానాలవైపు పోకుండా ఉంటే కలిసి పనిచేయటానికి అభ్యంతరం ఉండవలసిన పని లేదన్నారు. మయోభారం మీదపడు తున్న సహస్రదూసాల చంద్రదర్శనోత్సవం చేసుకోబోతున్న మీరు రాజకీయాల్ని ఇంకా నడపటంలో మీ లక్ష్యం ఏమిటని ప్రశ్నించగా, అందరికీ తెలిసినదే. రైతుల పంటలకు గిట్టుబాటు ధరలు లభించలేదు. రైతులు ఋణవిముక్తులుకాలేదు. బలహీనవర్గాలకు పెట్టుబడిదారీ వర్గంవారి దోపిడీ గ్రహణం ఇంకా వీడలేదు. కార్మికుల హీన దీన స్థితిని మనం చూస్తునే ఉన్నాం. రాజకీయాల్ని విరమించడం మన పైవిషయాల్ని నేనేమి పట్టించుకొనకుండా ఏదో రామకృష్ణా అంటూ నేను స్వీయ జీవితాన్ని గడపాలనుకోవడమే కదా. ఇంతకన్న దేశద్రోహం, ప్రజాద్రోహం ఉండదు. నిజానికి 60 ఏండ్ల రాజకీయాలు నా శరీరంలో ప్రతి అణువులో కనిపిస్తాయి. అవసరమైనపుడు స్పందిస్తాయి. ఏదో కాకతాళీయంగా ఏ పార్టీయో టిక్కెట్టుఇస్తే పార్టీలోనికి వచ్చినవాడను కాను. ప్రజలనుండి ఉద్భవించిన ప్రజాసేవ కుడను. ప్రజాభిమానిని. ప్రజలనుండి వేరుపడేది నిర్జీవస్థితి దాపురించినపుడే.

అందువలననే మీరు మీ శైలిలో రాజకీయా పోరాటాల్ని నడపగలదిట్టలని ఆంధ్రప్రదేశ్ లో పేరెన్నికగన్నారని మాకు తెలుసు. మీరు రాజకీయ దురంధరులు. ఆంధ్రప్రదేశ్ లో మీరు సాధించినది విపుల పరుస్తారా. క్లుప్తంగా మీకు వివరించిన అదొక గ్రంథమౌతుంది. రైతోద్యమాల్ని నడిపి జమీందారీ విధానం రద్దయేలా చూసాను. ఇక స్వాతంత్రోద్యమాల్లో పాల్గొని స్వాతంత్ర యోధునిగా నా వంతు సేవ నే జేసాను. జైలుకు వెళ్లాను. బలహీనవర్గాల్ని సమైక్యపరచి పోరాటాల్ని నడిపాను. వ్యక్తిగత ఆస్తిపాస్తుల్ని కాలరాయాలని జూచిన నాటి కాగ్రెస్‌ను స్వతంత్ర పార్టీ నాయకునిగా అడ్డుతగిలి నిలుపుదల చేసాను. ప్రత్యేకాంధ్ర రాష్ట్రంలో మీరు మెచ్చిన కృషి సల్పాను. కల్లుగీత పారిశ్రామికుల్ని నిస్సహాయుల్ని చేయతలపెట్టిన ప్రభుత్వాన్ని పడగొట్టించాను. ఐక్య కాంగ్రెస్ నిర్మాణం నెహ్రూజీకి నాడు రాష్ట్రంలో వామపక్ష పార్టీలు అధికారంలోకి రాకుండా ఆపగలిగాను. మారిన పరిస్థితులనుబట్టి వామపక్షాలనుబట్టి నిరంకుశ తెలుగుదేశం విధానాల్ని ఖండిస్తూ వచ్చాను. రాష్ట్రమంత్రి వర్గంలో ఆనాడు చేరి ప్రజలు మెచ్చిన విధానిల్ని అమలుపర చారు. జాతీయ నాయకులు ఆచార్య రంగా, రాజగోపాలాచారి వంటివారితో కలిసి

దేశ సౌభాగ్యానికి కృషిచేసాను. 1951 నుండి నేటి వరకు అధికార కాంగ్రెస్ పీఠాన్ని బ్రద్దలుకొట్టి దాని నిరంకుశ విధానాల్ని తప్పుడు మార్గాన్ని అరికట్టాలని, భావసమైక్యత కలిగిన పార్టీలతో కలిసిమెలసివస్తు నేటికి అదే ఆశయంతో జనతాద ళ్‌లో చేరాను. అయిన దేశానికి ఇంకా నే జేయవలసినది ఎంతో ఉన్నదన్న విశ్వాసం, నమ్మకంతో ఉన్నాను అని అన్నారు లచ్చన్న విలేకరులతో.

ప్రజా ఉద్యమంలోచేరి ప్రజాసేవ చేయడం స్వాతంత్ర్యోద్యమంనాటి రాజకీయాలు పదవులు పంపకాల్లో మునిగితేలడం ఈనాటి తతంగాలు తెలియవు. నా లక్ష్యసాధనకై నేను జీవితాంతము పరిశ్రమిస్తూనే ఉంటాను. వయోభారం నాకేమి అడ్డురాదు. ధృడసంకల్పం, చిత్తశుద్ధి నాకూతగా ఏనాడు నిలిచి ఉంటాయి.

ఆంధ్రప్రదేశ్‌లో నేడు విలీనం అయిన లోక్‌దళ్ పార్టీ ప్రాంతీయ పార్టీకాదా అని ప్రశ్నించగా కాదు అని జవాబు. నా లోక్‌దళ్ ఆంధ్రప్రదేశ్ నాటి చరణ్‌సింగ్ లోక్‌దళ్‌లో ఒక భాగమే ఈపార్టీ. దేశస్థాయిలో రెండుగా విడివడిన భారతీయ లోక్‌దళ్‌తో సరిపడక ప్రత్యేక ఎ.పి. లోక్‌దళ్‌గా నడుపుకుంటూ వచ్చాను. ప్రాంతీయపార్టీ కాదు.

జనతాదళ్‌లో మీరీనాడు మీ పార్టీని విలీనం చేయవలసిన అగత్యం ఏమిటి? అన్న ప్రశ్నకు ఏనాడో చేసివుండవచ్చు. దేశకాలమాన పరిస్థితిల్నిబట్టి వాస్తవిక సంఘటనలు జరుగుతుంటాయి తప్ప మన ఇష్టాయిష్టాల్నిబట్టి కాదన్నది మీకు తెలును. ఒకరి దయాదాక్షిణ్యాలతో ఏ ఒకరుగాని, పార్టీగాని ఎంతోకాలం మనలేదు. తెలుగుదేశం దయాధార్మాలమీద ఆదారపడి ఏవోకొన్ని సీట్లకోసం పార్టీని ఆపంధాలో నడపడం అవమానకరంగా నేను భావిస్తాను. అందుకే బెంగుళూరులో ఎన్నికలముందు జరిగిన కన్వెన్షన్‌లో ఆహ్వానం అందిన వెళ్లలేదు. అందుకు ప్రతిగా రాష్ట్రంలో వామపక్ష ప్రజాస్వామ్య సంఘటనకు రూపకల్పనచేపి నిరంకుశ తెలుగుదేశం పోకడల్ని ఎత్తుగడల్ని నిత్యం తూర్పూరబట్టాను. రాష్ట్రంలో తృతీయశక్తి ఆవిర్భవానికి కృషిసలిపాను. అయితే CPI వైదొలగి ఎన్నికల్లో పాల్గొని ఏమి సాధించింది. మరల కాంగ్రెస్‌పార్టీకి హెచ్చుస్థానాల్ని కల్పించటానికి సాధనంగా ఉపయోగపడింది. తెలుగుదేశం మిత్రపక్షాలలో ఇది ఒక్కటిగా చేరి సాధించినదేమిటి LDF భగ్నం అవటంతప్ప.

నేషనల్ ఫ్రంట్‌లో మీ పార్టీ భాగస్వామి. ఆ ఫ్రంట్‌కి చైర్మన్ యన్.టి.ఆర్. మరి సయోధ్య ఎలా కలుగుతుంది. సయోధ్య ఉండవలసింది పార్టీల మధ్యతప్పించి వ్యక్తుల మధ్య కాదు. విధానాల్లో బేదిస్తాంతప్ప వ్యక్తిగతంగా భేదించడం రాజకీయాల్లో లేని విషయం. యన్.టి.ఆర్. కలసివస్తే దోస్తీచేయటానికి అభ్యంతరం ఎవరికి

ఉండదు. నిజానికి తెలుగుదేశంలో నా పార్టీ సహచరులనందరికి నేను స్వయంగా కలిసాను. నన్ను రాజకీయ రణరంగం భీష్మునిగా పేర్కొంటూనే వెనుక గోతుల్ని త్రవ్వేరీతి నీతుల్ని తెలుగుదేశం పాటించింది. తత్ఫలితం అనుభవించింది. విమర్శకు వెనుకంజవేయని తత్త్వం నాది అని అన్నారు.

మీరు 1989 ఎన్నికల్లో మీ పార్టీ అభ్యర్థుల్ని నిలబెట్టలేదు. మీరు ఎన్నికల్లో పోటీచేయలేదు. తృతీయశక్తికి అవకాశం ఉండదని భావించారా! విలేఖరి అడిగారు.

ఎన్నికల్లో పాల్గొనడం లేకపోవడం అన్నది సిద్ధాంతానికి సంబంధించినది. నిజమైన రాజకీయ పోరాటం ఫలితం ఆశించదు. మన వ్యవస్థనే మార్చివేయాలని, మన కళ్లముందే ప్రయత్నిస్తున్న ఏ కొద్దిమంది విజ్ఞానావకాశాల్ని మనం ఏ దృష్టితో పరిశీలిస్తాం. వారి ఆశయసిద్ధి, సంకల్పం గొప్పది. ఆచరణలో ఇది సాధ్యమా! కాదా అన్నది ప్రాముఖ్యం వహించదు. ఫలితం ఆశించి ఏ ఒకరు ఏ ఉద్యమాన్ని చేపట్టిన అది త్వరలోనే నీళ్ళు కారుతుంది. అయితే ఉద్యమం మన ఊపిరిగా ఉండాలి. ఫలితం వస్తుందీ రాదు అన్నది ప్రశ్నగా ఉండరాదు. అందువలననే నేను ఈ ఎన్నికల్లో ఎచటనూ పోటీచేయలేదు. శ్రీకాకుళం జిల్లా స్వతంత్రులుగా పోటీచేసిన వారిని బలపరచాను. ఊరూర తిరిగి వారిని గెలిపించమని కోరాను. హరిశ్చంద్ర పురంలో చిరంజీవి కె. ఎర్రం నాయుడు, సోంపేటలో నా తనయుడు గౌతు శివాజీ ఇండిపెండెంట్లుగా గెలిచారు.

ప్రాంతీయ పార్టీలకు భవిష్యత్ లేదంటారా?... విలేకరి ప్రశ్న... ''సమకాలీన ప్రాంతీయ సమస్యల్ని పరిష్కరించటానికి తాత్కాలికంగా ప్రాంతీయ పార్టీలో మనగలుగుతాయి తప్పించి శాశ్వతంగా మనగలగలేవు. జాతీయ పార్టీల ఆకర్షణ ఆశయాల్ని లక్ష్యాల్ని ఇవి సంతరించుకోలేవు. అభివృద్ధి అభ్యుదయం దేశస్థాయిలో జరగవలసినవి తప్పించి ప్రాంతీయ స్థాయిలో జరిగేవి కావు. అందువలన జాతీయ పార్టీయే దేశానికి శరణ్యమన్న ఉప ప్రధాని దేవీలాల్ అభిప్రాయం సరియైనదే. గత అనుభవంలోను, దేశ స్థాయిపార్టీలే ప్రజలను ఆకర్షిస్తు వస్తున్నాయి.'' జవాబిచ్చారు లచ్చన్న.

''మీరు చేరిన జనతాదళ్ పార్టీకి రాష్ట్రంలో భవిష్యత్ ఉందా? అన్న విలేఖరి ప్రశ్నకు సమాధానంగా లచ్చన్న'' తన 81వ సంవత్సరాల రాజకీయ అనుభవం జనతాదళ్‌కు మన రాష్ట్రంలో భవిష్యత్ ఉండగలదన్న దానినే సమర్థిస్తున్నది. ప్రాంతీయ పార్టీలు నేడు మనగలిగిన పరిస్థితులు రాను రాను మృగ్యమౌతున్నాయి. దేశస్థాయిలో విశాల పరిధిలో ప్రజానీకం ఎంతో ఆలోచిస్తున్నది. ప్రపంచం నేడు ఆధునిక ఆలోచనారీతుల వలన నవీన భావాల స్పందన వలన ఎంతగానో కుదంచుకు



మన ముఖ్యమంత్రి [illegible] యం. చెన్నారెడ్డితో ముచ్చటిస్తున్న -
చిరంజీవి జి.ఎస్.ఎస్. [illegible] సుపుత్రిక - శిరీష



రాజుగారితో - అచ్చన్న



రాష్ట్రమంత్రి జి.వి. సుధాకరరావుగారితో - అచ్చన్న



ఒకవైపు విశాఖపట్నం పార్లమెంట్ సభ్యురాలు శ్రీమతి ఉమాగజపతి వేరొకవైపు కళాబంధు శ్రీ టి. సుబ్బిరామిరెడ్డి - అచ్చనగారితో ఏవో మంతనాలు జరుపుతున్నారు.



మైసూరు ఈడిగర్ మహాసభలో దక్కన్ హెరాల్డ్ ప్రొ
గురుస్వామిగారితో అచ్చన్న



సుభద్రాదేవి శ్రీమతి యశోదాదేవితో జైలుకు వెళ్తున్న దృశ్యం



1954లో మెహబూబ్‌నగర్ జిల్లా కలెక్టర్ కార్యాలయంలో
కల్లు దుకాణాల వేలం పాటల్ని ప్రతిఘటిస్తున్న లచ్చన్న



కర్నూల్లో కల్లు దుకాణాల వేలం పాటల్ని ప్రతిఘటిస్తున్న
లచ్చన్న – కె. రాజగౌడతో



1984 ఆంధ్రప్రదేశ్ గీత పారిశ్రామితక మహాసభ ప్రతినిధులతో లచ్చన్న



మండల కమిషన్ రిపోర్టును అమలు పరచాలని 1954లో
ఆందోళన చేస్తున్న లచ్చన్న

పోతున్నది. ప్రపంచం మానవ మనుగడ అన్న విశాలార్థమున నేడు మనం జీవిస్తున్నాం. ప్రాంతీయ కుల మత దురభిమానులు క్రమేపి తగ్గుతూ వస్తున్నాయన టాన్ని ఏ ఒకరు కాదనలేదు. ప్రాంతీయ పార్టీలు కొన్ని నేషనల్ ఫ్రంట్‌గా ఏర్పడటంలోను జనమోర్చ, లోక్‌దళ్, జనతాపార్టీలు జనతాదళ్‌గా మారడంలోను భావం ఉద్రేకం ప్రాంతీయ స్థాయిలోనున్న ఏ పార్టీ దేశానికి ప్రతిరూపంగా నిలచి దేశపాలనను చేపట్టి దిశగా వెళ్లలేదని భావించడం వలననే కదా.

నేషనల్ ఫ్రంట్ రైతుకూలీలకు ప్రయోజనాల్ని ఎంతగానో కల్పించగలదన్న విశ్వాసాలతో జనతాదళ్ పార్టీలో అడుగిడినాను. నేను ఏనాడు ఏ పార్టీలో చేరి పదవులు-భాగ్యాలు వస్తాయని చూపక ఏ పార్టీ ఏతోడు నీడ రైతుకూలీ ప్రజా రాజ్య సిద్ధాంతాన్ని అమలుచేయగలదో ఆలోచిస్తూ ఆశిస్తూనే అందులో కలుస్తున్నాను. అంతియేగాని అధికార పక్షంలో ఏనాడు చేరలేదు. ఈనాడు కేంద్రంలోనున్న జనతాదళ్ అధికార పక్షమైన, ఇది రైతుకూలీ ప్రజారాజ్యాన్ని స్థాపిస్తుందని బలహీన వర్గాల్ని బాగుపరుస్తుందని, పెట్టుబడిదారీ వర్గాన్ని అరికట్టి, కార్మికసౌభాగ్యాన్ని పెంచుతుందని దోపిడీ వ్యవస్థను నిర్మూలించి సమసమాజాన్ని రూపొందిస్తుందన్న ఆత్మవిశ్వాసం, నమ్మకం జనతాదళ్ పార్టీలో ఆంధ్రప్రదేశ్ లోక్‌దళ్ పార్టీని విలీనం చేసాను. ''భవిష్యత్తులో నా కార్యక్రమం జనతాదళ్ పార్టీ నాయకునిగా రాష్ట్రం నలుమూలలా పర్యటించి'' పార్టీలోని క్రిందిస్థాయి కార్యక్రమాల్ని కూడ జనతాపార్టీలో చేరేలా కృషి చేయడం పార్టీ అభివృద్ధికి అహర్నిశలు శ్రమించడం అంటూ లచ్చన్నగారు విలేకరుల గోష్టిని ముగించారు. రాష్ట్ర జనతాదళ్ నేతగా బడుగు బలహీన వర్గాలకు, యువజనులకు, విద్యార్థి లోకానికి మేలు జరిగేలా తను అహర్నిశలు వయోభారం తన మీద పడుతున్నా కృషి సలపడమే తన ధ్యేయమని, లక్ష్యమని పేర్కొన్నారు.

శుభం.

సమాప్తం.

# అనుబంధం

## వెనుకబడిన తరగతుల జాబితా ప్రకటన కథ–లచ్చన్న

1922లో మొదటిగా వెనుకబడిన తరగతులను జాబితాలను ప్రకటించడం జరిగింది. మద్రాసు జస్టిస్ పార్టీవారి పరిపాలనలోనే ఈవి రామస్వామి నయకర్ కృషి పోరాటం వలన జస్టిస్‌పార్టీ అమల్లోనికి తెచ్చింది.

1950 జనవరి 26న రాజ్యాంగం అమల్లోకి రాగానే అగ్రవర్ణాలవారు హైకోర్టులో దావావేసారు. రాజ్యాంగంలో సాంఘికంగా, విద్యాపరంగా వెనుకబడిన వారినీ, వెనుకబడినవారుగా రాజ్యాంగం తెలుపగా కొన్ని కులాల్ని వెనుకబడిన తరగతులుగా డిక్లేర్ చేయడం కుదరదని హైకోర్టు తీర్పు చెప్పింది. ఆనాడు ముఖ్యమంత్రిగా నున్న రాజగోపాలాచారి సుప్రీంకోర్టులో స్టే తెప్పిస్తారు. ఆ స్టేపై రాజ్యాంగంలో నున్న ఆర్టికల్ ప్రకారం జాతుల మధ్య కులాలమధ్య వ్యత్యాసం చూపకూడదని అందరికి సమానావకాశాలు కల్పించాలని రాజ్యాంగం కోరుతున్నదని, అందుకు కులాల జాబితా కూడదని సుప్రీంకోర్టు కూడా కొట్టివేయటానికి అవకాశమున్నది.

అందువలన రాజాజీ భారత రాజ్యాంగానికి మొదటగా సవరణ తేవాలని పట్టుపట్టారు. ఆ విధంగానే రాజ్యాంగ పరమైన హక్కుల్ని బి.సి.లకు కల్పించకపోతే మొత్తం దక్షిణాపథంలో వారి కాంగ్రెస్ నామరూపాలు లేకుండా పోతుందని వాదించారు.

ఆనాటి గోవిందవల్లభ పంత్, నెహ్రూజీ ఆమోదంతో సాంఘికంగా, విద్యావైజ్ఞానికంగా వెనుకబడిన కులాలకు ప్రత్యేక సదుపాయాల్ని కల్పించాలని, ప్రప్రథమంగా రాజ్యాంగ సవరణ జరిగింది. నిజానికి వెనుకబడిన జాబితాల ప్రకటనకు రూపకల్పన చేసింది జస్టిస్‌పార్టీ DMK తప్పించి ఆనాటి కాంగ్రెసే కాదు.

అయితే మద్రాస్ నుండి వెడివడిన ఆంధ్ర, ఆంధ్రప్రదేశ్ కాగా వెనుకబడిన జాబితాలు మరల హైకోర్టు నుండి ప్రతిఘటనలను ఎదుర్కొన్నవి. వెనుకబడిన జాబితాలో గల కులాల్ని సాంఘికంగా విద్యావైజ్ఞానికంగా వెనుకబడినవిగా పరిశీలించి నిర్ధారణ పరచబడినవి కావు కాబట్టి కుల ప్రాతిపదికగా వ్రాసినవి కాబట్టి ఆనాటి ఛీఫ్ జస్టిస్ పింగళి జగన్మోహన రెడ్డిగారు జాబితాల్ని రద్దుచేస్తారు. ఆ జాబితాలు రద్దు అయిన తదుపరి చర్యను తీసుకోవటానికి ఆనాటి ముఖ్యమంత్రి తీసికోలేదు. నిజానికి ఆనాటి ముఖ్యమంత్రి వెంటనే హైకోర్టు తీర్పు మేరకు సాంఘికంగా విద్యావైజ్ఞానికంగా నిర్ధారణచేసి జాబితాల్ని తయారు చేయొచ్చుగా అని డిప్యూటేషన్ జరిపిన అసెంబ్లీలో చర్చించిన ధారణల్ని జరిపిన రెడ్డిగారు ఏమి వినిపించుకోలేదని వెనకబడిన తరగతుల నాయకుల అభిప్రాయం పడుతు నిజానికి వెనుకబడిన కులాలకు వెన్నుపోటుపొడవడం ...ిందనే నేటికి వారు భావిస్తున్నారు.

పర ప్రభుత్వాలు కూడ వెనుకబడిన కులాల్ని ఆదరించే పరిస్థితులో ఒకనాడుండేవి. అటువంటిది ఆనాటి కాంగ్రెస్ అధిష్టాన వర్గం కిమ్మనక ఊరుకొన్నది.

1953లో 10 మంది పార్లమెంటు సభ్యులు రాజ్యాంగంలోని ఆర్టికల్స్ 340 మేరకు కమిషన్ వేయాలని, నెహ్రూజీకి నివేదిక ఇస్తారు. ఆనాటి మేధావుల్లో ఒకరైన కాకాకలేల్కార్ కమిషన్ ఛైర్మన్‌గా ఒక కమిటీని నెహ్రూజీ నియమిస్తారు. ఆ కమిషన్‌ను నియమిస్తూ సాంఘిక విద్యా వైజ్ఞానికంగా వెనుకబడినతనానికి కారణాలను నిర్ధారణ పరచమని అడుగుతారు. 1950లో రాజ్యాంగంలో స్పష్టముగా క్రైటీరియా పేర్కొన్న కమిషన్‌ను 1955 వరకు వేయలేదు. ఆ ఆర్టికల్ 340లో మే (May) అని అన్నందున ఆది బి.సి.లకు 'మేకు' అయింది.

పయి సంఘం వారిని క్రైటీరియను చెప్పమన్నారు. తక్కువ కులాలుగా సమాజమున చూడబడుతున్నవారు, సాంఘికంగా వెనుకబడిన వారని గుర్తిస్తారు. రాజ్యాంగంలో స్పష్టముగా వెనుకబడిన తనమును పేర్కొన్న సాంఘికంగా విద్యావిషయంగా వెనుకబడిన వారని. పేర్కొన్న మరల సాంఘికంగా విద్యావిషయికంగా వెనుకబడిన కులమని నిర్ధారణ పరచడానికి మరొక ప్రత్యామ్నాయ "ప్రాతిపదికను" కల్పించమని కమీషన్‌కు ప్రథమ షరతుగా నిర్ణయించడంలో ప్రభుత్వ లక్ష్యసాధనలో దురుద్దేశముందని వెనుకబడిన వర్గాల నాయకుడు లచ్చన్నగారు స్పష్టీకరిస్తారు.

స్వయముగా చెప్పబడిన సాంఘికంగా విద్యావిషయంగా వెనుకబడిన తనము అనే నిర్వచనానికి భిన్నముగా వేరొక రీతిని నిర్వచనం చేయడం సాధ్యం కాని పని. కాలయాపనకు వేసిన పథకం తప్పించి కార్యసాధనకు ముందుకు తీసికొని పోయేది కాదు.

ప్రజల్లో ఎవరెవరు వెనుకబడిన తరగతులకు చెందిన వారుగా ఉండగలరో ఒక జాబితాను రూపొందించి ప్రభుత్వానికిస్తారు. రాష్ట్రప్రభుత్వాలకు అభిప్రాయ సేకరణకు నిమిత్తం అంపిస్తారు.

అనాటికి సర్దార్‌జీ ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ మంత్రివర్గంలో సోషల్ వెల్ఫేర్ మినిష్టర్‌గా ఉన్నారు. సాంఘిక సంక్షేమశాఖ తరుపున ఆ నివేదికను పరిశీలించి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం కేబినెట్ ఆమోదంతో మరల ఢిల్లీకి అంపించారు.

కమిషన్ చెప్పిన రీతిగాకాక ఇతర రాష్ట్రప్రభుత్వాలు అభిప్రాయాలను త్రోసి రాజని కమిషన్ వెనుకబడిన తనమును ప్రత్యేక నిర్వచనము యివ్వడం సాధ్యంకాదన్న మాటను నెపముగా తీసికొని ఆనాటి కేంద్ర హోంశాఖామాత్యులు స్వర్గీయ పండిత గోవింద వల్లపంత్ గారు, ఆ చట్టానికి ప్రభుత్వం యొక్క ప్రథమ షరతులను కమిషన్

వారు అమలుపరచుటలో విఫలమైనందున ప్రభుత్వమే పరిశీలించి ప్రత్యేక ప్రాతిపదికను నిర్ణయించి, కమిషన్ సిఫార్సులమీద తగు చర్యలు తీసికోబడునని ఒక మెమోరాండం తయారుచేసి పార్లమెంటు ఉభయ సభల్లో కమిషన్ వారిచ్చిన నివేదికను సమర్పించారు తప్పించి దీనిపై నాటి నుండి నేటివరకు ఎటువంటి చర్చ జరగలేదు.

## బలహీన వర్గాల సంఘాల సమైక్యత-ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సభ ఆవిర్భావం

సంజీవరెడ్డిగారు బలహీన వర్గాలపట్ల ప్రదర్శిస్తున్న అసహన భావం వలన, ఆనాటికి ఉన్న నాలుగు బలహీన వర్గాల సంఘాల సమైక్యత కావటానికి సిద్ధపడినాయి. ఆంధ్రరాష్ట్ర వెనుకబడిన తరగతుల సంఘం అధ్యక్షులు అనగాని భగవంతరావు, కార్యదర్శి గౌతు లచ్చన్న. ఆంధ్ర రాష్ట్ర వెనుకబడిన తరగతుల కాంగ్రెస్ సంఘం అధ్యక్షులు ప్రగడకోటయ్య. హైదరాబాదు వెనుకబడిన తరగతుల సంఘం అధ్యక్షులు బొజ్జం నరసింహులు. తెలంగాణ వెనుకబడిన తరగతుల సంఘం అధ్యక్షులు కొండా లక్ష్మణ బాపూజీ. పైసంఘాల వారు పార్టీ రహిత భావనతో స్వర్గీయ అన్నం విశ్వనాథం గారి పిలుపుపై వారి తోటలో సమావేశమైనారు.

1. అన్ని సంఘాలు కలిసి ఉమ్మడి రాయభారం జరిపి సంజీవరెడ్డి వద్దకు వెళ్లి సంఘాల సమైక్యతను ఆశీర్వదించమని కోరారు.

పార్టీ రాజకీయాలకు అతీతంగా సాంఘిక సంకేమానికే ఈ సమైక్యత జరుగుతున్నదా లేదా అని పరిశీలించమని నాటి సాంఘిక సంకేమ మంత్రి డి. సంజీవయ్యను కోరారు సంజీవరెడ్డి. అయితే కాంగ్రెస్ వారికి కావలసింది ఎవరీ సమైక్య బలహీన వర్గాల సంఘానికి అధ్యక్షులు ఎవరన్నది తేలాలని సంజీవయ్య కాంగ్రెస్ పార్టీకి చెందిన వ్యక్తిని అధ్యక్షునిగా చేయాలన్నది ముఖ్యమంత్రి సంజీవరెడ్డి ఎత్తుగడ. లచ్చన్నగారు ఆ సమైక్య బలహీన వర్గాల సంఘానికి అధ్యక్షునిగా ఎన్నుకోబడతారేమో అన్నది కాంగ్రెస్ వారి భయం అది గ్రహించిన లచ్చన్నగారు నేను అధ్యక్షునిగా పోటీ చేయను. ఏ ఒకరు, నన్ను ప్రతిపాదించిన నేను నిలబడను అన్న హామిని ఇచ్చిన తదుపరి నాలుగు సంఘాలు రద్దు అయివాటిస్థానే ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సంఘం అనేది రూపొంది నది. ఆనాడు సికింద్రాబాద్ మాజీ మేయర్ బి.సి. సంఘానికి అధ్యక్షునిగా ఎన్నుకోబడ తారు.

1958లో వార్షిక సమావేశం హైదరాబాద్‌లో జరుగుతుంది. ఆ సమావేశానికి కాంగ్రెస్ నాయకులు ఏ ఒకరు హాజరుకారు. అయితే లచ్చన్నకు పరోక్ష రాయభారం వస్తుంది. బలహీన వర్గాల సంఘానికి అధ్యక్షునిగా ఉండవలసిన వాడు లచ్చన్నగారే. ఆయనను అధ్యక్షునిగా ఉండమని కాంగ్రెస్ వారు కోరతారు. ఈ సందర్భమున

లచ్చన్నగారు మరల బి.సి. సంఘానికి అధ్యక్షునిగా ఎన్నుకోబడతారు. అయితే 1959లో మరల ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ బలహీన వర్గాల సంఘం ఉద్భవించింది. దీనికి అధ్యక్షులు కొండా లక్ష్మణ బాపూజీ. బలహీన వర్గాలు ఆర్థికాభివృద్ధి సంఘమని మరొక సంఘం అవతరిస్తుంది.

ఢిల్లీ వెళ్లి అచటగల నాయకుల్ని కలసి ఢిల్లీ ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సంఘం అఖిలభారత వెనుకబడిన తరగతుల సంఘం ఆధ్వర్యమున కేంద్ర వ్యవసాయ శాఖామాత్యులు అఖిలభారత ఫెడరేషన్ అధ్యక్షులు ''పంజాబ్‌రావ్'' అధ్యక్షునిగా, బాబూ జగజ్జీవన్ రాం ఆరంభకునిగా, లచ్చన్నగారిని కన్వీనర్‌గా మహాసభ జరుగుతుంది. కాకాకవేల్కార్ కమిషన్ నివేదికపై చాలా సుదీర్ఘమైన చర్చలు జరుగుతాయి.

1)కమిషన్ చెప్పిన సూచనను అన్ని కులాలకు చెందిన స్త్రీలను వెనుకబడిన వారిగా గుర్తించడం సరికాదన్న సూచనను రద్దుచేయాలి. 2) వెనుకబడిన తరగతుల జాబితాల్ని ప్రకటించాలి. 3) కేంద్ర ప్రభుత్వానికి ఒక నివేదికను సమర్పించుటకు తీర్మానం.

ఆ డెప్యుటేషన్ నడపటానికి లచ్చన్నగారినే కన్వీనర్‌గా పెడతారు. గోవింద వల్లభపంత్‌తో తర్జన భర్జన జరిగింది. పంత్ అంగీకరించారు. స్వరాజ్యం రాక పూర్వం నుండి మెరిటెడ్ పూర్ బేక్ వర్డ్ క్లాసు విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లుండేవి. 1957లో అయితే దరిమిలా రద్దయినందున వాటిని పునరుద్ధరించాలని కోరతారు. కేంద్రరాష్ట్రాలకు ఏకమొత్తంగా నిధులను గ్రాంట్ చేయగలదని వ్యక్తిగతం పరిగణనపై ఇవ్వదలచుకోలేదని చెప్పారు. ఈమేరకు నిబంధనలు ఒక ఏడాదిపాటు అమల్లో ఉంచారు. తదుపరి ఆర్థికంగా వెనుకబడిన మెరిటెడ్ స్టూడెంట్లకే స్కాలర్‌షిప్ ఇవ్వాలని రాష్ట్రాలకు కేంద్రం సూచిస్తుంది. సంజీవరెడ్డి గారి మంత్రివర్గంలోకే వల్లభపంత్ గారుకూడ వచ్చారు. బ్రిటిషు వారినుండి అనాది నుండి వస్తున్న సాంప్రదాయాన్ని కూడ కాలదన్ని ప్రతీ సంవత్సరం వెనుకబడిన విద్యార్థులకు స్కాలర్‌షిప్‌లను మంజూరు చేయక నాటినుండి నేటివరకు కాంగ్రెస్ బలహీన వర్గాలకు చావు దెబ్బ కొట్టిందన్నదే లచ్చన్నగారి ధృడమైన అభిప్రాయం.

## సుప్రీంకోర్టు తీర్పు

బలహీన వర్గాల జాబితాను రద్దుపరచిన దానిపై సుప్రీంకోర్టుకు వెళ్లి తన వాదనల్ని వినిపించారు. సర్దార్ లచ్చన్నగారు అయితే మాత్రం సుప్రీంకోర్టు, హైకోర్టు వాదనలనే సమర్థించింది.

అఖిలభారత స్థాయిలో కాంగ్రెస్ అధిష్టాన వర్గం ''కామరాజు'' పథకం అని ఒక

రాజకీయ పథకం ప్రవేశపెడతారు. ఈమేరకు మద్రాసు నుండి కామరాజు ఆల్ ఇండియా కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఆనాటి ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు కేంద్రప్రభుత్వ మంత్రివర్గంలో చేరుతారు.

ఇక ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్‌పార్టీకి లీడర్ ఎన్నికల్లో ప్రతిఘటనలు వచ్చాయి. సంజీవరెడ్డి అల్లూరి సిగపట్లు పడతారు. సంజీవరెడ్డి బ్రహ్మానంద రెడ్డిని ముఖ్యమంత్రిగా ప్రతిపాదించగా అల్లూరు పోటీనిండి తప్పుకొని, ఏ ఒక్కరిని అల్లూరి పెట్టిన బలపరుస్తానని సంజీవరెడ్డి కబురు యిస్తారు. అల్లూరి నాటి కాంగ్రెస్ అధ్యక్షునిగా ముఖ్యమంత్రి పోటీచేయ సిద్ధపడి ప్రచారానికి దిగుతారు. ఈ స్థాయిలో సంజీవరెడ్డి కూడా ప్రచారంలోనిక దిగుతారు. తుదకు బ్రహ్మానందరెడ్డి ఓడిపోవడం ఖాయమని అల్లూరితోరాజీకి దిగుతారు. అల్లూరినాటి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు-డీ. సంజీవయ్యను సూచిస్తారు. చివరకు ముఖ్యమంత్రి యోగం సంజీవయ్యకు దక్కుతుంది. ఎవరిని ప్రతిపాదిస్తే సంజీవరెడ్డి అంగీకరించరో. వారిని ప్రతిపాదించ సిద్ధపడి సంజీవయ్య పేరును సూచిస్తారు అల్లూరి. అల్లూరి సత్యన్నారాయణ ప్రతిపాదించిన సంజీవయ్య మనకు ముఖ్యమంత్రి అవుతారు.

ఆనాటికి డెమొక్రటిక్ సోషలిష్టు పార్టీగా కొనసాగుతు సర్దార్‌జీ మరికొంత మంది వెనుకబడిన తరగతుల సంఘ అధ్యక్షునిగా సంఘం తరపున సంజీవయ్యగారి వద్దకు డెప్యుటేషన్‌కు వెళ్తారు. బి.సి. జాబితాలను పునరుద్ధరించమని మెమోరాండం యిస్తారు. సంజీవయ్యగారు జాబితాలను పునరుద్ధరిస్తారు. అయిన 5, 6 మాసాల్లోనే ప్రకటించిన జాబితాల్లో కాపు కులాన్ని చేర్చడంతో హైకోర్టులో కొందరు ఈజాబితాను కూడా ఛాలెంజ్ చేసారు. ముఖ్యమంత్రి కావటానికి ప్రధాన కారకులయిన స్వర్గీయ అల్లూరి సత్యన్నారాయణ రాజుగారి సలహామేరకు ''కాపు'' కులాన్ని కూడ బి.సి. జాబితాల్లో వేసి జి.ఓ. జారీ చేస్తారు సంజీవయ్య.

అగ్ర కులస్థులు మరల ఈ జాబితాపై హైకోర్టులో రిట్ పిటిషన్ దాఖలు చేస్తారు. ''కాపు'' కులం అగ్రకులం అని వాదిస్తారు వారు సాంఘికంగా విద్యావిషయకంగా వారు వెనుకబడిన వారని నిర్ధారణపరచక వారిని వెనుకబడిన జాబితాల్లో సరాసరి వేయడం సరికాదని మొత్తం జాబితా రద్దుకావాలని కోరారు. ఈ దశలో బి.సి. సంఘాన్ని 3rd Party గా చేర్చమని హైకోర్టులో లచ్చన్నగారు పిటిషన్ పెడతారు. ''కాపు'' సంఘాన్ని చేర్చడం తప్పని హైకోర్టు భావిస్తే ఆ కులాన్ని జాబితానుండి తొలగించాలి తప్ప జాబితాల్ని రద్దు పరచవద్దని వాదిస్తారు. హైకోర్టు ఈ వాదనను అంగీకరించక మొత్తం జాబితాలనే రద్దుపరుస్తుంది. అయితే గవర్నమెంటు అపీల్‌కు పర్మిషన్ తీసికొన్నది. ఇది జరగడం బి.సి. సంఘం అభ్యర్ధన పైనే.

అయితే అప్పీల్ చేయడం మాత్రం బ్రహ్మానందరెడ్డి గారు 1962లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేసిన తదుపరే జరిగింది. ఈనాటి కేంద్ర ప్రభుత్వం మంత్రి వర్గంలో నున్న శివశంకర్ గారే రాష్ట్రప్రభుత్వం తరపున సుప్రీంకోర్టులో వాదిస్తారు. బి.సి. సంఘం తరపున వేరొక ప్లీడర్ వాదిస్తారు.

340 ఆర్టికల్ మేరకు తరతరాల నుండి సమాజంలో హీనంగా తక్కువ కులస్థులుగా చూడబడుతూ, చదువు సంధ్యలకు దూరంగా ఉన్నవారే వెనుకబడిన తరగతులవారని సుప్రీంకోర్టు తీర్పు ఇచ్చే లావాదిస్తాయి.

సుప్రీంకోర్టు ఏ రాష్ట్ర ప్రభుత్వం అయిన పరిశీలించి సాంఘికంగా విద్యా విషయంగా ఏ కులమైన తక్కువ కులమని భావించిన ఆ కులాలన్నింటిని వెనుకబడిన కులాలుగ ప్రకటించవచ్చునీ సుప్రీంకోర్టు నిర్ధారణ పరుస్తారు. చట్టబద్ధమైన కులాలు అవుతాయి. ఈ తీర్పుమేరకు బ్రహ్మానందరెడ్డి గారు అనంత రామన్ కమిషన్‌ను నియమిస్తారు. వెనుకబడిన తరగతుల జాబితాను రూపొందించమని ఆదేశిస్తాను.

## ఆంధ్రప్రదేశ్ లో 8 ఏండ్లు వెనుకబడిన తరగతుల జాబితాలు అమల్లో లేవు:

అనంత రామన్ కమిషన్ వెనుకబడిన తరగతుల్లో మరల వెనుకబడిన తరగతులు అన్ని క్రొత్త పదాన్ని చేర్చి ఆమేరకు కొన్ని కులాలకు కొంత మార్పు చెప్పడం అన్నదీ సంఘంలోనే జరిగింది. అనాదిగా సమాజమున వెనుకబడిన వారు 4 కేటగిరీలుగా ఉండేవారు. (1) S.C (2) S.T (3) B.C (4) విముక్త జాతులు. బి.సి. జాబితాలను రాష్ట్రం ప్రకటించాయి. అందులో విముక్త జాతుల్ని కలిపారు. యస్.సి. లోనున్న హరిజనులను, బి.సి.లో కలిపారు. Listed Backward Class అనంత రామన్ కమిటీ నాలుగు విధాలుగా వర్గీకరించారు.పూర్వపు డి నోటిఫైడ్ జాబితాలో ఉన్న వారిని 'A' తరగతిగా నిర్ణయించారు. Original B.C లను రెండు భాగాలుగాచేసి లిటిల్ అడ్వాన్సు అని 'బి' తరగతిగా నిర్ణయిస్తారు. హరిజన కన్వర్టెడ్ వారిని 'సి' క్లాసు గడిక్లేర్ చేసారు. మిగతా బి.సి. లనందరిని 'డి' లిస్టులో పెడతారు. బ్రహ్మానంద రెడ్డిగారి హయాంలోనే A B C D జాబితాలుగా చట్టపరమైన క్రమబద్ధీకరణ జరిగి రాజ్యాంగ బద్ధమైనవి.

1957 నుండి 1962 వరకు జరిగిన పోరాట ఫలితంగా 8 సంవత్సరాలు అగ్రకులాల నాయకులు ఎత్తులను చిత్తుచేసి బలహీన వర్గాల నాయకుల పట్టుదల దీక్షల వలన ఈనాటికి చట్టపరమైన హక్కులను వెనుకబడిన తరగతులు పొందగలిగాయి. ఇందులో లచ్చన్నగారు చేసిన కృషి అభినందనీయమైనది. బలహీన వర్గాల సంక్షేమం తన ధ్యేయం అని ప్రకటించిన కాంగ్రెస్ మంత్రి వర్గమే సుమారు 8 సంవత్సరాలు బలహీన వర్గాల

జాబితాలను అమల్లో పెట్టలేదు సరికదా ఉన్నవాటిని రద్దుపరచేలా వ్యవహరించేది. తదుపరి అంజయ్యగారి హయాంలో మరల వేరొక కమిషన్‌ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. మురళీధర్ రావు కమిషన్ విచిత్ర మేమన ఈ కమిషన్ వేయమని బలహీన వర్గాల సంఘం ప్రతిపాదించకపోయిన ఆనాటి ఆర్థికశాఖామాత్యులు అయ్యపు రెడ్డి శాసనసభా నాయకులుగా నియమించబడతారు. బి.సి. లు ఇంతవరకు పొందిన ప్రయోజనాలేపాటివి ఎంత వరకు వారికి సదుపాయాలుండవలసి ఉంది. ఆ జాబితాలో నున్న వెనుకబడిన తరగతులనన్నింటిని వెనుకబడిన తరగతులగనే కొనసాగించాలా అన్న విషయాలపై ములళిధర్ రావు కమీషన్ వేస్తారు. ఈ కమిషన్ వేయడంలో ప్రభుత్వ చిత్తశుద్ధిని శంకించ వలసి వస్తుందేమోనన్నది లచ్చన్న గారి సుస్థిర అభిప్రాయం.

బలహీన వర్గాల జాబితాలను తిరగదోడాలన్న దుష్ట సంకల్పం అందులో ఉందన్న దాతని సంకల్పం అయితే అదృష్టవశాత్ మురళీధర్ రావు కమిషన్ బలహీన వర్గాలకు ఇంకను చేయవలసింది ఎంతయినా ఉందని బాగు పడినదేమిలేదని, ఆ జాబితాలోనున్న ఏ ఒక తరగతిని జాబితానుండి వేరుపరచవలదని ప్రభూత్వానికి సిఫార్సు చేసారు.

## ప్రధానాంశములు

జనాభాలో 44 శాతము బలహీన వర్గాలకు చెందిన ప్రజలు కావున 25% రిజర్వేషన్లు 44% పెంచాలి. ఆర్థిక అభ్యుదయానికి బి.సి. వాళ్ళకు సంబందించిన బడ్జెట్‌లో 41/2 శాతం వెచ్చించాలి. ఉపాది కల్పన క్రింద 10 ఏండ్ల వరకు అవకాశాలు కల్పించాలి. ప్రమోషన్సులో కూడా రిజర్వేషన్లు అమల్లోకి తేవాలి. బి.సి. విద్యార్థులకు Coching Centre ను తెరవాలి.

విజయ భాస్కరరెడ్డి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉండగా మురళీధర రావు కమిషన్ రిపోర్టును అమలు చేయాలని కోరారు. లచ్చన్న బలహీన వర్గాల సంఘ నాయకునిగా అభ్యర్థించార్థు. కాని ఫలితం కన్పించలేదు. జాబితాలపై ఎట్టి ప్రభుత్వ నిర్ణయాన్ని తీసుకోలేదు. 1983లో ఎన్నికలు కదా, మూడు మాసాలున్నవి కదా. ఎన్నికలు అయిన తరువాత దానిని పరిశీలిద్దాం అని విజయభాస్కరరెడ్డి అన్నారు.

1983లో తెలుగుదేశం అధికారంలోనికి వచ్చింది. కాంగ్రెస్ వాదులందరు కలసి వారిలోనే వేర్వేరుగా నడుపబడుతున్న బలహీన వర్గాల సంఘాలను సమైక్యపరచి ఆనాటికి కేంద్ర మంత్రి వర్గంలోనున్న శివశంకర్‌గారి అధ్యక్షతన కాంగ్రెస్ వెనుకబడిన తరుగతుల సదస్సు నడిపి టి. బాలగౌడ్‌ను ప్రెసిడెంట్‌గా ఒక బలహీన వర్గాల సంఘానికి రూపం ఇస్తారు. అయితే కొండాలక్ష్మణ బాపూజీ కాంగ్రెస్‌వాదియే ఆతడు

అతని సంఘం కాం(గెస్ బలహీన వర్గాల సంఘంలో కలియలేదు. ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల సంఘం అధ్యక్షులుగా సర్దార్ గౌతులచ్చన్నగారే కొనసాగుతు న్నారు.

1984 ఫిబ్రవరిలో సికింద్రాబాద్ నిజాం కళాశాల గ్రౌండ్ లో వెనుకబడిన వర్గాల నయకుల ఒక సదస్సును ఏర్పాటు చేస్తారు. లచ్చన్నగారి ఆధ్వర్యమున జరుగుతుంది. ఈ సదస్సుకు SC, ST, BC ల సహాయకులందరినీ ఆహ్వానించారు. సభాధ్యక్షులు శ్రీ సర్దార్‌జీ ప్రారంభోపన్యాసం. నాటి ముఖ్యమంత్రి యన్.టి. రామారావుగారే ముఖ్య అతిదులు. మురళీధరరావు కమిషన్ సిఫార్సులను అమలుచేయాలని ప్రభు త్వాన్ని అర్థిస్తూ తీర్మానించారు. SC లకు రిజర్వేషన్ కోసం సదుపాయాల్ని కల్పించారని, వెనుకబడిన తరగతులకు జరిగిన అన్యాయాలను తీర్చి దిద్దగలమని ప్రకటిస్తారు. బి.సి. లకు కాంగ్రెస్ అన్యాయం చేసిందని యన్.టి. రామారావుగారు గంభీరంగా ఇస్తున్న ఉపన్యాసానికి ఒక కాంగ్రెస్ MLA కృష్ణాజిల్లా రెడ్డియ్య అడ్డుపడి మీరు అధికారానికి వచ్చి 1 సంవత్సరం అయింది కదా మీరు చేసిన న్యాయం చెప్పమని అడుగగా కోపం పట్టలేక తన మెడలోవేసిన పూలదండల్ని ఊడబెరికి విసిరి వేసారు. ఈ సభ విజయవంతంగా జరిగినందున లచ్చన్నగారే వెనుకబడిన సంఘ నాయకుడై వారికి ఏమైన చేయగలడన్న ప్రజాభిప్రాయం బలపడునతూండటం జూచి మరల ఆనాటికి ఉన్న వివిధ బలహీన వర్గాల సంఘాల నాయకులనందరినీ మరల సమైక్య పరచటానికి హైదరాబాదు సమావేశం ఏర్పాటు చేస్తారు.

టి. బాలగౌడు లచ్చన్న వగైరాలు కొండాలక్ష్మణ బాపూజీ కూడ హాజరవుతారు. సమావేశంలో నిర్ణయించిన దేమన కొండాలక్ష్మణ బాపూజీ లేచి మాకు ఏ పదవులు అక్కరలేదు. లచ్చన్నగారికి కూడ అవసరంలేదు. సంఘ సమస్యల పరిష్కారం కోసం మీతో ఉండి సంపూర్ణంగా సహకరిస్తాం. మనం అందరం కలసి తిరుపతిలో ఒక రాష్ట్ర సంస్థను ఏర్పాటు చేసుకొందాం.

తిరుపతిలో ఆంధ్రప్రదేశ్ వెనుకబడిన తరగతుల మహాసభ జరపటానికి హైదరాబా ద్‌లో ఆర్గనైజింగ్ కమిటీ వేస్తారు. తిరుపతిలో మహాసభలు జరుగుతాయి.పబ్లిసిటీ బాగాయిస్తారు.

తిరుపతిలో ఇక 2,3 దినాల్లో మహాసభలు జరుగుతాయనగా చరిత్రలో ఇదివరకె న్నడూ జరగనిరీతిగా ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం సమావేశాన్ని హైదరాబాదు పబ్లిక్ గార్డెన్స్‌లో జూబ్లీహాలులో ఏర్పాటు చేస్తారు. బయట ఒక వేదిక వేయించి అందులో బహిరంగా వెనుకబడిన వర్గాల కార్యకర్తల సదస్సు అని ప్రకటిస్తారు. మంత్రివర్గంలో ములళీధరరావు కమిషన్ సూచించిన రీతిని 44% రిజర్వేషన్ విధానాన్ని వెనుకబడిన

కులాలకు కలిగించడానికి మంత్రివర్గంచేత తీర్మానం చేస్తారు. ఒక షరతుతో ఒక సంవత్సరానికి కుటుంబ ఆదాయం రు. 12,000/- లోపు ఆదాయం ఉన్నవారికే ఈ రిజర్వేషన్ విధానం వర్తిస్తుంది. నిజానికి 12 వేల రూపాయిలలోపు ఆదాయం ఉన్న అందరు ప్రభుత్వోద్యోగులు ఉపాధ్యాయులు అందరూ వస్తారు. అటెండర్లు కూడ 12 వేల రూపాయల ఆదాయాన్ని మించి ఉంటారు. మరళీధరరావు కమిషన్ ఇచ్చిన రిపోర్టును అమలుపరచటానికి తెలుగుదేశం ప్రభుత్వం సిద్ధంగా ఉందని ప్రకటిస్తూ హెలికాప్టర్‌లో ఆంధ్రప్రదేశ్‌లో 7 దినాలు పర్యటిస్తారు. వెనుకబడిన తరగతులకు ఏమైన చేయగలిగింది తెలుగుదేశమే అని ప్రకటిస్తారు.

తిరుపతిలో జరుగబోయే వెనుకబడిన తరగతుల మహాసభ జరగకముందే మురళీధరరావు కమిషన్ మేము అమలుపరుస్తున్నాం అని చెప్పడంలో ఉద్దేశం మేము వాళ్ళు తిరుపతిలో జరిపిన మహాసభల వలన కాదు. మా అంతటమేమే బి.సి. లకు చేయూతనిస్తున్నాం అని చెప్పారు.

44% శాతము బి.సి. లకు అనగానే అగ్రవర్ణాలవారు వెంటనే ఆందోళనకు దిగుతారు. ప్రతిభను పాతిపెట్టారన్న వాదనను లేవదీస్తారు. పాఠశాల కళాశాలలు మూసివేసిన పరిస్థితి అన్ని పార్టీలలోనున్న అగ్రజాతులకు చెందిన శాసన సభ్యులు విరాళాలు సేకరించి విద్యార్థిలోకానికి అందించారు. బి.సి. లను అవహేళనచేస్తు ఈ రిజర్వేషన్ల విధానం అమలుచేస్తు అగ్రవర్ణాలవారు బజార్లలో చీపురుకట్టల్ని పట్టుకొని వీధులను తుడుచుకోవాలని, అది ఎంతో నీచమైన స్థితి అని, ఎన్నో ఏండ్ల నుండి తరతరాల నుండి వీధుల్లో చీపురుపట్టుకొని చెప్పులు కుట్టుకొని కల్లు, సారాలు అమ్ముకుని జీవించే హీన దీన కులస్థులను అలాగే ఉండాలన్న దానిని ప్రదర్శనల ద్వారా సమర్థించారు.

ఇంతలో తిరుపతిలో వెనుకబడిన తరగతుల మహాసభలు జరిగాయి. ఉద్యమానికి ఈ సభలు సవాలు చేసాయి. మహాసభలకు టి. బాలగౌడ్ అధ్యక్షులుగా నిర్ణయించారు. సర్దార్ లచ్చన్న, కొండా లక్షణ బాపూజీలను బి.సి. లయొక్క ప్రధానాచార్యులుగా ఆ సభలో ప్రకటిస్తారు.

ఉద్యమానికి ప్రతి ఉద్యమం నడపటానికి లచ్చన్న అగ్రజాతి సిబ్బంది కూడా ఉద్యమాల్లో దిగుతారు. సెక్రటేరియట్‌లో ప్రవేశించ దలచిన ఉద్యోగులను ఆపటానికి యత్నించినవారిని లాఠీచార్జ్ చేసారు. అందుకు నిరసనగా సెక్రటేరియట్‌లో నున్న మహిళా ఉద్యోగులు సెక్రటేరియట్‌లో నున్న ముఖ్యమంత్రి గదిలో చొరబడి నిరసన ...రు. అయిన ముఖ్యమంత్రి వారిని క్షమిస్తారు.

బి.సి. సంఘం నాయకులను అరెస్టు చేస్తారు. నిరాహారదీక్ష శిబిరాల్ని సెక్రటేరియట్ వద్ద ఏర్పాటు చేస్తారు. అగ్రవర్ణాలవారు యన్.టి.ఆర్. జారీచేసిన జి.ఓ.పై హైకోర్టులో దావా వేస్తారు. దావాలో బి.సి. సంఘం నాయకులు 3వ పార్టీగా చేరుతారు. వ్యక్తిగతంగా లచ్చన్న, బాలగౌడ్ , స్వామి వగైరాలు చేరతారు.

హైకోర్టు మురళీధరరావు కమిషన్ నిర్ధారణ పరచినట్లు వెనుకబడిన తరగతుల జనాభా 35% మించి ఉండదని కోర్టు నమ్ముతున్నందున 44% బి.సి.ల రిజర్వేషన్ విధానం చెల్లదు సరియైనది కాదు. అయితే రాష్ట్రప్రభుత్వం జనాభా లెక్కల వివరాల్ని సరిగాతీసికొని ప్రభుత్వం మరల బి.సి. రిజర్వేషన్ శాతాన్ని ప్రకటించుకో వచ్చు- అంతవరకు లోగడ ప్రకటించిన రిజర్వేషన్స్ మాత్రమే చెల్లుతాయి. ఇబ్బంది అంతా తెలుగుదేశం ప్రభుత్వం శాసనసభలో దానిపై Appeal చేస్తామని ప్రకటించి, నేటివరకూ జనాభా లెక్కల నిర్ధారణ జరపక సుప్రీంకోర్టుకి వేదించింది. కాలం గడుపుతూ తన పబ్బం గడుపుకుంటూ పోతున్నది. అని లచ్చన్నగారి ధృడమైన అభిప్రాయం.

అనుబంధం

# ఉత్తరాంధ్ర జీవనధార-మన వంశధార

లచ్చన్న

శ్రీకాకుళం జిల్లాలో జీవనదులుగా ప్రఖ్యాతి గాంచిన వంశధార, నాగావళి, ఉత్తరాంధ్ర ప్రజల జీవన ప్రమాణాల్ని పెంచుకున్న నదీమ తల్లులు. శ్రీకాకుళం జిల్లాలో వంశధార నది ప్రవహించడం, సిరులు సౌభాగ్యాలు వర్షించడమే. ధనరాసులు తరలి ప్రవహించడమే వంశధార-కాదు ఉత్తరాంధ్ర ప్రజల జీవనాడి శ్రీకాకుళం ప్రజానీకపు భావి భాగ్యోదయపు దీపిక. ఆ వంశధార నదీ ప్రాజెక్టు అవతరణ కథ.

సుమారు వంద ఏండ్లక్రితం బ్రిటిషువారి హయాంలోనే ఈ వంశధార రిజర్వాయర్ రూపకల్పనను అనాటి గంజాం జిల్లా కలెక్టరు చేశాడు. నాటికి శ్రీకాకుళం జిల్లా ఏర్పడలేదు. ఈనాడు ఒరిస్సాలో ఉన్న గంజాం జిల్లా ప్రాంతం ప్రస్తుతము శ్రీకాకుళం జిల్లాలోని శ్రీకాకుళం డివిజన్ మాత్రమే అనాడు గంజాం జిల్లాగా ఉండేవి. ఆనాడు ఇది ఉమ్మడి మద్రాస్ రాష్ట్రమునగల చివరి భాగము.

హెడ్ ఛానల్ అదివరకే నిర్మాణం అయి ఉన్నది. వాటికి అడ్డు కట్టలు లేవు. పురుషోత్తపురం ఛానల్, బైర్ ఛానల్, పాలాకి ఛానల్, లుకలాం ఛానల్. వీటికి ఆనాటి గంజాంజిల్లా కలెక్టరు నీటి పారుదలసీమను రూపొందించ సిద్ధపడినారు. దీనివలన ఆనాటి గంజాం జిల్లాలో పలాసానుండి టెక్కలి తాలూకా, నరసన్నపేట శ్రీకాకుళంలో నున్న మెట్టభాగమును మాగాణి భూములుగా మార్చడానికి ఉద్దేశించినదీ పథకం.

బ్రిటిష్ వారిపరిపాలనలో ఈ ప్రాంతం జమిందారులు అదీనంలో ఉండేది. ఇకపోతే ఆనాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రం, తదుపరి ఏర్పడిన ఆంధ్రరాష్ట్రం, ఆతర్వాత ఏర్పడిన ఆంధ్రప్రదేశ్, శ్రీకాకుళం జిల్లాపట్ల చిన్నచూపు కన్పరుస్తూనే వచ్చాయి. సవతి తల్లుల ప్రేమను ఒలికించడం తప్పించి, నిజమైన అభిమానాన్ని ప్రదర్శించిన ఈ జిల్లాలో నీటిపారుదల సౌకర్యాలు ఏనాడో కలిగి యుండేవి. నిజానికి శ్రీకాకుళం జిల్లా సిరులు విలసిల్లే జిల్లా అయిన చిక్కుల్లో పడిన జిల్లా అయినది అని లచ్చన్న వ్యాఖ్యానిస్తారు. చిందర వందర రాజకీయాల్లో పడి చిల్లర వ్యవహారాల్లో మునిగినందున అభివృద్ధి అడుగంటుతూ వస్తున్నది. నీటి వనరులు, నదులు తక్కువా? వంశధార, నాగావళి చెప్పుకోదగిన జీవ నదులు, బహుదా మహేంద్రతనయ,

సువర్ణముఖి, జంఝావళి ఇంకా సెలయేళ్ళు గెడ్డలు, వాగులు లెక్కకు మించి ఉన్నవి.

ఇకపోతే వర్షపాతం రాష్ట్రంలో హెచ్చువర్షపాతం గలప్రాంతం ఒకవైపు సముద్ర తీరం, అపారమైన సముద్రపు సంపద, చేపలవేట, వేరొక వైపువేలకొలది ఎకరాల అరణ్యాల వలన ఏర్పడే ప్రదేశాల్లో అటవీసంపద, బౌతికావసరాల్ని పెంచుకోవటా నికి ఇన్ని అవకాశాలున్న అభివృద్ధి పొందలేదు. వెనుకబడిన జిల్లాగా నేటికి పరిగణించ బడుతున్నది.

1948లో ఉమ్మడి మద్రాస్ రాష్ట్రశాసన సభలో ప్రవేశించారు లచ్చన్నగారు. మొదటగా ఈ జిల్లా ఎచ్చట ఉంది. దీని భౌగోళిక ఉనికిని ఇతర రాష్ట్రాలు గుర్తించేలా తనవాణిని నలుమూలల ప్రతిధ్వనింప జేసారు.

1935 ముందు మద్రాస్ రాష్ట్ర ప్రధానిగా కొన్ని వత్సరాలు అధికారాల్ని చేపట్టిన జస్టిస్ పార్టీకూడా పూర్తిగా విస్మరించింది. ఎ.పి. పాత్రోలాంటి వ్యక్తులు గవర్నర్ కౌన్సిల్‌కి అడ్వయిజర్‌గా ఉండేవారు. ఆనాటి రాజులకు లీగల్ అడ్వజయిర్‌గా ఉన్నందున చేయగల సహాయాన్ని చేయలేకపోయారు. వంశధార విషయంలో ఏమాత్రం కృషిచేయలేకపోయినా ఆంధ్రా యూనివర్సిటీని మాత్రం ఉత్తరాంధ్రలో స్థాపన జరిగింది.

1936లో మద్రాస్ రాష్ట్రప్రధానిగా అధికారం చేపట్టిన కాంగ్రెసుకూడ తగిన శ్రద్ధ తీసుకోలేదు. అయితే 1936 పుల్లెల శ్యామసుందరంగారు శాసనసభలో ప్రవేశించి తీవ్రమైన కృషి చేశారు. 1935 తరువాత ఒరిస్సా రాష్ట్రం ఏర్పడి గంజాం జిల్లా మననుండి. విడివడినందున వంశధార ప్రాజెక్టు రెండురాష్ట్రాల సమస్యగా మారింది. అంతవరకు ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర పరిధిలోనున్న భూభాగం నదితోపాటు రెండు రాష్ట్రాల అధికారాల సుడిగుండంలో చేరింది.

ప్రజలు మాత్రం ఆనాటినుండి నేటివరకు ప్రజా ఆందోళన సలుపుతూనే వచ్చారు. ప్రతి ఎన్నికల్లో ప్రధాన సమస్య ఇది. ప్రతీ బడ్జెట్ సమావేశాల్లో వంశధార సమస్య లేవనెత్తుతూనే ఉన్నారు. ఆప్రాంత ఎన్నికల్లో దీనిని స్మరించనిదే అభ్యర్థులు ముందడుగు వేయలేని పరిస్థితి.

1948లో లచ్చన్న గారు మద్రాసు రాష్ట్ర శాసనసభలో వంశధార సమస్యను లేవనెత్తారు. ప్రజాందోళనను కొనసాగించారు. 1948 నుండి 1951 వరకు ఆలోచిస్తా మని తగిన విధంగా చేయగలమన్న మాట తప్ప పనిమాత్రం జరగలేదు. అయితే ఆనాటి నీటిపారుదల శాఖవారు పరిశీలనకు మాత్రం వచ్చారు.

1952లో కాంగ్రెస్ పార్టీకి రాజనామా ఇచ్చి కె.యల్.పి. సభ్యునిగా శాసనసభలో ప్రవేశించారు. శ్రీకాకుళంజిల్లా అభివృద్ధికి ప్రధానమైన చర్చ ''వంశధార ప్రాజెక్టు'' పై ఎలుగెత్తి చాటారు. సభలో చర్చనీయాంశం జేశారు.

నిజానికి 1936లోనే శ్యామసుందరం గారి కృషివలన ప్రాజెక్టు పనికొనసాగ వలసింది. అయితే, 1939వ రెండవ ప్రపంచ యుద్ధం వచ్చినందున పనికి అంత రాయం కలిగింది.

1946లో కాంగ్రెస్ మంత్రివర్గం మద్రాస్‌లో ఏర్పడిన తరువాత ''ఇన్వెస్టిగేషన్'' పూర్తిచేసారు. లచ్చన్న పోరాట ఫలితంగా శ్రీకాకుళం జిల్లాలో నిజానికి ప్రభుత్వ పక్షం, ప్రతిపక్షం అంతా కాంగ్రెస్ లచ్చన్నగారే. నివేదిక వచ్చింది.

ఈ నివేదిక ప్రకారం గణపవరం వద్దగల సంకిడి గ్రామం వద్ద రిజ్వాయర్ ఆనకట్ట కట్టాలని ప్రతిపాదన. అయితే ఇందువలన హెచ్చుభాగం ఒరిస్సా ప్రాంతం ముంపిడికి గురి కాగలవన్న భీతితో ఒరిస్సా రాష్ట్రం అడ్డుచెప్పింది.

1946-1951 వరకు కాంగ్రెస్ ప్రభుత్వం ఒరిస్సాలో సమస్యను తీర్చలేకపో యింది. 1948 నుండి 1951 వరకు శాసన సభ్యునిగా ఉన్న లచ్చన్న పోరాడినంతమే రకు పోరాడుతూనే ఉన్నారు. తనకు ''పార్టీ'' అభిమానం ఉన్నా తన ''ప్రాంతం'' అభివృద్ధి కావాలి గదా.

1952లో మరల లచ్చన్న శాసనభలో ఆందోళన చేయగా ఆనాటి నీటిపారుదల శాఖామాత్యులు ఎ.సి. సుబ్బారెడ్డి పునఃపరిశీలన చేయించారు. ఈ మేరకు నేరడివద్ద ఆనకట్ట కట్టవద్దు, బ్యారేజ్ నిర్మాణం కావాలని ప్రతిపాదన. ఈ ప్రతిపాదన వలన ఒరిస్సా భూములు హెచ్చుగా ముంపిడికి గురికాకపోయిన ఆ రాష్ట్రభూములుకొన్ని నీటమునగక తప్పదు. పర్లాకిమిడి గుణుపురం మధ్యగల ఒరిస్సాలోని వారణాశి భూములు ముంపిడికి గురికాక తప్పలేదు. ఇది వరకు గణపవరం ఏరియా లేదు. వారణాశికి వచ్చింది. సిబ్బంది గృహాల నిర్మాణం జరిగాయి. నిర్మాణకార్యక్రమం చేపట్టేరు.

దరిమిలా ఆంధ్రరాష్ట్రం మద్రాసు రాష్ట్రంనుండి విడివడే ఏర్పాట్లలో మునిగినం దున కొంతకాలం ఇది వెనక పడింది.

1953లో ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తదుపరి లచ్చన్నగారు రాష్ట్ర సాంఘిక సంకేమం, వ్యవసాయాభివృద్ధి చేపట్టారు. ప్రకాశం మంత్రివర్గంలో 5వారాలున్న లచ్చన్నగారు, ఆంధ్రరాష్ట్ర రాజకీయ సమస్యమీద రాజకీయ రచ్చలు-రగడలు చెలరేగి వంశధార సమస్యపై ఆలోచించే అవకాశమే చిక్కలేదు లచ్చన్న గారికి.

1955లో మరల లచ్చన్నగారు గోపాలరెడ్డిగారి మంత్రి వర్గంలో విద్యుత్‌శాఖ, కార్మికశాఖల్ని నిర్వహించారు. వంశధార ప్రాజెక్టు నిర్మాణం కొరకు ముఖ్యమంత్రితో, నీటి వనరులశాఖ మంత్రితో మంతనాలు జరిపారు. ఇందుపయి గోపాలరెడ్డి గారు ఒరిస్సావెళ్లి సంప్రదింపులు జరుపుతారు.

1956లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన తదుపరి నాటి ముఖ్యమంత్రి సంజీవరెడ్డి ప్రధాన ప్రతిపక్ష నాయకునిగా ఉన్న లచ్చన్న కృషిఫలితంగా ఒరిస్సా ముఖ్యమంత్రి బిజూపట్నాయక్‌ను నీటి పారుదల శాఖామాత్యులును హైదరాబాదుకు రమ్మని ఆహ్వానించగా వారు రావడం జరిగింది. ఆచర్యల్లో లచ్చన్నగారు పాల్గొనడం జరిగింది. నేరడి వద్దనే ఆనకట్ట రిజర్వాయర్ కట్టాలని ప్రతిపాదన.

అంతర్‌రాష్ట్ర వివాదంలో పడిన ''వంశధార ప్రాజెక్టు'' రాష్ట్రప్రభుత్వం చిత్త శుద్ధితో వ్యవహరించలేనందున ఢిల్లీ ప్రభుత్వం రెండు రాష్ట్రాల్ని ఒప్పించే ప్రయత్నంచేయగల సమర్థత ఉన్నను చేయనందున వంశధార ప్రాజెక్టు నత్తనడక నడుస్తూనే ఉంది అన్నది లచ్చన్నగారి అభిప్రాయం.

1962 స్వతంత్రపార్టీ శాసన సభ్యులుగా గెలుపొందిన లచ్చన్న బడ్జెట్‌లో నిధులు మంజూరుచేసేలా చేసారు. అయితే సంవత్సరం చివరకు ఒరిస్సా రాష్ట్రం అనుకూలించలేదని ఆ నిధుల్ని మరలా మరొకదానికి మళ్ళించడం జరిగి శ్రీకాకుళం జిల్లాలో లచ్చన్నగారు ఏమూల పర్యటించిన, ఏ ప్రాంతం వెళ్ళిన అతనికి అందిన విజ్ఞప్తులు వంశధార ప్రాజెక్టు నిర్మాణం వెంటనే జరగాలని ప్రభుత్వాన్ని ఒప్పించాలని.

1967లో ఎన్నికల్లో స్వతంత్రపార్టీ నాయకులుగా రికగ్నైయిజడ్ ఆపోజిషన్ పార్టీ లీడరుగా మరల ఈవిషయాన్ని అసెంబ్లీలో లేవనెత్తారు. 1968లో తుఫాను బాధితుల ప్రాంతాన్ని పరిశీలించటకు కేంద్ర నీటిపారుదల శాఖామాత్యులు శ్రీకాకుళంజిల్లా పర్యటనకు వస్తారు.

రంగాగారి ప్రతిపాదన మేరకు ఆముదాలవలస బంగ్లాలో అధికార్ల సమావేశాన్ని ఏర్పాటుచేస్తారు. వంశధార ప్రాజెక్టుపై చర్చలు సాగిస్తారు అధికారులు శ్రీ - అనధికారులు.

ఈ సందర్భంగా క్రొత్త స్కీమును శ్రీకాకుళం ఇ.ఇ. ఇరిగేషన్ శాఖవారు ప్రతిపాదిస్తారు. ఈమేరకు నేరెడివద్ద నిర్మించనున్న రిజర్వాయర్ బదులు నేరడివద్ద రెగ్యులేటర్‌ను ఏర్పాటుచేసి కాలువలద్వారా హిరమండలంలో గల కొండల లోయల్లోనికి వంశధార నీటిని మళ్లించి, రిజర్వాయర్ సర్వేలు చేయాలని ప్రతిపాదన. దీనివలన ఒరిస్సా రాష్ట్ర భూములు ముంపిడికి గురికావని తెలుపుతారు. ఆంధ్రలోకూడ

పల్లపుభూములు ముంపుకు గురికావు. కేవలం నాలుగు గ్రామాలుతప్ప. దీనిని కె.యల్. రావు అంగీకరించారు. కేంద్రప్రభుత్వం అనుమతి మంజూరు చేయిస్తానని మాట యిచ్చారు.

వంశధార నదీ ప్రాజెక్టు నిర్మాణంలో ఆ ప్రాంత శాసనసభ్యునిగా మొన్నటి వరకు ఆంధ్ర ప్రదేశ్ శాసనసభలో ప్రతిపక్ష సభ్యునిగా శాసనసభలోన, బయట ప్రస్తావించని బడ్జెట్ సమావేశాలు లేవు. ప్రజాందోళనల ద్వారా, విజ్ఞప్తులు ద్వారా, కరపత్రాల ద్వారా తన అభిప్రాయాన్ని పత్రికలలో ప్రకటించడం ద్వారా సర్దార్ గౌతు లచ్చన్నగారు నదీ ప్రాజెక్టు నిర్మాణం అన్ని దశలు సత్వరంగా జరగాలని అహర్నిశలు శ్రమిస్తూ వచ్చారు. ప్రభుత్వాన్ని అనేక సమయాల్లో నిలదీసి ఈ నదీ ప్రాజెక్టు నిర్మాణాన్ని సత్వరం చేపట్టి పనిని పూర్తి చేయాలని లోగడ అడిగిన సంఘటనలెన్నో ఉన్నాయి.

వంశధార నదీ ప్రాజెక్టు మొదటి దశ నిర్మాణం పూర్తి అయిన తన రెండవ దశ నిర్మాణాన్ని కూడా సత్వరం సంతరించుకున్నప్పుడే శ్రీకాకుళం జిల్లా దనధాన్యాలతో సిరి సంపదలతో విరాజిల్లగలదని యావత్తు జిల్లా రైతాంగం ప్రభుత్వాన్ని అభినందించ గలదని భావిద్దాం.

# సర్దార్ గౌతులచ్చన్న
# ప్రజారాజకీయ జీవిత షష్ట్యబ్ది 1930–1990



స్వాతంత్ర్య సమరయోధులు రైతోద్యమ నాయకులు బడుగు బలహీనవర్గాల ప్రజానాయకులు మన ఆంధ్రరాష్ట్ర మాజీమంత్రివర్యులు పేరెన్నికగన్న ఒకనాటి ప్రతిపక్ష నాయకులు సర్దార్ గౌతులచ్చన్నగారి ప్రజారాజకీయ షష్ట్యబ్ది మహోత్సవం రాజమహేంద్ర పురమున 5-5-90న సాయంత్రం 6 గంటలకు సన్మాన సారధ్య సంఘం వారు మహా వైభవోపేతముగా జరిపించారు. పురప్రముఖులు, రాజకీయనాయకులు, మేధావంతులు, రైతుకూలీ ప్రజానీకం, ఎంతో ఆనందాతిరేకముతో ఆనాడు లచ్చన్నగారిని వేయినోళ్ళ కొనియాడుతూ అభినందించారు.

ఆ దినమున వేరు వేరు సందర్భాలలో రెండు చోట్ల తన ప్రజారాజకీయ షష్ట్యబ్ది మహోత్సవం జరపడం ఎంతో చెప్పుకోదగ్గ ప్రత్యేకాంశం.

భారత రైల్వే శాఖామాత్యులు ప్రముఖ జనతా దళ్ పార్టీ నాయకులు జార్జి ఫెర్నాండెజ్ లచ్చన్నగారిపై తనకున్న ప్రత్యేక అభిమానంతో ప్రత్యేకమైన హెలీకాప్టర్ లో మధ్యాహ్నం 8 గం॥లకు రాజమండ్రి విచ్చేసి చిత్రాంగద అతిథి గృహములో మేధావులు, పురప్రముఖులు హాజరైన అభినందన సభలో లచ్చన్నగారికి మంత్రి జార్జిఫెర్నాండెజ్ గారు అభినందనలు తెలుపుతూ సిద్ధాంతాలపై రాజకీయాలను నడిపిన రాజనీతజ్ఞుడని లచ్చన్నగారిని కొనియాడారు. లచ్చన్న జీవితం ప్రజలకు మార్గదర్శకమని ఆయన శ్లాఘించారు.

అదే దినమున రాజమండ్రి పురపాలక సంఘంవారు 60 ఏండ్ల రాజకీయ ప్రజాసేవతో పునీతులవుతున్న సర్దార్ లచ్చన్నగారిని తమ వంతు సన్మానించదలిచారు. పౌరసన్మానం, మధ్యాహ్నం 11గం॥లకు ఘనంగా జరిపించి వేద పండితులచే ఆశ్వీరదింపచేసి మంగళవాయిద్యాలు మ్రోగుతుండగా మున్సిపల్ ఛైర్మన్ అప్పారావుగారు, ఎ.సి.వై. రెడ్డి, ఇతర మున్సిపాలిటీ మెంబర్స్ అత్యంత గౌరవాభిమానాలతో లచ్చన్నగారికి పుష్పాభిషేకం జరిపించారు. ప్రజల మనిషి లచ్చన్న - అని ప్రశంసించారు.

అదే దినమున సాయంత్రం పావన గోదావరీ తీరమున గల రాజమహేంద్ర వరము సుబ్రమణ్యం మైదానంలో సర్దార్ లచ్చన్నగారికి ఘన సన్మానోత్సవం జరిగింది. ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డిగారు తన అభినందన సందేశాన్ని రాష్ట్ర ఆర్థికశాఖామాత్యులు కె. రోశయ్య ద్వారా వినిపించారు. ఆనాడు జరిగిన సన్మానోత్సవ సభకు మాజీమంత్రి కె. ఇ. కృష్ణమూర్తిగారు అధ్యక్షత వహించారు. ఉన్నత విద్యాశాఖామాత్యులు కె. రోశయ్య ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. లచ్చన్నగారినీ వారి శ్రీమతి యశోదాదేవి గారినీ పుష్పమాలాలంకృతులను జేసి పలువురి ఎదుట ోశయ్యగారు, కె. ఇ. కృష్ణమూర్తిగారు, ఎ.సి.వై. రెడ్డి, మేడూరి సత్యనారాయణ,

కూడిపూడి ప్రభాకరరావు, అంకెం ప్రభాకరరావు ఘనంగా సత్కరించి 60 ఏండ్ల రాజకీయ జీవితంలో అచ్చన్నగారు చేసిన సేవలను కొనియాడారు. ఆయన ఆరుదశాబ్దాల రాజకీయ జీవితం ప్రజలతో పెనవేసుకుపోయిందని కె. రోశయ్యగారు అభివర్ణించారు. ఏ పార్టీ అధికారంలో వున్నప్పటికీ తను నిత్యం బడుగువర్గాల సమస్యల పరిష్కారానికి కృషిచేశారని సభాఅధ్యక్షులు శ్రీ కె.ఇ. కృష్ణమూర్తి గారు పేర్కొన్నారు.

ఉత్తరాంధ్రాలో జంటగా వ్యవహరించుటలో పెరెన్నికగంటూ వస్తున్న గౌతుశ్యామ సుందర శివాజీ, కింజరాపు ఎర్రన్నాయుడుగారు ఇరువురూ నాటి సభావేదిక నలంకరించారు. ఈ సంర్భమును పురస్కరించుకొని సర్దార్ గౌతులచ్చన్నగారిపై ప్రజాకవి, రచయిత వంగపండు అప్పలస్వామి రచించిన సర్దార్ గౌతులచ్చన్న అనే గ్రంధాన్ని మాజీమంత్రి కూడిపూడి ప్రభాకరరావు ఆవిష్కరించగా గ్రందరచయిత శ్రీ వంగపండు అప్పలస్వామిని మరొక మాజీమంత్రి అంకెం ప్రభాకరరావు సన్మానించారు.

తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు తెలియజేస్తూ పదవికంటే సిద్ధాంతాలే మిన్న అని ప్రభోదించారు. యువతరం విద్యార్థులు అరాచకాలు, అన్యాయాలు అంతమొందించడానికి నడుం బిగించాలని పిలుపునిచ్చారు. వేలాదిమంది సమక్షంలో తనను పూల మాలలతో సత్కరించిన తన అనుచరులకు, సహచరులకు అచ్చన్నగారు తన కృతజ్ఞతలు అందజేశారు. తన 60 సం॥ సుదీర్ఘ రాజకీయ చరిత్రలో పదవులకోసం సిద్ధాంతమే విలువైనదని ఒకనాటి స్వాతంత్ర్య సమరయోధుడు, రైతోద్యమ రథసారధి, నేటి బడుగు బలహీన వర్గాల ప్రజానాయకుడు, జనతా దళ్ పార్టీలో ప్రముఖులు అయిన సర్దార్ గౌతులచ్చన్న సభాముఖంగా ప్రస్ఫుటపరిచారు. ఆనాడు జరిగిన తన రాజకీయ జీవిత షష్ఠ్యబ్ది మహోత్సవం జరిగింది.

ఇట్లు

సన్మాన సారధ్యసంఘం

రాజమండ్రి



HYDERABAD,

*Dr. M. Channa Reddy*

CHIEF MINISTER

DATED 2-5-1990.

My dear *Sri Sardar Gowthu Latchanna*

I am extremely sorry for my inability to be present at Rajahmundry on the occasion of the Celebrations on 5th May 1990, as the Prime Minister of India proposes to visit Hyderabad on 5th evening.

I once again apologise for this and wish the Celebrations all success. Your political life has been a saga of ups and downs, struggle and assertion. You have always worked for the cause of the people. I had the good fortune to be associated with your activities at certain stages and in looking back, it always gives me great pleasure and satisfaction.

I heartily congratulate you on this occasion and wish you a long, peaceful and prosperous life, to be available for the service of the people and their cause.

With best wishes,

Yours *Sincerely*

*MCR*

(DR.M.CHANNA REDDY)

Sardar Gowthu Latchanna,
c/o Sri A.C.Y.Reddy, MLA.,
H.No.30-9-55/A, Jandapanja Road,
RAJAHMUNDRY.



1986లో నరసన్నపేటలో జరిగి అంజయ్య స్మారకసభలో అచ్చన్న
ప్రక్కనున్న వావిరాల గోపాలకృష్ణయ్యగారు



డి.వి.జి. రాజుగారితో - అచ్చన్న



సర్దార్ గౌతులచ్చన్న తంగెళ్ల శేషం రాజుగారితో



మన ముఖ్యమంత్రి చెన్నారెడ్డి - శివాజీ



శ్రీకాకుళం జిల్లా అచ్చన్న అభిమాన రాజకీయ కార్యకర్తలు, సారధి రెడ్డి, కిల్లి మోహనరావుల్ని చూడవచ్చు.




32 ఏండ్లు అచ్చన్న గారి రథసారధిగనే గాక ఆత్మీయునిగా నేటికీ మనగులుగుతున్న, పి. బలరాం



కె. రంగదాస్ చౌదరి బ్రహ్మప్రకాష్, తమిళనాడు ద్రావిడ కజగం సెక్రటరి వీరమణితో అచ్చన్న (ఎస్.సి.బిసి. ఎస్.టి పార్టీ)




ఆమరణ నిరాహారదీక్షను 1984లో కొనసాగిస్తున్న సర్దార్ అచ్చన్న



అల్పసంఖ్యాక వర్గాల మహాసభను ప్రారంభోత్సవం చేస్తున్న నటరత్న
రాష్ట్ర ముఖ్యమంత్రి రామారావు - లచ్చన్న



వెనుకబడిన తరగతుల దళిత హరిజన మైనారిటీల పార్టీ కార్యవర్గంలో లచ్చన్న



1984లో తెలుగుదేశం పార్టీ పరిపాలనలో మండల కమిషన్ సిఫార్సు
అమలుచేయాలని ఆందోళన చేస్తున్న అచ్చన్న



ఢిల్లీలో పార్లమెంట్ క్లబ్ లో సమావేశం - ఢిల్లీలో సమావేశం



విశాఖపట్నం జిల్లాలో పార్టీకి అత్యంత సేవచేసిన లచ్చన్న అభిమాని
కార్యకర్త పైలాడ పైడితల్లి నాయుడు



1980లో ఢిల్లీలో జరిగిన భారతీయ లోక్‌దళ్ పార్టీ పునరుద్ధరణ
- చరణ్‌సింగ్‌తో అచ్చన్న



ఆర్. శంకర్ కేరళ ముఖ్యమంత్రులు



విశాఖజిల్లా ఎస్ సి. ఎస్ టి. బి సి. సమావేశం



జలగం వెంగళరావుతో - అచ్చన్న



మహాసభల సందర్భంగా ఊరేగింపు లచ్చన్న
(ఎస్సీ.బిసి. ఎస్.టి మైనార్టీల పార్టీ)



ఆంధ్రరాష్ట్ర గీత పారిశ్రామిక సంఘం 1983లో హైదరాబాదు వారు
నిర్వహించిన సమావేశంలో ప్రసంగిస్తున్న రాష్ట్ర ముఖ్యమంత్రి
శ్రీ యన్. టి. రామారావు గారు-లచ్చన్న

అనుబంధం

# యన్.టి.ఆర్-సర్దార్ గౌతు లచ్చన్న

## (1980-83)

ఢిల్లీలో లోక్‌దళ్ పార్లమెంటరీ బోర్డు సమావేశం 1980 జనవరిలో జరిగింది. ప్రదాన కార్యదర్శి మదులిమాయె ఆనాటి జనతాపార్టీ కార్యదర్శి రామకృష్ణహెగ్డే, జనతాపార్టీ కార్యదర్శి సురేంద్ర మోహనరెడ్డి.

లోక్‌సభ ఎన్నికల్లో పరాజయానికి CPI(M) బహుగుణ కాంగ్రెస్ (అర్సు) ADMK నాయకుడు యం.జి. రామచంద్రన్ వెన్నుపోటు పొడిచారు అని పార్టీ కార్యవర్గం తీర్మానించింది. లోక్‌దళ్ కేంద్రపార్లమెంటరీబోర్డు సభ్యులు చరణ్ సింగ్, మధులిమాయె, చంద్రజిత్‌యాదవ్, కర్పూరి ఠాగూర్, వీరేంద్ర, ఆర్.కె. అయ్యర్. 1980లో అంజయ్య కాంగ్రెస్ రాష్ట్ర ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారం చేసారు. 1982లో ఫిబ్రవరిలో విజయవాడలో లోక్‌దళ్ కార్యాలయంలో లోక్‌దళ్ నాయకులు లచ్చన్న, శ్రీ సుంకర సత్యన్నారాయణ, శ్రీ తుమ్మల... చౌదరి, సదాశివరెడ్డి, డా. యలిమంచిలి శివాజీలతో కార్యవర్గం సమావేశమైనారు. 1982 సెప్టెంబరు నెలలో తెలుగుదేశం పార్టీ నాయకుడు యన్.టి.ఆర్. లో ప్రతిపక్ష ఐక్య సంఘటన గూర్చి చర్చించ లోక్‌దళ్ కార్యవర్గం సిద్ధపడినారు. 1982 సెప్టెంబరులో కేంద్రంలో ఏర్పడిన చీలికలతో నిమిత్తం లేకుండ, స్వతంత్రంగా ఉండాలని తీర్మానం. భూపతి సీతారామస్వామి అభ్యంతరం రాష్ట్రంలో 5 పార్టీల ఫ్రంట్ కొరకు లచ్చన్న తీవ్ర ప్రయత్నం చేసారు. ప్రొగ్రెస్సివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ కమిటీని జయపాల్ రెడ్డిగారితో లచ్చన్న ఏర్పరచారు. 1982 అక్టోబరున రాష్ట్ర ముఖ్యమంత్రి విజయబాస్కర రెడ్డిగారు అదే వత్సరాన 1982 సెప్టెంబరు 15వ తేదీన బాబులరెడ్డిగారింట P.D.F. సమావేశం జరిగింది. 1982 అక్టోబరు 25వ తేదీన పి.డి.యఫ్. నాయకులు టి.డి.పి. నాయకునికి లేఖ వ్రాసారు. కాంగ్రెసేతర ప్రతిపక్షాల మధ్య సమన్వయం కొరకు బాబులరెడ్డి (జనతా), దత్తాత్రేయ (బి.జె.పి), నారపరెడ్డి (కాంగ్రెస్), శ్రీ సుంకర సత్యన్నారాయణ (లోక్‌దళ్) నాయకులు చర్చించారు. శ్రీ గౌతులచ్చన్నగారు PDF కు కన్వీనర్ శ్రీ యన్.టి.ఆర్. ని కన్వీనర్ వెళ్లి కలసి చర్చించడం జరిగేది.

1982 నవంబరున దుర్భిక్షం. వరద బాధితులకు వనరులు కేంద్రం విడుదల చేయాలని ప్రతిపక్ష నాయకులు డిమాండ్ చేసారు. విజయభాస్కర రెడ్డిగారు

మంత్రిగా ఉన్న కేంద్రం ఉదాసీనత ఫోలేదని విమర్శించారు. రాష్ట్ర కాంగ్రెస్ ప్రతినిధి కేంద్రంలోని వి.బి.రాజు ఉండి, పి.డి.యఫ్. తరుపున లచ్చన్న బాబుల్ రెడ్డి CPM కమ్యూనిష్టుల తరపున సుందరయ్య, హనుమంతరావు, CPI శ్రీ గిరిప్రసాద్, శ్రీ సత్యన్నారాయణ సమాలోచనలు చేసారు. సీట్ల సర్దుబాటు గురించి అదే సమయాన ప్రత్యేకంగా ఉభయ కమ్యూనిష్టు పార్టీలు తెలుగుదేశం పార్టీ నాయకులలో చర్చలు జరపడం ప్రారంభించారు.

లోక్‌దళ్ మొత్తం రాష్ట్రంలో 32 స్థానాల్లో పోటీ చేయదలచింది. చరణ్ సింగ్, దేవీలాల్ రాష్ట్ర పర్యటనకు రావడం ఆనాడు జరిగింది. పి.డి.యఫ్. కన్వీనర్ లచ్చన్నగారు బాబుల్ రెడ్డి ఇరువురు కలిసి సుందరయ్యతో సమావేశానికి వెళ్ళారు. లచ్చన్నగారు సుందరయ్యతో సుందరయ్యగారూ మనం మనలో ఉన్న పార్టీ విభేదాల్ని విస్మరించాలి. కాంగ్రెస్‌ను ఓడించాలి. మరల మరొక ప్రయత్నం చేద్దాం. బి.జె.పి. తో మీరు కలసిరావాలి. అంతేగాక నూతనపార్టీ తెలుగుదేశం నాయకునితో మనం ఎన్నికల సరుదుబాటును చేసుకోవాలని అనగా లచ్చన్నగారు మీరు ఇంతకు దిగజిరిపోయారని అనుకోలేదు. రంగులు పూసుకొన్న వానితో రాజకీయలు చేస్తామా? అని అన్నారు సుందరయ్యగారు. తదుపరి రాజకీయ పరిణామాలు వచ్చిన పరిస్థితులను గుర్తుంచుకొని, తెలుగుదేశం మిత్రపక్షమై మనగలిగే పరిస్థితి ఉంది.

## లోక్‌దళ్ పార్టీ లచ్చన్న-తెలుగుదేశం పార్టీ యన్.టి. రామారావు

1983లో ఎన్నికలు దగ్గర పడుతున్నాయి. 1982లో ఆంధ్రప్రదేశ్‌లో నాదెండ్ల భాస్కరరావు ప్రోత్సాహమున యన్.టి.ఆర్. ప్రాంతీయ పార్టీని స్థాపించ దలచినట్లు క్రియాశీల రాజకీయాల్లో ప్రవేశిస్తున్నట్లు మద్రాస్ నుండి ప్రకటిస్తారు.

యన్.టి. రామారావు యిచ్చిన ప్రకటనపై నాటి ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో ప్రోగ్రెస్సివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ నాయకుడు లోక్‌దళ్ పార్టీనేత, బలహీన వర్గాల నాయకుడు సర్దార్ లచ్చన్న సాదరంగా స్పందించి, ఆతని అభిప్రాయానికి గౌరవమిచ్చి, సాదరంగా రాజకీయాల్లోనికి ఆహ్వానిస్తారు. కాంగ్రెస్ పార్టీని ఎదిరించ టానికి నూతన పార్టీ నాయకునిగా రావాలని యన్.టి.ఆర్. ను అభినందిస్తూ ప్రకటిస్తారు.

సర్దార్ గౌతులచ్చన్న యన్.టి.ఆర్. ను బలపరుస్తూ ప్రకటన ఇవ్వగానే అసెంబ్లీలో ఉన్న ప్రతిపక్ష నాయకులు బి.జె.పి, జనతా, ఉభయ కమ్యూనిష్టు పార్టీలు లచ్చన్నగారికి అభ్యంతరం చెబుతాయి. తొందరపడి మీరు యన్.టి.ఆర్.కు స్వాగతం పలుకుతున్నారని అవహేళన చేయగా అని లచ్చన్న దానికి దుష్ట కాంగ్రెస్

విధానాల్ని త్రిప్పికొట్టడానికి ఎన్ని ప్రతిపక్షాలు వచ్చినా మనం స్వాగతం పలకాలని, రామారావు అనికాదు అన్నది ఆతని సమాధానం.

తెలుగుదేశం ఆవిర్భమయి ప్రతిపక్షంగా నిలుస్తుంది. ఇతర ప్రతిపక్షాలతో కలసి ఎన్నికల రణరంగంలోకి దిగటానికి చర్చల్లో కలుస్తుంది. ప్రొగ్రెస్సివ్ డెమొక్రటిక్ ఫ్రంట్ కన్వీనర్ లచ్చన్న ఇతర ప్రతిపక్షాల నాయకులు దత్తాత్రేయ, బాబులురెడ్డి, సుందరయ్య వంటి వారితో సమాలోచనలు ప్రారంభం అవుతాయి. ఈనాడు పత్రికాధిపతి రామోజీరావు గారు, లోక్‌దళ్ పార్టీ సెక్రటరీ సుంకర సత్యన్నారాయణ తన ఇంటికి పిలిచి తెలుగుదేశం తరపున మంతనాలు కొనసాగిస్తారు. మీ లచ్చన్న గారు ప్రొగ్గెస్సివ్ డెమొక్రటివ్ ఫ్రంట్ నుండి బయటపడి వచ్చిన మీకు 10 సీట్లు ఉమ్మడి ప్రాతిపదికపై యిచ్చేటట్లు చేస్తాను. లచ్చన్నగారితో మాట్లాడండి అని చెప్పారు. నిజానికి రామోజీరావుగారు యన్.టి.ఆర్. ను సంప్రదించిన తదుపరే ఈవిధంగా చెప్పియుండాలి.

అందుకు లచ్చన్నగారు సుంకర సత్యన్నారాయణ, రామోజీ రాయబారానికి సర్దార్‌జీని తీసుకొని వెళ్లారు. అందుకు లచ్చన్నగారు చూడండి సత్యన్నారాయణ గారు మనం ఫ్రంట్ కన్వీనర్‌గా ఉన్నాం. ఫ్రంట్‌ను విడిచిపెట్టి లోలోన మనం రాజీపడటం రాజకీయంగా మనకు అప్రతిష్ట తెచ్చిపెడుతుంది. మొత్తం ఫ్రంట్‌తో యన్.టి.ఆర్. రాజీపడి, సీట్లను సర్దుబాటు చేసుకొన్న మంచిదికదా! అన్న మాటలతో లచ్చన్నగారు మారరన్నది తెలిసిపోయింది. ఫ్రంట్‌లోనున్న లచ్చన్న పార్టీలు పేర్లు మారుతున్న లచ్చన్నగారు కాంగ్రెస్‌ను ప్రతిఘటించడంలో ఏనాడు తను వెనుదిరిగి పారిపోలేదు. ఆ దృక్పదం నుండి నేటికి మారలేదు.

తెలుగుదేశం నాయకుడు ఫ్రంట్‌తో రాజీపడకపోయిన లోక్‌దళ్ త్రిముఖపోటీ ఉన్నచోట కాంగ్రెస్ గెలిచే ప్రమాదం ఉన్ననాడు లోక్‌దళ్ అభ్యర్థిని విరమించుకొంటాము అని లోక్‌దళ్ కార్యవర్గం ఆనాడు తీర్మానించింది. తెలుగుదేశం పార్టీ వెలుగులోనికి రావాలని వాంఛిస్తున్న దెవరన్నది తెలుస్తుంది.

రామారావు వెండితెరపై ప్రజలకు దగ్గరగా ఉన్నందున సినీగ్లామర్ బాగాపని చేసినందున గత 30 ఏండ్లుగా ఏనాడు ప్రతిపక్షాలు కాంగ్రెస్‌పై దుమ్ము పోయడం తప్పించి ప్రతిపక్షాలు వారిలో వారు సమైక్యమై ఎన్నిక ఒప్పందాలను జరిపించుకొని ప్రజల అభిమానం పొందలేక పోయినందున, కాంగ్రెస్‌పై ప్రజలకు ఏవగింపు కలిగేటట్లు చేయగలిగిన జనులెల్లరికి కాంగ్రెస్‌ను ఓడించాలన్న పట్టుదల పెచ్చుపెరిగి పోయినందున తెలుగుదేశం కొత్తగావచ్చిన పార్టీ అయినందున రామారావుగారు యిచ్చిన నినాదాలు. ఏ ప్రజానాయకుడు లోగడ కాలంలో యివ్వనందున తెలుగు

దేశం పార్టీకి జనాభిప్రాయం దగ్గరగా ఉందన్నది ద్యోతకమవడమే తరువాయి. కాంగ్రెసేతర ప్రతిపక్షాలను ప్రతిపక్షాల నాయకులను ప్రక్కకు బెట్టే రాజకీయ అధికారాల్ని దక్కించుకొన్నారు.

నిజానికి ఒకనాడు పార్టీని ప్రకటించిన తదుపరి ఒకనాటి రాత్రి 9.00 లకు హైదరాబాదు చింతలబస్తీలో ఉన్న సర్దార్ గౌతులచ్చన్న గారింటికి తెలుగుదేశం అధినేత రామారావు గారు స్వయంగా వెళ్లి రెండు చేతులు జోడించి తనను దీవించమని, లచ్చన్నగారిని అర్ధించారు.

లచ్చన్నగారెంతగానో ఆనందించారు. ఐదు దశాబ్దాలుగా కాంగ్రెస్‌ను ఎదిరించాలని పోరాడుతున్న తనకు జనతాపార్టీ ముక్కలైన తదుపరి ఈనూతన పార్టీ కాంగ్రెస్‌ను జయించగలదన్న నమ్మకంతో రామారావుగారితో కరచాలనంచేసి తప్పక నా ఆశీర్వాదం మీకు ఉంటుంది. రాజకీయాల్లో శత్రువులు. మిత్రులు అంటూ ఉండరు. ఏ ఒకరం ఆలోచించేది ఆ ప్రజల సంకేమమే కదా! ప్రజాస్వామ్య వ్యతిరేక విధానాలను నాటినుండి నేటివరకు పాటిస్తున్న దుష్ట కాంగ్రెస్ దుమ్మురుల పాలి అని ఉద్బోధించిన సర్దార్ గౌతులచ్చన్న తెలుగుదేశం పార్టీ బాగుకోరిన వారోకాదో ఇట్టే తెలిసిపోతూనే ఉంది. అయితే ఆ తెలుగుదేశం పార్టీ సర్దార్‌జీకి ప్రజస్వామ్య పరిరక్షణలో ఏ మాత్రం సహాయపడినది? రాజకీయాల్లో అన్ని పాఠాల్ని క్షుణ్ణంగా అర్థం చేసుకొన్న సర్దార్ గౌతులచ్చన్నగారి మీదనే తన రాజకీయ వ్యూహం ఎత్తుగడల్ని ప్రసరింపచేసారు. సర్దార్‌జీ శాసనసభ సభ్యుడయిన ఒక పార్టీయే గెలిచినట్లవుతుందని, తెలుగుదేశం నాడు గ్రహించారు. శాసనసభలో 40 ఏండ్లు శాసన సభా అనుభవం ఉన్న రాజనీతిజ్ఞుడు, రాజకీయ నాయకుడు, బలహీన వర్గాల నాయకుడు. ఉన్న తనకేనాడు ప్రతిబంధకం కాగలడన్న అవగాహనకు లోనయ్యారేమో. 10 స్థానాల్లో లోక్‌దళ్ పార్టీకి కేటాయిస్తామని కబురు పెట్టిన తెలుగుదేశం పార్టీతో పొత్తుకురాని లచ్చన్న ఏనాటికైన తన పార్టీకి ప్రాణ సంకటమని భావించినందుననే లచ్చన్నపై తెలుగుదేశం పార్టీ తన అభ్యర్థిని నిలిపింది. అనుభవం, ప్రజాబలం, బలహీన వర్గాల నాయకునికి ఎదురొడ్డి రాజకీయాల్ని నడపడం ఏమంత తేలికైన పనికాదు. అందుకు సులువుగా లచ్చన్నగారిని, మొదటనే శాసన సభకు ఎన్నిక కాకుండ చేయటానికి సంకల్పించారు రామారావు. సోంపేటలో లోక్‌దళ్ పార్టీ తరపున పోటీ చేస్తున్న లచ్చన్న గారిపై ఆ నియోజకవర్గం, తన స్వగ్రామానికి చెందిన ఒక ధనిక కుటుంబీకురాల్ని, మహిళను తెలుగుదేశం అభ్యర్ధిగా నిలబెట్టారు. కాంగ్రెస్‌పార్టీ మజ్జి నారాయణరావు గారిని నిలబెట్టింది.

ఈవిధంగా లచ్చన్నగారిపై తెలుగుదేశం పార్టీ అభ్యర్థిని నిలబెట్టడం లోక్‌దళ్

నాయకులు సత్యనారాయణగారిని, వడ్డే శోభనాద్రిగారికి ఏమీ రుచించలేదు. అసందర్భంగా కన్పించింది. ఆ ఇరువురు లచ్చన్నగారిని సంప్రదించకనే కృష్ణాజిల్లా పర్యటనలోనున్న ఆనాటి తెలుగుదేశం నాయకుడు శ్రీ యన్.టి. రామారావుగారిని గుడివాడలో కలిసి లచ్చన్నగారిపై నిలబెట్టిన అభ్యర్థిని విరమించుకోవలసినదిగా కోరారు.

పై ఇరువురు లోక్‌దళ్ ప్రధాన నాయకులే గాక శ్రీ రామారావుగారికి కూడ కావలసిన వారు రామారావుగారు వారుచెప్పినది విని ఎంతో ఆశ్చర్యంగా, నటరత్నం కదా ఏమిది అంతటి పూజ్యనీయులు లచ్చన్నగారిపై నిన్నగాక మొన్న పుట్టిన తెలుగుదేశం పార్టీ అభ్యర్థిని నిలబెట్టుటయా, ఏమి ఏమి ఎంత అసంభవము. ఏమైన దానిని పరిసీలిస్తాను. తప్పు ఎచ్చట జరిగిందో తెలుసుకుంటాను బ్రదర్. మీరు ఆందోళన పడవద్దు బ్రదర్. అంతా సవ్యంగానే ఉండేలా చేస్తాను అని అన్నారట.

ఆ మాటలువిన్న సత్యన్నారాయణ వడ్డే శోభనాద్రిరావు ఎంతో ఉప్పొంగిపోయారు. రామారావుగారితో అన్నారు. చూడండి మీ తెలుగుదేశం పార్టీ అభ్యర్థులు గెలవాలని ఆశిస్తున్నాం. అందుకు త్రిముఖపోటీ యున్నచోట మా లోక్‌దళ్ అభ్యర్థుల్ని విరమించుకొంటున్నాం. మీరు అదే పద్ధతిని చేపడుతున్నందుకు మీరు అభినందనీయులు అంటూ చెప్పారు.

అయితే తెలుగుదేశం పార్టీ తన అభ్యర్థిని సోంపేట నియోజక వర్గం నుండి విరమింపజేసుకొన్నదీ లేనిదీ పాఠకులకు లెల్లరికి తెలిసినదే. నిజానికి తెలుగుదేశం నేత లోక్‌దళ్ నాయకులకు మాటయిచ్చిన రీతిగా, తెలుగుదేశం అభ్యర్థిని సోంపేటలో విరమింపజేసిన సర్దార్‌జీ అత్యధిక ఓట్లతో గెలవడమేగాక కాంగ్రెస్‌కు డిపాజిట్ దక్కని పరిస్థితి వచ్చేది. తెలుగుదేశం పార్టీ నేత తనిచ్చినమాటను తప్పారు. అంతేగాక మహిళా అభ్యర్థిని తెలుగుదేశం నిలబెట్టి గెలిపించుకోవాలన్నది గాక ఆ నియోజకవర్గంలోని మహిళలను విడదీసి లచ్చన్నగారిని ఓడించి, కాంగ్రెస్‌ను గెలిచేలా చేయడమే తెలుగుదేశం ఎత్తుగడ అన్నది తెలిసిపోతుంది. వ్యూహం ఎత్తుగడలతో మూడవ అభ్యర్థి ఉన్నపుడే లచ్చన్న ఓడిపోవడం తన అభ్యర్థి గెలవకపోయిన కాంగ్రెస్ పార్టీ గెలుస్తుంది. రాజకీయ కురువృద్ధులలో భీష్ముడు రాజకీయ రణరంగం నుండి తొలగిపోవడం జరుగుతుంది. తెలుగుదేశం పార్టీ ఆశించినదే జరిగింది.

ఇంత జరిగినా తెలుగుదేశం నాయకుడు రామారావు ప్రభుత్వం బ్రతికి బట్టగట్టి నాలుగు కాలాలపాటు రాజ్యం చేయాలన్న సంకల్పంతోనే మనసులో ఎటువంటి

దురభిప్రాయం పెట్టుకొనక విజయవాడలో లోక్‌దళ్ పార్టీ జనరల్ బాడీ సమావేశం జరిపి, లోక్‌దళ్ పార్టీని రద్దుపరుస్తునట్లు తీర్మానం వ్రాసి ఆ తీర్మాన పాఠాన్ని తన లోక్‌దళ్ సహచర నాయకుల్ని సత్యన్నారాయణ, వడ్డే శోభనాద్రిరావు, ఎ. పాండురంగారావు మొదలగు వారిని తీసుకొని వెళ్లి రామారావుగారిని వారి ఎస్టేట్‌లో కలసి వీరంతా లోక్‌దళ్ పార్టీ నాయకులు పార్టీ రద్దు అయింది. వీరిని మీ పార్టీలో కలుపుకొని అరమరికలు లేకుండా వారికి మీ తెలుగుదేశం పార్టీ వారిగా భావించాలని మిమ్మల్ని కోరుకొంటున్నాను అని సర్దార్‌జీ రామారావుతో అంటారు. కాంగ్రెస్ పార్టీ మరల ఏనాడు రాజ్యాధికారాన్ని అందటానికి సుతారాము ఇష్టపడని లచ్చన్న గారు తనకు అన్నివిధాలా ఎదురు తిరిగి తనిచ్చిన స్నేహ హస్తాన్ని కాదని ఎదిరించిన తెలుగుదేశం పార్టీకి అధికారంలో కొనసాగేలా చేయాలని లచ్చన్నగారి ఉద్దేశం.

సరే లచ్చన్నగారూ మీ వంటి పెద్దలు ఇంతటి ఆదరణనిచ్చి మాపార్టీని దీవిస్తున్నపుడు మీరెపుడూ మాకు అభినందనీయులు. మీరు రాజకీయ కురువృద్ధులు భీష్మాచార్యుల వంటి వారు మాకు పూజనీయులు. మీ సలహాలు మాకు నిరంతరం కావాలి. మరి మీరు తెలుగుదేశంలోనికి రావాలి అని రామారావు అన్నారు. చూడండి రామారావుగారూ! మీ పార్టీ గెలిచినపార్టీ, నా పార్టీ ఓడిపోయిన పార్టీ. ఓడిపోయిన నేను మీ పార్టీలోనికి రావడం నేను పదవి నాశించి వచ్చినట్లవు తుంది. క్షమించండి. అందువలన నేను తెలుగుదేశం పార్టీలోనికి రాలేను.

మీరు రాజకీయ కురువృద్ధులు. భీష్ముల వంటివారు. మీ అభిప్రాయాన్ని మేము కాదనటానికి లేదు. అయిన మీరు బయటఉన్న మీ ఆదరణాభిమానాలు ఎల్లపుడూ మా తెలుగుదేశం పార్టీపై ఉండాలని ఉంటాయని ఆశిస్తాం. మీరు ఇచ్చిన ఇస్తున్న ప్రోత్సాహానికి మీదియే అభినందనలు స్వీకరించండి అని చెప్పి అంపించారు.

సర్దార్‌జీని అభినందించిన తెలుగుదేశం నేత రామారావుగారు నిజానికి లోక్‌దళ్ పార్టీ నాయకులు ఏనాటి నుండో కాంగ్రెస్ పార్టీపై ధ్వజమెత్తి పోరాడుతున్న సర్దార్ గౌతులచ్చన్న గారిని, ఏ స్థాయిలో ఏ రీతిని గౌరవించాలో, ఎలా గౌరవించాలో తెలిసికోవలసిన పరిస్థితులు ఏనాటికైనా ఏర్పడక తప్పదన్నది గత చరిత్ర చెప్పిన చారిత్రక సత్యాలు.

అనుబంధం

# చెన్నారెడ్డి-గౌతు లచ్చన్నల-చెలిమి-బలిమి

భారత స్వాతంత్ర్యోద్యమం క్రమేపీ బలపడుతుండటం గ్రహించిన బ్రిటిష్‌వారు 1909లో మింటోమార్లె సంస్కరణల్ని మనదేశాన ప్రవేశపెట్టిన సంవత్సరంలో ఉత్తరాంధ్రలో జన్మించారు సర్దార్ లచ్చన్న. ఈ సంస్కరణలు మనకు పరిపాలనానుభవం నేర్పటానికి అని వారి ''ఉవాచ''.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం 1919లో ఆంగ్ల ప్రభుత్వం కేంద్రంలో పరిపాలనా బాధ్యతల్ని అప్పగించక, రాష్ట్రాలలో ఏవో కొన్ని అప్రధానశాఖల్లో భారతీయుల్ని చేపట్టేటందుకు మాంటింగ్ చెమ్సుఫర్డు సంస్కరణల్ని అమలుచేస్తున్న తరుణంలో డా. మర్రి చెన్నారెడ్డి నాటి హైదరాబాదు స్టేట్‌లో జన్మించారు.

ఇరువురు పదేండ్లు వయోభేదం కలిగియున్న రాజకీయోద్యమ పోరాటాల్లో ఇరువురు ఒకటిగా కలిసి వ్యవహరించినవారు. లచ్చన్న భారత జాతీయోద్యమంలో పాల్గొని చెఱసాలలో-మ్రగ్గినవారు చెన్నారెడ్డి తెలంగాణా స్వాతంత్ర్యోద్యమ సమరంలో పాల్గొన్న దేశభక్తులు.

భారతదేశాన్ని బ్రిటిషువారు, బ్రిటిష్ పాలితప్రాంతాలని, సర్వస్వతంత్ర సంస్థానాలని విభజించి వారిపై పెత్తనం వహించి పేష్కుత్ వసూలుచేసుకొనే పరిపాలనా పద్ధతిని ప్రవేశపెట్టినారు. నిజానికి సంస్థానాధిపతులు మనవారైనను బ్రిటిషువారికన్న హీనాతిహీనంగా వారిపాలన కొనసాగేది. హైదరాబాదు స్వతంత్ర రాజస్థానం పాలకుడు నైజాం.

నిజానికి బ్రిటిషు ప్రాంతాలలోనున్న వారికి 1947 ఆగష్టు 15వ తేదీన స్వాతంత్ర్యం వచ్చిన 1948 సెప్టెంబరు నెల 19వ తేదీ వరకు హైదరాబాదు నైజాం సంస్థానంలోనున్న వారికి సర్వస్వతంత్రత లభించలేదు. తెలంగాణా స్వాతంత్ర్య సమరం అని ఒక సంవత్సరంపాటు నడుపవలసి వచ్చింది. నైజాం పరిపాలన నుండి తొలగటానికి రజాకార్లను అణచటానికి స్వతంత్ర భారతంలో హైదరాబాద్ సంస్థానం విలీనం కావటానికి.

లచ్చన్న-చెన్నారెడ్డి ఇరువురు భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు. ఒకరు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు వేరొకరు, తెలంగాణా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్నవారు. ఒకరు ఉత్తరాంధ్ర నుండి ప్రభవించగా, వేరొకరు తెలంగాణా నుండి మొలకెత్తినవారు. ఒకరు స్వాతంత్ర్యం పూర్వం రాజకీయాల్లోనికి ప్రవేశించినవారు. వేరొకరు స్వాతంత్ర్యం తదుపరి రాజకీయాల్లోనికి వచ్చినవారు.

1947లో వైస్రాయి **మౌంట్‌బాటన్** బ్రిటీషు పార్లమెంటు ఆమోదం మేరకు దేశవిభజన సిద్ధాంతాన్ని మన వారిచేత ఔననిపించి భారత్-పాకిస్తాన్ రెండుగా విభజిస్తు స్వతంత్ర రాజ్యాలుగా ప్రకటించాడు. అంతటితో సరిపుచ్చుకొనక విభజించు పాలించు సిద్ధాంతాన్ని అమలుపరచ భారతదేశం నందలి స్వతంత్ర సంస్థానాధిపతులకు వారి యథేచ్ఛమేరకు ఇండియాలో లేక పాకిస్తాన్‌లో చేరడమో లేక స్వతంత్రంగ ఉండటమో నిర్ణయించుకోవచ్చని తెలిపారు.

దేశ భక్తి-జాతీయతగల సంస్థానాధిపతులెల్లరు ఇండియాలో విలీనం కావటానికి సిద్ధమవగా, హైదరాబాద్ సంస్థానం నవాబ్ నైజాం అందుకు అంగీకరించలేదు. తత్ఫలితమే తెలంగాణాలో స్వాతంత్ర్య సమరం.

భారతదేశంలో స్వాతంత్ర్యోద్యమం కొనసాగుతున్న సమయంలోనే హైదరాబాద్ సంస్థానంలో రాజకీయ చైతన్యానికి పునాదులు పడ్డాయి. అమరనాథ చటోపాధ్యాయ, ముల్లా అబ్దుల్ ఖయిమ్ ప్రారంభకులు. ''హైదారాబాదు రికార్డు'' పత్రిక స్థాపన జరిగింది. 1892లో నైజాం అడ్డుతగిలింది. కొమర్రాజు లక్ష్మణరావు, గాడిచర్ల హరి పురుషోత్తమరావు, కాళేశ్వర్రావు గ్రంథాలయాల ద్వారా ప్రజల్లో చైతన్యం తెచ్చారు. 1911లో కృష్ణదేవరాయ ఆంధ్ర భాషానిలయం స్థాపన 1966లో విజ్ఞానచంద్రిక గ్రంథమండలి, వివేకవర్ధనీ పాఠ్యాంశాలను గణపతిరావు స్థాపించారు. నిత్యానంద బ్రహ్మచారి 1892లో ఆర్యసమాజ స్థాపన జరిగింది.

స్వదేశీ ఉద్యమం కూడ నైజాం రాజ్యంలో తలెత్తకపోలేదు. అఘోరనాథ చటోపాధ్యాయ కారకులు. ఎందరో దేశభక్తులు వందేమాతరం ఉద్యమంలో పాల్గొని నైజాం నుండి అనేక బాధలకు గురవుతారు.

1919లో ఉస్మానియా విశ్వవిద్యాలయం స్థాపన జరిగి రాజకీయోద్యమానికి, చైతన్య ప్రతీకలు మొలకెత్తాయి. గాంధీజీ ప్రభావం నైజాం రాజ్యంలోనికి ప్రాకింది. పండిత తారానంద గాంధేయవాది. ఖిలాఫత్ ఉద్యమం వచ్చింది. హిందువులు, ముస్లిములు కలిసి ఉద్యమించారు. 1920లో గాంధీజీ సహాయ నిరాకరణోద్యమంలో ప్రభావం కనపడింది.

1921లో ఆంధ్ర జన సంఘం స్థాపన జరిగింది. మహర్షి కార్వే అధ్యక్షుడు. ఇందులో ఆనాటి సభ్యులు మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, నరసింగరావు నైజాం స్టేట్ ఆంధ్ర జనసంఘంగా పిలవబడింది. మాడపాటి హనుమంతరావు కార్యదర్శి. నీలగిరి, గోల్కొండ పత్రికలు ప్రోత్సహించాయి. 1930లో ఇదే సంఘం ఆంధ్ర మహాసభ అని పేరు మార్చుకొన్నది. ఆంధ్ర మహిళాసభ దీనికి అనుబంధం

అయింది. అయితే ఈ సభ తన సభల్ని హైదరాబాదు వెలుపలి రాష్ట్రాల్లో జరుపుకొనేది. నియంత నైజాం పోలడల వలన.

1937లో బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ప్రవేశపెట్టమని ఒక తీర్మానంచేస్తు, ఆ తీర్మానం ప్రతిని నైజాం నవాబుకు అందజేయమని ప్రసిద్ధ దేశభక్తుడు రాజకీయ నాయకుడు కె.వి. రంగారెడ్డిని అభ్యర్థించారు. వీరే మన మంత్రి చెన్నారెడ్డి మేనమామ.

అయితే విప్లవోద్యమకర్త రావి నారాయణరెడ్డి వినతి పత్రాలు నైజాంలో సంప్రదిం పులు సరికావు. ఆంధ్ర మహాసభను విప్లవ పంథాలో నడిపించాలని చేసిన ప్రయత్న ఫలితంగా 1944 సరికి కమ్యునిస్టుల ప్రాబల్యంలోనికి ఆంధ్ర మహాసభ చేరింది.

ఉద్యమ నాయకులు కె.వి. రంగారెడ్డి, యం రామభద్రరావు, బి. రామకృష్ణారావు, వామపక్ష సిద్ధాంతానికి ఇష్టపడనివారు విప్లవ వ్యతిరేకులు, జాతీయ ఆంధ్ర మహాసభ అనుపేరుతో విడిపోయారు. నైజాంలో కుడిఎడమ పక్షాల పోరాటం నైజాం పాలనపై కొనసాగింది.

1938లో సత్యాగ్రహోద్యమం ప్రారంభమైంది. ఈ ఉద్యమంలో ఆనాటి ప్రముఖులు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ప్రారంభమైనది. నూకల రామచంద్రారెడ్డి, పి.వి. నరసింహారావు, హయగ్రీవాచారి, రామచంద్రారెడ్డి, విద్యార్థి ఉద్యమకారులు. అందువల ననే వందేమాతరం రామచంద్రారావు అన్నపేరు వచ్చింది.

## హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ ఆవిర్భావం-పునర్జన్మ

1938లో స్వామి రామానందతీర్థ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను స్థాపించి కమిటీ ఏర్పాటు చేయగా, మత కక్షలకు ఇది పునాది కాగలదని, హైదరాబాదు సంస్థానం ప్రధానమంత్రి హైదర్ దీనిని నిషేదించారు. అయితే మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, యం. నరసింగరావు సత్యాగ్రహానికి సిద్ధపడినారు. రావి నారాయణరెడ్డి, రామానందతీర్థ, కాళోజీ నారాయణరావు మొదలగు దేశభక్తులు అరెస్టయినారు. ఆశ్చర్యకరమేమన నాటి జాతీయ నాయకులు నెహ్రూ, పటేల్, పట్టాభి, రాజేంద్రప్రసాద్ నైజాం సంస్థానం లోపల ప్రవేశించటానికి అనుమతి ఇవ్వలేదు. కాంగ్రెస్‌ని గుర్తించలేదు. నైజాము తనకు భారత సమాఖ్యలోచేరే ఉద్దేశం లేదని తన సంస్థానానికి ప్రతిభ గుర్తింపు ఉందని వాదించసాగారు.

క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందున బి. రామకృష్ణారావు, వందేమాతరం రామచంద్రరావు, కాళోజీ నారాయణరావు, పద్మజా నాయుడు మొదలగువారు నిర్బంధించబడినారు. చివరిగా నెహ్రూ కలుగజేసికొనగా 1946లో కాంగ్రెస్ పార్టీమీద విధి నిషేదాల్ని నైజాం స్టేట్ పాలకులు ఎత్తివేశారు.

## రైతు రంగా రాజకీయ పాఠశాల స్థాపన

1947లో ఆగష్టు నెల 15వ తేదీన స్వాతంత్రదినోత్సవాన్ని దేశంలోగల ప్రజలెల్లరు జరుపుకున్న ఆ అదృష్టం శుభ ఘడియలు. హైదరాబాదు సంస్థానంలోనున్న వారికి లభించలేదు.

హైదరాబాద్ నవాబు ఇండియాలో తన సంస్థానాల్ని విలీనం చేయనని స్వతంత్రంగా మనగలుగుతానని చెప్పడం ప్రజల్లో కోపతాపాలకు కారణమైంది. జాతీయతను కోల్పోవడం, అస్వతంత్రులుగాపడి ఉండటం, ఏ జాతి సహిస్తుంది. విప్లవోద్యమాలకు ఊపిరి నిచ్చాయి. ఆ సరికే 1947లోనే రామానందతీర్థ అధ్యక్షతన కాంగ్రెస్ పార్టీ సమావేశమై ఉద్యమాన్ని నడుపుటలో అభిప్రాయ బేధాలకు లోనయింది. కృష్ణారావు మొదలగువారు కోరగా కె.వి. నరసింగరావు మొదలగువారు రజాకార్లను సాయుధ పోరాటంలోనే ఎదుర్కోవాలని సిద్ధపడినారు. నైజాం పరిపాలన ఎంత కర్కశంగా ఉండేదో నిదర్శనం, ఉద్యమ కేంద్రాలుగా విజయవాడ-బొంబాయి లుండేవి. వి.బి. రాజు, బొమ్మకంటి సత్యన్నారయణ హాయిగ్రీవాచారి, విజయవాడ కేంద్రంలో ఉద్యమాన్ని నడపగా, పి.వి. నరసింహారావు, కె.వి. నరసింగరావు ఆదిలాబాద్ శిబిరం నుండి నడిపారు.

ఇదే సమయాన అఖిల భారత కిసాన్ ఉద్యమ స్థాపకులు రైతోద్యమ పితామహుడు ఆచార్య రంగా, అతని ముఖ్య సహచరులు సర్దార్ గౌతు లచ్చన్న, పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిల ఆధ్వర్యాన 1947లో కృష్ణా-ఖమ్మంజిల్లా సరిహద్దుల్లో నాందిగాం తాలూకాలో రాజకీయ పాఠశాలను స్థాపించారు. తెలంగాణా స్వాతంత్ర పోరాటంలో తమతమ సిద్ధాంతపాత్ర, తన అభిమాన రాజకీయ సహచరుల తోడ్పాటు ఉండాలని, వామపక్ష పార్టీల ప్రాబల్యంలోనికి అద్యతన ఉద్భవించబోయే హైదరాబాద్ రాష్ట్రం జారకూడదని రాజకీయ పాఠశాలను తెరచి వారికి ఉద్యమ రాజకీయ చైతన్యం కలుగజేసి, వారి ఉద్యమానికి నిధుల రూపంలో సహాయ సంపత్తిని అందించడం రంగాజీ ధ్యేయం.

ఆ సరికి నైజాం రజాకార్లను సృష్టించి కాశీం రజ్వీ నాయకత్వాన దౌర్జన్యాల్ని జరిపించే తతంగానికి రూపకల్పన చేసారు. ఆంధ్రులు భీతావహులైన ఇతర ప్రదేశాలకు తలదాచుకోవటానికి, స్వస్థలాల్ని విడచిపెట్టి ప్రాణ భయంతో పరుగెలెత్తే దుర్దశ దినాలవి. ఈ సమయంలోనే నైజాం పాలనఅన్న అనేకమంది హైందవులు విజయవాడ వారి వారి కుటుంబాలతో వచ్చారు. రజాకార్ ఉద్యమంలో తెలంగాణాలో ఆనాటి రాజకీయ నాయకులు వారు రాజకీయాల్లో ఉద్యమాల్ని నడుపుతున్నందున వారి కుటుంబాలకు రక్షణ ఉండదేమోనన్న భావంతో విజయవాడ వచ్చినారు. డా. మర్రి చెన్నారెడ్డి కుటుంబం కూడ ఆ ఉద్యమ కాలంలోనే విజయవాడలోనే తలదాచుకొన్నది.

ఆనాటికే రాజకీయ భావాలతో ఉత్తేజితుడైన మర్రి చెన్నారెడ్డిగారు తను డాక్టరు వృత్తి నడుపుతున్నదా, విని విడిచిపెట్టి తెలంగాణా స్వాతంత్ర్య సమరంలో కాలూని నిలవటానికి సిద్ధపడినారు. నైజాం నవాబును ఎదిరించే పోరాట కార్యక్రమాల్లో పాల్గొనటానికి సిద్ధమైనారు మర్రి చెన్నారెడ్డిగారు.

## మర్రి చెన్నారెడ్డి రైతు రంగా రాజకీయ పాఠశాలలో ప్రవేశం

నాడు తెలంగాణా స్వాతంత్ర్య సమరం సాగిస్తున్న ప్రసిద్ధ దేశభక్తుడు, ప్రముఖ రాజకీయవేత్త కె.వి. రంగారెడ్డిగారి మేనల్లుడు మర్రి చెన్నారెడ్డి తన కుటుంబమే రాజకీయాలకు పుట్టినిల్లుగా మారినందున మామగారి రాజకీయాల వలన ప్రేరితుడయి స్వీయ వృత్తిని విడనాడి, రాజకీయాల్లోని ప్రవేశించారు. నైజాం నవాబు పాలన అంతమొందించాలన్న వారిలో ఒకరిగా తాను రూపొందుటకు రైతు రంగా ప్రారంభించిన రాజకీయ పాఠశాల వలన ఆకర్షితుడై అందులో ప్రవేశించారు.

## చెన్నా-లచ్చన్న సెలిమి

రైతు రంగా స్థాపించిన రాజకీయ పాఠశాలలో చేరిన చెన్నా-రంగాజీ అనుంగు శిష్యులు లచ్చన్న-తిమ్మారెడ్డి వగైరాలతో అత్యంత సన్నిహితత్వం అనతికాలంలోనే ఏర్పడింది. రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని నమ్మిన శిష్యవర్గంగా చెన్నా-లచ న్నలు రూపొంది, భావ సమైక్యతగల వ్యక్తులుగా ఒకరు ఒకరిపట్ల ఆకర్షితు లయినార సుమారు 2 నెలలు కొనసాగిన ఆ రాజకీయ పాఠశాలల్లో ఆ పాఠశాల తెలంగా రాజకీయ నాయకులకు ఉద్దేశించినదే అయిన ఆంధ్ర నుండి పాల్గొన్న లచ్చన్న తిమ్మారెడ్డి వంటి నాయకలతో వారితో సహృద్భావ సంబంధాల్ని పెట్టుకోవడానికి కారణమైనది.

## చెన్నా-లచ్చన్నల ఇరువురికి రంగా శిష్యరికం

దుష్ట నైజాం పాలన అంతరించాలన్నది ఒక ధ్యేయం తదుపరి ఆశయం గ్రామీణ రైతాంగం బాగుపడాలి. రంగాజీ తన పాఠశాలలో చెన్నారెడ్డితో పాటుచేరిన ఉద్యమ కారులెల్లరిని, రైతుకూలీ ప్రజారాజ్య సిద్ధాంతాన్ని అమలు పరచాలని, వామపక్ష పార్టీ అభిప్రాయాలు సరికాదని బోధించారు. కమ్యునిష్టుల ప్రాబల్యంలోనికి స్వంతంత్ర హైదరాబాదు వెళ్లకూడదన్నదే రంగాజీ బోధనల సారాంశము.

హైదరాబాదు సంస్థానంలో ఉద్యమిస్తున్న పార్టీలు విభిన్న సిద్ధాంతాలు కలివి అయితే నైజాం పాలనరద్దు రజాకార్లను అంతమొందించడం ఇరుపార్టీల ధ్యేయం. కమ్యునిష్టుపార్టీ ఒకవైపు, హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ ఒకవైపు తన పోరాటాన్ని ఉధృతం చేసాయి. ప్రజల్ని సమీకరించాయి. 1947 ఆగష్టు 7వ తేదీనుండి ప్రాంతాల్లో జన సంచలనం ప్రారంభం. మనం కూడా 1947 ఆగష్టు 15వ స్వతంత్ర జెండా ఎగురవేద్దాం అవి

సుల్తాన్ బజార్‌లో ఎగురవేసారు. ఉప్పొంగిన ఉత్సాహంలో ఉద్రేకంలో నేడు పాల్గొన్న నాయకులెల్లరిని నైజాం వారిపై లాఠీచార్జిచేసి జైల్లోపెట్టి నిర్బంధించారు. ఆ నిర్బంధించిన దేశభక్తులలో ఉద్యమకారులలో కె.వి. రంగారెడ్డి, దేవ్‌సింగు, జలగం వెంగళరావు, కమలమ్మ, కొండా లక్ష్మణ బాపూజీ, కాళోజీ నారాయణరావు, దాశరథి, డా. మర్రి చెన్నారెడ్డి ముఖ్యులు.

రావి నారాయణరెడ్డి, ఎల్లారెడ్డి, ముగ్దుం మొయినుద్దీన్ కమ్యూనిష్టు పార్టీకి ఆధ్వర్యం వహించి రజాకార్లను అణగదొక్కుటలో శాంతియుత మార్గాన్ని గాక విప్లవమార్గాన్ని ఎంచుకొన్నారు. ఒక దశలో వీరు ''యునైటెడ్ ఫ్రెంట్‌గా కాంగ్రెస్‌వారితో కలిసి పనిచేసారు.

## 1952లో బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గంలో చెన్నారెడ్డి

భారత ప్రభుత్వం ఎత్తుగడ వ్యూహం మేరకు 1947 నవంబరులో నైజాం నవాబుతో ఒప్పందం చేసుకొన్నది. యధాస్థితిని కొనసాగించటానికి కాంగ్రెస్ నాయకులు విడుదలయ్యారు. సంస్థానంలో శాంతి భద్రతల్ని నైజాం కాశిం రజ్వీకి అప్పగించారు. ఇక దురంతాలు ద్రోహాలు ప్రారంభమైనాయి.

ఒక ఏడాదిపాటు మరల తెలంగాణా నాయకులు కాశిం రజ్వీ దురాగతాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. యువజనోద్యమం రైతోద్యమాల్ని మర్రి చెన్నారెడ్డిగారు నడపవలసి వచ్చింది. హైదరాబాదు నివాసి అయిన చెన్నారెడ్డి రాజకీయ చైతన్యం కేంద్రంలో తనొక రాజకీయ సాధనంగా రూపొందారు. ఉద్యమాలకి, ఊపునిచ్చే కార్యక్రమాల్ని రూపొందించారు.

ఒకవైపు కమ్యూనిష్టులలో పోరాటం వేరొకవైపు కాంగ్రెస్‌లో సంఘర్షణ జాతీయ జీవనంలో కలియటానికి ప్రజలెల్లరు ఉవ్విళ్ళూరటం నైజాం గద్దెను కదిలించాయి. నైజాం నవాబు దుష్టతలంపును కనిపెట్టిన భారత రక్షణ శాఖామంత్రి, ఉప ప్రధాని వల్లభాయి పటేల్ నైజాం దుశ్చర్యల్ని అంతం చేయటానికి 1948 సెప్టెంబరు 13న హైదరాబాదు సంస్థానాన్ని వశపరచు కోవలసిందిగా భారత సైన్యాన్నికోరగా సెప్టెంబరు 17న పోలీసు యాక్షన్ జరిగి హైదరాబాద్ సంస్థానం భారత్‌లో విలీనం కావడం జరిగిపోయింది.

1952లో జరిగిన ఎన్నికల్లో హైదరాబాద్ రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ విజయమందింది బూర్గుల రామకృష్ణారావు మంత్రివర్గాన్ని ఏర్పరచారు. తన మేనమామ ప్రసిద్ధ తెలంగాణా ప్రజోద్యమము నాయకుడు కె.వి. రంగారెడ్డితోపాటు చెన్నారెడ్డిగారికి ఆ మంత్రివర్గంలో స్థానం తన ఉద్యమానికి ప్రతిఫలంగా కలిగింది. పోలీసు ఏక్షన్ తదుపరి

హైదరాబాద్ సంస్థానం మూడు విభాగాలుగా విడిపోయింది. కన్నడ ప్రాంతాలు, కర్ణాటకలో కలిసాయి. మరాట్వా ప్రాంతం, మహారాష్ట్రలోనికి వెళ్లింది. మిగిలిన ప్రాంతం తెలంగాణాగా హైదరాబాద్ రాష్ట్రంగా చరిత్రలోకి ఎక్కింది.

## లచ్చన్న-చెన్నారెడ్డి ఏక కాలంలో మంత్రి పదవుల నిర్వహణ

చెన్నారెడ్డి 1952లో హైదరాబాద్ రాష్ట్రంలో మంత్రివర్గంలో సభ్యులుగానున్న కాలంలో రంగా లచ్చన్నలు తరుచుగా హైదరాబాదు రావడం చెన్నారెడ్డిగారి అతిధులుగా ఉండటం జరిగింది. ఆంధ్ర రాష్ట్రం మంత్రివర్గంలో 1952లో లచ్చన్నగారు కూడ మంత్రి వర్గం కొన్నాళ్లుయిన నిర్వహించి ఉన్నవారే. అయితే లచ్చన్న రంగాలు కృషీవరలోక పార్టీ నేతలుగా మారిన, చెన్నారెడ్డి కాంగ్రెస్‌పార్టీలోనే మనగలుగుతూ వచ్చారు. అయినప్పటికి రంగాజీ గురుత్వాన్ని లచ్చన్న సహచరత్వాన్ని చెన్నారెడ్డి నిత్యం అభిలషిస్తూ ఉండేవారు. పార్టీకి, సిద్ధాంతానికి అతీతమైన ఆత్మీయత, అభిమానం అనురాగం వారి మధ్య ఉండేవి.

1953లో లచ్చన్నగారు మంత్రిపదవిలో నుండగా చెన్నారెడ్డి, లచ్చన్నగారు కూడ అదేవత్సరం మంత్రి పదవిలో నున్నారు. ఆంధ్రలో స్వాతంత్రోద్యమ జాతీయ ప్రభావగీతాలు వెలసిన దినల్లో లచ్చన్న ఉద్యమం కొనసాగించారు. చెన్నారెడ్డి హైదరాబాద్ నవాబు దుష్పరిపాలన అంతం చేయడంలో కవితాశాస్త్రాల్ని సందించిన దాశరధి, సి. నారాయణరెడ్డి, కాళోజీ, నారాయణరావులు ప్రబోధగీతాల్ని ప్రజానీకంలో చొచ్చుకొనేలా చేశారు ఉద్యమించారు.

నా తెలంగాణా కోటి రత్నాల వీణ అన్నారు దాశరధి. అంతేగాక దగాకోరు భూటక రజాకారు పోషకులని నిందించారు. ఊళ్లకూళ్లు అగ్గిపెట్టి, యిళ్లన్ని కొళ్ళగొట్టి తల్లిపిల్ల కడుపుకొట్టి మిన్నంటిన దుర్మార్గాన్ని ఎత్తిజూపారు.

సి. నారాయణరెడ్డిగారు కవిసమ్మేళనంలో తన కంఠం విప్పి కవి గానం సభకులెల్లరిని మంత్రి ముగ్ధులుగా చేసింది. వెనుకబడిన వాళ్లని ముందుకు నడుపుతూవెళ్లి చేయిచేయి కలుపుతో అని నీతి బోధచేసారు. నవ యుగంబున నాజీ వృత్తులనగ్నత్వ మింకెన్నాళ్లు అని ప్రశ్నించారు కవి కాళోజీ నారాయణరావు.

తెలంగాణా స్వాతంత్ర్య సమరం నాటి యువతరాన్ని నడిపే నాయకత్వాన్ని అందుకొని ముందు నడచిన రాజకీయవేత్త చెన్నారెడ్డి ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో ఘనమైన పాత్ర వహించి, ప్రకాశం మంత్రివర్గాలలో పనిచేసినవారు లచ్చన్న బూర్గుల రామకృష్ణారావుగారి మంత్రివర్గంలో సభ్యులు చెన్నారెడ్డి.

## విశాలాంధ్ర నిర్మాణంలో ఐక్యంగా కృషి సల్పిన చెన్నా-లచ్చన్నలు

1956లో లచ్చన్న ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి ఐక్య కాంగ్రెస్‌లో నుంటూ తను తన గురువు రంగాజీని ఒప్పించటంలోను, బూర్గుల రామకృష్ణారావుగారికి విశాలాంధ్ర నిర్మాణానికి అనుకూలంగా మలచుటలో విశేష కృషి సల్పారు చెన్నారెడ్డి. విశాలాంధ్ర నిర్మాణానికి కమ్యునిష్టుపార్టీ ఎలాను సిద్ధపడిఉంది. దేశాన్ని పాలిస్తున్న కాంగ్రెస్ హైకమాండ్ , బాషారాష్ట్రాన్ని ఏర్పరచే పథకం సిద్ధం చేసికొనిఉంది. అమలుపరచటానికి ఆంధ్రులందరు ఒకటిగా రూపొందాలన్న అభిలాష సార్వజనీనాభిప్రాయం సర్వత్రా వ్యాపించింది. హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి పచ్చజెండా ఊపారు. ఆ సరికి ఆంధ్ర ముఖ్యమంత్రిగా ఉన్న బెజవాడ గోపాలరెడ్డి సరే అన్నారు. రెండు రాష్ట్రాల్లో అధికారంలో ఉన్నది కాంగ్రెస్ పార్టీ కేంద్రంలో పాలిస్తున్నది కాంగ్రెస్‌పార్టీ ఆంధ్రప్రదేశ్ నిర్మాణం వెంటనే రూపందాల్చి 1956 నవంబరు 1వ తేదీన అవతరించింది.

## రాష్ట్ర నాయకత్వం ఎన్నికల్లో చేతులు కలిపిన చెన్నా-లచ్చన్నలు

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ శాసనసభా పార్టీ నాయకునిగా ఎంపిక కావడానికి నీలం సంజీవరెడ్డి, బెజవాడ గోపాలరెడ్డిగార్ల మధ్యపోటీ ఏర్పడింది. మెజారిటీ సంపాదించిన కాంగ్రెస్ మంత్రివర్గం నిర్మాణం చేయాలి. ఆంధ్ర ప్రాంతం నుండి గౌతు లచ్చన్న తదితరులు తెలంగాణా నుండి మర్రి చెన్నారెడ్డి మొదలగువారు నీలం సంజీవరెడ్డి నాయకత్వాన్ని ఎదిరించి, కాంగ్రెస్ హైకమాండ్ కు నివేదికల్ని అంపించారు. గోపాలరెడ్డిని బలపరచారు. అసంతృప్తి వాదుల సమావేశం గోపాలరావు ఎగ్బోటే గృహంలో జరిగేది. కాంగ్రెస్ అధిష్టానవర్గంపై తిరుగుబాటు అసంతృప్తి కాంగ్రెస్ సంజీవరెడ్డిపై ఆరోపణల్ని చేసేది. అయిన గోపాలరెడ్డిగారు ఓటమి చెందారు.

బయటపడి ఎదిరించిన పాపానికి ఇటు లచ్చన్నకు అటు చెన్నారెడ్డికి మంత్రి పదవుల నందించక, నీలంవారు చెన్నారెడ్డి మేనమామకు కె.వి. రంగారెడ్డికి, రెవెన్యూశాఖను తనతో పోటీచేసిన గోపాలరెడ్డిగారికి హూం శాఖను కేటాయిస్తు మంత్రివర్గంలోనికి తీసికొన్నారు. కళావెంకట్రావుకి ఆర్థికశాఖ లభించింది. కృషికరలోక పార్టీనుండి గెంతువేసి కాంగ్రెస్‌లో కలిసిన పెద్దిరెడ్డి తిమ్మారెడ్డిని వ్యవసాయశాఖ లభించింది.

క్రమేపి నీలంవారి వర్గం బలపడుతూ వచ్చినందున మంత్రివర్గం ఆ మేరకు విస్తరించబడటం. పునర్వ్యవస్థీకరించడం జరిగేది. 1958లో పునర్వ్యవస్థీకరణ కాసు బ్రహ్మానందరెడ్డిగారిని తీసికొన్నారు. అదే సంవత్సరం బెజవాడ గోపాలరెడ్డి కేంద్ర మంత్రిగా వెళ్లినందున కాసు బ్రహ్మానందరెడ్డి ఆర్థికశాఖకు వచ్చారు. 1960 సంవత్సరం

నీలం సంజీవరెడ్డి జాతీయ కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నికోబడటంతో దామోదరం సంజీవయ్య 1960లో మంత్రివర్గాన్ని ఏర్పరచారు.

## 1957లో డెమొక్రటిక్ పార్టీని స్థాపించిన లచ్చన్న-చెన్నారెడ్డి

సంజీవరెడ్డిగారి ప్రాబల్యం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్‌లో ప్రబలడంలో వారిని ఎదుర్కొన్న లచ్చన్నను చెన్నారెడ్డిని కాంగ్రెస్ పార్టీనుండి నెట్టివేసే పథకం నేపధ్యంలో రూపొందసాగింది.

ఆంధ్ర ప్రాంతంనుండి లచ్చన్న పి.పి.జి. తెలంగాణా నుండి చెన్నారెడ్డి బొమ్మకటి సత్యన్నారాయణ, హయిగ్రీవాచారి వంటి వారు కాంగ్రెస్‌పార్టీకి భిన్నమైన పార్టీ ఉండాలన్న భావంతో డెమొక్రటిక్‌ని స్థాపించారు. వరంగల్ పట్టణంలో ప్రజా సమ్మేళనమే ఇది రూపొందుతుంది. చెన్నారెడ్డి అధ్యక్షులుగా, ఉపాధ్యక్షులుగా లచ్చన్న ఎన్నికోబడతారు. కార్యవర్గం ఏర్పడింది. కాంగ్రెస్‌ని ప్రతిఘటించాలన్న ధ్యేయం ఆశయం నెరవేరాలని రాష్ట్రం నలుమూలలా పర్యటించారు. ఇదే సమయమున ఐక్య కాంగ్రెస్‌లో లచ్చన్న ఉన్నంతకాలంలో కాంగ్రెస్ హైకమాండ్ అతనిపై కొన్ని నేరారోపణల్ని చేస్తుంది. వాటిని దిగ్విజయంగా త్రిప్పికొడతారు లచ్చన్న. పర్యవసానం డెమొక్రటిక్ పార్టీస్థాపన తెలంగాణా నాయకునితో చేతులు కలపడం.

## స్వతంత్రపార్టీలో మరల చేయిచేయి కలిపిన లచ్చన్న-చెన్నారెడ్డి

1959లో దేశ స్థాయిలో కాంగ్రెస్ విధానాల్ని ఎదిరిస్తు రాజగోపాలాచారి స్వతంత్ర పార్టీని రూపొందిస్తారు. ఆచార్య రంగా ఆల్ ఇండియా స్థాయిలో స్వతంత్రపార్టీ అధ్యక్షునిగా ఉంటారు. ఆంధ్రప్రదేశ్ అధ్యక్షులు గొట్టిపాటి వెంకట సుబ్బయ్య, ఉపాధ్యక్షులు చెన్నారెడ్డి-లచ్చన్నలే.

1960లో విజయవాడలో స్వతంత్రపార్టీ సమావేశాన్ని ఏర్పాటు చేస్తుంది. చెన్నారెడ్డి కూడావచ్చి పాల్గొంటారు. అవసరమైతే కృష్ణానదిలో పడతాను తప్పించి మరల కాంగ్రెస్ పార్టీలో చేరేదిలేదని సభాముఖంగా ప్రకటించినారట. అయితే స్వల్పకాలంలోనే స్వతంత్ర పార్టీని విడిచి మరల కాంగ్రెస్‌లో కలియడం జరిగింది. అయితే వారి వ్యక్తిగత స్నేహాలకు గౌరవాలకు వారిరువురి మధ్య నాటి నుండి నేటివరకు భంగం కలగలేదు. పార్టీలకు అతీతమైనది వారిరువురి మధ్య స్నేహబంధం, అనురాగం, ఆప్యాయత.

## ఒకరు ప్రతిపక్ష నాయకుడు వేరొకరు మంత్రివర్గంలో సభ్యులు

1962 ఎన్నికల తదుపరి నీలం సంజీవరెడ్డి మరల కాంగ్రెస్ రథసారథ్యాన్ని వహిస్తారు. అతని మంత్రివర్గంలో డా. మర్రి చెన్నారెడ్డి, ప్రణాళిక-పంచాయితీ రాజ్యమంత్రిగా చేరతారు. మామకు బదులు అల్లునికి మంత్రివర్గంలో స్థానం లభించింది

1962 ఎన్నికల్లో స్వతంత్ర పార్టీ శాసనసభలో ప్రతిపక్ష నాయకులు, అధికార పక్షంలో చెన్నారెడ్డి-ప్రతిపక్షంలో లచ్చన్న, ఒకరు కాంగ్రెస్, వేరొకరు స్వతంత్రపార్టీ 1964లో బస్‌రూట్ల జాతీయకరణ గూర్చి సుప్రీంకోర్టు చేసిన వ్యతిరేక వ్యాఖ్యలపట్ల సంజీవరెడ్డి రాజీనామాచేయగా కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు. చెన్నారెడ్డి ఆర్థిక మంత్రి చేరారు. కాంగ్రెస్‌లో చేరిన పి.వి.జి. రాజుకు విద్యాశాఖ లభించింది. మరల ఎన్నికలనంతరం 1967లో మంత్రివర్గంలో బ్రహ్మాందరెడ్డి ముఖ్యమంత్రి కాగలిగారు. నల్లూరి బసవరాజు రెవెన్యూ, చెన్నారెడ్డిగారికి మంత్రివర్గంలో స్థానం లభించలేదు. మరల లచ్చన్న స్వతంత్రపార్టీ శాసన సభాపతి పక్షనాయకునిగా వచ్చారు. కాంగ్రెస్ హైకమాండ్ వ్యూహం ఎత్తుగడలమేరకు తెలంగాణా నాయకులకు తగిన ప్రాధాన్యత ఇవ్వలేదు. తత్ఫలితమే తెలంగాణా ప్రజాసమితి స్థాపన లచ్చన్న-చెన్నారెడ్డి ఇరువురు ఏర్పాటువాదులే.

## లచ్చన్న-చెన్నారెడ్డి ఇరువురు ఏర్పాటువాదులే

పెద్దమనుషుల ఒప్పందంలోని షరతుల్ని పాటించనందున 1969లో ప్రత్యేక తెలంగాణోద్యమం ప్రారంభమైనది. చిన్న రాష్ట్రాలే పరిపాలనకు అనువుగా ఉంటాయి. ఆర్థికంగా బాగుంటాయి. ఆంధ్ర తెలంగాణా ప్రత్యేకంగా ఉన్నప్పుడే అభ్యుదయాన్ని అందగలవన్న వాదనలు లేచాయి. ఉద్యమం తీవ్రరూపం దాల్చింది. చెన్నారెడ్డి అనుచరుడు ఎ. మదనమోహన్ ఆమరణ నిరాహారదీక్షల్ని జరిపారు.

లచ్చన్న ఆంధ్రప్రాంతం నుండి ఒకే గృహమున ఉండి అన్ని విషయాల్లో తన్నుకొని చావటంకన్న వేరువేరుగా ఉండి ఆదరణాభిమానాన్ని ఒకరిపై ఒకరు చూపెట్టుకోవచ్చని వాదించారు. ప్రత్యేక తెలంగాణోద్యమానికి వంతపలికారు. నిజమైన వేర్పాటువాదినన్న పేరు గడించారు. తెలంగాణోద్యమాన్ని జె.వి. నరసింగరావుకి ఉప ముఖ్యమంత్రిగా నియమిస్తూ చల్లార్చాలని జలగం వెంగళరావు హూం అయితే తెలంగాణా నాయకుడు పి.వి. నరసింహారావు ముఖ్యమంత్రి కానిదే ఉద్యమ తీవ్రత తగ్గలేదు. రాయలసీమ వ్యక్తి బి.వి. సుబ్బారెడ్డి ఉప ముఖ్యమంత్రి నిచ్చేసారు. వాసిరెడ్డి కృష్ణమూర్తి నాయుడు ఇంతవరకు అన్ని మంత్రివర్గాల్లో ఉంటూ వచ్చారు.

## పెద్దమనుషుల ఒప్పందంలో ఇరువురు పెద్దమనుషులే

ఒక ప్రాంతంవారు ముఖ్యమంత్రి అయిన వేరొక ప్రాంతంవారు ఉప ముఖ్యమంత్రి కావాలి. తెలంగాణా మిగుల నిధుల్ని తెలంగాణాకు యివ్వాలి. ప్రణాళిక నిధుల్ని నిష్పత్తుల్లో పంపకం జేయాలి. ఈ మంత్రివర్గంలో నిష్పత్తి మేరకు ప్రాతినిధ్యాన్ని కల్పించాలి. ఇంక మరికొన్ని షరతుల ఒప్పందం.

ఒప్పందం సరిసమానుల మధ్యనే జరుగుతుందన్నారు రాజనీతివేత్త చాణుక్యుడు. ఒప్పందం ఎవరి మధ్య జరిగింది. ఆంధ్రప్రాంతంలోనున్న రాజకీయ నాయకులు తెలంగాణాలోఉన్న రాజకీయ నాయకులు ఒప్పందం చేసికొన్నవారు గౌతు లచ్చన్న, చెన్నారెడ్డి, నీలం సంజీవరెడ్డి, ఎ. సత్యన్నారాయణరాజు, బి. రామకృష్ణారావు, జె.వి. నరసింగరావు మూడు ప్రాంతాలకు వారు ప్రాతినిధ్యం వహించారు. ఆంధ్రప్రదేశ్‌లో పేర్కొనదగిన ప్రముఖ రాజకీయ నాయకులనిపించు కున్నారు. 1956లో జరిగిన పెద్దమనుషుల ఒప్పందంలోచేసుకున్న పెద్దమనుషులలో ఇద్దరు పెద్దమనుషులే.

## లచ్చన్న-చెన్నారెడ్డి ఇరువురు ఏర్పాటువాదులే

తెలంగాణా విద్యార్థి కార్యాచరణ కమిటి 1969 మార్చి 9వ తేదీన తెలంగాణా బంద్‌కు పిలుపు ఇచ్చారు. కె.వి. రంగారెడ్డి బలపరిచారు. 1969 అక్టోబర్‌లో మర్రి చెన్నారెడ్డి, మల్లిఖార్జున జైల్లో నిర్బంధించడం జరిగింది. తెలంగాణా ప్రజాసమితి లీడర్స్‌ను ప్రధానమంత్రి చర్చలకు పిలిచారు.

తదుపరి రాజకీయ పరిస్థితులు మారి బ్రహ్మానందరెడ్డి రాజీనామా యివ్వడం పి.వి. నరసింహారావు ముఖ్యమంత్రి కావడం జరిగింది. ప్రజాసమితి నాయకులు కాంగ్రెస్‌లో కలియడం జరిగిపోయింది.

ఆంధ్రలో మరొక ఉద్యమం లేచింది. జై ఆంధ్ర ఉద్యమం 1972లో హైకోర్టు ముల్కి నిబంధనలు చెల్లవని తీర్పుచెప్పగా తెలంగాణా ప్రజల్ని సంతోషపెట్టడానికి ప్రభుత్వం సుప్రీంకోర్టుకు నివేదించగా సుప్రీంకోర్టు ముల్కి నిబంధనలు సరియైనదే అని తీర్పు ఇచ్చింది. దీనితో ఆంధ్ర ప్రజానీకం రెచ్చిపోయింది. తమ రాష్ట్రాలలో రెండవస్థాయి పేరులుగా ఉండ నభిలషించలేదు. ఉద్యమం ప్రారంభమైనది. అగ్నిజ్వాలలా ఆంధ్ర అంతటా వ్యాపించింది. పరిపాలన స్తంభించింది. రాష్ట్రపతి పాలన వచ్చింది. గౌతు లచ్చన్న రాష్ట్రమంతటా తిరిగి ఏర్పాటువాదాన్ని బలపరచారు. కాకాని వెంకటరత్నం మరణించడం, బి.వి. సుబ్బారెడ్డి నాయకత్వం విఫలమవడం, 108 దినాల యన్.జి. ఓ.ల సమ్మె విరమణ. కేంద్రప్రభుత్వం తుదకు 6 సూత్రాల పథకం మేరుకు ఇరుప్రాంతాల వారిని రాజీకి వచ్చినట్టుచేసి సమైక్య ఆంధ్రప్రదేశ్‌ను కొనసాగించేలా చూచింది. (1973 అక్టోబర్) అధ్యక్ష పరిపాలన అంతమొంది జలగం వెంగళరావు 1973 డిశంబరు 10న మంత్రివర్గం ఏర్పరిచారు.

## ఇరువురు విభిన్నపార్టీల స్థాపన ద్వారా కాంగ్రెస్‌పార్టీని ఎదిరించినవారే

1973వ సంవత్సరంలో గౌతు లచ్చన్న స్వతంత్రపార్టీ విఫలం కాగా భారతీయ క్రాంతిదళ్‌లో చేరారు. చరణ్‌సింగు నాయకత్వం ద్వారా రైతోద్యమం ప్రతిఫలించగల

దని భావించారు. అదే సమయాన 1973 జనవరి 21 ఆంధ్రప్రదేశ్ శాసనసభ తాత్కాలిక రద్దులోఉండగా చెన్నారెడ్డి తన ఆధ్వర్యమున తెలంగాణా కాంగ్రెస్‌వాదుల సదస్సును హైదరాబాద్‌లో నిర్వహించి, కాంగ్రెస్ ఫోరంలో ప్రత్యేక తెలంగాణా ప్రజాసమితిని స్థాపించి పురతెలంగాణాను స్థాపించి ప్రత్యేక రాష్ట్రనిర్మాణం తన ధ్యేయంగా ప్రకటించారు. తెలంగాణా ప్రజల్లో పలుకుబడి గల రెడ్డి ప్రాంతమంతటిని తిరిగి తెలంగాణా స్టేట్ ఆవశ్యకతను చెప్పారు. అయితే ఆంధ్రప్రాంతంలో జై ఆంధ్రా ఉద్యమం సన్నగిల్లినట్లుగా తెలంగాణా ప్రాంతంలో కూడ ప్రత్యేక తెలంగాణా ఉద్యమం కూడ సన్నగిల్లింది. కారణం ఆరు సూత్రాల పథకం అమలుద్వారా ఇరు ప్రాంతాల రాజకీయ నాయకుల్ని కేంద్రప్రభుత్వం ఒప్పించింది. చెన్నారెడ్డిగారు ఉత్తరప్రదేశ్ గవర్నర్‌గా వెళ్లారు.

## ఒకరు అధికార పక్షనాయకులు, వేరొకరు శాసనసభ ప్రతిపక్షానికి లీడర్

1977లో జనతాపార్టీ అవతరణతో భారతీయ లోక్‌దళ్ దీనిలో అంతర్భాగమైనందున గౌతు లచ్చన్న ఆంధ్రప్రదేశ్ జనతాపార్టీ నాయకులుగా రూపొందారు. డా. మర్రి చెన్నారెడ్డి కాంగ్రెస్‌పార్టీకి సారధ్యం వహించే స్థితిగతుల్ని ఆనాటికి తెచ్చుకొన్నారు. ఎన్నికల్లో కాంగ్రెస్ (ఐ) పార్టీ గెలిచి 1978లో చెన్నారెడ్డి ముఖ్యమంత్రి పదవిని చేపట్టగా 60 మంది శాసనసభ్యులతో జనతాపార్టీ శాసనసభలో ప్రతిపక్షం గౌతులచ్చన్న గారి నాయకత్వాన నడిచింది. శాసనసభలో ఒకరు ప్రభుత్వ పక్షానికి లీడరు. వేరొకరు శాసనసభలో జనతాపార్టీ లీడరు. ప్రశ్నించడం ఒకరి వంతు, జవాబివ్వడం వేరొకరి వంతు. కలసిమెలసి ఒకేపార్టీగా మెలగిన వ్యక్తులిరువురు, విభిన్న రాజకీయ పోకడల్ని కలిగిన వ్యవస్థలో మనగలిగే స్థితిగతులనందారు. చెన్నారెడ్డి శ్రీమతి ఇందిరాగాంధీకి అత్యంత సన్నిహితునిగా రూపొందారు. ప్రత్యేక తెలంగాణా అవసరంలేదని ప్రకటించారు. ఆనాటి చెన్నా మంత్రివర్గంలో సి. జగన్నాధరావు, జి. శ్రీరాములు నాయుడు, యన్. భాస్కరరావు, పద్మనాభరాజు, కె. రోశయ్య, హయగ్రీవాచారి ఉండేవారు.

## 1980లో ఇరువురు వారి వారి పార్టీ పదవుల స్థానాలనుండి బయటపడినవారే

1980లో లోక్‌సభ మధ్యంతర ఎన్నికలు జరిగేనాటికి జనతాపార్టీ విచ్ఛిత్తి జరిగి గౌతులచ్చన్న, బి.యల్.డి. అభ్యర్థిగా పోటీచేసి శ్రీకాకుళం పార్లమెంటు స్థానం నుండి ఓటమి అందారు. అదే సంవత్సరం డా. మర్రి చెన్నారెడ్డి కేంద్ర కాంగ్రెస్ హైకమాండ్ ఆదేశాల మేరకు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పదవినుండి తప్పుకొన్నారు. టి. అంజయ్య ముఖ్యమంత్రి పదవిని చేపట్టారు. సమర్థుడు, ప్రతిభావంతుడైన

చెన్నారెడ్డిని శ్రీమతి ఇందిరాగాంధీ మంచి పరిపాలకునిగా గుర్తించి, దేశ పరిపాలనలో పంజాబ్ రాష్ట్రానికి, మరల ఉత్తర ప్రదేశ్‌కి చెన్నారెడ్డిని గవర్నర్‌గ అంపించారు. లచ్చన్నగారు ఢిల్లీవెళ్లి భారతీయ లోక్‌దళ్ రెండుగా B అని A అని విభజించడం సరికాదని ఎంతచెప్పిన విననందున తను ఏ విభాగములో చేరక ఎ.పి. లోక్‌దళ్ అను పేర ఆంధ్రప్రదేశ్‌లో తన పార్టీ కొనసాగేలా చేసుకున్నారు.

## ఇరువురూ 1990లో అధికార పార్టీలలో నాయకులుగా అవతరించినవారే

ఒకరు రాష్ట్ర కాంగ్రెస్ శాసనసభా పార్టీ పార్టీనాయకులు, వేరొకరు రాష్ట్ర జనతాదళ్ పార్టీనాయకులు.

కేంద్రమున అధికార పీఠంలోనున్న జనతాదళ్ పార్టీలో నేడు గౌతులచ్చన్న దరిమిలా చేరిపోయారు. జనతాదళ్ పార్టీల రెండింటిలో తాను సభ్యునిగా ఒకనాడున్న వీరే మరల ఆ రెండు పార్టీలు ఒకటిగా జనతాదల్‌గా రూపొందడంతో మరల మాతృసంస్థలో తాను చేరినట్లయినది. నేడు ఆంధ్రప్రదేశ్ జనతాదళ్ పార్టీనాయకులుగా దేశం నలుమూలలా పర్యటిస్తున్నారు. డా. మర్రి చెన్నారెడ్డి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ మంత్రివర్గానికి నాయకత్వం వహిస్తున్నారు. ముఖ్యమంత్రిగా నేడు వ్యవహరిసుతన్నారు.

1980 నుండి 83 వరకు ఎ.పి. లోక్‌దళ్ నాయకులుగా ఉంటున్న లచ్చన్న 1984లో తెలుగుదేశం పార్టీలో తన పార్టీవిలీనం చేసారు. మరల 1984లో ఎ.పి. లోక్‌దళ్‌పార్టీని పునః స్థాపన చేసి పోటీలో నిలుచుని ఓటమి నొందారు: మరల 1989 నవంబరు ఎన్నికల్లో తను పోటీచేయక ఇండిపెండెంట్ అభ్యర్థులను బలపరచి గెలిపించుకొనుటలోనే ఎ.పి. లోక్‌దళ్ పార్టీ నిలచింది.

1986లో రాజకీయ అజ్ఞాతవాసంలోకి వెళ్లిన చెన్నారెడ్డిని ప్రసిద్ధ పరిపాలనాదక్షునిగా చివరికి గుర్తించిన కాంగ్రెస్ హైకమాండ్, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అధిష్టించమని కోరింది. డా. మర్రి చెన్నారెడ్డి మరల తమపట్ల తనకుగల అభిమాన ఆదరణలలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని అలంకరించి తెలుగుదేశం పార్టీని ఎన్నికల్లో చిత్తుగా ఓడించి, కాంగ్రెస్ పార్టీని అత్యధిక సంఖ్యాబలంతో గెలిపించిన ఆంధ్రప్రదేశ్‌లో పేరొందిన రాజకీయ దురందరుడు, ప్రజ్ఞానిది, పరిపాలనాదక్షుడు శ్రీ చెన్నారెడ్డి. మాజీ ప్రధాని శ్రీ రాజీవ్ రెడ్డికి రాష్ట్ర కాంగ్రెస్‌పార్టీ నాయకత్వాన్ని అప్పగించారు. తత్ఫలితంగా డా. మర్రి చెన్నారెడ్డిగారు రాష్ట్రమంత్రి వర్గాన్ని ఏర్పరచి నేడు మర రాష్ట్ర ముఖ్యమంత్రిగా కొనసాగుతున్నారు. భారత ఉప ప్రధాని దేవీలాల్

ప్రోత్సాహ ప్రోద్బలాలతో మరల జనతాదళ్ పార్టీలో చేరిన సర్దార్ గౌతు లచ్చన్న, డా. మర్రి చెన్నారెడ్డిగారికి అత్యంత ప్రియతమ స్నేహితులు అభిమానులు పార్టీస్థాయికి మించిన ఆదరణాభిమానాల్ని ఒకరిపట్ల వేరొకరు ప్రదర్శించుకోగల రాజనీతి విజ్ఞానులు. విడివడని వారి వారి పార్టీలకతీతమైన అపూర్వ స్నేహబంధాలు కలిగి ఆనాటినుండి నేటివరకు అవిచ్ఛిన్నంగా, విభిన్న జాతీయ పార్టీల రాజకీయ నాయకులుగా మనగలుగుతూ వస్తున్నారు.



చిట్టి బొమ్మగారిచే సన్మానం- ఏలూరు



శ్రీ తెన్నేటి విశ్వనాధంగారితో అచ్చన్న



1983లో చిన్నారి మనవల చిరంజీవి మనవరాళ్ళతో లచ్చన దంపతులు



పశ్చిమ గోదావరి జిల్లా జనతా పార్టీ సమావేశంలో ప్రసంగిస్తున్న
శ్రీ తెన్నేటి విశ్వనాథం లచ్చన్న



నెల్లూరులో జరిగిన కిసాన్ మహాసభలో ప్రసంగిస్తున్న నాటి పార్లమెంటు సభ్యులు నేటి పుదుచ్చేరి గవర్నర్ శ్రీమతిచంద్రావతిగారితో లచ్చన్న



ద్రవిడ కజగం నేత – వీరమణి గారితో లచ్చన్న



ప్రకాశం జిల్లా ఒంగోలులో ధర్నా జరుగుతున్న వర్గాలలో లచ్చన్నను అరెస్టు చేసి తీసికొనిపోతున్న దృశ్యం




దళిత మజ్దూర్ కిసాన్ పార్టీ స్థాపనలో లచ్చన్న




నెల్లూరులో మరళీధర్ కమిషన్ రిపోర్టుకు అమలు చేయాలని
ధర్నా చేస్తున్న అచ్చన్న



అఖిలభారత బి సి. ఎస్ సి. ఎస్.టి. మై నారిటీల పార్టీ ప్రధాన
కార్యదర్శి చంద్రజిత్ యాదవ్ మాజీ కేంద్రమంత్రితో అచ్చన్న



జస్టిస్ ఆవుల సాంబశివరావుతో - లచ్చన్న



సిమ్మ జగన్నాథంగారితో



1985లో జరిగిన
ఎస్ సి. బి సి. ఎస్ టి. మైనారిటీల
మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు
నవుడూరు ముసలయ్య



సర్దార్ గౌతులచ్చన్నగారి జీవితచరిత్రను వ్రాసిన రచయిత - ప్రిన్సిపాల్ వంగపండు అప్పలస్వామి



ఆదర్శదంపతులు శ్రీ లచ్చన్న శ్రీమతి గౌ